ఆంధ్ర విశ్వకళాపరిషద్ గ్రంథమాల
(15 వ సంఖ్య)

శ్రీరస్తు

# వైయాకరణపారిజాతము

విశాఖపట్టణమందున్న
ఆంధ్రవిశ్వకళాపరిషత్
కళాశాలాంధ్రాధ్యాపక
కళాప్రపూర్ణ
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి
విరచితము




వాల్తేరు
1957

రాజమండ్రి సరస్వతీ పవరు ప్రెస్సు నందు
ముద్రితము



[ వెల రు. 12-0-0

# కృతిసమర్పణ శీర్ష పద్యములు

...:o:...

సీ. సర్వసర్వంసహా సార్వభౌమ శ్రీజార్జి
రేజుఁ డే పద్మకోద్గీసకుండు
భారతసామ్రాజ్య సారసేనాని యనఁ
చెలఁగు నేసును "కే. సి. ఐ. ఇ" బిరుద
వరానరబుల్ బిరుదాన సార్థకముగా
మన్నించు రాంగ్లసామ్రాజ్యు లెవని
సెస్నపురీరాష్ట్ర సింహాసనాధ్యక్షు
సచివాగ్రగణ్యుఁ దేశభక్తశాలి
ప్రథితాంధ్రవిశ్వకళా పరిషత్ప్రో
ఛాన్సలరీ భూసనత్తముండు
శ్రీరిగోన్వృషభాల పాలింటి బొబ్బిలి
బొబ్బిలి నేలు నే భూతలేంద్రుఁ

తే-గీ. డక్టర్-సర్-రాజ-రావు శ్వేతాచలపతి
రామకృష్ణరంగారావు రాజచంద్ర
మోహనప్రభు శేఖరు నోమిఁ గాంచఁ
ప్రీతి శ్వేతాద్రిపతి రామకృష్ణ విభుఁడు.

{ శీర్షము = సీసము.
పద్యక = పద్యము,
పద్యక వంశము. }

సీ. కవిసార్వభౌముఁడు గణుతింపఁగాఁదగు
సాహిత్యసామ్రాజ్యచక్రవర్తి
రావుసర్వజ్ఞ సింగావనీకాంతుండు
పార్థివాగ్రణి మీఁదు వంశకర్త
కారుణ్యమిత్రతా సిరతా ప్రభూతలఁ
దనరుచుండి రంగరాణను జయించి

తే-గీ. బరఁగు విద్వత్కవీశ్వర పారిజాత
జగతి న్యాయాకరణ పారిజాత సుమము
కృతిని గాన్కగ నిడు సంకేత మొసఁగఁ
గొనుము జయమంగళంబులం గనుము చిరము.

మ. సరసత్వంబు సుధాంశుతాంగతయు నౌన్ సౌగ్గుణ్యముం గల్గు భూ
వర చంద్రుండవు నీవు సత్కృతికి సంప్రాప్తింపు భాగ్యంబు బం
గరుపుం భూమకు గన్న సంపూర్ణ భాగ్యం బంపు శ్రీ గద్దిరాట్
పరిమళ్ స్వామి వినుత్య శాగ్రణి నుతింపం గల్గెంగా దే భువ
న్వర తాలాభము తానసీనుసదివిధామంబు సామాన్యమే.

ఉ. భూమిసుతాగ్రనాథు పరిపూర్ణ కృపామహిమంబునం భువిం
ధామర తంత్రగి నెలయుచుం భవదీయసులంబు; రాజ్యమున్
శ్రీమిగులంగ విస్తృతిని జెందుఁ; జగున్ నల సూనువర్ష ముల్
సేమము పొందిపంటయు నశేష జనోన్నతి నీను నుండలిన్. ౪

శ్లో. వాగ్దేవతాం కమలభూర్వదనే నయాన
ద్యావచ్చ లోకజననీం స్వ్రాన్యయేన విష్ణుః
అర్ధేన శంభు రపి యావ దుమాం దధాతి
తావ ద్ధరాతు విభు రేష చ రాజ్యలక్ష్మీమ్.

# విజ్ఞప్తి

విచక్షణులారా, ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారక విరచితమని
యు నయ్యది యాంధ్రవ్యాకరణప్రపంచమునఁ బ్రాథమిక మగుటంజేసి
సంస్కృతసమ శబ్దానుశాసనము ప్రధానముగను నచ్ఛాంధ్రభాషానుశాసన
మప్రధానముగను రచింపఁబడినదనియు నద్దానియందలి పరిశిష్టవిషయములను
విపులముగఁ బూరించుటకయి యథర్వణాచార్యునిచే వికృతి వివేక మనెడి
యథర్వణకారికావళి రచింపఁబడినదనియు నా రచించియున్న చింతామణీ
విషయపరిశోధనమున విపులవిమర్శన పురస్సరముగ సిద్ధాంతీకరించియున్నాను.
అట్టి నన్నయాథర్వణ గ్రంథములను శోధించి యాయాచార్యోక్తానుబట్టి యుక్తలక్షణ
గ్రంథభాగములను నా రచించిన కారికలను నచ్చ టచ్చటఁ జేర్చి నన్నయా
థర్వణీయ మనెడి మహాకవిప్రయోగమూల కాంధ్ర భాషాస్వరూప నిరూపక
మగు గ్రంథమును మూలముగఁ గొని యద్దాని కితరాంధ్రలక్షణగ్రంథ
ప్రపంచపరిశీలన పూర్వకముగను, వైదిక లౌకిక సంస్కృతభాషా వ్యాకరణ
సంబంధ పరిశీలనపూర్వకముగను, ప్రాచీన మహాకవిప్రయోగ ప్రపంచ
ప్రదర్శనపరిశీలన పూర్వకముగను, నితర ద్రావిడభాషాసంబంధ విశేష
విమర్శనార్థక తొల్కాప్పియ కర్ణాటభాషాభూషణాది ద్రావిడవ్యాకరణ
విషయ ప్రదర్శన పరిశీలన పూర్వకముగను, విపులమగు వ్యాఖ్యానముచేయు
టయే మదీయ పరమోద్దేశము. ఆంధ్రభాషా వాఙ్మయ కూలంకష పాండిత్య
సంపత్తికి "శాస్త్ర మపౌరుష మాద్యం । ప్రాయికనిత్యప్రయోగలక్ష్యైతత్ ।
దృశ్య" మిత్యాది నన్నయభట్టారక సూక్తిచొప్పున వ్యాకరణ సంస్కార
సంస్కృత సంస్కృతభాషావాఙ్మయ పరిజ్ఞానమేకాక యితర ద్రావిడభాషా
వైదుష్యమును నత్యావశ్యకమనుటలో విప్రతిపత్తిలేదు.

గ్రాంథికాంధ్రభాషాస్వరూప నిరూపణవిషయమునఁ గథావస్తునిర్వ
హణ పరతంత్ర ప్రాచీనమహాకవి గ్రంథములలోని కవిప్రయుక్తములె
యని విశ్వసింపఁదగిన సాధారణముగా మార్పరాని స్థలములందలి ప్రయోగ
విశేషములతోపాటుగఁ బ్రాచీనగ్రాంథికాంధ్ర భాషానుశాసనైకతానములగు
నాంధ్రశబ్దచింతామణి వికృతి వివేకాది ప్రాచీనలక్షణ గ్రంథములును
బ్రాచీనమహాకవికృతములె యగుటంజేసి పరమ ప్రామాణికము లనుట నిర్వి
వాదాంశము. కాన, నట్టివానికి వ్యాఖ్యానముచేయుట ప్రాచీన గ్రాంథికాంధ్ర

భాషాసేవకుల కత్యంతోపకారకమును వ్యాఖ్యాకర్తకు ధన్యతాపాదకమును నై యుండు ననుటలో సందియములేదు.

ఇప్పటికి వెలయించిన యీ యాఱుప్రకరణములలోను దద్భవప్రకరణమును ననుస్వారప్రకరణమును నక్షర ప్రకరణమును నంతస్థప్రకరణములోని రేఫ అకారవిషయమును మిక్కిలిగ విపులీకరింపఁబడినవి.

ఆంధ్రభాషలో వైకృతశబ్దముల తెగయు మిక్కిలి విశాలమైనదియె. కాన, సంస్కృత శబ్దప్రపంచము వికృతినందిన పద్ధతులను నట్టి వికృతులు కల్గుటలోని శబ్ద తత్వశాస్త్రసిద్ధములగు నుపపత్తులను లఘువుగానైన దెలిసికొనుట యత్యావశ్యకమై యున్నది. అందు వికృతులు కల్గుజాడలు మాత్రమలంతిగ నర్వాచీనమగు కవిసంశయ విచ్ఛేదమున వివరింపఁబడి యున్నవి.

వర్ణోచ్చారణశుద్ధి, వర్ణవైశేష్యనిర్ణయము, వికృతిశబ్దావిర్భావములోని భాషా పరిణామోపపత్తిజ్ఞానము, మున్ముందటి సంధిప్రభృతి వ్యాకరణ కార్యసాధన ప్రక్రియోపపత్తిజ్ఞానము, మున్నగు ననేక భాషాశాస్త్రవిషయముల కక్షర తత్వశాస్త్రము మూలభూతమైయున్నది. అట్టి విషయ మాంధ్ర వ్యాకరణాభ్యాసకులకేకాక లౌకిక సంస్కృత వ్యాకరణాభ్యాసకులకు సైతము విస్తరించి యుపదేశించు సంప్రదాయమె లేదు. అట్టి శాస్త్రము నుపపాదించు గ్రంథ మాంధ్రవాఙ్మయమున నిప్పటికిని వెలసియుండలేదు. వైదిక సంస్కృత వ్యాకరణములలో మాత్రమె యట్టి శాస్త్రము విస్తరిల్లియున్నది.

అనుస్వార చరిత్ర మింకను వింతదశలో నున్నది. హ్రస్వముమీఁది యర్థానుస్వారమునుండి పూర్ణానుస్వారమును జింతామణి సాధించుచున్నట్లహోబలపతి వ్యాఖ్యచేసియున్నాఁడు. నన్నయ భట్టారకునకు ముందు సైతమర్థానుస్వారము పూర్ణానుస్వారరూపముగనో యనునాసికరూపముగనో లిఖింపఁబడెడిదని కొందఱు విమర్శకులు వ్రాయుచున్నారు. అరసున్న కర్థచంద్రాకార లిపి నాధునిక ముద్రణకర్తలు కల్పించిరని కొందఱు తలంచుచున్నారు.

ఇంక రేఫ అకారవిషయకములగు నథర్వణకారికల యర్థమె దుర్జ్ఞేయమై యున్నది. వీనికి వింతవింతలగు విపరీతార్థములను గొందఱు పండితులు చేసియున్నారు.

పయి కారణములచేతఁ దత్తద్విషయములను గొంత విస్తృతమగు విమర్శనముతో వ్రాయవలసివచ్చెను. ఉచ్చారణ భ్రష్టములగు నర్థానుస్వార

శకటరేఫముల విషయమున నింతవిరివిగ వ్రాయనేలయని తలంపరాదు. ప్రాచీన గ్రాంథికాంధ్రభాషా విషయమున వాని పరిశోధన మత్యావశ్యక మనియు నేటికిని ప్రామాణిక గ్రాంథికాంధ్రభాషా లేఖన ముద్రణాదులలో నయ్యవి పట్టుదలతోఁ బాటింపఁబడుచునే యున్నవనియుఁ బాఠకమహాశయులు గ్రహింతురుగాక.

పఱిగన్నడము తమిఱము మున్నగు నన్యదేశ్య శబ్దములలో వెలయుచున్న ఱకారపు లిపి '*ழ*' అనురీతిని దమిఱమునందును 'ఱ' అను రీతిని బ్రాచీనాంధ్రకర్ణాట సాధారణ లిపియందును నుండుటంజేసి, యట్టి శబ్దముల నుపయోగించినపు డా యాంధ్రకర్ణాట సాధారణలిపి యిం దుపయోగింపఁబడుచు వచ్చెను. నన్నయభట్టారకుని నాఁటి కట్టివర్ణము తెల్గున, డకారాది రూపముగఁ బరిణమించి యుండుటంజేసి, యది యిందలి యచ్చాంధ్రవర్ణసమామ్నాయమున గ్రహింపఁబడదయ్యెను.

ఆంధ్రశబ్దచింతామణి కీవఱకుఁ బుట్టియున్న వ్యాఖ్యలలో విపులమయియున్న సంస్కృతభాషామయమగు కవి శిరోభూషణమును రచించిన యాతని పేరు పురాణగాథల చొప్పున "అహోబిలుఁడు" అని చెప్పఁదగియున్నను నీవఱకున్న లిఖితముద్రిత గ్రంథములందెల్ల "అహోబలపండితుఁడు, అహోబల పండితీయము" అని యిట్లు వెలసియుండుటంజేసి సంజ్ఞావిషయమున నట్లు పేర్కొన్నను క్షతిలేదన్న తలంపున నట్టి పేరులిందు మార్పలేదు. (చూడుఁడు-ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, అహోబలశబ్దము.) మఱియు నహోబల శబ్దభవమగు తద్భవరూపము "ఓబల, ఔబల, ఓబ, ఓబమ్మ" అను రీతినె గ్రంథములలో వెలయుచుండుటంజేసి ప్రాచీన పండిత వ్యవహారము నందును 'అహోబల' అను వ్యవహారమె యుండెడిదని విశదమగుచున్నది. "ఓబామ్బికాయాం నరసక్షితీన్ద్రాత్" (సదాశివదేవరాయల దానశాసనము ఎపిగ్రాఫియా ఇండికా, ౪ పుస్తకము, ౧ పుట.)

నేను శ్రీ విజయనగర మహారాజులవారి సంస్కృతకళాశాలయందాంధ్ర ప్రధానోపాధ్యాయుఁడుగ నున్నపుడె నన్నయాథర్వణ గ్రంథములను జోడించి యద్దాని వ్యాఖ్య రచనమునకుఁ దగు సామాగ్రిని సమకూర్చుకొనుచుండెడివాఁడను. అట్లాంధ్రభాషా వాఙ్మయ పరిశోధనముచేయు సందర్భమున నావఱకు రచించియున్న వసుచరిత్రవిమర్శన హరిశ్చంద్రలోపాఖ్యాన విమర్శనములకుఁ దోడుగ నథర్వణకారికావళీ విమర్శనమును సంతరించి, బాలసరస్వతీయ విమర్శన చింతామణివిషయ పరిశోధనముల రచనమునకుఁ గడంగితిని. ఇంతలో నేను జెన్నపురి విశ్వవిద్యాలయాంధ్రభాషా వాఙ్మయ పరి

శోధక సభ్యుఁడుగ నియమింపఁబడుటచేత దీక్షపరిశోధనము చేయుచు, నట్టి గ్రంథముల రచనమును గొనసాగించుట కవకాశము కల్గెను. కాఁగా, ఇచట నున్న మూఁడేండ్లలో నారచింపఁబూనియున్న నన్నయాథర్వణీయ వ్యాఖ్యానమగు వైయాకరణ పారిజాతమనెడి యీ గ్రంథ మాఱుప్రకరణములుగ రచించితిని. నేను దీనిని ముద్రింపించుకొని దీని సాఫల్యము ననుభవించుట కుదారహృదయులగు శ్రీ మద్రాసు విశ్వవిద్యాలయమువా రనుగ్రహించిరి. పిదప నేను శ్రీ యాంధ్రవిశ్వకళాపరిషత్కార్యాలయమున నాంధ్రోపాధ్యాయుఁడుగ నియమింపఁబడి యచట నాంధ్రవిశ్వకళాపరిషదధ్యక్షులుగ నుండి యున్న శ్రీ ప్రొఫెసర్, సర్, సర్వేపల్లి రాధాకృష్ణ పండితు, కె. టి; యమ్. ఎ; డీ. లిట్; వారితో నేతద్గ్రంథవిషయమును బ్రసంగించి ముద్రణావకాశమున దీని వెలయింపవేఁడఁగా నమ్మహాశయు లాంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణములలో నొకటిగా నా యీ గ్రంథ ముంచుట కేర్పాటుచేయ, శ్రీ సిండికేటువా రద్దానిని నామోదించి నాభాషాసేవకుఁ బ్రోత్సాహ మొసంగిరి. తరువాత, నాంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షపదవి నధిరోహించిన పండితవిమర్శకాగ్రసరులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యమ్. ఎ; (Cantab) యమ్. ఎల్. సి; వా రట్లారంభింపఁబడిన యేతద్గ్రంథ ముద్రణమును బూర్ణముగావింపించి, దీనిని వెలయింపఁజేసిరి. పై రీతి నేతద్గ్రంథవ్యాప్తికి మూలభూతులగు ప్రభుమహాశయులందఱయెడలను, నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

ఈ గ్రంథమందలి తమిఱు మళయాళభాషావిషయముల పరిశీలనమునకు వలయు తత్తద్వ్యాకరణాది గ్రంథసారములను నాకుఁ దెలిపిన తమిఱాంధ్రకర్ణాటమలయాళ భాషావిశారదులగు విద్వాన్, వి. వేంకటరాజులు రెడ్డిగారియెడలను (మద్రాసు విశ్వవిద్యాలయమువారి తమిఱు భాషావాఙ్మయ పరిశోధకసభ్యులు) కర్ణాటభాషావ్యాకరణాది విషయములను దెలిపిన సంస్కృతకర్ణాటభాషా పాండిత్య పరిపూర్ణులగు శ్రీమాన్, హెచ్. శేషయ్యంగారు, ఆచార్యులుగారి యెడలను (మద్రాసు విశ్వ విద్యాలయమువారి కర్ణాట భాషా వాఙ్మయ పరిశోధక సభ్యులు) నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

# విజ్ఞప్తి యనుబంధము



నా రచించిన యీ వైయాకరణ పారిజాతము మున్నగు గ్రంథములలోని నా సిద్ధాంతములకు భిన్నాభిప్రాయులగుచు, నలంతి విజ్ఞులేమేమో వ్రాసియున్నారు. వారు నాగ్రంథములను సరిగాఁ జదివినట్లు కానుపింపదు. సంస్కృతమెంత 'అగ్గబుయ్యి' యయ్యెనో కాని మా గృహనామమగు 'వఝులవారు' అనుదానిని 'వఝ్ఝులవారు' అని వ్రాయునంతటి విజ్ఞులైరని చెప్పుటకుఁ జింతిల్లుచున్నాను. వర్గయుక్కులు ద్విరుక్తములగు నపుడు వానిలో మొదటిది యల్పప్రాణమగుట యుచ్చారణ స్వభావసిద్ధమును శాస్త్రసిద్ధమును ని గ్రహింప లేకుండుట వింత!

"ఈవిషయమై 25—6—53 తేదీని శ్రీ వఝ్ఝులవారికి లేఖవ్రాయఁగా సమాధానము లభింపమింజేసి కాఁబోలు మిన్నకుండిరి" (ఆంధ్రభాషాభూషణపీఠిక 68 పుట)" (నా జవాబీయమికిఁ గారణమును సరిగా నరయమి శోచనీయము.)

"కళాప్రపూర్ణ శ్రీయుత వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారివంటి యుద్దండ పండితశిఖామణిని సైత మోటమిం జెందించిన" (ఆంధ్రభాషాభూషణము 'తొలిపలుకు–౪ పుట).

ఇట్టి వ్రాఁతలను జూచియే కావలయు గుండప్రజలో నొకరు "గ్రాంథిక వాదాన్ని తిరుగులేకుండా దెబ్బకొట్టినారు" అని వ్రాసిరి. (ఆంధ్రపత్రిక ౧౯౫౪–జనవరి ౮ తేదీ–౮ పుట)

ప్రతిపక్షులు నా యీ యనుబంధమునైనఁ జదువఁగల్గుదు రేమోయని యాశించుచు నీవఱకు విపులవిమర్శన పూర్వకముగా వ్రాసియున్న నాగ్రంథములలోని విషయములనె తీసి యీ యనుబంధముం బ్రచురించుచున్నాను.

ముఖ్యముగా "ఆంధ్రశబ్ద చింతామణి" మహాభారత భాగాంధ్రీకర్తయగు నన్నయచే రచింపఁబడలేదనియు నద్దానిని బాలసరస్వతి రచించియుండుననియు నట్లె వికృతి వివేకమనెడి యథర్వణ కారికావళి యాచింతామణికి వివరణ గ్రంథము కాదనియు దాని నహోబల పండితుఁడు రచించి యుండుననియు కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులవారు మొట్టమొదటఁ దమ యాంధ్రకవుల చరిత్రలో వ్రాసిరి. ఈవిషయమును నా రచించిన చింతామణి విషయపరిశోధనములోను నీ వైయాకరణ పారిజాతములోను 'ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము' లోను విపుల విమర్శన పూర్వకముగా నేను నిరసించి యున్నాను. పిదప నట్టి ఖండిత యుక్తులనె చాలవఱకుఁ జూపుచు మఱికొంత నిస్సారగ్రంథమును జేర్చి యాంధ్ర కవితరంగిణీకర్తగారు వ్రాసిరి. వీరు నాగ్రంథములను బొత్తిగాఁ జదివికొనకయె వ్రాసినట్లు కానిపించును. పిదప వీరి మిత్త్రులగు నాంధ్రభాషా భూషణపీఠికా కర్తగారు పయిగ్రంథమునె యుదాహరించుచుఁ గొంత వ్రాసిరి. ఇట్టి ప్రతిపక్షుల కందఱకును నాగ్రంథములను దయతో సావధానముగా నవగాహనముఁ జేసికొనుఁ డనునదే సరియగు సమాధాన మనవచ్చును.

శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులు, (యం. మ్మె.) గారు తమ 'తెనుఁగుకవుల చరిత్రలో నీ క్రిందిరీతిని వ్రాసిరి. "అథర్వణాచార్యుఁడు.........ఇతని వ్యాకరణము వికృతి వివేక మను పేరు గలది. ఇందలి లిపి శ్లోకములలో నుదాహరింపఁబడిన యక్షర విన్యాసమునుబట్టి

డా. బర్నెలుదొర (Dr. Burnell) వా రీతనిని పండ్రెండవ శతాబ్దినున్న వాఁడని భావించిరి. ఇది సమంజసమె. నన్నయభట్టారకుని వెనుక తిక్కనకు ముందుగా భారతమును పూరించుటకుఁ బూనుకొనిన యాంధ్రకవి యథర్వణుఁడు.'' (తెనుఁగు కవుల చరిత్ర 303 పుట). కాని యాంధ్రశబ్దచింతామణి నన్నయ రచితము కాదని నొక్కి వ్రాసిరి. అథర్వణుఁడు నన్నయ తిక్కనల మధ్యవాఁడనియు వికృతివివేక మను నథర్వణ కారికావళి నాయథర్వణుఁడే రచించెననియు నంగీకరించునపు డింక నట్టి యథర్వణ కారికావళి యాంధ్రశబ్దచింతామణికి వివరణ గ్రంథమనియు నక్కారణమున నది భారతకర్తృ నన్నయ రచితమనియు నంగీకరింపక తప్పదు.

శ్రీ వేంకటరావుపంతులుగా రథర్వణ కారికావళికి నందలి లిపిశ్లోకములకు నర్థమును దెలిసికొని యుండమింజేసి వీరట్లు వ్రాసి రనుటకు సందియములేదు. గ్రంథములను జదువకయు వానియర్థమును సరిగ గ్రహింపకయు విపర్యసములు వ్రాయుచు నలవాటు విస్తరిల్లుచుండుట నిట్టి ముప్పు సంభవింపవలసెను.

ఆంధ్రశబ్దచింతామణి "దపశార్ఙ్గ పిప్పల దళాన్యుక్తాః పస్వ్రగి సన్నిభాః క్రమాత్పరుషాః" అని యాకాలపు శాసనములలోఁ బ్రసిద్ధమైయున్న యాంధ్ర కర్ణాట సాధారణ లిపిలోని పరుషముల యాకారమును వర్ణింపఁగా దానినే యనువదించుచున్న "పఞ్చ వర్గాద్యో వర్ణాః। శృఙ్ఖ శార్ఙ్గాది సన్నిభాః" అను నథర్వణకారిక వచింపఁబడినదని గ్రహింపకుండుట శోచనీయము!

నన్నయ నాఁటికి శాసనాది ప్రసిద్ధమగు నాంధ్రకర్ణాటసాధారణ లిపిని గొంత సౌష్ఠవముగ నుండునట్లు నన్నయ సవరింపఁగా నద్దాని నథర్వణుఁడు మఱింత యుక్తముగా సంస్కరించెను. అట్టి నన్నయాథర్వణోపదిష్టలిపి సంస్కారము ప్రాతిశాఖ్యప్రసిద్ధ వర్ణోత్పత్తి పద్ధతి ననుసరించి యున్నది. అట్లయినను నలవాటు బలిమిచేత నయ్యది వాడుకకెక్కదయ్యెను. కాని యందలి కొన్ని విషయములు మాత్రము వాడుకలోనికి వచ్చినవి.

నన్నయనాఁటికిఁ దలకట్టు '—' అనురీతి నుండఁగా 'అ' కార లిపికి (బొత్తెన్ను) సరిగా బాలచంద్రాకార (✓) లిపి నన్నయచే నుపదేశింపఁబడెను. ప్రాచీన లిపిలోఁ బొల్లు హల్లును వ్రాయునపుడు దానితలమీఁది 'అ' కారపు గుఱుతగు '—' అనురేఖను వ్రాయమానుటయె యై యుండఁగా నథర్వణుఁడు '/=ౕ పొల్లునకుఁ దిర్యగ్రేఖను నిల్పవలయునని యుపదేశించెను. (తిర్యగ్రేఖా యుజ శ్చోర్ధ్వమ్) ఆపొల్లుగుఱుతు తర్వాతి లిపిలో విస్తరించెను. అట్లే వర్గయుక్కులు ప్రాచీనలిపిలో 'ఒత్తు'లు లేకయే యుండఁగా నథర్వణోపదిష్టమగు నధోదండ రేఖ తర్వాతి లిపిలో (దణ్డరేఖాన్వితా అధః) విస్తరిల్లినది. అట్లె ప్రాచీనలిపిలో లేని మిళద్దండ ద్వయరేఖ (జ - ఞ) (మిళద్దణ్డ ద్వయోపేతాః) 'జ - ఞ' ల లిపిలో విస్తరిల్లినది. నన్నయాథర్వణలిపి ప్రాతిశాఖ్య ప్రసిద్ధ వర్ణోత్పత్తి పద్ధతి మూలకము. (చూ - వై. ప్రా. ౨౭౨ విష. ౨౬౦ పుట) (౨౭౩ మొ - ౨౮౦ - విష. వై - ప్రా - ౨౬౧ - ౨౬౫ పుటలు). (ఈలిపిశ్లోకము లాంధ్ర భాషా చరిత్ర కర్తగారి కేవో గీఁతలని యర్థమైనవి).

ఆంధ్ర కవితరంగిణీకర్తగారగు శ్రీ చాగంటి శేషయ్యగారును నాంధ్రభాషాభూషణ టీకాకర్తగారగు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారును మఱొక వింత సిద్ధాంతము నంగీక

రించిరి. "అప్పకవి స్వతంత్రముగా రచించిన పద్యములను నహోబిలుఁడు, కారికలుగ సంస్కృతీకరించి యధర్వణుని పేరు పెట్టినాఁడు" (ఆంధ్ర - తరం - 3 సం పు॥ ౮౩-౮౪ పుటలు.) (ఆంధ్రభాషాభూషణ పీఠిక. ౩౨ పుట). అధర్వణకారికలకు సమానార్థకములగు పద్యము లప్పకవీయమున నలంతులు మాత్ర మున్నవి. అవిమాత్ర మధర్వణ కారికలకు మూల మనియుఁ దక్కిన యధర్వణకారికలు స్వతంత్రములె యనియు వీరు వచింతురు కాఁబోలు! మఱియు నప్పకవీయములోని లిపి వివరణ పద్యము లధర్వణకారికలతో మాత్రమె సమానార్థకములని వీరనుకొనుచున్నారు. ప్రతిపత్తు లనుకొనునట్లుగ నొక్క యధర్వణకారికలనే యప్పకవి యచట నాంధ్రీకరింపలేదు. చింతామణిలోని యార్యలను నాధర్వణములగు ననుష్టుభములను జోడించి యాంధ్రీకరించెను. ఇంకఁ బ్రతిపత్తులు బాలసర్వతి చింతామణీ యార్యలను నహోబలుఁ డధర్వణకారికలను గీర్వాణించి రనవలెను. లిపిశ్లోకముల యర్థము తెలియక బాలసరస్వతి యా లిపిశ్లోకములను దన టీకలోఁ జేర్పనే లేదు. అప్పకవి చింతామణి లిపిశ్లోకములను బండిత పరంపరాయాతాధర్వణ కారికలను జోడించి తెనిగించెను.

"బాలేన్దు పరిధిశృఙ్గావర్త కుశగ్రన్థి దాత్రపరశుసమాః! ఆద్యాః - (ఆం. చిం.)
ఇవి యధర్వణకారికలలోనివి కావే!

సీ. విదియ చంద్రునివూడ్కి వెలయు నత్వము ......... ! నడిమికి గుడిఁ జుట్టి
విడువ నిత్తు ......... (అప్పక. ౨ ఆశ్వా.)

దరశార్ఙ్గ పిప్పలదళాఙ్కుశ పన్నగ సన్నిభాః క్రమాత్ పరుషాః......... (ఆం. చిం.)
ఇవి యధర్వణకారికలు కావే!

సీ. శఙ్ఖ శార్ఙ్గ ద్విపాశన దళాఙ్కుశ పన్న; గాకృతుల ..................
(అప్ప. ౨ ఆశ్వా.)

అప్పకవి యివి యాంధ్రశబ్ద చింతామణిలోనివే యని వచించెను. వీని నప్పకవి స్వతంత్రముగా రచించుటేమి? అహోబలుఁడు గీర్వాణించుటేమి? అధర్వణకారికలందు హల్లుల యాకారములను సవరించు విషయములు మాత్రమె కలవనియు నప్పకవీయ పద్య మూలకము లనుట కేవల మసంగత మనియు హల్లుల యాకారములో సైతము గ్రంథద్వయమునకును చాల భేదము లున్నవనియు వీరు గ్రహింపకుండుట వింత! "పఞ్చ వర్గాదయో వర్ణాః" అను నధర్వణకారికల యెత్తుబడి యైన వీరికి స్మరణాతిథి కాకుండుట మఱియు వింత! లిపిశ్లోకముల యర్థమును సరిగా గ్రహింపలేని యప్పకవి పద్యములు 'మూలము - స్వతంత్రములు' ననుట తద్గ్రంథ పరిశీలన రాహిత్య కృతము.

అప్పకవీయమునందును నహోబలపండితీయమునందును గల వివరణ రేఖలు లిపి శ్లోకములకు సరిగా నుండక యున్మత్త లిఖితములవలె కేవలము నసంగతములై యున్నవి. శ్రీగిడుగువారిచే సంస్కరింపఁబడిన యప్పకవీయమునందును నసంగతముగానె వ్రాయఁబడి నను "ఈ రూపములు సరియైనవి కావు. .........బర్నెలు వ్రాసిన సౌదిండియన్ పేలియాగ్రఫీని......... చూడవలెను." అని టిప్పణముగా వ్రాసిరి (వై. పా. ౨౪౯ - ౨౫౦ విష. ౨౪౧, ౨౪౨ మొ. పుటలు.)

ఈ లిపిశ్లోకములలోని "పూర్ణేందు సదృశః పూర్ణ। స్త్వర్ధ స్త్వర్ధేందు సన్నిభః" అనునది నన్నయోపదిష్టమగు "పూర్ణార్ధభేదతో ద్వివిధః" అనుదాని కథర్వణుండు చేసిన వివరణము. దీని నప్పకవి పండితపరంపరాయాతముగా విని మీఁదివానినివలె నిక్కముగనే స్వీకరించి యుండును.

తే. గీ. సగము జాబిల్లి వలె వ్రాయ సగముసున్న।
నిండు జాబిల్లివలె వ్రాయ నిండుసున్న.

(అప్పక. ౨. ౨౨)

ఇట్లు గ్రహింపక శ్రీ శేషయ్యగారును వీరిమిత్రులు శ్రీ గోపాలకృష్ణయ్యగారును గల రూపును విపరీతముచేసి వ్రాసిరి. అప్పకవి యరసున్న కర్ధచంద్రాకారమని పేరు గల్పించి నాఁడనియు నహోబలుఁడు దానిని గీర్వాణీకరించెననియు వ్రాసిరి. (ఆంధ్రభాషాభూషణ పీఠిక ౩౨ పుట). మీఁదు మిక్కిలి ప్రాచీనులు పూర్ణార్ధములు రెండిటను నిండుసున్నగానే వ్రాసెడివారని యొకొక యసత్యస్థితి నంగీకరించిరి.

"ఐనను విమర్శక ధర్మమును వీడఁజాలక మఱియొక సిద్ధాంతమునుం జూపుచున్నారు.

ప్రాచీనులు సున్నలు రెంటికిని నిండుసున్ననే వ్రాయుచుండువారు. మీఁదిహల్లు ద్విత్వయుక్తమగుచో సున్నయనియు, ద్విత్వయుక్తము కానిచో సున్న యరసున్నయనియు నెంచుచుండెడివారు" (ఆంధ్రభాషాభూషణ పీఠిక 33 పుట) అని పీఠికాకర్తగారు వ్రాసిరి. వీరుగాని వీరికి మార్గదర్శకులగు శ్రీ శేషయ్యగారుగాని వైయాకరణ పారిజాతములోని యనుస్వార ప్రకరణమును జిత్తగించి యున్నయెడలఁ బైరీతిని వ్రాయ సాహసింపరుగదా! (చూ. వై. పా. అనుస్వారప్రకరణ ౩౦౭ విష. మొ. ౩౭౨ విష. వ. ౨౨౮ పుట నుండి ౨౬౪ పుట వ.) అందును ౩౧౬–౩౧౭ పుటలనైనఁ జిత్తగించియున్నచో "రెండుసున్నలను సున్నగానే ప్రాచీనులు వ్రాయుట, పరాక్షరద్విత్వముచే నిండుసున్నయని గ్రహించుట" అను పద్ధతి నవ్యమని గ్రహింతురు. ప్రాచీనకాలమునఁ దేల్చిపలుకు ఖండానుస్వారము పేర్కొనఁబడెడిదనియు నన్నయభట్టారకుఁడె యట్టి ఖండానుస్వారమును స్థాపించినవాఁడనియుఁ బ్రాచీన శాసన ప్రదర్శన పూర్వకముగా విపుల విమర్శన పురస్సరముగా నందుఁ జూపఁబడి యున్నది. చూ. వై.పా. ౩౧౬–౩౧౭ పుటలు) నన్నయభట్టారకుని ఖండాఖండానుస్వారములు పూర్ణార్ధ బిందువులు నను వ్యవహారమునె, చింతామణికి వివరణగ్రంథకర్తయగు నథర్వణుఁడు "పూర్ణేందు సదృశః పూర్ణ। స్త్వర్ధ స్త్వర్ధేందు సన్నిభః" అని వివరించెననియు గ్రహింప నగును.

గ్రంథమును జదువకయె వాని యర్థమును సరిగా తెలిసికొనకయె వానిమీఁది విమర్శనమునకు దిగుట పరమ సాహసము!

ఈరీతిని లిపిశ్లోకము అప్పకవ్యాదుల పద్యముల సంస్కృతీకరణము అనువాదము ధ్వస్తముకాఁగా నథర్వణ కారికావళి యప్పకవికిని నాతనికిఁ బూర్వుఁడగు బాలసరస్వతికిని నాతనికిఁ బూర్వుఁడగు ముద్దరాజు రామనకును బూర్వముండెడిదని యంగీకరింపక తీరమింజేసి యది తిక్కన కించుకపూర్వుఁడగు నథర్వణునిదే యను శ్రీ నిడుదవోలు వెంకటరావు పంతులుగారి పక్షములోనికి రాక తప్పదు.

అథర్వణకారికావళి ప్రాచీనకాలమున సాకల్యముగాఁ బ్రసిద్ధికెక్కకున్నను నందలి కారికలు కొన్ని పండితపరంపరాయాతముగా వాడుక కెక్కియుండెను.

శ్లో. పరుషా వా స్వరూపేణ । ప్రథమాన్తోపరి స్థితాః ।
కాకా సంబోధనే చాపి । హ్యవ్యయే కర్మధారయే ।
అచేతనార్థకే శబ్ద । ఇతి శృఙ్గారభూషణః
(వికృతి వివేకము, సంధి - ౧౮.)

గీ. సంధిఁ గూర్పంగఁ బ్రథమాంత శబ్దవితతి
పైఁ గచట తపలకు వికల్పంబు చెల్లు
కాకు సంబోధ నావ్యయ కర్మధార
యంబుల నచేతనంబుల నబ్జనాభ ॥
(ముద్దరాజు రామన, కవిసంజీవని — ప్రథమ తరంగము. ౧-౨౭)

అప్పకవీయమునఁ గొన్ని యాంధ్రశబ్దచింతామణి లిపి కారికలను నథర్వణకారికలను నాంధ్రీకరణము గలదనుటకుఁ బ్రతిపక్షులవాదమె నిదర్శనము గదా. ఇంకీ శ్లోకములు బాల సరస్వతీయమున వారంటి తాటాకుపుస్తకమున లేకుండుఁ గాక. పెక్కుప్రతులలో నున్నవి. ఇట్టి లిపి శ్లోకములు, పై కారికలు నన్నయాథర్వణులవె యనుటకుఁ బ్రబలనిదర్శనములై యున్నవి. ఇట్టిచిక్కు వరసియె కదా డా. చిలుకూరి నారాయణరావుగారు వీని జోలికిఁ బోక యేవో గీతలని తప్పుకొనిరి. చింతామణి కథర్వణ కారికలు వివరణ గ్రంథమనియు నథర్వణ కారికావళి ప్రత్యేక గ్రంథము కాదనియు నాగ్రంథద్వయమును సవిమర్శముగాఁ జదివిన వారికెల్ల బోధపడక తీరదు. వేయేల! ఆంధ్రశబ్దచింతామణిలో లేనివిషయములు మాత్రమే యథర్వణ కారికావళిలో వెలయుచున్నవి. ఇట్టి స్థితిలో నాంధ్రశబ్దచింతామణి కథర్వణ కారికావళి వివరణ గ్రంథమనుటలో సందేహ మేమున్నది? ఆట్లా రెండుగ్రంథములను నేకగ్రంథముగా జోడించియే నేనద్దానికి గల్పతరువను వ్యాఖ్యను జేసియున్నాను, (చూ. ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము) అట్లథర్వణుండు జోడించిన గ్రంథము నేఁటికిని నుపలబ్దము కాలేదు. అహోబల పండితీయమునుండియే యెవ్వరును నథర్వణకారికావళిని సంగ్రహించుచున్నారు. అథర్వణ కారికావళి టీకాకర్తయు నహోబలపండితీయమునుండియె దానిని సంగ్రహించెను. చింతామణివల్ల సిద్ధింపని వ్యాకరణవిషయములు మాత్రమె యథర్వణ కారికావళిలో వెలయుచుండుటే కాక యొక్కొక్కచో నథర్వణ కారికావళీకర్త చింతామణిలోని శబ్దముల నెత్తికొని వివరించుచు నుండును.

I "ఔపవిభక్తికసంజ్ఞాః......తేహి విభక్తౌ సమాసే చ" అను నాంధ్రశబ్దచింతామణి కారికలోని 'హి' శబ్దము నందుకొని యథర్వణ కారికావళి "ప్రవృత్తి శ్చాప్రవృత్తి శ్చ । వికల్పశ్చ క్వచి ద్భవేత్! తద్వివేకః ప్రయోగైక । శరణం స్యా ద్ధి (స్యాత్ + హిశబ్దతః) శబ్దతః" అని వివరించుచున్నది. (చూ. వ్యా. సం ౨-౨౩ మొ. ౨౩౩ వ. విష. ౯-౨౬ పుట)

II "తత్ర తృతీయా షష్ఠీచ! విభక్తి స్సమ్మతే శుభే" అను నథర్వణ కారికలోని 'తత్ర' శబ్దము "నతుహో భవేచ్చ లోపో హ్యర్థే యో వర్తతే పరే తస్మిన్" అను నాంధ్రశబ్ద చింతామణిలోని 'హ్యర్థే' అనుదానిఁ బరామర్శించుచున్నది. (చూ. 'వ్యా. - సం.' ౯౭౪ పుట, ౨౩౭ విష.)

III "క్వచి త్ప్రత్యయయోగే చ । తథాత్వ ముపేక్ష్యతే" అను నథర్వణ కారికలోని "తథాత్వమ్" అనుశబ్దమున కాంధ్రశబ్ద చింతామణిలోని "షష్ఠీ భవే ద్వితీయా సప్తమ్యా ! స్తస్య రుషసంస్థితా నామ్నామ్" అను కారిక చెప్పిన "షష్ఠికి ద్వితీయాతుల్యత్వము కల్గుట" యర్థము. (చూ.వ్యా. సం. ౨౫౧I—౨౮౦—౨౯౯ విష.) (౧౧౩౫-౧౧౭-౧౨౩ పుటలు-వ్యా-సం.)

IV "అన్యత్రాపి భవే ద్దైక్యం । క్వచిత్ సుకవిసమ్మతేః" అను నథర్వణ కారికలోని "అన్యత్రాపి" అను దానికి "ప్రథమ లుగప ద్విను ల్యోః" అను చింతామణి కారికలోని "ద్విను ల్యోః" అను వానియందే కాక యితర స్థలములందును ద్విత్వాలోపము కల్గునని యర్థము. చూ-వ్యా-సం. ౨౧౦ IV విష. ౮౯—౨ పుట.)

V "నుర్మ్యా సుజసో వ్యక్తాః । యుక్తా వపి మతా ను మాః" అను నథర్వణ కారిక (చూ. వికృతి వివేకము ౧౩౦ పుట.) "దేశ్యా వస్తు ప్వత్స్వప్నః" అను నలు మూడు లగు నాంధ్రశబ్ద చింతామణి శ్లోకములను శేషపూరకము లయి యున్నవి. ... ముల విషయమునఁ జింతామణిలోఁ జెప్పఁబడని విషయము లీ యాథర్వణ కారిక చేత నిరూపింపఁబడుచున్నవి. (చూ. వ్యా. సం. ౨౧౯ విష. ౯౯౭ పుట)

VI "రఞ్జతి ప్రభృత్యాదీనాం । బిన్దో శ్చ స్యాల్లోపో భవేత్" (చూ. 'వ్యా. సం' ౩౨౮ విష.) అని చింతామణి "రంజిల్లు" మున్నగువాట్ల లకార ద్విత్వము సాధించి యుండఁగా నందొక 'ల' కారము లోపించుటయుఁ గలదని యథర్వణుఁడు "... లకార ఇతి కేచన" అని వివరించి యున్నాఁడు. ... "తత్ర" అను దానికిఁ జింతామణి సూత్రములోని "లావు భౌ" అనుదాని చెప్పిన వచ్చు లకార ద్విత్వములో ననియేకదా యర్థము.

ఇట్టి స్థలములు పెక్కుగలవు. విస్తరభీతిని జూపలేను. ఇట్టి సందర్భములను పరిశీలించు నపు డాంధ్ర శబ్దచింతామణికి వికృతి వివేకము వివరణ గ్రంథము కాదనుమాట (ఆంధ్ర ... తరంగిణి — ౩ సం. ౮౯ — ౯౧ పుటలు) విమర్శన ... నగదా. నన్నయాథర్వణ కారికల యర్థము నాఘ్రాణించిరయేని మున్నుగా నిట్లు వ్రాయ సాహసింపరు గదా.

అహోబలుఁడె యథర్వణ కారికల రచయిత కానోపునను ప్రతిపక్షుల వాక్యము నసత్యమనక తీరదు. అథర్వణ కారికలు పెక్కు కవిశిరోభూషణకర్తయగు నహోబలపతి కర్థము కాలేదు.

వెనుక నుదాహరించిన "క్వచి త్ప్రత్యయ యోగే చ । తథాత్వ ముపేక్ష్యతే" అను నథర్వణ కారిక కర్థసందర్భములు తెలియక యహోబలపతి "ప్రత్యయ యోగే మిక్కిలియు నిత్యుదాహరణమ్" అని మిక్కిలి యసంగతముగా నుదాహరించెను. ఈ స్థలమునఁ బ్రత్యయ యోగ మేమియు లేదుగదా! (అహో. ౧౯౯ పుట. అనాదిష్విత్యాది సూత్రవ్యాఖ్య)

అట్లె వెనుక నుదాహరించిన "తత్ర తృతీయా షష్ఠీ చ । విభక్తి సమ్మతే ఉభే" (వ్యా. సం. ౨౩౨ విష.) అను నథర్వణ కారిక కర్మార్థక స్థల విషయకమని యహోపతి కేవలము ప్రామాదికముగా వ్రాసెను. (అహో. ౫౦౩ పుట.)

నన్నయాథర్వణ సమ్మతములగు ద్రుత స్వత్వ సంశ్లేషముల స్వరూప మహోబలపతి గ్రహింపలేదు. (చూ. 'వ్యా. సం.' ౯౦ విష. ౨౮౯ పుట మొ. ౨౯౧ పుట వ.)

ప్రాకృతే తద్భవే చాపి చ జా దన్త భవా స్మృతా” అను నథర్వణ కారికలోని ప్రాకృత శబ్ద మాంధ్రదేశ్య పరమని యహోబలపతి గ్రహింపలేదు. (చూ. 'వ్యా. సం.' విస్త ౧౮ విష.) దేశ్యమందే లేని దంత్యత్వము తద్భవములం దెట్లు ఘటిల్లును ?

“స్త్రీయశ్చ స్త్రీసమ స్యేతో । ద్రుతేః స్యా న్నిత్య్రితిః క్వచిత్” అను నథర్వణ కారిక కర్థము చేసికొని యీ క్రిందిరీతిని వ్రాసెను. (అహో. ౪౫౩ పుట) “తల్లిం దండ్రియు నన్నుం గానక ఇత్యాది ప్రయోగ స్త్వనాకరత్వా దుపేక్ష్య ఏవ” అహో. ౨౫౯ పుట) “త్రిమూర్తి విలాస వర్తివిన్ ఇతి రూపం త్వసంగత మేవ” ( ... పుట) ఈసందర్భమునుబట్టి “అనుబాలకు నడ్డపడి యే । మిని జేయంగ నీకు” (ఉ. ... ౧౩) “ప్రీతుం జేయుకం। టెను హితమైన కృత్య మొకటిం గలదే” (ఉద్యో. ... ౧౫౮) మున్నగు కవిబ్రహ్మ ప్రయోగములును నపప్రయోగములె యగుచున్నవి. (చూ. 'వ్యా. సం.' ౪౪ విష. ౩౦౯ పుట)

పైరీతి నహోబలపతి కర్థమే కాని యథర్వణ ... లింక ననేకములు గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు. కాన నహోబలపతి ... కారికావళిని రచించి యథర్వణుని పేరు పెట్టె ననుట పట్టి కల్ల.

ఇంకం దిక్కన్నకుం బూర్వుండగు నథర్వణుని వివరణ గ్రంథమునకుం బూర్వ మనక తీరని యాంధ్రశబ్దచింతామణి చిరకాలమునుండి పండిత పరంపరాయాతమగు జనశ్రుతిచొప్పున భారతభాగాంధ్రీకర్తయగు నన్నయదే యనుటకు సందియ ముందునా ? కాదనుటకుం బ్రతిపక్షుల కేమి యుక్తి కలదో విద్వాంసులు పరిశీలింతురుగాక !

మఱియు నాంధ్రశబ్దచింతామణికిని నన్నయ రచించిన యాంధ్రమహాభారత భాషకును గల సంబంధము వాని యేకకర్తృకతను గూఢమూలము గావించుచున్నది.

I ఆంధ్రవ్యాకరణ ప్రపంపంచములో నొక్క యాంధ్రశబ్దచింతామణిమాత్రమె ప్రథమ పురుషక్రియల 'ఇ' కారమునకు స్వరపరకత్వమునం బరరూపసంధి నిత్యతను విధించుచున్నది.

ఆంధ్రమహాకావ్య ప్రపంచములో నొక్క నన్నయ భారతభాగమున మాత్రమె ప్రథమ పురుష క్రియల 'ఇ' కార పరరూప సంధి నిత్యముగాం బ్రయోగింపంబడినది. (చూ. 'వ్యా.సం.' ౪౧-౪౧ I విష.)

II ఆంధ్రవ్యాకరణ ప్రపంచములో నాంధ్రశబ్దచింతామణిని రచించిన నన్నయభట్టారకుండె యావల కుపేక్షింపంబడుచున్న యర్ధబిందువు స్థితిని స్థాపించెను. (చూ. ఈవిజ్ఞప్త్యనుబంధము viii పుట)

ఆంధ్రమహాకావ్యప్రపంచములో నొక్క నన్నయ భారతభాగమందు మాత్రమె ఖండాఖండ ప్రాస ముపయోగింపంబడ లేదు. (చూ. వై. పా. ౩౩౧ మొ. ౩౩౬ విష. అందును ౩౩౬ విష. ౩౦౪ మొ. ౩౧౦ పుటలు. అందును ౩౧౦ పుట)

III ఆంధ్రవ్యాకరణ ప్రపంచములో 'ర-అ'ల యతిప్రాస మైత్రి దుష్టమని నిర్ణయించినది యాంధ్రశబ్ద చింతామణి మాత్రమె.

ఆంధ్రకావ్య ప్రపంచములో 'ర-అ' ల యతి ప్రాసమైత్రి నుపయోగింపనిది యొక్క నన్నయ భారత భాగము మాత్రమె. (వై. పా. ౪౪౪ విష.)

IV ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున 'గోరు' మొదలగు శబ్దముల తుదిరేఫమునకు బహువచనమున ఱ=(ళ) త్వము నాదేశించియు “త్రాడు” మున్నగు శబ్దములతుది 'డ' కారమునకు 'ఱ' = (ళ) త్వ మాదేశింపని దొక్క యాంధ్రశబ్ద చింతామణి మాత్రమె.

నన్నయ భారత భాగమునఁ బ్రాసస్థలములం దట్టి 'ము' [illegible] ప్రయోగింపఁ [illegible]
కున్నను నన్నయ కాలపు శాసనములలో "గుడి-(బూవు) గుద్దు" అను [illegible] రూపములు
కాన్పించుచున్నవి. ఇది శాసన ప్రయోగ ప్రదర్శన పూర్వకముగ [illegible]
సర్వస్వమున నిరూపింపఁబడెను. (చూడు. 'వ్యా. సం.' ౧౯౯ విష. [illegible] పుటలు.)

V ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతము కేవల [illegible] విధించిన
దొక్క యాంధ్రశబ్ద చింతామణి మాత్రమే.

ఆంధ్రమహాకావ్య ప్రపంచమున నొక్క నన్నయ భారత భాగమునందే [illegible]
నకార వ్యంజన రూపముగా మాత్రమే ప్రయోగింపఁబడెను. (చూ. చిం. [illegible] ౧-౧౨
విష. మొ. ౧౩౭ విష. వ)

VI ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునందు [illegible]
డును ద్రుతమునకు బిందువు విధించునదొక్క చింతామణి మాత్రమే.

ఒక్క నన్నయ భారత భాగమందు మాత్రమే [illegible] ద్రుతమునకుఁ
బూర్ణబిందువు వచ్చు ప్రయోగములు గలవు. ఉదా: [illegible]
మొనసి' (ఆది. ౫ ఆ. ౧౩౭ ప) (చూ. 'వ్యా-సం.' ౭౧ I విష) (చూ. 'వ్యా. సం.'
౭౨ I విష)

VII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతపూర్వస్వర పరరూపసంధి నన్నయాధర్వణ
పక్షమునందు మాత్రమే సిద్ధరూపము. ఇతరుల పక్షమున 'నాతన్ + అనియె' అను సూత్రా
వ్యాప్తికే వీలు లేదు.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున నకార వ్యంజనము మాత్రమే ద్రుతముగా ప్రయోగించు
నన్నయభారత భాగమున మాత్రమే యట్టి పరరూపసంధి సందర్భపడును. ఇతరుల పక్షమున
స్వరపరకత్వమున ద్రుతలోప మెట్లు?

VIII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున సమహా ద్విపదయమున "యొక్క" [illegible]
ములుగా 'ది-వి' ప్రత్యయములను విధించునది యొక్క నన్నయాధర్వణీయమే.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున సమహాద్విపదయమున 'యొక్క' [illegible]
'ది-వి' ప్రత్యయములను బ్రయోగించినది నన్నయభారత భాగము మాత్రమే (చూ. 'వ్యా-సం.'
౨౫౧ I విష)

IX "అను - కొను" మున్నగు 'ను' వర్ణాంతధాతువులు 'ట' ప్రత్యయాంతము లగు
నపుడు 'ను' వర్ణమునకు బిందుగూప వికారము సంభవింపరాదని సూత్రించున దొక్క నన్న-
యాధర్వణీయమే. "టవర్ణకః క్రియాన్తే స్యాద్భావార్థే సానునాసికః । పూర్వస్య
న వికారో నః।...(వికృతి వివేకము. క్రియా-౧౯ శ్లో) (వ్యా.సం. ౩౧౯ విష. ౧౪౨-౪౩ పుట)
(వికృతి వివేకటీకాకర్త దీని నుదాహరించుట మఱచెను. (చూడు. అహో ౪౯౯ పుట)
(అంట మున్నగు బిందు ఘటిత రూపము నన్నయ భారత భాగమున నొక్కచోటనియు లేదు.
తిక్కన యట్టి రూపములను ధారాళముగఁ బ్రయోగించెను. ఉ: పాండు నృపాలు పాలు
గైకొంటయ చాలు ... రా। కుంట ... (ఉద్యో-౩ఆ౫౯) (వ్యా-సం౧౪౩-౪పుట) మూల
ఘటిత కేతన యట్టి సున్నను సూత్రించెను. క. తినుటకుఁ దింట యగున్ మఱిఁ । గొనుటకుఁ
గొంట యగుఁ గనుటకుం గంట యగున్ । వినుటకు వింట యగుం దా। ననుటకు నంట యగు
వలసినప్పుడు కృతులన్ (ఆంధ్ర భాషా భూ. ౧౫౭ ప).

ఈసందర్భమునుబట్టి యథర్వణ కారికావళి తిక్కన కేతనలకు ముందటిదని తోఁచక మానదుగదా. దానికి మూలగ్రంథమగు చింతామణి నన్నయ రచిత మను పండిత జనశ్రుతి రూఢమూల మగుచున్నదిగదా.

X ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునఁ బదాది యకార మాచ్ఛికశబ్దములందు గలదనియు, సంధివేళల లోపించుననియుఁ జెప్పిన దొక్క నన్నయాథర్వణీయమె. తక్కిన గ్రంథములెల్ల నట్టి పదాది యకారోచ్చారణము వ్యావహారికమనియు నద్దానిమీఁది యచ్ఛే యావయవిక మనియు వచించుచున్నవి. ప్రాచీనమగు, తమిళభాషలోఁ బదాది యకార మావయవికము గలదు. ఉదా: (తమి) యానై = (తె) యేనుఁగు (తమి) యాఱు = (తె) యేఱు. = (తమి) యారు =(తె) యెవరు - మొ.

ఈవిషయమును బరిశీలించునపు డాంధ్రశబ్ద చింతామణి యత్యంత ప్రాచీనమనియు దాని నర్వాచీన మనుట పరమసాహసమనియు నెవ్వరికేనిఁ దోఁచకపోదుగదా. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ భారత భాగముల కిట్టి యాంతరంగిక సంబంధములు పెక్కు స్థలము లందు గలవు. విస్తరభీతిని వానినెల్లఁ జూపలేదు. ఈ సందర్భమునుబట్టి భారతాంధ్రీకర్తృ నన్నయాథర్వణులే యాంధ్ర శబ్ద చింతామణి వికృతి వివేక కారికల రచయితలని యెవ్వరికేని తోఁచకపోదుగదా.

ప్రతిపక్షుల నిస్సారములగు నితరాక్షేపణములకు నేనిందు సమాధానముల నియ్యఁ దలంపలేదు. దిఙ్మాత్రముగా నట్టివాని నొకటి రెండు చూపి విడుచుచున్నాను.

'వస్తున్నాడు, పోతున్నాడు' అను రీతిగల వ్యావహారికపదము, లసాధువులనియు 'వచ్చుచున్నాఁడు పోవుచున్నాఁడు' మున్నగు గ్రాంథిక శబ్దములు సాధువులనియు ననుశాసించుట నన్నయాథర్వణుల ప్రణాళియే కాదు. గ్రాంథిక భాషలోని శబ్దములను నిరూపించుటయే వారిపద్ధతి. అట్లే "యితడు-యీతడు" మున్నగు వ్యావహారిక శబ్దముల యాది యకారము విషయమును వారు స్మరింపనేలేదు.

"అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అను సూత్రము చొప్పునఁ (వై-పా- ౫౦౩ విష. ౫౧౬ పుట) (వ్యా. సం. ౫౩ విష. ౧౨౧ పుట) గొన్నిటఁ బదాది యకారము శబ్దావయవసిద్ధమె యని విశదీకరించుచున్న నన్నయకును నాతని గ్రంథమును వివరించుచున్న యథర్వణునకును నట్టి పదాది యకారములు హల్లులు కావనుట సమ్మతమని "ఆద్య+వర్ణాస్తు హాత్త్వేన। న గృహ్యన్తే కదాచన" అని యెవ్వరేని వ్యాఖ్య చేయుదురా? పరమ సాహసికులగు గోపాలకృష్ణయ్యగారు తప్ప. "ఆది+అవర్ణాస్తు హాత్త్వేన న గృహ్యన్తే కదాచన" (చూ. వై. పా. ౫౧౨ విష. ౫౩౮ పుట మొ.| 'వ్యా. సం' ౫౩విష. ౧౨౧ పుట మొ.) అని ఛేదముచేసి వ్యాఖ్యచేయుట యుక్తము కాదా. "ప్రాణా త్ప్రాణో లఘుర్య స్స్యాత్స హల్స్యాచ్చ క్వచి ద్భవేత్" (వై. పా. ౫౧౨ విష. ౫౩౮ పుట) అని చెప్పిన యథర్వణుఁడు సంహితా 'అ' కారముతోఁ గూడిన పదాది యకారము (హరియతడు) హల్లు కాదని చెప్పెనని వాఖ్య చేయుట సమంజసముకదా! అట్టియెడ "శ్రీవఝ్ఝలవారు అనర్థదాయకమైన విపరీతార్థంచేసి "ఆది+అవర్ణాస్తు" అని వ్యర్థమైన అర్థాన్ని చెప్పడం సమంజసంకాదు";

నన్నయ భారత భాగమున( బ్రాసస్థలములం దట్టి 'ఢ' కారమునకు బ్రయోగము దొరక కున్నను నన్నయ కాలపు శాసనములలో "గుడి–(బహు) గుడ్లు" అను రీతి రూపములు కాన్పించుచున్నవి. ఇది శాసన ప్రయోగ ప్రదర్శన పూర్వకముగ నాంధ్ర వ్యాకరణసంహితా సరస్వమున విమర్శింపఁబడెను. (చూడు. 'వ్యా. సం.' ౧౯౯ పిస. ౭౩౩–౭౩౮ పుటలు.)

V ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతము కేవల నకార వ్యంజన రూపమని వచించిన దొక్క యాంధ్రశబ్ద చింతామణి మాత్రమే.

ఆంధ్రమహాకావ్య ప్రపంచమున నొక్క నన్నయ భారత భాగమందే ద్రుతము నకార వ్యంజన రూపముగా మాత్రమే ప్రయోగింపఁబడినది. (చూ. చిం–విష. పరి–౧–౨౫ విస. మొ. ౧౩౭ పిస. వ)

VI ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునందు వర్గయుక్కులు కాని స్థిరములు పరమగునపు డును ద్రుతమునకు బిందువు విధించున దొక్క చింతామణి మాత్రమె.

ఒక్క నన్నయ భారత భాగమందు మాత్రమె మకార పరకత్వమున ద్రుతమునకుఁ బూర్ణబిందువు వచ్చు ప్రయోగములు గలవు. ఉదా: లయగ్రాహి, కమ్మని లతాంతములకుం మొనసి' (ఆది. ౫ ఆ. ౧౩౯ ప) (చూ. 'వ్యా–సం.' ౯౧ I విష) (చూ. 'వ్యా. సం.' ౯౨ I విష)

VII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతపూర్వస్వర పరరూపసంధి నన్నయాథర్వణ పక్షమునందు మాత్రమె కుదురుపడును. ఇతరుల పక్షమున 'నాకున్ + అనియె' అను నుదా హృతికే వీలుఁ లేదు.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున నకార వ్యంజనము మాత్రమె ద్రుతముగా ప్రయోగించు నన్నయభారత భాగమున మాత్రమె యట్టి పరరూపసంధి సందర్భపడును. ఇతరుల పక్షమున స్వరపరకత్వమున ద్రుతలోప మెట్లు?

VIII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున సమహ ద్విషయమున "యొక్క" కుఁ బర్యాయ ములుగా 'ది–వి' ప్రత్యయములను విధించునది యొక్క నన్నయాథర్వణీయమె.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున నమహద్విషయమున 'యొక్క'కు బర్యాయముగా, 'ది–వి' ప్రత్యయములను బ్రయోగించినది నన్నయభారత భాగము మాత్రమె (చూ. 'వ్యా–సం.' ౨౫౧ I విష)

IX "అను – కొను" మున్నగు 'ను' వర్ణాంతధాతువులు 'ట' ప్రత్యయాంతము లగు నపుడు 'ను' వర్ణమునకు బిందురూప వికారము సంభవింపరాదని సూత్రించున దొక్క నన్న యాథర్వణీయమె. "టవర్ణకః క్రియాన్తే స్యాద్భావార్థే సాసమాసయోః। పూర్వస్య న వికారో నోః।...(వికృతి వివేకము. క్రియా–౧౯ శ్లో) (వ్యా.సం. ౩౧౯ విష. ౧౮–౨౯ పుట) (వికృతి వివేకటీకాకర్త దీని నుదాహరించుట మఱచెను. (చూడు. అహో ౮౯౯ పుట) (అంట మున్నగు బిందు ఘటితరూపము నన్నయ భారత భాగమున నొక్కటేనియు లేదు. తిక్కన యట్టి రూపములను ధారాళముగఁ బ్రయోగించెను. ఉ: పాండు నృపాలు పాలు గై కొంటయ చాలు ... రా। కుంట ... (ఉద్యో–౩ఆ౫౯) (వ్యా–సం౧౮౩–౨పుట) మూల ఘటిత కేతన యట్టి సున్నను సూత్రించెను. క. తినుటకుఁ దింట యగున్ మఱిఁ । గొనుటకుఁ గొంట యగుఁ గనుటకుం గంట యగున్। వినుటకు వింట యగుం–దా। ననుటకు నంట యగు వలసినప్పుడు కృతులన్ (ఆంధ్ర భాషా భూ. ౧౫౯ ప).

ఈసందర్భమునుబట్టి యథర్వణ కారికావళి తిక్కన కేతనలకు ముందటిదని తోఁచక మానదుగదా. దానికి మూలగ్రంథమగు చింతామణి నన్నయ రచిత మను పండిత జనశ్రుతి రూఢమూల మగుచున్నదిగదా.

X ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునఁ బదాది యకార మాచ్ఛిక శబ్దములందు గలదనియు, సంధివేళల లోపించుననియుఁ జెప్పిన దొక్క నన్నయాథర్వణీయమె. తక్కిన గ్రంథములెల్ల నట్టి పదాది యకారోచ్చారణము వ్యావహారికమనియు సద్దానిమీఁది యచ్చే యావయవిక మనియు వచించుచున్నవి. ప్రాచీనమగు, తమిళభాషలోఁ బదాది యకార మావయవికము గలదు. ఉదా: (తమి) యానై = (తె) యేనుఁగు (తమి) యాఱు = (తె) యేఱు. = (తమి) యారు =(తె) యెవరు - మొ.

ఈవిషయమును బరిశీలించునపు డాంధ్రశబ్ద చింతామణి యత్యంత ప్రాచీనమనియు దాని నర్వాచీన మనుట పరమసాహసమనియు నెవ్వరికేనిఁ దోఁచకపోదుగదా. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ భారత భాగముల కిట్టి యాంతరంగిక సంబంధములు పెక్కు స్థలములందు గలవు. విస్తరభీతిని వానినెల్లఁ జూపలేదు. ఈ సందర్భమునుబట్టి భారతాంధ్రీకర్తృ నన్నయాథర్వణులే యాంధ్ర శబ్ద చింతామణి వికృతి వివేక కారికల రచయితలని యెవ్వరికేని తోఁచకపోదుగదా.

ప్రతిపక్షుల నిస్సారములగు నితరాక్షేపణములకు నేనిందు సమాధానముల నియ్యఁ దలంపలేదు. దిఙ్మాత్రముగా నట్టివాని నొకటి రెండు చూపి విడుచుచున్నాను.

'వస్తున్నాడు, పోతున్నాడు' అను రీతిగల వ్యావహారికపదము, లసాధువులనియు 'వచ్చుచున్నాఁడు పోవుచున్నాఁడు' మున్నగు గ్రాంథిక శబ్దములు సాధువులనియు ననుశాసించుట నన్నయాథర్వణుల ప్రణాళియే కాదు. గ్రాంథిక భాషలోని శబ్దములను నిరూపించుటయే వారిపద్ధతి. అట్లే "యితడు-యీతడు" మున్నగు వ్యావహారిక శబ్దముల యాది యకారము విషయమును వారు స్మరింపనేలేదు.

"అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అను సూత్రము చొప్పునఁ (పై-పా- ౫౦౩ విష. ౫౨౬ పుట) (వ్యా. సం. ౫౩ విష. ౧౨౧ పుట) గొన్నిటఁ బదాది యకారము శబ్దావయవసిద్ధమె యని విశదీకరించుచున్న నన్నయకును నాతని గ్రంథమును వివరించుచున్న యథర్వణునకును నట్టి పదాది యకారములు హల్లులు కావనుట సమ్మతమని "ఆద్య+వర్ణాస్తు హ త్వేన। న గృహ్యన్తే కదాచన" అని యెవ్వరేని వ్యాఖ్య చేయుదురా? పరమ సాహసికులగు గోపాలకృష్ణయ్యగారు తప్ప. "ఆది+అవర్ణాస్తు హత్వేన న గృహ్యన్తే కదాచన" (చూ. పై. పా. ౫౧౨ విష. ౫౩౪ పుట మొ.|'వ్యా. సం' ౫౩విష. ౧౨౧ పుట మొ.) అని ఛేదముచేసి వ్యాఖ్యచేయుట యుక్తము కాదా. "ప్రాణా త్ప్రాణో లఘుర్య స్స్యాత్స హల్వాచ్చ క్వచిద్భవేత్" (పై. పా. ౫౧౨ విష. ౫౩౪ పుట) అని చెప్పిన యథర్వణుఁడు సంహితా 'అ' కారముతోఁ గూడిన పదాది యకారము (హరియతడు) హల్లుకాదని చెప్పెనని వాఖ్య చేయుట సమంజసముకదా! అట్టియెడ "శ్రీవర్యులవారు అనరదాయకమైన విపరీతార్థంచేసి "అది+అవర్ణాస్తు" అని వ్యర్థమైన అర్థాన్ని చెప్పడం సమంజసం కాదు"

(ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష ౧౫ పుట) అని నిరసనబుద్ధిచేఁగదా వ్రాయవలసెను.

"గ్రాంధిక వాదులైన శ్రీ వఝ్ఝులవారు అసలు వ్యావహారిక వాదాన్నే కాదని త్రోసి పుచ్చుతున్నప్పుడు నావ్యాకరణం బయటకు వస్తే వ్యావహారికానికి కూడా ఒక వ్యాకరణమా? అని అవహేళనముచేసి త్రోసిపుచ్చడం కష్టంకాదు" అని 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష' అనుదాని నానుడిలో శ్రీగోపాలకృష్ణయ్యగారు వ్రాసిరి. వ్యావహారిక భాషతో గ్రంథములను వ్రాయరాదని నేను వాదించువాఁడనుగాను. 'వస్తాడు పోతాడు' మొదలగు వ్యావహారికశబ్దములు ప్రాచీనమహాకావ్యములలోఁ గలవనుట సత్యవిదూరమనిమాత్రమె నాయభిప్రాయము. ఏవో కొన్ని యుత్తరాంధ్ర గ్రంథములలో నలంతి వ్యావహారిక రూపములు లేఖకాది ప్రమాదములవల్లను, నట్టియుత్తరాంధ్ర సామాన్యకవుల సమ్మతివల్లను బ్రయుక్తములయినం గావచ్చును. ఆయాగ్రంథములను సరిగాఁ బరిశీలించినంగాని యట్టివాని యథార్థము విశదముకాదు. అయినను వ్యావహారిక శబ్దాల ప్రయోగ ముత్తరాంధ్ర సామాన్యకవుల గ్రంథాలలో "కళాప్రపూర్ణ శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు" చూపియే యున్నారు. ఆప్రయోగములనే మఱికొంత నిస్సారగ్రంథమును జేర్చి చూపుటలో వీరి యభిప్రాయమేమో తెలియరాకున్నది.

ఇంతకును నేను వ్యావహారికభాషలో సైతము గ్రంథములు వ్రాయవచ్చునని యీ వైయాకరణ పారిజాతము ౨౭ విషయమున స్పష్టముగా వ్రాసియే యున్నాను. వీరిట్టి యసత్యపు వ్రాఁతలను వ్రాసి చేయు ఘనకార్యమేమో తెలియకున్నది. ఈరీతి నన్యాయముగాఁ గేవల నిరసన బుద్ధితో వ్రాసెడి వీరి వ్రాఁతలను విమర్శించుట యనావశ్యకము.

నన్నయభట్టారకుఁడు 'ర ఱ' ల యతిప్రాసమైత్రిని బ్రయోగింపఁలేదను సిద్ధాంతము చేతనేకదా "ఎఱుకని యెఱుఁగక, నీకున్ । మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం । గఱకంఠా (టా) క్షమియింపుము..." (భార-ఆర ౧ ఆ. ౩౨౬ ప) అను నన్నయ పద్యములో 'కఱ' అను దేశ్యశబ్దమె ప్రయుక్త మయ్యె నన వలసెను. లేనిచో నట 'గర' శబ్దమునే నిల్పనగును గదా. అట్లె నన్నయ తద్భవములలో 'ఱ' కారమును బ్రయోగింపలేదను సిద్ధాంతము చేతనేకదా ప్రౌఢవ్యాకర్త సూత్రించినట్లుగ (ప్రౌఢ – సంజ్ఞా – ౯ సూ.) నట్టి పద్యమున "గరకంఠ శబ్దభవమగు 'కఱకంఠ' శబ్దము నంగీకరింపలేదు. నన్నయ ప్రయోగములం దెచ్చటను 'ర ఱ' మైత్రియుఁ దద్భవశకటమును లేవనియేకదా యట్లంగీకరింపవలసెను. అట్లె 'కఱకంఠ' శబ్దగత 'ఠ' కారము ప్రాసగతముగ నెచ్చటను ప్రయుక్తము కాలేదు గాన నన్నయ 'కఱకంటా' అను శబ్దమును బ్రయోగించె నన దగును. ఇట్టి వ్రాఁత మిక్కిలి యసంభావ్య మనుచు నేమేమో నిస్సారపు యుక్తులను శ్రీ గోపాలకృష్ణయ్యగారు విస్తరించి వ్రాసిరి. (ఆం-భూ-పీఠిక-౧౦౩-౧౦౪ పుటలు) తాటాకుల పుస్తకములు తప్పుల తిప్పలగుటచేతను, నట్టివి సంస్కరించిన వారును సామాన్యులగుటచేతను వానిని సంస్కరించుట యొక యకార్య కరణము కానేరదు. తాటాకుల పుస్తకములలోని వ్రాఁతలను యథాస్థితముగాఁ గవి ప్రయుక్తములని యెవ్వరును విశ్వసింపఁజాలరుగదా. కావున ముద్రణములలో 'కఱకంఠా' అని యుండుట యొక ప్రమాణము కానేరదు. నన్నయవంటి మహానుభావుఁడు ప్రయోగించినది గ్రామ్య మెట్లగును? దాని కనింద్యగ్రామ్యతా కల్పనము వివేక

హీనతచేఁగదా కల్పింపవలయును. కావున నన్నయభట్టారకుఁడు "కఱకంఠా" అని సాధు శబ్దమునె ప్రయోగించె ననుట కేవలము సమంజస మనుటలో విప్రతిపత్తి లేదు. (చూ–వ్యా–సం–౧౨౪–౧౨౫ పుటలు)

క. వాఁడి మయూఖము లనఁగా ।
వేఁడి పయోధరలనఁగ వింజామరనా
మూఁడస్త్రంబు లనంగాఁ
బోఁడిమి కఱకంఠ నామముం బోలి తగున్ (ఆం–భూ–౧౩౪ ప.)

అను పద్యమున 'వాఁడి మయూఖములు' మున్నగునవి 'కఱకంఠ' నామముం బోలి సాధువులగు నని కేతన చెప్పుచుండఁగా 'వాఁడి మయూఖములు' మున్నగునవి కర్మధారయము లనియు 'కఱకంఠ' నామము బహువ్రీహి యనియు శ్రీగోపాల కృష్ణయ్యగా రెట్లు వ్రాయ సాహసించిరో తెలియకున్నది.

"తా వృథా రమేశ సమా" (ఆం. భూ. పీఠిక. 64 పుట) అనుచోటి శ్రీ గోపాలకృష్ణ గారి యపవ్యాఖ్యకు "సమాధానము లభింపమింజేసి కాఁబోలు మిన్నకుండిరి." (ఆం. భూ. పీఠి ౬౨ పుట) అని వ్రాయుట యర్థ్వమా? ఇచటి సామ్యమునుబట్టి మాత్రము వలసినంత యర్థము వచ్చునఁట. ఇచటి సామ్యమునుబట్టి 'విధాతుఁడు' అనియు రూపసిద్ధి కల్గునని వీ రంగీకరింతురు కాఁబోలును!

కొన్ని వీరిజాబు లమాయికములనుకొని జబాబు లిచ్చితిని. పేరన్నగారి విద్యాభ్యాస మునవలె నంతకంతకుఁ బ్రశ్నములు హెచ్చినవి. నాకంత తీఱిక లేదని వ్రాసివ్రాసి విసిఁగి జబాబు లీయక మిన్నకున్న మాట నిజమె.

కోడుగంటివారివీథి,
విజయనగరము
24—2—1956

ఇట్లు సుజనవిధేయుఁడు,

వఝల చిన సీతారామస్వామి శాస్త్రి.

# విషయసూచిక.

## I గ్రంథాదిసందర్భము.



విషయ సంఖ్య.

విషయ సంఖ్య.



## II తద్భవప్రకరణము.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.



## అక్షరప్రకరణము.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.



## IV. అనుస్వార ప్రకరణము.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

౩౧౮. వర్గాక్షర పరకద్రుతము కాలక్రమమున ననుస్వార మగుచున్నది. అట్టి యనుస్వార మర్ధమాత్రిక నకారజన్యమె యైనను హ్రస్వపూర్వకత్వమున మాత్రిక మగుచున్నది.

౩౧౯. అర్ధబిందు పరిణతి విశేషములు, బిందువు తేలుటలోని యుపపత్తులు, నుడి తొలియచ్చుమీఁది పూర్ణము తేలకుండుట కుపపత్తులు.

౩౨౦. అవసానగత నమలు కొన్నియెడల లోపించునపు డవ్వియును బిందుపరిణతి ద్వారముననే లోపించుచున్న వనఁదగియున్నను, నాంధ్రు లట్టి బిందు పరిణామమును సూత్రింపలేదు. ప్రాకృతకర్ణాటములలో నట్టి బిందుపరిణతి మిక్కిలి విశాలముగ నున్నది.

౩౨౧. సమాన పదమధ్యగ తానునాసికములు బిందువులై తేలుచుఁ గాలక్రమమున లోపించును. అట్టి యనునాసికములు ద్రావిడ భాషలలో నొకొక్కదానియందు, నొకొక్క యవస్థలో నుండుటయుఁ గలదు. అట్టి శబ్దములపట్టిక

## V. అంతస్థ ప్రకరణము.

౩౨౨. లఘువోఽలఘువ ఇత్యాది సూత్రవ్యాఖ్య.

౩౨౩. యవల లఘ్వలఘుతలను జూపుటకు బాలసరస్వ త్యప్పకవులు "హలి సర్వేషా" మ్మను పాణినీయసూత్రమును జూపుట సరికాదు. అహోబలపతిచూపిన " వ్యో ర్లఘు ప్రయత్నే" త్యాది సూత్రమె సరియై యున్నది. అలఘుశబ్దము నకుఁ బర్యాయముగ నీవిషయమున గురుశబ్దమును వాడఁబడుచున్నది.

౩౨౪. లకారద్వైవిధ్యము ప్రాకృతవ్యాకరణ ప్రసిద్ధము. అంతస్థములు నాల్గిటికిని లఘ్వలఘుభేద మాంధ్రమునఁ గలదని చింతామణి చెప్పుచున్నది.

౩౨౫. స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వచ్చు యకారము లఘువని సంస్కృత ప్రాకృత వ్యాకరణానుసారముగఁ జింతామణియుఁ జెప్పుచున్నది.

౩౨౬. లఘు వకార మిట్టి దని చింతామణి చెప్పలేదు. బాలసరస్వత్యాదులు ప్రథమమీఁది పకారమున కాదేశమగు వకారము లఘువని వ్యాఖ్య చేసిరి. అది సరికాదు. యకార తుల్యన్యాయమున సంహితలో నాగమముగా వచ్చు వకారమె లఘువనుట యుక్తము. అట్టిది తెల్గున మిక్కిలి యరుదు. ఈ సందర్భమున నప్పకవీయములోని సందర్భ మసంగతముగ నున్నదని తత్పటీకా కర్తలు చెప్పుట సరికాదు.

౩౨౭. ర ఱ ల, ళ లఘ్వలఘుతలు యవల వంటివి కావు

౩౨౮. అట్లయినను లఘ్వలఘు యవలకువలెనె ద్వివిధ లకారములకును యతిప్రాస మైత్రిని సంస్కృత పండిత మతానురోధమునఁ జింతామణి యంగీకరించుచున్నది.

విషయ సంఖ్య.

విషయసూచిక.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.



## VI దంత్య తాలవ్య చజ ప్రకరణము.

విషయ సంఖ్య.

తత్సమములందు దంత్యత నంగీకరింపరాదు. శ్లేషసందర్భమున దంత్య తాలవ్యచజల మైత్రి విరుద్ధము కాదు.

౫—౨౫. ప్రాకృతే తత్భవేచాపీత్యాది కారికలోని ప్రాకృతశబ్ద మాంధ్రదేశ్యపరము. దానికి మహారాష్ట్ర్యాది ప్రాకృతపరముగా నహోబలపణ్డితులు చేసిన వ్యాఖ్యలు సరి కావు. అధోక్షజ వచనార్థ విమర్శనము.

౫—౨౬. ప్రాకృతమునందలి చజలకు దంత్యోచ్చారణము గలదనుటకుఁ బ్రమాణము లేదు. మరాఠీలో నిట్టి దంత్య చజలు గలవను కాల్డువెల్లు దొరగారి వ్యాఖ్యల తెల్గువివరణము. మాగధిలోని చవర్గ స్పష్టోచ్చారణము వేఱువిధము.

౫—౨౭. ఇట్టి దంత్యతారూప సరళోచ్చారణ మితర ద్రావిడ భాషలందును గలదు. అట్లు లేదను కాల్డువెల్లుగారి యభిప్రాయము సరి కాదు.

శ్రీ ర స్తు.

# నన్నయాధర్వణీయము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

### I గ్రంథాది సందర్భము.

ఆం-చిం॥ విశ్వశ్రేయః కావ్యమ్

---

# వైయాకరణ పారిజాతము.

### I గ్రంథాది సందర్భము.

---

(౧ వి.) శ్లో॥ సుధియా పరిపూత మానసౌ
కలయేఽహం జగతః ప్రియంకరౌ।
పితరౌ మమ వేఙ్కటామ్బికా।
ముఖలిఙ్గేశ్వర జమ్పతీ హృది॥

శ్లో॥ పితామహ భ్రాతృసుతం*స్వవిద్యా।
గురుం చ చిన్తామణి సత్సమాఖ్యమ్।
శ్రీవత్స గోత్రోద్ధరణ ప్రశస్తిం।
నమామి నారాయణ సత్కవీన్ద్రిమ్॥

శ్లో॥ శబ్దశాసన నన్నార్య।
మాన్ధ్రికావ్య కృతాం గురుమ్।
వన్దే కవిత్రయగురు।
మాన్ధ్రి వ్యాకృతి కృద్గురుమ్॥

---

* 'భ్రాతృజాయా' యను మేఘసందేశప్రయోగముచేత భ్రాతృసుతశబ్దసమాసము సప్రమాణ మగుచున్నది.

మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీపరమేశ్వరపరముగాను నర్థద్వయ మెన్నసగును. రెండవశ్లోకమున గురువులగు నారాయణపండితుల పక్షముగాను విష్ణుపక్షము గాను నర్థద్వయ మెన్నసగును. రెండిటను నుపమాధ్వనిని బరిశీలింపసగును.

శ్లో॥ తచ్చిన్తామణి శిష్టార్థం।
వ్యాచకారాన్ధ్రి లక్షణమ్।
యో౽స్మై ద్వితీయాచార్యాయ।
నమో౽థర్వణ సూరయే॥

శ్లో॥ నన్నయాథర్వణీయానాం।
సూత్రాణాం మార్గదర్శకౌ।
ప్రస్తౌమి తౌ బాలసర।
స్వత్యహో *బలపణ్డితౌ॥

(౨. వి.) శ్రీమచ్చళుక్య సామ్రాజ్య ధురంధరుండగు, రాజనరేంద్రుని యాస్థాన పండితుండును, శబ్దానుశాసనుండును నగు నన్నయభట్టారకుండు తద్రాజనరేంద్రప్రేరణమునఁ బంచమవేదమనంబరగు వ్యాసమహర్షి ప్రణీత సంస్కృత మహాభారతసంహిత నాంధ్రీకరింపఁబూని యావఱ కాంధ్రభాష మహాకావ్యరచనోపయోగిభాషగా నేర్పడియుండమిం జేసియు, విశేషించి వివిధభావవిశాలంబగు మహాభారతసంహిత నాంధ్రీకరించుటకుఁ దగిన వైశాల్య మద్దానికి లేమింజేసియు, నావఱకుఁగల యాంధ్ర దేశీయ పండిత వ్యవహారస్థ సంప్రదాయముచొప్పున నత్యంతవిస్తృత సంస్కృతభాషాశబ్దములకెల్లఁ దెలుఁగువిభక్తుల మేళగించుటచే నేర్పడునట్టి సంస్కృతపదముల సాహాయ్యమున నాంధ్రభాషకు మహావైశాల్యమును గల్పింపనెంచి తాదృశ సంస్కృత సమశబ్ద సాధన ప్రక్రియోపదేశము ప్రధానముగను, దక్కిన యుత్పత్స్యమా నాంధ్ర మహాకావ్యప్రయోగ వేద్యాచ్ఛాంధ్ర (తత్కాలోపదేశ యోగ్యవిషయము లల్పము లగుటంజేసి) భాషాస్వరూపనిరూపణ మప్రధానముగను, సూత్రింపనెంచి యీ యాంధ్రశబ్ద చింతామణిని రచించి శబ్దానుశాసనుఁడై యాంధ్ర మహాభారతము నాంధ్రీకరింపఁ దొడంగినవాఁ డయ్యెనని భారతాదిమ గ్రంథ విమర్శనమువలన విశదమగుచున్నది.

పయివిషయములెల్ల నారచించిన చింతామణివిషయ పరిశోధన గ్రంథమున విపులముగఁ జర్చింపఁ బడియుండుటచే నిటమరల విస్తరించి వ్రాయనయితిని. (చింతా 1-65 విష.)

(3. వి.) నన్నయభట్టారకునినాఁటి కొకటిరెండువందల సంవత్సరములకు ముందటినుండియుఁ దరువోజాక్కఱాద్యాంధ్ర జాతిపద్యముల రచనము

* ('అహోబిల' మనియే పురాణపరిశీలనమువలనఁ దోఁచెడిని. అట్లయినను గవిశిరోభూషణ మాతృకలందెల్ల "అహోబల" శబ్దమే యగపడుచున్నది. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వాదులలో నహోబలశబ్ద మంగీకరింపఁబడి యున్నది. ఇది సజ్ఞావాచకము. అహోబలకు 'ఓబల' అను వైకృతమును గవిప్రయుక్తము.)

వెలయ నారంభించెననియు, నప్పటికే సంస్కృతశబ్దములకుఁ దెనుఁగు విభక్తులనుజేర్చిన సంస్కృత సమపదముల నుపయోగించుకొనెడి యాచారము వెలసియుండెననియు, సరళాదేశ ద్రుతాగమ యడాగమాది సంధికార్యములు మున్నగునవి యప్పటి పద్యములలోనే వెలయ నారంభించెననియు, నావలికె సంస్కృతశ్లోకముల ననుసరించిన పద్యముల రచనము కన్నడమున వెలసియుండెననియు నట్టిసమయమున నిరర్గళ సంస్కృత కవితాధారగల నన్నయ భట్టు తెనుఁగుపద్యములను రచించుట యసంభావ్యము కాదనియు, నట్టి యావఱకున్న సంప్రదాయముల ననుసరించి నన్నయ భట్టారకుఁడు చింతామణి రచనముచేతను నాంధ్రభారత రచనముచేతను నాంధ్రభాష కుత్తమ వాఙ్మయవత్త్వావస్థను సంఘటించి వాగనుశాసనుఁడును నాంధ్రకవితా గురుండును నయ్యెననియు, నెఱుంగనగును.

క॥ వెలయంగఁ దెలుఁగు బాసకు।
దళమయ్యెను సీసములును దరువోజలు గీ।
తులు నక్కఱలును ద్విపదలు।
పొలుపొందఁగ రేచఁడిష్టమున నొనరించున్॥
(కవిజనాశ్రయము. జాత్యధికారము ౧౦ ప.)

(క్రీస్తు. శ. ౭౪౮ A. D.)

పండరంగుని అద్దంకి శాసనము. శ. స. ౭౭౦ ప్రాంతము.

తరువోజ. పట్టంబుగట్టిన ప్రథమంబు నేణ్డు,
బలగర్వ్వ౦ బొప్పంగ బైలేచి సేన।
పట్టంబుగటి (ట్టి?) ఇచ్చ్రప్రభుబణ్డరంగు,
బఞ్చినసమత్త (సామంత) పడువతో బోయ।
కొట్టంబుల్వ ణ్డైణ్డుగొణి (ని) వేంగినాణ్డిం,
గొళల్చి (గొళచి?) యాత్రి భువనాంకుశబణ (బున?) నిల్పి।
కట్టెపు దుర్గంబు గడు బయల్సేసి,
కండు (దు) కూర్చెజవాడగా విఞ్చు మెచ్చి॥"

**(మ॥ రా॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారి శాసన పద్యమంజరి.)**

ఈ శాసనము నన్నయభట్టారకునకు రమారమి రెండువందల యేండ్ల క్రిందటిది.

"యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము."

శ. స. ౮౨౦ ప్రాంతము.

(క్రీ. శ. A. D. 898.)

మధ్యాక్కరము :– స్వస్తి నృపాంకుశాత్యన్త వత్సల సత్యత్రిణేత్ర,
విస్తర శ్రీయుద్ధమల్లుణ్డనవద్యవిఖ్యాతకీర్తిఁ ।
ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజ సల్కి-భూవల్లభుణ్డార్తిఁన్. ॥
పరగగ బెజవాడ గొమరస్వామికి భక్తుణ్డై గుడియు
నిరుపమమతి నృపధాము డ్డైత్తిచ్చె నెగిదీర్చె మఠంబు,
గొరగల్గా కొరులిన్దు విడిసి బృన్దంబు గొనియుణ్డునారు
... ... ...రిగాక యబ్బారణాసి వచ్చిన పాపబు గొణ్డు,
వెలయంగ నియ్యెట్టు ఒస్సిమలిన్నరై విడిసినబ్రోల,
గలతాన పతులును రాజు పట్ట బుగట్టిన పతియు,
నలియంబయ్యారల వెల్వాటించిన నశ్వమేధంబు,
ఫలబుపేక్షించిన లింగబటెసిన పాపంబు దమకు,
జననుత చేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకువచ్చి
త్రిణయను సుతుణ్డొణ్డు సోటుమెచ్చక తివిటె యిన్నెలప
యనఘుణ్డు సేకొని యున్దు ప్రత్యక్షబయ(యు?)న్న నిచ్చ,
గనిమల్లణ్డెత్తించె గుడియు మఠంబును గాత్రిఁకేయునకు,
(దీని జేబ్రోలు యేలెడు (వా) రతిరబేలు (వా)రొణ్డు సోటిగొరగ,
లునుబెట్టు వేరుగనుజ(ను) య్యాస్తితి సేకొణి కాచు(వా)ర దీని,
న్దారునిల్పినవారు (స్థి)తిడప్పి యటెపుట వా(పం)బు గాన
రమనతో బెజవాడకెల్ల బెడంగును రక్షయుంగాను
న్దమతాత మల్లపరాజు వేరెఱు దానుం గట్టించెం,
గ్రమంబునం దానికి కలశబిడ్డట్టుగా మొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లు డ్డెత్తించె నమిత తేజుణ్డు,
తనధర్మ్మఁ వాడబడి కాచునృపతులకున్ద.

(శాసన పద్యమంజరి. అసంపూర్తి 2 శాసనము.)

పయి శాసనములభాష నన్నయ భారతభాషకుఁ జాల సన్నిహిత
ముగనే యున్నదిగదా! (౨౭౦ విష. చూ.)

(ర. వి.) కొందఱు విమర్శకులు నన్నయ భట్టారకుని కాలమునాఁటికిఁ దెలుఁగున, మలయాళమునందుఁ బ్రసిద్ధమైయున్న మణిప్రవాళరీతిగల కవిత యుండెడిదనియు, నన్నయభారతాంధ్రీకరణము నట్టిరీతితోనే నడుపవలయు నని రాజనరేంద్రుని సభలో ఘోరయుద్ధములు జరిగెననియు నపుడు నన్నయ భట్టు కర్ణాట భాషాపండితుఁడగు నారాయణభట్టు సాహాయ్యము నందెనని యీక్రింది భారతపద్యము సూచించు చున్నదనియుఁ జెప్పుచున్నారు.

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా ।
రాయణునట్లు వానస ధరామరవంశ విభూషణుండు నా ।
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడున్ దనకిష్టుఁడున్ సహా ।
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్ ॥

(భార - ఆది - ౧ ఆ. ౨౫.)

మఱియు నిట్లు నారాయణభట్టు సాహాయ్యమునంది నన్నయభట్టు కర్ణాటభాషాకవితారీతిని జూపియుఁ గర్ణాటభాషలో నట్టి మణిప్రవాళరీతి యప్పటికి నూటయేఁబదియేండ్ల క్రిందటనే నిరాకరింపఁ బడినదని నచ్చఁ జెప్పియు భారత రచనారీతిని స్థాపించెనని చెప్పుచుఁ దెనుఁగులో నట్టిమణి ప్రవాళరీతి ప్రాచీనకాలమున గలదనుటకుఁ బాల్కురికి సోమనారాధ్యుని వృషాధిపశతకములోని యీ క్రిందిపద్యమును నిదర్శనముగఁ జూపుచున్నారు.

చ॥ అనయముఁ జేతులందు భవదఙ్ఘ్రి సరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యనుమాటల నిన్ వరివస్కరోమ్యహ
మ్మనుచు మణిప్రవాళమున నంకనసేయుదు భక్తలోక హృ
ద్వనజవిహారలోల బసవా! బసవా! బసవా! వృషాధిపా"॥

కాని యీ యూహమెంతమాత్రమును సరికాదు.

వృషాధిపశతకములోఁ బాల్కురికి సోమనారాధ్యుఁ డీ సందర్భమున నిశ్లోకాక తమిఱు సంస్కృత మేళనరీతిని, సంస్కృత కర్ణాట పదమేళరీతిని, కేవల సంస్కృత పదగుంఫిత రీతిని నింకను బహుభాషా పదగుంఫిత రీతిని ననుకారముచేసి ౫౦ పద్యము మొదలు ౬౪ పద్యమువఱకును బద్యరచనము చేసియున్నాఁడు. అట్టి రీతులెల్ల నాంధ్రమునఁ బ్రాచీనకాలమున నుండెడివని యెవ్వరును జెప్పఁజాలరు గదా ? (ఈ సందర్భములోని యీ పద్యములు దుర్గ్రహార్థకములై తప్పుల తిప్పలై ముద్రింపఁబడియున్నవి.) సోమన కన్నడ మలయాళాదులలోని యిట్టిరీతిని జమత్కరించి యుండును.

చ॥ "తిరువడినెమ్మనమ్మననునే హృదయేశ్వర కిం పరీయతాం
బరికరితంబు రాని నిను బాహిరిఁ బోలుట శాసితాహతా
వరదనెగిల్లె యంచు నినుఁ బ్రస్తుతిసేయుదుఁ బెక్కుభాషలన్
వరద వివేకశీల బసవా! బసవా! బసవా! వృషాధిపా!॥"

ఇంతయేల! నన్నయ భట్టారకుని నాఁటికి మహాకావ్యము లెవ్వియు లేకున్నను వెనుకవ్రాసిన రీతిగల కొన్ని శాసనపద్యములు వెలయుచున్నవి గదా! వానియం దెచ్చటను మచ్చునకైన మణిప్రవాళ రీతి యనఁగా సంస్కృతాంధ్ర విభక్త్యంత మేళితపదరచన గలదా? వానిరీతి చాలవఱకు నన్నయ భారత కవితరీతినే యున్నదిగదా!

పయి సందర్భమునుబట్టి యాంధ్రభాషలో నన్నయకాలము నాఁటికి మణిప్రవాళరీతి యుండెననుటయు నాతఁడు "ఘోరరణంబు" సల్పి యద్దాని నడఁగించెననుటయు నిరాధారము లగుటచే నెంతమాత్రమును విశ్వసనీయములు గానేరవు.

కాఁగా నన్నయభట్టు భారతము నాంధ్రీకరింపఁ బూనినవేళకుఁ దెలుఁగులోఁ గొంత సంస్కారము నందుట కర్హ్వమగునట్టియు భారత కవితారీతి కొంత గల్గినట్టియుఁ బద్యములే శాసనాదులలో నుండెడివనియు నట్టివాని లోని నియమములను నప్పటికిఁ బ్రాచీనులు, సమకాలికులును నగు పండితుల వ్యవహారములలోఁగల మఱికొన్ని నియమములను, ననుసరించి సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనెడి పద్ధతి నుపదేశించుటను బ్రధానముగాఁ జేసికొని నన్నయభట్టు చింతామణి రచనకుఁ గడంగెననియు నిశ్చయింపనగును. నేఁటి వ్యావహారికభాషను గ్రాంథికముగఁ జేయఁదలఁచు వారికిని నీపద్ధతి యావశ్యకమె యగుచున్నదిగదా! (బా. వి.) కాన నన్నయ భట్టు వ్యాకరణము మొదట రచించెననుట యసంభావ్యము కాదు.

(శి. వి.) నన్నయభట్టారకుఁడు పయిరీతి నాంధ్రశబ్దచింతామణిని రచింపఁబూని తద్గ్రంథాదిని శిష్టాచార ప్రాప్తమగు మంగళమును విశ్వేత్యాది ప్రకృత సూత్రముతో నాచరించియున్నాఁడు.

విశ్వేత్యాది:—కావ్యమ్ = ప్రబంధము.

విశ్వశ్రేయః = సకలశుభములును గలది.

"శ్రేయస్, న. అతిశయేన ప్రశస్యమ్, ఈయసుః, శ్రాదేశః, ధర్మే మోక్షే, శుభేచ. (శబ్దస్తోమమహానిధి.)"

శుభములనఁగానిట సకల పురుషార్థములును ననిభావము. అయ్యావి ప్రవృత్తి నివృత్త్యుపదేశక కావ్యాధీనములగుటచేత నద్దాని సేవనమువలన లభించునని తాత్పర్యము.

ఇందలి విశ్వశబ్దము ప్రపంచవాచకమగుటచేతఁగాని, సాకల్యమును బోధించునదగుటచేతఁగాని, శివదేవతా వాచకమగుటచేతఁగాని మాంగళ్య సూచకము కానోపును. మఱియు నామైకదేశగ్రహణన్యాయమున 'వి' శబ్దము విష్ణువాచకమగుటచేతఁగాని, యహోబల పండితుఁ డంగీకరించినట్లు గ్రంథాంత మంగళవాచకి "విశేష" శబ్దార్థకమె యగుటచేతఁగాని యద్దానిచే మంగళాచరణము నడుపఁబడెనని యెన్నఁదగును. లేదా సకలశుభములు గలదను నర్థముగల 'విశ్వశ్రేయ' శ్శబ్దముచేతనే గ్రంథాది మంగళాచరణము నడుపఁబడె ననఁదగును. ఇట్టిస్థితిలో నహోబలపతి, (చింతామణి) గ్రంథాంతమందు విశేషశబ్దముతోడను (వర్ణాగమో విశేషః) గ్రంథ మధ్యమున నచ్చటచ్చట నథశబ్దములతోడను మంగళ మాచరింపఁబడెననియు గ్రంథాదిని మంగళాచరణమునకు బదులుగా వర్ణగణాది (వర్ణగణాది శుద్ధియే యిందులేదు. చూ. ౭. విష.) శుద్ధియేకాక వస్తునిర్దేశము నయితము చేయఁబడెననియు నీక్రిందిరీతిని వ్రాయుటకుఁ గారణము తెలియకున్నది. "విశ్వశ్రేయః కావ్యమితి వస్తునిర్దేశోఽపి (వర్ణగణాదిశుద్ధియేకాక వస్తు నిర్దేశము నైతమునని యపి శబ్దార్థమచటి సందర్భమునుబట్టి విశదమగుచున్నది.) అత ఏవ దండి నోక్తమ్. "ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమితి. నచ మఙ్గళం కావ్యమాత్రసాధారణమ్...............భగవతా పతఞ్జలినా మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే ఇత్యాద్యుక్త్వా ...............అతఏవాచార్యేణాపిమధ్యే మఙ్గళార్థత్వేన తత్ర తత్ర అథశబ్దః ప్రయుక్తః. అన్తే మఙ్గళార్థత్వేన విశేషశబ్దః ప్రయుక్త ఇతిజ్ఞేయమ్" (అహో. ౨౧ పుట.)

(౬. వి.) ఇందు గ్రంథాదినున్న 'విశ్వ' శబ్దమునకుఁగాని, 'వి' శబ్దమునకుఁగాని, గ్రంథాంతమందలి 'విశేష' శబ్దమునకుఁగాని మంగళ వాచకత్వము కోశాదులలో నగపడదు. మఱియు నవియు, నథశబ్దములును, నాయాచోట్ల నర్థాంతరములందుఁ బ్రయుక్తములై యున్నవి. వానికెట్లు మంగళార్థకత్వము పొసఁగును? "వక్రతమావథాప్యనుస్వారౌ, ఏజథోవక్రః, అథ లోపల కికురొయికాన్యా, అథభూజ్యాదిః పరిణతిః, ఏకత్వేఽథ బహుత్వే

ముడుజా," అని యిట్లు చింతామణిలో వాడఁబడిన "అథ, అథో" అను శబ్దములు కొన్ని కోశములచొప్పున మంగళవాచకములయ్యు మంగళార్థమునఁ బ్రయుక్తములుగాక యానంతర్యాద్యర్థములందు వాడఁబడినవి. "ఏజథో వక్రః" అనుచోటమాత్రమే 'అథో' శబ్దమునకు "మధ్యేమఙ్గళార్థోవా" అని యహోబలపతి వ్యాఖ్య చేసియున్నాఁడు. పై కారణములచే నయ్యవి యెల్ల మంగళవాచకము లెట్లగును?" అని శంకింపవలదు. ఆశబ్దము లాయా స్థలములలో మంగళార్థమునఁ బ్రయుక్తములు గాకున్నను వానికి సహజముగానున్న మంగళార్థము వాని శ్రవణమాత్రమున స్ఫురించునని యభిజ్ఞులు తలంచుచున్నారు. ఈ సంప్రదాయమునుబట్టి వృద్ధి, విస్తృతి మున్నగువానిని దెల్పు శబ్దములు గ్రంథాదిని మంగళార్థకములుగా నెన్నఁబడుట విరుద్ధము కానేరదు.

మఱియు "మఙ్గళానన్తరారమ్భ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ" అని యిట్లమరకోశమున "అథో అథ" శబ్దములు రెండిటికిని మంగళవాచకత్వము చెప్పఁబడియున్నను బ్రామాణికులగు వాచస్పత్యాది కోశకారులు కొందఱు అవి సహజముగా మంగళవాచకములు కావనియుఁ, బయి నుదాహరించిన యితర విశేషాది శబ్దములవలెనే వాని శ్రవణముమాత్రమున మాంగళ్యము స్ఫురించుననియు వ్రాసియున్నారు. "అథ......అవ్య............మఙ్గళంతు నాస్యార్థః కింతు అర్థాన్తర ప్రయుక్తోఽప్యయం శ్రుత్యా మఙ్గళసాధనం భవతి.

శ్లో॥ ఓంకారశ్చాథశబ్దశ్చ।
ద్వావేతౌ బ్రహ్మణః పురా।
కణ్ఠం భిత్వా వినిర్యాతౌ।
తేన మాఙ్గళికా వుభౌ॥

ఇత్యుక్తేస్తస్య శ్రవణేన మఙ్గళసాధనత్వమ్. అతఏవ శారీరకభాష్యే - అర్థాన్తర ప్రయుక్తోఽప్యథశబ్దః శ్రుత్యా మఙ్గళ మారచయతీత్యుక్తమ్..............అథశబ్దానుశాసన మిత్యత్ర మఙ్గళార్థతయోపాదానమ్. అర్థస్తు అధికారఏవ.........." (వాచస్పత్యకోశము)

"ఓమ్, అథ." అను శబ్దములు బ్రహ్మదేవుని కంఠమును భేదించుకొని నిరుపప్లవముగ బయటికి వచ్చినవిగాన నవి మంగళస్ఫోరకములు కానోపునని వారి యభిప్రాయమై యుండును. టీకాకారు సముద్రప్రసాదికమును జేసిన

యగస్త్యాదుల స్మరణమున జీర్ణశక్తి గల్గునని మనవారు తలంచుచుండ లేదా?

" అగస్త్యం కుమ్భకర్ణంచ । శివంచ బడబానలమ్ ।
ఆహార పరిణామార్థం । స్మరామిచ వృకోదరమ్ ॥

ఇట్లే వైదికులు కుండలేష్టిచేసి యందుఁ గుండలములు ధరించువానికి నూతేండ్లాయువు గల్గునను నర్థముగల 'శతమానం భవతీ' త్యాదిమంత్ర మును నెల్లరకును నాశీర్వాదవిషయమున నుపయోగించుచుండ లేదా! మంత్ర వినియోగములలోఁ బెక్కు లిట్టివేకదా!

(౭) ఇఁకఁ జింతామణి గ్రంథాదిపద్యమున వర్ణగణాది శుద్ధి గలదా యనువిషయమును బరిశీలింపవలసి యున్నది. "విశ్వశ్రేయః కావ్యం, తద దోషౌ పరిష్కృతౌచ......" అను చింతామణ్యాదిమ శ్లోకమున నస్త్రగిరి రుద్రస్థానములలో "క, త, ప," లుండుటచేత వర్ణశుద్ధి లేదని చెప్పవలసియు న్నది. అట్లయినను వర్ణగణాదిశుద్ధి కావ్యాదినిమాత్రమే పాటింపఁదగుననియు వ్యాకరణాది శాస్త్రారంభములలో (మంగళాచరణముమాత్రము చాలును) దానిని బాటింప నక్కఱలేదనియు నన్నయభట్టారకుఁడు తలంచిన ట్లాతఁడిం దుఁజెప్పనున్న "శుభవర్ణాః శుభశబ్దా యేచ శుభగణా స్తఏవ కావ్యాదౌ! గ్రాహ్యాః పురాస్త్రరసగిరి రుద్రే ష్వకచట తపా నింద్యాః" అను కారికచే విశద పడుచుండుటం జేసి వర్ణగణాదిశుద్ధిని జింతామణిలో నాతఁడు పాటింపకుండు టయె స్వరసమైయున్న దనఁదగును. కొందఱీ సందర్భమునఁ జింతామణ్యాదిని మంగళవాచకశబ్ద ప్రయోగ ముండుటంజేసి యీ క్రిందివచనము చొప్పున వర్ణగణాదిశుద్ధి పాటింపఁబడకుండుటలో క్షతిలేదని తలంచెదరు.

శ్లో॥ దేవతావాచకా శ్శబ్దా ।
యేచ భద్రాదివాచకాః ।
తే సర్వే నైవ నిన్ద్యాః స్యు ।
ర్లిపితో గణతోఽపిచ ॥

పరిశీలింపఁగా వర్ణగణాది శుద్ధి యావశ్యకమయియున్న కావ్యాది విష యమునమాత్రమె యీ కారికను సమన్వయించుట యుక్తముగాని వర్ణ గణాదిశుద్ధియే పాటింప నక్కఱలేని శాస్త్రారంభవిషయమున దీనిని సమన్వ యించుట యుక్తముకాదు గదా! అట్లె తలంచియుండనిచో నన్నయభట్టార

కుఁడు వర్ణగణాది శుద్ధి యుండవలెనని చెప్పుటలో "కావ్యాదౌ" అను దళ
మును నిలిపియుండునా?

పయిరీతిని దలంపక యహోబలపతి చింతామణి గ్రంథాదిని మగణ
ప్రయోగము శుభదమని వ్రాయుట స్వారసికమైయుండలేదు. అట్టియస్వారసిక
పద్ధతిని బోవుటచేతనే యాతఁడచట శుభవర్ణా ఇత్యాదికారికయొక్క యుత్త
రార్థము బాధింపఁగా నద్దాని పూర్వార్థమును మాత్రమె యుదాహరించి
దాఁటిపో వలసినవాఁడయ్యెను.

"మగణస్యాత్యన్త శుభకరత్వా ద్గ్రన్థాదా వాచార్యేణ ప్రయోగః
కృతః తదుక్త మాచార్యైః - శుభవర్ణా శ్శుభశబ్దా శ్శుభప్రదాఇతి. ఆచా
ర్యేణాప్యుక్తమ్. శ్శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణాఇతి"

(అహో. ౧౫ పుట.)

ఇంతియకాక యీ సందర్భమున నహోబలపతి కృత్యాదివర్ణగణాది
శుద్ధిమత్త, చింతామణికిఁ గలదని నిరూపించుచు మిక్కిలి విపులముగ వ్రాసి
తుదికి "అల్పజీవితత్వ" మ్మను ఫల మొకదానివల్ల లభించుచున్నదనియు నట్లై
నను గుణబాహుళ్యమున నీ దోషము నిర్మూలితమగుననియు నీక్రిందిరీతిని
నవిమర్శితముగ వ్రాసియున్నాఁడు. "యద్య ప్యుడుకూటవిచారే ప్రథమగణ
తారాయా ఆరభ్య ద్వితీయగణ తారాపర్యన్తం గణనా కర్తవ్యా. తత్రో
భయో ర్జ్యేష్ఠానక్షత్రకత్వేన సంఖ్యాయాః ప్రథమత్వేన త్రయోదశ సఙ్ఖ్యా
ప్రాప్త్వ ర్తిత్వేన ఫల మల్పజీవితత్వమ్. తథాపి.

"దోషమాత్రం నిరాకర్తుం
బ్రహ్మణోఽపి నశక్యతే।
బలవత్త్వం దుర్బలత్వం।
విచార్యం గుణదోషయోః।
"ఏకోహి దోషో గుణసన్నిపాతే, నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః॥"

ఇతిన్యాయేన బలవదష్టవిధకూటగణై రేకకూటదోషః స్వల్పః పరిహృత
ఏవేతి" (అహో. ౨౦ పుట.)

ఇట్టి సమాధానముల యసంతృప్తి యటుండఁగాఁ జింతామణి కర్తకు
వచ్చు స్వవచనవ్యాఘాతదోషమునకును సంతృప్తికరమగు సమాధానము
లేదుగదా? కాఁగా నాతఁడు వర్ణగణాదిశుద్ధి కావ్యాదినిమాత్రమె చూడ
వలెనని తలంచినట్లు గ్రహించుటయే యుక్తము. ఇట్లు గ్రంథకర్తృవివక్షిత

మగుటచేతనే యహో’బలపతి వివరించిన వర్ణగణాదిశుద్ధి సందర్భము నిటఁ బ్రదర్శించి విమర్శింపలేదు.

(ర.) బాలసరస్వతీయమునందును నప్పకవీయమునందును గావ్యరచనము ధర్మకార్యములలో నెల్ల నుత్కృష్టమయినదని యీ క్రిందిరీతిని దీని కర్థము వ్రాయఁబడెను.

“విశ్వ శ్రేయః = సర్వధర్మములలోను శ్రేష్ఠము. (బాలసర.)

క॥ ధర్మములలోన నుత్తమ।
ధర్మము కావ్యము నిజంబు ధర నెవ్వని కా।
ధర్మము చేకుఱు నతఁడు సు।
ధర్మను వసియించుఁ బెక్కు దైవతయుగముల్ ॥ (అప్పక-౧ ఆ-౧౪ ప)

ఇట్టి యర్థము కావ్యరచయితలకు రచనాభిరుచిని మాత్రమే కల్గించును గాని లోకమునకుఁ దత్సేవాభిరుచిని గల్గింపఁజాలదుగదా! ఇట్లు కావ్యము కవీంద్ర శ్రేయస్సాధనమని చెప్పుటకన్న నాంధ్రభాషా సేవకులకెల్ల శ్రేయస్సాధనమనుట మిక్కిలి స్వరసమై యుండునుగదా!

‘కావ్యమ్ = కావ్యము, విశ్వ = ప్రపంచమునకు, శ్రేయః = శ్రేయస్కరము’ అని యిట్లహో’బలపండితీయ నిర్గళితార్థము బాలసరస్వతీయ మను పేరితో ముద్రింపఁబడిన యొక టీకలోఁ గలదు. బాలసరస్వతీయ తాళపత్ర మాతృకలలో నిట్టియర్థ మగపడదు. కాఁగా నీటీక బాలసరస్వతీయము కాదని చెప్పనగును. ఈ విషయము నారచించిన బాలసరస్వతీయ పీఠికలో విపుల విమర్శనపూర్వకముగ సిద్ధాంతితమై యున్నది. (బాలసరస్వతీయపీఠిక 8—9 పేరాలు.)

ఇంక నహో’బలపండితుఁడును బాలసరస్వతివలెనె సూత్రములోని కావ్యశబ్దమునకుఁ గావ్యరచనా పరముగనే వ్యాఖ్య చేసి యున్నాఁడని యీ క్రింద నుదాహరించు నాతని ధోరణివలన విశదమగుచున్నది.

“అన్యత్ = అన్యదేశభాషామయం కావ్యమపి, విహాయ = పరిత్యజ్య, లోకే వైకృతకావ్యానిచ బహుమన్యన్తే = బహూకరణ పూర్వకం కుర్వన్త్యే వేత్యర్థః......సంస్కృత కావ్యనిర్మాణధౌరేయా అప్యాన్ధ్రదేశవాసినః కవిచన్ద్రాః.........ఆన్ధ్రభాషామేవ బహుమన్యమానాః తన్మయానికావ్యాని కుర్వన్త్యేవేత్యర్థః. (అహో ౧౦౧ పుట)

అహోబల పండితుఁడు "కావ్యమే సకలశ్రేయస్సు" అని యర్థము చేసి శుద్ధసారోపలక్షణచేఁ గావ్య మవ్యభిచరితముగాఁ గీర్త్యాది సమస్తశ్రేయస్సాధన మగునని వివరించెను. కావ్యమునందు శ్రేయస్త్వారోపముచేసి లక్షణ నంగీకరింప నక్కఱలేకయే యట్టి యర్థము నావ్రాసినరీతిని బహువ్రీహిచే సిద్ధించుచున్నది. అదియే స్వారసికమైయున్నదని తోఁచుచున్నది.

ఇఁక నహోబలపతి యంగీకరించిన యారోపమే చేయునపుడు "విశ్వేషాం శ్రేయః" అను విగ్రహమును వివక్షించి కావ్య మెల్లరకును శ్రేయస్సాధన మగుచున్నదని యర్థము చేసినయెడల నాతని యర్థము మఱికొంత మెఱుగుగా నుండును. వేదశాస్త్రములు, పురుషులు - పరిణతబుద్ధులు నగువారికి మాత్రమె యతికష్టముసఁ బురుషార్థసిద్ధిని గలుగఁజేయుననియుఁ గావ్యమన్ననో యెల్లజాతులవారికిని స్త్రీపురుషాది భేదములేకుండ నెల్లజనులకును సుకుమారబుద్ధులకును నానందమును గలిగించుచు నదుపదేశద్వారమున సుఖముగఁ బురుషార్థసిద్ధిని గలిగించునను నర్థ విశేషము పైరీతిని లభించును. కావ్యసేవనమున కిట్టి ప్రయోజనమునె విశ్వనాథ పంచాననుఁడు చెప్పియున్నాఁడు.

శ్లో॥ చతుర్వర్గఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి ।
కావ్యాదేవ............"
చతుర్వర్గ ఫలప్రాప్తిర్హి వేదశాస్త్రేభ్యో నీరసతయా
దుఃఖాదేవ పరిణతబుద్ధీనామేవ జాయతే. పరమాన
న్దసన్దోహ జనకతయా సుఖాదేవ సుకుమారబుద్ధీ
నామపిపునః కావ్యాదేవ. నను తర్హి పరిణత బుద్ధిభిః
సత్సు వేదశాస్త్రేషు కావ్యేషు కిమితి యత్నః కరణీయ
ఇత్యపి నవక్తవ్యమ్. కటుకౌషధోప శమనీయస్య రోగ
స్య సితశర్కరోప శమనీయత్వే కస్యవా రోగిణః సిత
శర్కరాప్రవృత్తి స్సాధీయసీ నస్యాత్........"

సాహిత్యదర్పణము. ౧ పరి. ౫ పుట.)

(౯.) కావ్యమువలన సకలశుభములును గలుగుచున్నవని బాలసరస్వత్యాదులు మిక్కిలి విపులముగాఁ బ్రామాణికవచనముల నుదాహరించియున్నారు.

శ్లో॥ తటాకో ధననిక్షేపో, ద్విజస్థాపనమేవచ ।
వనం శివాలయః కావ్యం, సుతశ్చ స్వర్గదా నృణామ్ ॥
ముక్తిదా స్సప్తసన్తానా, మహాపాతకినామపి ।
తారయన్తిచ దుర్గేభ్యః, పితౄనుభయవంశజాన్ ॥

(బాలసరస్వ - విశ్వేత్యాది సూత్రవ్యాఖ్య)

పయిరీతిగల బాలసరస్వత్యాద్యుదాహృత ప్రామాణికవచనముల నెల్ల గ్రంథ విస్తరభీతి నిచట నుదాహరింపనయితిని.

"కావ్యాలాపాశ్చ యే కేచి ।
ద్గీతకా న్యఖిలానిచ ।
శబ్దమూర్తి ధరస్యైతే ।
విష్ణో రంశా మహాత్మనః"

(ఆగ్నేయపురాణము. సాహిత్యదర్పణోదాహృతము.
సాహిత్యద. ౬ పుట).

పయిరీతిని మహాకావ్య సేవనమువలన సకలశుభములును సమకూరు నని వ్యాకరణాదిని నన్నయభట్టు సిద్ధాంతము చేయుటచేఁ దాదృశమహాకావ్య రచనా సామర్థ్యాదికము నొదవించుటలోఁ బ్రధానసాధనమగుచున్న వ్యాకరణమునకును గావ్యద్వారమున శ్రేయోదాయకత్వము లభించుచున్నదని యాతఁడు తలంచినట్లు విశదమగుచున్నది. సుశబ్దాప శబ్దోచ్చారణమువలనఁ బుణ్యాపాపములు సంభవించును గాన వ్యాకరణము స్వయముగఁ బురుషార్థ సాధకమగుననుట సరికాదు. యజ్ఞాదివైదికకర్మములందే యట్టి నియమము నెన్నవలెనని మహాభాష్యకర్త స్పష్టముగాఁ జెప్పెను. "యద ప్యుచ్యతే...... నియమ ఇతి......యాజ్ఞే కర్మణి స నియమః. అన్యత్రానియమః......యాజ్ఞే కర్మణి పున ర్నాపభాషన్తే........." (వ్యాకరణ మహాభాష్యము.. (౧ అ-౧ పా. ౧ ఆహ్నికము)

సాహిత్యదర్పణ కర్తయగు విశ్వనాథుఁడును గావ్యము పురుషార్థ సాధకమగుటచేతఁ దత్కావ్యస్వరూపనిరూపణము చేయు తన యలంకార గ్రంథమును దద్ద్వారమునఁ బురుషార్థసాధకమగునని యీపద్ధతినే యీక్రింది రీతిని జెప్పియున్నాఁడు.

శ్లో॥ చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖా దల్పధియామపి ।
కావ్యాదేవ యత స్తేన । తత్స్వరూపం నిరూప్యతే ॥

(చూ ౮-విమ) (సాహిత్య. ౧ పరి. ౧ శ్లో)

(౧౦) మఱియు వ్యాకరణగ్రంథాదిని గావ్యప్రశంస చేయుటంబట్టి వ్యాకరణము కావ్యభాషా మాత్రవిషయకమె యని స్పష్టపడుచున్నది. పై నుదాహరించినరీతిని గావ్యములలో నపశబ్దోచ్చారణమునఁ బాపము సంభవింపనేరదుగదా! ఇఁక "దోషా స్తస్యాపకర్షకాః" (సాహిత్యదర్పణము. ౭...శ్లో) అను నాలంకారికోక్త కావ్యదోష సామాన్యలక్షణము చొప్పున రసప్రధానములగు కావ్యములయందే యపశబ్దప్రయోగాదులకును దోషత్వము సంభవించునుగాని తక్కినగ్రంథములందు సంభవింపనేరదు. కాఁగా "శక్తం పదమ్" అను చొప్పునఁ బదమునకు వివక్షితార్థబోధనశక్తి లోకప్రసిద్ధమై యుండుట, "వాక్యం స్యా ద్యోగ్యతాకాంక్షాఽఽసత్తియుక్తః పదోచ్చయః" అను చొప్పున వాక్య మన్వయాది సౌష్ఠవమును గల్గియుండుట, మున్నగు రచనాలక్షణములుమాత్రము కావ్యేతరగ్రంథములం దుండినం జాలునని చింతామణికర్త తలంచియున్నట్లగపడుచున్నది.

అట్లయినను గావ్యాలంకార చూడామణి, నరసభూపాలీయము, నప్పకవీయము, నాంధ్రభాషాభూషణము, మొదలుగాఁ గల కావ్యేతర ప్రాచీన పద్యగ్రంథభాగములును గావ్యభాషతోనే వ్రాయఁబడుటచేతను గావ్యములె కాక పద్యగ్రంథములెల్లఁ గావ్యభాషతో రచించు నాచారమె నన్నయభట్టారకునకుఁ దర్వాత స్థిరపడియున్నట్లు విశదమగుచున్నది. ఇట్లు కేవలపద్యగ్రంథముననె కాక లక్షణగ్రంథాదులలోని గద్యములసైతము కావ్యభాషతోనే గ్రంథకర్తలు రచించియున్న ట్లెల్లరకును విదితమే. వానియందు లేఖకకృత ప్రమాదములుండుట శంకాస్పదము కాదు. కావుననె యట్టివి నేఁటి ముద్రణ సంస్కర్తలచేత సవరింపఁ బడుచున్నవి.

ఇఁకఁ గావ్యేతరములును వ్యాఖ్యానరూపములును నగు బాలసరస్వతీయాదులును, బద్యగద్యాత్మకములగు నప్పకవీయాదులలోని వచనభాగములును వ్యావహారిక భాషతోనే రచింపంబడిన వనియు నట్టివానినెల్ల ముద్రణ సంస్కర్తలు యథేచ్ఛముగఁ గావ్యభాషామయములుగా మార్చిరనియు నది కేవలము నకృత్యమనియు నప్పకవీయ పీఠికా కర్తగారు జర్చించియున్నారు.

అప్పకవీయ వచనభాగములలో నూఱుపంక్తులు మాత్రము కావ్యభాషతో నున్నవనియు నైదువందల యేఁబదిపంక్తులు వ్యావహారికభాషతో నున్నవనియు వారు పీఠికలోఁ వ్రాసియున్నారు. కాని యట్లు వ్యావహారికభాషతో నున్నవని వారు చెప్పిన "30—37 పుటలు. 48—55 పుటలు. 148—216 పుటలు, 'అన్న అనేటందుకు, అయ్య అనేటందుకుఁ (చూ-పు. 159)" అను చోటులు వ్యావహారికభాషతోఁ గనఁబడకుండుట మిక్కిలి యాశ్చర్యకరముగ నున్నది. 159 పుటలో 'అయ్య అనుటకు, అన్న అనుటకు, అనియేయున్నది, గాని వారు వ్రాసినట్లు లేదు. ఇఁక నప్పకవీయతాళ పత్రమాతృకలో నట్లు వ్యావహారికభాష యగపడుచున్నదనియుఁ బ్రకృతాంధ్ర లోకసమ్మతికై వారు సయితము కావ్యభాషామయముగ సవరించిరనియు నూహింపవలసియున్నది. వారు చూచినమాతృకనె ప్రమాణముగా నంగీకరించినను గ్రంథకర్త కొన్ని పంక్తులు కావ్యభాషతోను గొన్ని పంక్తులు వ్యావహారికభాషతోను రచించె ననుట సంభావ్యముగా నగపడదు. మఱియు వారు వ్యావహారిక భాషతో నున్నవని చెప్పుచున్నపంక్తులలో నెల్లయెడలను వారి పీఠికాభాషవంటి వ్యావహారికభాష వెలయుచున్నదా? లేక యెచ్చటనేని నేదేని కారణమున నొక్కొక్క వ్యావహారికపదము పడియున్నదా? యను విషయములను బరిశీలింతమన్న నట్టి వ్యావహారికభాషతో వారు పరిష్కరించిన పుస్తకమె ముద్రింపఁబడదయ్యె. ఇఁక వారు వ్యావహారికభాషామయమని చెప్పిన బాలసరస్వతీయ టీకలోని వ్యావహారిక భాషాప్రయోగములు సరస్వతీ ప్రయుక్తములు కావనియు నవి యెల్లలేఖకాది ప్రక్షిప్తములె యనియు నారచించిన బాలసరస్వతీయ పీఠికలో విపులముగాఁ జర్చించి సిద్ధాంతీకరించి యుండుటచే గ్రంథవిస్తరభీతి నిట మరలఁ జర్చింపలేదు.

(బాలసరస్వతీయపీఠిక. 18 - 23 పేరాలు.)

(౧౧) 'ఆంధ్రశబ్ద చింతామణియందు గీతిశ్లోకములు ప్రచురములై యున్నవి. "ఔపవిభక్తికసంజ్ఞాః........." (సంధి 30 శ్లో) "నిత్యం దారా దేశ్చ........." (అజంత 49 శ్లో) "అనుతాం స్త్రియామ్......" (అజంత 52 శ్లో) "ప్రథమైకవచన........." (హలంత 54 శ్లో) అను నాలుగు శ్లోకములుమాత్ర మార్యాశ్లోకములై యున్నవి. 'కేషాంచి దుదల్తానామ్........." (అజంత 51 శ్లో) "ఆత్మన ఇమనన్తానామ్........." (హలంత 56 శ్లో) "ద్విగుకర్మధారయా......" (హలంత 69 శ్లో) అను

మూఁడు శ్లోకములునూత్రమున్ నిర్వివాదముగ నుద్గీతులై యున్నవి. తక్కిన వెల్ల గీతిశ్లోకములె యగుచున్నవి.

"లక్ష్మైతత్సప్తగణా । గోపేతా భవతి నేహ విషమే జః ।
షష్ఠోయం నలఘూవా । ప్రథమేర్థే నియత మార్యాయాః ॥
షష్ఠే ద్వితీయలా న్లే । పరకే ముఖలాచ్చ స యతిపద నియమః ।
చరమేర్థే పఞ్చమకే । తస్మా దిహ భవతి షష్ఠో లః ॥

(వృత్తరత్నాకరము ఆర్యాప్రకరణము ౧-౨ శ్లోకములు)

"ఆర్యా ప్రథమదళోక్తం । యది కథమపి లక్షణం భవే దుభయోః ।
దళయోః కృతయతిశోభాం । తాం గీతిం గీతవాన్ భుజఙ్గేశః ॥
"ఆర్యా శకలద్వితయం, వ్యత్యయరచితం భవే ద్యస్యాః ।
సోద్గీతిః కిల గదితా, తద్వ ద్యత్యంశ భేదసంయుక్తా ॥

(వృత్తరత్నాకరము గీతిప్రకరణము ౧-౩ శ్లో)

బాలసరస్వతియు నప్పకవియు నహోబలపండితుఁడును జింతామణి లోని శ్లోకములెల్ల నార్యలని వ్రాసియున్నారు.

"తొల్లి సకలకవితా ప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకలకవిహితం బుగా యథోచిత సూత్రగర్భితంబుగా నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేద కంబుగా......"

(బాలసరస్వతీయము గ్రంథాది)

కం॥ "ఇలనెనుబది రెండార్యలు । గలుగు పరిచ్ఛేదపంచకంబునఁ
దగు...... (అప్పయకవీయము ౧ ఆ-౫౨ ప)
"తత్రపఞ్చ పరిచ్ఛేదా । శ్శబ్దశాస్త్రే నియన్త్రితాః ।
ఆర్యాఖ్యపద్యై స్తత్సఙ్ఖ్యా । సమ్మితా స్యా ద్గజైర్గజైః ॥

(అహోబల పండితీయావతారిక)

విశ్వశ్రేయః కావ్యమ్మను ప్రకృతసూత్రపు వ్యాఖ్యానమున నహో బలపతి యీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"సర్వాణి గ్రన్థేస్మిన్ పద్యా న్యార్యా గీతి వృత్తాని. లక్ష్మైతత్సప్త గణా, గోపేతా భవతి నేహ విషమే జః' ఇత్యాది సామాన్యలక్షణాత్. త్రిష్వంశ కేషు పాదో, దళయో రాద్యేషు దృశ్యతే యస్యాః, పథ్యేతి నామ తస్యాశ్ఛన్దో

చి. ౨. తదదోషౌ పరికృతౌచ వాగర్థౌ ।

---

విద్ధి స్వమాఖ్యాతమ్ "ఇతి విశేషలక్షణాచ్చ, ఆర్యాద్యర్థ సమాగీతి రితి పైజ్జళ సూత్రచ్చ." (అహో ౬-౭ పుటలు)

పై సందర్భమును బట్టి వీరు మగ్గురును జింతామణి శ్లోకము లెల్ల నేక విధముననే యున్నవని తలంచిరే కాని, మూఁడుజాతుల శ్లోకము లున్నవని పరిశీలించిన ట్లగపడదు. మఱియు నివి జాతులయియుండఁగా వీనిని వృత్తములని వాడుటయు ఛందస్సంప్రదాయము కాదు. ఇంతియకాక గీత్యుద్గీత్యాదులను సామాన్యముగా నార్యలని వ్యవహరించుటయు విశేషార్థబోధకము కానేరదు.

శ్లో॥ "గీతిచతుష్టయ మిత్థం ।
ప్రత్యేకం షోడశప్రకారం స్యాత్ ।
సాకల్యే నార్యాణా ।
మశీతి రేవ భేదా స్యుః"

అను హలాయుధ వృత్త్యుదాహృత వచనమునుబట్టి గీత్యాదులెల్ల నార్యాభేదములే యనవలసియున్నను గీత్యాదులను వాడునపుడు "గీతి పథ్యార్య గీతివిపులార్య" మొదలగు రీతులను వాడుటయె సంప్రదాయముగాని విభిన్నలక్షణ లక్షితములయి ప్రత్యేకసంజ్ఞలు గలవానినెల్ల సామాన్యముగ నార్యలనివాడుట సంప్రదాయముగాదు. గీత్యాదులం దార్యాలక్షణము సాకల్యముగాఁ బట్టక యందలి కొంతలక్షణము మాత్రమే పట్టుచుండుటచేతఁ బయిరీతిని వాడుట సరికాదయ్యెనని యెన్నవగును. మఱియు నార్యాగీతి యను ప్రత్యేక సంజ్ఞ వేఱొక లక్షణము గల శ్లోకమునకీ క్రిందిరీతిని వెలయుచుండఁగా నిందలి గీతుల నార్యాగీతులని యహోబల పండితుఁడు వ్యవహరించుటయు సరిగా నుండలేదు.

"ఆర్యాపూర్వార్థం యది, గురుణైకే నాధికేన నిధనే యుక్తమ్ ।
ఇతర త్తద్వ న్నిఖిలం । యదీయ ముదితేయ మార్యాగీతిః"
(వృత్తరత్నాకరము గీతిప్రక. ౪ శ్లో)

(౧౨) తదదోషావిత్యాది :—

అదోషౌ = చ్యుతసంస్కారతాపరనామక గ్రామ్యదోషరహితము లగునట్టియు,

పరిష్కృతౌ = కావ్యపరికరము లనఁదగు కావ్యశోభాకర ధర్మములతో నున్నట్టియు,

వాగర్థౌ = శబ్దార్థములె,
తత్ = ఆ కావ్యము.

'పరిష్కృతౌ' అనుచో గుణాలంకారాలంకృతములని మాత్రమె యర్థముకాదు. అట్లై యైనచో సుమాగమము వచ్చి 'పరిష్కృతౌ' అను రూప ముండవలసి యుండును. "సంపరే స్సుమ్" (ముగ్ధబోధవ్యాకరణము ౭౬౬ సూ.) "అర్థానభిధానేపి భూషణ ఏవ. కాతన్త్ర సంక్షిప్తసారైక వాక్యత్వాత్. భూషణా దన్యత్ర సంకరోతి. పరికరోతి" (దుర్గాదాసవ్యాఖ్య) "సంపరిభ్యాం కరోతౌ భూషణే" (౬-౧-౧౩౭) "సమవాయేచ" (౬-౧-౧౩౮) (పాణినీయము). కాఁగా గ్రామ్యదోషదూషితములు గానట్టియు గుణాలఙ్కార భావికాది (దండికావ్యదర్శములోని భావికము) కావ్యపరికరములతోఁ గూడి నట్టియు రసవ్యక్తీకరణదక్షము లగు శబ్దార్థములె కావ్యమనిపించుకొను నని యర్థము తేలుచున్నది. కావ్యపరికరములనుటచేత గుణాలంకారవత్త్వమే కాక శబ్దార్థదోషరాహిత్యము పాత్రౌద్యాచిత్య సందర్భశుద్ధి ప్రభృతి భావిక సంపత్తిమున్నగునవియును జెప్పఁబడుచున్నవి. కాఁగా "తదదోషౌ" అనునది పునరుక్తమగుచు దోషములలోని కెల్ల గ్రామ్యదోష మత్యావశ్యక ముగాఁ బరిహర్తవ్య మని విశదీకరించుచున్నది. తన్మూలమున శ్రుతికట్వాద్య నిత్యదోషములు సహింపఁదగిన వనియు వ్యక్తమగుచున్నది. ఇట్టి యభిప్రాయము తోడనే సాహిత్యదర్పణ కర్తయు తదదోషౌ శబ్దార్థౌ సగుణా వన లఙ్కృతీ పునః క్వాపి కావ్యమ్మను మమ్మటోక్త కావ్యలక్షణమును నిరసించి "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని కావ్యలక్షణమును జెప్పియున్నాఁడు.

"కించైవం కావ్యం ప్రవిరళ విషయం నిర్విషయం వా
స్యాత్. సర్వథా నిర్దోష స్యైకాంత మసంభవాత్ .........
నహి కీటానువేధాదయో రత్నస్య రత్నత్వం వ్యాహ
న్తు మీశాః, కింతూపాదేయ తారతమ్యమేవ,
తద్వదత్ర శ్రుతిదుష్టా దయోపి కావ్యస్య. ఉక్తంచ.
శ్లో॥ కీటానువిద్ధరత్నాది । సాధారణ్యేన కావ్యతా ।
దుష్టేష్వపి మతా యత్ర । రసాద్యనుగమః స్ఫుటః ॥
(సాహిత్యదర్పణము. ౧ పరిచ్ఛేదము. ౯ పుట.)

పయిసందర్భమునుబట్టి విశ్వనాథుఁడు చ్యుతసంస్కారతా దోషము నయితము కావ్యత్వమునకు హానికరము కానేరదని తలంచినట్లగపడుచున్నది.

చి. ౩. సా వా గ్యా రసవృత్తిః ।

---

కాని చింతామణి కర్త మాత్ర మట్టిదోషము కావ్యమున నెంతమాత్ర ముండరాదనియే తలంచినట్లు వెనుక నుదాహరించినరీతిని "తదదోషావి" త్యాది పునరుక్తదళపు స్వారస్యమున విశదమగుచున్నది. చింతామణి కర్తయొక్క యిట్టియాశయమునే యీ క్రిందిరీతి నథర్వణాచార్యుఁడు వివరించి యున్నాఁడు.

"కవితోపాశ్రితం దోషం । నైవ కించి త్సహామహే ।
తదర్థమేవహి వయం । భూయసా ప్రయతామహే ॥" (౩౮ విష.)

(౧౩) నన్నయ భట్టారకుని యభిప్రాయము పై రీతిగ నుండుటచేత నీక్రిందఁ జూపఁబడు బాలసరస్వత్యాదుల వ్యాఖ్యలు గ్రంథ కృదభిప్రేత ములు కావని తోఁచుచున్నది.

"అదోషౌ = అపార్థాది దోషరహితములు, పరిష్కృతౌచ = గుణా లంకార యుక్తములునగు...........

క॥ 'ఢీకొని సురాసురేంద్రులు ।
కాకోలూకముల కరణిఁ గడు నుద్ధతులై ।
భీకరరణంబుసల్పిరి ।

... ... ...

అను వాక్యము గుణాలంకారయుక్తమైనను నుపమాదోష సహితము కానఁ గావ్యముకాదు." (బాలసరస్వతీయము.)

"తే॥ గీ॥ కృతికినెపుడు శబ్దార్థముల్ రెండువలయు ।
నవి యలంకార యుతములు **నఖిలదోష** ।
**రహితములు** గాఁగఁ జూచి కూర్పంగవలయుఁ ।
గామెపలిబాల గోపాల గానలోల ॥ (అప్పక. ౧ అ ౧౪౫ ప.)

అదోషౌ = వాక్యార్థదోషరహితౌ, పరిష్కృతౌ = గుణాలంకార సహితౌచ.

అల్పోపి దోషః ప్రమాదే నాప్యనుపేక్ష్య ఇతిద్యోతయితు మాదా వదోషావితి విశేషణమ్; ఏకోహి దోషఇత్యాది న్యాయస్తు కావ్యవ్యతిరిక్త విషయక ఇతి ద్రష్టవ్యమ్, పదదోషాః శ్రుతికట్వాదయః వాక్యదోషాః ప్రతి కూల వర్ణాదయః. అర్థదోషా అశ్లీలాదయః ॥" (అహోబ)

తత్తత్సందర్భోచితరసవ్యంజకమహాకవిగ్రథిత వాక్యరచనా విశేషము చేత రసము వ్యక్తమగుచు సహృదయస్వాద యోగ్యము కావలసినదే, యనఁగా నిట్టిదని నిరూపింప శక్యముకానిదని తాత్పర్యము. కావుననే సాహిత్యదర్పణమున నీ క్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

" సత్త్వోద్రేకా దఖణ్డస్వ । ప్రకాశానన్ద చిన్మయః ।
వేద్యాన్తర స్పర్శశూన్యో । బ్రహ్మాస్వాద సహోదరః ॥
... ... ... ...
నాయం జ్ఞాప్య స్స్వ సత్తాయాం । ప్రతీ త్యవ్యభిచారతః
విభావాదిపరామర్శ । విషయత్వా త్సచేతసామ్ ॥
పరానన్దమయ త్వేన । సంవేద్యత్వాదపి స్ఫుటమ్ ।
ననిర్వికల్పకం జ్ఞానం । తస్య గ్రాహక మిష్యతే ॥
తథాభిలాపసంసర్గ । యోగ్యత్వవిరహా న్నచ ।
సవికల్పకసంవేద్యః । సాక్షాత్కారతయా నచ ॥
పరోక్ష స్త త్ప్రకాశో నా । పరోక్ష శ్శబ్ద సంభవాత్ ।
తస్మా దలౌకిక స్సత్యం । వేద్య స్స హృదయై రయమ్ ॥
ప్రమాణం చర్వణై వాత్ర । స్వాభిన్నే విదూషాం మతమ్ । ...
అవాచ్యత్వాదికం తస్య । వక్ష్యే వ్యఞ్జనలక్షణే ॥ "
(సాహిత్యదర్పణము. 3 పరి. ౩౮—౫౯ కా.)

"ఏతాదృశ కావ్యనిర్మాణే శక్త్యాదీనాం త్రయాణాంమిళిత్వా హేతుత్వముక్తమాలంకారికైః—ఉక్తం హి కావ్యప్రకాశే. 'శక్తి, ర్నిపుణతాలోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్, । కావ్యజ్ఞ శిక్షయాభ్యాస । ఇతిహేతు స్తదుద్భవే' హేతురి త్యేకవచనం మిళిత్వా హేతుత్వకథనార్థమితి " (అహో. ౭౬ పుట.)

" శ్లో॥ నియతికృత నియమరహితాం,
హ్లాదైకమయీ మనన్య పరతన్త్రామ్ ।
నవరసరుచిరాం నిర్మితి,
మాదధతీ భారతీ కవే ర్జయతి " ॥ (అహో. ౭౫ పుట.)

" రసప్రలుబ్ధధియో బహుమన్యన్త ఇత్యనేన రసజ్ఞానామేవ పణ్డితానాం కావ్యే స్వారసిక ప్రవృత్తి ర్న కేవలతర్కకర్కశధియాం సుధియామపీత్యర్థోజ్ఞాప్యతే. త దు క్త మభియుక్తైః.

చి॥ ౯-సాధ్యోహి రసో యథాయథం కవిభిః

---

ఈ సందర్భమున నప్పకవ్యహోబలపతులు కావ్యగుణదోషాలంకార రసాది స్వరూప నిరూపణాద్యాలంకారిక విషయము లతివిపులముగా నుదాహరించిరి. వ్యాకరణగ్రంథమున వానిని జెప్పుట యంత ప్రసక్తము కాదని తలఁచి యావిషయము లిందు వివరింపలేదు.

(౧౮) సావాగిత్యాది:—

యా = ఏది

రసవృత్తిః = రసవ్యక్తీకరణ సమర్థమో

సా = అదియే

వాక్ = మీఁదిసూత్రముసఁ బేర్కొనఁబడిన వాక్కు కావలయును.

కావ్యమునకు రసము జీవితభూతమగుటచేత రసప్రత్యాయన ప్రవణ శబ్దార్థములె కావ్యమున సంఘటింపఁబడవలెను.. రసవ్యక్తియుఁ గావ్య సామాగ్రిలోనిదే యగుటచేత నీయర్థమునైతము 'పరిక్రుతౌ' అను విశేషణము చేతనే లభింపఁదగియున్నను రసము జీవితభూతమగుటచేత నీరసవాక్యములకుఁ గావ్యత్వము లేదని దృఢీకరించుటకయి 'వాక్' శబ్ద మిట్లు విశేషించి వివరింపఁబడెనని తెలియనగును.

కం॥ "ప్రాతఃస్నానము సేయుదు ।
రాతతమతి సంధ్యవార్చి యాపాసనముల్ ।
సీతాపతి పూజయు సం ।
ప్రీతిగ నొనరుతురు పురి ధరిత్రీదివిజుల్ ॥"

అనువాక్యము దోషరహితమైనను గుణాలంకారయుక్తము కాదుగానఁ గావ్యముకాదు." అని బాలసరస్వతియు వ్రాసియున్నాఁడు.

(బాలసరస్వతీయము, తదదోషా విత్యాదిసూత్రవ్యాఖ్య.)

(౧౯) సాధ్యఇత్యాది:—రసః=రసము; యథాయథమ్=యథాస్వభావముగా; (యథోచితముగనని భావము) కవిభిః=మహాకవులచేత; సాధ్యోహి= సాధింపఁదగినదిగదా! వ్యక్తపఱుపఁ దగునుగదా! 'యథాయథమ్. యథాతథమ్' అను రెండును బర్యాయములేకాన 'యథాతథమ్ కవిభిః' అను పాఠముపక్షమునను నిట్లె యర్థము చేయనగును. "యథాతథ. అవ్య...... యస్య వస్తునో యద్రూపం భవితు ముచితం తథారూపభావే. యథాయథ మ ప్యత్రార్థే (శబ్దస్తోమ మహానిధి.)

తత్తత్సందర్భోచితరసవ్యంజకమహాకవిగ్రథిత వాక్యరచనా విశేషము చేత రసము వ్యక్తమగుచు సహృదయస్వాదయోగ్యము కావలసినదే, యనఁగా నిట్టిదని నిరూపింప శక్యముకానిదని తాత్పర్యము. కావుననే సాహిత్యదర్పణ మున నీ క్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

"సత్త్వోద్రేకా దఖణ్డస్వ । ప్రకాశానన్ద చిన్మయః ।
వేద్యాన్తర స్పర్శశూన్యో । బ్రహ్మాస్వాద సహోదరః ॥
... ... ... ...
నాయం జ్ఞాప్య స్స్వ సత్తాయాం । ప్రతీ త్యవ్యభిచారతః
విభావాదిపరామర్శ । విషయత్వా త్సతచేతసామ్ ॥
పరానన్దమయ త్వేన । సంవేద్యత్వాదపి స్ఫుటమ్ ।
ననిర్వికల్పకం జ్ఞానం । తస్య గ్రాహక మిష్యతే ॥
తథాభిలాపసంసర్గ । యోగ్యత్వవిరహా న్నచ ।
సవికల్పకసంవేద్యః । సాక్షాత్కారతయా నచ ॥
పరోక్ష స్త త్ప్రకాశో నా । పరోక్ష శ్శబ్ద సంభవాత్ ।
తస్మా దలౌకిక స్సత్యం । వేద్య స్స హృదయై రయమ్ ॥
ప్రమాణం చర్వణైవాత్ర । స్వాభిన్నే విదూషాం మతమ్ । ...
అవాచ్యత్వాదికం తస్య । వక్ష్యే వ్యఞ్జనలక్షణే ॥ "
(సాహిత్యదర్పణము. 3 పరి. ౩౮—౫౯ కా.)

"ఏతాదృశ కావ్యనిర్మాణే శక్త్యాదీనాం త్రయాణాంమిళిత్వాహేతుత్వ ముక్తమాలాంకారికైః—ఉక్తం హి కావ్యప్రకాశే. 'శక్తి, ర్నిపుణతాలోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్, । కావ్యజ్ఞశిక్షయాభ్యాస । ఇతిహేతు స్తదుద్భవే' హేతురి త్యేకవచనం మిళిత్వా హేతుత్వకథనార్థమితి " (అహో. ౭౬ పుట.)

" శ్లో॥ నియతికృత నియమరహితాం,
హ్లాదైకమయీ మనన్య పరతన్త్రామ్ ।
నవరసరుచిరాం నిర్మితి,
మాదధతీ భారతీ కవే ర్జయతి " ॥ (అహో. ౭౫ పుట.)

" రసప్రలుబ్ధధియో బహుమన్యన్త ఇత్యనేన రసజ్ఞానామేవ పణ్డి తానాం కావ్యే స్వారసిక ప్రవృత్తి ర్న కేవలతర్కకర్కశధియాం సుధియామ పీత్యర్థో జ్ఞాప్యతే. త దు క్త మభియుక్తైః.

చి-శ. స్వస్థానవేషభాషా, భిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః ॥
లోకే బహుమన్యన్తే, వైకృతకావ్యాని చాన్య ఉపహాయ ॥

---

శ్లో॥ రసప్రసర నిర్భరాః కవిగిరాం ప్రసారాః పరం ।
ముదం విదధతే హృది ప్రమదిమభాజి కావ్యామృతైః
సుధాకర కరాఙ్కురవ్యతికరేణ చన్ద్రోపలా ।
ద్రవన్తి శిశిరా శ్చిరా దపి న విన్ధ్య వన్ధ్యోపలా॥ ఇతి'' (అ. ౧౦౩ పు.)

౧౬. పయి యహోబలపతి వాక్యములోని కేవలశబ్ద స్వారస్యముచేత రసికులును మహాకవులును శాస్త్రజ్ఞులై యుండుట విరుద్ధముకాదని యెన్న నగును. కావుననే కావ్యకర్తకు వ్యాకరణాదిశాస్త్రజ్ఞాన ముండితీరవలెనని యీ క్రిందిరీతిని సరస్వత్యాదులచే జెప్పఁబడి యున్నది.

శ్లో॥ " సత్కులీన శ్శుచి ర్దక్ష । శ్ఛన్దో వ్యాకరణాదివిత్ ।
ప్రశాన్త స్సుభగాకారో । దైవజ్ఞశ్చ కవి ర్భవేత్ ॥
(బాలసరస్వ. సాధ్యఇత్యాది సూత్రవ్యాఖ్య)

" కులీనత్వాది గుణములేల యనఁగా :—

శ్లో॥ 'గవి క్షీర మివ గ్రాహ్యం । కావ్యం విప్రేణ నిర్మితమ్' (అ. ౨౫ పుట.)
" నశూద్రస్య వచో గ్రాహ్యమ్............... అను
నిదిమొదలగు నిషేధము లున్నవి గాన.........

(బాలసరస్వ. సాధ్యఇత్యాదిసూత్రవ్యాఖ్య.)

తే॥ ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న ।
యంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబు గాదు ।
పాయసంబైన సంస్కారపక్వమైన ।
కాకమృష్టంబు హవ్యంబు గాని యట్లు ॥ ౧౩౬ ॥
(అప్పకవీయాంధ్రీకృతి ౧-ఆ.)

పయి గవిక్షీరమిత్యాది సందర్భమును నిదియుఁ గేవలము నసంగతములై యున్నవి. ఈ విషయ మింకను ముందు నిరసింపబడును. (చూ-౧౯ విష.)

కవులకుఁగల కవితారుచిభేదములనుబట్టి వారికి వేర్వేఱు నీక్రిందిరీతి నన్వర్థసంజ్ఞలు వాడఁబడుచున్నవి.

“సచ వివేకి, వాచిక, రౌచి కార్థిక శిల్పక భూషణార్థి మార్దవానుగతా ఖ్యాభి స్సప్తవిధః. గుణదోషవిభాగజ్ఞో, వివేకీ పరికీర్తితః, అను ప్రాసనమా బద్ధ పదబన్ధస్తు వాచకః । ప్రసాదమధురాయుక్తవచనో రౌచికో భవేత్, అర్థ సంగ్రహచాతుర్యయుక్త స్స్యా దార్థికః కవిః । శిల్పకస్తు భవే ద్దక్షః । కవనే యమ కాన్వితే । సాలంకృతి స్యాభూషణార్థీ । మార్దవీ రసతత్పరః ॥ ఇతి తేషాం లక్షణాని సంప్రదాయసంజీవన్యాం విద్యా చక్రవర్తినా ప్రతిపాదితాని.” (అహో౦ ౮ పు).

సీ॥ గణవర్ణశబ్దార్థ గుణదోషనికరంబుఁ
బరికించి కూర్చుఁ గబ్బము వివేకి ।
బహుతరాను ప్రాస పదబంధనియమంబు
వదలక కృతిసేయు వాచికుండు ।
మృదుమధురోక్తులు వెదకి కావ్యంబెల్ల
రచియించుఁ బడపడి రౌచికుండు
మితశబ్దములలోన నతివిపులార్థంబు,
లిమిడించు నర్థాఖ్యు నెసఁగునతఁడు ॥

తే॥ గీ॥ సెప్పు యమకంబు నెప్పట్ల శిల్పకుండు ।
పొందుపఱుచు నలంకృతుల్ భూషణార్థి ।
సరళపదవిరళార్థ విస్ఫురణముగను ।
జూపు రసమెందు మార్దవస్ఫుటకరుండు ॥

(అప్పక ౧ ఆ. ౨౧౧)

... ... ... ...

(౧౭) స్వస్థానేత్యాది :—రసప్రలుబ్ధధియః = రసాస్వాదన తత్పర హృదయులగు, సన్తః = ఆంధ్రపండితులు (లేదా తత్తద్దేశవాసులగు తత్త ద్భాషాపండితులు) స్వస్థాన = స్వదేశమునందలి, వేషభాషా = వేషభాష లందు, అభిమతాః = అభిమానము గలవారగుచు, లోకే = ఆంధ్ర దేశ మందు, (లేదా లోకమందంతటను), అన్యత్ = వైకృత కావ్యములకంటె భిన్నమైన ప్రకృతిభూత సంస్కృతకావ్య జాతమును (లేదా ఇతర దేశభాషా కావ్యములను) అపహాయచ = విడిచియు, వైకృతకావ్యాని = ఆంధ్రభాషా కావ్యములను (లేదాస్వస్వదేశ భాషాకావ్యములను) బహుమన్యన్తే=బహూ

కరించుచున్నారు. అనఁగా శ్రవణపఠనపాఠన రచనాదులచే నాదరించు చున్నారని తాత్పర్యము.

సంస్కృతము వ్యవహారస్థము కాకుండుటచేఁ దద్భాషామయ కావ్యముల కన్న వ్యవహారస్థ మగుటచేత జీవకళాభాసురము లగుచున్న స్వదేశభాషాగ్రథితములగు కావ్యములు రసావిష్కరణ విషయమునఁ బ్రకృష్టతరము లగుటంజేసి యట్టి సంస్కృతకావ్యజాతమును విడిచియు వైకృతకావ్యముల ననఁగా స్వస్వదేశభాషా గ్రథిత కావ్యములను పండితు లాదరించుచున్నారని తాత్పర్యము. ఇట్టి యాదరణము వెలయుచుండుటచేతనే యాంధ్రమున మహాకావ్యములులేని కొఱంతను దీర్పనెంచి నన్నయభట్టారకుఁ డాంధ్ర మహాభారతమును రచింపఁగడంగుటయు నద్దాని కుపకారకమగు నీయాంధ్రశబ్దచింతామణిని మొట్టమొదట రచింప నారంభించుటయు సుప్రసక్తము లగుచున్నవని తాత్పర్యము. గ్రంథకర్త కిట్టి యభిప్రాయముండుటచేతనే యీ వ్యాకరణ గ్రంథాది నున్న కావ్యప్రసంగము సుసంగతమగుచున్నది.

పైని వ్రాసినరీతి నిందలి వైకృతశబ్దమునకు "ఆద్యా మహార్ణా సా మూలం । సర్వస్యేతి నిగద్యతే" అనుచొప్పున దేశభాషా సామాన్యపరముగా నర్థమును గ్రహింపక యాంధ్రభాషా విశేషపరముగా "ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే, ఏషా తయో ర్భవే ద్వికృతిః" అనుచొప్పున నర్థము నెన్నుటలో క్షతిలేదు. నన్నయభట్టారకుని నాఁటి కాంధ్రమున మహాకావ్యములు లేకున్నను ముక్తకాదిక్షుద్రకావ్యములును నక్కలలు మున్నగుపాటలును బదములును గొన్ని పద్యమయదానశాసనములును మున్నగునవి వెలసియుండుట సుప్రసిద్ధమేకదా! అట్టివాని నాదరించుచుఁ దమిళ కన్నడాదులకువలె మహాకావ్య వాఙ్మయవత్త్వావస్థ యాంధ్రమునకు లేదయ్యెనే యని పరితపించుచు నాంధ్రకావ్యసేవ యందలి తమ యాదరము నాంధ్రులు వెల్లడించు చుండుటచే నన్నయభట్టారకుఁడు భారతరచనమునకును దదుపకారకచింతామణి రచనమునకును గడంగెనని గ్రహింపనగును. (౩-౪-౧౭ విషయ) ఇందలి 'సన్తః' అను నది తాత్కాలిక పండితసభల పరమని యీ క్రింది భారత పద్యము వ్యక్తపఱుచుచున్నది.

చ॥ పరమవివేక సౌరభ విభాసితసత్కవిపుంజ వారిజో ।
త్కరరుచిరంబులై సకల గమ్యసుతీర్థములై మహామనో ।
హరసుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన సత్సభాం ।
తరసరసీ వనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్). (భార-ఆది ౧ ఆ)

౧౮ ;—బాలసరస్వత్యప్పక వ్యహోబలాదు లీ సూత్రములోని 'అన్యదపహాయ' అనుదానికి 'ఇతరదేశభాషామయ కావ్యములను విడిచి అనియు 'బహుమన్యన్తే' అనుదానికి స్వదేశభాషాకావ్యములను రచించుచున్నారనియును వేఱువిధముగ నర్థములు వ్రాసియున్నారు. ఇట్టివ్రాఁతలకు

"శ్లో॥ దేశభాషా పురాణాని । రచితానిచ మానుషైః ।
శ్రుత్వా కావ్యేతిహాసాంశ్చ । భయ మాప్నోతి మానవః ॥"
(అహో ౧౦౧)

అనురీతి వచనములను బ్రమాణముగఁ జూపి మిక్కిలి విపులముగఁ జర్చించిరి.

"శాస్త్రే తు సంస్కృతా దన్య । దపభ్రంశతయోదితమ్"।
"అపశబ్దం ప్రయుఞ్జానో, రౌరవం నరకం వ్రజేత్ ॥"

అను వచనములచొప్పున నపభ్రంశరూప దేశభాషాకావ్యములు గ్రాహ్యములు కావనునది మొదటిపక్షము. మహాభాష్య కర్త "శబ్దేనైవా (సుశబ్దేనైవా) ర్థోఽభిధేయో నాపశబ్దేనేతి, ఏవంక్రియమాణం కార్య మభ్యుదయకారి భవతీతి......... నియమఇతి యాజ్ఞే కర్మణి స నియమోఽన్యత్రానియమః యాజ్ఞే కర్మణి పున ర్నాప భాషన్తే" (మహాభాష్యము. ౧ అధ్యా-౧ పాద-౧ ఆహ్ని) అని చెప్పియుండుటచేత నపశబ్దప్రయోగము యజ్ఞ మాత్రమునందే నిషిద్ధమగుటంజేసి దేశభాషాకావ్యములు నిషిద్ధములు కావని యామొదటిపక్షమును ఖండించి (అహో ౮౭-౮౯ పుట) యహోబలపతి యవేద్యములగుటచే నన్యదేశభాషా కావ్యములు 'దేశభాషే' త్యాది వచనముచే నిషిద్ధము లగుచున్నవని సాధించెను. "దేశభాషేతినిషేధ స్యావేద్యర సాన్య దేశభాషాకావ్యపరిత్యాగ ఏవ తాత్పర్యమ్." (అహో ౧౦౧ పుట)

పయి యహోబలపతి మార్గమును సరియై యుండలేదు. అన్యదేశభాషాపరిచయము లేనివారికిఁ దద్రచనమునఁ బ్రవృత్తియే కలుగదు. ఇఁకఁ దత్పరిచయము గలవారి కవేద్యత్వ మసంభవముగదా! ఇట్టిస్థితిలో నన్యదేశభాషాకావ్యములను విడిచి స్వదేశభాషా కావ్యములను రచించుచున్నారను నర్థము సుసంగతము కానేరదు. ఒకదేశమువారికి వేఱొకదేశపు భాషలోని కావ్యములు తెలియకుండుట యంతటను దుల్యమేకదా! దేశభాషాకావ్యములు రసావిష్కరణక్షమములగుటచేత గ్రాహ్యములని రసప్రలుబ్ధధియ యను వాక్యముచే నంగీకరించునపు డట్టియాదరము సకల దేశభాషా

సాధారణమే యగునుగదా! మఱియు 'అన్యదపహాయ' అనుటచేత నావఱకుఁ బ్రచారములోనున్న వానిని విడిచి యని యర్థము లభించుచుండుటంజేసి యావఱకుఁ బ్రచారములో నున్న సంస్కృతకావ్యములను విడిచి యను నర్థమే సుసంగతముగానుండును గాని యావఱకుఁ బ్రచారములో లేని యన్యదేశభాషాకావ్యములను విడిచి యనునర్థము సంగతము కానేరదుగదా! మఱియు 'వైకృతకావ్యాని' యనుచోటనున్న వైకృతశబ్దపు స్వారస్యముచేత నన్యమును విడిచి వైకృతకావ్యముల నాదరించుచున్నారను వాక్యమున నన్యశబ్దము ప్రకృతిభూత సంస్కృత ప్రాకృత కావ్యములనే బోధించుననుట యెంతయు స్వారసికమై యుండునుగదా!

ఇఁక 'బహుమన్యన్తే' యనుదానికి రచించు (ఆంధ్రకావ్యములను) చున్నారను వీరి వ్యాఖ్యానము సైతము సరియైయున్నట్లగపడదు. 'బహుమన్యన్తే' యను శబ్దము బహుమానించుచున్నారనఁగా నాదరముతో సేవించుచున్నారను నర్థము నిచ్చునె కాని రచించుచున్నారను నర్థము నీయనేరదు. మఱియు రచించుచున్నారను నీయర్థము పక్షమునఁ గతిపయకవిమాత్రాదరణమే తోఁచును గాని స్వస్థానవేషభాషాభిమానము కల్గిన పండితు లనేకుల యాదరణము తోఁచదు. కాన నీయర్థము గ్రాహ్యముకాదు.

(౧౯) వెనుక నుదాహరించిన వ్యాకరణ మహాభాష్యోక్తుల చొప్పున యజ్ఞకర్మముల విషయమున ననఁగాఁ బారాయణాదికముచేఁ బుణ్యము కలుగు కార్యములవిషమున నపభ్రష్టములగు దేశభాషలలోని కావ్యము లుపచరింపమింజేసియు, స్త్రీశూద్ర ద్విజబంధులకు సంస్కృతగ్రంథ పఠనయోగ్యత లేమింజేసియు, గత్యంతరాభావమున స్వదేశభాషాకావ్యములు మాత్రమె గ్రాహ్యములగుననియు, నన్యదేశభాషాకావ్యములు జప్యబుద్ధిచే గ్రాహ్యములు కామింజేసి వానిని విడుచుచున్నారనియు నిట్లు బాలసరస్వతి వ్యాఖ్య చేసియున్నాఁడు.

ఇట్లు స్త్రీ శూద్రులకు సంస్కృతగ్రంథమాత్ర పారాయణమునందే యోగ్యత లేదనుట కేవలము నసంగతమనుటకు సందేహములేదు. శూద్రుఁడగు సూతుఁడే యష్టాదశపురాణములను మహర్షులకెల్లఁ జెప్పియుండలేదా? విదురుఁడు సంజయుఁడు మున్నగువారు సంస్కృతభాషామాత్రమునె చదువలేదనుట యెంతవెఱ్ఱితనము! ఎందఱెందఱు స్త్రీలు విద్యావతులయి పురాణాదులలోఁ బేరెక్కి యుండలేదు? వసుచరిత్రమను ప్రబంధరాజమును

రచించి విజయనగర సామ్రాజ్యధురంధరుఁడగు రామరాజు సభకలంకార భూతుఁడై రామరాజభూషణుఁడను బిరుదనామమునఁ బ్రసిద్ధికెక్కిన సకల పండితసమ్మానితుఁ డగుచున్న భట్టుమూర్తికిఁగాని యాతని కృతులకుఁగాని యేమి కొఱంత గలదు? అనవేమారెడ్డి మున్నగు శూద్రరాజు లెందఱు మహావిద్వాంసులయి పండితస్తోత్రపాత్రులై ప్రసిద్ధి కెక్కియుండలేదు?

పయిరీతి నీ సందర్భమున బాలసరస్వత్యప్పకవ్యహోబల పండితులు వ్రాసిన విపులమగునేతద్విషయక విమర్శనమెల్ల మిక్కిలి యయుక్తమై యుండుటంజేసి యట్టివిషయముల నిట విస్తరించి పమర్శింపనేల యని యుపేక్షించితిని. నాగరకత బలసిన నేఁటికాలమున నట్టి విమర్శనముల కించుకేని యావశ్యకతయు నుండనేరదని నా నమ్మకము.

(౨౦) ఈ సందర్భమున నహోబలపతి మఱొక వింతప్రసంగమును జేసియున్నాఁడు. దేశభాషలలోఁ బ్రాకృతమును, నాంధ్రమును, దత్సమ తద్భవరూప సంస్కృతసంబంధము గలవగుటంజేసి హేయములు కావనియుఁ దక్కిన యన్యదేశ్యము లిట్టివి కానేరవనియు, నందును దమిళభాషకు సంస్కృతానుసారిత్వమే లేదనియు, వింతగ వ్రాసెను.

"తత్రాపి ప్రాకృతాన్ధ్రియో ర్నాన్యదేశభాషావ త్సర్వత్రాప శబ్దత్వే ప్రామాణ్యమ్.

తథాహి. ప్రాకృతభాషా త్రిధా—తత్సమా, తద్భవా, దేశ్యా చేతి. తత్సమ ప్రాకృతస్య వేదవేదాఙ్గరూఢత్వేన వైదికత్వే నామ్లేచ్ఛత్వస్య నిర్వివాదత్వాత్ .......... ...ద్రావిడభాషా అసంస్కృతానుసారిణ్యపి... ........." (అహో ౯౦ - ౯౨ పుట)

ఈ యహోబల పండితప్రసంగ మెంతమాత్రమును సరికాదు. ఆంధ్ర భాషలోవలెనే కర్ణాట మలయాళాదిభాషలలో నెల్ల సంస్కృత సమసంస్కృత భవశబ్దము లనంతముగాఁ జేరియున్నవి. తమిళభాషయందు సైతము సంస్కృత శబ్దములు పెక్కు చేరియుండకపోలేదు. కానఁ దమిళము సంస్కృతానుసారి కాదనుట సత్యము కానేరదు. తమిళవాఙ్మయములోని కెల్ల మొదటిగ్రంథ మైనట్టియు దమిళులచే నత్యంతప్రామాణికముగా నంగీరింపఁబడుచున్న ట్టియు నత్యంత ప్రాచీనమయినట్టియుఁ దొల్కాప్పియమునఁ దత్కర్తయగు తొల్కాప్పియ రీక్రిందిరీతిని జెప్పియున్నారు.

చిం-ఉ, సిద్ధి ర్లోకా ద్దృశ్యా, లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ
సంస్కారార్థో నియమో, ఽనియమా ద్గామ్యంహి యత్త్వపభ్రంశః॥

---

"ఇయఱ్ చొల్, తిరిచొల్, దిశైచ్చొల్, వడచొల్, ఎన్ఱనైత్తె చెయ్యుళ్ ఈట్టచొల్లే" (౧ సూ. ఎచ్చఇయల్=ప్రకీర్ణప్రకరణము.)

చెయ్యుళ్ = కావ్యములలో, ఈట్ట = చేర్పదగిన, చొల్ = శబ్దములు — ఇయఱ్ చొల్ = జనసాధారణ శబ్దములు, తిరిచొల్ = మాఱు మూలశబ్దములు, దిశైచ్చొల్ = అన్య దేశ్యశబ్దములు, వడచొల్ = ఉత్తర దేశ శబ్దములనఁగా సంస్కృ శబ్దములు, ఎన్ఱు+అనై = అనునవియె.

"వడచొఱ్ కిళవి వడవె ఱుత్తొరీఇ ఎఱుత్తొడు పుణర్న్దచొల్లాగుమ్మే" (5, ఎచ్చఇయల్ = ప్రకీర్ణప్రకరణము.)

వడచొఱ్ కిళవి = సంస్కృత భాషాశబ్దములు, వడఎఱుత్తు = సంస్కృతమునందేకల యక్షరములును, ఒరీఇ = (విడిచి) మానివేసి, ఎఱుత్తొడు = తమిళ సంస్కృతములనెడి రెండు భాషలలోను గలయక్షరములతో, పుణర్న్ద = చేరిన, చొల్లాగుమ్మే = శబ్దములగును. ఉదా:- అన్తమ్ = (తుది) అమలమ్, కమలమ్, మొ.

"చిదైన్దన వరినుమ్ ఇయైన్దన వరైయార్" (ఓ-సూ ఎచ్చఇయల్ = ప్రకీర్ణప్రకరణము.)

చిదైన్దన = వైకృతములైన శబ్దములు' వరినుమ్ = వచ్చినపుడు, ఇయైన్దన = తమిళమున కనుకూలములైన శబ్దములనె, వరైయార్ = (విడువరు) గ్రహింతురు. ఉదా:—దశమ్ = (పది) తచమ్.

(౨౧) వ్యా:—సిద్ధి ర్లోకా దిత్యాది.

సిద్ధిః = ఆంధ్రసాధు శబ్దముల సిద్ధి (నిష్పత్తి)
లోకాత్ = పండితలోక వ్యవహారమువల
దృశ్యా = గ్రహింపఁ దగినది.
అనన్యాదృశః = వేఱువిధముకానిదనఁగా నేకరూపమున నుండునదియు
నిత్యశ్చ = చాలవఱకు స్థిరపడినదియు నగు లోకవ్యవహారమే యని
లోకః=మీఁది సూత్రములోఁ జేర్కొనఁబడిన లోకశబ్దముచే గ్రహింపనగును.

నియమః = వ్యాకరణము.

సంస్కారార్థః = అట్టి లోకవ్యవహారమునుబట్టియుఁ దత్తత్కాలికపండితాదరమునుబట్టియు సాధుశబ్దముల నెన్ని సాధించుట స్వరూపముగాఁ గల సంస్కారమే ప్రయోజనముగాఁ గలది.

యత్తు = ఎట్టిది

అపభ్రంశః = అపభ్రంశమని (మహాభాష్యములో) పేర్కొనఁబడెనో

తత్ = అట్టి

గ్రామ్యమ్ = గ్రామ్యభాష

అనియమాత్ = పైని వ్రాసిన లక్షణముగల వ్యాకరణము లేక పోవుట వలన.

భవతిహి = సంభవించునుగదా. సామాన్యుల కావ్యములలోఁ బ్రవేశించునుగదా.

"వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయ ప్రకృతి భావలక్షణ స్సంస్కారః" అను కాత్యాయన ప్రాతిశాఖ్యవచనమును జూపుచు "సంస్కారము శబ్దముల నాశ్రయించి యుండునది. అనఁగా వాడుకలో వర్ణలోప. వర్ణాగమాదులచేఁ గలుగు మార్పులే సంస్కార శబ్దమునఁ జెప్పబడును. ఇందు కొక యుదాహరణము:— 'వచ్చినవాఁడను' అనుశబ్దము 'వచ్చిననాఁడను వచ్చినాను. వచ్చాను' అనువిధముగా మాఱినది. ఇందలిమార్పే సంస్కార మనఁబడును" అనియిట్లు వ్రాయుచు గొందఱాధునికులు "సంస్కారార్థోనియమ" యనుసూత్రము సందర్భమునఁ బయి కాత్యాయనకృతార్థమును సమన్వయింపఁ జూతురు. ఈ యర్థ మీసూత్రసందర్భమున నెట్లుపొసఁగునో తెలియకున్నది.

'సంస్కారార్థో నియమ' యనుచోఁ బూన వ్యాకరణము మార్పుల నిమిత్తమనుట సరియా? వ్యాకరణము భాషకు మార్పులను జేయదుగదా! అయ్యవి లోకవ్యవహారమువలన సంభవించును. మఱియు సాధువులు నసాధువులు నగు మార్పులనెల్ల వ్యాకరణము సాధింపదు. కేవల సాధువులగు లోకసిద్ధములగు మార్పులను మాత్రమే సాధించును.

నన్నయభట్టారకుని నాఁటికిఁ గావ్యవాఙ్మయ మాంధ్రమున లేకుండుటంజేసి యచ్చాంధ్రశబ్దసిద్ధియు సంస్కృతసమశబ్దసిద్ధియుఁ జాలవఱకుఁ బండితలోక వ్యవహారముననే గ్రహింపఁబడెనని యెన్నవలెను. మండలభేదములను బట్టియు నాయా పండితుల జ్ఞానభేదములనుబట్టియు నపండితలోక వ్యవహార

సంసర్గమునుబట్టియుఁ బండిత వ్యవహారము సైతము వివిధముగా నుండును. మఱియు వ్యావహారికభాష దఱుచుగ స్వభావసిద్ధమగుమార్పు నందుచుండును. కావున నట్టి పండితలోకవ్యవహారములలోఁ జాలవఱ కేకరూపముగ నుండి కొంత స్థిరపడి నిల్చినట్టి పండితవ్యవహారమే గ్రాహ్యమగును. అట్టి గ్రాహ్యమగు పండితవ్యవహారమునుబట్టియుఁ దత్తత్కాలిక పండితాదరమునుబట్టియు సుశబ్దాపశబ్దములను విభాగించి యందు సాధుశబ్దముల రూపసాధన ప్రక్రియనుమాత్రము (వాఙ్మయారంభదశలోని) వ్యాకరణము చూపును. అట్టి వ్యాకరణ సంస్కారము లేనపుడు సామాన్యకవు లట్టి విభాగము చేసికొనలేక గ్రామ్యము లనఁదగు నపశబ్దములను బ్రయోగించుట సంభవించును. మహాకవులును వ్యాకరణ కర్తలవంటి వారే కాన నట్టివారి వాఙ్మయము వెలసినకొలఁది నట్టివాఙ్మయములోని యా యామహాకవి ప్రయోగములును నాదర్శములై యుండును; కాని యట్టి వాఙ్మయమును సయితము సాకల్యముగా సామాన్యులు పరిశీలింపఁ జాలరుగాన వాఙ్మయము వెలసినతర్వాత సైత మసాధారణజ్ఞాన సంపన్నుఁడు చేసిన వ్యాకరణముండుట యావశ్యకమె యని గ్రహింపవలెను. నన్నయ భట్టారకుని నాఁటికే కావ్యవాఙ్మయము వెలసియుండినచో నద్దానినుండియు సాధుశబ్దసిద్ధియగునని యాతఁడు చెప్పి యుండునుగదా.

(౨౨) "అట్లయిన సంస్కృత వ్యాకరణ మహాభాష్యములో సైతము శబ్దసిద్ధి లోకము వలనఁ గల్గునని చెప్పనేల యని శంకింపవలదు. పాణినీయములోని లౌకిక శబ్దానుశాసన భాగముసైతము వైదిక కర్మోపయోగి శిష్టవ్యవహార భాషను మాత్రమె మూలముగాఁ జేసికొని రచింపఁబడినదిగాని యావఱకున్న సంస్కృత వాఙ్మయమును మూలముగఁ జేసికొని రచింపఁ బడియుండలేదు. (చింతామణివిషయ పరిశోధనము. 20-80- విష.) అందలి వైదిక శబ్దానుశాసన భాగము మాత్రము వేదభాష నాధారముగఁ గొనియే సాధింపఁబడినది. కావుననే మహాభాష్యకర్త "సిద్ధే శబ్దార్థసంబంధే లోకతః" అనియు "వేదాన్నో వైదికా స్సిద్ధాః, లోకాచ్చ లౌకికాః" అనియుఁ జెప్పియున్నాఁడు. పాణినీయము పుట్టిననాఁటికి సంస్కృత రామాయణాది కావ్యవాఙ్మయ మున్నను నద్దానిని మూలముగా మునిత్రయమువారు గ్రహింపలేదు. వైదికకర్మోపయోగి శిష్టవ్యవహారభాషయే వారిచే మూలముగ గ్రహింపఁబడెను. అట్లే కానిచో వైదికశబ్దములకు వేదమువలెనే లౌకిక శబ్దములకుఁ గావ్యాది

వాఙ్మయము సైతము లోకముతోపాటు మూలమనియైనఁ జెప్పఁబడి యుండదా! అట్లుచెప్పియుండలేదు సరేకదా! కవులభాష ప్రమాణము కాదనియు నీక్రిందిరీతిని మహాభాష్య కర్త నిరసించెను. మఱియు యజ్ఞాదులందు శిష్టులచే వాడఁబడెడి భాషకు మాత్రమే వ్యాకరణనియమము పాటింపవలయు ననియు వైదికకర్మోపయోగి శిష్టవ్యవహారభాషయే వ్యాకరణమునకు మూలమనియుఁ గంఠోక్తముగ నీక్రిందిరీతిని జెప్పియుండెను.

"న తర్హీదానీ మిదం భవతి
యస్మిన్ దశ సహస్రాణి, పుత్త్రే జాతే గవాం దదౌ ।
బ్రాహ్మణేభ్యః ప్రియాఖ్యేభ్యః । సోయ ముఞ్ఛేన జీవతి"

"ఛన్దోవ త్కవయః కుర్వన్తి నహ్యేషా ఇష్టిః" (మహాభాష్యము) "నహ్యేషేతి అసాధవ ఏవైవమాదయః నతు తత్ప్రామాణ్యా త్సాధుత్వ వ్యవస్థా" అని యిట్లు కైయటుఁడు వ్యాఖ్యానముచేసి యున్నాఁడు. (యూస్త్ర్యాఖ్యౌ నదీ (౧అధ్యా. ౪పాద. 3సూ)అనుసూత్రపుభాష్యసందర్భము.చూడుడు.) పై సూత్రములోని 'స్త్ర్యాఖ్యౌ' అను శబ్దపుసాధుత్వము విషయమునఁ జర్చించుచు మహాభాష్యకర్త దానికిఁ బైప్రయోగమును జూపి కవిప్రయోగములనుబట్టి యనుశాసనము చేయుట యిష్టికాదనియుఁ గవులు నిరంకుశముగఁ బ్రయోగించుచుందురనియుఁ జెప్పియున్నాఁడు.

"సమానాయా మర్థావగతౌ శబ్దేన చాపశబ్దేన చ, ధర్మనియమః క్రియతే, శబ్దేనైవార్థోఽభిధేయో నాపశబ్దేనేతి. ఏవం క్రియమాణం కార్య మభ్యుదయకారి భవతీతి......... యదప్యుచ్యతే............నియమఇతి యాజ్ఞేకర్మణి స నియమోఽన్య త్రానియమః......యాజ్ఞే కర్మణిపున ర్నాపభాషన్తే" (మహాభాష్యము ౧అధ్యా౧పాద౧ఆహ్నికము.)

"పృషోదరాదీని యథోపదిష్టమ్(౬అ3పా౧౦౯సూ)*" 'యదితర్హి శిష్టాః శబ్దేషు ప్రమాణం కి మష్టాధ్యాయ్యా క్రియతే. శిష్టపరిజ్ఞానార్థాష్టాధ్యాయీ"

(౬. అధ్యా 3 పాద 3 ఆహ్నికము. మహాభాష్యము.)

పై సందర్భమునుబట్టి పాణినీయమునకు వైదిక కర్మోపయోగి శిష్ట వ్యవహారభాషయె మూలమనియు, సంస్కృత కవులభా  పాణినీయమునకు లొంగ

* పృషోదరప్రకారాణి శిష్టై ర్యథో చ్చారితాని తథైవ సాధూని స్యుః
(భట్టోజీదీక్షితవృత్తి).

వలయుననుట మునిత్రయాభిప్రేతము కాదనియు నెన్నఁదగును. అట్లయినను దర్వాతి వైయాకరణులు మాత్ర మట్లంగీకరింపక గత్యంతరాభావమున, నట్టి పాణినీయమునె కావ్యభాషకును ననుశాసనముగా నేర్పఱుచుచుఁ బ్రాచీనకావ్యాది సంస్కృత వాఙ్మయములో నెచ్చటను ననేకములకుఁ బ్రయోగము లేకున్నను నట్టివ్యాకరణ సాధితరూపముల నెల్ల కావ్యములలోఁ బ్రయోగింపవచ్చుననియుఁ దద్వ్యాకరణమునకు లొంగని ప్రయోగములు కావ్యములలో మహాకవులచేఁ బ్రయుక్తములైయున్నను నవి యసాధువులే యనియుఁ జెప్పుచు 'అపశబ్దం ప్రయుఞ్జానో రౌరవం నరకం వ్రజే' త్తను మొదలగు వాని నట్టికావ్య ప్రయుక్తాపశబ్దముల విషయమున సయితము సమన్వయించుచున్నారు. ఆలంకారికులును నట్టి యపశబ్దములు చ్యుత సంస్కృతములనియు నట్టివానిని గావ్యములందుఁ బ్రయోగింపరాదనియు సిద్ధాంతీకరించుచున్నారు. నవ్యములగు సంస్కృత వ్యాకరణములను రచించువారు సయిత మట్టి పాణినీయమునె తఱుచుగా మూలముగాఁ గొనుచు వచ్చిరే కాని తమ నాఁటికున్న కావ్యభాష కన్యూనానతిరిక్తముగ సాధుత్వమును సూత్రింపఁ గడంగరైరి.

(౨౩) ఆంధ్రవ్యాకరణములకు సంస్కృత వ్యాకరణమే చాలవఱ కాదర్శమై యుండుటచేత నాధునికాంధ్ర వైయాకరణులు సైత మట్టి సంస్కృత వైయాకరణుల వలెనె వ్యాకరణములకు లొంగని మహాకవి ప్రయోగములను సైత మపప్రయోగములనుచు నిరాకరించుచున్నారు.

"పనిఁ గొంట నీకుఁ బ్రాభవము కాదె" ఇత్యాది శ్రీనాథవచనస్య ప్రామాదికత్వ మేవేత్యవధేయమ్. (అహో ౪౯౯ పుట.)

"సుతులఁ గనియెడుకొఱకు, నీవు ఘటించుకంటె, ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాది వచనాం కిం మూలమితి వయం న విద్మః" (అహో ౫౦౦ పుట) అనియిట్లించుకేని సందేహింపక యహోబలపతి వ్రాసియున్నాఁడు.

కం॥ విరచించెను శ్రీ నాథుఁడు । ధరణిని శృంగార నైషధంబునఁ గూర్చుం ।
డిరి యొండురు నని కానక । పరపురుష క్రియలఁ బ్రకృతిభావము కలదే॥

(అప్పకవీయము ౪ ఆ.)

అని యిట్లప్పకవియు శ్రీనాథమహాకవి కజ్ఞత నాపాదించినాఁడు.

ఇట్లే యాధునికులు ఛందోయతిప్రాసయమకశ్లేషాది ప్రతిబంధమున మహాకవులచేతఁ గావ్యములలోఁ బ్రయోగింపఁబడినను లక్షణవిరుద్ధములు

సాధువులు కానేరవని వాదించుటయుఁ గలదు. మహాకవులని చెప్పఁచు వారు ఛందోయతిప్రాసాది నిర్బంధవ్యగ్రులయి యపశబ్దములను బ్రయోగించి రనుట కేవలము పరిహాసనీయమై యున్నది. ఛందోయతిప్రాసాదుల నిర్బంధమున సైతము వారు తమకు సాధువులని తోఁచినశబ్దములనే ప్రయోగింతురు. అసాధుశబ్దముల నెంతమాత్రమును బ్రయోగింపరు. వారు, వ్యాకరణ సూత్రములను సవరించుటకుఁగాని తమకునచ్చిన వ్యావహారిక భాషా ప్రయోగములకు సాధుత్వమును బ్రసాదించుటకుఁగాని సమ్మతించియే బుద్ధిపూర్వకముగనే యట్టి ప్రయోగముల నట్టిమార్పరాని స్థలములందుఁ బ్రయోగించుచు వచ్చిరనుట యెంతయు యుక్తము. అట్లే కానిచో వారిని మహాకవుల నుటయే యసంగతము. కాఁగా మహాకవుల కావ్యములందుఁ గవిప్రయుక్తములని విశ్వసింపక తీరని—అనఁగా ఛందోయతి ప్రాసశ్లేషయమకాదుల నియమమున మార్పరానిరీతిగ నిబద్ధములై—యున్న ప్రయోగములను బ్రామాణికములుగ నంగీకరించి వాని ప్రక్రియను జూపు సూత్రములను వ్యాకరణములలో జేర్చుటయె యుక్తము. తత్తత్కాలిక ప్రామాణికులు చేయుచున్న పనియు నదియె. అట్లైకానిచో లేఖకాదికృత ప్రమాదములును గవిప్రయుక్తములేమోయను సందేహము దుర్నివారమె యగును.

(౨౮) ప్రాచీనులగు నన్నయాథర్వణులు మాత్రము పైయాధునికులవలెఁ గాక మహాకవిప్రయోగములకే పరమప్రామాణ్యము నంగీకరించువారు. నన్నయభట్టారకునినాఁటికిఁ గావ్యవాఙ్మయము లేకున్నను 'అన్యేషాంచ ప్రయోగ మహితానామ్'అనునది మొదలగు సూత్రములచేత సమకాలిక భావి మహాకవి ప్రయోగములకే ప్రామాణ్యము నంగీకరించి యుండెను. ఇంక నథర్వణాచార్యుఁడన్ననో స్పష్టముగా మహాకవి ప్రయోగములకే ప్రామాణ్యము నంగీకరించుచుఁ దనగ్రంథమును నడపియున్నాఁడు. అప్పకవ్యహోబలపతుల వలె నెచ్చటను నాతఁడు మహాకవిప్రయోగములను నిరాకరించియుండలేదు. మఱియు మహాకవి ప్రయోగములే వ్యాకరణమునకు మూలమని పెక్కుచోట్ల నీక్రిందిరీతిగ గంఠోక్తముగఁ జెప్పియున్నాఁడు.

"వికృత్యాదిగతో యోఽత్ర స్యా చ్ఛబ్దాన్తరయోగతః
ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవి సమ్మతేః"

"పినానుకరణం కేచి, దాద్యశబ్దం ప్రయుఞ్జతే"

"స్యా ద్వర్ణస్య వ్యత్యయశ్చ, కుత్రచి త్కవి సమ్మతః"

"భాషేయ మమితా తత్ర, దేశ్యా చిత్రస్వభావయుక్
తచ్చిత్రతానుమన్తవ్యా, పూజ్యపాద సుభాషితే"
ఇట్టివి పెక్కుస్థలములు గలవు. విస్తర భీతి నుదాహరింపలేదు.

కం॥ మున్ను తెనుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁజెప్పెద వి।
ద్వన్నికరము మది మెచ్చఁగ, నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్॥

అని యిట్లాంధ్ర భాషాభూషణకర్త యగు కేతనామాత్యుఁడును (౧౨౫౦ క్రీ.శ.) జెప్పియున్నాఁడు.

(౨౫) అట్లయిన నీక్రింది యథర్వణకారిక యెట్లు పొసఁగునని శంకింపరాదు.

"శాస్త్రప్రయోగవచసో । శ్శాస్త్రం బలవ దుచ్యతే ।
అనిష్పన్నే పదే తేన । ప్రయోగాశ్రయణం హితమ్"

ఇయ్యది యచ్చాంధ్రశబ్ద విషయమునఁ గాని సంస్కృత సమముల లోని యాంధ్రవిభక్తియోజన ప్రక్రియ విషయమునఁగాని చెప్పఁబడియుండ లేదు. వెనుక వ్రాసిన రీతిని మహాకవి ప్రయోగములకుఁ బ్రామాణ్యము నిచ్చినయథర్వణుని నట్టియసంగతి పొల్పుఱుచుట యుక్తముకాదుగదా. మఱి యుఁగవిప్రయోగమూలక మగు వ్యాకరణమునకుఁ బ్రయోగముల కన్నఁ బ్రామాణ్యము గలదని యున్మత్తుఁడైనఁ జెప్పియుండఁడుగదా. పరిశీలింపఁగా బయిరీతి నీ శ్లోకము సంస్కృత శబ్దముల విషయమున మాత్రమే చెప్పఁబడె ననుటకు సందేహములేదు. ప్రయోగములకన్న శాస్త్రమునకుఁ బ్రామాణ్యము నొసంగుట వెనుక వ్రాసిన రీతిని లక్ష్యైకచక్షుష్కులగు నాధునిక సంస్కృత వైయాకరణుల సిద్ధాంత మగుటచేతను నట్టి సంస్కృతమునుండి తెనుఁగులోనికిఁ దెచ్చుకొనుచున్న సంస్కృతశబ్దముల విషయమున నట్టి సిద్ధాంతమును బాటింపక తీరకుండుటచేతను దద్విషయమునఁ బైరీతి నథర్వణుఁడు చెప్పవలసి వచ్చెనని గ్రహింపవలసియున్నది. ఈ విషయమును గ్రహింపఁ జాలక "కఅకంతాది శబ్దముల ప్రయోగ ప్రామాణ్యమును బైకారిక యుపదేశించుచున్నద"ని గుప్తార్థ ప్రకాశికాకారుఁడు వ్రాయుట (సంజ్ఞ. సూ. ౨౩- బాలవ్యా.గు.ప్ర.) యసంగతమనక తీరదు.

సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనునపుడు సంస్కృత వాఙ్మయములోఁ బ్రచురప్రయుక్తము లగుచున్నవానిని మాత్రమే తెచ్చి

కొని వాడుకొనవలెనని విరళేత్యాది సూత్రముచేఁ జింతామణి కర్త నియమించినను దర్వాతి మహాకవు లట్టి నియమములో నిలువక "వ్యుత్పన్న మితి గౌడీయై, ర్నాతిరూఢ మపీష్యతే" అను నాచార్యదండి వచనము చొప్పున గౌడీమార్గానుయాయులై, విరళప్రయుక్త శబ్దములనే కాక యప్రయుక్తశబ్దములను సయితము ప్రయోగించుచు వచ్చుటంజేసి తత్ప్రయోగ ప్రామాణ్యమున సంస్కృతవ్యాకరణ సాధువు లగునపుడు విరళప్రయుక్తములైనను దుది కప్రయుక్తములైనను సంస్కృతశబ్దములు దెలుఁగున నిర్దుష్టములె యగుచున్నవనియు నింకను సంస్కృత సంప్రదాయముచొప్పున, సంస్కృత శబ్దమువిషయమున శాస్త్రప్రయోగములకు విరోధము వచ్చునపుడు సంస్కృత వ్యాకరణశాస్త్రమునకే ప్రామాణ్యము నొసంగవలెననియు నిట్లు సుసంగతముగా నధర్వణుఁడు విరాళ్యాత్యాదియగు పై చింతామణి నియమమును 'సర్వే శబ్దా' ఇత్యాదిసూత్రముతోను "శాస్త్రప్రయోగవచసో" రిత్యాది సూత్రముతోను సవరించియున్నాఁడు అట్టి నన్నయాధర్వణుల యభిప్రాయములను గ్రహింపఁజాలక యహోబల పండితాదులు పై సూత్రముల నాంధ్రశబ్ద సామాన్యపరములుగ నన్వయించి వాని కచ్చాంధ్రశబ్దముల నుదాహరించి యాంధ్రవ్యాకరణములకు సయితము మహాకవి ప్రయోగములకన్న నధిక ప్రామాణ్యము నంగీకరించి వానికిని నిరంకుశాధికార మొసంగుట యెంతయు శోచనీయమై యున్నది. (౨౩-విషయము.)

(౨౬) పయి సందర్భమునుబట్టి కవిప్రయోగములకుఁ బరమప్రామాణ్యము నంగీకరించుచున్న నన్నయాధర్వణీయగ్రంథము ప్రయోజనశూన్యమగుచున్న దని శంకింపఁ జనదు. నన్నయభట్టు స్వసమకాలిక పండితలోకవ్యవహారమును నధర్వణాచార్యుఁడు తనకు లభించిన మహాకవిప్రయోగములను, ప్రయోగములు లభింపని విషయములలో స్వ సమకాలిక పండితలోకవ్యవహారమును బాగుగఁ బరిశీలించి సుశబ్దముల నేర్చి, వాని ప్రక్రియను సూత్రించియుండుటచేత నట్టి లోకవ్యవహార మహాకవిప్రయోగమూలకమగు వారి వ్యాకరణము మహాకవిప్రయోగములకు బాధకము కాఁజాలదు. (మహాకవులను నిర్ణయించుటకు నైయాకరణలోకమే ప్రమాణము). మఱియు నసాధారణపాండిత్యశాలికృత్యమగుటచే దుష్కరమగు భాషావాఙ్మయ దీర్ఘవిమర్శన పరిశ్రమము చేయఁజాలనట్టియు భాషాపాండిత్యమును సంపాదింపఁ గోరునట్టియు నభ్యాసకులకు విశాలమగు భాషాస్వరూపమును నిష్కం

శయముగఁ జూపుటకును, నుత్తరోత్తర వ్యవహారమున నశించుటచే నవేద్యములగు ప్రాచీనపండితవ్యవహారములను సంరక్షించి యుత్తరోత్తరు లకు గోచరింపఁ జేయుటకును, లోకవ్యవహార మహాకవిప్రయోగములను బరిశీలించి సాధుశబ్దము నేర్చుటలోను వానియందుఁ గల యనుగమములను గ్రహించుటలోను జూపవలసిన బుద్ధివికాసమును బ్రసాదించుటకును నట్టి దీర్ఘవిమర్శనము చేయఁజాలని సామాన్యకవుల కావ్యములలో నపశబ్దములు నిలిచిపోకుండ వారించుటకును, వారి వ్యాకరణము పరమోపకారకమగుచు సప్రయోజన మగుచున్నదని గ్రహింపవలెను. కాఁగాఁ బ్రాంచీనపండితలోక సాధువ్యవహార మహాకవిప్రయోగమూలకమగు వ్యాకరణమునకు విరుద్ధము లగు సామాన్యకవుల ప్రయోగములును నసాధు వ్యవహారమును దుష్టము లని నిర్ణయించుటయం దాంధ్రవ్యాకరణముల కధికారముగలదని సిద్ధాంతిత మగుచున్నది.

(౨౮) నన్నయభట్టారకుఁడు కావ్యభాషకే సలక్షణతాసంపత్తి యుండ వలెనని తలంచియున్నను దర్వాతివా రాంధ్రవాఙ్మయమెల్లఁ గావ్యభాష తోనే యుండవలెనని సిద్ధాంతము చేసిరని యీవఱకు విపులముగఁ జర్చిం చి చూపియే యున్నాను (౧౦ విష.)

అనద్యతనాంధ్రవాఙ్మయమునందలి కావ్యేతర పద్యవాఙ్మయము సైతము కావ్యభాషతోనే రచింపఁబడి యున్నదనుటలో నెవ్వరును విప్రతి పన్నులుకాఁజాలరు. ఆంధ్రగద్యవాఙ్మయమునందు భారతాది గద్యపద్యాత్మక కావ్యములలోని గద్యములు తక్కిన గద్యములకన్నఁ గావ్యభాషకు సన్నిహి తముగాఁ దాళపత్రమాతృకలలో నగపడుచున్నవి. మొత్తముమీఁదఁ గావ్యే తరములగు నాంధ్రగద్య గ్రంథములు పెక్కుసాక్ష్యలముగాఁ గావ్యభాషతోఁ దాళపత్ర మాతృకలలో నగపడనిమాట నిజమే. కాని యొక గ్రంథమున కనేక తాళపత్రమాతృకలు లభించునపుడు వానియందుఁగొంత వ్యావహారిక భాష యున్నను నొకదానిలోనున్న రీతి వేఱొకదానిలో నుండదు. దీనినిబట్టి యవి మొదట గ్రంథకర్తచేత సలక్షణభాషతోనే వ్రాయఁబడియుండఁగాఁ దర్వాతి లేఖక పరంపరవల్ల నట్లు వివిధ వ్యావహారిక శబ్దములు చేరెనని తోఁచును. కాన తాళపత్రమాతృకలుమాత్రము యథాస్థితముగాఁ బ్రమాణీకరింపఁ బడఁ జాలవు. తఱుచుగ వానిలోని పద్యములందు సైతము నర్ధానుస్వార శకట రేఫ సరళా దేశములు పాటింపఁబడియే యుండలేదు. "బ్రంహ్మాండాది, వయ్యాకర

ణులు,గరియ్యా, సంహ్వాతి, శేనాపతి, పాత్రుడు, కరుణతోడా,చెరిత్ర, నాయడ" మున్నగు తప్పులకు మేరయే లేదు. పద్యాంత వ్యంజన నకారము 'ను' అనియు 'నూ' అనియు వ్రాయఁబడును. ఇంకను ననేకవిధములగు తప్పులు కుప్పలై యుండును. ఇంకను నర్ధానుస్వార లేఖనమునకై యేర్పడిన పద్ధతిచొప్పున వ్రాయఁబడిన లేనిపోని ద్విత్వములు నియమశూన్యముగా వ్యాపించియుండును. ఏ తాళపత్ర మాతృకయైనను రెండుమూఁడువందల యేండ్ల క్రిందటి కాలము కన్నఁ బ్రాచీనమనుటకు వలనుపడకుండుటచేతనుఁ జింతామణిమాట యటుండ నాంధ్రభూషాభూషణాదుల చొప్పునను నట్టివెల్లఁ దప్పులే యనకతీరకుండుట చేతను నట్టివి కవికృతములు కావనియు లేఖకపరంపరాకృతములనియు వానిని వ్యాకరణానుసారముగా సవరింపక తీరదనియు నెవ్వరైన నంగీకరింపక తప్పదు. అట్లు సవరించుటలోఁ గొన్నిటిని సవరించి వ్యావహారిక పదములను గొన్నిటిని విడుచుట సరికాదుగదా! ఇస్త్రిని, చూసేరు, మోసేటివారు చేసువారు, తెచ్చుతారు మున్నగుజాతుల వ్యావహారికపదములు గ్రామ్యములని ౧౨౭౦ (క్రీ. శ) ప్రాంతము వాఁడగు కేతనామాత్యుఁడు చెప్పియుండుటచే నప్పటికే యవి వ్యావహారికభాషలో నున్నవని స్పష్టపడుచున్నది. అట్టి జాతులపదము లకు మచ్చునకైనఁ బ్రాచీనమును మార్పరానిదియు నగు పద్యవాఙ్మయ ప్రయోగము లేకుండుటయే వానియందలి ప్రాచీన కవుల యనాదరమునకుఁ బ్రబలసాక్ష్యము కానోపును. "ఆ.వె॥ అందులోన గ్రామ్యమనఁగ నెవ్వరు నొప్ప। రొరులఁ దెగడు చోట నొప్పు నదియు" అనెడి కేతనామాత్యుని సూక్తి చొప్పునఁ దిట్టుకవిత్వములోను 'గ్రామ్యం తత్ర ద్విధా' అను నథ ర్వణకారిక చొప్పున నాయా పాత్రముల సంభాషణములోను మాత్ర మె గ్రామ్యమునకుఁ బ్రయోగార్హత ప్రాచీనులచే నంగీకరింపఁ బడినట్లు స్పష్టపడుచుండఁగా నద్దానిని వారు వ్యాకరణకోశ వ్యాఖ్యానాద్యుత్తమ గ్రంథములను రచించునపుడు బుద్ధిపూర్వకముగా నుపయోగించిరనుట విశ్వస నీయమై యుండదుగదా. ఎన్నివిధముల నాలోచించినను బ్రాచీనులు వ్యావ హారికభాషతో గ్రంథములు వ్రాసిరనుట సత్యముకాదనియే తోఁచు చున్నది. సంస్కృతభాషలోఁ గావ్యేతరములగు వైద్య వ్యాఖ్యాకోశ వ్యాకర ణాదులగు గద్యపద్యగ్రంథములు కావ్యభాషతోనే వెలసియుండుటను బట్టి యాంధ్రపండితులును నట్టిమార్గమునే యవలంబించిరా యని యాలోచింప వలసియున్నది. అయినను నీవిషయమున సంస్కృతభాష నాదర్శముగ గ్రహిం చుట సరియైయుండఁబోదు. ఆంధ్రమున గ్రామ్య మనఁబడుచున్న భాష

శిష్టపండితకవివ్యవహారములో నున్నట్లు సంస్కృతమున నుండెడిదనుటకుఁ బ్రమాణము లేదుగదా. మహాభాష్యకర్త యపభ్రష్టములని చెప్పిన గావీ గోణ్యాదిశబ్దములు ప్రాకృతములలో నుండుటంబట్టి యట్టివి వ్యావహారికములై యుండవన్న నవి కావ్యరచనాయోగ్యములయి ప్రత్యేకముగ భాషలోని పదములై యున్నవిగాని యాంధ్రగ్రామ్యములవలె నగ్రాంథికములై యుండలేదు. వేయేల! తుదికిఁ దెలుఁగునఁ గావ్యభాషతో గ్రంథరచనము చేయఁజాలని నేటివారుసైత మట్టికావ్యభాషతోనే గ్రంథరచనము చేయఁ గడంగుచు ననేక స్ఖాలిత్యముల పాలగుచున్నారు గాని వ్యావహారిక భాషతో గ్రంథరచనము చేయుట కంగీకరింపఁ జాలకున్నారు. అట్టి దోషభూయిష్ఠగ్రంథములె కేవల వ్యావహారిక భాషతో వ్రాయఁబడిన గ్రంథముల కన్న మేలని విద్యాశాఖలవా రంగీకరించుచున్నారు.

(౨౮) పరిశీలింపఁగానిప్పటి దేశస్థితినిబట్టి కన్నడమునువలెనె యాంధ్రమును నయితము ప్రాచీనాంధ్రము నవీనాంధ్రము నని రెండువిధములుగా విభాగించికొనుట యావశ్యకమై యున్నట్లగపడుచున్నది. నేటి పండితవ్యవహారస్థభాషను గ్రాంథికముగాఁ జేయఁదలంచుట యుక్తమేయైనను నయ్యది ప్రాచీన కవులచేతనే గ్రాంథికభాషగ నంగీకరింపఁ బడినదని వాదించుట మాత్రము యుక్తమై యుండలేదు. తత్తత్కాలిక పండితాదరమె తత్తత్కాలిక వ్యావహారిక భాషల యోగ్యతకు మూలమైయుండునుగాన నద్యతనపండితులు తమ వ్యవహారములోనున్న భాషను సంస్కరించి (దానిని) గ్రాంథికముగ నంగీకరించునపుడును, దాని నద్యతనకవులు గ్రంథములలో వాడునప్పుడును, నద్దానికి దోషశంకయే లేదనుటకు సందేహములేదు. ప్రకృతమునఁ బాశ్చాత్య విజ్ఞానము తెనుఁగులోనికి రావలెనన్నపుడును, నట్టి విజ్ఞానముగలవారు కావ్య భాషతో గ్రంథములు వ్రాయఁజాలనపుడును, గ్రాంథికభాషకన్న వ్యావహారికభాష సుబోధమగునపుడును, బండిత వ్యవహారస్థాంధ్రభాషను గ్రాంథిక భాషగా నెల్లవారును నంగీకరించి తీరవలెనుగదా. కాని యీవఱకిట్టివారు వ్రాయుచున్న పద్ధతిని నియమశూన్యముగా వ్రాయుట పరిహాసనీయము. అట్టిరచనతోడి గ్రంథము వాఙ్మయములోనికిఁ జేరనేరదు. కాన నన్నయ కాలమునందువలెనే నేఁడును నాంధ్రపండితులు సంఘముగ నేర్పడి కొన్ని సుగమములగు నియమముల నేర్పఱచి వ్యావహారికాంధ్రమును సంస్కరించుటయు నట్టి నియమములతో నొప్పెడి వ్యావహారిక భాషతో వారు గ్రంథరచ

నము చేయఁబూనుటయు యుక్తమని నా యభిప్రాయము. అట్టి నియమము లను గొన్నిటినిట దిఙ్మాత్రముగాఁ జూపెదను.

I. వ్యవహారభ్రష్టములగు నర్ధానుస్వార శకటరేఫముల నుపేక్షించుట

II. వ్యవహారమున లేని సరళాదేశాదులను జేయమానుట. "కాబట్టి తెల్లవారెను." మున్నగు చోటులందు మాత్రమె సరళాదేశములను బాటించుట.

III కళాద్రుతప్రకృతి కత్వములతోడి సంధుల నుపేక్షించుట. విసంధిగ నజాదిపదములను యథాస్థితముగనే వ్రాయుట. అట్టియెడలఁ బదాంతద్రుతలోపాదికము (నాచేత అతఁడు మొ.) నంగీకరించుట.

IV. వ్యవహారభాషనుండి యథారుచిగఁ బదములను సమాసపదములను గ్రహించుట. అనేక మంది, మనుషులు, మొ.

V. అన్యదేశ్యపదములకు సరియగు ప్రసిద్ధ సంస్కృతాంధ్ర పదములు దొరకనప్పు డాయన్యదేశ్యపదములనే యాంధ్రసంప్రదాయము చొప్పున ద్విత్వోత్వాదులను జేర్చి వాడుట మొ. రోడ్డు-రైలు మొ.

ఇట్లే ప్రాచీనాంధ్రభాషా స్వరూపము ననఁగాఁ గావ్యభాషాస్వరూపమును వాఙ్మయ విమర్శనమున బాగుగ గ్రహించి యనఁగాఁ దత్తత్కాలిక కావ్యభాషా చరిత్రమును బాగుగాఁ బరిశీలించి తత్తచ్చరిత్రమునకు సరిగ నీవఱకు ముద్రితములగువానిలోని స్ఖాలిత్యములను సవరింపించి ముద్రింపించుటయు నత్యావశ్యకమె యైయున్నది. ఈ విషయమున నన్నయ భారతభాగమునుగూర్చి దిఙ్మాత్రముగఁ జూపెదను.

I. పదాది యకారము నంగీకరించుట.

II. ద్రుతమున కాయాచోటులందు 'న,' స్వరూపమును దొలఁగించుట.

III. "ను" స్వరూపముపై గజడదబాదేశమును జేయకుండుట మొ.

ఆయాకవులు వ్రాసిన వ్యాకరణములకును వారివారి గ్రంథములలోని మార్పరాని ప్రయోగములకును విలక్షణముగా వారివారి గ్రంథముల భాషను దర్వాతి వ్యాకరణమురీతిని సంస్కరించి ముద్రించుట కేవలము నయుక్తము గదా!

(౨౯) ప్రకృత మనుసరింతము:—సిద్ధి ర్లోకాదిత్యాది ప్రకృతసూత్ర మునకు బాలసరస్వత్యప్పకవ్యహోబలపండితులు వేఱువిధముగఁ జేసిన యీ క్రిందిరీతి వ్యాఖ్యానములు సరికావని చెప్పకతీరదు.

“లోకో౽నన్యాదృశశ్చ నిత్యశ్చ” అనుచోట “నెప్పటికిని భాషా కవిత్వములు కలవె యనుట.” అని బాలసరస్వతి వ్రాసియున్నాఁడు. ఈ విషయమునే విస్తరించుచు నహోబల పండితుండును “నిత్యశ్చ=భాషాకవితావత్త్వేన ఆప్రళయం వర్తమానః. తేన లోకా త్సిద్ధి రిత్యర్థః.” అని వ్రాసెను. ఈ సందర్భమున నహోబలపండితుఁ డాంధ్రభాషా కవితా వ్యాకరణములకు, సంస్కృత పండితులు వేదశాస్త్రములకుఁ గల్పించినట్లే “ఆంధ్రభాషా కావ్య నిర్మాణే కవయః ప్రతియుగం ప్రవర్తంతే” (అహో. ౧౦౭ పుట) అను చొప్పున, ననాదిత్వమును శాశ్వతత్వమును గల్పించియున్నాఁడు. ఈ విషయమును జరిత్రాభిజ్ఞు లెవ్వరును నంగీకరింపఁ జాలరుగదా.

(౩౦) మఱియు నిచట నహోబల పండితుఁడు సృష్ట్యాది ప్రళయాంత మగు కాలములో నెప్పుడును నాంధ్రభాషాకావ్యములు వెలయుచునె యున్నవిగాన నట్టి కావ్యములనుండి శబ్దసిద్ధిని గ్రహింపవలయుననియు, నట్టి భాషాకావ్యములనుండి సిద్ధించు శబ్దములలో “వనముకు, రాముకు, జననీ, కన్యా, లోకపాలులు,” మున్నగు నసాధుశబ్దములను నివారించుటకు వ్యాకరణ మావశ్యకమనియు నీక్రిందిరీతిని వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

“నియమో—లక్షణం, సంస్కారార్థః — సంస్కారః —శబ్దసిద్ధి, రర్థః— ప్రయోజనం యస్యస సంస్కారార్థః. వనముకు, రాముకు, ఇత్యాదిప్రయోగే ప్రాప్తే ‘నఃకా’ వితి శాస్త్రేణ నకారవిధానపూర్వకం శబ్ద స్సంస్క్రియతే. తేన, వనమునకు, రామునకు ఇత్యాదిప్రయోగ స్సాధుః, జననీ కన్యేత్యాదీనాం హ్రస్వఏవ సాధుత్వమ్. లోకపాలాది శబ్దానాం ర్వాదేశఏవ జస స్సాధుత్వమ్. ఇత్యేవమాదౌ సంస్కారార్థో నియమః. ప్రత్యయాదేశానాం లోకసిద్ధత్వేపి వ్యవస్థా శాస్త్రేణ క్రియతే. బహ్వర్థస్యాపి సంస్కృతేన సమాసే సంస్కృతపదేన పరిమితమార్థపదం కర్మధారయో భవతీతిశాస్త్రేణ వ్యవస్థా క్రియతే, అన్యథా బహ్వర్థస్య సంస్కృతేన సమాసే సంస్కృతస్యాప్యర్థేణచ సమాసే కో వా నివారయితా భవేత్. అత స్సంస్కారార్థత్వేన నియమ ఆవశ్యక ఇతి సిద్ధమ్...............నవాచ్యం కవిప్రయుక్త మేవపద ప్రయుఞ్జానైః కవిభిరేవ అసాధుప్రయోగః పరిహ్రియతే. ఇతి శాస్త్రస

ప్రయోజన మదృష్ట మితి. క్వచిత్ప్రియుక్తేష్వపి స్ఖలనదర్శనాత్." (అహో ౧౦౪. ౧౦౫. ౧౦౬ పుట)

ఈ యహోబలపతి గ్రంథములోని పూర్వభాగ మీ క్రిందిరీతిని జాల వఱకు బాలసరస్వతీయమును సంబంధించినదే యగుటచేత నద్దానినె యీ తఁడు విస్తరించి చెప్పెనని యెన్న నగును.

"కం॥ హరిముఖ సురపాలులకుం। బరికింపఁగ రాని వెలుఁగు పరమేశమనో।
వరహంససరము సంతత। కరుణ శుభా లొసఁగు శైలకన్యా మాకున్ ॥

ఇందు 'సురపాలులకును, సరము, శుభాలు, శైలకన్యా,' అను నివి యుక్తలక్షణములు కావు కనుక గ్రామ్యములు; ఇవి సలక్షణములైన సౌమ్యములు.

కం॥ హరిముఖ సురపాలురకుం। బరికింపఁగ రానివెలుఁగు పరమేశమనో।
వరహంససరసి సంతత। కరుణ శుభము లొసఁగు శైలకన్యక మాకున్॥

ఇట్లు గ్రామ్య సౌమ్యభేదములు తెలియునది."

పయి సందర్భమునుబట్టి 'సిద్ధి ర్లోకా ద్రుశ్యా' అను సూత్రములోని లోకశబ్దమున కహోబలపండితుఁడు వ్యావహారికలోకము కావ్యలోకము నని వెనుక వ్రాసిన రీతి నర్థముచేసికొని, యందు వ్యావహారికలోకమునుండి కవులు శబ్దముల నెన్నుకొని కావ్యములందుఁ బ్రయోగించుచుందురనియు, నట్టి ప్రయోగములలోని 'వనముకు, లోకపాలులు, కన్యా' మున్నగు స్ఖాలిత్యము లను వ్యాకరణము వారించుచు సాధ్వసాధుతావ్యవస్థను జేయుననియు నభి ప్రాయపడినట్లు విశదమగుచున్నది. ఇందలి చాలభాగము లక్షకైకచక్షు ష్కులగు నాధునిక సంస్కృత వైయాకరణుల సిద్ధాంతముగాన సంస్కృత శబ్దవిషయమున దీనినంగీకరింపక తీరకున్న నంగీకరింపనగునేమో కాని తక్కిన యాంధ్రభాషవిషయమున నట్లు పొసఁగదు. అట్లు మహాకవు లంగీక రించి ప్రయోగించియే యున్నపు డీక వానిని వారించుటలో నాంధ్రవ్యాక రణమున కేమి యధికారముండును? అట్టివ్యవస్థ నిర్మూలము కాదా? నన్న యకుఁ బూర్వకాలమునఁ గావ్యభాషయే లేదు. కవులు ప్రయోగించు టెక్కడ? వ్యాకరణము వారించు టెక్కడ? ఇంతకును 'జననీ, కన్యా' మున్నగు దీర్ఘాంతరూపము లప్పటి వాడుకలో నుండెడివన్నచోఁ గాదని రుజువు చేయలేమేమోగాని యట్టివానిని గవులెవ్వరును బ్రయోగించి యుండలేదు.

ఇంకను నన్నయభట్టు ప్రయోగింపకున్నను నుత్తరోత్తర మహాకవులు ప్రయోగించుటచేత వనముకు మొదలగునవి సాధువులె యని తర్వాతివా రంగీకరించుచునే వచ్చిరి.

కం॥ "కమలాసన నిను నావి । క్రమముకు వెలపెట్టెదేని ... "

(నిర్వ. 2 ఆ.)

కం॥ "రాముని శుభచరితంబును । రామాయణముగ రచించి ప్రాచేతసుకున్"

(భాస్క-రా.)

అని యిట్లు పెక్కు-రు ప్రాచీన మహాకవులు 'వనముకు' అను జాతి రూపములను బ్రయోగించియున్నారు.

"సర్వేషామేవ చోదంత । శబ్దానాం కౌ పరే భవేత్ ,
నః ప్రాయః స్యా దృకారాచ్చ । సర్వపండితసమ్మతేః ॥"

అని యథర్వణాచార్యుఁడు నగాగమము నిత్యము కాదనియుఁ బ్రాయికమనియు సూత్రించి యున్నాఁడు. ఇట్టివాని నెఱుఁగక వీరికిఁ గొన్ని వందల యేండ్ల తర్వాతివారగు బాలసరస్వత్యహోబల పండితులట్టి రూపములు గ్రామ్యములని వ్రాయుట యుక్తము కాదుగదా!

(3౧) అథర్వణుఁడు తన కాలమునకున్న మహాకావ్యములలోని ప్రయోగములకు సాధుత్వమును సూత్రించుచు వచ్చెనే కాని యాతఁ డితరులవలె గ్రామ్యత్వము నంగీకరించి మహాకవి ప్రయుక్తత్వ గౌరవమున దానికి ననింద్య గ్రామ్యత్వ రూపమున సాధుత్వమును సూత్రింపలేదు. సామాన్యముగ నీ యనింద్య గ్రామ్యత్వాంగీకారపద్ధతి సంస్కృత పండితుల దననగును. "మహాకవిప్రయోగత్వా త్సాధుః, కవీనాం నిరంకుశత్వా త్సాధుః" అను నీ రీతి నపశబ్దతను, దానికే సాధుత్వమును, నంగీకరించు సంప్రదాయము సంస్కృతమునఁ గలదు. అద్దాని ననుసరించియే విరళా నిత్యాది సూత్రవ్యాఖ్యానమున బాలసరస్వతి "ప్రయోగ ప్రసిద్ధము గ్రామ్యమైనను యోగ్యమె యని వాగనుశాసనుల వివక్ష" అని వ్రాసియున్నాఁడు. బాలసరస్వతి సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొను విషయమున రచింపఁబడిన సూత్రపు వ్యాఖ్యాన సందర్భమునఁ బైవాక్యము వ్రాసియుండుటచేత నాతఁడు పై సంస్కృత పండితుల సంప్రదాయము చొప్పున సంస్కృత శబ్దముల విషయమున మాత్రమే పై రీతి ననింద్యగ్రామ్యత నంగీకరించెనని చెప్పినను

జెప్పవచ్చునేమో కాని యట్టిదాని కాంధ్రశబ్దముల నుదాహరించిన యప్పక వ్యాదుల విషయమున నట్లుచెప్పుటకు వలనుపడదు.

ఆ. వె. " గ్రామ్యమైన నాంధ్రకవులు సంకేతిత।
సుప్రసిద్ధ మనుచు సూత్రముననను।
గలిమిఁ బూర్వసుకవి కావ్యోక్తములు ప్రసి।
ద్ధంబులైనఁ గూర్పఁ దలఁతు రెపుడు॥ (అప్పక. ౧ ఆ. ౕ౪౨)

అది యెట్లనినఁ గనియె ననవలసిన భూతార్థక్రియాపదైకవచనము నందు వర్ణలోపముచేసి 'కనెనఁట' అని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించిరి." అని యప్పకవి వ్రాసెను. నన్నయ యట్లు ప్రయోగింపనేలేదు. నన్నయభట్టు దేశ్యక్రియల రూపములను సాధింపనే లేదు. ఆతని ప్రయోగము నకు మొదట గ్రామ్యత యెట్లు సంభవించునో తెలియకున్నది. ఇట్లె జుగుప్సా శ్లీల స్ఫోరకమగు 'క్రక్కు' అను నాచ్ఛిక క్రియకు ననింద్యగ్రామ్యత నహోబల పతి యంగీకరించియున్నాఁడు. శబ్దరత్నాకరకోశముసందును బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణములయందును నీ యనింద్య గ్రామ్యత యంగీకరింపఁబడెను. ప్రౌఢవ్యాకరణమున బాలవ్యాకరణోదాహృత గ్రామ్యముల విషయమున మాత్ర మనింద్య గ్రామ్యత ప్రసంగింపఁబడినను దక్కిన విశేష ప్రయోగముల కెల్ల సాధుత్వమే సూత్రింపఁబడెను.

" గ్రామ్యం తత్త్ద్విధా సాధు, కళకంఠముఖా హితాః।"

అను కారికనుబట్టి యథర్వణుఁడును నట్టి యనింద్య గ్రామ్యత నంగీక రించెనని భ్రమింపరాదు.

గ్రామ్యభాషను నీచపాత్రముల భాషణముల ననుకరించునపుడు ప్రయోగించుట—('సూసినా మేలు బాగెము సేసినాము', యయాతిచరిత్రము ౧ ఆ.) యుచితమేయనియుఁ గళకంఠాది శబ్దములన్నోో మహాకవి ప్రయుక్త ములగుటంజేసి వానికి గ్రామ్యతయే లేదుగాన నవి హితములె యనఁగా నగ్రామ్యములె యనియుఁ బై కారిక కర్థము నైన్ననగును.

(౩౨) ఆలంకారికులు గ్రామ్యదోషమును వేఱువిధముగ వర్ణించిరి. వారి మతమున వ్యాకరణదుష్టము, 'చ్యుతసంస్కృతము' 'అపశబ్దము' అని పేర్కొనఁబడెను. అప్రౌఢధోరణి గ్రామ్యముగాఁ జెప్పఁబడెను.

కావ్యాదర్శ కర్తయగు దండ్యాచార్యుఁ డప్రౌఢధోరణిలోనె యశ్లీల దోషమును నంతర్భవింపఁ జేసి చెప్పఁగాఁ దర్వాతివారు వ్రీడా జుగుప్సా మంగళ స్ఫోరకము 'అశ్లీలము' అనియుఁ గేవల పామరోక్తి గ్రామ్యమనియు వాకొనిరి.

"అశ్లీలత్వం వ్రీడాజుగుప్సామంగళ వ్యంజకత్వా త్త్రిధా........"

"గ్రామ్యత్వం యథా 'కటిస్తే హరతే మనః' అత్ర కటిశబ్దో గ్రామ్యః" ॥ (౩౬౮ పుట)

"స్వపిహిత్వం సమీపే మే, స్వపి మ్యేవాధునా ప్రియ; అత్రార్థో గ్రామ్యః" (౪౧౭ పుట) (సాహిత్యదర్పణము ౭ పరిచ్ఛేదము)

కటిగల్లాదిశబ్దములు గ్రామ్యములని దండ్యాచార్యుఁడు చెప్పకున్నను నాతఁడు చెప్పిన గ్రామ్య వివరణమును బట్టి యాతని కట్లు చెప్పుట విరుద్ధముకాదని యెన్నన గును. "శబ్దేఽపి గ్రామ్యతాస్త్యేవ । సా సభ్యేతరకీర్తనాత్ ...... యథా యా భవతః ప్రియా" (యభ మైథునే) అను దండ్యాచార్య ధోరణినిబట్టి యశ్లీలమును గ్రామ్యదోషాంతర్భూతముగ నాతఁడు తలంచెనని యుఁ జెప్పవచ్చును. పై విషయములనె యహోబలపతి యీ క్రింది రీతిని బ్రసంగించి యున్నాఁడు.

"ఆలంకారికాస్తు శబ్దార్థయో ర్గ్రామ్యత్వ మన్యథోచుః. తదుక్తం దణ్డ్యాచార్యేణ...... కన్యే కామయమానం మాం । త్వం న కామయసే కథమ్ । ఇతి గ్రామ్యోఽయ మర్థాత్మా । వైరస్యాయైవ కల్పతే । కామం కన్దర్ప చణ్డాలో । మయి వామాక్షి నిర్దయః । త్వయి నిర్మత్సరో దిష్ట్యే । త్యగ్రామ్యోఽర్థో రసావహః । శబ్దేపి గ్రామ్య తాస్త్యేవ । సా సభ్యేతర కీర్తనాత్ ...... యథా యా భవతః (యభ మైథునే) ప్రియా । ఖరం ప్రహృత్య విక్రాన్తః । పురుషో వీర్యవానితి... .. గల్లాదయ శ్శబ్దా గ్రామ్యా ఇత్యూచుః॥ (అహో ౧౧౭ పుట).

ఆలంకారిక గ్రామ్యత యనిత్యదోషములలోని దగుటచేత నది వ్యవహారవశమున నదోషము నొకప్పుడు గుణము నగుచుండును. భగినీ భగవత్యాది శబ్దములందలి గ్రామ్యత రూపుమాసినదని యాచార్యదండియె "భగినీ భగవత్యాదిః సర్వత్రైవ ప్రయుజ్యతే" అని చెప్పియున్నాఁడు. ఇట్లనిత్య దోషమగు గ్రామ్యతయేకాక నిత్యదోషమగు చ్యుతసంస్కారతయు

మహాకవి ప్రయుక్తత్వమున నదుష్టమయి పోవునదే యనుటకు సందియము లేదు. రెండును నజ్ఞానమువల్లనే సంభవించి క్రమక్రమముగాఁ బండితుల నచ్చికను గాంచి తత్ప్రియుక్తములగుచు నదుష్టము లగుచున్నవి. కావుననె చ్యుతి సంస్కృతికిని గ్రామ్యమను పేరు సమంజసమగుచున్నది.

ప్రాచీన వైయాకరణులుగాని ప్రాచీనాలంకారికులుగాని గ్రామ్యశబ్దమును నపశబ్దపర్యాయముగా వాడినట్లగపడదు. కాని "ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః తద్యథా-గౌరిత్యస్య గావీ, గోణీ, గోతా, గోపోతలికే త్యేవమాదయోఽపభ్రంశాః" (వ్యాకరణ మహాభాష్యము. ౧ అధ్యా, ౧ పాద. ౧ ఆహ్ని).

మహాభాష్యకర్త యపభ్రంశము లని పేర్కొన్న గావీ గోణ్యాది శబ్దములు ప్రాకృతభాషలలో వెలయుచుండుటంజేసియు గీర్వాణశబ్దములను బామరులు వాడుటలో నేర్పడిన యపభ్రష్టములె ప్రాకృతములగుటం జేసియు "పామరాది ప్రయుక్తం య, త్తద్గ్రామ్య మభిధీయతే" అని దండ్యాచార్యుఁడు చెప్పియుండుటం జేసియుఁ బామరోక్తులకు వలెనె వ్యాకరణ దుష్టములకును శిష్టకవి వ్యవహార ప్రవేశమున నదుష్టత యంగీకరింపఁ బడుటం జేసియు గ్రామ్యాపభ్రంశముల కైక్యము నంగీకరించుట యుక్తమని నన్నయ భట్టారకుఁడు తలంచియే "గ్రామ్యంతు యత్త్వపభ్రంశః" అని యిట్లు మహాభాష్యవ్యవహృతాపభ్రంశ శబ్దమును గ్రామ్యశబ్ద పర్యాయముగ వివరించి సూత్రించెనని యెన్న నగును.

అట్లయినను నందలి యప్రౌఢోక్తి రూపమగు నాలంకారిక గ్రామ్యత వ్యాకరణమునందుఁ జెప్పుట యప్రసక్తమని కావలయును నన్నయాథర్వణు లీ గ్రామ్య భేదమును బ్రసంగించుట గాని దీనికిని జ్యుత సంస్కారతా పర్యాయమనఁదగు గ్రామ్యదోషమునకును నైక్యము నుపపాదించుట గాని చేసి యుండలేదని యెన్న నగును. అట్టి వారి యాశయమును గ్రహింపఁ జాలక కావలయును గేతనామాత్యాదులవలెనే యహోబల పత్యాదులును నపభ్రంశరూప గ్రామ్యతాశ్లీలతల కైక్యమును బ్రసంగించుచు వచ్చిరి.

సీ॥ "పంచాకుమయ్యతో పించాకుమయ్యా వాటిదెచ్చు తారు మమ్మాన్న దలంచి
యేగ గొంటూ రమ్ము యేదాలు వోదాలు మోసేటివా రాస నేసువారు॥
.........గద్ద గుద్ద నాఁగ గ్రామ్య మయ్యె. (అం. భా. భూ. ౨౫ ప.)

సీ॥ " బొందలు గుద్దలు బొక్కలు...... సేసేవు లేసిరాకు॥

గీ॥ అనెడు క్రియలును మొదలైనయట్టి గ్రామ్య । శబ్దములు...... "

(కావ్యాలంకార చూడామణి ౯, ఉల్లా. ౨౨)

కవిజనాశ్రయమునందు భీమకవిసైతఁ మపశబ్ద దోషములో నశ్లీలత కంతర్భావము నుదాహరించి యపశబ్ద గ్రామ్య దోషముల రైక్యమును బ్రసంగించియున్నాఁడు. కవిజనాశ్రయ ముద్రణ సంస్కర్తలు దోషాధికారమును సరిగ నర్థముచేసికొనఁజాలక యందలి పద్యములను దార్మాఱుగ ముద్రింపించి ద్వితీయ ముద్రణమునందైన సవరించి యుండలేదు. కాన, వాని వరుసను సరిగ మార్చి యిచట నుదాహార్యభాగము నుదాహరించుచున్నాను. ౧౧—౧౫ పద్యములను ౧౬—౨౦ పద్యములనుగాను ౧౬—౨౦ పద్యములను ౧౧—౧౫ పద్యములనుగాను మార్పవలయును.

క॥ వెలయంగ లక్ష్యలక్షణ । ముల సిద్ధములైన శబ్దములు గాని కుసం ।
ధులు మొదలైన విరూపో । క్తు లెల్ల నపశబ్దనామ దోషము లయ్యెన్ ॥

... ... ... . ...

క॥ నోడువులకు సంధి నెగ్గులు
వోడమిన శ్రుతి దుష్టమయ్యె భూతలమున ని
చ్చెడు నెడ నినుమడి, సిరి యనఁ
బడు నీ చోటులను జుట్టు ప్రావగుఁ గృతులన్ ॥

... ... ... ...

క॥ ఇవి మొదలగు నోడువు లనే .
కవిధ గ్రామ్యోక్తు లెన్ని కల వన్నియు స
త్కవు లపశబ్దములని స
త్కవితల మెచ్చరు కవీంద్రకల్పమహీజా ॥

(కవిజనాశ్రయము - దోషాధికారము)

పయి సందర్భమును బట్టి కవిజనాశ్రయకర్త చ్యుతసంస్కృతికిని నశ్లీల గ్రామ్య (ఆలంకారిక) ములకును నైక్యము నంగీకరించె ననుటలో విప్రతిపత్తి లేదుగదా! నరసభూపాలీయకర్తయు గ్రామ్యశబ్దమును జ్యుతసంస్కారతాపరముగాను నప్రౌఢ ప్రయోగపరముగాను వాడియున్నాఁడు.

క॥ పామరుల భాష గ్రామ్యము
భామిని కటి గల్లములు విభాసిల్లు ననన్
గోమలి చన్నులు కన్నులు
గాముని పండువు లొనర్చెఁ గడువడి ననఁగన్. (౪ ఆ. ౧౦ ప)

కం॥ వ్యాకరణ దుష్టమగు పద
మేకడఁ జ్యుతసంస్కృతాఖ్య మిది యెట్లన్నన్...... (౪ ఆ. ౧౧)

కం. అపగతలక్షణమును గ్రా
మ్యపు సంధియుఁ దగ విసంధియనఁ దగు నరిగె
న్నపరగిరి కినుఁ డనంగా
నృపు లొప్పుదు రధికగుణ వినిద్ర తనంగన్॥ (౪ ఆ. ౨౪ ప).

అప్పకవియు గ్రామ్యదోషము నపశబ్దపరముగనే వివరించి కనులు చెవులు మున్నగు నవి దేశ్యములలో నగ్రామ్యములని చెప్పియున్నాఁడు.

క॥ కవులకు దేశ్యము లోక।
వ్యవహారమువలనఁ దెలియనగు......(౧ ఆ.౧౧౫ ప.)

తే-గీ॥ అవనియందు లోక వ్యవహారమనఁగ।
నాత్మదేశంబులను బెద్దలైనవార।
లాడు భాషావిశేష వాక్యములలోన।
వాడుకకు వచ్చునవి దుగ్ధవార్ధిశయన॥ (౧ ఆ. ౧౧౬ ప)

వ॥ అవి యెయ్యవి యనిన—(౧ ఆ. ౧౧౭)

సీ. మదిరాక్షి చెవులు తొమ్మిది లెక్కలనరాదు
ముద్దియ కనులు తమ్ము లనరాదు............
క్రమత వీనికి వీనులు కన్నుదోయి।............
అనుచు మునువాడి రవియ చే కొనఁగ వలయు. (అప్పం. ౧ ఆ. ౧౧౮)

సంస్కృతాలంకారికు లుదాహరించిన కటిగల్లాది శబ్దములే కాక బట్టుమూర్త్యప్పకవ్యాదు లుదాహరించిన యీ 'చెవులు, కనులు' పదములు సైతము మహాకవిప్రయుక్తములయి యుండుటంజేసి యవి నిర్దుష్టములే యై యున్నవి. కాని నన్నయాథర్వణు లట్టి యాలంకారిక గ్రామ్యతా వివరణమును వ్యాకరణమున వివరించుట యప్రసక్తమని తలంచి యుపేక్షించి యున్నందున నిటఁ దద్విషయమును విస్తరించి వివరింపనయితిని.

అహోబలపండితుఁడు సైతము పైని వ్రాసినరీతి నాలంకారికోక్త గ్రామ్యత వేఱని వెనుక వ్రాసిన రీతి నచ్చటఁ జెప్పినను దుది కీ క్రింది రీతిని వాని నైక్యమునే యంగీకరించి యున్నాఁడు.

"మహాకవిప్రయోగరూఢం చే ద్గ్రామ్యపి ప్రయోగార్హా మిత్యా చార్యతాత్పర్యమితి బాలసరస్వత్యోక్తమ్.........................

'నీ వెట్టి బంగారు గాను' ఇత్యాదీనాం గ్రామ్యత్వేఽపి ప్రయోగార్హతేతి సరస్వత్యాశయో వర్ణనీయః. అనేనైవ 'అపాంగ మాలికల్ మెఱుఁగులు గ్రక్క' నిత్యాదీనామపి ప్రయోగాణాం సాధుత్వమ్"

(అహో-౧౭౭- ౧౭౮ పుటలు)

'క్రక్కన్' అనునది యచట వమనార్థకముగాక గౌణవృత్తిచే 'క్రుమ్మరింప' అను నర్థమును నిచ్చున దగుటచేత దండ్యాచార్యాభిప్రాయ ముచొప్పున గ్రామ్యము కాకున్నను నట్టి శబ్దము శ్రుతి మాత్రమున "యాభవతః ప్రియా" అను దండ్యాచార్యాంగీకృత స్థలమునందు వలెనే గ్రామ్యతను దోఁపఁజేయు నని యహోబలపతి యాశయమై యుండును. నన్నయాథర్వణుల వలెనె బాల సరస్వతియు నిచటనె కాక యింకెచటను నాలంకారికోక్త గ్రామ్యతకును నపశబ్దతకును నైక్యము నంగీకరించు ప్రసంగము చేసియుండలేదు. కాఁగా బాలసరస్వతి కట్టి యాశయము గల దని చెప్పుచు నహోబలపతి 'క్రక్కన్' అనుదాని నుదాహరించుట సుప్రసక్తముగ నున్నట్లగపడదు. మఱియు విరళానిత్యాది సూత్ర వ్యాఖ్యలో నాతఁడు వ్రాసిన వాక్య మచటఁ బ్రస్తుతమగుటచేత నాతనియాశయమును వర్ణించుచోట సంస్కృతసమ శబ్దముల యనింద్యగ్రామ్యతనుమాత్రమే చూపుట యుక్తముగాని 'క్రక్కన్' 'నీ వెట్టి బంగారుగాను' అను నాచ్ఛిక శబ్దముల యనింద్యత నుదాహరించుట సరికాదనియు గ్రహింపనగును. పయి నుదాహరించిన 'క్రక్కన్' అను చోట నాచార్యదండి మతము చొప్పున నయితము గ్రామ్యత గలదని యహోబలపతి దలఁచినట్లు ప్రామాదికముగ (అతని యీ క్రింద నుదాహరింపఁ బోవు పంక్తులలో 'న' శబ్దము ముద్రణములోఁ బోవుటను గ్రహింపక) శ్రీ౦తి భద్రాద్రి శాస్త్రులుగారు, తెనుఁగు టీక నీ క్రిందిరీతిని వ్రాసియున్నారు.

"అనేనైవ 'అపాఙ్గ మాలికల్ మెఱుఁగులు గ్రక్క' నిత్యాదీనామపి ప్రయోగాణాం సాధుత్వమ్, ఏతద్గ్రామ్యంతు 'నిష్ఠ్యూతో ద్గీర్ణవాన్తాది

గౌణవృత్తి వ్యపాశ్రయమ్। అతిసున్దర, మన్యత్ర। గ్రామ్యకక్ష్యాం విగాహతే' ఇతి దండినా ప్రతిపాదితమ్ (ఇచట 'నప్రతిపాదితమ్' అని యుండవలెను) గుణవృత్త్యైషాం సాధుత్వ మితి నృసింహః. "(అహో. ౧౭౭ పుట.)

"వీనికి గ్రామ్యత్వమును దండి చెప్పినాఁడు ......... ఈ శబ్దములకు గుణవృత్తి చేతనే సాధుత్వమని నృసింహుఁడు చెప్పెను" (శ్రీ౦శి భద్రాద్రి శాస్త్రులుగారి టీక). ఇట్టి ప్రమాదము లీటీకలో ననేకములు గలవు.

(33) మఱియు నప్పకవి 'సిద్ధి ర్లోకా ద్ద్రుశ్యా' అను ప్రకృత సూత్రపు సందర్భమున దేశ్య శబ్ద సిద్ధిమాత్రము లోకమువలనఁ దెలియునని యర్థము చేసెను.

క॥ కవులకు దేశ్యము లోక। వ్యవహారమువలనఁ దెలియనగు నాలోక।
వ్యవహారము నిత్యంబును।భువి నిజదేశమున యోగ్యమును నగుఁ గృష్ణా॥
(అప్పక. ౧ ఆ. ౧౧౫ ప.)

సంస్కృత సమములకు మూలము సంస్కృతమే యని యంగీకరించినను బ్రాకృతసమ ప్రాకృతభవ సంస్కృతభవములు లోకసిద్ధములె యనక తీరదు. అవి సంస్కృత (ప్రాకృత) ప్రకృతికములెయైనను వానిని సాధించు వ్యాకరణములు లేమిం జేసియు నున్న సూత్రములచే సాధింపఁబడు వైకృతములెల్ల వ్యవహారస్థములు కానపుడు ప్రయోజ్యములు కాకుండుటం జేసియు దేశ్యములతోపాటుగ వైకృతములును దెనుఁగున లోకవ్యవహారసిద్ధములె యని గ్రహింపవలెను. ఇంతయేల! సంస్కృత సమములకు సైతము ప్రాతిపదికములను సంస్కృతభాషనుండి గ్రహించినను వానికిఁ దెనుఁగు విభక్తులు చేర్చు సంప్రదాయమునకును లోకమే మూలమనక తీరదు గదా. కాఁగా సామాన్యముగా నాంధ్ర శబ్దసిద్ధికిఁ లోకము మూలమని యర్థముచేయుట యుక్తము.

(34) సన్మూలవత్త్వా దిత్యాదిః—

సన్మూలవత్త్వాత్ = లక్ష్యలక్షణ వాఙ్మయము కలిమిచే స్థిరపడియున్న సంస్కృతప్రాకృతములును, బండితలోకవ్యవహారమును మూలముగాఁ గలదగుటచేతను, రూఢత్వాత్ = మహాకావ్య ప్రపంచమందును బండిత ప్రపంచమునందును బ్రసిద్ధమై యున్నదగుటచేతను, సాధుభిః = మహాకవులచేత, గృహీతత్వాచ్చ = మన్నింపఁబడి కావ్యములందు వాడఁబ

విక్ర॥ సమ్మాలవత్త్వా ద్రూఢత్వా । ద్గృహీతత్వాచ్చ సాధుభిః,
నాపభ్రంశత్వ మేతస్య । నియమాభావతస్తు తత్ ।
నివారణాయ తస్యైవ । ప్రవృత్తి ర్విదుషా మభూత్ ।
తదర్థమేవహి వయం । భూయసా ప్రయతామహే ।
కవితో పాశ్రితం (తోపశ్రుతం-పాఠా.) దోషం।నైవ కించి త్సహామహే॥

---

డిన దగుటచేతను, ఏతస్య = ఈ యాంధ్రకావ్యభాషకు, అపభ్రంశత్వమ్ = అపశబ్దత్వము, న = లేదు. తత్ = ఆ యపభ్రష్టత, నియమాభావతస్తు = వ్యాకరణము లేకుండుటచేత నైనచో, భవతి (అధ్యాహార్యము) = సంభవింప వచ్చును. తస్యైవ = అట్టియపశబ్దతయొక్కయే, నివారణాయ = వారించుట కొఱకు, విదుషామ్ = పాణిని నన్నయాది పండితాగ్రేసరులయొక్క, ప్రవృత్తిః = వర్తన మనఁగాఁ బ్రయత్నము, అభూత్ = ఆయెను; జరిగెనని యర్థము. తదర్థమేవహి=అట్టిపనికేకదా, వయమ్=మేము, భూయసా=అధిక ముగా, ప్రయతామహే = ప్రయత్నించుచున్నాము. కవితోపశ్రుతమ్ = కవిత్వములో ననఁగా సాధారణకవికృత కావ్యములలో వినఁబడెడి, దోషమ్ = అపశబ్దదోషమును (లేదా కవితోపాశ్రితమ్ = కావ్యముల నాశ్రయిం చిన దోషమును), కించిదపి = అల్పియమునైన ననఁగా నొక్కటినైన, నసహా మహే = సహింపఁజాలము.

(3గి) సంస్కృత ప్రాకృతాపభ్రంశ ప్రచురమగు వైకృతమున కప శబ్దత దుర్వారమను శంక రాఁగా నద్దానిని వారించుచుఁ బై కారణములచేత నపభ్రష్టత రూపు మాయునని ప్రకృతకారికలతో వివరించుచున్నాఁడు. కృత కత్వమును, వ్యవహార ప్రసిద్ధ్యభావమును, మహాకవి ప్రయుక్తత్వాభావ మును నపభ్రంశముల యపశబ్దతకు నిదానములని భావము. సంస్కృతసమ ప్రాకృతసమభాష సంస్కృత ప్రాకృతవాఙ్మయమూలక మగుటచేతను, దద్భవ దేశ్యాత్మకభాష పండితవ్యవహారమూలక మగుటచేతను, నుభయమును నాంధ్రమహాకవిప్రయోగప్రసిద్ధ మగుటచేతను, నాంధ్రమహాకావ్యభాష కప భ్రంశత్వము లేదని తాత్పర్యము. పైని చేర్కొనఁబడిన మహాకవిప్రయు క్తతాదులు కావ్యభాషా పదముల కెల్లఁ జూపుట దుర్ఘటమనుటకు సందేహము లేదు. ఒకొక్క ప్రకృతికిఁగల వివిధప్రత్యయ విశిష్టప్రయోగములను గావ్యములందుఁగాని వ్యవహారమందుఁగాని చూపుట సుకరము కాదుగదా. కాఁగా నసాధారణ ప్రజ్ఞా పాండిత్య సంపన్నులగు వైయాకరణు లట్టి పండిత

ప్రయోగములను మహాకావ్య ప్రయోగములను గూలంకషముగాఁ బరిశీలించినవారును, స్వయముగా మహాకవులును, భాషావ్యవహర్తలును నగుట చేత వారట్టి ప్రయోగప్రపంచమునుబట్టి సంకోచ వికాసన్యాయముల ననుసరించి చేయు నియమములు భాషాభ్యాసకులకును సాధారణ కవులకును బరమ ప్రమాణము లగుచున్నవనుట యుక్తమే కదా. సార్వత్రికములుగాని ప్రయోగములనుబట్టి నిపాతన్యాయమునఁ బ్రయోగదృష్టములకే ప్రామాణ్యమును సూత్రించుట సంకోచన్యాయ సిద్ధమనియుఁ బ్రాయికనిత్యాది ప్రయోగములనుబట్టి తత్తద్రీతిని దత్తజ్జాతులకెల్ల సాధుత్వమును సూత్రించుట వికాస న్యాయసిద్ధమనియు గ్రహింపనగును. ఇఁక నట్టి వారేయగు వ్యాకరణ రచనాపరులు కానట్టి యితరపండిత మహాకవులును స్వస్వకాల లబ్ధ భాషావాఙ్మయ పరిశీలనమునుబట్టి యావశ్యకున్న వ్యాకరణముల నుల్లంఘించుట యావశ్యకమని తలంచి యట్లుల్లంఘించి ప్రయోగించునపు డట్టిప్రయోగ విశేషములు గ్రామ్యములని కాని, యనింద్యగ్రామ్యములని కాని యనిపించుకొనవు. ఇఁక వానిని వెనుకటివలెనె యుత్తరోత్తరులు పరమ ప్రమాణములుగను నగ్రామ్యములనఁగా సాధుశబ్దములుగను నంగీకరింప వలసినదే యని గ్రహింప వలెను.

(3౬) మహాకవి ప్రయుక్తములగు వనముకు మున్నగురీతి ప్రయోగములకు వెనుకనుదాహరించిన విధమున (విష. 30) బాల సరస్వత్యహోబలపతులు గ్రామ్యత్వమును గల్పించుచున్నవా రగుటచేత (విష ౨3) నహోబలపతి, మహాకావ్యములందును భ్రమ ప్రమాదములచేఁ దప్పులుప్రయుక్తములగునని చెప్పి వాని కసాధుత్వము నంగీకరించుచు నట్టి ప్రమాద ముత్తరోత్తరులకుఁ గలుగకుండఁ జేయుటకు వైయాకరణులు యత్నింతురని ప్రకృత కారికల లోని "నివారణాయే" త్యాది భాగమున కభిప్రాయ వర్ణనము చేసియున్నాఁడు. మహాకావ్యప్రయుక్తము లపశబ్దములే కావని యీావజ కీయభిప్రాయము నిరాకృతమె యై యున్నది గదా. (30-విషయ, (౨3-౨౬ విష.)

కాఁగా సామాన్య గ్రంథకర్తల గ్రంథములలో నపశబ్దములు పడకుండ వారికి సుశబ్దముల నుపదేశించుటయు, నభ్యాసకులకు సుకరముగా భాషాతత్త్వ ముపదేశించుటయు, వ్యాకరణ పరమప్రయోజనములని సిద్ధాంతితమగుచున్నది. ప్రకృత సూత్రములలోని "కవితోపశ్రుతం దోషం। నైవ కిం

చిత్సహామహే ” అను, నీక్రింది యాభియుక్తోక్తుల సారమగు వచనము సయితము సామాన్య గ్రంథకర్తల కవితకె యని గ్రహించునది.

“తదల్పమపి నోపేక్ష్యం, కావ్యే దుష్టం కథంచన।
స్యా ద్వపు స్సున్దరమపి, శ్విత్రే ణైకేన దుర్భగమ్॥
గౌ ర్గౌః కామదుఘా సమ్యక్, ప్రయుక్తా స్మర్యతే బుధైః।
దుష్ప్రయుక్తా పున ర్గోత్వం, ప్రయోక్తు స్సైవ శంసతి॥
(అహో. ౧౦౭ పుట.)

ఇంక నహోబలపతి ప్రకృతములగు “సన్మాలవత్త్వా” దిత్యాదికారికలకుఁ, గావ్యప్రయోగయోగ్యతారూపమగు నపభ్రంశత యాంధ్ర భాషకుఁ గలదనియుఁ గావ్యప్రయోగాయోగ్యతారూప మగు నపభ్రశంత లేదనియు నసంగతముగ నర్థము చేసియున్నాఁడు.

“ఏవం చానాన్ధ్రాపశబ్దస్యైవ అస్యాపి కవిప్రయోగానర్హత్వ ప్రయుక్తం నాపశబ్దత్వమ్. తస్య చణ్డాల యవనాదౌ వినియోగకథనాత్ (చణ్డాలయవనాదీనా। మపభ్రంశః ప్రయుజ్యతే - అహో. ౧౩౦ పుట) ప్రయోగార్హత్వే నాపశబ్దత్వ మస్తు. ఏతద్భాషాయాస్తు శిష్టపరిగృహీతత్వేన, న తాదృశ మపభ్రంశత్వమ్. కింతు గ్రామ్యత్వే నాపభ్రంశత్వం స్యాత్;” (అహో ౧౦౯ పుట)

ఆథర్వణీక మూలమున ‘నాపభ్రంశత్వ మేతస్య’ అని కంఠోక్తముగఁ జెప్పఁబడుచుండఁగా దానికిఁ గావ్య ప్రయోగార్హత్వరూపాభ్రంశత గలదని వ్యాఖ్యచేయుట యుక్తము కాదుగదా. మఱియు సంస్కృతాపభ్రంశమునకు నాటకాదులలోని నీచపాత్ర సంభాషణమున నుపయోగము చెప్పఁబడినట్లే వ్యాకరణాపరనామక నియమము లేని యాంధ్రములోని గ్రామ్యభాషకు సైతము నీచపాత్రసంభాష ణోపయోగిత్వమును “గ్రామ్యం త త్తద్విధౌ సాధు” (౩౧-వి) అని యథర్వణుఁడు చెప్పుచుండఁగా నగ్రామ్యమగు వ్యాకరణాంగీకృత భాష కపభ్రశంత గలదని యాతని కభిప్రాయ మున్నట్లు చెప్పుట కేవలము నసంగత మనక తీరదుగదా. చిత్రము! ఈయహోబలపతియే కొన్నిచోట్ల నాంధ్రమున కపభ్రంశత లేదనియుఁ బ్రసంగించి యున్నాఁడు.

“ప్రాకృతాన్ధ్రయో ర్నాన్యదేశభాషావ త్సర్వత్రాపశబ్దత్వే ప్రామాణ్యమ్.” (అహో. ౯౦ పుట)

వికృ.—శ్రుతేఽపశబ్దే చోక్తేవా. ప్రమాదా త్పాణినిం స్మరేత్ ।
ఽథవా ఫణినా మీశం, చిన్తయే ద్బహుశో బుధః ।
ప్రాకృతే షడ్విధేచాపి, వాల్మీకిం వా మహేశ్వరమ్ ।
ధ్యాయే దత్రతు మామేవ (నావేవ - పాఠా), స్మరే త్పండిత సత్తమః ॥

---

"వస్తుతస్తు వాఙ్మాత్రానుశాసనమాత్రస్య బ్రహ్మజన్యత్వా మేవే త్యాంధ్రభాషా తదనుశాసనయో ర్బ్రహ్మకారణత్వ మేవ......ఇతి నాస్య వ్యాకరణస్య వ్యావహారికాప్రామాణ్య శంకాంకూరస్యాపి ప్రసక్తిః" (అహో. ౧౧౫-౧౧౬-పుటలు.)

... ... ... ...

(౩౭) వ్యా – శ్రుతేఽప శబ్దఇత్యాది. —

బుధః=వివేకశాలి, సంస్కృత భాషయందు (అధ్యాహార్యము) ప్రమాదాత్=ప్రమాదమువలనఁబడిన, అపశబ్దే=అపశబ్దము, శ్రుతే=వినఁబడినదై యుండఁగాను, ఉక్తేవా = పలుకఁబడినదయి యుండఁగాను, పాణినిమ్ = సంస్కృత శబ్దశాసనుఁడగు పాణిని మునిని, స్మరేత్=తలంపవలెను. అథవా= కాదేని, ఫణినామీశమ్ = వ్యాకరణ మహాభాష్యకర్తయగు పతంజలిని బహుశః = మాటి మాటికిని, బుధః = వివేకి, చింతయేత్ = తలంపవలెను. "ప్రమాదవశమున నపశబ్దము వినఁబడినపుడును బలుకఁబడినపుడును" అను నర్థముగల "శ్రుత" ఇత్యాదికము నీ క్రింది రెండువాక్యములందును నన్వయించుకొనునది. ప్రాకృతే షడ్విధే=మహారాష్ట్రీ (ప్రాకృత) శౌరసేనీ, మాగధీ, పైశాచీ, చూళికా పైశాచ్యపభ్రంశరూపములగు నాఱు విధముల ప్రాకృతభాషలందును, నపశబ్దశ్రుత్యాదులు సంభవించునపుడు, వాల్మీకింవా = వాల్మీకిమహర్షిని - ని, మహేశ్వరమ్ = మహేశ్వర దేవుని గాని, ధ్యాయేత్ = ధ్యానింపవలయును. అత్రతు = ఈ యాంధ్రభాషయందన్ననో, మామేవ = నన్నే, యనఁగా నథర్వణునే, పండిత సత్తమః=వివేకవంతుఁడు, స్మరేత్=తలంపవలెను. 'నావేవ' అనుపాఠము పక్షమున, నావేవ= మమ్ములనిద్దఱను, ననఁగా, నన్నయ భట్టాథర్వణులనని యర్థముచేయవలెను.

సామాన్యకవికృత కావ్యములం దపశబ్దము వినబడినపుడు పాఠక శ్రోతలును, బ్రమాద వశమునఁ గావ్యమున నపశబ్దమును బ్రయోగించి స్వయముగనో, యితరులు చెప్పుటచేతనో, తెలిసికొనినపుడు ప్రయోక్తయు,

చిం—ఆద్య ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః।
కేవలతయానుసర్ప। త్యభేద యేయం యథాతథం భాషా॥

---

శబ్దశాసకస్మరణముచేయవలయును. తత్స్మరణమున శక్తి విశేష మావేశించు ననియు, మంగళవాచక శబ్దస్మరణమువలన మాంగళ్యము గలుగునట్లే (౬ విష.) తన్మూలమున సాధుశబ్దస్మృతిపరంపర యొదవుననియుఁ, దాత్పర్యము. ఇట్టి యభిప్రాయములు ప్రాచీనులకుండుట వింతకాదు.

అట్లుస్మరించుటలోఁ దెల్గున సంస్కృతసమాపశబ్ద శ్రుత్యాది సందర్భమునఁ బాణినిమునిని స్మరింపవలెను. లేదా "యథోత్తరం మునీనాం ప్రామాణ్యమ్" అను సిద్ధాంతము చొప్పునఁ బతంజలిని స్మరింపవలెను. అట్లే ప్రాకృతసమా ద్యపశబ్దశ్రుత్యాది సందర్భమునఁ దద్భాషా వ్యాకర్తలలోని వాల్మీకి మహర్షినిగాని మహేశ్వరదేవతనుగాని స్మరింపనగును. తక్కిన తద్భవ దేశ్యరూపమగు నీ తెనుఁగు భాషలోని యపశబ్దముల శ్రుత్యాది సందర్భమున నన్నె యనఁగా నథర్వణునే స్మరింపనగును. సంస్కృతమున నుత్తర మునికిఁ బ్రామాణ్యాతిశయము నంగీకరించిన న్యాయముచేత నాంధ్రమున ద్వితీయాచార్యుఁడగు తనకే యట్టి ప్రామాణ్య మంగీకార్య మనియుఁ జింతామణి సంస్కృతసమ శబ్దానుశాసనమాత్ర ప్రధాన మగుట చేతనైత మాచ్ఛిక విషయమునఁ దనకే ప్రామాణ్యాతిశయ మంగీకరింపఁ బడుట యర్హమనియు నథర్వణుఁడు తలంచెనా యని యాలోచింపవలసి యున్నది. లేదా పై రెండు భాషల విషయమునను ప్రక్రమమును బట్టి యాంధ్రభాషా విషయమునందును నిర్దుష్టను జేర్కొనుట కవిహృదయమై యున్నట్లగపడుచుండుటచేత నథర్వణుఁ డిచట "నావేవ" అని పఠించియుండు ననియు, "చింతామణ్యథర్వణ కారిక" లకుఁ గల సంబంధమును సరిగ గ్రహింపని యహోబలపతిచేతఁగాని, తత్పూర్వు లెవ్వరిచేతనైనం గాని యట్టి "మామేవ" అను పాఠము ప్రక్షేపింపఁబడి యుండుననియు నూహింపవలసి యున్నది.

(౩౯) ఆద్య ప్రకృతిరిత్యాదిః—

వ్యా—ఆద్యప్రకృతిః = ఆద్యమగు ప్రకృతి యనఁగా సంస్కృతమును, ప్రకృతిః = ద్వితీయ ప్రకృతి యగు ప్రాకృతమును, ఆద్యే = మొదటివి. ప్రకృతిభూతములని భావము. ఏషా = ఈయాంధ్రభాష, తయోః =

ఆరెండిటికిని, వికృతిః = వికార మనఁగా వాని ననుసరించునది, భవేత్ = అయ్యెడిని; (ఈదూదే ద్వివచనం ప్రగృహ్యమ్మను సూత్రము చొప్పున "ద్వే ఏషా" అను మూలమున సంధి లేదు). యేయంభాషా = వికృతి యని ప్రసిద్ధి కెక్కిన యీయాంధ్రభాష (యచ్ఛబ్దనికటస్థిత ఇదం శబ్దః ప్రసిద్ధిం పరామృశతి. అహో. ౧౨౧ పుట.) కేవలతయా = పార్థక్యముతో నుండియు (వేఱుభాషగ నేర్పడియుండి) ఉభేచ = సంస్కృత ప్రాకృతములను, యథాతథమ్ = యథేచ్ఛముగ లేక యథార్థ్యముగ, అనుసర్పతి= అనుసరించి వర్తిల్లుచున్నది గదా.

జన్య జనక భావరూప సంబంధముచే నాంధ్రమునకు వికృతి సంజ్ఞ గల్గినదనియు నాంధ్రమెల్ల సంస్కృత ప్రాకృతములనుండి పుట్టినదనియుఁ జింతామణి తాత్పర్యమని చెప్పెడి కొందఱు పాశ్చాత్య భాషాపండితుల మాటలు కేవలము సత్యవిదూరములు. "ప్రకృతిద్వయజా తజ్జా, తుల్యాతు సమా, ప్రవాహినీ దేశ్యా" అనిచెప్పుచున్న చింతామణికిఁ దెలుఁగు సాకల్యముగ సంస్కృత ప్రాకృతజన్యమను నభిప్రాయము గలదనుట కేవలము సాహసముగదా.

సంస్కృత ప్రాకృతాంధ్రములకుఁగల యీప్రకృతి వికృతి భావము "ప్రకృతివ ద్వికృతిః" అను మీమాంసా న్యాయానుసారముగ నంగీకరింపఁ బడినది. ఆంధ్రమునందలి తత్సమ తద్భవ దేశ్య శబ్దముల రూపసాధన ప్రక్రియ విషయమున సంస్కృత ప్రాకృత వ్యాకరణోక్త కార్యము లనేకము లీయాంధ్ర వ్యాకరణమునఁ జెప్పఁబడవనియు, నట్టి యనుక్తములెల్ల "ప్రకృతివ ద్వికృతిః" అను చొప్పునఁ బ్రకృతివ్యాకృతులగు సంస్కృత ప్రాకృతవ్యాకరణములనుండియే గ్రహింపవలయుననియు నన్నయాదుల యాశయము. కావుననే 'మహాత స్సో ర్ధు జనితో భవే త్పుంసి' ప్రభృతులగు పెక్కుచోటులందు సంస్కృతవ్యాకరణోక్త సు ప్రత్యయాది యోజన మంగీకరింపఁబడినది. ఇట్లే "వసతి రనుబంధక స్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్రే" త్యాద్యనేక స్థలములందు 'వర్తమానే లట్' ఇత్యాది సంస్కృత వ్యాకరణవిధు లనేకములు గ్రహింపఁబడుచున్నవి. ఇట్లే సమాస విషయములు కారకవిషయములు ప్రాతిపదికాది సంజ్ఞలు మున్నగు ననంతము లగు సంస్కృత వ్యాకరణ విషయములు గ్రహింపఁబడుచున్నవి. ఇట్టి వ్యాకరణ శాస్త్రవిధాన లాఘవమునకే యీప్రకృతి వికృతి న్యాయము సంస్కృత ప్రాకృతాంధ్రములకుఁ గల్పింపఁబడెను; కాని జన్య జనక భావ సంబంధమునఁ

గల్పింపఁబడలేదు. పయిరీతిని 'షష్ఠ్యా ఉత్పించి నుమ్ సేచే' త్యాద్యనేక స్థలములందు "స స్వనూనః" (౧-౧-౮-షడ్భాషాచంద్రిక) ఇత్యాది ప్రాకృత వ్యాకరణసంజ్ఞ లనుక్తములయి గ్రహింపఁబడినవి. ఇట్లే 'ద్వివచనస్య బహువచనమ్' (౨-౩-౬౮షడ్భా) 'బిందుల్' (౧-౧-౪౦షడ్భా) ఇత్యాది ప్రాకృతసూత్రము లనుక్తములే యగుచు నాంధ్రమున నుపయోగింపఁబడుచున్నవి.

ఈవిషయమున బాలసరస్వత్యాదు లంతసరిగఁ జెప్పకున్నను నహోబలపతి మాత్రము పయిరీతిగె వ్యాఖ్య చేసియున్నాఁడు.

"ఉభయానుసారిత్వేన ఉభయ విలక్షణత్వేనచ ఉభయాపేక్షయా వికృతిత్వమ్, వికృతిత్వ వ్యపదేశాత్ 'ప్రకృతివ ద్వికృతి' రితిన్యాయేన అనుక్తస్య కార్యస్యాత్ర తాభ్యాం ప్రాప్తి రిత్యాచార్యాశయః. తేన'హలన్త్యమ్' 'సానునాసికోచ్చారణం జిత్' ఇత్యాది కార్యం ప్రవర్తతే. ఇమ మర్థం సూచయితుమేవ తత్ర తత్ర నుమ్ సుపాది వ్యవహారో లభ్యత ఇతి జ్ఞేయమ్. అతఏవోక్తం ద్వితీయాచార్యేణ. 'ఆద్యా మహోర్గ్వా సా మూలం। సర్వస్యేతి నిగద్యతే। తదనుక్తస్యకార్యస్య। వక్తా భవతి పాణిని రితి' (అహో.౧_౨౦పు) (చూడుఁడు ౮౩వి.)

అహోబలపతి యిట్లు వ్రాసియు మరల బాలసరస్వతీ మార్గమును సయితము చూపియున్నాఁడు. "యేయం భాషా వికృతిత్వేన ప్రసిద్ధా సా భాషా ఉభేచ ఆద్యే తత్సమాదిభిః అనుసర్ప త్యనువర్తతే.........అనుసరణ ప్రకార స్త్వేవమ్"(అహో ౧_౨౦ పుట) అని యిట్లు వ్రాసి బాలసరస్వతీ మార్గమును జూపియున్నాఁడు. తత్సమతద్భవములచే నాంధ్రభాష సంస్కృత ప్రాకృతముల ననుసర్పించుచున్నదని యాక్రిందిరీతిని జెప్పెను. ఈపక్షమున దేశ్యానుసర్పణము లేకున్నను వికృతిత్వము ఛత్రిన్యాయమున సిద్ధించునని యెన్ననగును.

(38) బాలసరస్వతిపద్ధతి — కేవలసంస్కృతమును సంస్కృతసమ సంస్కృతభవములచేతను గేవల ప్రాకృతమును బ్రాకృతసమ ప్రాకృతభవములచేతను (వికృతి) ననుసరించుచున్నదని బాలసరస్వతి యర్థము చేసెను. "సముద్రానకు సంద్రము, చంద్రునకుఁ జందురుఁడు మొదలగునవి ప్రాకృమును మించి మొదలి సంస్కృతమునకే తద్భవము లగుచున్నవి. ప్రాకృతమునకైనచో 'సముద్దము. చందుడు' అని రావలెను. కృష్ణుఁడు మొదలయినవి సంస్కృతమునకే తత్సమములు......" (బాలసరస్వతీయము) ఈపక్షమున

లోకవ్యవహారమునఁ గాని, కావ్య వ్యవహారమునఁ గాని ప్రసిద్ధిలేని 'సముద్దము, చంద్దుఁడు' మున్నగు వానిని వారించుటకు సూత్రములో "కేవల" శబ్దమేలొకో తెలియకున్నది. సంస్కృతభవ ప్రాకృతభవములగు 'లచ్చి' మున్నగునవి సయితమీతనిచేత నంగీకరింపఁబడినవేకదా. కాఁగా నీతని వ్యాఖ్య పక్షమున 'కేవలతయా' అనునది నిరర్థకమగుచున్నది. మఱియుఁ జింతామణికర్తయే సంస్కృత ప్రాకృతముల యనుసరణ ప్రకారభేదములచేఁ గల్గు భాషాభేదములను "ప్రాకృతభవ-సంస్కృతభవ సంస్కృతవ" దిత్యాది సూత్రముచేత హలంత పరిచ్ఛేదములో వివరించుచునె యున్నాఁడు.

అప్పకవి తత్సమానుసరణము నుపేక్షించి తద్భవానుసరణమును మాత్ర మంగీకరించి వివిధ తద్భవములను మాత్రమె యుదాహరించెను. తత్సమములు వికృతులు కామింజేసి వికృతిత్వవ్యపదేశ విషయమున వాని నెత్తనేల యని యాతఁడు తలంచెనేమో? కాని యిచటి యనుసరణము సంస్కృత ప్రాకృత సంబంధ మాత్రరూపమెయని తలంచిన సరస్వతీమార్గము యుక్తతరమై యున్నది. మఱియు నత్యల్ప సంఖ్యాకములగు తద్భవములచేత మాత్రమే యాంధ్రమునకు వికృతిత్వ వ్యపదేశము కల్గెననుట యసంగతమగును. ఛత్రిన్యాయము పొసఁగనేరదు.

హాయగ్రీవశాస్త్రులుగారిదగు కృతకబాలసరస్వతీయ టీకలో (చూ. బాలస. ౯ పేరా) "ఉభే" అనునది ప్రథమా ద్వివచనముగా నన్వయింపఁబడినది. 'యథాతథా' అనుపాఠాంతరము కల్పింపఁబడినది. ఆకారణమున సంస్కృత ప్రాకృతము లెట్లనుసరించుచున్నవో యట్లే యాంధ్రభాషయు ననుసరించుచున్నదని యిట్లర్థవ్యక్తియే లేకుండ నసంగతముగ నర్థము వ్రాయఁబడినది. ఉద్ద్యోతినీ వ్యాఖ్యాకర్త కవిశిరోభూషణాదులను బరిశీలింపక హాయగ్రీవ శాస్త్రిలుగారి టీకనుమాత్రమె చూచినయాతఁడు గాన నట్టి టీకలోని యసంగతి పోవునట్లుగఁ, బ్రాకృతము సంస్కృతము ననుసరించునట్లే యాంధ్రము సంస్కృత ప్రాకృతములు రెండిటిని ననుసరించుచున్నదని యిట్లు సవరించి వ్యాఖ్యానము చేసెను. 'యేఽయమ్' అనుదానికి "అవ్యహిత పూర్వోక్తా ప్రకృతిః" అని వ్యాఖ్యచేసెను. అందవ్యవహిత పూర్వోక్తమయినది వికృతిగాని ప్రాకృతము గాదు. కావుననే వ్యాఖ్యాతలెల్ల "యేఽయమ్" అనుదానిని వికృతిపరముగానే యన్వయించిరి. మఱియుఁ జింతామణిలోని పాఠము 'యథా తథా' అనునది కాదు. "యథాతథమ్" అనియె వ్యాఖ్య

పత్ర మాతృకలలోనెల్ల నున్నది. "యథాతథమ్ = యథేచ్ఛమ్" అని యహోబలపండితీయమునను, "యథాతథమ్ = యథేచ్ఛముగా" అని బాలసరస్వతీయమునను వ్యాఖ్యానములు చేయఁబడుటచేతఁ దద్వ్యాఖ్యాతలు చూచిన మాతృకలలో సైతము "యథాతథమ్" అని యున్నదనియె యంగీకరింపక తీరదు. అప్పకవీయములో 'యథాతథా' అనియే ముద్రితమై యున్నది గాని దానికప్పకవి వ్రాసిన యీ క్రింది వివరణ పద్యమును బట్టి ప్రకారార్థకములగు యథాతథా శబ్దములు మూలమున నున్నట్లగపడమింజేసి యప్పకవిపాఠము సైతము "యథాతథమ్" అనునదియే యని నిర్ణయింపనగును.

"కేవలతయానుసర్ప త్యుభేచ యేయం యథాతథాభాషా"

తే॥గీ॥ ప్రకృతులను రెంట రెండు రూపముల నమరు ।
తద్భవములు ప్ర త్యేక మాంధ్రంబు లగుచుఁ ।
జంద్రునకుఁ జందురుండని సంస్కృతమునఁ ।
జన్దుఁడని ప్రాకృతమున నీచందమునను" (అప్ప. ౧ ఆ. ౨౫-౨ ప.)

ప్రకృతులగు సంస్కృత ప్రాకృతములు రెండిటిలోను సంస్కృతమునకు వేఱుగను బ్రాకృతమునకు వేఱుగను రెండు తద్భవరూపము లేర్పడునను నర్థముగల పై వివరణ పద్యమును వ్రాసిన యప్పకవి పాఠమున "యథాతథా" అను ప్రకారార్థక శబ్దములు లేవనుట నిశ్చయముగదా. మఱియుఁ బ్రాకృతమునకుఁ బ్రకృతిభాష సంస్కృత మొక్కటే యగుటచే నందు ద్విప్రకారక తద్భవములుండు నను సామ్యధర్మ మసంగతముగదా. నావద్దనున్న విజయనగరపుఁ దాళపత్ర మాతృకలోను (౧౦. తాళపత్రము) కరక వలస తాళపత్ర మాతృకలోను (౧ తాటాకు) వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్సు వారి కాగితపు మాతృకలోను (౫ కాగితము) "యథాతథమ్" అనుదానికిఁ బర్యాయమగు 'యథాయథమ్' అను పాఠమే యగపడుచున్నది. కాఁగా "యథాతథా" అను పాఠము గ్రంథకృత్ప్రియుక్తము కాదని యెన్నవగును.

(౪౦) వికృతి ప్రాకృతశబ్దములకు వివిధార్థములు వివిధ వ్యుత్పత్తులును వెలయుచుండుటంజేసి యొక్కొక్క రొక్కొక్కరీతిని వీనిని వివరించుచువచ్చిరి.

అనుక్త వ్యాకరణ కార్యగ్రహణ విషయమునను దత్సమ తద్భవాను సర్పణవిషయమునను నాంధ్రము సంస్కృత ప్రాకృతములకు వికృతియగు

నట్లే ప్రాకృతభాషయు సంస్కృతమునకు వికృతియగుటంజేసి యయ్యదియు వికృతియని వాడఁబడుట గలదు.

"భాషా ప్రదీపే చోక్తమ్—కౌమారపాణినీయాది।
సంస్కృతా సంస్కృతా భవేత్।
ప్రకృతి స్సంస్కృతాభాషా।
వికృతిః ప్రాకృతీ భవేత్॥ (అహో. ౧౭౯ పుట)

మఱియుఁ బ్రకృతియగు సంస్కృతమునుండి వచ్చినదిగాన దానికిఁ బ్రాకృతసంజ్ఞయు నన్వర్థమగుచున్నది.

"ప్రకృతి ప్రత్యయాది వ్యుత్పత్తిమత్ ప్రకృతమ్. తత ఆగత మితి ప్రాకృతశబ్ద వ్యుత్పత్తిః" (అహో ౧౭౮ పుట).

"ప్రకృతే స్సంస్కృత శబ్దా దాగతః-అణ్-నాటకాదౌ ప్రసిద్ధే అప శబ్దే." (శబ్దస్తోమ మహానిధి).

ప్రాకృతములోని దేశ్యభాషకు సైతము ప్రాకృతసంజ్ఞ యన్వర్థకమగుచున్నది. ప్రకృతు లనఁగా రాష్ట్రములోని జనులు గాన ప్రకృతులగు జనుల వాడుకనుండి సిద్ధించునదగుటచేతఁ బ్రాకృత దేశ్యమునకును బ్రాకృతత్వ వ్యపదేశము సార్థక మగుచున్నది.

"తత్సమం సంస్కృతసమం। జ్ఞేయం సంస్కృత లక్షణాత్। ప్రకృతే స్సంస్కృతా త్సాధ్య। మానం సిద్ధంచ తద్భవమ్।...... దేశ్య మవ్యుత్పత్తి మత్త్వాత్। ప్రాకృతత్వేన కథ్యతే" (అహో ౧౭౮ పుట).

పయి రీతినె ప్రకృతులగు సంస్కృత ప్రాకృతములనుండి వచ్చిన వగుట చేత నాంధ్రములోని తత్సమతద్భవభాగములకును సార్థకమగుచుఁ బ్రాకృతత్వ వ్యపదేశము చెల్లుననియు, నిఁకఁ గొఱవడిన యాంధ్రదేశ్యము సైతము జన వ్యవహార సిద్ధమే యగుటచేతఁ బ్రాకృత దేశ్యమునకు వలెనే యాంధ్ర దేశ్యమునకును బ్రాకృతత్వ వ్యపదేశము సార్థకమగుచు వర్తించు ననియుఁ దలంచి కావలయును విన్నకోట పెద్దిరా జీక్రింది రీతిని జెప్పియున్నాఁడు.

గీ॥ విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు।
లోనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ।
ఆంధ్రభాషయు ప్రాకృతాహ్వాయము కాన।
వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ. (కావ్యాలం. ౯ ఉల్లా 8.ప.

౧) ప్రాకృతాంధ్రములకుఁ గొన్ని విషయములలోఁ భేదములును . కాని దేశ వ్యవహారమాత్ర సిద్ధములై దేశ్యములనుటలోను దేశ భాషావిభక్తులతో సాధారణముగా సంస్కృతశబ్దములనెల్ల భాషలో వాడికొన వచ్చుననువిషయములోను ప్రాకృతాంధ్రములు తుల్యములే యనవచ్చును. తద్భవభాష విషయమున రెండింటికిని జాల భేదము గలదు. తెలుఁగునఁ దద్భవ శబ్దములు దేశ్యములవలెనే లోకవ్యవహారసిద్ధములు మాత్రమె (ఏవేని యలంతి శబ్దములను గవులు కల్పించి వాడిరేమో కాని) యంగీక రింపఁబడును. ప్రాకృతమునందన్నో యట్లు కాదు. దేశవ్యవహారసిద్ధ తద్భవ ముల నంగీకరించుటయే కాక కవులు సర్వశబ్దసాధారణముగా సంస్కృత శబ్దములనుండి ప్రాకృతతద్భవములను సాధించి వాడుట సంప్రదాయమై యున్నది. "ప్రకృతేస్సంస్కృతాత్సాధ్యమానం సిద్ధంచ తద్భవ" మ్మనెడి వెనుక నుదాహరించిన (విష.౪౧) కారిక పయివిషయమునె విశదీకరించుచున్నది. తెలుఁగున నాచ్ఛిక కావ్యములు తద్భవ దేశ్యభాషలు రెండిటితోడను నడపఁ బడుచున్నవి. ప్రాకృతమునం దట్లు కాదు. ప్రాకృత కావ్యములలో నేవేని యలంతి దేశ్యశబ్దములు పడినవో లేక యవియును గాల వ్యవధానముచే నజ్ఞేయ సంస్కృత ప్రకృతికములై యున్న తద్భవములే యేమో కాని సాధా రణముగాఁ దత్సమ తద్భవ శబ్దములె యగపడుచున్నవి.

"సిద్ధం ప్రాకృతం త్రిధా (౧-౧)" సిద్ధం=ప్రసిద్ధం ప్రాకృతం త్రిధా త్రిప్రకారం భవతి, సంస్కృత యోనిః...... సంస్కృతసమమ్......... దేశీ-ప్రసిద్ధమ్, తచ్ఛేదమ్—ల్హాసియం-ఫుట్టం చంద్రికో జ్జలియం ఇత్యాది" (చండకృత ప్రాకృతలక్షణము) - పై పదములు తద్భవరూపములె యనుట శాస్త్రవిదూరము కాదు. హ్లాదితమ్=హాదిఅం = రిహాసిఅం=లిహాసి అం = ల్హాసి అం = ల్హాసియం; స్ఫుష్టమ్ = ఫుట్టమ్; చన్ద్రికోజ్జ్వలితమ్ = చన్ద్రికో జ్జలియం - మొ - దీనినిబట్టి ప్రాకృతములలో దేశ్యపద ప్రాచుర్యము లేదనియు నపభ్రంశాదులలోనె దేశ్యశబ్ద ప్రాచుర్య ముండెడిదనియు ముందు విశదీకరించు విధమున (౪౨ విషయము) నెన్న నగును.

ప్రాకృతవ్యాకరణములయందును దత్సమతద్భవభాషలకె యనుశాస నము వెలయుచున్నది. హేమచంద్రుఁ డిట్లు చెప్పియు నున్నాఁడు.

"అథ ప్రాకృతమ్. (౮-౧-౧-) వృత్తిః — సంస్కృతా దనన్తరం ప్రాకృతస్య అనుశాసనమ్ — సిదసాధ్యమాన సంస్కృత యోనే రేవ తస్య

లక్షణమ్. న దేశ్యస్యేతి జ్ఞాపనార్థమ్, సంస్కృత సమంతు సంస్కృతలక్షణే నై వ గతార్థమ్.'' అని వివరించి యున్నాఁడు.

"దేశ్య మార్షంచ రూఢత్వా । త్స్వతన్త్రత్వాచ్చ భూయసా ।
లక్ష్మ నాపేక్షతే తస్య । సంప్రదాయోహి బోధకః''
" దేశ్య మవ్యుత్పత్తిమత్త్వా । త్ప్రాకృతత్వేన కథ్యతే''
(అహో ౧౨౮ పుట)

అను చొప్పున దేశ్యమునకు లక్షణముచేయుట శక్యముకాదని హేమచంద్రుని యాశయము విశదమగుచున్నది. దేశ్యమును ప్రాకృత మనుటలో నీతఁ డీక్రిందరీతిని వ్యుత్పత్తి నెన్నె ననఁదగును.

"ప్రకృత్యా స్వభావేన సిద్ధమ్=ప్రాకృతమ్''

(౮_౨) ప్రాచీనకాలమునఁ ప్రకృతిభూత సంస్కృతమునుండి సాధ్యమానమగు తత్సమ తద్భవరూపభాషకే ప్రాకృత మను వ్యవహార ముండెడిదనియు నట్టి ప్రాకృతము మహారాష్ట్రీ శౌరసేన్యాది భేదముల నందినదనియు నింకఁ బైశాచీద్వితయాపభ్రంశాది భాషలలో మాత్రమె దేశ్యశబ్దములు వెలసియుండెడివనియు నాకారణముననె వానిని దేశభాషలుగఁ దలంచెడివారనియు నిటఁగొందఱు ప్రాకృతపండితులు తలంచుచున్నారు. (చూడుఁడు ప్రాకృతప్రకాశ పీఠిక, పర్వతీయ ఉదయరామ డవరాల కృతము) కాని యీ యభిప్రాయము సరిగనున్న ట్లగపడదు.

శ్లో॥ తదేత ద్వాఙ్మయం భూయః। సంస్కృతం ప్రాకృతం తథా ।
అపభ్రంశశ్చ మిశ్రంచే। త్యాహు రార్యా శ్చతుర్విధమ్ ॥
సాంస్కృతీనామ దైవీవా। గన్వాఖ్యాతా మహర్షిభిః ।
తత్సమ స్తద్భవో దేశీ। త్యనేకః ప్రాకృత క్రమః। 33
మహారాష్ట్రోద్భవాం భాషాం। ప్రకృష్టాం ప్రాకృతం విదుః ।
సాగర స్సూక్తిరత్నానాం। సేతుబన్ధాది యన్మయమ్॥ 34
శౌరసేనీచ గాడీచ। లాటీ చాన్యాచ తాదృశీ।
యాతి ప్రాకృత మిత్యేవ। వ్యవహారేషు సన్నిధిమ్॥ 35
ఆభీరాది గిరః కావ్యే। ష్వపభ్రంశ ఇతి స్మృతాః ।
శాస్త్రేషు సంస్కృతా దన్య। దపభ్రంశత యోదితమ్॥ 36

సంస్కృతం సర్గబన్ధాది। ప్రాకృతం స్కన్ధకాదికమ్
ఆసారాదీ న్యపభ్రంశే। నాటకాదిషు మిశ్రకమ్॥

(కావ్యాదర్శము, ౧ పరిచ్ఛేదము)

ఇందపభ్రంశాది భిన్న మహారాష్ట్ర్యాది ప్రాకృతమందును దేశ్య భాగ మంగీకరింపఁబడెనుగదా. అట్లయినను ప్రాకృతములకన్న నపభ్రంశాదులలో దేశ్యశబ్ద ప్రాచుర్యముండిన నుండవచ్చునని తోఁచెడిని. పయి కారికలను బట్టి మహారాష్ట్రితోపాటు శౌరసేన్యాదులు మాత్రమే ప్రాకృతత్వ వ్యవహారము గలవనియు నపభ్రంశ మట్టిదికాదనియు దండ్యాచార్యుఁడు తలంచెనని విశదమగుచున్నది. దీనినిబట్టి దండ్యాచార్యుఁడు సైత మపభ్రంశాదులకుఁ బ్రాకృతత్వ వ్యవహారము నంగీకరించెనని వ్రాసిన యీ క్రింది యహోబలపతి గ్రంథము ప్రామాదికమనక తీరకున్నది.

“భాషాప్రదీపే చోక్తమ్:—

కౌమారపాణినీయాది। సంస్కృతా సంస్కృతా భవేత్॥
షడ్విధేయం ప్రాకృతీచ। శౌరసేనీచ మాగధీ।
పైశాచీ చూళికాపైశా। చ్యపభ్రంశ ఇతి క్రమాత్।
మహారాష్ట్రోద్భవా భాషా। ప్రాకృతీ పరికీర్త్యతే
శూరసేనోద్భవా భాషా। శౌరసేనీతి గీయతే।
ప్రచక్షతే మాగధీం తాం। యాభాషా మగధోద్భవా।
పిశాచదేశసంభూతం। పైశాచీద్వితయం భవేత్!
ఆభీరాదికజాం భాషా। మపభ్రంశం ప్రచక్షతే॥

షణ్ణామపి ప్రాకృతమిత్యేవ వ్యవహారః। దణ్డినాపి శౌరసేనీచ గౌడీచ.........’ (అహో. ౧౨౯ పుట.)

అపభ్రంశభాషకే కాక పైశాచీ ద్వితయాదులకును బ్రాకృతత్వ వ్యవహారము ప్రాచీనమతమున లేదని యొప్పక తీరదు.

“పురాణ వాగ్భట్టేనాపి వాగ్భట్టాలఙ్కారే. (౨ - ౧) సంస్కృత ప్రాకృతాపభ్రంశ భూతభాషి (పిశాచ=భూత) తేతి భేదేన చతుర్ధా విభజతే”

“ప్రాకృతసర్వస్వకార మార్కణ్డేయేన - (౧) భాషా- (౨) విభాషా (3) అపభ్రంశ (౪) పైశాచీభేదా ద్భాషాః (ప్రాకృతాః) చతుర్ధా విభక్తాః॥ (ప్రాకృత ప్రకాశపీఠిక, ౨3. పుట.)

**విశ్మృ— ఆద్యా మహార్హా సా మూలం । సర్వస్యేతి నిగద్యతే.**
**తదను క్తస్య కార్యస్య । వక్తా భవతి పాణినిః ॥**

---

భరతమునియు నీరీతినె విభాగించెను.

"మాగధ్యవన్తిజా ప్రాచ్యా । శూరసేన్యర్ధమాగధీ ।
బాహ్లీకా దాక్షిణాత్యాచ । సప్తభాషాః ప్రకీర్తితాః ॥
శాబరాభీరచణ్డాల। సుచేర ద్రవిడాదయః ।
హీనా వనేచరాణాంచ । విభాషానాటకే స్మృతా ॥"

పయి భరతముని కారికలలోని భాషలనఁబడెడి మాగధ్యాదులే ప్రాకృతములనియు విభాషలనఁబడెడి యపభ్రంశాదులు ప్రాకృతభిన్నములనియు గ్రహింపనగును.

(౮౩) ఆద్యేతి:—ఆద్యా=సంస్కృతభాష, మహార్హా=మిక్కిలి పూజ్యమైనది. ఈవిషయమును జింతామణికర్తయే శాస్త్ర మపౌరుష మిత్యాదికముచేఁ జెప్పుచున్నాఁడు. సా=ఆ సంస్కృతభాష, సర్వస్య=సకల భాషలకును, అనఁగా హిందూదేశములోనున్న యుత్తరమునందలి వివిధప్రాకృత భాషలకును దక్షిణమునందలి వివిధ ద్రావిడభాషలకును, మూలమ్=ప్రకృతి భూతమైనది. (ఈవఱకే సంస్కృతముతోడి ప్రకృతి వికృతిభావము తెల్లునకు విశదీకరింపబడెను.) (౩౦విష.) ఇతి=అని, నిగద్యతే చెప్పఁబడుచున్నది. తత్= ఆ కారణమువలన ననఁగాఁ బైరీతిని బ్రకృతి వికృతిభావము నంగీకరించుట వలన, అనుక్తస్యకార్యస్య=ఈయాంధ్రవ్యాకరణమునఁ జెప్పఁబడని సంస్కృత ప్రాతిపదిక రూపసాధనము వివిధసంజ్ఞలు మున్నగు నెల్లకార్యజాతమునను, పాణినిః=పాణినిముని (అనఁగా సంస్కృతవ్యాకరణకర్త) వక్తా = చెప్పువాఁడై యున్నాఁడు. "ప్రకృతివ ద్వికృతిః" "అనుక్త మన్యశబ్దానుశాసనవత్" ఇత్యాదుల చొప్పున నాంధ్రవ్యాకరణమునఁ జెప్పఁబడనివియు, నాంధ్రవ్యాకరణోక్తముల కవిరుద్ధము లగునవియు, సంస్కృతవ్యాకరణముల నుండి గ్రహింపవలెనని యెన్నునది. దీనినిబట్టి సంస్కృతశబ్దముల వ్యుత్పత్తులను సంధిసమాసాదికార్యములను సంస్కృత వ్యాకరణములనుండియుఁ దద్భవశబ్దములందలి వైకృతకార్యములు మున్నగునవి ప్రాకృత వ్యాకరణములనుండియు యథార్హముగ గ్రహింపవలెనని విశదమగుచున్నది. ఈ సందర్భమును బట్టి సైతము తెల్లునకు "ఏషా తయో ర్భవే ద్వికృతిః" అని చెప్పఁబడిన వికృతిసంజ్ఞ జన్యజనక భావసిద్ధము కాదని స్పష్టమగుచున్నది.

(౮౮) మఱియు వెనుక నుదాహరించిన రీతిని బ్రాకృత భాషయు సంస్కృతజన్యమె యగుసప్పుడు ప్రాకృతసమ ప్రాకృత భవములను సైతము సంస్కృతసమ సంస్కృతభవములను గానె నిరూపింపనగునుగాన నాంధ్రభాషకు సంస్కృతసంబంధిత్వమును మాత్రమె యంగీకరించుట లెస్సయని ప్రకృత సూత్రపూర్వార్ధము చేత విశదమగుచున్నది. ఆంధ్రభాషకు సంస్కృతముతోనున్న సంబంధమువంటి యత్యావశ్యక విశాలసంబంధము ప్రాకృతభాషతో లేదు. సంస్కృతములోనున్న ప్రాతిపదికములకెల్ల సాధారణముగాఁ దెనుఁగు విభక్తులనుఁ జేర్చి తెనుఁగులో వాడికొనవచ్చును. అట్లే సంస్కృతధాతువుల కెల్ల సామాన్యముగా నించుగాగమముచేర్చి తెనుఁగులో నుపయోగింప వచ్చును. ఇంకఁ బ్రాకృతసమము తత్సమభాగములో నొకటి యనుకొనుటయే కాని, ప్రాకృతభాషలోని ప్రకృతులకెల్ల నట్లాంధ్రచిహ్నములను జేర్చి తత్సమ ములనుగా నుపయోగింపరాదుగదా. ఇంకఁ దద్భవములనువలెనె ప్రాకృత సమములను సయితము లోకవ్యవహార ప్రసిద్ధములై మహాకావ్య ప్రయుక్త ములై యున్నపుడు మాత్రమె గ్రహించుట యాంధ్రభాషా సంప్రదా యమై యున్నదిగదా. కాఁగాఁ దెనుఁగునకు సంస్కృత సంబంధమువంటి యవర్జనీయ సంబంధము ప్రాకృతముతో లేదనుట నిశ్చయము.

ఆంధ్రపాఠకునకు సంస్కృత ప్రకృతులనువలెఁ బ్రాకృత ప్రకృతు లను దెలిసికొనక తీరదను నిర్బంధము లేదు. శబ్దవ్యుత్పత్తుల చరిత్రమును జూపుట యాంధ్రవైయాకరణాభిప్రేతమే కాదు. 'సస్సమాస' ఇత్యాది ప్రాకృతసంజ్ఞలు నామైకదేశగ్రహణన్యాయాదులచేతనే గ్రాహ్యములు కాఁ గలవు. "ద్వైక్యం సోన్వయే" అనియిట్లు (ముగ్ధబోధవ్యాకరణము సమాస పరి. ౧-సూ) 'సః=సమాసః' అను సంజ్ఞ సంస్కృతవ్యాకరణములందును గలదు. ఆంధ్రతద్భవములందలి వైకృత కార్యములకును బ్రాకృత వ్యాకరణోక్త వైకృత కార్యములకును జాల వైజాత్యముండుటచేతఁ (౭౫ విష.) బ్రాకృత వ్యాకరణోక్త వైకృత కార్యములు తెల్గుతద్భవముల సాధనమునకు మార్గ దర్శకమాత్రములె యగును గాని సాకల్యముగా నుపచరింపఁ జాలవు. (కాల క్రమమున సూరకవ్యాదు లాంధ్రోపయోగి వైకృత కార్యముల నుప దేశించి యున్నారు). ఆంధ్రభాషాభూషణ కావ్యాలంకారచూడామణి సర్వ

చిం.——శాస్త్ర మపౌరుష మాద్యం। ప్రాయికనిత్యప్రయోగ లక్ష్మైతత్,
దృశ్య మతిస్థవిరం య। జ్జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః

లక్షణసారసంగ్రహ శబ్దరత్నాకరాదులలోఁ బయి యధర్వణాభిప్రాయమే పాటింపఁబడియున్నది.

కం॥ లచ్చియన లక్ష్మిపేరగు। ......(అం.భూ. ౨౦ ప.)

మున్నగు చోటులందు లచ్చిశబ్దాదులకు లక్ష్మి ప్రభృతిసంస్కృతములె ప్రకృతులుగఁ జూపఁబడెను గాని లచ్చి ప్రభృతి ప్రాకృతములు ప్రకృతులుగఁ జూపఁబడలేదుగదా.

సంస్కృత ప్రాకృతములతో నాంధ్రమునకు జన్యజనక భావరూపసంబంధము లేదనుట కాయాభాషలలోని ప్రకృతులను దత్సమములుగా వాడునపుడు వానికిఁ దెలుఁగు విభక్తులనుజేర్చి వాడుకొనుచుండు సనాతనసంప్రదాయమె ప్రబలనిదర్శనమై యున్నదిగదా. సంస్కృత జన్యములగు ప్రాకృత శబ్దములలో నట్లుగాక సంస్కృత విభక్తులే వికృతములగుచు వానితుదిని నిల్చుచుండుట సార్వత్రికమై వెలయుచున్నది గదా. (౭౫. విమ.). ద్రావిడ భాషాకుటుంబములోనివగు తమిళ కన్నడాంధ్రాది భాషలలో ద్రావిడ విభక్తులే నిల్చుచున్నవిగాని సంస్కృత ప్రాకృత విభక్తులును వాని వికృతులును సాధారణముగా నిల్చుచుండ లేదనుటలో విప్రతిపత్తి లేదుగదా.

సంస్కృతాంధ్రములకు జన్యజనకభావరూపసంబంధము లేదనుట కింకను ననేకములగు నిదర్శనము లున్నవి. అట్టివానినెల్లఁ జూపుట కియ్యది స్థలము కాదని విస్తరభీతిచే నిట విస్తరించి చూపనైతిని.

(౮౫) వ్యా—అపౌరుషమ్=పురుషసామాన్యకర్తృకముగాక పాణిన్యాది ఋషిప్రోక్త మగునట్టియు (లేదా యపౌరుషేయముగా నంగీకరింపఁబడు వేదమున కంగమగుటచే నపౌరుషేయమైనట్టియు) (వేదశాస్త్రము లపౌరుషేయము లనియు నీశ్వరోపదిష్టము లనియుఁ బ్రాచీనుల సిద్ధాంతము. ఋషుల ముఖమున నంతర్యామియగు నీశ్వరుఁ డుపదేశించుచున్నాఁడని విమర్శకుల యాశయము.) ప్రాయికనిత్య ప్రయోగలక్ష్మ = ప్రాయికములు నిత్యములు, మున్నగాఁగల ప్రయోగముల లక్షణములు గలది యనఁగా వాని నుపదేశించునట్టియు (వెనుక వ్రాసినరీతిని గేవల కవి ప్రయోగము

లను బట్టి సాధారణు లేవేవి నిత్యకార్యములో యేవేవి పాక్షిక కార్యములో దెలిసికొనుట దుష్కరమని భావము. వివ. ౩౬) అతిస్థవిరం = మిక్కిలి ప్రాచీనమైనట్టియు (లేదా) లోకోత్తరజ్ఞానకలితమగునట్టియు (న తేన వృద్ధో భవతి। యేనాస్య పలితం శిరః। యోవా యువా ప్యధీయాన। స్తం దేవాః స్థవిరం విదుః) ఏతత్ = ఆద్యమ్, శాస్త్రమ్ = ఈసంస్కృత వ్యాకరణ శాస్త్రము (ఆద్యశబ్దము సంస్కృత భాషాపర్యాయముగా వాడుట నన్నయాది హృదయము) దృశ్యమ్ = తెలిసికొనఁదగినది. [దృశ్ (దృశా)... దర్శనే, జ్ఞానే. [శబ్దస్తోమమహానిధి]. ఆంధ్రభాషా పాండిత్యమును గోరువారెల్ల నభ్యసింపవలసినదే యని భావము. యత్ =ఏసంస్కృతవ్యాకరణమును, జ్ఞాత్వా = తెలిసికొని, ప్రయుక్తః = ప్రయోగింపఁబడిన, శబ్దః = శబ్దము, ఆర్షసమః = ఋషిప్రయుక్తప్రయోగముతో సరియైనదనఁగా నపశబ్దతాశంకాలేశరహితమైనది, (ప్రామాణికము) భవతి = (అధ్యాహార్యము) అగుచున్నదో యట్టి యాద్య శాస్త్రము నని పూర్వవాక్యముతో నన్వయము.

(౮౬) ఆంధ్రభాషలో నత్యధికభాగము సంస్కృతప్రచురమై యుండును గాన నందుఁ బాండిత్యమును గోరువారు సంస్కృతవ్యాకరణమును నభ్యసించి తీరవలెనని తాత్పర్యము. తత్సమక్రియలు, తత్సమశబ్దములు, సిద్ధసమాసములు మున్నగువాని నిర్మలజ్ఞానము సంస్కృత వ్యాకరణాభ్యాసము లేక సంభవింపనేరదని భావము.

నన్నయభట్టారకుఁడు తన యీ చింతామణిలో సంస్కృత వ్యాకరణ సిద్ధ ప్రకృతులనె మూలముగాఁ జేసికొని తత్సమరూపసాధన ప్రక్రియ నడుపఁదలఁచినవాఁడు గావున నట్టి ప్రకృతుల జ్ఞానము సంస్కృతవ్యాకరణమువలన గ్రహింపనగునని చెప్పుట సుప్రసక్తమగుచున్నది. ఆచ్ఛిక ప్రకృతుల జ్ఞానమున కాంధ్రపండిత వ్యవహారప్రవాహమే యాధారము కాఁగలదని 'ప్రవాహినీ దేశ్యా' అను సూత్రముతో వ్యక్తపఱుపఁ దలఁచియున్నాఁడు. ఇటఁ బ్రాకృతభవ ప్రకృతులను దెలిసికొనుటకు సంస్కృతమువలెనె ప్రాకృతమును సైత మభ్యసింప నక్కఱలేదా యని శంకింపఁజనదు. కేవల సంస్కృతభవములనువలెనె ప్రాకృతసమ ప్రాకృతభవములను సైతము పండితలోకవ్యవహారస్థములను మాత్రమె గ్రహించుట సంప్రదాయమై యున్నది గాని సంస్కృతసమములనువలె సాకల్యముగ వ్యాకరణ ప్రక్రియ చొప్పునఁ దెలుఁగుచేసి వానిని గ్రహించుట సంప్రదాయమై యుండలేదు.

కాన కేవలసంస్కృతభవములనువలెనె ప్రాకృతసమ ప్రాకృతభవములను సైతము వ్యవహారమునుండియె తెలిసికొననగుననియు, నట్టి ప్రాకృతసమ ప్రాకృతభవముల ప్రకృతులగు సంస్కృతశబ్దములను గేవల సంస్కృతభవ ముల ప్రకృతులనువలెనె శబ్దాకారార్థసంబంధములనుబట్టి యథార్థముగ నూహించుకొన నగుననియు నక్కారణమునఁ బ్రాకృతసమ ప్రాకృతభవ ముల ప్రకృతిరూపములను వాని యర్థాదులను దెలిసికొనుటకు సైతము సంస్కృత భాషాభ్యాసమె యావశ్యకమనియు నేతత్సూత్ర స్వారస్యమున నూహింపవలసియున్నది. ఇట్టి చింతామణి హృదయము ననుసరించియె యథర్వ ణాచార్యుఁడు ప్రాకృత సమభవములకును సంస్కృత ప్రకృతులనె గ్రహిం పనగునని వెనుక వ్రాసినరీతిని వివరించెనని యెన్న నగును. (౮౮ విష.)

(౮౭) ప్రకృత చింతామణి కారికకుఁ బయిరీతిని జింతామణిలోఁ బ్రసక్తిని సమన్వయించికొనక కేవల సంస్కృతభాషా ప్రశంసామాత్ర పరముగనె యన్వయించుకొనుటచేఁ గాఁబోలును బాలసరస్వతి యీకారి కను జింతామణిలోఁ జేర్చి టీక వ్రాయఁ డయ్యెను. అప్పకవియు దీనిని వివ రింపలేదు. అహోబలపతియు నట్లే దీనిని మూలములోఁ జేర్పలేదు. అట్లయి నను "ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే" ఇత్యాది సూత్రవాఖ్యానములో సంస్కృతమున కాద్యప్రకృతియను పేరన్వర్థకమని సాధించు సందర్భమున సంస్కృతముయొక్క యాద్యత్వమును నిర్వహించుటలోఁ బ్రమాణముగా దీనిని నన్నయభట్టకృతమెయని యాతఁడు నిశ్చయించుచు నీక్రిందిరీతి నుదాహరించెను.

"ఆద్యాచ సా ప్రకృతి శ్చాద్యప్రకృతిః = సంస్కృతభాషా, తస్యా స్సకల భాషానిదానత్వాత్. "అతఏవ శాస్త్ర మపౌరుష మాద్యం। ప్రాలం బక నిత్యప్రయోగలక్ష్మైస్తత్ । దృశ్య మతిస్థవిరం యజ్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః" ఇతి క్వచిత్పుస్తకే సరస్వతీ కరలిఖితఏవ శబ్దాను శాసన ప్రణీతత్వేన పద్యం స్థితమ్. ఆర్షసమః = వైదిక శబ్దతుల్యః. ప్రామా ణిక ఇతియావత్. శేషం సుగమమ్. తతో౽న్వర్థ మాద్యప్రకృతి రితినామ." (అహో. ౧౧౯ పుట)

దీనినిబట్టి "శాస్త్రమపౌరుష" మిత్యాది ప్రకృతకారిక చింతామణి లోనిదిగ నన్నయభట్టుచే రచింపఁబడెనని యెఱిఁగియు బాలసరస్వత్యహో

**వికృ—వర్ణలోపాగమా నైకే। సర్వస్మిం స్తద్భవే పదే।**
**భిన్నత్వం యుక్తవర్ణస్య। లోపాదేశాగమా స్తథా॥**

---

బలపతులు పైని వ్రాసినరీతిని సంస్కృత స్తానకతా మాత్రపరముగ దీని కర్థముచేసికొని యనావశ్యక మను బుద్ధితో దీనిని జింతామణిలోఁ జేర్పరైరని తోఁచుచున్నది. కాన నావ్రాసినరీతి నిది సుప్రసక్తమైయుండుటచే నిది యట్లు ప్రత్యాఖ్యేయము కానేరదని యెన్నఁదగును. హయగ్రీవశాస్త్రిలుగారి కృత కబాలసరస్వతీయములో (చూఁడుఁడు నా వ్రాసిన బాలసరస్వతీయ పీఠిక, 8-9 పేరాలు) నిది మూలముగ సంగీకరింపబడినది. అందులో నీశ్లోక మాంధ్ర శబ్దచింతామణి స్తావకముగా వ్యాఖ్యచేయఁబడెను. ఈ పక్షమున నన్నయభట్టు తన యీచింతామణిని 'అపౌరుషమ్. ఆద్యమ్. అతిస్థవిరమ్' అనుచు నసంగతముగా స్తుతించుకొనెనని చెప్పవలసివచ్చును. ఉద్ద్యోతినీ వ్యాఖ్యాకర్త యీశ్లోకము ప్రక్షిప్తమని తలంచి "ఇయ మార్యా ప్రాచీన తాళపత్రపుస్తకే నదృశ్యతే. ప్రక్షిప్తేవ ద్భాతి". (౧౦ సూత్రపు వ్యాఖ్య, ౧౧-పుట) అని యిట్లు వ్రాసెను. పాపము! ఈయన యహోబల పండితీయ మునైన సరిగఁ జూడకయే యీటీక వ్రాయుటచే నిట్టి ప్రమాదముల పాలగు చుండును. అహోబలపండితీయమున నున్న 'ప్రాలంబక నిత్య' అను పాఠ మున ఛందోభంగము దుర్నివారము కాన లేఖకాది ప్రమాదకృతము కానోపును. కావున హయగ్రీవశాస్త్రిలుగారి పాఠమే నాచే నంగీకరింపఁ బడెను.

ఇది గ్రంథాది సందర్భము

---

# వైయాకరణపారిజాతము

## II తద్భవ ప్రకరణము

(౭౮) వ్యా:—సర్వస్మిన్ = పలువిధములుగల, తద్భవేపదే = తద్భవ పదమునందును, నైకే = అనేకవిధములగు, (దీనికి వాక్యత్రయమునందును నన్వయము) వర్ణలోపాగమాః = వర్ణలోప వర్ణాగమములు, ఆదేశములును (ముందటి వాక్యములోని 'లోపాదేశాగ- మా స్తథా' అనుచోటి తథాశబ్ద

తద్భవే సంస్కృతీయే స్యు। రాదేశాద్యా స్తథాన్యతః
స్యా ద్వర్ణ స్య వ్యత్యయశ్చ కుత్రచి త్కవిసమ్మతః॥
కుత్రచి చ్ఛబ్దభేదేతు భవే త్పర్యస్త లి జ్గతా
తద్భవస్యాపి శబ్దస్య। దీర్ఘాన్తత్వం క్వచి ద్భవేత్ ॥
క్వచి దాద్యస్య శబ్దస్య। వికారే ప్యన్య వాచ్యతా.

---

ముచే 'ఆదేశములు' అనియు నుపలక్షితమగుచున్నది.) భవన్తి= అగుచున్నవి. "క్వచిదాద్యస్యేత్యాది కారిక చెప్పున నర్థమునందును నించుక మార్పుగల్గును. అర్థమునందును నాకారమునందును గొంత మార్పుగల్గుచుండఁగాఁ బ్రకృతితోడ బలమైన పోలిక వెలయుచుండుటయె తద్భవత్వమునకు లక్షణమని విశదమగుచున్నది. (అహో. ౧౨౩ మొ. ౧౨౭.వ). ఉదా:—సప్త = సత; రథము = అరదము మొ. తాలవ్య చకారము దంత్య చకారముగా మాఱుటమాత్రముచేత సయితము తద్భవత్వము నంగీకరింపనగునని ప్రౌఢవ్యాకరణకర్త యాశయము. (ప్రౌఢ-సంజ్ఞ-౬సూ.) 'రాజె - మంచము' మున్నగువాని నచ్చతెల్గు కావ్యములలోఁ గవులు వాడియున్నారు. ఇట్లె 'మూఁగ' అను నపభ్రంశ ప్రాకృతమునం దర్ధానుస్వారాగమముచేత సైత మది ప్రాకృతభవముగ నంగీకరింపఁబడెను. యుక్త వర్ణస్య = హల్ సంయోగముగల వర్ణమునకు, భిన్నత్వమ్ = విశ్లేషమును, తథా = ఆప్రకారముగానే యనఁగా మీఁదఁజెప్పినట్లె, లోపాదేశాగమాః= వివిధములగు వర్ణలోప వర్ణాదేశ వర్ణాగమములును, స్యుః = అగుచున్నవి. విశ్లేష సహకృతముగా వర్ణలోపాదులు యథాసంభవముగా సంభవించునని తాత్పర్యము. ఉ. చంద్రుఁడు = చెందురుఁడు; శ్రీ = సిరి; రత్నము = రతనము. అన్యతః = స్థలాంతరములందు, కుత్రచిత్ = కాదాచిత్కముగ, సంస్కృతీయే = సంస్కృత ప్రకృతికమగు, తద్భవే = తద్భవశబ్దమునందు, వ్యత్యయశ్చ=వ్యత్యయమనఁగా, వర్ణములు తార్మాఱగుటయు, కవిసమ్మతః= కవిసమ్మతము, స్యాత్=అగును. తథా = ఆప్రకారముగానే, ఆదేశాద్యాః= వివిధములగు వర్ణాదేశాదులును, భిన్నతయు, (వ్యత్యయము వచ్చు శబ్దములలోనే) స్యుః= యథాసంభవముగ నగుచున్నవి. సూత్రములోని చకారబలముచేత నీవ్యత్యయ వికృతి, భిన్నతలేకయె ప్రత్యేకముగ వచ్చుటయు, భిన్నతా సహకృతముగ వచ్చుటయుఁ గలదను నర్థలాభము కలుగుచున్నది. మఱియు దేశ్యములలో సయితమీవ్యత్యయ వికారముగలదు. ఉదా. (సం).

పారావతము = (తద్భ) పావురము. (వ్యత్యయము లేని తద్భవము-పారువము) (సం) ప్రేమ (తద్భ)-పెరిమె, పెరిమ; (సం.) ప్రేరించు = (తద్భ) పెర రేఁచు. మొ. దేశ్యములలోనివ్యత్యయము:—ఏఁడు+పది=డెబ్బది; పావురము=వారువము; ఇది యశ్వశబ్ద భవమని సూరకవిగారు వ్రాసిరి. కిట్టెలుదొరగారు దీనిని బాడబశబ్ద భవముగ నుదాహరించిరి. అర్వశబ్ద భవమని కొందఱు తలంచుచున్నారు. కుత్రచిత్ = ఒకానొకప్పుడు, కొన్ని తద్భవశబ్దములందు, పర్యస్త లిఙ్గతా = వ్యత్యస్తమయిన లింగము కలుగుటయు, భవేత్ = అగును. ఉదా:—ఈర్ష్య=ఈరసను. పీటిక = పీడ్యము. మొ. తద్భవస్య శబ్దస్య= తద్భవమైన శబ్దమునకు, క్వచిత్ = ఒకా నొకప్పుడు, దీర్ఘాన్తత్వమపి = దీర్ఘమునకు హ్రస్వమురాక దీర్ఘాంతముగనే యది నిల్చియుండుటయు, భవేత్ = అగును; ఉదా. పల్లకీలు = పల్లకులు. పల్ల్యంకిక = పల్లకి, = పల్లకీ. "ప్రోల్లసత్పల్లకీ శబ్దైః" (అహో. ౩౦౩) అను ప్రయోగమును జూపి యిది తత్సమమె యని యహోబలపతి సమర్థించెను. కాని యచటఁ దెనుఁగు శబ్దమె సంస్కృత సమాసములో దీర్ఘాంత సంస్కృతనామముగ ననుకరింపఁబడెననియుఁ, బల్లకీశబ్దము సంస్కృత వాఙ్మయమున లేదనియు నెన్న నగును. సంస్కృత కోశములందెందును నయ్యదిలేదు. ("రేపల్లెవాడ నగరీ నగరీయసీతి" అనునది మున్నగు వానియందువలె సిద్ధసమానగతిని సమర్థింపనగును)

క్వచిత్ = ఒకానొకప్పుడు, ఆద్యస్య శబ్దస్య = సంస్కృత శబ్దము యొక్క, వికారే = వికృతియం దనఁగాఁ దద్భవమునందు, అన్యవాచ్యతా = అన్యార్థకత్వమును గలుగుచున్నది. ఆకారమందువలెనె యర్థమునందును దద్భవత్వమున మార్పు గల్గునని భావము. (౭౮ విష.) ఉదా:— గౌరవము – గారవము (ప్రేమ); కన్య = కన్నియ = కన్య (లేఁతది). స్వత్వము = సొత్తు; (సొంతము). అక్షయము = అక్కజము. సంభ్రమము= సంబరము = సంబ్రమము; (సంతోషము, పండుగు.)

(౪౯) ప్రకృత సూత్రమునఁ గొన్ని యపపాఠము లహోబలపండితీయాదులందుఁ బడియున్నవి. నాయొద్దనున్న కాగితపు లిఖిత మాతృకలో "వర్ణలోపాగమా నైకే" అనియె యున్నది. కాని ముద్రితాహోబల పండితీయమున "వర్ణలోపాగమా నేకే" అని యున్నది. అహోబలపండితీయ ముద్రణమునకుఁ జాలముందటిదగు ద్వాత్రింశిణీ సీతారామ కవిగారి

వికృతి వివేక టీకలో "వర్ణలోపాగమాన్, ఏకే," అని వ్యాఖ్య చేయఁబడియు న్నది. కారికలోని ముందటి వాక్యమునందలి 'లోపాదేశాగమా స్తథా' అనెడి నిర్వివాదపాఠములోని ప్రథమయె యిచట సయితము 'ఆగమాన్' అను ద్వితీయాపాఠము సరికాదని విశదీకరింపఁ జాలియున్నది. మఱియు వర్ణలోపాగమాదులు తద్భవమునందు వచ్చునని చెప్పుట సర్వసమ్మతము గాన "ఏకే" అను మతాంతరత్వ బోధకశబ్ద ముండుట సరికాదు. కావున 'నేకే' అను పాఠ ముపేక్షితమయ్యెను. మఱియు నిచటి వికృతివివేక టీక యీ తప్పులోనే కాక వివిధాపార్థములతో నిండియున్నందుచే నద్దాని నుపేక్షించు టలో సంకోచింప నక్కఱలేదు.

ఇచట ముద్రితాహోబల పండితీయములోని 'స్వభిన్నత్వం యుక్త వర్ణ। లోపాదేశాగమా స్తథా" అను పాఠము ముద్రణ ప్రమాదజనితము. అహోబలపతి దానికి వ్రాసిన "యుక్తవర్ణస్య = సంయుక్తవర్ణస్యేత్యర్థః" అను వాఖ్యయె పై విషయమును స్పష్టపఱుచుచున్నది.

"వర్ణలోపాగమా నేకే। (నైకే) సర్వస్మిం స్తద్భవే పదే" ఇత్యుక్త్వా పునః స్పష్టార్థం 'భిన్నత్వం యుక్త... ... ... ... సమ్మత' ఇత్యుక్తమ్" (అహోబల ౧౨౩ పుట) అనియిట్లచట నథర్వణుడు స్పష్ట ప్రతిపత్తికై పునరుక్తముగఁ జెప్పెనని యహోబలపతి వ్రాయుట సరికాదు. ప్రకృత కారికలలో వర్ణలోపాదులు వచ్చునను వాక్యము మూఁడుసారులు పడి యుండుట చేత వానిని సరిగ నన్వయించి కొనక యహోబలపతి యిట్లో కస్థలము పునరుక్తమని వ్రాసెను. ఇఁక మూఁడవస్థలమును సరిపెట్టు కొనుటకయి 'తథాన్యతః' అను చోట 'తదన్యతః' అను పాఠము నంగీ కరించి సంస్కృతభ వేతరములగు ప్రాకృత భవములందు సయితము లోపాదులు వచ్చునని యన్వయించెను. ఇట్టి సమన్వయమున నహోబలపతి బుద్ధిపూర్వకముగ నగతికత్వమున నంగీకరించిన పౌనరుక్త్య మటుండఁగా వర్ణవ్యత్యయ రూపవికారము సంస్కృతభవములలో రాదనెడి యనిష్టార్థ ము సయితము దుర్వారమగుచున్నది. మఱియు నీ వర్ణవ్యత్యయవికారము పారావతాది శబ్దభవములగు "పావురము" మున్నగు సంస్కృతభవముల లోనె సాధారణముగ నగపడుచున్నది. వర్ణవ్యత్యయ సహాకృతముగ నాదే శాదులు వచ్చునని యర్థముచేయనపుడు "సర్వస్మిం స్తద్భవే పదే" అను టచేతనే సిద్ధించెడి వర్ణలోపాదులను ప్రాకృతభవముల విషయమున

మరలఁజెప్పుట వ్యర్థమగునుగదా. "సంస్కృతీయో తద్భవే" అని మరల విశేషించి చెప్పుటచేత వ్యత్యయము సాధారణముగ సంస్కృతభవములందే యగపడునని విశదమగుచున్నది. భిన్నతయు సంస్కృతభవములందే తఱచుగ నగపడుచున్నది. అట్లని ప్రాకృతశబ్దములలో వ్యత్యయ భిన్నతలనెడి వికృతులులేవని తలంపరాదు. తెల్గులోనికి వచ్చెడి ప్రాకృతసమ ప్రాకృత+భవశబ్దములలో నట్టి వికృతులు మిక్కిలి యరుదని యెన్ననగును. ప్రాకృతసమములలో 'సిరి' అనుచో మాత్రము భిన్నత యగపడును. 'రతనము' అనునది ప్రాకృతభవ మనరాదు. అది ప్రాకృతమున "రఅణం-రయణం" అని యుండును.

(౫౦) "సంస్కృతీయే తద్భవే" అనుదాని స్వారస్యమునఁ దెనుఁగులోనికి వచ్చు ప్రాకృత భవములును గలవను నభిప్రాయము తేలుననియు నది "ఆద్యా మహార్ష్ట్రే" త్యాదికారికకు విరుద్ధమనియు (౨౩ విమ.) శంకింపరాదు. ప్రాకృతభవాదులను సైతము సంస్కృత ప్రకృతులనుండియే సాధించుకొననగును గాన నాంధ్రులు సంస్కృతమునువలెఁ బ్రాకృతమును సైతమభ్యసింపవలెనను నిర్బంధము లేదని 'ఆద్యే' తి సూత్రముచేఁ జెప్పెనే కాని బ్రాకృతభాషనుండి కొన్ని తద్భవములు కలుగలేదని యాతఁడు చెప్పియుండలేదు. మఱియు వ్యత్యయము సంస్కృతమునుండి వచ్చిన తద్భవములలోనె యగపడుచున్నదని తెలుపుటకు మాత్రమె "సంస్కృతీయే" అను దళమును నిల్పెనని యెన్ననగును. ఇంతియకాక వ్యత్యయ సహకృతములగు వర్ణలోపాదులు కేవల సంస్కృతభవములందు మాత్రమె వచ్చుననియు, 'సంస్కృతీయే' అనుదళమువలన విశదమగుచున్నది. ఇంకఁ గేవల వర్ణలోపాగమాదికము మాత్రమన్నచో తద్భవములందెల్ల రావచ్చునని 'సర్వస్మిన్' అనుదళమువలన విశదమగుచున్నది.

(౫౧) ప్రకృతిద్వయమునుండియు వచ్చిన కొన్ని తద్భవముల నీసందర్భమున బాలసరస్వతి యుదాహరింపఁగా వానికిని మఱికొన్నిటికిని నప్పకవి ప్రాకృత సూత్రప్రక్రియను జూపెను. అహోబలపతి యట్టివానిలో 'చంద్ర, లక్ష్మి, ద్యూత' శబ్ద తద్భవప్రసంగవిషయమున నప్పకవి బాలసరస్వతుల ప్రమాదములను విపులముగఁ జూపెను. విస్తరభీతి నిట నుదాహరింపలేదు. అట్టి చంద్రాది శబ్దముల యుదాహరణముల సందర్భమునఁ దద్విషయములు చూపఁబడును.

(గీ౨) తద్భవశబ్దములకుఁ బ్రకృతులను జూపుటలో సంస్కృత శబ్దములనే కాక ప్రాకృతశబ్దములను సైతము చూపుట, చింతామణికర్తకును బాలసరస్వత్యప్పకవ్యహోబలపతులకును నాధునికుఁడగు బాలవ్యాకరణకర్తకును సమ్మతమె యై యున్నను వెనుక నుదాహరించిన రీతిగ నధర్వణునకు సమ్మతమైయున్నట్లగపడదు. ఆంధ్రవాఙ్మయ పఠనమువలన సంస్కృత శబ్దము లలవడినట్లు ప్రాకృత శబ్దములు తెలియనేరవు. ఇంక "ఈ తద్భవమునకుఁ బ్రకృతి యీ ప్రాకృతశబ్దము" అని తెలియుటకు సూత్రమె యాంధ్రాభ్యాసకులు ప్రాకృతభాష నభ్యసింప వలయును. ఇంత శ్రమపడినను నట్టి ప్రాకృతశబ్దము సయితమాంధ్రాభ్యాసకులకుఁ దెలిసిన సంస్కృత శబ్దమునుండి పుట్టినదై యుండునుగాని యది వేఱుప్రకృతి కాదు. మఱియుఁ బైనుదాహరించిన వైయాకరణులు సంస్కృత ప్రాకృత ప్రకృతులను మాత్రము చూపిరేకాని యీ యా వైకృతము లేర్పడుటలోని ప్రక్రియ నెవ్వరును జూపియుండలేదు. అప్పకవి మాత్రము, "చంద్ర, సముద్ర, లక్ష్మి, ద్యూత, శాణ, రాజకుల, మూక, యక్ష" శబ్దములందుఁ గల్గినవర్ణ వికృతులను జూపుటకు యత్నించెను. కాని యాతఁడు సైతమాశబ్దములు ప్రాకృతములోనికి వచ్చువఱకుఁ గల వికృతులను మాత్రమె ప్రాకృత వ్యాకరణ సూత్రముల నుదాహరించి చూపెనుగాని యట్టి ప్రాకృత ప్రకృతులనుండికాని వాని సంస్కృత ప్రకృతులనుండికాని యేర్పడిన తద్భవములందు సంభవించిన వికృతుల కనుగమములను గల్పింప యత్నింపలేదు. ఇంక నితరమగు తద్భవశబ్ద ప్రపంచ మేర్పడుటలోని వికృతుల ప్రక్రియ చూపలేదని వేఱుగఁ జెప్పనక్కఱలేదుగదా. ఆంధ్రవైయాకరణులలో నట్టి తద్భవప్రక్రియను వివరించిన ప్రామాణికుఁ డొక్క డడిదము సూరకవి మాత్రమె యనవచ్చును. సూరకవి తెలుగుభాషలో నట్టితద్భవ ప్రక్రియను వివరించి యుండఁగా నట్టి సూత్రములఁ గొంతవఱకు సవరించి బలారిసింహ నరసింహ రాజసింహుఁడు కవిజనాంజనమను చింతామణి టీకలో * నా సూర

* కవిజనాంజనమను చింతామణిటీక బలారిసింహ నరసింహ రాజసింహ కృతమైయున్నది. దీనియం దీతని కృతి చాల తక్కువ. ఈతఁడు బాలసరస్వతీయమునె చింతామణిసూత్రవ్యాఖ్యగా నెల్లయెడలను వ్రాసి యచ్చటచ్చటఁ బైకెత్తిన గ్రంథాంతరస్థ విషయములను విశేషించి వ్రాయుచువచ్చెను. ఈతఁడిట్టి తన రచన క్రింది పద్యమును మాత్రము గ్రంథాదిని జెప్పియున్నాఁడు. గీ॥ హ్రస్వముగఁ డీక బాలసరస్వతుండు। చేసె దానికి నేను విశేషముగను। గవిజనోక్తులు లక్ష్యముల్ గాఁగఁ జేతుఁ। గవిజనాంజన మనెడు వ్యాఖ్యాన మొకటి॥ (కవిజనాంజనము గ్రంథాది సందర్భము).

కవి యనుగమములనే గీర్వాణించి యున్నాఁడు. కాని తా నట్లు సూరకవి గ్రంథమునుండి సంగ్రహించి సవరించి శ్లోకరూపమునఁ జెప్పినట్లు వ్రాయ లేదు. కాని యీతఁడు తన కవిజనాంజనములో నొకచోట నీక్రింది రీతిని గవిసంశయవిచ్ఛేదమును స్మరించియున్నాఁడు. "అకారాంతముల మీఁదను గలదని నిశ్చయించుటకుఁ గవిసంశయవిచ్ఛేదము ఆ॥ వె॥ కర్మధారయంబు గావించుచో నకా రాంతమైన యట్టి యాంధ్రపదము। ... ... ..." (కవి జనాం.౧౧౦పుట.)" ఈసందర్భమునుబట్టి కవిసంశయవిచ్ఛేదములోనిదె, మూల మనియు దానినె నరసింహరాజుగారు సంస్కరించి గీర్వాణించి రనియుఁ జెప్ప నగును. మఱియు వీరుచేసిన సంస్కారమునుబట్టియు వీరిచ్చిన కవిసంశయ విచ్ఛేదములోనివే యగు నుదాహరణములనుబట్టియుఁ బై విషయము నిశ్చి తము కాగలదు.

౫౩—౬౧. విషయములు - కవిజనాంజన తద్భవ సూత్రములు—

(౫౩)—"ఉత్వస్య వా భవే దోత్వ। మోత్వ మాత్వస్య జాయ తే। ఋకా రస్య భవే ద్రిత్వ। మేత్వ మిత్వం భవే దుతా (ఉతా=ఉత్వమ్)। ఏకారశ్చ భవే దైత్వమ్"

ఉవర్ణ మొవర్ణమగును. ఉ. కులము= కొలము. (కూశ్మాండము = గుమ్మడి. ఇది సరియగు నుదాహృతి కాదు.)

ఓకార మాకారమున కగును. ఉ. ప్రౌఢ = ప్రోడ. ఋకారమునకు 'రి, ఎ, ఇ, ఉ, అను వానిలో నేదేని యగును. ఉదా. ఋక్షము = రిక్క; మృగము=మెకము; మృత్యువు = మిత్తి; పృథివి = పుడమి మొ.

ఐకారమున కేకారమగును. ఉదా. వైరము= వేరము.

(౫౪.)—'బిందో ర్లోపో భవిష్యతి.' బిందువు లోపించును. ఉదా— ఏకాంతము=ఏకతము. మొ.

(౫౫) ఊర్ధ్వ రేఫస్య లోప స్స్యా। దధో రేఫస్య వా భవేత్. సంయోగ ములో మీఁదనున్న రేఫము లోపించును. క్రింది రేఫము బహుళముగ లోపిం చును. ఉదా. వర్తి=వత్తి, ధాత్రి=దాది, మొ.

(౫౬) అథో యత్వస్య చైత్వం స్యా। దియో భవతి తస్యచ. సంయో గములోని క్రింది యకారము 'ఎ, ఇయ' అనువానిలో నేదే నగును. ఉదా. కన్య=కన్నె, కన్నియ మొ.

అథో యత్వస్య లోప స్స్యాత్. సంయోగములోని క్రింది యకార మొకప్పుడు లోపించును. ఉదా. మాణిక్యము=మానికము మొ.

(౫౭) ద్విత్వైకస్యచ లు గ్భవేత్. సంయోగములో నొకవర్ణము లోపించినపుడు పరిశిష్టహల్లు ద్విరుక్తమగుటయు నట్టి ద్విత్వములో నొకటి క్వాచిత్కముగ లోపించుటయుఁ గలదు. ఉదా. కూశ్మాండము = గుమ్మడి; మాణిక్యము=మానికము. మొ. (ఈ సూత్రము కవిజనాంజన ముద్రణ ప్రమాదమున భ్రష్టమయినను నుదాహృతులనుండి వ్యక్తమగుచున్నది.)

(౫౮.) టవర్గస్య తవర్గస్య మైత్రీ స్యా దితరేతరమ్. ట త వర్గవర్ణములు పరస్పర పరిణామము నందుచుండును. ఉదా. ఖడ్గము=కత్తి; చిత్రములు=చిట్టలు మొ.

(౫౯.) ఏకస్మిన్నేవ బిన్దు స్స్యాత్. ఒకానొకచో బింద్వాగమమును గల్గును. ఉదా. కేతకి=గేదంగి=గేదఁగి.

(౬౦) క్షస్య ద్వికచ సాః క్రమాత్. క్షవర్ణస్థానమున— 'క్క, చ్చ, స' అనువానిలో నేదేని నిల్చును. ఉదా. ఋక్షము = రిక్క; లక్ష్మి=లచ్చి; క్షేమము=సేమము మొ.

(౬౧.) ద్వితీయస్య చతుర్థస్య। తదాది ర్భవతి క్రమాత్. తత్తద్వర్గ ద్వితీయ చతుర్థములకుఁ దత్తద్వర్గ ప్రథమ తృతీయములు వరుసగ నగును. ఉదా. ముఖము=మొకము; ప్రౌఢ=ప్రోడ మొ.

కఖయో రపి గప్రాప్తిః. కఖలు గకారాకారమునందుటయుఁ గలదు. ఉదా. కుంతి=గొంతి; ఖాతము=గాత మొ.

(౬౨) శషయో స్సత్వ ముచ్యతే. శషలు సకారరూపముందును. ఉదా. ఆశ = ఆస; భాష=బాస మొ.

(౬౩) తటయో ర్ణళరేఫాణాం। డత్వాదేశో భవే దిహ. 'త, ట, ణ, ళ, ర' అనునవి డకారముగ మాఱవచ్చును. ఉదా. పతాక = పడగ; అటవి=అడవి; గ్రామణి = గామిడి; నారికేళము = నారికెడము; సంగరము=జగడము మొ.

(౬౪) జ్ఞణలానాం భవే న్నత్వమ్. జ్ఞ, ణ ల, లు నకారరూపము నందును. ఉదా. ఆజ్ఞ=ఆన; గుణము=గొనము; త్రిలింగము= తెనుఁగు మొ.

(౬౫)—కహయో ర్యత్వ ముచ్యతే. కహలు యకారరూపము నందును. ఉదా. మల్లిక=మల్లియ; సందేహము సందియము మొ. 'కహలు లోపించి యకారము వచ్చెననుట లెస్స'.

(౬౬.) తవర్గస్య చవర్గస్య । రలయో శ్చసయో స్తథా । పవయో శ్చాపి మిత్రత్వమ్. తచవర్గములకుఁ బరస్పరపరిణామము కల్గును. ఉ. భూతము = బూచి; సూచి=సూది; అట్లె రలలు పరస్పరము మాఱును. ఉ. స్థూలము = తోరము; గంధర్వము = కత్తలాని (కత్తళము, కత్తళుఁడు); అట్లె చసల న్యోన్యము మాఱును. ఉదా. నారాచము=నారసము; హంస = అంచ. అట్లె పవలు పరస్పరము మాఱును. ఉ. ద్రౌపది = ద్రోవది; శవము=సవము. మొ.

(౬౭.) హ్రస్వో భవతి దీర్ఘతః. దీర్ఘము హ్రస్వ మగును. కస్తూరి= కస్తురి.

(౬౮.) హజబాం పూర్వ బిన్దూనాం । గత్వాదేశో భవే దిహ. బిందు పూర్వకములగు 'హజబ' అనువానికి బిందుపూర్వక గకారాదేశ మగును. ఉదా. సింహము = సింగము; సింజిని = సింగిణి; కంబళము=గొంగళి మొ.

(౬౯.) యకారస్య జకార స్స్యాత్. యకారమునకు జకార మగును. ఉ. యజ్ఞము=జన్నము మొ.

అచాం వత్వ ముదీరితమ్. అపదాది స్వరము వకారయుత మగును. ఉ. (అన్నము=వణ్ణము - ఈ సూరకవి యుదాహృతి సరికాదు. వణ్ణము గ్రాంథికము కాదు). ఎన్ను=వెన్ను మొ.

మకారస్య వకార స్స్యాత్. మకారము వకారమగును. ఉ. హిమము= ఇవము. మొ.

వకారస్య చ గో భవేత్. వకారము గకార మగును. ఉదా. ప్రవాళము=పగడము.

తవర్గస్య యకారః స్యాత్. తవర్గు యకారముగ మాఱును. ఉదా. రాత్రి=రేయి.

రేఫో భవతి చ క్వచిత్. ఒకానొకప్పుడు రేఫాగమము నగును. ఉదా. తంతువు=త్రాడు మొ.

(౭౦.) హకారోఽచం సమాప్నోతి. హకారము లోపింపఁగ దానిమీఁది స్వరము నిల్చును. ఉ. హంస=అంచ.

(౭౧.) ఇరీరా వృడి చైరిచ. 'ఇరి, ఇర, ఉడి, ఏరి' అను నాగమములును నగును. ఉ. సాక్షి=సాకిరి; భిక్ష = బికిరము; ప్రేమము=ప్రేముడి; దేవి = దేవేరి మొ.

క్వచిద న్త్యే సవర్ణః స్యాత్. ఒకానొకప్పుడు తుదివర్ణమునకు సవర్ణ మగు (మిత్రమగు) నక్షర మగును. ఉ. రేఖ=రేక; జట=జడ; క్వచి దత్వం భవే దితామ్. ఒకప్పుడు తుది 'ఇ' కార మకార మగును. ఉ. యువతి = ఉవిద; నిశ్రేణి=నిచ్చెన మొ.

క్వచి దస్య భవే దిత్వమ్. ఒకానొకప్పుడు తుది 'అ' కారమునకు 'ఇ' కార మగును. ఉ. ఖడ్గము=కత్తి. "'ఉవ' తస్య క్వచి ద్భవేత్". తుది 'అ'కారముచోట నొకప్పుడు 'ఉవ' నిల్చును. ఉదా:– అర్ఘము=అగ్గువ. మొ.

(౨౨.) తద్భవప్రక్రియను జూపుటలో సూరకవి ప్రాకృతసమ ప్రాకృతభవములకు సైతము సంస్కృత ప్రకృతులనుండియే రూప సాధన ప్రక్రియను జూపియున్నాఁడు. కాఁగా నథర్వణ సూరకవుల మార్గ మేకీభవించెనని చెప్పనగును. సూరకవియే కాక సర్వలక్షణ సార సంగ్రహమును రచించిన కూచిమంచి తిమ్మకవియు సంక్షేపముగఁ దద్భవ ప్రక్రియను వివరించి యున్నాఁడు. అట్లు వివరించుటలో నాతఁడును బ్రాకృత సమ ప్రాకృతభవశబ్దములను సైతము సంస్కృత ప్రకృతులనుండియే సాధించియున్నాఁడు.

ప్రాచీనులగు నాంధ్రభాషాభూషణకర్తయు, గావ్యాలంకార చూడామణికర్తయుఁ దద్భవశబ్దముల ప్రకృతులను జూపుటలోఁ బ్రాకృత సమ ప్రాకృతభవములకు సైతము సంస్కృత ప్రకృతులనే చూపిరిగాని ప్రాకృత ప్రకృతులను జూపి యుండలేదు. అందును జూడామణి కర్తయగు విన్నకోట పెద్దనార్యుఁడు సంస్కృతశబ్దములను దెనుఁగువారు వ్యవహరించు టలో నపభ్రష్టములగుచుఁ బ్రాకృతశబ్దములవలెనే తెనుఁగు తద్భవములును నేర్పడినవని యీ క్రింది రీతిని స్పష్టముగాఁ జెప్పి యున్నాఁడు.

"ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వాయమ" (కావ్యా. చూ. ౯ ఉల్లా. ౮–పద్య.) (చూ. ౪౦ విష)

ప్రాకృతాహ్వాయ మనఁగాఁ బ్రకృతి జనవ్యవహారసిద్ధ మని తాత్పర్యము.

కం॥ వదలక సిద్ధాక్షరములఁ
బొదివిన వర్ణములఁ దూలి పోఁ బలుకఁగ న।
ర్థదమై ప్రాకృతనిభ మగు
నదియే తద్భవము నాఁగ నభిమత మయ్యెన్॥ (౯.ఉల్లాసము,౧౪.పద్య.)

సీ॥ యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు చంద్రముఁడను పేరు
చందమామ। ... ... ... ... (౯ ఉల్లా. ౧౪ పద్య.)

ఆంధ్రభాషాభూషణకర్త యగు కేతనమంత్రి పయిరీతిని స్పష్టముగాఁ జెప్పియుండకున్నను "సిరి" మున్నగు ప్రాకృత సమములకును "జేముఁడు" మున్నగు ప్రాకృతభవములకును సంస్కృతపదములనె ప్రకృతులనుగాఁ జూపెను గాని ప్రాకృతశబ్దములను జూపి యుండలేదు.

సీ॥ అర్ఘంబె యగ్గువ, దీర్ఘిక డిగ్గియ, గుణములు గొనములు, కులము కొలము।
స్నిగ్ధంబు నిద్దంబు, శ్రీ సిరి, భంగం(గ్నం)బు బన్నంబు, దిశ దెస, భాష బాస।
యక్షులు జక్కులు, యముఁడు జముండగు, నాజ్ఞప్తి యానతి, యాజ్ఞ యాన।
ద్యూతంబు జూదంబు, దోషంబు దోసంబు, ముగ్ధుండు ముగుదుండు। ముఖము మొకము॥
తే॥ పసదనంబు ప్రసాదనం, బసము యశము।
సమ్మెటయె చర్మయష్టి, కర్జంబు కార్య
మీరసం బీర్ష్య, వైరంబు వైర, మిట్టి।
పగిదిపల్కులు తద్భవ పదము లయ్యె॥ (ఆంధ్రభాషాభూష. ౬౧పద్య.)

(23) ఈసందర్భమున నీక్రింది విషయములను విచారింపవలసి యున్నది.

I. సంస్కృతమును మాటలాడెడి యార్యులు తెనుఁగుదేశమునకు వచ్చి యట్లు సంస్కృతముతో మాటలాడుకొనుచుండఁగాఁ వారికి లోఁగిపోయి తెలుఁగువారును నట్టి సంస్కృతముతో మాటలాడ యత్నించుటలో నపభ్రష్టమై వికృతిభాష యేర్పడినదా?

II. "సంస్కృతసమము సంస్కృతభవము ప్రాకృత దేశ్యము" అను మూఁడు తెగలుగల ప్రాకృతమును మాటలాడువారు తెలుఁగుదేశమును వశపఱుచుకొని యట్టి ప్రాకృతముతో మాటలాడుచుండఁగాఁ దెలుఁగువారును నద్దానితో మాటలాడ యత్నించుటలో నపభ్రష్టమై యీవికృతిభాష యేర్పడినదా?

III. సంస్కృత ప్రాకృతపండితులు ముఖ్యముగా సంస్కృతపండితులు తెల్గుదేశమునకు వచ్చి తెల్గురాజులను దమ విజ్ఞానాతిశయమున వశపర్చుకొని దేశమునఁ బ్రాముఖ్యము నంది తెలుఁగుభాష కలవాటుపడి తెల్గుభాష యలంతి యగుటచేతను దమ సంస్కృతప్రాకృతముల యలవాటుచేతను సంస్కృత

శబ్దములకును సరుదుగాఁ బ్రాకృతశబ్దములకును దెలుఁగు విభక్తులనుజేర్చి తెలుఁగుగా మాటలాడుచుండఁగా నట్టివాని నాంధ్రులు వాడుటలో నపభ్రష్టములయి యాతద్భవము లేర్పడినవా ?

చరిత్రమునుబట్టి పై విషయములను విమర్శించుట కవకాశము లేదు. కొందఱు పాశ్చాత్యపండితులు చరిత్రమునుబట్టి పై విషయములవంటి వానినె విమర్శింప యత్నించిరేకాని కృతార్థులు కాలేకపోయిరి. వారికి మన దేశపు చరిత్రమున రెండువేల యేనూఱేండ్లకు వెనుకటి విషయము లేమియుఁ దెలిసియుండలేదు. ఆ తెలిసినదియు వెనుకకు వెళ్ళినకొలఁదిని జాల సందేహభూయిష్ఠముగనే యున్నది. ద్రావిడభాషలకుఁ గల సంస్కృత ప్రాకృతములతోడి సంబంధ మన్ననో యంతకన్న మిక్కిలి ప్రాచీనమైనదియుఁ జరిత్రమున కందనినాఁటిదియు నయి యున్నది. ఆకారణముచేతఁ బయివిషయముల నాంధ్రభాషలోని శబ్దములనుబట్టి పరిశీలించుటయె సమంజసమని తోఁచి యట్లుచేయుచున్నాను.

(౭౮) పయిమూఁడు పక్షములలోను బూర్వపక్ష మెంతమాత్రమును సిద్ధాంతము కాదు. సంస్కృతముతో సంబంధమే లేని దేశభాష యాంధ్రమున మిక్కిలి ప్రాచీనమై ప్రచురమై వ్యాపించియున్నది. సంస్కృతనామములకుఁ జేర్చు సుబ్విభక్తులుగాని సంస్కృతధాతువులపై నిల్చు తిఙ్విభక్తులుగాని వాని వికృతులుగాని యాంధ్ర సుప్తిఙ్విభక్తులలో నగపడవు. సంస్కృతశబ్దములను దెలుఁగున వాడునపు డట్టి సంస్కృత ప్రకృతులకుఁ దెల్గువిభక్తులను జేర్చి వ్యవహరించుట యనాది సంప్రదాయమై యున్నది. ఇంతియకాక యార్యులును నాంధ్రులును సంస్కృతమును వాడుటలోనె యపభ్రష్టమై యాంధ్ర మేర్పడినపుడు వాఙ్మయగంధము లేని సర్వజన వ్యవహారయోగ్య భాషలో సంస్కృతభవము లధికములుగ నుండి తీరవలయును గదా. కాని సంఖ్యావాచకములు, సర్వనామములు, 'తల్లి తండ్రి' ప్రభృతిశబ్దములు మున్నగు సర్వజనవ్యవహారస్థపదములలో నాంధ్ర దేశ్యపదములె యత్యధికముగను దద్భవ శబ్దము లత్యల్పములుగను వెలయుచున్నవి. కాఁగా సంస్కృత భాష వాడుక భాషగ నుండునపు డది యపభ్రష్టమై యాంధ్ర మేర్పడె ననుట సరికాదు.

(౭౯) పయివానిలో రెండవపక్షమనఁగాఁ బ్రాకృతము నాంధ్రులు వాడుటలో నపభ్రష్టమయి తెనుఁగుభాష యేర్పడెనను పక్షము సయితము

సరికాదు. ఈవిషయమునందును బైని జెప్పినయుక్తులె చాలి యున్నవి. విశాలమగు నాంధ్ర దేశ్యభాషకుఁ బ్రాకృత వ్యాకరణ సిద్ధభాషతోఁగాని ప్రాకృత వాఙ్మయస్థ భాషతోఁగాని యేమాత్రమును సంబంధము లేదు. ప్రాకృత దేశ్యమని చెప్పఁబడుచున్న దేశ్యనామార్థ కోశాదులలోని భాషలో ననేకములు తద్భవములె యైయున్నవి. మఱియు నట్టి ప్రాకృత దేశ్య మత్యల్పము. అందును నత్యధికపదముల కాంధ్ర దేశ్యపదములతో సంబంధమే యగపడదు. సంస్కృత జన్యములగు ప్రాకృతములలో సంస్కృతవిభక్తుల పరిణామ రూపములె వెలయుచున్నట్లుగా నాంధ్ర సుప్తిఙ్విభక్తులు సంస్కృత ప్రాకృతవిభక్తుల నేమాత్రమును సంబంధింపక ద్రావిడాద్యాంధ్రశబ్ద తత్పరిణామ రూపములై యున్నవి. ప్రాకృతశబ్దము లేవేని తెనుఁగులోనికి వచ్చునప్పు డవి తెనుఁగు విభక్తులతోడనే వాడుక కెక్కినవి.

| సంస్కృత విభక్త్యంతములు | ప్రాకృత విభక్త్యంతములు | సంస్కృత విభక్త్యంతములు | ప్రాకృత విభక్త్యంతములు |
|---|---|---|---|
| రామః | రామో | పితా | పిఆ |
| దేవాః | దేవా | రాజా | రాఆ |
| చన్ద్రమ్ | చంద్రం | బ్రహ్మా | బ్రమ్హా |
| హారేణ | హారేణ | సర్వే | సవ్వే |
| సురైః | సురేహి | ఇమే | ఇమే |
| పలాశాత్ | పలాసాదో | సర్వస్మిన్ | సవ్వస్సిం |
| డిత్థస్య | డిత్థస్స | త్వదీయమ్ | తువం |
| నారాయణే | నారాఅణే | భవని | హోంతి |
| రసికేషు | రసిఏసు | వర్ధన్తే | వద్ధంతి |
| ధర్మే | ధమ్మే | భవిష్యామి | హోస్సామి |
| అగ్నినా | అగ్గిణా | గన్తవ్యః | గంతవ్వో |
| వాయునా | వాఉణా | గృహీతుమ్ | ఘేత్తుం |
| అగ్నిభిః | అగ్గిహి | వర్ధితుమ్ | వడ్ఢిఉం |
| బాలే (సంబో) | బాలే (సంబో) | భోక్తుం | భోత్తుం |
| భర్తృణా | భత్తుణా | | |

సంస్కృత విభక్తులతోఁగాని ప్రాకృతవిభక్తులతోఁగాని తెనుఁగు విభక్తుల కిట్టి సంబంధము గలదని యెవ్వరును జెప్పలేరుగదా!

మఱియుఁ గాలక్రమమున భాషలయందు మార్పు కలుగుచు వచ్చిననువాని స్వభావముమాత్రము తత్తత్పరిణామ పరంపరల నించుమించుగ ననుగమించుచునే యుండును. సంస్కృతశబ్దములనుండి ప్రాకృతశబ్దము లేర్పడుటలోని ప్రాకృతభాషా వైకృత స్వభావములకును సంస్కృతమునుండియే తెనుఁగులోనికి శబ్దములు పరిణమించునపుడు గల్గెడి యాంధ్రభాషా వైకృత స్వభావములకును జాల వ్యత్యాసమగపడుచున్నది. ఈ విషయము సైతమాంధ్రము ప్రాకృతజన్యము కాదనుటకుఁ గొప్ప నిదర్శనమయి యున్నది.

ఆంధ్రమునను నేకాక ద్రావిడభాష లన్నిటిలోను సంస్కృత శబ్దములలోని వర్గద్వితీయ చతుర్థములు వరుసగా వర్గప్రథమ తృతీయములుగా మాఱిపోవును. వీని తద్భవములలో మచ్చునకైన వర్గీయ మహాప్రాణ వర్ణము నిలువనేరదు. కాఁగాఁ బ్రాచీనాంధ్ర దేశ్య భాషలో వర్గీయ మహాప్రాణ వర్ణములు లేనందున నట్టిస్వభావమే యాతద్భవములలోనికి వచ్చియుండుననుటకు సందియములేదు.

ప్రాకృతములోనికి వచ్చెడి సంస్కృతభవములయం దన్ననో ధారాళముగా వర్గద్వితీయ చతుర్థవర్ణములు వెలయుచుండును. మీఁదు మిక్కిలిగ సంస్కృతములోని వర్గప్రథమ తృతీయములకును నీ మహాప్రాణ వర్ణములాదేశము లగుచుండును.

| | సంస్కృ. | ప్రాకృ. |
|---|---|---|
| 'ఠో ఢః' (ప్రాకృతమంజరి. ౨ పరి. ౨౨ సూ.) | మఠో | మఢో |
| 'సటా,శకట,కైటభేషు ఢః' ( " " ౧౮ సూ.) | సటా | సఢో |
| 'ఫో భః' ( " " ౨౩ సూ.) | రేఫః | రేభో |
| 'కుబ్జే ఖః' ( " " ౩౨ సూ.) | కుబ్జం | ఖుజ్జం |
| 'బిసిన్యాం భః' " " ౩౫ సూ.) | బిసినీ | భిసిణీ |
| షట్ శాత సప్తపర్ణేషు ఛః ,, ౧౨ సూ.) | శాతః | ఛా ఓ. మొ. |

సంస్కృత శబ్దములలోని మహాప్రాణ హకారము తెనుఁగులోనికి వచ్చునపుడు తఱుచుగా లోపించుచుండును. ప్రాకృతమునం దట్లులోపింపదు సరేకదా యది యితర వర్ణములకును నాదేశమగుచు నిల్చుచుండును.

'యథాదిషు హః' (పాకృతమం. ౨ ప. ౨౮ సూ.) యథా=జహా

'ఖఘథధభామ్' ప్రాకృత మం. ౨ ప. ౨౫ సూ.) మేఖలా=మేహాలా

విఘసః=విహాసో; నాథః=నాహో; విధిః=విహీ; శోభనమ్=సోహణం; ఇట్లు

మహాప్రాణ స్థలములందేకాక యల్పప్రాణములచోటను హకారము వచ్చుటయుఁ గలదు.

వసతి భరతయోర్హః (ప్రాకృత మం. ౨ ప. ౮ సూ.) వసతిం=వసహిం; భరతం=భరహం.

దివసే సస్య ( " " ౮_౨ సూ.) దివసః=దిఅహో.

యకారము జకారముగను, శషలు సకారముగను మాఱుట మున్నగు కొన్ని విషయములందుఁ బ్రాకృతాంధ్ర తద్భవముల ప్రక్రియలోఁ గొంత సామ్యమున్నను నట్టి మార్పులు సైతము తెనుఁగునకు స్వాభావికములె యనఁ దగును గాని ప్రాకృత సంబంధమున వచ్చినవనరాదు. యమునాశబ్దము ప్రాకృతమున 'జఉణా' అను రూపమందును. తెల్గునందన్ననో 'జమున' అని యేర్పడును. ఇట్లె 'రత్న' శబ్దము ప్రాకృతమున 'రఅణమ్' అని యేర్పడును. తెల్గునందన్ననో 'రతనము' అని యుండును. ఇట్టి వానియందలి ప్రాకృతాంధ్ర వైకృతపద్ధతులు విజాతీయములనక తీరదుగదా. యకారము జకారముగ నుచ్చరింపఁబడుట కేవలప్రాకృత స్వభావసిద్ధమే కాదు. సంస్కృతమునందే యట్టి మార్పు గలదని యీక్రింది ప్రాతిశాఖ్య గ్రంథముచే విశదమగుచున్నది.

"అథాన్తస్థానా మాద్యస్య పదాదిస్థస్య, అన్యహ లసంయుక్తస్య, సంయుక్తస్యాపి రేఫోష్మాభ్యాం ఋకారేణచ అవిశేషే. ణాదిమధ్యావసానే షూచ్చారణే జకారోచ్చారణమ్." (శుక్లయజుః ప్రాతిశాఖ్యము. ప్రతిజ్ఞా సూత్ర పరిశిష్టము. ద్వితీయఖండిక).

ఉవ్వటభాష్యము:—"అంతస్థానా మాద్యస్య యకారస్య స్థానే జ(య) కారోచ్చారణం భవతి......పదాదిస్థస్య యథా-(యుం) జుంజానః ........ ......సూ (ర్య) ర్జవవడా; హ (ర్య) ర్జత......సామా (న్యౌ) న్జౌగ్భిః... ధా (ర్యా) ర్జా...

ప్రాతిశాఖ్యేపి భగవతా కాత్యాయనేన యాజ్ఞవల్క్యేనచ ఈషత్ స్పృష్టస్య యకారస్య పదాదిస్థలే పఞ్చదశ శాఖాసాధారణ్యేన స్పృష్టప్రయత్నతా విహితా. అత స్సంప్రదాయ విద ఏవం విధే యకారే స్పృష్టప్రయత్న జ్ఞాపనాయ మధ్యే బిన్దుం ప్రక్షిపన్తి. స్పృష్టప్రయత్నం స్థానైక్యాచ్చ వర్గ తృతీయ సదృశం (య) జకారం పఠన్తి చ......"

శషలు ప్రాకృతములో సకారముగ మాఱుట మహారాష్ట్రి మున్న — వానిలో మాత్రమె. మాగధిలో శవర్ణమె వెలయుచున్నది. సకారస్థానమున సైతము మాగధిలో శవర్ణమె నిల్చును. "ప్రో శ్లో" (౯-౨-౬౩, సకార రేఫయో ర్మాగధ్యాం శకార లకారౌ యథాక్రమం భవతః"(షడ్భాషాచంద్రిక ౧౮౫ పుట). అచ్చ తెలుఁగునందు మచ్చునకయిన శవర్ణములేదు. శసషల పర స్పర సంబంధము సంస్కృతభాషలోనే ప్రసిద్ధమై యున్నది. ఇణ్ (క వర్ణ ముల ప్రత్యాహారము) కవర్గములపైనున్న సకారము షకారముగఁ బలుకఁ బడుట సంస్కృతభాషా ప్రసిద్ధము.

"నకారజా వనుస్వార, పంచమా ఝలి ధాతుషు! సకారజః శకారశ్చే, షా ట్టవర్గ స్తవర్గజః (కవి కల్పద్రుమము)" అని 'శస' ల సంబంధము వాకొనఁబడెను.

అపదాదిస్థములగు, క గ చ జ త ద ప య వలు తఱుచుగా లోపించి వానిమీఁది స్వరములు ప్రాకృతములోనికి వచ్చిన సంస్కృతభవములో నిల్చుచుండును. ఇట్టిపద్ధతి యాంధ్రభాషలో నెంతమాత్రము లేదని చెప్ప వచ్చును. (దీర్ఘికా ద్యత్యల్ప సంఖ్యాక శబ్దములలో 'కకారాది' లోపము ప్రాకృత సంబంధమున నర్వాచీనముగ వచ్చియుండును).

"క గ చ జ త ద ప య వానాం ప్రాయో లోపః"

"యమునాయాం మస్య" (ప్రాకృతమంజరి ౨-పరి ౨-3 సూ.)

| సంస్కృత. | ప్రాకృత. | తత్సమ. | ఆంధ్రతద్భ. |
|---|---|---|---|
| లోకః | లోఓ | లోకము | |
| నగః | ణఓ | నగము | |
| కాచః | కాఓ | కాచము | కాసు. |
| భుజః | భుఓ | భుజము | బుజము. |
| భూతం | భూఅం | భూతము | బూతము. |
| పదం | పయం | పదము | |
| పాపం | పాఅం | పాపము | |
| స్వయం | సయం | స్వయము | సొయము |
| సేవా | = సేఆ | = సేవ | |
| యమునా | = జఉణా | = యమున | = జేమున. |

మఱొకవింత—సంస్కృత శబ్దము లెల్లఁ దెలుఁగులోనికి ధారాళముగాఁ దత్సములగుచు యథాస్థితముగ రావచ్చును. వానికిఁ దద్భవరూపములున్నను

దత్సమరూపములును నుండవచ్చును. ఈవిషయమునకును బైవానిలోనే యుదాహృతులు చూపఁబడెను. ప్రాకృతములో నన్ననో యట్లుకాదు. తద్భవ సూత్రములచేఁ బయిని వ్రాసినరీతిని వర్ణవిపరిణామము చెప్పఁబడినస్థలము లందట్లు విపరిణామము జరుగని సంస్కృత శబ్దము ప్రాకృత భాషలోఁ దత్సమముగ రానేరదు. కాఁగా సంస్కృతశబ్దము ప్రాకృతములోనికిఁ గేవల తత్సమముగానో కేవల తద్భవముగానో మాత్రము ప్రవేశించును. పయికారణములచేతఁ బ్రాకృతములోని తత్సమశబ్దములకును దెనుఁగులోని తత్సమశబ్దములకును మిక్కిలిభేదము గలదనకతీరదు. అట్లె తద్భవములును వాడుకలోని కెక్కినపుడె వానికిఁ దెనుఁగున సాధుత్వము గలదు. ప్రాకృతములందన్ననో యట్లుగాదు. సంస్కృతములోని శబ్దములకెల్లఁ బ్రాకృత వ్యాకరణ సూత్రములచొప్పున వర్ణవిపరిణామాదులను జేసికొని వ్యవహరింపవచ్చును. కాఁగాఁ దెనుఁగున సంస్కృత సమములు యథేష్టముగ వాడఁబడినట్లె ప్రాకృతమునఁ దద్భవములు యథేష్టముగా వాడఁబడునని యెన్నఁగును. (చూడు. విష. ౪౧)

పయి రీతిని భాషాసంప్రదాయముల విషయమునను భాషాస్వభావముల విషయమునను బ్రాకృతాంధ్రములకుఁ జాల భేదమున్నదనుట నిర్వివాదాంశము.

ఇఁకఁ బ్రాకృతవ్యాకరణసాధ్యములగునట్టియుఁ, బ్రాకృతవాఙ్మయస్థములగునట్టియుఁ, బ్రాకృతశబ్దములలోఁ దెనుఁగులోనికి వచ్చినవి యత్యల్ప సంఖ్యాకములై యున్నవి. మొత్తముమీఁద నూటికిఁ బదిచొప్పున నైన వచ్చినట్లగపడదు. మఱియుఁ బ్రాకృతమె యాంధ్రముగఁ బరిణమించుట నిజమైనయెడలఁ బ్రాకృత భాషలో ధారాళముగా వ్యాపించియున్న మహాప్రాణధ్వనులు ప్రాచీనాంధ్రమున వెలసియుండవా? అట్లె ప్రాకృతములో మృగ్యములగుచున్న "ఎ, ఒ, ఐ, ఔ, చే, జే," మున్నగున వాంధ్రదేశ్యములోవలె నాంధ్రములోనికివచ్చిన ప్రాకృతభవశబ్దములందును వెలసియుండవా?

ఉ. వైద్యః ( వేజ్జో, (ప్రా.) వెజ్జు. విష్ణుః = వెన్నుఁడు (విణ్హూ.ప్రా.) చతుర్థి = చౌతి (చఉద్ధీ. (ప్రా.) అప్సరాః=అచ్చర. (అచ్ఛరా. (ప్రా) మొ.

"కొందఱ మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱ మతంబున వక్రతమంబులుం గలవు" (బాల. సంజ్ఞ. ౨ సూ). అని సూరిగారు వ్రాసిరి.

"ఐ దౌ తౌ చ కేషాంచిన్మతే భవతఏవ. కైతవమ్=కైఅవం. సౌద ర్యమ్=సోఅరిఅం. కౌరవాః=కౌలవా ... ... (చండ ప్రాకృ. స్వర విధానము. ౧౯ సూ.) అనియిట్లు చండవ్యాకరణమున 'ఐఔ' ల స్థితి విషయమున మాత్రము పయి సూరిగారివాక్యమునకు మూల మగపడుచు న్నది. అట్లయినను బ్రాకృతమున 'ఐఔ'ల యునికి క్వాచిత్కమనియే చండుఁడు సైతము చెప్పియుండుటచేతను బ్రాకృత వాఙ్మయమున నట్టి "కైఅవం, సౌఅరిఅం" మున్నగు వానికిఁ బ్రయోగము మృగ్యమగుటచేతను నట్టి వానినిబట్టి యనేకములగు తెనుఁగు తద్భవములలో నగపడుచున్న 'ఐఔ' లు ప్రాకృత జన్యములు కావచ్చునని చెప్పుట యుక్తము కానేరదు. పరిశీలిం పఁగా ద్రావిడభాషాసంపర్కమున నర్వాచీనముగాఁ బయిరీతిని క్వాచిత్క ముగాఁ బ్రాకృతమున 'ఐఔ'ల స్థితి వ్రాయఁబడెనేమో. కాని యవి ప్రాకృత భాషకు స్వాభావికములు కావు.

"ఐకారస్య భవే దేత్వ। ముత్సర్గేణ పదేపదే"
"ఔకారస్య భవే దోత్వ। ముత్సర్గేణ పదేపదే"

అని యిట్లు ప్రాకృతమంఃరిలో 'ఐత ఏత్' (౧పరి.౩౬.సూ.) "ఔత ఓత్" (౧ పరి.౪౨ సూ.) అను వరరుచిసూత్రములకు స్పష్టముగ వివ రణము వ్రాయఁబడియెను. (చూ. ౭౯ వి. VII.IX.) (౨౫.౪౬-వి)

"చజౌ తజ్జే ప్రాకృతేచ। దంత్యావేవ నసంశయః" అను నధోక్షజ వచనము కలదనుచు నుదాహరించి యప్పకవ్యాదులు ప్రాకృతమునందును దంత్యచజలు కలవనుచు వ్రాసిన వ్రాఁతలు సైతము గ్రాహ్యములు కావు. ప్రాకృత వ్యాకరణములం దెచ్చటను నట్టిదంత్య చజలు విధింపఁ బడియుండలేదు. కాఁగా నట్టి యధోక్షజవచనము నిర్మూల మనఁదగును. లేదా యందలి ప్రాకృతశబ్ద మాంధ్ర దేశ్యపరమనియు, (ప్రాకృతశబ్దము దేశ్యపర్యాయమని యీవఱకు విశదీకరింపఁబడెను - వి. ౪౦) నందలి "తజ్జే" అనుదాని సాహచర్యమున "ప్రాకృతే" అనుదాని కాంధ్రదేశ్యపర ముగామాత్రమె యర్థము కుదురుపడుననియు నెన్నదగును.

"చవర్గస్య స్పష్టతా తథోచ్చారణమ్." (ప్రాకృత ప్రకాశ. ౧౧ పరి. ౫ సూ.) అను మాగధీసూత్రముచేఁ జెప్పఁబడిన స్పష్టత దంత్యరూపమని కొంద ఱభిప్రాయ పడుదురు. కాని యచట స్పష్టత ఛఝలకు సైతము చెప్పఁ

బడుటచేతను దెల్గునందు సైతము సార్వత్రికముగ 'చజ' లకు దంత్యత లేకుండుటచేతను, నచటి స్పష్టత స్పృష్టతాప్రయత్నములోని స్పష్టతనే బోధింపఁజాలును గాని దంత్యతారూపమును బోధింపఁ జాలదని గ్రహింప నగును.

మఱొకవింత— ప్రాకృతసమములు తెనుఁగులో నున్నవనుట మాత్రమే కాని యట్టి ప్రాకృతసమములలోఁ బ్రాకృతభాషలోఁ గల యనాంధ్ర వర్ణ మొక్కచోట నయిన నిలిచియుండలేదు. సంస్కృతసమములలో ధారాళముగ ననాంధ్రవర్ణఘటితశబ్దములు వెలయుచుండుటయుఁ బ్రాకృతశబ్దములలోని యనాంధ్రవర్ణములు సాకల్యముగ నాంధ్రదేశ్యములలో నున్న వర్ణములుగా మాఱియే తద్భవములందెల్ల నిలుచుచుండుటయు నరయునప్పుడు ప్రాకృతముతో నాంధ్రమునకు బలమైన సంబంధము లేదనియు నట్టి ప్రాకృత సంబంధిశబ్దములలో నాంధ్రమున లేని కేవల ప్రాకృత స్వభావముతో నున్న యత్యల్పములగు "కంబము" మున్నగునవి తప్పఁ ('కంబము' అనునదియు సంస్కృత 'కంభ' శబ్దభవ మనఁదగును.) దక్కిన శబ్దము లెల్ల సంస్కృతమునుండియే తెల్గులోనికి వచ్చినవనియుఁ జెప్పుట యుక్తమని తోఁచక మానదు గదా. కావున యకారమునకు జకారము వచ్చుట శషలకు సకారము వచ్చుట సంయుక్తములలో నొక హల్లు లోపింపఁగాఁ దక్కినదానికి ద్విత్వము వచ్చుట మున్నగు విషయములు ప్రాకృతాంధ్రోభయభాషాసాధారణములయి యున్నంతమాత్రముచేఁ బయిని జూపిన యనేకములగు విషయములలో నవి విరుద్ధ స్వభావములను గల్గియుండుటచేతఁ దెల్గునకు సంస్కృతముతోనే లేని జన్య జనక భావరూపసంబంధమును బ్రాకృతముతోఁ గల్పించుట కేవలము నసంగత మనుటకు సందేహము లేదు.

(౨౬. వి.) పయి కారణములచేత వెనుక నుదాహరించిన తుది పక్షమె (౭౩ వి.) యనఁగా సంస్కృతశబ్దములను దఱుచుగను బ్రాకృతశబ్దముల నరుదుగను నాంధ్ర విభక్తులతో నార్యులు వాడుచుండఁగా నాంధ్రులు వానిని వాడుటలో ననేకము లపభ్రష్టములు కాఁగా వానిలో గవులకు నచ్చినవి దేశ్యములవలెనె సాధువులుగ గ్రహింపఁబడి గ్రాంథికము లయ్యెనన్న పక్షమె యుక్తి యుక్తమై యున్నదని సిద్ధాంతిత మగుచున్నది. చాలవఱకీ యభిప్రాయమునె యీ క్రింది కావ్యాలంకారచూడామణి పద్యము వ్యక్త పఱుచుచున్నది.

క॥ వదలక సిద్ధాక్షరములఁ
బొదివిన వర్ణములఁ దూలిపోఁబలుకఁగ న
ర్థదమై ప్రాకృత నిభమగు
నదియే తద్భవము నాఁగ నభిమత మయ్యెన్॥ (౯ ఉల్లా.౧౪ పద్య.)

హిందూ దేశములోని మూలభాషలన్నిటియందును నిట్లే సంస్కృత శబ్దములు తత్సమరూపములుగాను తద్భవరూపములుగాను బ్రవేశించి యున్నవి. ఒక్కవిశేషము మాత్ర మగపడుచున్నది. ప్రాకృతముల దేశ్య మత్యల్పమై యుండుటచేతను బ్రాకృతములలోని విభక్తులు సైతము సంస్కృతవిభక్తుల పరిణామములై యుండుటచేతను నుత్తర దేశములం దార్యుల బల మధికమై తద్దేశీయులను వారిభాషలను నడంచివేసెననియు నక్కారణమున నచట సంస్కృతభవభాషలె వెలసినవనియు, ననఁగా నచటి వారును సంస్కృతమునె మాటలాడ యత్నించినందున వారి మాతృభాషలలోని పదము లల్పముగను సంస్కృత భవము లధికముగను వెలసెననియు, దోఁచుచున్నది. దక్షిణహిందూ దేశమునందన్ననో యట్లుగాక దాక్షిణాత్యుల మాతృభాషలె నిలిచియున్నవనియు వానిలో నార్యుల సంబంధమునఁ బయి నుదాహరించినరీతిని సంస్కృత ప్రాకృత పదములు చేరినవనియు నెన్నఁదగి యున్నది. కావుననె హిందూ దేశములోని యుదీచ్యుల భాషలకును దాక్షిణాత్యుల భాషలకును గొంత సంబంధముండుట సమూల మగుచున్నది. అట్లె తమిళ కర్ణాటాంధ్రాది దాక్షిణాత్య భాషల కత్యంత సన్నికృష్టతచేత నధిక సంబంధముండుటయు నక్కారణముననే యవి యేక (మూలద్రావిడ) భాషా జన్యములని భాషాతత్వశాస్త్రజ్ఞులు కల్పించుచుండుటయు సంభవించుచున్నది.

తమిళాంధ్రకర్ణాటాది దాక్షిణాత్య భాషలు మూలద్రావిడభాష యనఁబడెడి యొక భాషనుండి యొదవెననియు, నట్లె యార్య భాషలును గ్రీకు లాటిను మున్నగు భాషలును "ఇండోయూరపియను" భాషాకుటుంబము లోనివనియు భాషాతత్వశాస్త్రజ్ఞు లిట్లు ప్రాపంచిక భాషలకుఁ గుటుంబ విభాగమును జేసియున్నారు. ఈవిషయము దేశ్యభాషా వివరణ సందర్భమున విపులముగా విమర్శింపఁబడును.

(౨౨. వి.) అడిదము సూరకవి కవిసంశయవిచ్ఛేదములోఁ దద్భవప్రక్రియను జూపియుండెనని యీావఱకు వ్రాసియేయున్నాను. కాని యట్టి ప్రక్రియ హేతుప్రదర్శనపూర్వకమయి యుండలేదు. తద్భవములందుఁ గల వికృతుల

గీ॥ వర్ణములనైన మాత్రలవలననైన ।
వికృతి తద్భవమునకుఁ గావింపవలయు ।
నదియ ప్రాకృత రీతియై యతిశయిల్లు ।
.... .... .... .... ....(కవిసంశయవిచ్ఛేదము, ౩ తరం. ౧౧ప.)
కొన్ని మాత్రిక వికృతు లగు న్మహేశ (కవిసం. ౩. తర. ౧౦ ప.)

---

కెల్ల సాకల్యముగ హేతువులను జూపుట దుఃశకము కావచ్చును. మఱియుఁ గాలవిప్రకృష్టతచేత సంభావితములగునట్టి హేతువులు కొన్నియెడల సరికాక పోవచ్చును. ఏదియెట్లయినను నట్టి హేతుప్రదర్శన మభ్యాసక బుద్ధివికాస కారణమగుచు మున్ముందు వైశాల్యము నందుటకు మూలము కాఁగలదను తలఁపున నట్టి హేతువులను యథాసంభవముగను, యథాశాస్త్రముగను, యథాశక్తిగను జూప యత్నించుచున్నాను. మఱియు సూరకవి చూపిన తద్భవములలోఁ గొన్ని దేశ్యములని కొందఱు విమర్శకు లభిప్రాయ పడు చున్నారు. అయినను నీసందర్భమున సూరకవి గ్రంథమె చాలవఱకు మూలముగ గ్రహింపఁబడుటచే నాతని లక్ష్యము లిందును నుదాహృతము లగుచున్నవి.

(౭౮-వి.) ఉచ్చారణత్వర, యస్పష్టశ్రవణము వర్ణములకుఁగల స్థాన ప్రయత్నాది సంబంధము, నుచ్చారణసౌలభ్యాపేక్ష, యాయాదేశముల లోని శీతోష్ణాది స్థితిభేదములు, జనుల ముఖయంత్రములోని యీషద్భేద ములు, వారివారికిఁగల భాషాంతర సంబంధమువలనఁ గలుగు నలవాటులు, మున్నగుకారణములచేత శబ్దములు వర్ణలోపాది వికారముల నందుచుండును. పయి కారణములచేతనే దేశకాల పాత్రాది భేదములనుబట్టి యెక్కొక్క చోట నొక్కశబ్దమె వేర్వేఱు విధములగు మార్పుల నందుచుండును. ఉదా. ఋషి=ఇరుడి, (తమిళ) రిసి (కర్ణాట), రుసి (తెల్గు).

పయి విధములుగల మార్పులను సూత్రించుటలో దక్షిణహిందూ దేశపు వైయాకరణులకెల్లఁ జాలవఱకుఁ బ్రాకృత వ్యాకరణ కర్తలె మార్గదర్శకులై రనవచ్చును. పయి విషయములనే యడిదము సూరకవిగారు పైమూలముతో విశదపఱిచిరి. నన్నయాథర్వణులు తద్భవ ప్రకరణమును విపులముగా సూత్రించియుండమింజేసి యడిదము సూరకవిగారి కవిసంశయ విచ్ఛేదములోని వైకృతసూత్రము లీసందర్భమున మూలముగా నంగీకరింపఁ బడుచున్నవి.

వ్యాఖ్య—వర్ణేత్యాది—వర్ణములనైనన్=హల్లులవలనఁ గాని, మాత్ర లవలననైనన్ = అచ్చులవలనఁ గాని, వికృతి = ప్రకృతి శబ్దాకారమున

వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశాది వికారములను, తద్భవములకున్ =సంస్కృత భవాంధ్ర శబ్దములకు, కావింపవలయును = కలుగఁ జేయవలయును. అట్టి మార్పు దేని కలిగినపుడే యవి తద్భవము లనిపించుకొనునని భావము. అట్టి వికృతి యించుకేని జరుగనపుడు వానికిఁ దద్భవతావ్యవహారము లేదనియు నవి తత్సమములె యగుననియుఁ దాత్పర్యము. అదియ = అట్లు వికృతిని దద్భవములకుఁ గల్గించుటయె, ప్రాకృతరీతియై=ప్రాకృత వ్యాకరణపద్ధతియై అతిశయిల్లున్ = ఒప్పును; లేదా 'అదియు' అని పాఠాంతరము నంగీకరింప నగును. ఆ పక్షమున—అదియున్ = అట్టి వికృతియు, ప్రాకృతరీతియై = ఆంధ్రదేశ్యముయొక్క రీతిగలదై — అనఁగా నాంధ్రదేశ్యములోని వర్ణముల లక్షణములు మాత్రమె గలిగియుండునదై వెలయుచుండునని భావము. కొన్ని = కొన్ని తద్భవములు, మాత్రైకవికృతు లగును = హల్వర్ణ వికృతి లేకున్నను హ్రస్వదీర్ఘముల మార్పుమాత్రముచేతనే తద్భవము లనిపించు కొనునని యర్థము. మూలములోని మహీశ శబ్దము కృతినాయక సంబోధ నపరము. ఉదా.— నారాచము = నారసము, ఆకాశము = ఆకసము (ఇందు హల్లులకును మాత్రలకును వ్యత్యాసము గలిగెను). కస్తూరి = కస్తురి (ఇందు మాత్రా వ్యత్యాసమాత్రమె కలదు).

ఇట్టి వ్యత్యాసములు గల్గునపుడును గొన్ని యెడల వికృతిత్వ మంగీక రింపకుండుటయుఁ గలదు. సంస్కృత పదములలో వర్గాక్షర పరకత్వమున నున్న తత్తద్వర్గ పంచమముగా మాఱుటయు, నవసానమున మకారపు పొల్లు సున్నగా మాఱకుండుటయు సంస్కృత సంప్రదాయము. అట్లయినను 'మాతంగా' ది పద మధ్యస్థలములందు సైతము తెల్గున వర్గ పంచమా దేశము రాకుండుట సమ్మతమై యున్నదని యీ క్రిందిరీతి ప్రాస ప్రయోగ ములు విశదీకరించుచున్నవి.

శా॥ సింగం బాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమై నుండి మా।
తంగ స్ఫూర్జితయోధ" (విరా. ౪ ఆ. ౯౫)

ఇందలి మాతంగశబ్దము సిద్ధసమాస మధ్యగత మగుటచేతఁ దద్భవ మనిపించుకొనదుగదా. 'మాతంగ' అనుచోట ఙ కారముగా నున్న మాఱు లేదనక తీరదు. ఙ కారము తెల్గున లేదుగదా.

"బ్రహ్మ, చిహ్నము, పూర్వాహ్ణము, జిహ్వ," మున్నగు పదములం దలి సంయోగములలోని హకారము మొదటిదే యైనను నుచ్చారణమున

"తే॥ ధర యథాపూర్వవర్ణ శబ్ద ప్రతతికి
నోలిఁ గొన్నిటి కాదేశ ముత్వ మగును
దద్భవం బజ్విభక్త్యేకతన్ భజించుఁ
దఱుచుగా వీని పద్ధతు లెఱుఁగ వలయు" (కవిసం. 3 తరం. ౫ ప)

---

రెండవదిగా వినఁబడుచున్నది. ఇట్టి యుచ్చారణవికృతి గల్గినను వీనిని దత్స మములని వ్యవహరించుటయే యాంధ్ర వైయాకరణ సంప్రదాయమై యున్నది. ప్రాకృతభాషలో నిట్టి వికృతి సూత్రింపఁబడుటయు నిట్టివానిని దద్భవములనుగా నెన్నుటయుఁ బ్రసిద్ధమై యున్నది. "హ్న, హ్ల, హ్మాము నల మాం స్థితి రూర్ధ్వమ్" (ప్రాకృత ప్రకాశము. 3 పరి. ౮ సూ.) (ఆంధ్ర మున. 'హ్ల' అనుచోట 'ల్హ' అను రీతిగల యుచ్చారణము లేదు. 'కల్హా రము' అపశబ్దము. 'కహ్లారము సుశబ్దము).

'క్ష, త్స, జ్ఞ, మున్నగు సంయోగములకు విజాతీయ ధ్వనులు కల్గినను నట్టివానితో నున్న శబ్దములను దద్భవము లనుట సంప్రదాయము కాదు, ఇంక నవి తత్సమములుగానే యాంధ్ర వైయాకరణులచే నుదాహరిం పఁబడుచున్నవి.

మఱియు, రాముఁడు మొదలగు చోటులం దవయవ సంబంధమగు 'అ' కారము స్థానమున 'ఉ' కారము నిల్చుటయు, 'రమ' మున్నగు శబ్దములలో దీర్ఘముచోట హ్రస్వమునిల్చి మాత్రా వికృతి జరుగుటయు, 'అంగిరుఁడు, కర్మము,' మున్నగుచోటులందు సంస్కృతశబ్దావయవ వర్ణములు లోపించుటయు, 'మహాత్తు' మున్నగుచోట్ల ద్విత్వోత్వములు వచ్చుటయు మున్నగు మార్పు లనేకములు కల్గుచున్నను నవి యెల్ల నాంధ్రవిభక్తి నిమిత్త కములనియు, నట్లు శబ్దాంతమునఁ గల్గిన విభక్తిసంబంధములగు మార్పులవలన వాని తత్సమత్వమునకు భంగములేదనియు నవి తద్భము లనిపించుకొనవనియు నాంధ్ర వైయాకరణులెల్ల సాధారణముగాఁ దలంచి యున్నారు. అడిదము సూరకవి సైతమట్టివానినెల్లఁ దత్సమములుగానె యంగీకరించి యట్టి మార్పు లను నీ వికృతి సందర్భమున సూత్రించి యుండలేదు. కాని, యట్టి మార్పుల వంటివే యనఁదగు నీక్రిందిమార్పులు మాత్రము కల్గినపుడు తద్భవత్వము నంగీకరించుచు నీక్రింది రీతి నుదాహరించి యున్నాఁడు.

వ్యాఖ్య:—ధ రేత్యాది—సంస్కృతశబ్దావయవాక్షరములు యథాపూ ర్వముగనె నిల్చియున్నను గొన్ని యెడల నేకత్వమున నాచ్ఛికము

నజ్విభక్తియు నగు 'ఉ' కారము విభక్తి కాదేశము వచ్చుటయు నద్దానితో సంధించిన శబ్దము తద్భవ మగుటయుఁ గలదని యర్థము. ఉదా.—పన్నీరము+ఉ=పన్నీర+ఉ=పన్నీరు. ఇట్లె—మీను (మీనము) నాదు (నాదము) వాదు (వాదము) మొ. ఇట్టివెల్ల ముందు వేఱుమార్గమున సాధింపఁబడును. (చూడు. ౧౦వి.) ఇవి తద్భవములనుటలో విప్రతిపత్తి లేదు. కాని, సూరకవి, పైరీతిశబ్దముల నుదాహరించుటయే కాక యీ సూత్రపు సందర్భమున " వృద్ధు (వృద్ధుఁడు) మూర్ఖు (మూర్ఖుఁడు) దుష్టు (దుష్టుఁడు) ధూర్తు (ధూర్తుఁడు) మూకు (మూకుఁడు)" అనువానిని సైత ముదాహరించెను. ఇట్లె సందర్భాంతరమున 'వయసు, తపసు, మనసు' అనువానిని సైత ముదాహరించెను. పై వానిలో వృద్ధు మున్నగునవెల్ల శబ్దరత్నాకర కోశమునఁ దత్సమములుగాఁ జూపఁబడెను. "దుష్టు" అనునది శబ్దరత్నాకరమున లేదుగాని " దుష్టుకి వెరువు" అనువాడుక గలదు. లక్ష్మీనారాయణీయ మను నాచ్ఛిక కోశమున " వస్తువు, వయసువాఁడు, మనసు" అనునవి మాత్ర మాచ్ఛికములుగఁ జూపఁబడెను. ఆంధ్రభాషార్ణవకోశ మందుకు మూల ముగాఁ జూపఁబడెను.

కాని, యీ శబ్దములు తద్భవము లనుటకుఁ బ్రమాణము లేదు. తద్భవ మచ్ఛాంధ్రముగఁ బరిగణింపఁబడిన దగుటంజేసి యాంధ్ర వాఙ్మయమునఁ గల యచ్ఛాంధ్ర కావ్యములలోఁ బ్రయుక్తములగు సంస్కృత సంబంధి శబ్దములనె తద్భవములనుగా నంగీకరించుట సప్రమాణమై యుండునని శబ్దరత్నాకర, వైకృతదీపికా, ప్రౌఢవ్యాకరణముల కర్తయగు బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తలంచియున్నట్లు వారి గ్రంథముల సందర్భమునుబట్టి విశదమగుచున్నది. బాలవ్యాకరణకర్తగారును వీనిని దత్సమములుగనె యెంచియున్నారు. ఇంతయేల ! చింతామణి కర్తకును దద్వ్యాఖ్యాతలకును నిట్టి యభిప్రాయమె కలదని వారి తత్సమశబ్దరూపసాధన ప్రక్రియ వలన విశదమగుచున్నది. అచ్చ తెనుఁగు కావ్యములలో నెచ్చటను వీని నెవ్వరును బ్రయోగించి యుండలేదు. మఱియు 'రాముఁడు' మున్నగువానియందువలెనె 'వృద్ధుఁడు' మున్నగువానియందును 'ఉత్వము' రాఁగాఁ బాక్షికముగా డ్వాది విభక్తి లోపము కలిగినంత మాత్రమున వానిని వైకృతములనుట యుక్తము కాదుగదా. అట్లె 'వయస్సు, మనస్సు, తపస్సు' అనువాని ద్విత్వరూపములు తత్సమములని యంగీకరించుచు వాని ద్విత్వ

"చజలు గావవి రెండు చే జెలగు ........" (కవిసంశయ. 3 తరం. ౧ ప.)

ములో నొకహల్లు లోపించినంతమాత్రమున వానిని సైతము తద్భవము లనుట యుక్తము కాదు గదా. అట్టియెడ 'వాకు' (వాక్కు) మున్నగునవి కూడ దద్భవములె యనవలసివచ్చును గదా!

వ్యాఖ్య—చజేత్యాది:—తాలవ్య చజలు దంత్యములగు నప్పు డాశబ్దములు తద్భవము లగునని యర్థము.

సూరకవి "రాజన్ = రాజు" అని యిట్లు రాజశబ్దమున కుత్వము వచ్చుటచే నది తద్భవమైన ట్లుదాహరించెను. ఉత్వము వచ్చిన రాజుశబ్దము తత్సమముగనె చింతామణికర్తచే సాధింపఁబడియున్నది. అయ్యది తత్సమమని యంగీకరింపనపుడు "ధర్మరాజు" మున్నగునవి యపశబ్దములైనఁ గావలసి వచ్చును. లేదా యట్టి సమాసములెల్ల ననింద్యగ్రామ్యములగు తద్భవములని యైన నసంగతముగాఁ జెప్పవలసివచ్చును. కాఁగా 'రాజు' అనునది తత్సమ మనక తీరదు. కాని యందలి జకారమును దాలవ్యముగాఁ బలుకక దంత్యముగాఁ బలుకునపుడు మాత్రము దానినిఁ బయి "చజేత్యాది" సూత్రము చొప్పునఁ దద్భవమని చెప్పక తీరదు. 'ధర్మరాజు' మున్నగుచోటులందుఁ దాలవ్యముగానే పలుకవలయును. ఇట్లే మంచాది శబ్దముల విషయము నను నెన్నవలయును. కాఁగా 'మంచము' అను తాలవ్య చకార విశిష్టరూపము తత్సమమనియు "మంచేము" అను దంత్య చకార విశిష్టరూపము తద్భవమనియు నెన్నవలయునని గ్రహింపవలెను.

అహోబలపతి యట్లంగీకరింపక తాలవ్యచకారమునకు దంత్యత కలిగినంతమాత్రమునఁ దానికి వైకృతత్వము నంగీకరింపరాదని చర్చించి యున్నాఁడు. (అహో. ౧౨౭ పుట). అచ్చతెనుఁగు కావ్యము లందెల్లఁ బ్రయుక్తమయియున్న "వలరాజే" మున్నగు శబ్దముల గతియేమగు నని యాయహోబలపండితుఁ డూహించెనో తెలియకున్నది. అచ్చతెలుఁగు కావ్యముల ప్రయోగములేకాక భారతాది గ్రంథములలోని "వలరాజు" మున్నగు ప్రయోగములందలి సమాసములును 'రాజే' అన్నది తత్సమమె యైనపుడు సాధువులు కానేరవుగదా. కాఁగా నప్పకవి 'రాజే' శబ్దములోని 'జ' కారమును దంత్యముగాఁ గేవలాంధ్రులు పలుకుట సరికాదని

చెప్పుటగాని, యహోబలపతి తాలవ్య చజలు దంత్యములగునపుడు వానికి వికృతిత్వము నంగీకరింపరాదనుటగాని సరికాదనుటకు సందేహములేదు.

పయి సందర్భమునుబట్టి తాలవ్యచజలు దంత్యములుగ మాఱినంత మాత్రమునఁ దద్భవత్వమును గల్పించుట యాంధ్రమహాకవి సమ్మతమై యున్నదని గ్రహింపవలయును. ఆకారమునందు మార్పేమియు లేకున్నను నర్థము నందించుక మార్పు కలిగినను దద్భవత్వమును గల్పింపనగునని యథర్వణాచార్యుఁడు చెప్పి నట్లీవలకు వ్రాసియే యున్నాను. (వి. ౪౧)
ఉదా. (తత్సమము) కన్య = అవివాహిత. (తద్భవము) కన్య = లేఁతది. (తత్స.) గౌరవము = (గురుభావము) (తద్భ.) గారవము = ప్రేమము. మొ. అర్థము మాఱుటలో సైతఁ మక్షరముల మార్పు కలుగు నప్పటి వలెనె కొంత యుక్తి యుండును. అట్టియెడఁ బ్రకృతివికృతుల యర్థములు రెండిటికిని నేదేని సంబంధము వెలయుచుండును. ఉదా. గౌరవము=గారవము ; నిజము= నిజేము మొ.

'అనుమానము, సంగతి, నైఖరి' మున్నగు శబ్దముల కర్థమునందు మార్పు కల్గినను వానిని తద్భవములని వాడెడి సంప్రదాయము లేదు. అట్టివి కవిప్రయోగములలో నీక్రిందిరీతిని సిద్ధసమాసమధ్యగతములై యుండుట చేత వానిని దద్భవము లనుటకు వలనుపడదు. కావున నట్టియెడల వర్ణాదేశాదులచేత నాకారమున మార్పుగల్గినపుడు మాత్రమె తద్భవత్వము సంగీకరింపవలెనని (౪౧.విమ.) గ్రహింపవలెను. 'కన్య' అనుదాని పరిణామ పద్ధతి వేఱు. [(తత్స.) కన్య = (తద్భ) కన్నియ=కన్య. (ముత్తియము = ముత్యము).] కావున విరోధములేదు.

మ॥ అరిగాఁ బంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళవైఖరి నూపన్...
(వసు. ౧ ఆ. ౧౩౦ ప.)

(౭౯. వి.)—అజ్వికృతి. I, II అకారవికృతి :—

I అవర్ణము కంఠ్యతా సంబంధమున 'ఒ' వర్ణముగా మాఱుట గలదు. ఉ. ఫల్గు=పొల్లు; అర్పణము=ఒప్పనము; ఆళి=ఓలి మొ.

II తాలవ్య హల్లు మీఁది 'అ' వర్ణము "ఎ" వర్ణముగమాఱుట గలదు. ప్రకృతిలోని హల్లు తాలవ్యమును, దానిమీఁది యచ్చు కంఠ్యమును నగుటచేతఁ గంఠ్యము తాలవ్యము నగు 'ఎ' వర్ణము వచ్చుట సహజమేకదా.

ఉదా.—శపియించు=సెపియించు; శయ్య=సెజ్జ; శ్రవము=చెవి ; చంద్రము=చెందిరము, శల్యుఁడు=సెల్లుఁడు. దర్శనము=దరిసెనము. వ్యవహారము = బేహారము. భాగ్యము=బాగెము. వ్యథ-వెత, త్యాగము= తేగము. మత్స్యము= మచ్చెము. విద్య=విద్దె. మొ. వ్యవహారాది శబ్దములలోని పరిణామ విశేషములు, '౯౮' విషయముచేత సాధ్యములగును. న్యాయము = నాయము మున్నగు నిలంతి తావులందు '౯౮' సూత్రమును ప్రకృత సూత్రమును వర్తింపకుండుటయుఁ గలదు. 'శయ్య' అనుదానికి 'సెజ్జ' అనియెకాక 'సజ్జ' అనియు వికృతి గలదని కూచిమంచి తిమ్మకవి యుదాహరించెను.

ఆ॥ వె. "శయ్య యనెడిచోట సజ్జ సెజ్జ"

(సర్వలక్షణ సారసంగ్రహము ౧ ఆ ౮౭ ప.)

సీ॥ ఉండునేపిట మార్కండేయమునిరాజు,

సజ్జలింగ మనంగశాసనుండు" (కాశీ. సర్వల. ౧ ఆ. ౫౩)

ఈ శ్రీనాథ ప్రయోగమునందలి "సజ్జ" శబ్దము వికృతియే కాదు. 'సజ్జ' అను తత్సమ పదమె గలదు.

"సజ్జుఁడు=సం-విణ. (అ-ఆ-అ) (1) కవచము తొడిగినవాఁడు (2) అలంకరింపఁబడినవాఁడు" (శబ్దరత్నాకరము)

పయిరీతినె తిమ్మకవి సజ్జశబ్దభవమగు వేఱొక ప్రయోగమును సైతము ప్రామాదికముగఁ జూపెను. ఇచట నిది శయ్యాశబ్దభవముకాదు. దేశ్యమును గాదు.

చ॥ తళుకుఁబసిండి యోవరులు దంతపుఁబావడ లర్చనాగృహం।
బులు గుడినీరుమేడలును భోజనశాలలు కెంపుటోడుబి
ళ్ళలు గరిడీల్ సుశీతల శిలాతలముల్ భువనేశ్వరంబు లు
జ్జ్వలజలయంత్రధామములు సజ్జెలు దాఁటి ధరావతీర్ణనై ॥

(సర్వల. ౧. ఆ. ౫౧ వసుచ.)

ఇందలి సజ్జెశబ్దము శిరోగృహ వాచకమైయున్నది. శయ్యాపరమగు నర్థమున కిచటఁ బ్రసక్తియేలేదని తక్కిన పద్యసందర్భమువల్ల విశదమగుచున్నదిగదా. ఇది దేశ్యమెట్లునుగాదు.

"సజ్జె. యు. దే. వి బుట్ట.....పై... 2 శిరోగృహము. ఉప్పరిగెల్ సజ్జెలు చప్పరాలు చవికెల్ పైఁ జూడలే దెక్కి......(రామా.౬.శబ్దర.)

కం॥ ఋత్వమునకు నిత్వమ్మగు నెత్వము సిద్ధించు....(కవిసం. ౩ తరం. ౮ప.)
రిత్వమగును ఋత్వంబు (కవిసం. ౩ తరం. ౧౦. ప.)
సుడి తొలఁగు....(కవిసం. ౩ తరం. ౨ ప.)

---

పై కారణముచేతనె యిది 'సజ్జ' శబ్దభవమని వైకృత దీపికలో వ్రాయఁబడెను. అట్లగుటచేత 'అలంకృత గృహము' లేదా 'ఆయిత గృహము' అని యర్థము. శిరోగృహము కట్టిన పిదపఁగదా గృహ మాయిత మయ్యె ననఁదగును.

III. ఇవర్ణము తాలవ్యతాసంబంధమున 'ఎ' వర్ణముగ మాఱుట కలదు. ఉ—శిఖ=సెగ. నిభము = నెపము. నివేశము=బేసి-మొ.

IV. ఉవర్ణ మోష్ఠ్యతా సంబంధమున 'ఒ' వర్ణముగ మాఱుట గలదు. ఓష్ఠ్య హల్లు మీఁద నీమార్పు చాలవఱకు నియతముగ నగును. ఉదా. పూగము = పోక. వకుళము = పొగడ. కుమారుఁడు = కొమారుఁడు — కుంతి=గొంతి, స్థూలము = తోరము.

వ్యాఖ్య:—ఋత్వమునకు ఇత్యాది—అర్థము స్పష్టము. సుడి తొలఁగు ననుటచేత 'అ' కారము నిల్చునని తాత్పర్యము (తెలుగు వ్రాఁతలో సుడి నిచ్చునపుడు తలకట్టును సైతము వ్రాయుట సంప్రదాయము గదా).

V. ఋవర్ణము, 'అ, ఇ, ఉ, ఎ, రి – రు' అనువానిలో నొకదాని రూపము నొందును. ఋ స్వరూపము తద్భవత్వమున నిలువదని యెన్నునది.

ఉదా:— ౧. అ – మృత్తిక = మట్టియ, తృతీయ = తదియ' మృత్స్న = మన్ను, వృద్ధి=వడ్డి.

౨. ఇ—శృంగారము=సింగారము, దృఢము=దిటము, మృత్యువు = మిత్తి, గృహము = గీము.

3. ఉ—పృథివి=పుడమి.

౪. ఎ—హృది = ఎద. వృద్ధులు = పెద్దలు. నృత్యము=నెత్తము. గృహస్థుఁడు = గేస్తుఁడు.

౫. రి—ఋక్షము = రిక్క.

౬. రు—ఋషి = రుసి.

౧—'ఋ' అను దానికి 'అర్' అనుదానివంటి యుచ్చారణము ప్రాచీన కాలమున సంస్కృత శబ్దములలో నుండెడిది. నేఁటికిని వేదమున నిట్టియుచ్చారణము ప్రసిద్ధమైయున్నది. కావుననె సంస్కృత సంధులలో ఋకారమునకు 'అర్' వచ్చును. (కృష్ణ+ఋద్ధి=కృష్ణర్ధి). వేయేల! స్వరపారాయణమున 'ఋ, ౠ' అనువాని నాంధ్రబాలురు సైతము 'అరు, అరూ' అనురీతిని బలుకుచుండుట సంప్రదాయమై యున్నదిగదా. అందలి రేఫము పరస్థహల్ సంయోగమున లోపించుట సహజమగుటచేత నట్లులోపింపఁగాఁ బరిశిష్టమగు 'అ' వర్ణము నిలుచుట సహజమగుచున్నది. అట్టి ఋవర్ణము లఘువగనె యుచ్చారణములో నలవాటుగ నుండుటచేత 'తదియ' మున్నగు చోట్లఁ బరహల్లునకు ద్విత్వము నొదవింపదయ్యెనని గ్రహింప నగును. ఇట్టి వికృతి ప్రాకృతమునందును గలదు. 'ఋతోఽత్' (ప్రాకృత ప్రకాశము ౧ పరి. ౨౭ సూ.).

౫. ఋవర్ణమును గొందఱు "రి' అని పలుకుటయు నుండెడిది. అట్లు పలుకుటలోఁ బదాదిహల్లు రేఫయుక్తమువలె నేర్పడును. అపుడు పదాదిసంయోగములోని రేఫము లోపించుట సహజ మగుటచేత నది పోఁగా నాహల్లుపై 'ఇ' కారము నిల్చుట సంభవించును. కావుననె హల్లుపై నిల్చిన ఋవర్ణము 'ఇ' వర్ణముగా మాఱుటయుఁ బదాదిని గేవలముగ నున్న 'ఋ' వర్ణము 'రి' అనునదిగా మాఱుటయు సంభవించుచున్నవి. అట్టి 'ఇ' వర్ణము 'ఎ' కారమగుటయు విరుద్ధము కాదుగదా (III సూ.)

సంస్కృత భాషలోను నీజాతి వికృతి గలదు. (కృ) క్రియతే

(భృ) భ్రియతే. మొ.

ప్రాకృతమునందును బయిరీతి మార్పులు గలవు. "ఇల్ కృపగే"(షడ్భాషాచంద్రిక. ౭౭ పుట) కృపాది శబ్దములలోని పదాదిగత ఋకార మికార మగును. కృపా=కిబ; 'ఋ=రీతి' (ప్రాకృత ప్రకాశము. ౧పరి. ౩౦సూ.) వర్ణాంతరముతోఁ గూడని పదాది ఋ వర్ణము 'రి' అగును. ఋణమ్=రిణం. మొ.

కర్ణాటమునందును నిట్టి వికృతి గలదు. 'ఇ ధృతః' (కర్ణాటకశబ్దానుశాసనము. ౨పా. ౧౫౦ సూ.)' తృణ=తిణ. కృష్ణ=కిష్ణ. 'రి రను త్తరస్య'(కర్ణాటక శబ్దానుశాసనము. ౨.పా. ౧౫౯ సూ) పదాది ఋకారము 'రి' అగును. ఋషి=రిసి. ఋణ=రిణ.

కం....ఓత్వ మెనయును నుత్వం, బౌత్వమునకు నోత్వం బగు, నైత్వం
బేత్వ మగు సుమశరాసన మథనా. (కవిసం. ౩ తరం. ౮ ప.)
సీ. ఐఔల కయి యవులగును....(కవిసం. ౩ తరం. ౧ ప.)

---

౬. అంతకంతకు 'ఋ' వర్ణము 'రు' అనుదానివంటి యుచ్చారణముతోఁ బలుకఁబడసాగెను నేఁటికాంధ్రు లట్లె పలుకుచున్నారు. కాఁగా నట్టి యుచ్చారణమున దానితోఁగూడిన హల్లు రేఫసంయుక్తము వంటి దగును. అందలి రేఫము సహజముగ లోపింపఁగా 'ఉ' వర్ణము ఋకారస్థానమున నిల్చుట సంభవించుచున్నది. పదాదినుండెడి కేవల 'ఋ' వర్ణము 'రు' స్వరూపముతోనె నిల్చును.

ప్రాకృతమునందును నిట్టి వికృతి కలదు. 'ఋతుగే' (౪౭ పుట-షడ్భాషాచంద్రిక) ఋతు ప్రభృతి శబ్దములలోని ఋవర్ణము 'ఉ' వర్ణముగా మాఱును.. పృథివీ=పుఢవీ. మొ.

అఱవమునందును నిట్టి వికృతిగలదు- 'ఋ వర్ణము 'రు' అగును.' (నన్నూలు ఎటుత్తు అధికారము, పదవియల్ ౨౦ సూ) ఋషి=ఇరుడి. ఇందుఁ దమిట సంప్రదాయము చొప్పున షకారస్థానమున డకారము నిల్చెను. రేఫమునకు ముందు 'ఇ' వర్ణ మాగమ మయ్యెను.

'వ॥ట్రులు విరమణ మొందు శౌరి ఋషులకు శశ్వత్ . . .' (అముద్రితమగు ఛందోదర్పణము) అనియిట్లు ఋవర్ణమునకు 'రు' వర్ణముతో యతిచెప్పఁబడెను. కవిప్రయోగములు తమకు దొరకనందున నది సరికాదని ముద్రణములలో దిద్దివేసిరి.

వ్యాఖ్య—ఓత్వమిత్యాది "ఓ = ఉ. ఔ=ఓ. ఐ = ఏ, అయి. ఔ=అవు" అని యగును-తుల్యన్యాయమున జరుగు మఱికొన్ని వికృతులకును వీనికిని నుదాహృతు లీక్రింద విశదీకరింపఁబడును.

VI. ఎవర్ణము 'ఇ' వర్ణముగా మాఱును. ఉ. సందేహము=సందియము

VII. 'ఐ' అనుదానికి 'ఏ' 'అయి' అగును—'ఏ, ఐ' అను వర్ణములు కంఠ్యములును, దాలవ్యములును నైయున్నవి. ఐకార ముచ్చారణములో 'అఇ' అనురీతిగ వినఁబడుట ప్రసిద్ధమె. అట్టిస్వర సంహితలో యకారము చేరఁగా 'అయి' అనురూప మేర్పడుట సహజమెకదా. ఉదా:-వైరము = వేరము. వైద్యుఁడు=వెజ్జు. వైశాఖము=వేసఁగి. పైఠ=పైఁట-పయిఁట. కైవ

ర్తుఁడు = కయివత్తుఁడు. కైకయి = కయిక. దైవము = (దయియము=) దయ్యము. ఇట్టి వికృతి ప్రాకృతమునందును గలదు. (చూ. క్రింద)

"ఐత ఏత్" (౧ పరి. ౩౫ సూ.) పదాదినున్న 'ఐ' కార మేకారము నిత్యముగా నగును. శైత్యం=సేచ్చం, "దైత్యాది ష్వఇ" (౧ పరి. ౩౬.) దైత్యాది శబ్దములలోని 'ఐ' కారము 'అఇ' అనురూపము నందును - దైత్యః= దఇచ్చో. మొ.

VIII. ఓకారము 'అ, ఉ' అనురూపముల నందుట గలదు. ఉదా. సంతోషము=సంతసము. మౌక్తికము=ముత్తియము. ఓకారము కంఠ్యము నోష్ఠ్యమును. అకారము కంఠ్యము. ఉకార మోష్ఠ్యము.

IX. ఔకారము 'ఆ, ఓ, అవు' అనురూపముల నందుట కలదు. ఔకారము కంఠ్యము, నోష్ఠ్యమును. ఆకారము కంఠ్యము. ఓకార మోష్ఠ్యము కంఠ్యమును. ఔకార ముచ్చారణమున 'అఉ' అను నాకారముతో నుండుట ప్రసిద్ధము. అట్టి సంహిత నడుమ వకారము నిలువఁగా 'అవు' అనురూప మేర్పడుచున్నది. అచ్చులసంహితలో వకారము నిల్చుట కన్నడమునందును దమిళమునందును గలదు. అ+అన్=అవన్ = వాఁడు., (తమిళ) పర+ అరశు = పరవరశు = ఇతరరాజు, (తమిళ). మను+ఇన = మనువిన (కన్నడము). తిరు+ఆరాధనము = 'తిరువారాధనము' అను పాండురంగ మహాత్మ్యమునందలి ప్రయోగమునుబట్టి తెనుఁగులోను నట్టి వకారాగమ మరుదుగఁ బ్రవేశించిన దనఁదగును. గెలుచు+అన్=గెలువన్, చతుర్థి=చవుతి వ్యావహారి కాంధ్రములో 'వ్రూరు' మున్నగు వాడుకలు ప్రసిద్ధములై యున్నవి. ఉదా. క్రౌంచము=క్రోంచెము, ప్రౌఢ = ప్రోడ. ద్రౌపది = ద్రోవది. గౌరవము = గారవము, యౌవనము = జవ్వనము (జవు + వనము).

ప్రాకృతమునందును నిట్టి వికృతి గలదు. 'ఔత ఓత్' (ప్రాకృత ప్రకాశము ౧. ప. ౪౧. సూ.). ఔకారమున కోకారాదేశము నిత్యముగా నగును. కౌముదీ = కోముఈ; "పౌరాది ష్వఉ" (ప్రాకృ. ప్ర. ౧ ప. ౪౨ సూ.) పౌరాది శబ్దములలోని ఔకారమునకు 'అఉ' అను నాదేశమగును. పౌరః = పఉరో. 'ఆచ గౌరవే' (ప్రా. ప్ర. ౧ ప. ౪౩.) గౌరవమ్ = గారవం - గఉరవం. మొ.

X. 'ఐ ఔ' లును 'అయి, అవు' లును వరుసగఁ బరస్పరమును మార్పు నందును. అట్టిమార్పు వాని యుచ్చారణస్థితినిబట్టియే కలుగుచున్నదనుట

స్పష్టము, కావుననే యాంధ్రశబ్ద చింతామణికర్త 'వాయి రవు ర్వాక్రతమా' అని యిట్లు ద్వివిధముగను వ్యాఖ్య చేయుటకు వీలుగ సూత్రించి యుండెను. ఉదా – అయి = ఐ— సహితము = సయితము = సైతము. సహించు = సయించు = సైంచు = సైఁచు. కవిత = కయిత = కైత. ఐకి 'అయి'వచ్చుటకు—కైక కయి=కైక = కయిక, ప్రాకృతము నందును "అయి, ఐ (షడ్భా. ౧౦౮ పుట) అయి సహి = ఐ (అఇ?) ఐసహి" అనియిట్టిపరిణామము గలదు.

'అవు' అనుదానికి 'ఔ' వచ్చుటకు—అగు=అవు=ఔ. రావుత్తుఁడు= రఉతు = రవుతు = రౌతు. చతుః = చఉ = చవు = చౌ. చతుర్థి = చ + ఉతి = చవుతి = చౌతి. "ఔ" అనుదానికి అవు వచ్చుటకు - యౌవనము=జవు + వనము = జవ్వనము. మొ. (దవ్వు=దవు=దౌ, )

XI-౧. ద్విత్వము పరమగునపుడు ముందటి దీర్ఘము నిత్యముగా హ్రస్వ మగును. ఉ. ఆశ్చర్యం = అచ్చెరువు. ఆర్య = అయ్య. లాక్ష = లక్క

XI-౨. హల్సంయోగమునకును బూర్ణ బిందువునకును ముందటి దీర్ఘము కొన్నియెడల మాత్రము హ్రస్వమగును. ఉ. కార్యము = కర్జము. కాంస్యము = కంచు. ఆందోళము = అందలము. ఆమ్రాతకము = (ఆంబ్రాతకము) అంబాళము. హ్రస్వమురామికి:—గృహస్థుఁడు = గేస్తుఁడు. పాత్రము = పాత్రలు. ప్రాథమిక = పాడ్యమి, జ్యోతిషము = జోస్యము.

XI-౩. పూర్ణ మొకప్పుడు ఖండ మగుటయుఁ గలదు. అపుడు ముందటి దీర్ఘము హ్రస్వము కాదు. ఇట్టి వికృతులు కేవలము నుచ్చారణ సౌలభ్యాపేక్షచేతనే సంభవించును ఉ. కాండము = కాఁడ. యంత్రము = ఏఁతము.

XI-౪. ప్రాకృతములోను ద్విత్వపరక దీర్ఘము నియతముగా హ్రస్వము కావలెనని "దీర్ఘస్య హ్రస్వతా నిత్యా, సంయుక్తోత్తరతా యది" (ప్రాకృతమంజరి. ౪ పరి. ౧ సూ) అను వృత్తికారవచనము చెప్పుచున్నను నట్టియెడల దీర్ఘము నిల్చుటయె బహుళముగ నగపడుచున్నది. హ్రస్వము వచ్చుట యరుదయి యున్నది. ఉ. ఏకమ్ = ఏక్కం. ఏతావత్ = ఏత్తిఅం. ఏతస్మాత్ = ఏత్తో. ఏతస్మిన్ ఏత్తహ. ఏవ = ఏవ్వ. కుట్టిమమ్ = కోట్టిమం. గృహీతుమ్ = ఘేత్తుం. గ్రహీతవ్యమ్ = ఘేత్తవ్వం. యోగ్యాః = జోగ్గో. నవమల్లికా = ణోమాల్లిఆ. నుదతి = ణోల్లఇ. దైవమ్ = దేవ్వం. ప్రేమ =

గీ. హ్రస్వవర్ణంబు లగును దీర్ఘాక్షరములు (కవిసం. ౩ తరం. ౩ ప.)

---

పేమ్మం. విదిత్వా = వేత్తూణ. శయ్యా = సేజ్జా. సేవా = సేవ్వా. స్తోత్రమ్= సోత్తం. సౌమ్యః = సోమ్మో. భవిష్యామి = హోస్సామి. యౌవనమ్ = జోవ్వణం. నీలమ్ = ణేల్లం. (హ్రస్వమగుట క్వాచిత్కము :- రాజ్యమ్ = రజ్జం.) ప్రాకృత ప్రకాశములో సంయోగము పరమగునపుడు ముందున్న యచ్చు లోపించునన్న పాఠమే యీసందర్భమున నంతటను గలదనియు దీర్ఘము హ్రస్వమగునన్న పాఠము లేదనియు వ్రాయఁబడియున్నది.

"(సంయోగే పరే సర్వత్ర పూర్వ స్యాచో లోపః (హ్రస్వశ్చ). యథా - నాస్తి = ణత్థి. సంక్రాంతిః=సంకన్తీ. నిష్క్రాంతః=ణిక్కన్తో. ఆర్తః = అత్తో ) ఏత త్కోష్ఠకాంతర్గతః పాఠో న సార్వత్రికః" (ప్రాకృత ప్ర. - ౪ పరి. ౧ సూ.). కాఁగా నట్టి హ్రస్వము సూత్రస్థ బహుళ శబ్దము చేతనే సంపాదింపఁదగినదని యభిప్రాయ మెన్న నగును. "జఉణ అడం = (యమునా తటః)......బహుళ గ్రహణాత్ నా ఇత్యత్ర హ్రస్వ త్వమ్..." (ప్రా. ప్రకా. ౪ పరి. ౧ సూ.). ఇట్లు సంయోగ పూర్వస్థలములలో హ్రస్వము రాకుండుట ప్రచురమై యుండుటయు సంయోగపూర్వకత్వము లేనపుడును హ్రస్వము వచ్చుచుండుటయు నరయఁగా నయ్యది తెనుఁగు లోని నియమమువంటిది కాదని విశదమగుచున్నది.

XII. వ్యాఖ్య:—హ్రస్వేత్యాది – కొన్నియెడల దీర్ఘము హ్రస్వ మగును. ఈవిషయమున నిట్లుగ నెన్ననగును. ఏకాధిక గుర్వక్షరములు వరుసగ నొకపదములో నున్నపు డుచ్చారణసౌలభ్యమునకయి వానిలో నొక గుర్వక్షరమగు దీర్ఘము హ్రస్వమగును. ఉదా. కస్తూరి = కస్తురి. వాహ్యాళి = వయాళి, అమావాస్య = అమవస. నారాచము = నారసము. ఆకాశము = ఆకసము. ఆధారము = ఆదరువు. కుమారస్వామి = కొమరసామి. మాలాకారి=మాలకరి. స్వర్ణకారి=సొన్నారి, సొన్నరి. సంతోషము = సంతసము. ఏకాంతము = ఏకతము. పరీక్షించు = పరికించు. మొ.

XIII. దీర్ఘము తరువాతి హల్లు ద్విరుక్తమగుటయు నట్టియెడల నాదీర్ఘమునకు హ్రస్వము వచ్చుటయుఁ గలదు. ఉదా. నీవారము = నివ్వరి. మానన= మన్నన. ఇట్టివానిలోని ద్విత్వము కొన్నియెడలఁ గాలక్రమమున నుచ్చారణములోఁ దేలుచు లోపించుటయుఁ గలదు–ఉ, నివరి. ఇట్లె వెనుక నుదాహరించిన

౧. శ్లో. కుత్రచి చ్ఛబ్దభేదేషు । భవే త్పర్యస్తలింగతా (వికృతివివేకము)

౨. సీ. అ, ఇ, ఉ లేకారంబు లాదేశములు మఱి । లాగమంబులు ప్రథమైక వచన । మునకు....(కవిసం ౩ తరం - ౪ పద్య)

౩. గీ. చెందు డుమువు । లొక్క కొన్నిపదంబుల కురగభూష-(కవిసం ౩ తరం ౩ ప)

౪. గీ. తద్భవము దేవమనుజశబ్దంబులైన । నడఁగు నొక్కొక్కచోట డు మాగమంబు. (కవిసం ౩ తరం ౪ ప)

---

రీతిని గొన్ని యెడల దీర్ఘ మూరక తేలి హ్రస్వమగును. (౭౯-XII.)ఉ. రాహుత్తుఁడు = రవుతు.

పయి సందర్భమును బట్టి తెల్గులోని హ్రస్వద్విత్వములు సన్నియోగ శిష్టములని చెప్పవచ్చును - ఇట్టినియత సంబంధము ప్రాకృతమున లేదు. ఉ. సేవా = సేవ్వా. యౌవనమ్ = జోవ్వణం - నీలమ్ = ణేల్లం. మొ.(XI. ౪.చూ.)

(౮ం) వ్యాఖ్య. ౧ కుత్రచిదిత్యాది - ప్రకృతి లింగములు వికృతిలో మాఱుటయుఁ గలదు. ఉదా - చీరము = చీర; కపిలము = కవిల. తాతుఁడు = తాత. మొ.

౨. 'అ, ఇ, ఉ, ఎ. అనునవి స్త్రీ ప్రత్యయములై' శబ్దముల తుదిని నిల్చును. ఉదా. ముస్త = ముస్తె; శ్రవము = చెవి. మొ.

3. వికృతుల తుదిని 'డు, ము, వు' అనునవి నిల్చుటయుఁ గలదు. ఉదా. ఈర్ష్య = ఈ రసము. మొ.

౪. మహద్వాచకములకును 'డు' రాకపోవచ్చును. ఉదా - భటుఁడు = బంటు. మొ.

తెనుఁగుభాషలోఁ బదము తుదిని 'అ, ఇ, ఉ, ఎ' అనునవి నిల్చుటయు వానిని స్త్రీసమములని వాడుటయుఁ గలదు. "వికృతౌ సర్వేశబ్దాః, క్లీబసమాః స్త్రీసమాశ్చ నాన్యే స్యుః । క్లీబసమా అమహద్వత్, స్త్రీవత్ స్యుః స్త్రీసమాః" అనియిట్లు చింతామణి కర్త చెప్పియున్నాఁడు. పైని వ్రాసిన 'అ' మున్నగునవి కొన్నిశబ్దములకుఁ గేవలము స్త్రీసమత్వవివక్షలో స్త్రీ ప్రత్యయములగుచు శబ్దాంతమున నిల్చుచున్నవి. ప్రత్యయస్వరసంధి నిత్యముగాన నట్టిస్త్రీ ప్రత్యయములు ప్రకృతుల తుదిని నిల్చుచున్నవి. ఉ. నిశ్రేణి = నిచ్చెన. అర్ఘము = అగ్గువ. త్యాగము = తెగువ. హింగువు = ఇంగువ.

తాతుఁడు = తాత. కాకము = కాకి. కుద్దాలము = గుద్దలి. నీవారము = నివ్వరి. చంపకము = సంపఁగి. మానుషుఁడు = మానిసి. శ్రవము = చెవి. సంధి = సందు. భటుఁడు = బంటు. వీణ = వీణె. ముస్త = ముస్తె. పట్టము= పట్టె. త్రికము = తీఁగె, కాష్టము = కట్టె. ('కద్రువ' శబ్ద మచ్చ తెనుఁగు కావ్యములలో నగపడమింజేసి యది తత్సమముగనె సాధింపఁబడెను). ఇట్టి స్త్రీసమములందుఁ బారిభాషికలింగ మనఁబడెడి సంస్కృతభాషాప్రసిద్ధలింగము గలదనియు దానిపద్ధతి చొప్పుననె తాత బంటు నిచ్చెన మున్నగు నాచ్ఛిక శబ్దములకును దత్త ద్వాచ్యవ్యక్తు లందలి సత్వరజస్త మోగుణములలోని సత్వోపచయ సత్వాపచయ సత్వసామ్యములను లోకము వివక్షించుటలోని భేదములచేతనె వరుసగాఁ బుంస్త్రీనపుంసకత్వము లేర్పడిన వనియుఁ జెప్పనచ్చును. కాని లింగ మర్థాశ్రితమని కుదుర్చుట కాపద్ధతి సంస్కృత పండితులచేఁ గల్పింపఁబడెనని తలంచి కాఁబోలు నట్టిపద్ధతియందలి యరుచిచేత నాంధ్ర వైయాకరణు లాంధ్రశబ్దములను బుంలింగసమములు, నపుంసక లింగసమములు, స్త్రీలింగసమములు నని వ్యవహరింపసాగిరి. పుంలింగ వాచక సంస్కృత సమశబ్దముల యాకారము గలవి యనఁగా డుమంతములగు తెనుఁగు శబ్దములు పుంలింగసమములనియు, నట్లే నపుంసకలింగ వాచక సంస్కృతసమ శబ్దములయొక్క యాకారముతో నున్న వనఁగా ముప్రత్యయముతోఁగూడినవి నపుంసకలింగసమములనియు నట్లె స్త్రీలింగవాచక సంస్కృతసమశబ్దముల యాకారములతో నున్న వనఁగా ప్రథమైకవచన లోపముతోనున్న శబ్దములు స్త్రీసమములనియు వ్యవహరించి యున్నారు. కాఁగానాచ్ఛిక శబ్దములను బున్నపుంసకస్త్రీలింగ వాచకములని వాడుట సంప్రదాయము కాదు. ఇంక వానిని బుంలింగసమములు నపుంసక లింగ సమములు స్త్రీ లింగసమములు ననియె వ్యవహరింప నగును. తద్భవములందు లింగవ్యత్యాసము బహుళముగఁ గల్గుచుండును. ఉ. ఈర్ష్య=ఈరసము, తాతుఁడు=తాత. భటుఁడు = బంటు మొ. మఱియుఁ గొన్ని సంస్కృత శబ్దములు స్త్రీ లింగ వాచకాదులై యున్నపుడు వాని వికృతులును స్త్రీ సమాదులే యైయున్నను స్త్రీప్రత్యయాకారములగు స్వరములు మాఱుటయుఁ గలదు. ఉదా. ముస్తా= ముస్తె; నిశ్రేణీ = నిచ్చెన; మొ.

కొన్ని చోట్ల స్త్రీ ప్రత్యయములై నిచ్చెనని సూరకవ్యాదు లంగీకరించిన "అ, ఉ," మున్నగువాని చరిత్రమును వేఱుమార్గమున నూహించుట

**మఱి విభ_క్త్యేకలోప। ములగు పదములు తద్భవంబులగు( గొన్ని।** (కవిస. ౩ తరం-౧౦౦ ప.)

కవకాశము కలుగుచున్నది. అట్టిచరిత్రము ననుసరించి యీ క్రిందిరీతిని చూపుచున్నాను.

వ్యాఖ్య:— మఱీత్యాది - కపిలము మున్నగుచోట్ల విభక్తిలోపమున 'కవిల' మున్నగుతద్భవము లేర్పడునని యర్థము. వానిచరిత్ర మిట్లూహింపనగును.

I. సంస్కృతశబ్దముల నాంధ్రులు వాడుటలో "చీరము" మున్నగు వాని తుది నున్న 'ము' వర్ణము సున్నగా( బలుక(బడుటయు నయ్యది క్రమక్రమముగా( దేల్చి పలుక(బడుచు నానా(టికి నశించుటయు సంభవించుటచేత( గొన్నిటికి స్త్రీసమత్వ మంగీకరింప(బడుచున్న దని యూహింపనగును. (అఱవ భాషలో 'ము' ప్రత్యయము చోట మకారవ్యంజనము నిల్పుటయు( గన్నడము నను వ్యావహారికాఱవమునను తెల్గువాడుకలోవలె( బూర్ణానుస్వారము నిల్పుటయు సంప్రదాయము.) ఉదా:-చీరము=(చీరం)=చీర; కుండము=కుండ; కపిలము=కవిల; ఫలకము=పలక; ఫనసము=పనస; శ్యామలము=చామన; లవము=రవ. కవిసంశయ విచ్ఛేదమున 'ఉవిద' శబ్దము 'అ' ప్రత్యయాంతమని చెప్ప(బడెను. కాని దానియందలి 'అ' వర్ణము 'యువతీ' శబ్దమునందు జరిగిన వర్ణవ్యత్యయమున సిద్ధించె ననుటలెస్స.

II. ప్రథమా విభక్తియగు 'ము' ప్రత్యయము 'వు' వర్ణముగా మాఱుటయు( గొన్నిచోట్ల దాని మొదటి 'అ' కారము స్వరశక్తిచే 'ఉ' కారమగుటయు( గలదు. మవలు రెండును నోష్ఠ్యములు. వకారమునకు( గల పాక్షికమగు నానునాసిక్యమును వివక్షించునపు డనునాసికమగు మకారమునకు వకారము కేవల సన్నిహితము కా(గలదు. కావుననె పై మార్పు తత్సమములందునుగలదని వైయాకరణులు సూత్రించిరి. ఉదా. ధర్మువు, కర్మువు, వర్గువు, అర్ఘువు. వీనిలో( గొన్నిటియం దనాంధ్రాక్షరములు వెలయుచుండుట చేత వానికి( దద్భవత్వ మసంభవమగుటంజేసి వానికిని వానిని బోలువానికిని దత్సమత్వమే యాంధ్రవైయాకరణులచే నంగీకరింప(బడుచున్నది. ప్రకృత సూత్ర లక్ష్యములగు 'కసవు' మున్నగువానియం దన్ననో ముప్రత్యయ 'మ' కారము వకార మగుటయేకాక యితర వర్ణ వికృతులును నుండుటచేతను నీశబ్దము లచ్చతెలుగు( గావ్యములలో వాడ(బడి యుండుటచేతను వీనికి(

దద్భవత్వ మభ్యుపగత మగుచున్నది. ఇంక 'ము' ప్రత్యయాంతము లె యనఁదగు నీ తద్భవముల నపుంసకలింగ సమత్వము విస్మృత మగుటయు వీనికి స్త్రీ సమత్వ వ్యవహారము కల్గుటయు వింత యననగును. ఉదా. ఘాసము= కసవు; ఉత్తరము = ఉత్తరువు, భరము=బరువు ఆధారము = ఆదరువు, సత్రము = సత్తరువు, సులభము = సుళువు, హితము = ఇతవు. మొద. ఇట్టి వానిపై మరల 'అ' అను స్త్రీప్రత్యయము నిల్చుటయుఁ గలదు. హింగువు = ఇంగువు = ఇంగువ. అర్ఘము = (అర్ఘువు) = అగ్గువ. మొద.

III. పయి సూత్రముచొప్పున మువర్ణకము వువర్ణముకముగా మాఱిన పిదపఁ గొన్నియెడల నట్టి వకారము నిత్యముగ లోపించుటయు దానిపైనున్న 'ఉకారము' పూర్వాచ్చుతో నిత్యముగా సంధించుటయుఁ గలదు. పదములోని తుది హల్లగుటచేతను, నల్పప్రాణ మగుటచేతను, గొన్నిచోట్ల 'ఉ' కార ద్వయమధ్యవర్తియగుటచేతను నచటి వకారము లోపించుట స్వాభావికమె యనఁదగును. ఉ- తేజము =(తేజవు =(తేజ+ఉ) = తేజు. 'కసవు' మున్నగు పూర్వసూత్రపు లక్ష్యములె స్త్రీసమము లనునపుడు వీనినట్లు వ్యవహరించుట కైముత్యన్యాయసిద్ధ మగునుగదా. రూపము = ఉరువు, నీరము = నీరు, ఈరసము = ఈసు, కాచము = గాజు, కాచము = కాసు, కపింజలము = కవుఁజు, అంబకము = అంబు, అంచలము = అంచు, శబ్దము = సద్దు, సుభగము = సొబగు, యామము = జాము, కాలము = కారు, కుబ్జము = గుజ్జు, వేత్రము = బెత్తు, కళంకము = కళంకు, మీనము = మీను, నాదము = నాదు, వాదము = వాదు, శీతము = సీతు, పట్టము = పట్టు, అంగము = అంగు, ఇట్టివెల్ల 'ఉ' ప్రత్యయాంతములుగాఁ గవిసంశయ విచ్ఛేదమున నుదాహరింపఁబడి యున్నవి. (3 తరంగము. ౪-౫ పద్యములు)

(౮౧) కొన్నియెడలఁ బదాదిరేఫమునకు ముందు, దాని మీఁది స్వరమువంటి స్వరమే చేరుట కలదు. ఉదా. రథము = అరదము, రాజు = అరుసు, రూపము = ఉరువు. ఇట్టి యాగమములు వచ్చుసంప్రదాయము తమిళమునందు సార్వత్రికమై యున్నది. సంస్కృత పదముల పదాదిని యకారమునకు ముందుగ 'ఇ' కారము నిల్చుటయు రేఫమునకు లాకును ముందుగ అ, ఇ, ఉ అనువానిలో నేదే నొకటి నిల్చుటయుఁ దమిళమున నవ్యభిచరిత మగు విధియై యున్నది. రంగము = అరఙ్గమ్, రాముఁడు = ఇరామన్, రూపము = ఉరువమ్, లక్షణము = ఇలక్కణమ్, లోభము =

గీ. వగవ వర్ణంబు లేకఘవమునఁ జెలఁగు। (కవిసం. ౩ తరం-౧౧౫.)

సీ. పొల్లు లోఁగుఁ బదాంతహల్లులఁ బరమేశ - (కవిసం. ౩ తర-౪౫.)

---

ఉలోబమ్, (నన్నూల్, ఎళుత్తు అదిగారమ్, పదవియల్-౨౧ సూ.) ప్రాకృత ములలో వలెనే తమిళమునందును, సంస్కృత పదమునకు వైకృత రూప ముండునపు డింక నద్దాని తత్సమరూపమును వాడుట ప్రాచీన సంప్రదాయమే కాదు.

(౧౨.) ఒక్కచో రేఫమునకుఁ బూర్వమం దుండెడి యక్షరము మీఁది స్వరము లోపించి సంయోగ మేర్పడుటయుఁ గలదు. ఉదా:—కిరీటి=క్రీడి, కురవ కము = క్రోవి, కర్పూరము = కప్పురము = కపురము = క్రపము, (అబ్బు రము= అబ్రము, అదురుచు = అద్రుచు. ఆంధ్ర.) 25043

(౧౩.) అనునాసికములమీఁది స్వరమున్నైత మొకప్పుడు లోపించుట కలదు. ఉదా. సముద్రము = సంద్రము, పనితము = పంతము. (పందెము)

(౧౪.) స్వరము స్వపార్శ్వస్థ స్వరముల బలిమిచేతఁ దత్సారూప్యము నందుచుండుటయుఁ గలదు. దీనినె స్వరశక్తియని వాడుదురు. '(Vowel harmony)' అని యాంగ్లమున వాడుదురు.) ఉదా. తురుష్క = తురక, పూర్ణిమ, పున్నమ, చతుర్థి = (చఉద్ది) చవుతి= చవితి(వాడుక), ఉత్తరము= ఉత్తరువు, భుజంగుఁడు = బొజుగు, గ్రామణి = గామిడి, మానుషుఁడు = మానిసి, ముకుళ = మొగడ, బాంధవ = బందువు, చతురంగము = చదరంగము, చతురము= చదరము, బాలిశుఁడు= పాలసుఁడు, మొ.

—హల్వికృతి—

(౧౫.) వ్యాఖ్య—వగవేత్యాది:—పదాదివర్ణము మాత్రము తెలుచుగా నిల్చును. పదాంతహల్లు లోపించును. పదాదిగతములు కానట్టి యక్షరములయందు వక్తకును శ్రోతకును సాధారణముగ శ్రద్ధ తగ్గుచుండుట సహజము. పదాదినుండు నొకటి రెండక్షరములతోడనె సామాన్యముగాఁ దత్తత్పదార్థము తోఁచుచుండుటచేతఁ దక్కిన వర్ణములందట్టి యశ్రద్ధ కలుగుట వింతకాదు. అట్టి యశ్రద్ధచే వానిని దేల్చి పలుకుచుండుటచేత సాధారణముగా వర్ణలోపము సంభవించుచుండును. ఈరీతిని వర్ణములు లోపించునపుడచటి యలవాటులో నున్న వర్ణముల లోపమును బూరించుటకయి వాని చోట ననుస్వారముగాని పూర్వస్వర దీర్ఘముగాని (ముందు విశదపఱుపఁ

సీ. "హయల కాదేశ మచ్చు లగును" – (కవిసం.౩త. ౪ప.)

---

బడును.) సంభవింపనేరవు, ఉదా-వాక్కు = వా, రాట్టు = రా, రాజు = రా, కాననము = కాన, పారావతము = పారువము, తామరసము = తామర, దేవాలయము = దేవళము, సంభ్రమము = సంబరము. విజ్ఞాపనము = విన్నపము, ప్రగ్రహము = పగ్గము.

—లోపవికృతి—

(౮౬) అట్లుగాక, ఉచ్చారణసౌలభ్యాపేక్ష, ఉచ్చారణత్వర, అస్పష్టశ్రవణము, నాయాదేశములలోని ముఖయంత్రములందలి కొన్ని లోపములు, కొన్ని వర్ణముల యుత్పత్తిలోఁ గాని పలుకుబడిలోఁగాని వెలయు బలహీనత, మున్నగు కారణములచేత నపదాదినే కాక పదాదియందును హల్వర్ణలోపము సంభవించుచుండును. అట్లు లోపించిన హల్లులపై నుండు స్వరములు పూర్వాచ్చులతో మేళితములగుటలో నవి సాధారణముగాఁ బూర్వాచ్చును దీర్ఘముగా మార్చుచుండును. కాఁగా నచటి వర్ణమును బలికెడి యలవాటునందు గల కాలవ్యవధి పూర్వాచ్చునకు మాత్రాధిక్యము నొదవించుటచేత గతార్థ మగును. పదాదివర్ణము లోపించునప్పు డట్టి లోటు కనఁబడనేరదు. కాన నట్టియెడ మాత్రాధిక్యాదులు కలుగుటకుఁ బ్రసక్తియె యుండదు. (దీనికి మున్ముందుఁ జూపఁబడెడి లోప స్థలములెల్ల నుదాహృతులు కాఁగలవు). ఉదా. ఉపహారము = ఉప + ఆరము = ఉపారము.

వ్యాఖ్య. హయేత్యాది:—హయలు లోపింపఁగా వాని మీఁది యచ్చులు నిల్చునని యర్థము.

(౮౭.) హకారము మహాప్రాణ మగుటచేత నుచ్చారణసౌలభ్యాపేక్షచేఁ దఱుచుగ లోపించును. (చూ. విష. ౯౧) అట్లు లోపించుటలోఁ బదాదీతరస్థలములందుఁ బైరీతిని బూర్వస్వరమునకు దీర్ఘము తఱుచుగా సంభవించును. ఉదా:- ఉపహారము = ఉపారము. మహారాజు = మారాజు. సహజము = సాజము. సహాయము = సాయము. గ్రహము = గాము. మహానసము = భానసము. గృహము = గీము. ముహూర్తము = మూరుతము. గృహస్థుఁడు = గేస్తుఁడు.

కొన్ని శబ్దములలోని కవర్గీయములు హకారముగ మాఱిన పిదపఁ బయిరీతి వికృతి కలిగెనా యని యాలోచింప నగును. ఉ. ముఖము = మొహా

ము = మోము. సగము = సహము = సాము. 'మొహము సహము' మున్నగు నవి గ్రాంథికాంధ్రమున లేకున్నను వ్యావహారి కాంధ్రమున వెలయుచునే యున్నవి. ఇంకను సుఖము = సుహము. మేఘము = మేహము మున్నగు ననేకస్థలము లిట్టివి వాడుకభాషలోఁ గలవు. (ఇట్లే కేవల త్వరితోచ్చారణమున శవర్ణముచోట సైతము హకారము వ్యావహారి కాంధ్రమున వెలయుచున్నది. చదివేశాడు = చదివేహాడు. ము.) గ్రాంథికాంధ్రమునందును ప్రాకారము = ప్రహరి మున్నగుచోట్ల నిట్టి వికృతి యగపడుచునే యున్నది.

తమిళ భాషలో హకారస్థానము 'క' కారము నిల్చునని నన్నూలు వ్యాకరణమునఁ జెప్పఁబడెను. (పదప్రకరణము, ౨౦ సూ.) మోహమ్ = మోకమ్. నేఁటి కాలమునఁ దమిళ పండితులు సైతమిట్టి హకారస్థానజన్య కకారమునేకాక యెల్ల కకారములను హకారముగ నుచ్చరించుచున్నారు. కహలు సమానస్థానికము లగుటచే నిట్టి మార్పులు సహజములె యనఁదగును.

వర్ణాంతర లోపమునందును బూర్వస్వర దీర్ఘ మగపడుచున్నది. దీర్ఘ పూర్వకత్వమున నాదీర్ఘమె నిలుచును. ఉదా. జీవితము=జీతము. కరండము= కరాటము. నిరభ్యవహారి = నిరాబారి = (నిరాహారి ప్రకృతికమనుటకంటె నిదియె లెస్స.) వ్యవహారము = బేరము. పదాదిని హకార లోపము మాత్రమే కలుగును. హిమము = ఇవము. హితము = ఇతవు. హేలలు = ఏలలు. హంస = అంచ. హనుమ = అనుమ. హరణము = అరణము. హరితాళము = అరిదళము. హర్షము = అరుసము. పదాది హకారలోపము తమిళమునందును గలదు. హిమమ్ = ఇవమ్.

(రా.) "పూను, పొదవు, పొందు, పొనరు, పొసఁగు," అను శబ్దము లందలి పదాది పకారము లోపించుట గలదు. ద్రావిడభాషాంతరమగు కన్నడ సంప్రదాయము చొప్పున నట్టి పదాది పకారము హకారమగుచు లోపించెనా యని యాలోచింపవలసి యున్నది. 'నీలుగు, నెగయు' అను శబ్దముల పదాది 'న' కారము లోపించుట గలదు, ద్రుతసంధిలో నివి పదాది 'న'కారకము లను తలంపున వీనికి హలాదు లను వాడుక కల్గెనా యని యాలోచింపవలసి యున్నది. పదాది నున్న యకారమునకు సైతము లోపము పయి రీతి నరుదుగ నగపడును. ఉదా. యశము = అసము. యువతి = ఉవిద. యుక్తుఁడు = ఉత్తుఁడు. యకార మల్ప ప్రాణముగాన తేలిపోయి లోపించుట సహజమె. లోపము రాని శబ్దములలోఁ దాలవ్య సంబంధమున నయ్యది

గీ. సున్నదొలఁగు — (కవిసం. ౩ త. ౨ ప.)
సీ. నెరసున్న । లరసున్నలగు నొక్కయవసరమున (కవిసం. ౩ త. ౧ ప.)
సీ. ఏత్వము **లఘుత్వము** భజించు దానికి
నాదేశ మియ యగు నళికనేత్ర (కవిసం ౩ తరం ౪ ప)
సీ. కత్వ హత్వములకు యత్వా మాదేశ మౌ (కవిసం ౩ త. ౬ ప)

---

తఱుచుగ జకార మగుచున్నది. యముఁడు = జేముఁడు. యజ్ఞము = జేన్నము. యుక్తి = జిత్తు. యత్నము = జేతనము. మొ.

(౮౯.) ద్విత్వములో నొకహల్లు లోపించి ముందటి స్వరమునకు దీర్ఘము వచ్చుటయుఁ గలదు. ఏతత్సమాన న్యాయమునఁ బరహల్లునకు ద్విత్వము వచ్చి ముందటి దీర్ఘము హ్రస్వమగుటయుఁ గలదు. ద్వివిధ స్థలములందును, బూర్వాక్షరమున కుచ్చారణమునఁ గల యూఁది పలుకు నలవాటునకు భంగము కలుగకుండుటకయి యట్టి మార్పు గలుగుట సహజ మనఁదగును. ఉదా-పుష్పము = పువ్వు = పూవు. నీవారము = నివ్వరి. మాననము=మన్నన (చూ.౭౯ XIII) స్నేహము = నేలము = నేయము. నెయ్యము.

వ్యాఖ్య: (౯౦.) సున్నేత్యాది-ఉచ్చారణ సౌలభ్యాపేక్షచేతఁ గొన్ని యెడల సున్నలు తేలి (యరసున్న లగుటయు) లోపించుటయుఁ గలదు.

ఉదా. తరంగము = తరగ (దీనిలో నర్ధబిందువు కోశములలోఁ జూపఁబడుచున్నది. ఆపక్షమున ‘తరంగ’ అనునది తత్సమము తద్భవమును నై యుండు ననఁదగును ‘తరఁగ’ అనునది తద్భవమాత్రమె యగును.) ఏకాంతము= ఏకతము. (కాంత=కాఁత. ఇది కవిసంశయ విచ్ఛేదమునఁ జూపఁబడినది. కాని యది యే కోశమునందును లేదు-) కూశ్మాండము = గుమ్మడి. మాతంగుఁడు = మాదిగ. ఆమంత్రణము = ఆమతి. మొ. ‘అంతఃపుర’ము మున్నగు చోట్ల ‘అంతిపురము’ అనియిట్లు విసర్గము లోపించుటయుఁ గలదు.

వ్యాఖ్య:—(౯౧) ఏత్వము ఇత్యాది—అర్థము స్పష్టము. వీణ=వీణె= వీణియ; ఘటిక = గడియ; సందేహము = సందియము. మొ.

‘ఇయ’ (ఇ+అ = ఎ) కు ‘ఎ’ వచ్చుట సహజముగాని ‘ఎ’ అనుదానికి ‘ఇయ’ వచ్చుట సహజము కాదు. కావున వీణికాది శబ్దములనుండి వానిని సాధించుకొనుట యుక్తము.

అపదాదిస్థములగు ‘క, చ, త, ర, వ, హ’ అనువర్ణము లరుదుగ లోపించి స్వరశేషము లగుటయుఁ గలదు. వీనిలో ‘క’ కారము పదాంతమున లోపిం

చుట, చాలవఱకుఁ దఱుచుగ నగపడుచున్నది (౮౭ వి.) అట్టియెడ నేర్పడు సంహితలోని యచ్చులు సంధింప కుండుటయు నాంధ్రభాషా సంప్రదాయాను సారముగ నాయచ్చుల నడుమ సాధారణముగ యకారమె నిల్చుటయుఁ గలదు. క్వాచిత్కముగ నన్యద్రావిడభాషా సంప్రదాయము చొప్పున వకారము నిల్చుటయుఁ గలదు. ఇకారపూర్వకస్థలమున యకారము నిల్చుట పాక్షికమై యుండ 'ఇ' కారమును ద్రోసి యకారము నిల్చుటయుఁ గ్వాచిత్కముగ నగపడుచున్నది. ఇఁక యకారము నిలువని పక్షమున నచటి స్వరద్వయమును (ఇ + అ) సంధించి 'ఎ' కారముగ మాఱును. తాలవ్యమగు 'ఇ' కారమును గంఠ్యమగు 'అ' కారమును గలిసి కంఠ్యతాలవ్యమగు 'ఎ' కారముగ మాఱుట సహజమేకదా. (వచ్చి నాఁడు=(నకారములోపమున) వచ్చి+ఆడు=వచ్చాడు—వచ్చేడు - మొదలగు వ్యావహారిక రూపము లీవిషయమున మంచి నిదర్శనములని చెప్పవచ్చును.

ఉదా:—కకారలోపము—ఘటిక = గడియ, గడె. దీపిక=దీవియ, దీవె = దివ్వె. ఢక్కిక = డిగ్గియ, డిగ్గె. మల్లిక = మల్లియ, మల్లె. పేటిక = పేటియ, పెట్టె. మౌక్తికము = ముత్తియము, = ముత్యము, ముత్తెము. ఛురిక= సురియ, సురె. వీటిక = వీడియము = వీడ్యము, వీడెము = విడెము. వర్ణకము = వన్నియ = వన్నె (రంగు). (ప్రత్యయ మను నర్థమునందు 'వన్నె' అను రూప మగపడదు-) ('వన్నియ' అనుచోటి 'ఇ' కారము యకార తాలవ్యతా బలమునఁ గల్గి యుండును) మాలిక = మాలియ = మాలె. వీణిక=వీణియ వీణె, భూమిక = బూమియ=బూమె. పుత్త్రిక=బొట్టియ = బొట్టె. మృత్తిక= మట్టియ =(మట్టి) కన్యక = కన్నియ=కన్నె, కన్య. కటకము=కడియము = కడెము. కుంచిక=కుంచియ = కుంచె. కంఠిక = కంటియ = కంటె. అంకిక = అంకియ = అంకె. దండక = దండియ = దండె. పట్టిక = పట్టియ = పట్టె, కోకిల=కోయిల. ఘటీకారము=గడియారము.

చకారలోపము :—మరీచము = మిరియము. పింఛిక = పించియము = పించెము. ఇది పింఛాశబ్ద భవము కాదు.

తకారలోపము :— చతుర్థి = (చ + ఉ + ద్ది) = చవుతి. చతుష్కము= (చ+ఉ+కము) చవుకము.

రేఫ (రకార) లోపము:- ఉష్ట్రము = (ఉష్టరము = ఒంటియ.)

గీ॥ అనుఁగులగుఁ గ్రిందిమీఁది సంగాక్షరములు (కవి- ౩త - ౨ప.)

వకార లోపము:—దైవము=(దైయము, దయియము) = దయ్యము (అయి+యును=అయ్యున్).

హాకారలోపము:— పరిహాసకము = పరియాచేకము= (పరి + ఆచేకము=) పరేచకము (పారిజాతకోశము). సహితము = సయితము. సైతము. సందేహము=సందియము (సందెము, అనురూప మగపడదు) సహించు = (సయించు) = (సైంచు) = సైఁచు. రాహుత్తుఁడు = (రా + ఉత్తుఁడు) రవుతు=రాతు. స్నేహము = (నే + అము= నేయము) = నెయ్యము (విష. ౮౯).

ఇట్లు పదమధ్యమునందలి వర్ణము లోపించి స్వర శేషమగుట ప్రాకృతమున మిక్కిలి ప్రచురము. కానియట్టి యచ్చులనడుమ వకారాగమము వచ్చుట లేదు. యకారాగమము మాత్రము 'అ' ద్వయమధ్యమున వచ్చునని కొందఱును 'అ' వర్ణపరకత్వ మాత్రమునఁ గల్గునని కొందఱును జెప్పిరి.

"యశ్రుతిరః" (షడ్భా - ౧-౩-౧౦) ప్రాయోలుగిత్యాదినా కాదీనాం లోపే సతి (క గ చ జ త ద ప య వలు లోపింపఁగా) యోఽవశిష్యతే 'అ' వర్ణః-సః అవర్ణాత్పరో లఘుప్రయత్నతర యకారశ్రుతి ర్భవతి, ఉదా—వచనమ్=వఅణమ్ = వయణం, మకుటః = మఉటో; ఇచట యత్వము లేదు. "యత్వమవర్ణే, (చండవ్యా-౩ విధానము- ౩౯. సూ.) కకార వర్గతృతీయయో రవర్ణే స్థితయోః యత్వం భవతి, కాకాః=కాయా. నాగాః=నాయా. క్వచి దన్యత్రాపి) పిబతి=పియఇ."

వ్యాఖ్య :— (౯-౨) అనుఁగు లిత్యాది—సంగాక్షరములు = విజాతీయములగు సంయుక్తాక్షరములు. అనుఁగు లగును=సజాతీయములుగాఁ బరిణమించును. ఈద్విత్వ మీ క్రింద మార్గాంతరమున సాధింపఁబడుచున్నది.

—సంయుక్త వికృతి—

సంయుక్తవర్ణములలో నొకహల్లు మాత్రము నిల్చి తక్కిన హల్లు లుచ్చారణ సౌలభ్యాపేక్షచేత లోపించును. పదాదీతరస్థలములలో లుప్తశేషము ద్విరుక్త మగును. సంయుక్తములలో నొకహల్లుమాత్రమే నిల్చునపుడు తత్ పూర్వవర్ణమున (పదాదియం దిట్టి ప్రక్రియ కావశ్యకతయే లేదు.) కుచ్చారణమున నలవాటయి యున్న గౌరవమున కనఁగా నూనికకు భంగము వచ్చును

గాన నట్టి గౌరవమునకు లోపము లేకుండ నట్టి లుప్తశేషహల్లునకు ద్విరుక్తి వచ్చుట కేవలము సహజమై యున్నది. ద్విత్వమును సంయోగమె యైనను నది భిన్నప్రయత్నోచ్చార్యమాణ హలంతరసంయోగమువలె శ్రమజనకము కాదు. ఉదా. లాక్షా=లక్క, లక్ష్మి=లక్కిమి; లచ్చి; లక్ష్మణుఁడు=లక్కుమనుఁడు.

కూచిమంచి తిమ్మకవి క్షకారముతో హలంతరము కూడియుండెనేని యచట ద్విరుక్త కకారాదేశము రానేరదని యీక్రిందిరీతిని జెప్పి యున్నాఁడు.

తే॥ గీ. సరవితో శబ్దమధ్యావసానములను
క్షాకు ద్విత్వ కకారంబు గదిసి నిలుచు
నాక్షకారంబుతోడ హల్లంటెనేని
రాదు ద్విత్వ కకారంబు రాజభూష (సర్వల. -౧ ఆ. ౩౮ ప.).

'లక్కుమనుఁడు; లక్కిమి' మున్నగుచోటులలోని 'క్ష్మ' అనుదాని యందలి మకారము వేఱుగ నిల్చుటచేత నచట విరోధము లేదనఁ దగును.

తద్భవములలోని ద్విత్వములకుఁ బయిరీతిని యుక్తి కల్పించుట ప్రాకృత వ్యాకరణ మార్గానుసారి యందురు.

"ఉపరిలోపః క గ డ త ద ప ష సామ్" (ప్రాకృత ప్రకాశము. 3 పరి. ౧ సూ.) (సంయోగములోని మొదటి కకారాదులు లోపించును.) 'అధో మనయామ్' (ప్రా. ప్ర. 3 పరి. ౨ సూ.) సంయోగములోని పరస్థిత మన యలు లోపించును) "సర్వత్ర లవరామ్" (ప్రా. ప్ర పరి. 3 పరి. 3 సూ.) సంయోగములో నెచటనున్నను ల వ రలు లోపించును.) "శేషాదేశ యో ర్ద్విత్వ మనాదౌ" (ప్రా. ప్ర. 3 పరి. ౫౦) (పదాదీతరస్థలములందలి లుప్త శేషాక్షరమునకును నాదేశాక్షరమునకును ద్విత్వము వచ్చును. ఉ. మార్గో = మగ్గో; మొ.)

ఉచ్చారణ సౌలభ్యాపేక్షాకృత మగుటచేత నీద్విత్వ పద్ధతి కేవల ప్రాకృత భాషా మాత్ర స్వభావము కాదని యెన్ననగును. తమిళ కర్ణాటము లందును నిట్టి పద్ధతి గలదు. నన్నూలునందును (తమిళ వ్యాకరణము) గర్ణాట శబ్దానుశాసనమునందును నిట్టి పద్ధతి సూత్రింపఁబడి యున్నది. విస్తర భీతి నిటఁ జూపలేదు.

గీ॥ క్రార యొక్కొకచోఁ దొలంగకయ యుండు (కవిసం. ౩ తరం. ౨౫)

గీ. "ద్విత్వ వర్ణంబులకును మీఁదిదియ యొండె
క్రిందిదియ యొండె తొలంగును —" (కవిసం ౩ తరం. ౩ ప.)

---

కవిజనాంజనకర్త పై యడిదము సూరకవి గారి రచనమును సరిగ గ్రహించిన ట్లగపడదు. ఆతఁ డుదాహరించిన గుమ్మడి శబ్దమునందలి ద్విత్వమునకు మార్గము చూపఁబడలేదు. ఒక్క క్షకారమునకు మాత్రమె ద్విత్వ కకార మాదేశింపఁబడెను. మఱియు 'అథో యత్వస్య చైత్వం స్యాత్', అను దానిచే నెత్వము వచ్చునప్పుడు కన్నె మున్నగు వానిలోని నకార ద్విత్వమునకు మూల మగపడదు.

వ్యాఖ్య :—క్రారేత్యాది—కొన్ని యెడల సంయోగములోని క్రారవడి లోపింపదని యర్థము. తద్భవపదములలో రేఫ పరకసంయోగము మాత్ర మరుదుగఁ బదాదిని పదమధ్యమునను నగపడుచున్నది. ఉదా. క్రౌంచము = క్రొంచ, కొంచ. గృధ్రము = గ్రద్ద. ద్రౌపది = ద్రోవది. ప్రతిజ్ఞ = ప్రతిన. ప్రాకారము = ప్రహరి. ప్రాయశ్చిత్తము = ప్రాచితము. ప్రతనము = ప్రాఁత. ప్రేరించు = ప్రేరేఁచు. ప్రేమ. ప్రేముడి. ప్రాపము = ప్రాపు. ప్రబలించు = ప్రబలు. యంత్రము = జెంత్రము. సముద్రము = సంద్రము. సంభ్రమము = సంబ్రము. కర్పూరము = కప్రము. కిరీటి = క్రీడి. వర్తులము = వట్రువ. కురవకము = క్రోవి, పదమధ్యమందు రేఫేతర సంయోగములును నరుదుగ నగపడుచున్నవి. ఉదా.—కస్తూరి = కస్తురి. పటోలి = పొట్ల. జ్యౌతిషము = జోస్యము మొ.

(౯౩.) వ్యాఖ్య, ద్విత్వేత్యాది:—పయిరీతిని వచ్చిన ద్విత్వ వర్ణములలో నొకటి లోపించుటయుఁ గలదు. లుప్తశేషమునకు వచ్చు ద్విత్వమును గాలక్రమమునఁ దేల్చి పలుకు నలవాటుచే నొకహల్లు లోపించుట సంభవింప నగును. ఉదా—కక్షపాల = కక్కపాల = కకపాల. ఇష్టిక = ఇట్టిక = ఇటిక. తాంబులము = తమ్ములము = తములము. అంబ = అమ్మ = అమ. వాహ్యాళి = వయ్యాళి = వయాళి. మాణిక్యము = (మానిక్కము) మానికము. మొ. మానిక్కమను పదము వాఙ్మయమున నగపడదు. వాడుకలో 'మాణిక్కెం వంటి' అనురీతి ప్రయోగము గలదు. తాంబూలాది శబ్దములలోని సున్న ౯౪ విషయము చెప్పఁబోవు మకారమగుడు ద్విత్వము నందుచున్నది.

(౯౪) సంస్కృత శబ్దములలోని కొన్నియెడల నుండు నకారపూర్వక మకారమును బిందుపూర్వక బకారమును మకార ద్వయముగఁ దెల్గున నేర్పడును. మకార సంబంధముచే నచటి న బ లు మ కారమగుట సహజమే కదా. వర్గీయ సంయోగములోఁ దుదివర్ణము నిల్చి పూర్వవర్ణము లోపించుట సహజమ (౧౦౨ విష.) గుటచే బకారవిషయము నిందు వేఱుగ సూత్రింపక తీరదయ్యెను. ఉదా-ఉన్మాదము = ఉమ్మాదము. ఉన్మత్తము = ఉమ్మెత్త. తాంబూలము = తమ్మలము. అంబ=అమ్మ. కుంభకారి = (భణు) కుమ్మరి. అంబకము = అమ్మ. జంబు = జమ్ము. తుంబి = తుమ్మి. కంబి= కమ్మి. కుసుంభము. కుసుమము. ('కుసుమ్మము' అనునది వాడుకనుండి నానాఁటికి నశించి యుండును.) ఈసూత్రముచే సాధింపఁబడు లక్ష్యములలోని బిందువుచోట మ కారముండుట సంస్కృత సంప్రదాయ మగుటచే నీలక్ష్యములు వెనుకటి పద్ధతిచేతనే సాధ్యము లగుచున్నవే యని శంకింపరాదు. సంస్కృత సమ పదమధ్యములందు పరసవర్ణాదేశము నిల్చుట యాంధ్రవైయాకరణ సంప్రదాయము కామింజేసియు నట్టి యనునాసికములచోట బిందువు నిల్చుటయె యాంధ్రకవి పండిత సంప్రదాయ మగుటంజేసియు (౭౮ విష.) నీసందర్భమున నట్టిపున్న యనునాసికముగఁ బరిగణింపఁబడు ననుటకును, నచటివర్గీయ సంయోగములోని మొదటిహల్లు లోపింప దనుటకును, ఉన్మాదము=ఉమ్మాదము ఉన్మత్తము = ఉమ్మెత్త, మున్నగు వాని సిద్ధికిని నియ్యది వేఱుగ సూత్రింపఁబడెను. మాతంగము మొదలగు శబ్దములలోని 'ఙ్గ = ంగ' అనుదానికి 'సింగము' మొదలగు శబ్దములలోని 'ంగ' అనుదానికిని, ప్రాసమైత్రి నంగీకరించి మహాకవులు ప్రయోగించుటయె సంస్కృత సమశబ్దములలోఁ బరసవర్ణానునాసిక స్థానమున సున్న నిల్చుట యాంధ్రపండిత సిద్ధాంత మనుటకుఁ బరమ ప్రమాణ మనఁదగును. మఱియు నట్టి (శాన్తా=)శాంతాది శబ్దములలోని 'ంత' మొదలగు వాని నాంధ్రలాక్షణికులు బిందుయతుల కుదాహరించుటయుఁ బ్రమాణాంతరముగ నెన్నఁదగును.

'ఙ, ఞ' వర్ణము లచ్చాంధ్రమున లేమింజేసి వానిచోటఁ దత్సమ పదములలోఁ బూర్ణబిందువె నిల్చును. ఉదా. అఙ్కిక = అంకియ = అంకె. అఙ్కుశము = అంకుసము. హిఙ్గువు = ఇంగువ. అఙ్గుష్ఠము = అంగుటము. కఙ్కేళి = కంకేలి. ఇఙ్గాలము = ఇంగలము. కిఞ్చిత్ = కించు. కాఞ్చి = కాంచి - కంచి. అఞ్చలము = అంచు. మఞ్చము = మంచము.

మంచము. పఞ్జరము = పంజరము = పంజెరము - మాఞ్జి = మాంజి = ముంజి. 'ణ న' లు తెనుఁగులో నున్నను దద్భవసందర్భమునఁ దత్సమము లందు వలెనె వాని చోట ననుస్వారమె నిల్చును. ఉ - కణ్ఠిక = కంఠిక = కంటియ = కంటె. ఘణ్టా = ఘంట = గంట. కుణ్డము = కుండము = గుండము. అన్తఃపురము = అంతఃపురము = అంతిపురము. ఆన్దోళము = ఆందోళము = అందలము. గ్రన్థి = గ్రంథి = కంతి. కొన్నియెడల మకార స్థానమునందును సున్నయె నిల్చుట గలదు. స్తమ్భము = స్తంభము = కంబము. తంబము. డమ్బరము = డంబరము = డంబు. కొన్నియెడల బిందువు-చోటి 'ఞ' కారము 'న' కారరూపమున నిల్చుటయుఁ గలదు. పఞ్చాశత్ = పంచాశత్ = (పఞ్ఞాస) పనస. సంజ్ఞ = సంఞ (సఞ్ఞ) = సన్న. (బాల క్రీడలలో 'సఞ్ఞ' అనువాడుక కలదు). ప్రాకృత భాషలలో నిట్లు సున్నవచ్చుట పాక్షికమై యున్నది. "యయి తద్వర్గాఽన్త్యః" = యయిప్రత్యాహార వర్ణములు పరమగుచుండఁగాఁ బదమధ్యమునందలి బిందువు వికల్పముగా వర్గపంచమ మగును. (ప్రాకృత ప్రకాశము. ౪ పరిచ్ఛేదము. ౧౭ సూ.) సంస్కృతమున నిది పదాంతమునఁ బాక్షికమును సమాన పదమధ్యమున నిత్యమును నయి యుండఁగాఁ బ్రాకృతమున నిట్లు సమాన పదమధ్యమందును బాక్షికత్వ మంగీకరింపఁబడెను. శఙ్కా = సఙ్కా = సంకా. షణ్ఢః = సండో = సణ్డో.

(౯౫.) సంయోగములోని లుప్త శేషము దీర్ఘపూర్వక మయ్యేనేని సంయోగపరకత్వమునఁ గల్గు గౌరవము సంభవింపకున్నను గౌరవక్షతి లేదు గాన నట్టిచోట్లఁ గొన్నియెడల ద్విత్వము కలుగకుండుటయుఁ గలదు. అట్టి యెడల ద్విత్వము వచ్చునపు డాదీర్ఘము వెనుకఁ జెప్పినరీతిని హ్రస్వమగును. (వి. ౭౯. XII) ఉదా. రుద్రాక్ష = రుదురాక. ధాత్రి = దాది; పరీక్షించు = పరికించు. మొ.

(౯౬.) కొన్నియెడల సంయోగములోని లుప్తశేషము హ్రస్వపూర్వక మయియున్నను ద్విత్వము నందకుండుట గలదు. ఉ॥ సప్త = సత. సపత్ని = సవతి. ప్రతిజ్ఞ - ప్రతిన. మాణిక్యము = మానికము. వీనికిని మొదట ద్విత్వరూపము లుండియు నానాఁటికిఁ దేల్చి పలుకఁబడుటచేత (౯౩ వి.) నశించెనా యని యాలోచింప వలసియున్నది. ఆపక్షమున నీ సూత్రమును విడువవచ్చును. 'ఇట్టిక = ఇటిక, కక్కపాల = కకపాల' మున్నగుచోట్లను వచ్చిన ద్విత్వము నానాఁటికి నేకశేషత నందినదనక తీరదుగదా. (౯౩ వి.)

గీ॥ బొట్లు ద్విత్వంబు లాగమంబులగు శబ్ద।
సరళతకుఁ గొన్నియెడలను జంద్రమౌళి (కవిసం. ౩ తరం. ౪ పద్య.)

---

(౯౭) వ్యాఖ్య:— బొట్లు ఇత్యాది:—స్పష్టార్థము. ఉదా. కేతకి = గేదఁగి. వక్ర = వంకర. నిద్ర = నిద్దుర. మొ.

ఇందలి 'శబ్దసరళతకు' అనుదానినిబట్టి ప్రకృతిపదములో ననునాసికాది బిందు బీజములు లేకున్నను శబ్దము సరళముగా వినఁబడుటకై యూరక బిందువు చేర్పఁబడునని యర్థముచేసిన పక్షమునఁ బయి యుదాహృతులు లక్ష్యములు కాఁగలవు. సంయోగ పూర్వాక్షర గౌరవము కాలక్రమమున తేలిపోయినపుడే పరస్థ శిథిలసంయోగము విశ్లిష్ట వికృతినందును (౧౦౭. విభ.) గాన వక్రశబ్దమున సంయోగ పూర్వాక్షర గౌరవ స్థాపనమునకయి బిందువు వచ్చెనని చెప్పరాదు. ఇంక 'శుల్కము = సుంకము' మున్నగుచోట్ల సంయోగములో నొక హల్లు లోపింపఁగాఁ బూర్వాక్షర గౌరవార్థమై పరస్థ లుప్త శేష హల్లునకు ద్విత్వము వచ్చుటకు మాఱుగా వాని నడుమ సున్న నిల్చుట క్వాచిత్కముగా నగపడుచున్నది. అట్టియెడల ద్విత్వాక్షరోచ్చారణముకన్న బిందూచ్చారణము సుకుమారతా గుణాధాయకమై సరళముగానుండు నను పద్ధతిచే నట్టియెడల నరుదుగా బిందువు వచ్చుటయుఁ గలదని యుక్తి చెప్పుట సహజముగా నుండును. ఇక్షువు = ఇంచు. వర్ధకి = వడ్రంగి. ఉష్ట్రిక = ఒంటెయ. పిష్టము = పిండి. స్వత్వము = సొంతము. స్పర్ధ = పంతము. కర్పూరము = గంబూర. వ్యాఘ్రము = వేఁగి. పరాక్షర ద్విత్వము సున్నకు మాఱుగవచ్చు సంప్రదాయము ద్రావిడ భాషాభేదములలో నగపడుచున్నది. (చూడు ౩౬౮ విభ.) ఈరీతి 'ఢక్క = డంక' మున్నగు తద్భవములందును నగపడుచున్నది.

ఇఁక " కేతకి = గేదఁగి. వక్ర = వంకర " మున్నగుచోట్లను వచ్చు సున్నకును బీజము లేకపోలేదు. సంస్కృత భాషలోని యలవలును స్వరములును బాక్షికముగ సానునాసికములునై యున్నవని వైయాకరణులు చెప్పియున్నారు. అట్టియానునాసిక్యమె యరుదుగ నిట్టి యనుస్వారాగమమునకు బీజము కానోపును. "అను నాసికాఽ ననునాసికా భేదేన యవలా ద్విధా"

"స నవవిధోఽపి (అచ్) ప్రత్యేక మనునాసికత్వా ఽ ననునాసికత్వాభ్యాం ద్విధా" (సి. కౌముది)

'గేదఁగి' శబ్దమునందే కాక యిట్టి బిందువు స్థలాంతరములను గలదు. వైశాఖము = వేసఁగి. చంపకము = సంపఁగి. భటుఁడు = బంటు. పీఠము = పీఁట. మూక = మూఁగ.

'నిద్ర = నిద్దుర' అనునపుడు వర్ణవికర్షము వచ్చుటచే దకార ద్విత్వమునకుఁ బ్రసక్తి లేకుండుటంజేసి 'నిదుర' అనియేర్పడుటయె సహజము. అట్లయినను దత్రత్య పూర్వాక్షర గౌరవ వాసనచే నిట్లరుదగు ద్విత్వము కల్గెనని యెన్నునది. (౧౦౭ విష.)

"బొట్లు ద్విత్వంబులు..." అను ప్రకృత సూత్రమునకు సూరకవి 'లక్క' అనుదాని నుదాహరించుట సరికాదు. లాక్షాశబ్దములోని క్షకార సంయోగముచోట "అనుఁగులగు..." అనుదాని చేతనే 'క్క' అనునది సిద్ధించుచుండఁగా నచటి ద్విత్వమును శబ్దసరళతకు వచ్చిన దానినిగఁ దలంచుట యుక్తము కాదుగదా. ఇది సూరకవిగారి దోషము కాదనియు లేఖకాది కృతమనియు నెన్ననగును.

కవిసంశయ విచ్ఛేదములోని మూఁడవతరంగమందలి తద్భవోదాహృతులు ఛందోబద్ధములు కామింజేసి లేఖకాది కృతములగు ప్రమాదము లందుండుట వింతకాదు. ఇట్టి వింకను గలవు. "అనుఁగులగును..." (౨౪.) "ద్విత్వైక వర్ణములు..." (౧ పద్య.) "తద్భవం బజ్వభక్త్యేకతన్..." (౮ ప.) అను వానియర్థము విశదపడునట్లుగ నుదాహృతు లీయఁబడనే లేదు. (కాంత) = 'కాఁత' (కవిసం.) ఇది యే కోశమునను లేదు. ఒక్క = ఒక్కఁడు. నాణెము, (కవిసం) వీని ప్రకృతులు చూపఁబడలేదు.

(౯౮.) కొన్నియెడల సంయోగములోని హల్లు లోపించునపుడు లుప్తశేషమునకు ద్విత్వము సంభవించుటయేకాక, దానిమీఁది స్వరము లుప్తవ్యంజన సజాతీయముగ మాఱుటయుఁ గలదు. ఓష్ఠ్యమగు వకారము లోపించునపు డచటి కంఠ్యమగు 'అ' వర్ణము కంఠోష్ఠ్యమగు 'ఒ' వర్ణముగ మాఱును. ఉదా. స్వర్ణము = సొన్నము; త్వక్కు = తొక్క; త్వర = తొర; స్వరము = సొరము; స్వమ్ము = సొమ్ము; స్వత్వము = సొత్తు; ద్వయి = దోయి. ద్వారము = దోరము; ద్వికము = గుగ; ద్విపటి = దుప్పటి; (తుదిరెండిటను 'ఇ' కారమును 'ఉ'

కారమైనది.) యజ్వ = ఒజ్జ. 'య, శ' మున్నగు తాలవ్యములు లోపించునపుడు కంఠ్యమగు 'అ' కారము కంఠ్యతాలవ్యమగు 'ఎ' కారముగ మాఱును. ఉదా. మత్స్యము = మచ్చెము ; వ్యవహారము = బేహారము ; వ్యథ = వెత ; ఆశ్చర్యము = అచ్చెరువు ; భాగ్యము = బాగెము. త్యాగము = తేగము; అన్యము = అన్నెము; పుణ్యము = పున్నెము; విద్య = విద్దె ; కన్య=కన్నె. ఈవిధి కొన్ని యెడలఁ బ్రవర్తింపదు. ఉదా. యశము= అసము ; స్వామి = సామి. (వాడుకలో సోమి (నాయుడు) అనియున్నది) ; న్యాయము = నాయము ; శ్యామ = చామ ; శ్యామాకములు = చామలు ; శ్యామలము = చామన ; ఖాద్యము = కజ్జము (వాడుకలో 'కజ్జెము' అందురు); కావ్యము = కబ్బము ; నిశ్చయము = నిచ్చయము ; నిశ్చలము = నిచ్చలము మొ. (చూడు ౭౯–II. IV. వి.) భిన్నతావికృతిచేత (వి ౧౦౩) "పున్నియము, విద్దియ, కన్నియ," అనురూపములు సిద్ధించిన పిదప వానిలోని యకారవ్యంజనము లోపింపఁగా (వి. ౮౭. ౯౧.) నిల్చు "పున్ని+అము" మున్నగు వాని నిత్యసంధిచే "పున్నెము, కన్నె విద్దె" మున్నగునవి యేర్పడెనని ప్రక్రియ చూపుట కవకాశమున్నను 'అన్నెము, బాగెము' మున్నగుచోట్ల 'అన్నియము, బాగియము' మున్నగురూపములె లేమింజేసి యట్టి ప్రక్రియను జూపుట కవకాశములేదు గాన నీ రీతిని "ఎత్వము"ను సంపాదించుటయె యుచితము. ఇఁక, 'పున్నియము' మున్నగునవి (౧౦౩-౧౦౭ వి) భిన్నతావికృతిచేఁ బుణ్యము మున్నగువానినుండియె సంభవించెనని చెప్పకతీరదు. మఱియుఁ బున్నెము మున్నగు ప్రకృత సూత్రసాధ్యములు తప్పఁ దక్కిన 'డిగ్గె' మున్నగునవి వెనుకవ్రాసిన రీతిని (విష.౯౧) 'డిగ్గియ' మున్నగువానినుండియె (డిగ్గి+అ = డిగ్గె) సంభవించెననియుఁ జెప్పక తప్పదు. 'డిగ్గె' మున్నగు వానిని బ్రకృత సూత్రముచే సాధింప శక్యము కాదుగదా. ఇఁక 'డిగ్గె, మున్నగువానినుండియె 'డిగ్గియ' మున్నగునవి సయితము కల్గెనని చెప్పుటకు వలనుపడదు. మొదట 'దీర్ఘికా'ది శబ్దములనుండి 'డిగ్గె' మున్నగునవి కల్గెనను టయె సంభావ్యము కాదు. తర్వాత 'ఎ' అను దానినుండి 'ఇయ' అనునది గల్గెనుట యంతకన్నను సంభావ్యము కాదు. 'ఇయ' నుండియె 'ఎ' అనునది వచ్చెననుట (ఇయ = ఇ+అ = ఎ. ౯౧ విష.) కేవలము సంభావ్యముగ నుండును. కావున సూరకవి చెప్పిన, 'ఎత్వమున కియ యాదేశమగు' అను (౯౧ విష.) నది సరికాదు. కావుననె చింతామణి కర్త యాచ్ఛిక శబ్దములందు

సైతము 'ఏద న్తతాచ నామ్నా మన్యతరస్యా మియాన్తానా మ్మని' చెప్పి యున్నాఁడు.

(౯౯.) సంయోగములోని హల్లులకు వైకృతవిధులు పర్యాయముగఁ బ్రవర్తించుటయుఁ గలదు. ఇది మండల భేదములందలి వ్యవహార భేదమునఁ గల్గి కవుల వాడుకకెక్కి యుండు ననఁదగును. I కొన్నియెడల సంయుక్తముల లోపము పర్యాయముగ నగును. II కొన్నిచోట్ల లోపభిన్నతలు పర్యాయముగ నగును. III కొన్నియెడల భిన్నత వచ్చునపుడు సైతము ద్విత్వబిందువులు పర్యాయముగ నగును. IV ఏకవిధమగు సంయోగమె (శబ్దభేదములందు) భిన్న భిన్నవికృతుల నందును. ఉదా :—

I లక్ష్మి = లచ్చి, లక్కిమి; లక్షణము = లచ్చనము, లక్కనము,

II అగ్ని = అగ్గి, అగిని; నర్తకుఁడు = నట్టువ; ముహూర్తము = మూరుతము; చిత్రములు = చిట్టలు; యాత్ర = జాతర; కార్యము = కర్జము. కారియము; చంద్రుఁడు = చందురుఁడు; చంద్రము = చేంద్రము; చంద్ర ముఁడు, చేందమామ; ద్వారము, = దువారము, దోరము, గర్వము = గరు వము; గర్వి = గబ్బి.

III నిద్ర = నిద్దుర; వక్ర = వంకర.

IV లక్ష్మి = లచ్చి, లక్కిమి; లక్ష్మణుఁడు = లక్కుమనుఁడు; లక్ష ణము = లక్కనము; లచ్చనము; భిక్షము = బిచ్చము; కక్ష = కచ్చె; లాక్ష = లక్క; అక్షము = అక్కు; అక్షయము = అక్కజము; క్షారము = కారము; క్షేమము = సేమము; త్యాగము = తేగము. నిత్యము = నిచ్చ; ఆర్య = అయ్య; కార్యము = కర్జము, కారియము; యజ్ఞము = జన్నము; ప్రజ్ఞలు పగ్గెలు.

(౧౦౦.) సంయోగములో నంతస్థోష్మములు తఱుచుగ లోపించును. మాణిక్యము = మానికము; ఖాద్యము = కజ్జము; ఖర్జూరము = కజ్జూరము; కర్పూరము = కప్పురము. ధాత్రి = దాది; చూర్ణము = సున్నము; స్వర్ణము = సొన్నము; ప్రసాదము = పసదనము; ద్వాయి = దోయి; కోష్ఠము = కొట్టు. నిశ్చయము = నిచ్చయము; ప్రశ్నము = పన్నము, శ్రేష్ఠి = సెట్టి; స్కంధము = కందము; స్మరుఁడు = మరుఁడు; చిహ్నము = చిన్నె; బ్రహ్మ = బమ్మ; పుష్పము = పువ్వు; స్వత్వము = సొత్తు; యజ్వ = ఒజ్జ; శుల్కము = సుంకము; స్పర్శవేధి = పరుసవేది; అల్పప్రాణములగు నంతస్థములు సకారమును

నుచ్చారణమున బలహీనము లగుటచేతను రేఫ హకారము లుచ్చారణ శ్రమాపాదకములగుటచేతను వర్ణాంతర సంయోగమున వీనిలోపము సహజమై యుండును. తఱచుగా ననుటచేత "కార్యము_కర్జము; ద్వితీయ = విదియ; క్షేమము =సేమము. సంధ్య = సంజ; వింధ్య = వింజ"; మున్నగుచోట్లఁ బై విధికి విపరీత ప్రవృత్తి కలుగుచున్నది. ద్రౌపది = ద్రోవది, ప్రౌఢ = ప్రోడ, మున్నగు చోటులందు సంయోగమే నిల్చుచున్నది. తద్భవములలోనే కాక దేశ్యము లందు సయితము రేఫ పరక సంయోగము మాత్రమె పదాదిని గలదు. 'స్వారి' అను వకార పరక సంయుక్త దేశ్యపద మొక్కటి మాత్ర మగపడుచున్నది. 'కర్జము' అనునది తప్పఁ దద్భవములలో రేఫ పూర్వక సంయోగ మెచ్చటను నగపడలేదు. "సంధ్య = సంజ; వింధ్య = వింజ" మున్నగుచోటులందు దకారము శేషించిన దన్నను జకారము రావచ్చును. (ద్యూతము = జూదము = జూజము) దకారము నిల్చునపుడు 'సందె' అను రూపమును వెలయుచున్నది. 'మత్సరము' అనుచోటఁ బ్రకృతియందే దంత్య చకారము వంటి యుచ్చారణ ముండుటచే నచట దంత్య చకారద్వయము నిల్చుట స్వాభావిక మనఁదగును. (మచ్చరము)

ప్రాకృతమునందును నిట్టి పద్ధతియె కలదు. 'వర్గే' (చండవ్యా. వ్యంజనవిధాన. 3 సూ.) వర్గాక్షరము పరమగునపుడు పూర్వస్థమగు వ్యంజనము లోపించును. "వర్గా దవర్గ్యమ్" (చండవ్యా. వ్యంజన విధాన. ౫సూ) = వర్గాక్షరములకుఁ బరమగు వర్గేత రాక్షరము లోపించును.

(౧౧౧ అంతస్థోష్మములు పరస్పరము సంయోగించు నపుడు హ, ర, య, ల, వ' స, లుత్తరోత్తరము బలీయములై నిల్చును. హకార రేఫము లుచ్చారణ శ్రమాపాదకరములగుటచేఁ దద్భవములలో నవి సర్వదా లోపించునని యెఱుంగునది. ఉదా - శ్యామ = చామ; సస్యము = సస్సెము; నిశ్రేణి = నిచ్చెన; శ్రవము = చెవి; స్వరము సొరము; స్వర్ణము = సొన్నము; శ్రీరంగ రాజు; సిరంగరాజు, శ్రుతి = సుతి; స్వామి = సామి; గర్వము - గర్వి = గబ్బి; వ్యాఘ్రము = వేఁగి; కావ్యము = కబ్బము; శల్యుఁడు = సెల్లుఁడు; వ్యావ్యాళి = వయ్యాళి; ఆర్య = అయ్య.

(౧౧౨) వ్యాఖ్య. జ్ఞణలేత్యాదిః—'జ్ఞ ణ ల' అను వానికి నకారాదేశ మగును. వర్గాక్షరముల పరస్పర సంయోగములోఁ బరహల్లు నిల్చును.

సీ॥ .... ....ద్విత్వైకవర్ణములు విడి యిరువర్ణము లగును... ....
(కవిసం. ౩ తరం. ౧ ప)

---

సంయుక్త వర్ణోచ్చారణమున వక్తకుఁ గల పరవ్యంజనోచ్చారణ ప్రయత్న త్వరచేఁ బూర్వహల్లు లోపించుట కేవలము స్వాభావిక మనఁదగును. ఉదా. ముక్తి=ముత్తి; ఖడ్గము=కగ్గము. ఉద్ఘాటించు=ఉగ్గడించు; ఉన్మాదము=ఉమ్మాదము; ఉన్మత్తము = ఉమ్మెత్త; ముగ్ధురాలు=ముద్దరాలు. మృత్స్న=మన్ను; విజ్ఞాపనము = విన్నపము; 'జ్ఞ' అనుదానిలోని జకారము లోపింపఁగా మిగిలిన 'ఞ' కారము స్వపూర్వ రూపమగు నకార రూపము నందుట సహజము. ("నకారజా వనుస్వార। పంచమా ఝలి ధాతుషు। సకార జ శ్శకారశ్చ। షాట్టవర్గ స్తవర్గజః") (కవికల్పద్రుమము) రాజ్ఞి = రాన్మ (రాజ్ + న్ + ఈ = రాజ్ఞీ); చిహ్నము = చిన్నె; సంజ్ఞ = సన్న యజ్ఞము = జన్నము; ఆజ్ఞ = ఆన (దీర్ఘము మీఁదిది గాన దీనికి ద్విత్వము రాలేదు.) (౯౨ వి.) పఞ్చాశత్=పనస (ఇచటి ద్విత్వము నానాఁటికి తేలి యుండునని యెన్న నగును.) (౯౩ వి.)

ప్రాకృతమునందును నిట్టి మార్గము గలదు. 'వర్గే' (చండవ్యాణి వ్యంజన విధాన. 3. సూ) వర్గాక్షరము పరమగు నపుడు పూర్వాస్థితవ్యంజనము మాత్రము లోపించును. ఉదా. శక్తః =సత్తో, మొ.

— వికర్షము ॥ భిన్నత. —

(౧౦౩.) వ్యాఖ్య. ద్విత్వేత్యాది:—

కొన్ని సంయోగములు భిన్నములగు ననఁగా వియుక్తము లగును. ఇట్టివికృతిని ప్రాకృత వ్యాకరణ కర్తలు వికర్షమని వ్యవహరించిరి. అధర్వణుఁడు దీనిని భిన్నతయని వ్యవహరించెను. ఇట్టిభిన్నతలో సయితము వర్ణాగమ వర్ణాదేశ వర్ణలోప వర్ణవ్యత్యయాదులు యథార్హముగా సంభవించుచుండును. ఈవికర్షమునం దట్టి వియుక్తములగు హల్లుల నడుమ యథార్హమగు స్వరాగమము నిత్యముగా సంభవించును. ఉదా. చంద్రుఁడు = చందురుఁడు. ఈర్ష్య = ఈరసము. ప్లవము = పడవ. మొ.

ఈ వికర్షము ప్రాకృతమునందును నరుదుగఁ గలదు. కాని వియుక్త వ్యంజన మధ్యమున నిల్చు స్వరాగమము విషయమున వేఱుమార్గముగ నుండును. "క్లిష్ట శ్లిష్ట రత్న క్రియా శార్ఙ్గేషు తత్స్వరవ త్పూర్వస్య" క్లిష్టా

శబ్దముల సంయోగమునకు వికర్షము కలుగును. వానినడుమ పూర్వాక్షరము మీఁది స్వరము నిల్చును. ఉదా. క్లిష్టమ్=కిలిట్ఠం, శ్లిష్టమ్=సిలిట్ఠం. రత్నమ్= రఅణం = రయణం. క్రియా = కిరిఆ. శార్ఙ్గమ్ = సారంగం. మొ.

"ఇః శ్రీ హ్రీ క్రీత క్లాంత క్లేశ మ్లాన స్వప్న స్పర్శ హర్షార్హ గర్హేషు" శ్రీప్రభృతి శబ్దములకు వికర్షము వచ్చును. అట్టిహల్లుల నడుమ ఇకారము నిల్చును. ఉదా.—శ్రీ=సిరీ; స్పర్శము=ఫరిసో, హర్షము=హరిసో. అర్హము= అరిహో (ప్రాకృత ప్ర. 3 పరి. ౬౦ - ౬౨ సూ.)

ఇంక 'కృష్ణేవా' (౬౧సూ). "అః క్ష్మా శ్లాఘయోః" (౬౩ సూ). "స్నేహేవా" (౬౪.సూ). "ఉః పద్మ తన్వీ సమేషు" (౬౫సూ). "జ్యాయా యా మీత్" (౬౬సూ). అను ప్రాకృతప్రకాశసూత్రములచేతఁ గతిపయ శబ్దములకుమాత్ర మీ వికర్షము చెప్పఁబడినది. ప్రాకృతాంధ్రములలో వికర్ష మున్నను నాంధ్రవికర్షరూపములు ప్రాకృతములకు విజాతీయములుగా నుండును. (శ్రీ = సిరి అనునదితప్ప) ఉదా. రత్నము =(ప్రాకృ) రయణం, (తెల్గు) రతనము, హర్షము =(ప్రాకృ) హరిసో, (తెల్గు) అరుసము, (అరిసము అని పారిజాతమునందుఁ గలదు కాని శబ్దరత్నాకరకర్త నిరసించెను) అర్హము = (ప్రాకృ) అరిహో, (తెల్గు) అరుహుఁడు, స్పర్శము =(ప్రాకృ) ఫరిసో. (తెల్గు) స్పర్శవేధి = పరుసవేది మొ. ప్రాకృతమున వికర్షము వచ్చెడి తక్కినచోట్లఁ దెల్గున వికర్షము రాదు. తెల్గున వికర్షము వచ్చుచోట్లఁ బ్రాకృతమునఁ వికర్షము రాదు.

అఱవ భాషలోను వికర్షము గలదు. అందును స్వరాగమము ప్రాకృతమునకన్న విభిన్నముగనె యున్నది. యవల పరక సంయోగము విడినపుడు వానికి ముందు 'ఇకారము' నిల్చును. ఉదా. తమి - వాక్యము = వాక్కియమ్. వక్రము = వక్కిరమ్. శుక్లము = చుక్కిలమ్.

మవ పరక సంయోగము విడినపుడు వానికి ముందు 'ఉకారము' నిల్చును. తమి - పద్మము = పదుమమ్. పక్వము = పక్కువమ్.

నకారపరక సంయోగము విడినపుడు దానికి ముందు 'అ'కారము నిల్చును. ఉదా. —రత్నము = అరతనమ్. (నన్నూలు, ౨౨ సూత్రము, పదవియల్. ఎలుత్తధికారము)

## ఆంధ్రవికర్ష స్వరాగమములు.

(౧౦౪.) భిన్నత నందుచున్న సంయోగము మీఁది స్వరమె యా విశ్లిష్ట హల్లులపై నిల్చును. ఉదా.—చంద్రుఁడు = చందురుఁడు. కీర్తి = కీరితి, అగ్ని = అగిని. ముగ్ధుఁడు = ముగుదుఁడు. ఈర్ష్య = ఈరస. ప్లవము పడవ. యత్నము = జతనము. రాత్రి = రాతిరి. రత్నము = రతనము. యాత్ర = జాతర. దర్శించు = దరిసించు. ముక్తి = ముగితి. శ్రీ = సిరి. "ప్రేమ = పెరిమ, ప్రేరించు = పెరరేఁచు" అనుచోటులం దుచ్చారణ సౌకర్యార్థముగ స్వరములు మాఱె ననఁదగును.

(౧౦౫.) భిన్నత నందెడి "అవర్ణాంత" సంయోగములో రేఫమున్నచోఁ దొలిహల్లుమీఁద (ఆ విశ్లిష్ట హల్లులలో) 'ఉకారము' కొన్నియెడల నిల్చుట యుఁగలదు. ఉదా. రుద్రాక్ష = రుదురాక. స్పర్శవేధి పరుసవేది. ముహూర్తము = మూరుతము. కొన్నియెడల ననుటచేత, ఈరసము. జాతర, వంకర, మున్నగుచోట్లయందుఁ బూర్వసూత్రమునె యుపయోగించునది.

(౧౦౬.) భిన్నత నందెడి సంయోగములోఁ బరహల్లు యకార మయ్యె నా దానికిఁ ముం దికారము నిల్చును. ఉదా.—మర్యాద = మరియాద. కన్య=కన్నియ. విద్య = విద్దియ. పుణ్యము = పున్నియము. మొ. వీని ద్విత్వము పరసూత్రముచే సాధ్యము.

(౧౦౭.) సంయోగము విడునపుడు తత్పూర్వాక్షర గౌరవపు వాసనచే విశ్లిష్టహల్లులలో మొదటిది ద్విత్వము నందుటగాని బిందుపూర్వక మగుటగాని క్వాచిత్కముగ నగపడుచున్నది. (౯౭ విష.) ఉదా.—కన్య=కన్నియ.విద్య= విద్దియ ; పుణ్యము = పున్నియము ; శుక్రుఁడు = సుక్కురుఁడు ; సత్రము = సత్తరువు; సత్వము = సత్తువ; చిత్రము = చిత్తరువు; నిద్ర = నిద్దుర; వక్రము = వంకర.

సంయోగ పూర్వాక్షరమును దేల్చి పలుకుట వాడుక కెక్కినపుడె యచటి శిథిల సంయోగమున కీవికర్షము సంభవించును. అపుడు సంయోగ పూర్వాక్షరపు గౌరవము వికర్షముచేఁ జెడును. ఏకమాత్రక మయినను నచటి సంయోగము వర్ణద్వయముగ నిల్చుటచే మాత్రాధిక్యము గల్గును గాన నచటి మాత్రల సంఖ్య మార్పులేక తుల్యముగనే యుండును. అట్లగుటచే నీవికర్ష వికృతి కేవలము స్వాభావికమె యగుచున్నది. అట్లయినను గొన్నియెడల

సంయోగ పూర్వాక్షరగౌరవోచ్చారణాభ్యాస వాసనచే నచట భిన్నత నందిన హల్లులలో మొదటిహల్లు ద్విరుక్త మగుట గాని బిందుపూర్వక మగుటగాని క్వాచిత్కముగా సంభవించు నని ప్రకృత సూత్రమునకుఁ దాత్పర్యము.

(౧౦౮.) అకారాంత సంయోగములోఁ బరహల్లు 'ఓష్ఠ్య' మయ్యేనేని దానికి ముందు 'ఉకారము' నిల్చును. ఉదా—గర్భము = కరువు(విస్మయము = విసుమానము ?) విశ్వాసము = విసువాసము. ద్వారము = దువారము. లక్ష్మణుఁడు = లక్కుమనుఁడు. సత్వము = సత్తువ.

వ్యత్యయము

(౧౦౯.) ప్రకృతి పదములలోని స్వరములును వ్యంజనములును దార్మా అగుచుండుటయుఁ గలదు. అథర్వణాచార్యులు దీనిని వ్యత్యయమని వాడిరి. ఇది వచ్చునప్పుడును వర్ణాగమ వర్ణాదేశ వర్ణలోప భిన్నతా వికృతులు కలుగుచుండుటయుఁ గలదు.

ప్రాకృతమునందును నీవికృతి యుండుటఁ గలదు. దీనిని స్థితి పరివృత్తి యని ప్రాకృత వ్యాకరణ కర్తలు వ్యవహరించిరి. ప్రాకృత ప్రకాశములో నీక్రింది యలంతి శబ్దములకు మాత్రమె వ్యత్యయ వికృతి సూత్రింపఁబడెను. (ప్రా-ప్ర. ర పరి. ౨౯ మొ. ౩౨ వ.) కరేణువు కణేరూ. కరేణూ. ఆలానము = ఆణాల (స్తంభో.) ఈక్రింది శబ్దములలో స్పష్టముగ స్థితి పరివృత్తి సూత్రింపఁబడకున్నను నయ్యది ధ్వనితమగుచున్నది. ఉదా-బృహస్పతి = భఅప్ఫఈ; మలినము=మఇలం (తెల్గు-మయిల), మలిణం; గృహము = ఘరం. ఉచ్చారణ త్వరలోని తడఁబాటు, సౌలభ్యాపేక్ష,యస్పష్ట శ్రవణము మున్నగు వానిచే నిట్టివికృతి సంభవించును.

I. స్వరవ్యత్యయము:—యువతి = ఉవిద; శుచి = చిచ్చు; (ద్విత్వము వింత); యుక్తి=జిత్తు; శృంఖల = సంకెల; ఉరము = (ర + ఉము=రోము) రొమ్ము; ఉరలు (ర + ఉలు) = రోలు.

II. హల్ వ్యత్యయము:—పారావతము = పావురము; కలంజము = గంజాయి; పతాక = పడగ; జ్యోతిషము = జోస్యము; కంపించు = పంకించు; ప్రలాపించు = (పరలాపించు) పలవరించు; మాలూరము = మారేడు; వాద్యము = (వాదియము) వాయిదము. వర్ధకి = (వఢ్రకి) వడ్రంగి; వర్తులము = (వత్రులము) వట్రువ; ప్రతనము = (ప్రనతము) ప్రాఁత.

III. ఉభయ వ్యత్యయము:—వినాయకుఁడు=(వెనకాయ) వెనకయ్య
గోహింసక = గోసంగి. మొ.

## వర్ణాదేశములు.

(౧౧౦.) ముఖ్యముగా నుచ్చారణ సౌలభ్యాపేక్షచేత నీ వర్ణాదేశ వికృతి గల్గుచుండును. మహాప్రాణ వర్గాక్షరముల యుచ్చారణము శ్రమపాదక మగుటచేత మహాప్రాణవర్ణ ఘటిత సంస్కృత పదము లాంధ్రమునకు వచ్చునపుడవి సవర్ణాల్ప ప్రాణములుగా మాఱిపోవును. ఇట్లే యుచ్చారణ సౌలభ్యాపేక్షాదికముచే మఱికొన్ని విధములగు వర్ణాదేశములును గల్గుచుండును. శషలు 'స' కారముగా మాఱిపోవును. కొన్నియెడలఁ బరుషములు సరళవర్ణములుగ మాఱును. వర్గపంచములు బిందువులుగా మాఱును. ఇట్లు గల్గెడి యాయా యాదేశములు మున్ముందుఁ జూపఁబడుచున్నవి.

పైనిఁవ్రాసిన సందర్భమునుబట్టి యాంధ్రులు మహాప్రాణ వర్గాక్షరములు, శ ష లు, మున్నగు వానిని బలుకు నలవాటు లేనివారని యేర్పడుచున్నది. కాని వీరు తత్సమములలో నట్టి వర్ణములనెల్ల యథాస్థితముగ నుచ్చరింపఁగలరని 'భీష్ముఁడు' మున్నగు తత్సమ పదములనుబట్టి యంగీకరింపక తీరదు. కావున సంస్కృత భాషా సంబంధము కలుగక ముందటి కాలములోని యాంధ్రమున వర్గయుక్కులు మున్నగునవి లేవనియు, నాకాలపు టాంధ్రుల కట్టి వర్ణముల నుచ్చరించు నలవాటు లేకుండెడిదనియు దర్వాత సంస్కృత పండితులు తత్సమములను వాడఁగా నట్టిపదముల నాంధ్రులు వాడుటలోఁ గొందఱ వాడుకలందుఁ బైరీతిని స్వాభావికములగు వికృతులేర్పడిన వనియు, వానిలోఁ గవులకు నచ్చినట్టియు, శాస్త్రసమ్మతములగు నట్టియు వికృతులు గ్రహింపఁబడినవనియు నంగీకరింపక తీరదు. ఇట్టి సంస్కృత సంబంధ మాంధ్రులకుఁ గలుగకముందే యాంధ్రము వెలయుచుండెడి దనుటకీ యొక్క నిదర్శనము చాలునుగదా.

తమిళమునందును (ఆంధ్రమునందు వలెనె) సంస్కృత పదమును దెచ్చికొను నపుడు వర్గద్వితీయ తృతీయ చతుర్థవర్ణము లాభాషలో లేనందున సంస్కృత పదములలోని యట్టివర్ణముల చోటఁ దమిళములో నున్న వర్గాదిమ

సీ॥ వర్గంబుల ద్వితీయవర్ణ చతుర్థవ ర్ణములు తదాది
వర్ణత భజించు (కవిసం ౩ తరం. ౬ ప)

---

వర్ణములే నిల్చునని దమిళ వ్యాకరణములలో వ్రాయఁబడియున్నది. (నన్నూలు పదవియల్, ౨౦-౨౩ సూ. తొల్కాప్పియము, ఎచ్చవియల్, ౫-౬ సూ)

కన్నడ భాషలో మహాప్రాణవర్ణములు వెలయుచున్నను సంస్కృత భవముల విషయమున మాత్ర మాంధ్ర భాషాపద్ధతియే యగపడుచున్నది.

సంస్కృతాప భ్రష్టరూపములగు ప్రాకృత భాషలు మొదట మొదట నీచపాత్రములకై నాటకాదులలో నుపయోగించుటకు మాత్రమే గ్రాంథిక ములుగ నంగీకరింపఁబడిన వగుటచేతఁ బరస్పరాహావాసభిజ్ఞత, యస్పష్టశ్రవ ణము, మున్నగు కారణములచేత వ్యవహారమునందుఁ గల్గిన యపభ్రష్టోచ్చార ణము లెల్లఁ బ్రయోగార్హములుగ నం దంగీకరింపఁబడినవి. కావుననె యందు 'ఖ ఘ థ ఫ భ' ల స్థానమున హకారము వచ్చుట మున్నగు వికృతు లెల్ల సూత్రింపఁబడినవి. అట్టివాని నాంధ్రపండితు లంగీకరింపరైరి. కాని యాంధ్రమునందును వ్యవహారములో 'మేఘము = మేహము, ముఖము = మొహము' మున్నగు నిట్టి వికృతులు లేకపోలేదు.

(౧౧౧.) వ్యాఖ్య.—వర్గేత్యాది. తదాదివర్ణ = వానికిఁ బూర్వములగు వర్ణములు వర్గప్రథమ తృతీయము లని యర్థము.

తత్తద్వర్గ ద్వితీయాక్షరములు తత్తద్వర్గ ప్రథమాక్షరములుగ నిత్యముగ మాఱును. హకారము సౌలభ్యాపేక్షచేత లోపించుట సహజముగాన వర్గ ద్వితీయము లందుండు మహాప్రాణరూప హకారావేశము లోపింపఁగాఁ బరి శిష్ట శ్వాస రూపములు నిల్చుట సహజమె కదా. అట్టిశ్వాసములు పరుషము లగుటచేత నవి తఱుచుగ సరళములగుటయుఁ గలదని ముందు చెప్పఁబడును. (౧౦౩ విష.) ఉదా.—ముఖము = మొకము = మొగము; ప్రచ్ఛదము = పచ్చ డము. అంగుష్ఠము = అంగుటము. స్థిరము = తిరము. సుభగము = సొబగు. రథము అరదము. ఈ తుది లక్ష్యమునుబట్టి యాంధ్రకవు లంగీకరించుచున్న థ ధప్రాసమైత్రికి మూలమగు థ ధల యుచ్చారణమునం గల యభేదము చిర కాలము క్రిందటనె యుండె నని విశదమగుచున్నది. (ప్రాకృతమున— నాథో = నాధో) (౧౧౨విష.) "గ్రంథ = కంతి. స్థిరము = తిరము" అని యిట్లుకొన్నిటిలో థ కారోచ్చారణము నిల్చియుండె ననియు నెన్నఁ దగును.

(౧౧౨.) వర్గచతుర్థములు నిత్యముగ వర్గతృతీయము లగును. వెనుకటి సూత్రము విషయమునందువలెనె యిచటను సైతము వర్గచతుర్థములలోని హకారవేశము సుఖోచ్చారణమునకయి యంతరింపఁగా ఘోషములగు

వర్గ తృతీయము లచట నిల్చుట సహజమె యని యెన్నఁదగును. ఉదా.—మేఘము = మేగము. ఘటిక = గడియ. 'ధాత = తాత' (బ్రహ్మ) ఇట్లు కొన్ని యెడల నట్టి ఘోషములలోని ఘోషత యంతరించి శ్వాసములు నిల్చుటయు విరుద్ధముకాదు. (౧౧౩ విష.)

పయిరీతిని వర్గద్వితీయ చతుర్థములకు వర్గప్రథమ తృతీయము లాదేశములగుట ప్రాకృత భాషా పద్ధతికిఁ జాల విరుద్ధమై యున్నది. ప్రాకృత భాషలలో మహాప్రాణములు వెలయుచుండుటంజేసి యందు వర్గప్రథమములకు వర్గద్వితీయము లాదేశము లగుట మున్నగు విపరీతపద్ధతి వెలయుచున్నది.

"ప్రథమ ద్వితీయయో ర్ద్వితీయ చతుర్థౌ" (చండవ్యా. వ్యంజన విధాన, ౧౧సూ) పరుషమ్ = ఫరుసం. నాథః = నాధో. మొ.

(౧౧౩.) పరుష సరళములు పరస్పరము మాఱుచుండుటయుఁ గలదు. శ్వాసములందు నాదము కల్గుటయు, నాదములందలి నాదిత లోపించుటయు వింతకాదుగదా. ఏకవర్గితా సంబంధమె యీవికృతికి మూల మనఁదగును.

ఉదా.—బాలిశుఁడు = పాలసుఁడు. ఘాసము = గాసము = కసవు. (గ్రాసము = గాసము, అనియు నెన్నవచ్చును), నిభము = (నిబము) నెపము. పూగము = పోఁక. గాఢము = గాటము. గుచ్ఛము = కుచ్చు. కాచము = గాజు. ఖాతము = (కాతము) గాత. కుంతి = గొంతి. కేతకి = గేదఁగి. రాజు = రాచే (వారు) చక్రము = జక్కవ. జట = జడ. అటవి = అడవి. అంతము = (సుందరము) అందము. ద్వీపము = (దీప) దిబ్బ. (దీబ లనియు వాఁడుకలోఁ గలదు) తపము = తబము. తపసు = తబుసు. మొ.

తమిళు భాషలో వర్గద్వితీయ తృతీయ చతుర్థములు లేమింజేసి తద్భవత్వమున వర్గద్వితీయాదుల చోట నెల్ల వర్గప్రథమములె నిలుచును. (నన్నూలు. పద ప్రకరణము ఎలుత్తధికారము, ౨౦సూ.) కన్నడమున ౧౧౧ - ౧౧౨ ౧౧౩ సూత్రములోని ముప్విధములగు పద్ధతులును గలవు. "తృతీయః ప్రథమ చతుర్థయోః" (౧౮౪ సూ.) "ద్వితీయస్య ప్రథమో వర్గాణామ్" (౧౮౨ సూ. కర్ణాటక శబ్దానుశాసనము, ౨ పాద). ప్రాకృతమునందును దృతీయముల కాయా వర్గులలోని ప్రథమము లాదేశము లగుట కలదు. ఉదా. నగరమ్ = ణకరమ్, "తృతీయ చతుర్థయోః ప్రథమ ద్వితీయౌ" (చండవ్యా. వ్యంజన. ౧౧ సూత్రపు పాఠాంతరము.)

తచ .... .... లకు .... .... అన్యోన్య సంప్రాప్తి గలుగుచుండు.

(కవిసం, ౩ తరం — ౬ పద్య)

తే॥ గీ॥ కలుగు బంధుత టత వర్గములకు శబ్ద. (కవిసం. ౩ తరం ౩ ప)

సీ....తథల కాదేశంబు చత్వ మగును కవిసం. ౩ తరం ౬ ప.)

---

(౧౧౪.) వర్గయుక్కులు క్వాచిత్కముగా హాకార రూపము నందు టయుఁ గలదు. అట్టియెడల నా హాకారము నిలుచక లోపించి పూర్వస్వరము నకు దీర్ఘము నొదవించుటయు సంభవించును. వ్యావహారిక భాషలో నట్టి హాకారము నిల్చుట గలదు. ఉదా. ముఖమ్ = (మొహాము) మోము. వర్గయుక్కులలోని వర్గీయాంశము లోపించుటయు నందలి మహాప్రాణాంశము లోపించి పూర్వ స్వరమును దీర్ఘముగ నొనర్చుటయు వింతకాదు. ఇట్లు హాకారము వచ్చి నిల్చుపద్ధతి ప్రాకృత భాషలోఁ గలదు. "ఖ ఘ థ ధ భాం హః" ఉదా. మేఘః = మేహో. వృషభః = వసహో (ప్రాకృత ప్ర. ౨ పరి. ౨౭ సూ.)

(౧౧౫.) వాఖ్య.—తచేత్యాది. తచలకు = త వర్గ చ వర్గములకు.

ఉకారేత్కములగు 'తు చు' అనువానికే త వర్గ చవర్గము లనెడి యర్థము లభించుట సంస్కృత వ్యాకరణ సంప్రదాయ మగుటచే నట్లు నవరింపవలె ననరాదు. ప్రాకృత భాషలో 'అ' కారవిశిష్టతలో సైత మట్టి యర్థము వచ్చుట కలదు. "పవయో ర్వ్యత్యాసః" (చండవ్యా. వ్యంజన. ౨౨ సూ.) భగినీ = వహిణీ. (౨౫సూ.) (ఇచటి 'వ' శబ్దము పవర్గవాచక మేకదా.) కాఁగా 'తచ' వర్గములకుఁ బరస్పర పరిణామము కొన్నియెడలఁ గల్గునని యర్థము లభించుచున్నది. ఉదా. త్యాగము = చాగము; తెమ్మ = చెమ్మ; చించ = చింత; సూచి = (సూజి) సూది; స్తనము = చన్ను; జాతి = జాడి, జాజి. ఆచ్చిక చే జే లకారాది యుక్తము లగునపుడు దంత్యములె, యగునుగాన వానికిఁ దంత్య తవర్గుతోడి సంబంధము సమూలమె యనఁదగును. ఇంక 'తెమ్మ=చెమ్మ' మున్నగుచోట్లను సైతము గాలక్రమమున నట్టి సంబంధము వ్యాపించి యుండునని యెన్నఁదగును.

(౧౧౬.) వ్యాఖ్య–కలుగు ఇత్యాది. అర్థము స్పష్టము. తథల కిత్యాది సూత్రము మీఁది దానిచే గతార్థము కాఁగలదు. (త = ద = డ). ణనల పరిణామమున ణాకు నావచ్చుటయే యాంధ్ర సంప్రదాయము. (చూడు.

౧౨౨ వి.) ఉదా.—కంఠము=గొంతు. పృథివి=పుడమి (థి=తి=ది=డి=డ). సంగతి = సంగడి - (తి=ది=డి - ఇట్లె యంతటను జూచునది) మేధి = మేడి. దీర్ఘిక = డిగ్గియ - ప్రచ్ఛదము = పచ్చడము. వృద్ధి = వడ్డి. ప్రతీహారి = (పడిహారి) = పణిహారి.

"ఇండో యూరపియను" భాషా కుటుంబములో 'ట' వర్గము లేమింజేసి సంస్కృతమునందలి 'ట' వర్గము ద్రావిడ భాషా సంపర్కమున 'త' వర్గమూలకమై వెలసె నని కొందఱు భాషాశాస్త్రజ్ఞులు చెప్పెదరు. పట్టణశబ్దము ప్రాకృతమే యనియు నదికాలక్రమమున సంస్కృతములోఁ జొచ్చె ననియుఁ దోఁచుచున్నది. "పత్తనే చ" (ప్రాకృతమంజరి. 3 పరి. ౨౨ సూ.) (పత్తనే చాపి యుక్తస్య। తకారస్య టకారతా। ఏష ఉక్తం పత్తనం హి। పట్టణం వాగ్మినో విదుః) వాచస్పత్యాది కోశములలోఁ బట్టణ శబ్ద ముదాహరింపఁ బడకున్నను శబ్దరత్నాకరాదులలో నది సంస్కృతముగనె చూపఁబడినది. క.రణవిజయము గైకొని పట్టణము—(నిర్వ-౫ ఆ-౭౯ ప)

సంస్కృత శబ్దములలోని నకారము ప్రాకృతములో ణకార మగును. 'నో ణః సర్వత్ర' (ప్రాకృతప్ర., ౨ పరి ౪౨ సూ.) 'ప్రథమ శిథిల నిషేధేషు ఢః' (ప్రా. ప్ర. ౨ పరి. ౨౮ సూ.) అని యిట్లు 'త' వర్గీయములకు 'ట' వర్గీ యాదేశము విధింపఁ బడెను. పైశాచీ ప్రాకృతమునందు సాంస్కృతిక ట వర్గము త వర్గ మగుచున్నది. "టో స్తుతు" (షడ్భా...౧౮౯ పు.) పైశాచీ ప్రాకృతమున 'ట' వర్గమునకు 'త' వర్గ మాదేశ మగును.

పయి సందర్భమునుబట్టి ప్రాకృతములకు ముందే సంస్కృతమున 'ట' వర్గ ముండెడిదని తేలుచున్నది. ఇంత యేల ఋగ్వేదమునందే ట వర్గము ధారాళముగ వెలయుచున్నది.

(౧౧౭) అనునాసికములు వర్గీయ సంయుక్తములు నియతముగ ననుస్వారము లగును. దీర్ఘము మీఁది పూర్ణము నియతముగ ఖండానుస్వారమగును. ౭౮ సూత్రముచొప్పున నిట్టి బిందుపరిణామ మాత్రమున శబ్దములు తద్భవములుకాకున్నను నితర వికృతులచే నవి తద్భవములు కానోపును. వర్గాక్షరములకు ముందర నుండు ననునాసికముల నుచ్చరించుట శ్రమాపాదకము గాన నవి యనుస్వారముగఁ బరిణమించుట సహజమే. అట్టి యనుస్వారము దీర్ఘము మీఁద నిల్చునపుడు తేలి ఖండ మగును. వాడుకభాషలో నది నానాఁటికి నశించుచున్నది. ఉదా అఙ్కిక= అంకియ. అఞ్చలము = అంచు. యంత్రము=ఏంతము. హింతాలము=

-ఈఁదు. కాండము = కాఁడ. కంఠిక = కంటియ. అంతము = అందము. స్తంభము = తంబము. లాంగలము = నాఁగలి. తెలుఁగున ఙ ఞలు లేవు. కనుక వానిచోట ననుస్వారమె నిల్చును. ప వర్గ పూర్వక మ కారము సున్న వంటి ధ్వనితోనె పలుకఁబడుచున్నది. కావుననే ప్రాచీన శాసనములలో ట త వర్గాక్షర పూర్వక బిందువుచోట మాత్రమె తత్తద్వర్గీయానునాసికముల వ్రాయు నాచారము నిల్చెనని చెప్పఁదగును. ఆంధ్ర వైయాకరణులును నాంధ్రకవులును వర్గాక్షర సంయోగ పూర్వస్థానునాసికములచోట నియతముగ బిందువునె వ్రాయవలెనని నిశ్చయించుకొనిరని యీ వఱకు వ్రాసియే యున్నాను. (౭౮, ౯౪ విష.)

(౧౧౮) అథర్వణాచార్యుఁడు తద్భవత్వావస్థ లేకున్నను సంస్కృత శబ్దావసాన గత మ కారములు సయితె మనుకృతిలో ననుస్వారముగనే తెలుఁగున నిల్చునని యీ క్రింది రీతిని వచించి యున్నాఁడు.

శ్లో. 'శబ్దానా మన్త్యభాగేషు। యోనుస్వారః ప్రదృశ్యతే।
తస్యాచి పరతో మ స్స్యాత్పూర్వత్ర కవిసమ్మతేః॥

(అహో. ౨౦౩ పుట)

తద్భవత్వమునందేకాక తత్సమములుగా సంస్కృత శబ్దములను వాడు నపుడును నింకను సంస్కృత విభక్త్యంతములై యనుకరింపఁబడునపుడును వర్గాక్షర పరక సంయోగములోని యనునాసికములచోట బిందువునే నిల్పవలెనని యాంధ్రమహాకవి లాక్షణికుల సిద్ధాంతమై యున్నది. (౭౮, ౯౪ విష.) కొందఱట్టి విషయము పాక్షికమని తలంచుచున్నారు.

ప్రాకృతమునందును బయి విషయములు పాక్షికముగ సంభవించును. "యయి తద్వర్గాన్త్యః" = (ప్రా. ప్ర. ౪ పరి. ౧౭ సూ.) యయి ప్రత్యాహార వర్ణములు పరమగునపుడు ముందటి బిందువుచోటఁ దత్తద్వర్గీయానునాసికము వికల్పముగా నిల్చును. ఉదా. పఙ్కం=పంకం- (సంస్కృ. పఙ్కమ్)

"మో బిన్దుః" (ప్రా. ప్ర. ౪ పరి. ౧౨ సూ.) = పదావసానగత మ కారము బిందువగును. భద్రమ్=బద్దం, మొ.

"అచి మ శ్చ" (ప్రా. ప్ర. ౪ ప. ౧౩ సూ.) అచ్చు పరమగునపుడు పదము తుది మకారముచోట బిందువుగాని మ కారముగాని వికల్పముగా నిల్చును. ఫలమ్+అవహరతి = ఫల మవహరఇ, ఫలం అవహరఇ" మొ.

గీ॥ వరుస ...రల, చస, టడ, పవ, నణ లకు।
గవల కన్యోన్య సంప్రాప్తి గలుగుచుండు। (కవిసం. ౩ తరం. ౪ ప.)
మత్వమునకు వత్వంబగు। వత్వమునకు....బత్వంబులగున్ (క. ౩ .త. ౬ ప,)
శ ష చ ల కెల్లను సత్వమగును. .... ళశనణలకు .... డత్వ మగును.
(కవి. ౩ తరం. ౪ ప.)

---

(౧౧౯) వ్యాఖ్య—వరుసేత్యాది. అర్థము స్పష్టము. ఈసూత్ర మునకు వేర్వేఱుగ నుదాహరణములును నందలి వికృతులబీజములును జూపఁ బడును. అందు గతార్థము లుపేక్షితములగును.

1. చసలకు—

నారాచము = నారసము
కాచము = కాసు
కంసము = కంచము
హంస = అంచ
ప్రసరించు = పచరించు
కాంస్యము = కంచు

దంత్య చకారోచ్చారణము 'త్స' కారోచ్చారణమునకు దగ్గఱగ నుం డును. అట్టి దంత్య చ కారమును సకారమును బరస్పర పరిణామ మందుట సహజమె కదా. కాఁగాఁ దాలవ్య చకారము దంత్యమయిన పిదప నయ్యది సకారముగఁ బరిణమించుట సంభవించును. (లేదా) సాంస్కృతిక తాలవ్య చ కారము శ వర్ణమైన పిదప నది సకారమయ్యె ననుటయు యుక్తియుక్తముగనె యుండును.

II. గవలకు—

ఇరు+వారు=ఇరువురు=ఇరుగురు.
అగస్త్య = అగిసియ, అవిసియ
ప్రవాళము=పవడము, పగడము
త్రికము = తిగ, తివ
బాంధవుఁడు = బందువు, బందుగు

గ వ లు పరస్పరము పరిణమించుటకుఁ దగినయుక్తి యగపడదు. ఈ మార్పు పదాదీతరస్థలములలో మాత్రమె జరుగుచుండుటను ననాది కకారా దులె లోపించుట రూఢమగుటను బరిశీలింపఁగా 'కగ'లు హకారరూపము నంది (౯౧ విష.) లోపింపఁగా (౮౭ విష.) (ప్రాకృతమునఁ ప్రాయో లు గిత్యాదిచే 'గ' కార లోపము గల్గును) నచటిసంహితలో వకారాగమము నిల్చుట సహజ మని యీ విషయమున యుక్తి నెన్నఁదగును. ఇకారాదుల మీఁదనైతము వకారాగమము వచ్చుట కలదు (తమిళమున ఇ+అన్=ఇవన్. ఎ + అన్ = ఎవన్. మొ) ఇట్లు గకారము వకారమగుట రూఢమయిన పిదప

వానికిఁ బరస్పర వ్యత్యాసము కలదను భ్రాంతి కలుగుటచేత వకారము గకారముగా మాఱుటయు సంభవించి యుండును.

III1. పవలకు—

నిభము = నెపము, నెవము

కపిలము = కవిల

ద్వీపము = దీవి

కపటము = కవుడు = కౌడు

ద్రౌపది = ద్రోవది

కాండపటము = గండవడము

పుష్పము = పువ్వు

శవము = సపము

వకుళము = పొగడ

వేత్రము = పేము, బెత్తము

వికిరము = (పికిరము) బికిరము

ఓష్ఠ్యమును నల్పప్రాణమును నగు పకారమునకును నట్టిదేయగు వకారమునకును బరస్పర పరిణామము సహజమె. పకార మోష్ఠ్యము స్పృష్టము. వకార మీషత్ స్పృష్టము, దంతోష్ఠ్యమును. ఇంతమాత్రమె (యజలకు వలె) వీనికి భేదము గలదు. ప్రాకృత భాషలలో నెల్లెడలను ననాది పకారము వకారమగును. "పోవః (ప్రా. ప్ర. ౨ పరి. ౧౫ సూ.) పకారస్యాయుక్తస్యానాది వర్తినో వకారాదేశో భవతి" ప్రాచీన తమిళవ్యాకరణము పేరగు 'తొల్కాప్పియము' అనునది 'తొల్కావ్యము' అనుదానినుండి వచ్చియుండునని యనేకుల యభిప్రాయము. కాని యందులకుఁ దమిళపండితు లంగీకరింపరు. తొల్‌కాప్పియరు చేసినదిగాన నది తొల్‌కాప్పియ మనఁబడుచున్న దందురు. ('కాప్పియరు = కావ్యకర' అనరాదా?)

IV. మవలకు—

హిమము = ఇవము

చామరము = సవరము,

పృథివి = పుడమి.

మవలు రెండును నోష్ఠ్యములు, నల్పప్రాణములును, వకారము దంతోష్ఠ్యమగుట విశేషము. మకారము సానునాసికము. వకారమున కానునాసిక్యము పాక్షికము. కాఁగా వీని పరస్పర పరిణామము వింతకాదు.

V. లరలకు—

లవము = రవ

శూలము = తోరము

కాలము = కాదు

క్రూర = కూళ

అగరు = అగలు

గీ. యతులకును వలె వర్ణైక్య మగును దఱుచు। ణనము౹ు తదాది వర్ణబాంధవ
ము గాంచు। (కవిసం. ౩ తరం. ౬ ప,)

---

లరలు రెండును దంతమూలీయములె యని ఋగ్వేదప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడెను. కొందఱు రేఫము వర్త్స్య మందురు.

"దంతమూలీయస్తు తకారవర్గః" (ఋగ్వేద ప్రాతి. ౧ పటలము. ౩౫. పుట) 'సకార రేఫ ల కారాశ్చ' (ఋగ్వేద ప్రా. ౧ పటల. ౩౯ సూ.)

'రేఫం వర్త్స్య మేకే' (ఋగ్వే. - ౧ పట. ౩౨ సూ.) పార్షదవ్యాఖ్య:—

"వర్త్స్యశబ్దేన దంతమూలా దుపరిష్ఠాత్ ఉచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే" సంస్కృత భాషలోని రేఖాలేఖాది శబ్దముల ద్వైరూప్యము సయితము వీని సంబంధమునకు నిదర్శనమై యున్నది. "హరిద్రాదీనాం రో లః" (ప్రా.ప్ర. ౨ పరి. ౩౦. సూ.) అనియిట్లు 'రా' కు 'లా' ప్రాకృతమునందును విధింపఁబడెను. "రలయో ర్లడయో స్తద్వ, ల్లళయో శ్శసయో రపి, వబయో ర్నణయో శ్చాన్తే। సవిసర్గావిసర్గయోః। సబిన్దు కాబిన్దుకయో। స్స్యా దభేదేన కల్పనమ్" (అహో. ౧౩౯ పుట) అను భోజరాజవచనమును వీని యభేదమును వచింౘుచున్నది. - "శ్రోః శ్లో" "సకార రేఫయో ర్మాగధ్యాం శకార లకారౌ యథాక్రమం భవతః" (షడ్భా. ౧౭౫ పుట.) అని యిట్లు మాగధీ ప్రాకృతమునందును వీని పరిణతి సూత్రింపఁబడినది.

(౧౨౦) సంస్కృత శబ్దములలోని తాలవ్య చ జలు 'అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ' లతోఁ గూడిన చజలుగా మాఱి తద్భవములగునపు డవి నియతముగా దంత్యము లగును. అట్లు కానపుడు వాని తాలవ్యత స్థిరపడున ట్లుచటి చజలపైనున్న 'అ' త్వ మెత్వ మగుటయుఁ గలదు. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔల తోఁ గూడినపుడు చజలకుఁ దాలవ్యత సంస్కృతమునందే కలదుగాని యచ్చాంధ్రమున లేదు. ఉదా. మంచము, = మంచెము, చంద్రుఁడు=చెందురుఁడు, చంద్రముఁడు = చెందమామ, చతురంగము = చెదరంగము, ఛతురుఁడు = చెదురు, ఛందము (చందము) చెంౘము. ఛలము (చలము) చెలము. రాజు = రాచె (వాఁడు) రాజు = రాజె. పంజరము = పంజెరము. చక్రము = (జక్కువ) జెక్కువ, చణ = (జణ)జెణ, గుచ్ఛము = కుచ్చు, కుబ్జము = గుజ్జు, చౌర్యము = చూఱ, జయ = జే.

(౧౨౧) వ్యాఖ్య. 'యతులకు' ఇత్యాది—వర్ణైక్యమనఁగా వర్ణముల కభేదము గలుగునని యర్థము. యతి విషయమున నెట్టి వర్ణమైత్రి చెప్పఁ

సీ. లళ నణల.... ... .... కాదేశంబు డత్వమగును। ....
జ్ఞణలల నత్వంబు సంభవించు (కవిసం, ౩ తరం. ౬౪)

---

బడెనో యట్టిమైత్రి చెప్పునఁ దద్భవత్వమునందును వర్ణములకు మార్పు కలుగునని భావము.

ణనమలు వానివాని వర్గాక్షరములతో బాంధవ మందు ననఁగాఁ దత్తద్రూపమునఁ బరిణమించు నని భావము. ఉదా. అంగణము=అంగడి. అమ్బ=అమ్మ, మొ.

వ్యాఖ్య—లళేత్యాదికమున కర్థము స్పష్టము—

సంస్కృత శబ్దములలోని లకారమునకుఁ గొన్నిమెడల 'ళ, డ, న' వర్ణములలో నేదేని యాదేశమగును. 'ల, న,' లు దంత్యములు. నకారమను నాసికము. లకారమున కానునాసిక్యము పాక్షికము. 'ల, ళ' లకు లఘ్వలఘుతామాత్రభేదమె గలదు. (గోళము=గోలము. హోలి = హోళి, మొ.) అట్టి యలఘు లకారమునకును, మూర్ధన్య ళకారమునకును నుచ్చారణమున మిక్కిలి సన్నికృష్ట సంబంధము రూఢమైయున్నది. 'ళ, డ' లకు మూర్ధన్యతా సంబంధము ప్రసిద్ధమె. ఉదా. లాంగలము = నాఁగలి. త్రిలింగము = తెలుఁగు = తెనుఁగు. ఖేలాకూలము = కేళాకూళి. దేవాలయము = దేవళము. నారికేలము = నారికెడము. ముకులము = మొగడ. తాలము = తాడు (తాటిచెట్టు) వకులము = పొగడ, ప్రవాలము = పవడము.

"రలయోర్లడయోస్తద్వ।ల్లళయోః......స్యాదభేదేన కల్పనమ్" (అహో. ౧౩౯ పుట). "లోళః" "లకారస్య ళకారాదేశో భవతి." (కర్ణాటక శబ్దానుశాసనము, ౨ పాదము. ౧౩౯సూ.) "ళో లః పైశాచ్యామ్" (షడ్భా. ౧౮౭ పుట) మున్నగు విషయము లిట స్మరింప నగును. పరిశీలింపఁగా లకారము నకారముగా మారుటయె యగపడును గాని నకారము లకారమగుట తద్భవములలో నగపడదు. 'తెనుఁగు'అనునది 'తెలుఁగు' కానేరదు.

(౧౨౨) ణకారమునకు సార్వత్రికముగ నకారాదేశమును గ్వాచిత్కముగ డకారాదేశమును గలుగును. డణలు మూర్ధన్యములు. ఉచ్చారణసౌలభ్యాపేక్షచేతనే ణకారము నకార మగును. ణకారమునందలి యానునాసిక్యము సుఖముఖోచ్చారణమునకై లోపింపఁగాఁ బరిశిష్టనాదభూత డకారము నిల్చుట సహజమే కదా. (చూడు ౧౧౬ విష.) ఉదా. —శాణ=సాన, గుణము = గొనము (రేఫముమీఁద ని మార్పు గలుగదు. హరణము = అరణము), అంగణము = అంగడి, గ్రామణి = గామిడి, గణన = గడన.

గీ॥ యత్వమునకు నాగేశము జత్వ మగును. (కవిసం. ౩ తరం ౯ ప.)
గీ॥ శషచల కెల్లను సత్వమగును (కవి. ౩ తరం. ౬ ప.)

---

జ్ఞకారాంతర్వర్తి నకారము ణకారమగును. ఉదా.—విజ్ఞానము = విన్నాణము.

టతవర్గముల కన్యోన్యము మార్పుగల్గు ననుదానిచేతనే (౧౧౬ విష.) 'ణన'ల మార్పు సిద్ధించుచున్నది. అట్లయినను ణకారము నకార మగునే కాని నకారము సాధారణముగా ణకారము కానేరదని తెలుపుటకై యీ సూత్రము మరలఁ జెప్పఁబడెను. ఇఁక ణకారము నకారమగుట పైశాచీ ప్రాకృతమునఁ గలదు. 'నో ణనోః పైశాచ్యామ్' (షడ్భా. ౧౮౮పుట)తక్కిన ప్రాకృతములందన్నను నకారమె ణకారమగును. ఉదా. జనః=జణో, మొ.

(౧౨౩) వ్యాఖ్య—యత్వేత్యాది - స్పష్టార్థము.

సంస్కృత శబ్దములలోని యకారము తద్భవములలో జకార మగును. అది 'అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ' లతో నుండెనేని దంత్య జకారముగ నేర్పడును. 'యజ' లు తాలవ్యములు. జకారము స్పృష్ట మగుచుండఁగా యకార మీషత్ స్పృష్టమగుట మాత్రమె భేదము గలదు. ఉదా. శయ్యా= సెజ్జ. యజ్ఞము = జన్నము. యోగి = జోగి. యముఁడు జముఁడు. యత్నము = జతనము. యంత్రము = జంత్రము. యాత్ర = జాతర. ద్యూతము=జూదము. కుబ్జము=గుజ్జు. కొన్నిచోట్ల యకారము లోపించు నని యీవలకె వ్రాయఁబడెను. (౮౭ విష.) ఉదా. యశము=అసము, మొ.

వైదిక సంస్కృతమునందె యిట్టి మార్పు గలదు. (౭౪. విష.) ప్రాకృత భాషలోఁ బదాది యకారము జకార మగును. "ఆదే ర్యో జః" (ప్రా. ప్ర. ౨ పరి. ౩౧ సూ.) 'ఆదిభూతస్య యకారస్య జకారో భవతి.' కర్ణాటమునందును యకారము జకారమగును. 'యో జః' (కర్ణాటక శబ్దానుశాసనము, ౨ పా. ౧౪౧ సూ.) తమిళములో నియ్యది విపరీతమయి యున్నది. అందు జకారము యకారమగును. ఉ. గజః = గయమ్. (నన్నూలు, పదవియల్).

(౧౨౪) వ్యాఖ్య. శషేత్యాది :- అర్థము స్పష్టము—

సంస్కృత పదములలోని శషలు సకారముగ మాఱును. తాలవ్యాచ్చులతోనున్న సకారముగా సైతము శ వర్ణము మాఱుట గలదు. శషస లూష్మములు. శషల యుచ్చారణముకన్న సకారోచ్చారణమున సారళ్యము మిక్కిలి.

ప్రాకృతమునందును ద్రావిడభాషలందును శషలు సకారముగా మాఱును. 'శషో స్సః' (ప్రా. ప్ర. ౨ పరి. ౪౩ సూ.) 'శ షో ర్వా సః' కర్ణాట శబ్దానుశాసనము, ౨ పాద. ౧౩౬ సూ.) ఇట్లు మాఱిన సకారమె దంత్య చ కారముగ మాఱునని యెన్ననగును. ఉదా — శాల = సాల, ఆశ = ఆస శల్యుఁడు = సెల్లుఁడు, శపియించు=సెపియించు, శుక్రుడు = (సుక్క) చుక్క, శాస్త్రము (సాస్త్రము) చెట్టము, శర్కర=(సక్కెర) చెక్కెర, శంక=(సంకు) — (చెంకు) జంకు. శూర్పణఖ = (సుప్పనాక) చుప్పనాక, భాష=బాస, వేషము= వేసము. షట్కము = (సక్కు) చెక్కు, (చూడు ౧౧౯ విష.).

(౧౨౭) శవర్ణమును దాలవ్యాచ్చులతోఁ (ఇ, ఈ, ఎ, ఏ.) గూడిన సవర్ణమును దాలవ్య చకారముగా మాఱుటయుఁ గలదు. ఉదా. శిక్యము = చిక్కము, శిరోనామము = చిరునామ, సిందూరము=చెందిరము (చంద్రము = చెందిరము, అని కొందఱందురు).

౧౨౬-౧౨౭ విషయముల రీతి కొంత తమిళమునందును గలదు. తమి ళమున శవర్ణము చకారమగును. ఇది తాలవ్య మనియె తమిళ వైయాకరణులు చెప్పుదురు. అద్వైత్వమునందుఁ దమిళ చకారమును బండితులు సైతము సకా రముగానే పలుకుదురు. ఉదా. తమి:— శంఖము = చఙ్కు. దీనిని 'సంగు' అని పలుకుదురు. తమిళ :— పదాదీతరస్థలములలోని శవర్ణము యకారము గాను షకారము డకారముగాను సకారము తకారముగాను క్షకారము 'క్క' కారముగాను మాఱును. తమిళ :— పదాదిని 'ష, స, క్ష' అనునవి చకార ముగా మాఱును. ఉదా. - దేశః = తేయమ్ ('తేచమ్' అనియు నందురు). విషయః = విడయమ్. ఋషిః = ఇరుడి. ఆసనమ్ = ఆతనమ్. ('ఆసనమ్' అనియు నుండును) లక్షణమ్ = ఇలక్కణమ్. అక్షరమ్ = అక్కరమ్ (ఆధు నికులు 'అట్చరమ్' అందురు.) షష్ఠి = చట్టి (సట్టి యని పల్కుదురు) సభ=చప్పై 'సప్పై' అనిపల్కుదురు.) క్షేమమ్ = చేమమ్ ('సేమమ్' అనిపల్కుదురు.)

(౧౨౮) హకారము (ఘకారమై) గకారముగ మాఱును. హఘలు మహాప్రాణములు కంఠ్యములును నైయున్నవి. ఉదా. ఆహారము = ఆఘా రము) ఓగిరము. సింహము =(సింఘము)= సింగము. తమిళమున హకా రము కకారమగును. (అందు'గ'లేదు). దానిని హకారముగనె పల్కుదురు. ఉదా. మోహః=మోకమ్ ('మోహమ్' అనియే పల్కుదురు.) నన్నూలు, పదవియల్ = పద ప్రకరణము, ౨౦సూ.)

**ఇరి యిర యువ యుడి యేరు లాదేశంబు । లగుఁ గొన్ని పదముల కయుగనేత్ర॥**
(కవిసంశయ. ३ తరం. ४ ప.)

---

(౧౨౭) సంస్కృత శబ్దములలోని రేఫము క్వాచిత్కముగాఁ దద్భవత్వమున శకట రేఫమగును. అయినను లఘ్వలఘు లకారములనంటి మైత్రి వీనికి లేదని చింతామణి కర్త యాశయము. అథర్వణాచార్యుఁ డుచ్చారమునుబట్టి వీనికి మార్పుగలుగునని యంగీకరించెను. "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్॥" (ఆంధ్రశబ్ద చింతామణి. సంజ్ఞ) "లఘు ర్భవే ద్గురుః కుత్ర । చి ద్గురు శ్చ లఘు ర్భవేత్ । ఉచ్చారణస్య కల్ప్యత్వా।న్నిదానం తత్ర సద్వచః॥" (వికృతి వివేకము)

ఉదా.—భీరుక = పిఱికి, పరుఁడు = పెఱ, చౌర్యము = చూఱ, కారిక - కాఱియ, మూర్ఖుఁడు = మొఱకు. మొ. బాలవ్యాకరణకర్త దద్భవములందు శకటరేఫము లేదని చెప్పఁగాఁ (సంజ్ఞ. ౧౮ సూ.) బైరీతి నుదాహృతులను జూపి ప్రౌఢవ్యాకరణ కర్త "తద్భవంబులయందును శకటరేఫము కలదు" అని సూత్రించెను. (ప్రౌఢ. సంజ్ఞ. సూ. ౯) ఈవిషయము రేఫ శకటరేఫవైర సందర్భమున విపులముగ విమర్శింపఁబడును. (3౮3 విమ.)

(౧౨౮) వ్యాఖ్య. ఇరీత్యాది - స్పష్టము.

ఉదా. సాక్షి = సాకిరి, భిక్ష = బికిరము, అర్ఘ్యము = అగ్గువ, ప్రేమ= ప్రేముడి, దేవి = దేవేరి. వీనిలో బికిరము వికిరశబ్ద భవ మనియు (౧౧౯ వి.) 'అగ్గువా' దులు స్త్రీప్రత్యయాంతములనియు (౮౦ వి.) నీవఱకు వ్రాసి యున్నాను.

కవిసంశయ విచ్ఛేదమున నింకను గొన్ని యీక్రింది విధములగు వికృతులు చూపఁబడినవి కాని యవి శాస్త్రసమ్మతము లనికాని, యనుభవానుకూలము లని కాని, తోఁచనందున వానిని మూలమునఁజేర్చి వివరింపలేదు. వాని నిటఁ జూపుచున్నాను.

(౧౨౯) "రేఫలకు...... డత్వ మగును (3 తరం. ౬ ప.) "సంగరము= జగడము" అని యుదాహరింపఁబడెను. లర లన్యోన్యము మాఱునుగాన రేఫము లకారముకాఁగా దానికి డకారము వచ్చిన రావచ్చునేమో కాని యీ యుదాహృతి యంత సరియై యున్నదని తోఁచదు. సంగరశబ్దములోని పదాది స్వరము మీఁది నిండుసున్న యూరకయే లోపించినదనుట సరికాదుగదా, కా

వుననే వైకృత దీపికలో జేగడ మనునది ఝకట శబ్దభవమని యుదాహరింపఁబడినది. "ఝకటః = అ-(స్త్రీ) కలహః" (సర్వశబ్దసంబోధిని)

(౧౩౦) "హజబలకు బిందుపూర్వము లయ్యె నేని। గత్వ మా దేశమగు చుండుఁ గాలకంఠ" (కవి. ౩ తరం. ౯ ప) హకారము గకారముగ మాఱిన మాఱవచ్చును. (౧౨౬ వి.) కాని బిందుపూర్వకములయిన జబలు గకారము లగుటకు బీజ మగపడదు. "సింజిని = సింగిణి; కంబళము = గొంగళి" అని యుదాహరింపఁబడెను. శబ్దరత్నాకరమున 'గొంగళి' శబ్దము దేశ్యముగా వ్రాయఁబడినది. సింగిణి శబ్దము 'శార్ఙ్గ' శబ్దభవమని వైకృతదీపికలో నుదాహరింపఁబడి యున్నది.

(౧౩౧) గీ॥ "ఊష్మ లంతస్థములు భేద మొందకుండు" (కవిసం-౩తరం, ౮ ప-) ఊష్మాంతస్థములు యథేచ్ఛముగ నన్యోన్యము మాఱుచుండు ననుటలో యుక్త్యనుభవము లగపడవు. "గృహము=గివము ; గుహ = గవి; కలశము = కడవ; కుటీరము=గుడిసె; శేఫాలిక = వావిలి; వైశ్యులు = బేరులు" అని యుదాహరింపఁ బడెను.

ఇందలి కడవ శబ్దము 'కటాహ' శబ్దభవమని వైకృతదీపికలో వ్రాయఁబడెను. ఇది కొంత సరిగా నున్నట్లు తోఁచుచున్నది. కటాహశబ్దములో హకారము లోపింపఁగా (౮౭ వి.) నచటి సంహితలో వకారము (౮౦ వి.) వచ్చిన దన నగును. ఈరీతినె 'గుహ=గవి' అనుదానిని సాధింప నగునుగాని, యది దేశ్యముగ శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను. 'గివము' శబ్దము (గృహ = గిఅ=గివ) శబ్దరత్నాకరాది కోశములలో నగపడదు. 'గుడిసె' శబ్దము కుటీర శబ్దమునుండి పుట్టెనని వైకృత దీపికలో వ్రాయఁబడెను. కాని యందు 'సె' వర్ణము చేరుటకు యుక్తి కానిపింపదు. 'వావిలి' శబ్దము దేశ్యముగా శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను. 'బేరులు' అనునది 'వ్యవహారి = బేహారి, బేరి' అను రీతిని సాధింపనగును.

(౧౩౨) గీ॥ "అచ్చులకు వత్వ మాదేశమగును" (కవిసం. ౩ తరం. ౧౦ ప.) ఇట్టి వకారాగమమునకును యుక్త్యనుభవములు కనఁబడవు. "అన్నము=వణ్ణము; అశ్వము=వారువము; ఉష్ణము=వెచ్చ ; ఓఢ్రము= వడ్డె" అని యుదాహరింపఁబడియెను. ఇందలి "వణ్ణము, వడ్డె" అను పదము లేకోశమునందును నగపడవు. మఱియు "ప్రథమదిక్కున నొడ్డె పాత్ర సామంతుల దట్టించి కంబముమెట్టు గొనియె" మొదలగు ప్రయోగ

ములచే వడ్డెశబ్దము గ్రాంథికము కాదని స్పష్టమగుచున్నది. 'వెచ్చ, వారువము' శబ్దములు శబ్దరత్నాకరమున దేశ్యములుగ నుదాహరింపఁబడెను. "వారువము" అనునది 'అశ్వము' అను దానికన్న 'అర్వము' అను దానికి సన్నిహితముగా నున్నది. కిట్టెలు దొరగారి కన్నడ కోశమున నిది బాడబ శబ్దభవముగా వ్రాయఁబడియున్నది.

(౧౩౩) "తాలకును స్త్రీయాలు జనియించు నీలకంఠ" (కవిసం. ౩ తరం. ౧౧ ప)

"రాత్రి = రేయి ; వక్త్రము = వాయి" అని యుదాహరింపఁబడెను. ఈ వికృతికిని యుక్త్యనుభవములు కానరావు. వాయిశబ్దము వాక్ఛబ్దభవమని వైకృత దీపికలోఁ వ్రాయఁబడియున్నది. 'రాత్రి' శబ్దమునందలి తకార రేఫములు లోపించి స్వరము శేషింపఁగా సంహితలో యకారాగమము వచ్చినదనిన ననఁదగునేమో కాని తవర్ణమునకు యకారాదేశమగు ననుట మాత్రము సరికాదనుటకు సందియములేదు.

(౧౩౪) "కలుగు బంధుత్వ మనునాసికలకు నెపుడు" (కవిసం. ౩ తరం. ౧౧. ప.) 'ఙ, ఞ' లు తెనుఁగున లేవు. 'ణ, నల' కన్యోన్య వ్యత్యాస మంగీకృతమె యై యున్నది. ఇఁక 'ణ'కారమునకు మకార మాదేశ మగునను విషయము యుక్త్యనుభవదూరమై యున్నది. ఉదా. ద్రోణము=తూము ; ఫణి= పాము ; ద్రోణశాకము = తుమ్మి. ఇందలి పాము శబ్దము దేశ్యముగ శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. తుమ్మిశబ్దము తుంబీశబ్దభవ మనియు, తూముశబ్దము తుంబికా శబ్దభవ మనియు వైకృత దీపికలో నుదాహరింపఁబడెను.

(౧౩౫) "అదుకఁబడుఁ గ్రార లొకకొన్ని పదములకును" (కవిసం. ౩. తరం. ౧౧ ప.)"తంతువు=త్రాఁడు; కబరి=క్రొమ్ముడి" అని యుదాహరింపఁబడి యున్నవి. ఈ వికృతియు యుక్తికిఁగాని, యనుభవమునకుఁగాని సరిపడి యుండలేదు. "త్రాడు, క్రొమ్ముడి" శబ్దములు దేశ్యములని శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను. "క్రొత్త+ముడి" అను పదముల మేళనమున సిద్ధించుచున్న క్రొమ్ముడి శబ్దమును గబరీ శబ్దభవమనుట కేవల ప్రామాదికమై యున్నది.

కవిసంశయ విచ్ఛేదములోని తద్భవ ప్రకరణములోని కొఱవడిన సూత్రములు నే నిందుదాహరించిన సూత్రములచేతఁ గతార్థములయి

యుండుటంజేసి వానిని మూలముగ నుదాహరింపలేదు. వాని పున రుక్తత యిటఁ జూపఁబడుచున్నది.

(౧౩౬) "గిలుక... ...క్రారయుఁ గియ్యు దొలఁగు"

(కవి. ౩ త. ౨. ప.)

(౧౩౭) "హ్రాలకు జసలు కకారంబు చేకూరు" (కవి. ౩ త. ౬ ప.)

ఇందు గిలుక క్రార కియ్యు దొలఁగుటయు, హ్రాకు జస కకారములు వచ్చుటయు, "౯౨-౯౩" విషయములకు మూలములగు "అనుఁగు లగును... ..." "ద్విత్వ వర్ణంబులకును మీఁదిదియ యొండె... ..." అనునవి మొదలగు సూత్రములచేతనే సిద్ధించునుగదా.

(౧౩౮) "ద ధలకు ట ఠల కాదేశంబు డత్వ మగును"

"వత్వమునకు ... ... పత్వంబు ... ... లగున్ ... ..."

(కవిసం. ౩ తరం. ౬. ౭. ప.)

(౧౩౯) "ఖత్వమునకు వరుస కత్వము। గత్వం బగుచుండు శైల కన్యాభరణా" (కవిసం. ౩ తరం. ౨ ప.)

ధకారము "వర్గంబుల ... ...(౬ ప.)" అను సూత్రముచేతనే దకారమగును. ఇఁక దకారము "కలుగు బంధుత ... ... ... ..." (కవిసం. ౩ తరం. ౩ ప.) అను సూత్రముచేతనే డకారము కాఁగలదు. అట్లె ఠకారము సైతము 'వర్గంబుల' (కవిసం. ౩ తరం. ౬ ప.) అను దానిచేతనే డకారము కాఁగలదు. 'ట, డ' (౬ ప.) అనుదానిచేతనే టకారము డకారము కాఁగలదు. అట్లే 'వ, ప' (కవిసం. ౩ తరం. ౬ ప.) అను దానిచేతనే వకారమునకు 'పత్వము' కలుగును. పయి రీతినే "వర్గంబుల ........." (కవిసం. ౩ తరం. ౬ ప.) అనుసూత్రముచేత 'ఖ' కారము 'క' కారమగుచున్నది. "కగల కన్యోన్య సంప్రాప్తి........." (౬ ప.) అను దానిచేతనే యట్టి (ఖకారాదేశ) కకారము గకార మగుచున్నది.

(౧౪౦) ఈ సందర్భమున సూరకవిగారు చెప్పిన (౧౨౯——౧౩౯) పది విషయములందలి వికృతి సూత్రములును సంభావ్యములుగ నున్నట్లగపడలేదు. తక్కిన నే నంగీకరించిన తద్భవములలో నయితము కొన్నిటి విషయమున నభిప్రాయభేదము లుండవచ్చును. దేశ్య తద్భవములను విడఁదీయుట సుకరముకాదు. ఘుణాక్షర న్యాయమునఁ గొన్ని దేశ్యములె యాకారమునందును నర్థమునందును సంస్కృతశబ్దములను బోలియుండుటచేత నవి

# III. అక్షర ప్రకరణము

శ్లో॥ అనుప్రదానా త్సంసర్గాత్ । స్థానాత్ కరణవిభ్రమాత్ ।
జాయతే వర్ణవైశేష్యం । పరిమాణాచ్చ పఞ్చమాత్ ॥

---

తద్భవములను నభిప్రాయము కలుగవచ్చును. కాల విప్రకృష్టతచేఁ గొన్ని తద్భవము లత్యధిక వికృతి నందుటచే సంస్కృత శబ్దముల పోలిక స్ఫురింపనిం జేసి దేశ్యములను తలంపు గలుగవచ్చును. ఏది యెట్లయినను బ్రకృతి వికృతి భావమును గల్పించు శబ్దముల సంబంధము శబ్దతత్త్వ శాస్త్ర సమ్మతమును సంభావ్యమును నై యుండుట మాత్ర మావశ్యకమని యెన్న నగును.

ఇది తద్భవ ప్రకరణము.

---

## వైయాకరణపారిజాతము

### అక్షర ప్రకరణము

(౧౮౧) వికృతు లేర్పడుటలో సంస్కృతవర్ణము లెంతవఱకు లోపించునో యనువిషయమును విశదపఱచుటకయి నన్నయభట్టారకుఁడు సంస్కృత వర్ణసమామ్నాయ సంఖ్యను "ఆద్యాయా" ఇత్యాది సూత్రముతోఁ జెప్పుచున్నాఁడు. ఆంధ్రవిద్యార్థు లెట్లును సంస్కృతమును జదివెదరన్న తలంపున నట్టి వర్ణసమామ్నాయమును నట్టివర్ణముల యుత్పత్తివిషయమును వివరింపఁడయ్యె. అట్టి వర్ణ స్వరూప నిరూపణ విషయమును వర్ణోత్పత్తి విషయమును నన్నయ భట్టారకుఁడే కాక యథర్వణుఁడును వివరించి యుండమింజేసి "అను ప్రదానా" దిత్యా ద్యభియుక్తోక్తి మూలముగ గ్రహింపఁబడి వివరింపఁ బడుచున్నది.

వ్యాఖ్య.—అను ప్రదానాత్ = గళ వివర సంకోచ వికాసరూప బాహ్య ప్రయత్న భేదమువలనను, సంసర్గాత్ = ప్రాణవాయు సంసర్గమునందలి మహత్త్వాల్పత్వములవలనను; స్థానాత్ = జిహ్వాప్రదేశము స్పృశించెడి జిహ్వామూల తాలు మూర్ధాది స్థానభేదములవలనను, కరణ విభ్రమాత్ = ఆ యా స్థానములను స్పృశించు జిహ్వాప్రదేశ స్పర్శనాది వ్యాపార విశేషములవలనను, (లేదా) ఓష్ఠోప సంహారాదులగు వ్యాపార విశేషములవలనను, పఞ్చమాత్ =

౨యిదవ దగు, పరిమాణాత్ = హ్రస్వదీర్ఘాది మాత్రాపరిమాణ విశేషము కలనను, వర్ణవైశేష్యమ్ = వర్ణవిశేషత, జాయతే = కలుగును.

నిశ్వాసవాయువు శ్వాసకోశములనుండి వాయుమార్గ ద్వారముగ అభిప్రాయావేదక శబ్దప్రయోగేచ్ఛా సహకృతమై వచ్చునపుడు కలిగెడి బాహ్యాభ్యంతర ప్రయత్నాదులచేత ధ్వని వైవిధ్యము సంభవించును. ఈ విష యమె ఋగ్వేద ప్రాతిశాఖ్యమున నీక్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

"వాయుః ప్రాణః కోష్ఠ్య మనుప్రదానం; కణ్ఠస్య ఖే వివృతే సంవృతే వా। ఆపద్యతే శ్వాసతాం, నాదతాం వా, వక్త్రీహాయామ్" (౧౩ ప. ౧ సూ.)

"ప్రయోక్తు రీహా గుణసన్నిపాతే। వర్ణీభవన్ వర్ణవిశేష యోగాత్।
ఏకః శ్రుతీః కర్మ ణాప్నోతి బహ్వీః" (౧౩ పటలము, ౧౩ సూ.)

ప్రాణవాయువు వక్తయొక్క శబ్ద ప్రయోగేచ్ఛతో సహకృత మగుచు (కోష్ఠ్య మనుప్రదానమ్) గళవివరముయొక్క (కణ్ఠస్య ఖే) వివృతి సంవృతులచేత శ్వాసనాదభేదముల నందును. ఏకవిధమెయగు ప్రాణవాయువు వక్తయొక్క యిచ్ఛా విశేషములచేతఁ గల్గు వివిధప్రయత్నములచేత వివిధ శ్రుతులను బొందుచున్నది.

(౧౪_౨)—పయివిషయమునఁ బాణినీయ శిక్షయందును నీక్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

"ఆత్మా బుధ్యా సమే త్యర్థాన్। మనో యుఙ్క్తే వివక్షయా।
మనః కాయాగ్ని మాహన్తి। స ప్రేరయతి మారుతమ్। ......
సో దీర్ణో మూర్ధ్న్యభిహతో। వక్త్ర మాపద్య మారుతః।
వర్ణాన్ జనయతే తేషాం। విభాగః పఞ్చధా స్మృతః।
స్వరతః కాలతః స్థానాత్। ప్రయత్నానుప్రదానతః।
ఇతి వర్ణవిదః ప్రాహు। ర్నిపుణం త న్నిబోధత।
ఉదాత్త శ్చానుదాత్తశ్చ। స్వరితశ్చ స్వరా స్త్రయః।
హ్రస్వో దీర్ఘః ప్లుత ఇతి। కాలతో నియమా అచి॥..."

ఇందు 'అనుప్రదానా' దిత్యాదికారికలోని 'సంసర్గాత్' అను దళము వివరింపఁబడలేదు. 'పరిమాణాత్' అనుదానికి బదులుగా నిందలి 'కాలతః' అనునదే చెప్పఁదగియుండఁగా 'స్వరతః' అను విశేషదళము చేర్పఁబడినది. కాని యుదాత్తాది స్వరవైశేష్యమునుబట్టి వర్ణవైశేష్యము నంగీకరించుట సంప్రదాయము కాదు.

శ్లో ॥ ఏకమాత్రో భవే ద్ధ్రస్వో । ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే ।
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో । వ్యఞ్జనం త్వర్ధ మాత్రకమ్ ॥

---

"ఉచ్చై రుదాత్తః" (తైత్తి. ౧ అధ్యా. ౩౮ సూ.)
"నీచై రనుదాత్తః" (తైత్తి. ౧ అధ్యా. ౩౯ సూ.)
"సమాహారః స్వరితః" (తైత్తి. ౧ అధ్యా. ౪౦ సూ.)

"సమానే స్థానే మూర్ధ్ని ఆసన్నే ఉపరిభాగే జాతేన ప్రయత్నేన ఉచ్చార్యమాణః స్వర ఉదాత్తగుణకత్వా దుదాత్త సంజ్ఞో భవతి. సమానే స్థానే హృదయాసన్నే అధోభాగే జాతేన ప్రయత్నేన ఉచ్చార్యమాణః స్వరః అనుదాత్త గుణకత్వా దనుదాత్త సంజ్ఞో భవతి. సమాహార ఉభయో స్సంభేదాత్మకః... ..." (వైదికాభరణ వ్యాఖ్య.)

అచ్చులు నాదములని ముందు విశదీకరింపఁబడును. (౧౫౧. వి.) అట్టి యచ్చుల నాదముయొక్క యుచ్చత్వ నీచత్వములచేత వాని కుదాత్తత్వా నుదాత్తత్వములు కల్గును. అట్టి స్వరవిశేషములు కలవి గనుకనే వానికి స్వరము లను సంజ్ఞ కల్గెనని యీక్రిందిరీతి నువ్వటుఁడు చెప్పి యున్నాఁడు.—

"ఉదాత్తానుదాత్త స్వరిత ప్రచయా ఏష్వక్షరేషు (స్వరేషు) స్థితాః స్వర్యన్తే శబ్ద్యన్తే ఇతి స్వరాః" (ఋగ్వేద ప్రాతిశాఖ్యము. పార్షదవ్యాఖ్య. ౨౦. పుట)

(౧౪౩)— పయిరీతి నీ యుదాత్తతాదులు నాదమునందలి యుచ్చత్వ నీచత్వాదికమును మాత్రమే మూలముగాఁగొని వ్యవహరింపఁబడును గాన నియ్యవి స్వరపరిమాణములోఁ జేర్పఁబడవు. కావుననే వీనివలనఁ గలుగుభేదములకుఁ బ్రాతిశాఖ్యములలో వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణము లేదు. అక్కారణముననె వర్ణ వైశేష్యమును జూపుభేదములను జెప్పుచున్న "అను ప్రదానా దిత్యాది ప్రకృత కారికలో నీ భేదము పేర్కొనఁబడదయ్యె నని యెఱుఁగునది.

(౧౪౪)— వాఖ్య — ఏకేత్యాది :- నన్నయాథర్వణులు వివరించి యుండమింజేసి వర్ణోచ్చారణ పరిమాణమును దెల్పు పై యభియుక్తోక్తకారిక యిచట మూలముగ గ్రహింపఁబడెను. స్వరములవిషయమున వర్ణపార్థక్యమును గలిగించెడి దగుటచేత నీపరిమాణభేదము మున్ముందుగ వివరింపఁబడుచున్నది. ఏకమాత్రః=ఉచ్చారణమున నొక్కమాత్ర కాలముగలది, హ్రస్వః=హ్రస్వము, భవేత్ =అగును; ద్విమాత్రః = ఉచ్చారణమున రెండు మాత్రల కాలము

గలది, దీర్ఘః=దీర్ఘమని, ఉచ్యతే=చెప్పఁబడును. త్రిమాత్రస్తు = ఉచ్చారణమున మూఁడు మాత్రలకాలము కలది. ప్లుతః= ప్లుతమని, జ్ఞేయః = తెలియఁదగినది. వ్యఞ్జనమ్ = వ్యంజనమనఁగా హల్లు, అర్ధమాత్రకమ్ = ఉచ్చారణమున నర్ధమాత్రాకాలము గలది.

(౧౪౫) ఈసందర్భమున మాత్రాకాల పరిమితిని గుఱించి యీక్రింది రీతిని పాణినీయశిక్షలోఁ జెప్పఁబడియున్నది.

"చాషస్తు వదతే మాత్రాం। ద్విమాత్రాం త్వేవ వాయసః।
శిఖీ రౌతి త్రిమాత్రం తు। నకుల స్త్వర్ధమాత్రకమ్॥"

కర్ణాట శబ్దాను శాసనవ్యాఖ్యలో నీక్రిందిరీతి నుదాహరింపఁబడెను. (3 సూత్రము)

"చటకో రౌ త్యేకమాత్రం। ద్విమాత్రం రౌతి వాయసః॥
త్రిమాత్రంతు శిఖీ రౌతి। నకుల స్త్వర్ధ మాత్రకమ్॥"
(చటకము=ఊరఁబిచ్చుక.)

పాలపిట్ట రుతమున (లేదా) ఊరఁ బిచ్చుకరుతమున నేకమాత్రాకాలమును, కాక రుతమున ద్విమాత్రాకాలమును నెమిలి యఱపున ద్రిమాత్రాకాలమును ముంగిస రుతిలో నర్ధమాత్రాకాలమును బట్టునని పయి కారికల కర్థము నెన్నునది. కుక్కుట రుతమున వరుసగాఁ మూఁడు కాలములును వేర్వేఱ వినఁబడునని వైయాకరణులు చెప్పుచున్నారు. "కుక్కుట రుతే ఉకారస్య ప్రసిద్ధత్వా దకారాదయో నోక్తాః సూత్రకారేణ." (సిద్ధాంతకౌముదీ టిప్పణము. 3పుట). ప్రాతఃప్రాత స్సముత్థాయ। క్రమాత్త్రీన్ శుద్ధకన్ధరః। హ్రస్వదీర్ఘప్లుతాన్ రౌతి। కృకవాకు రనాతురః॥ (కర్ణాట శబ్దానుశాసనవ్యాఖ్యా, మకరందవాఖ్యా 3 సూత్రము).

హ్రస్వాకారమును బల్కుకాలము మాత్రాకాల మనుచు నీక్రిందిరీతిని తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడి యున్నది.

"అకారశ్చ" (౧ అధ్యా. 3౩ సూ.) "తేనచ సమానకాలః స్వరః" (33సూ.) "ద్వి స్తావాన్ దీర్ఘః" (3౫ సూ.) "త్రిః ప్లుతః" (3౬ సూ.) "హ్రస్వార్ధకాలం వ్యఞ్జనమ్" (32 సూ) "అకారో హ్రస్వసంజ్ఞో భవతి ......... అకారేణ తుల్యకాల స్వరోపి హ్రస్వసంజ్ఞో భవతి.........హ్రస్వా ద్విగుణకాలః.........దీర్ఘసంజ్ఞో భవతి.........హ్రస్వత్రిగుణకాలః .........

ప్లుతసంజ్ఞో భవతి ......... వ్యఞ్జనం హ్రస్వార్ధ తుల్యకాలం అర్ధమాత్రా కాలం భవతి" (వైదికా భరణవ్యాఖ్య)

"స్వస్థో యువా ఋజుశ్వాస। ఉచ్చర త్యక్షరం లఘు।
కాలేన యావతా సా స్యా। న్మాత్రేతి మునయో విదుః
అంగ్గుళిస్ఫోటనం యావత్। కాలే మాత్రేతి సూచ్యతే।" (అఙ్గుళిస్ఫోటనం = మిట్టకాయ) (కర్ణాటశబ్దానుశాసనము. 3. సూ. మకరందవ్యాఖ్య.)

ఈక్రింది సూర్యసిద్ధాంత వచనములనుబట్టి మాత్రాకాల నిర్ణయము చేయుట కవకాశ మగపడుచున్నది.

"తీక్ష్ణ సూచ్యాబ్జ పుష్పస్య। దళభేద స్త్రుటి ర్భవేత్। తచ్ఛతం లవమిత్యుక్తం। తత్త్రింశస్తు నిమేషకమ్। నిమేషై స్సప్తవింశత్యా। కాలో గుర్వక్షర స్తతః। దశగుర్వక్షరోచ్చార। కాలః ప్రాణ స్సమీరితః। షడ్భిః ప్రాణై ర్వినాడీ స్యాత్। తత్షష్ట్యా నాడికా స్మృతా। నాడీషష్ట్యాతు నాక్షత్ర। మహోరాత్రం ప్రకీర్తితమ్" (నావద్దనున్న తాళపత్ర మాతృక) (గూఢార్థదీపికతో ముద్రిత మగు సూర్యసిద్ధాంతమున "షడ్భిః ప్రాణైః ... ..." అనునది మొదలుగ మాత్రమె యున్నది

"వాఁడిగల సూదిమొనతోఁ దామరపూ రేఁకును బొడుచుటకుఁ బట్టు కాలము 'త్రుటి'. నూఱుత్రుటు లొక లవము. ముప్పది లవము లొకనిమేషము. ఇరువదేడు నిమేషము లొకగుర్వక్షరము పలికెడు కాలము. పది గుర్వక్షరములు పలుకు కాల మొకప్రాణము. ఆఱుప్రా ము లొకవినాడిక. అఱువది వినాడిక లొకనాడిక. అఱువదినాడిక లహోరాత్రకాలము." అని పైశ్లోకముల కర్థము. కావున మాత్ర యనఁగా నలువదివేల యేనూఱు త్రుటులకాల మని తేలుచున్నది. అనఁగా నొక సెకండులో నయిదుమాత్రలు పలుకవచ్చు నని తాత్పర్యము. దీనినిబట్టి మాత్ర యనఁగా సెకండులో నయిదవ వంతు కాల మని తేలుచున్నది. కావున నయిదు కందపద్యములు చదువుట కొక మినెటుపయిని నాల్గు సెకెండ్లు పట్టునని యెన్న నగును. కందము పదునాఱు చతుర్మాత్రాగణములు కల దనఁగా నఱువది నాల్గు మాత్రలు గలది. కావున గంటకు నేకాశీత్యధిక ద్విశత కందపద్యములు చదువవచ్చునని గ్రహింపవలెను.

సమాసమునందలి పదములను బృథక్కరించుటలో నయ్యెడి కాలము మాత్రాకాల మనుచు నీక్రిందిరీతిని ఋగ్వేద ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడి యున్నది.

"మాత్రా హ్రస్వః ; తావ దవగ్రహాన్తరమ్ ; ద్వే దీర్ఘః ; తిస్రః ప్లుత ఉచ్యతే స్వరః"

పార్షద వ్యాఖ్య:—"హ్రస్వ స్వరో మాత్రాకాలో వేదితవ్యః... అవగ్రహః - నానాగ్రహైః స్సమాస వర్తినోః పదయోః పృథక్కరణమ్. మాత్రాకాలం భవతీత్యర్థః. పురః, హితమ్, రత్నధా, తమమ్; ద్విమాత్రాకాలో దీర్ఘస్వరో వేదితవ్యః......స్వరసంజ్ఞా ప్లుత స్యైవేన విధీయతే. సచ తిస్రో మాత్రా భవతి."

'క్త' అనునది యేకమాత్రాకమనియే గ్రహింపవలయును. కకార తకారములు కలిపి యొక్క మాత్ర యనియు, 'అ' కార మొకమాత్ర యనియు లెక్కించి యద్దానిని ద్విమాత్రాకముగా గ్రహింపరాదు. స్వరముతో నెన్ని హల్లులున్నను నందలి స్వరము నుచ్చరించు కాలములోనే యా హల్లుల యుచ్చారణము సైతము జరిగిపోవును గాన వాని పరిమితిని వేఱుగఁ బరిగణింపఁ దగదు. 'కన్' మున్నగు చోటులందలి స్వరపూర్వకమగు హల్లు నుచ్చరించునపుడే యర్ధమాత్రాకాలము వేఱుగఁ బట్టునని గ్రహింపవలయును. ఇట్టిది గురువుగా నాంధ్రవైయాకరణులు ప్రత్యేకముగా విధించుకొనిరి. సంస్కృతమున నిట్టిది లఘువుగ నెన్నఁబడును. భుజ్ మున్నగు ధాతువులు లఘూపధకము లని యుదాహరింపఁబడుచున్నవి. ఆంధ్ర వైయాకరణులే యైన సూరిగారు సైతము సంస్కృత సమధాతువులగు 'భుజించు' మున్నగు వానిలోని 'భుజ్' మున్నగు భాగములు గురువిరహితములనియె యుదాహరించిరి. "లఘ్వేకాక్షర పూర్వక్రియాన్త్యమ స్యానయో భవే దిద్వా" అని చింతామణియుఁ జెప్పుచున్నది. సంయుక్తాక్షరము పరమందున్నపుడు పూర్వాక్షరము యొక్క యుచ్చారణమున నూనిక సంభవించును. అట్లద్దాని నూఁది పలుకుటలో నయ్యది హ్రస్వమయ్యును ద్విమాత్రాకాలము పట్టునని గ్రహింపవలెను.

"మాత్ర యనఁగా నక్షరావయవము. క్ చ్ మున్నగునవి మాత్రలనఁబడును" అను సాధుని కాశయము పైవిషయములకు విరుద్ధము.

(౧౪౬) ఋ ౠ వర్ణముల యుచ్చారణమున ర ల సంపృక్త స్వరము వినఁబడుచున్నను నవి ప్రత్యేకముగ నొక్కొక్క మాత్ర కాలముగలవే యనియు వానియందు మొదటి స్వర భాగము పాదమాత్రాకమనియు

వానిలోని వ్యంజన మర్ధ మాత్రాకమనియుఁ దర్వాతిది పాదమాత్ర స్వర భాగమె యనియు వరరుచి చెప్పియున్నాఁడు.

"స్వరభక్తి స్వరూపంతు విస్పష్టం వ్యాచష్టే వరరుచిః—'ఋకారాది రణుమాత్రా, రేఫోఽర్ధమాత్రా, శేషా స్వరభక్తి రణుమాత్రా' ఇతి అస్యాయ మర్థః—'ఇంద్రియావిషయో యోసా। వణు రిత్యుచ్యతే బుధైః॥ రణుభి ర్మాత్రా। పరిమాణ మితి స్మృతమ్' మాత్రికస్య ఋకార స్యాది చతుర్భి రణుమాత్రః స్వరభాగః, మధ్యే రేఫ అర్ధమాత్రః, అన్త్యే పృణు మాత్రః స్వరభాగః॥ ఏ తత్ ఋకార స్వరూపమ్." (త్రిభాష్య రత్న వ్యాఖ్య, 'రేఫోష్మ...' అను ౨౧ అధ్యాయపు ౧౫ సూత్రపు వ్యాఖ్య. తైత్తిరీయ ప్రాతిశాఖ్యము. ౪౮౬ పుట.)

"ఋకార ల్కారౌ హ్రస్వౌ" (తైత్తి. ౧ అధ్యా. 3౧ సూ) "ఋకారశ్చ ఌ కారశ్చ హ్రస్వ సంజ్ఞౌ భవతః" (త్రిభాష్య రత్న వ్యాఖ్య) "తేనచ సమానకాలః స్వరః ఇతి (౧ అధ్యా. 33 సూ) వక్ష్యమాణే నాత్రాపి సిద్ధే పృథగ్వచనం మాత్రా వైషమ్య శంకా నివృత్త్యర్థమ్." (వైదికాభరణ) 'ర-ల' సంపృక్తిచే వీనియందలి స్వరభాగ మర్ధమాత్రికమె యగును గాన దానికి హ్రస్వసంజ్ఞా పునర్విధాన మావశ్యకమని భావము. వీని దీర్ఘత్వము నందలి మాత్రాదైర్ఘ్యము స్వరభాగమునకె యగు నని గ్రహింపవలయును.

(౧౮౭) ఇంక ననుస్వారము విసర్గమువలెనె వ్యంజన మగుటంజేసి యయ్యదియు నర్ధమాత్రా కాలికమే యనఁజనదనియు నయ్యది మాత్రా కాలిక మనియుఁ బ్రాతిశాఖ్యములలోఁ జెప్పఁబడియున్నది. ఇంతియకాక యనుస్వారము హ్రస్వపూర్వక మగునపుడు పూర్వస్వరములోని యణుభాగ మనఁగా బాదమాత్రా భాగ (అర్ధమాత్రా భాగమని కొందఱు) మను స్వారమున సంక్రమించు ననియు నక్కారణమున నట్టి యనుస్వారము పాదాధిక (అర్ధాధిక) మాత్రాక మగుననియు, నచటి పూర్వాచ్చు పాదోన (అర్ధోన) మాత్రాక మగుననియు నట్లె దీర్ఘపూర్వ కానుస్వారము పాదోన (అర్ధోన) మాత్రాకమనియు నచటి పూర్వస్థదీర్ఘ స్వరము పాదాధిక (అర్ధాధిక) మాత్రాక మనియుఁ గొందఱు తలంచెద రని యీక్రిందిరీతిని ఋగ్వేద ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియున్నది.

"హ్రస్వార్థ స్వరభక్త్యా సమాప్తా మనుస్వార స్యోపధా మాహు రేకే। అనుస్వారం తావత్తై వాధికంచ హ్రస్వోపధమ్॥ (౧౩ పట. ౩౨ సూ.) "దీర్ఘ పూర్వం సమానమ్" (౧౩ పటలము, 33 సూ.)

పార్షద వ్యాఖ్య:— "హ్రస్వా మనుస్వారోపధామ్ అర్ధస్వర భక్త్యా అసమాప్తామ్ పాదమాత్రయావా అర్ధమాత్రయావా న్యూనామ్ ఆహు రేకే ఆచార్యాః. అనుస్వారంచ తావతా కాలేన అధికమ్......దీర్ఘ పూర్వ మనుస్వారం తథైవార్ధ స్వరభక్త్యా న్యూన మాహుః దీర్ఘా ముపధాం తావ తైవాధికాంచ... ..."

శుక్ల యజుః ప్రాతిశాఖ్యమున హ్రస్వ పూర్వకానుస్వార మర్ధాధిక మాత్రాకమనియు నచటి హ్రస్వ స్వర మర్ధ మాత్రాకమనియు నట్లె దీర్ఘ పూర్వకానుస్వార మర్ధ మాత్రాకమనియు నచటి పూర్వస్థ దీర్ఘస్వర మధ్యర్ధ మాత్రాక మనఁగా నర్ధాధిక మాత్రాకమనియుఁ జెప్పఁబడి యున్నది.

"అనుస్వారో హ్రస్వ పూర్వోఽధ్యర్ధ మాత్రా పూర్వా చార్ధ మాత్రేతి" (శుక్ల. ౪ అధ్యా. ౧౪౭ సూ.)

"దీర్ఘా దర్ధ మాత్రా పూర్వా చాధ్యర్ధ మాత్రా" (శుక్ల. ౪ అధ్యా. ౧౪౯ సూ.)

అనుస్వార పరకస్వరము విషయమున వాడఁబడిన యిచటి మాత్రా శబ్దము స్వతసిద్ధ మాత్రాపరము. అనఁగా హ్రస్వము విషయమున మాత్రా శబ్దమున కేకమాత్ర యని యర్థము. దీర్ఘము విషయమున వాడఁబడిన యిచటి మాత్రా శబ్దము ద్విమాత్రాపరము.

"అనుస్వార శ్చ" (తైత్తి. ౧ అధ్యా. ౩౪ సూ.)

"భవ త్యనుస్వారోఽపి హ్రస్వ సంజ్ఞః ...... ... ......హ్రస్వార్ధకాలం వ్యఞ్జనమ్. (౧ అధ్యా. ౩౭) ఇత్యర్ధమాత్రత్వే ప్రాప్తే త న్మాభూ దితి హ్రస్వ త్వం విధీయతే" (త్రిభాష్య)

(౧౪౮) పయిరీతి ననుస్వారము మాత్రా కాలికమని యంంచియుఁగీకరి దైత్తిరీయ ప్రాతిశాఖ్య కర్త దానిని వ్యంజనముగనే తలంచెను.

"అనుస్వారోత్తమా అనునాసికాః" (తై. ౨. అ. ౩౦ సూ.).

"అనుస్వారో వ్యంజనం వా స్వరో వేతి పరమతమ్. త న్నిరాసార్థ మిద ముచ్యతే. అనుస్వారో ప్యుత్తమవత్ (వర్గ పంచమవత్) వ్యంజనమే వాస్మచ్ఛాఖాయామ్." (వైదికాభ).

శ్లో. ఖయాం యమాః ఖయః కః పౌ। విసర్గ శ్శర ఏవచ।
ఏతే శ్వాసానుప్రదానా। అఘోషాశ్చ వివృణ్వతే।
కణ్ఠ; మన్యే తు ఘోషా స్స్యు। స్సంవృతా నాదభాగినః।
ఆయుగ్మా వర్గ యమగా। యణ శ్చాల్పాసవః స్మృతాః॥

---

ఋగ్వేద ప్రాతిశాఖ్యములో ననుస్వారమునందుఁ గొన్ని స్వరధర్మములును గొన్ని వ్యంజన ధర్మములును నుండుటచేత నయ్యది స్వరమును వ్యంజనమును ననఁదగు నని యీ క్రిందిరీతిని జెప్పఁబడెను. కాఁగా నిది యభయ మని కాని యనుభయ మని కాని చెప్పఁదగు నని తేలుచున్నది.

"అనుస్వారో వ్యఞ్జనం వా స్వరో వా" (ఋగ్వే. ౧ పట. ౨౨పుట) ఉవ్వటుని పార్షదవ్యాఖ్య:— 'అం' ఇత్యనుస్వారో వర్ణ సమామ్నాయే పఠ్యతే. స కాంశ్చిత్ స్వరధర్మాన్ గృహ్ణాతి. కాంశ్చిద్ వ్యఞ్జన ధర్మాన్. తద్యథా—హ్రస్వత్వం దీర్ఘత్వం ప్లుతత్వమ్. ఉదాత్తత్వ మనుదాత్తత్వం స్వరితత్వ మితి. తథార్ధమాత్రా కాలతా, స్వరవశే నోదాత్తానుదాత్త స్వరితత్వం సంయోగశ్చేతి వ్యఞ్జన ధర్మాః. తత్రోభయ ధర్మయోగా దుభయ స్వభావం స్వరవ్యఞ్జనయో రన్య ద్వర్ణాన్తరం ప్రకాశయతి.........స్వర వ్యఞ్జనాతి రిక్త మన్య ద్వర్ణాన్తర మేత దిత్యేతత్ ఖ్యాపన పరమే వైతత్సూత్రమితి సిద్ధాన్తితమ్.

పయి శౌనక సూత్రమున కీ క్రింది వాచస్పత్య గ్రంథము ప్రతికూలముగ నున్నది.

"అనుస్వార విసర్గయో శ్చ అక్షర సమామ్నాయ సూత్రేషు 'అఇఉణ్' ఇత్యాదిషు మాహేశ్వరేషు చతుర్దశసు సూత్రేషు ఆమ్నానాభావేన భాష్యకృతా అట్సూపసంఖ్యానేపి న స్వర వర్ణత్వమ్.

'అయోగవాహా విజ్ఞేయా। ఆశ్రయస్థానభాగినః.' ఇత్యుక్త్యా స్వయం విరాజమానత్వాభావాత్ ఉదాత్తాది స్వరవత్త్వాభావాచ్చ తయో స్స్వర వర్ణాభావేపి అట్సూపసంఖ్యానంచ షత్వ ణత్వ కార్యార్థమ్."

(వాచస్పత్యము. ౧౫౯౭పుట. స్వరవర్ణ విభాగాది.) మాహేశ్వర సూత్రములు వర్ణ సమామ్నాయ సూత్రము లనెడు నీయభిప్రాయము సరి కాదు. (చూ. ౨౧౯-౨౨౮. పే.)

(౧౪౯) వ్యాఖ్య. ఖయా మిత్యాది:—సన్నయా ధర్మములు వివరించి యుండమింజేసి పయి సిద్ధాంతకౌముదీ వచనము మూలముగ గ్రహింపఁ

బడెను. ఖయాం యమాః =ఖయ్ ప్రత్యాహార వర్ణములలోని యమములును, ('పలిక్క్న' మున్నగు చోటులలోని వర్గాది వర్ణ చతుష్టయమునకును వర్గ పంచమములు పరమగు నపుడు వానినడుమ పూర్వసదృశ వర్ణము జనించును. అట్టి దానికి యమమనియు నాస్యమనియు నాసిక్యమనియుఁ బేరులు చెల్లును. అవి వేద మాత్ర ప్రసిద్ధములు.) ఖయః = ఖయ్ప్రత్యాహార వర్ణములును, (ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప) ౘక ౘపౌ=జిహ్వామూలీ యోపధ్మానీయములును, విసర్గః=విసర్గమును, శర ఏవచ = శర్ ప్రత్యాహార వర్ణములును, (శ ష స) ఏతే = అనెడి యీవర్ణములు, శ్వాసానుప్రదానాః = శ్వాస మనెడి బాహ్య ప్రయత్నము గలవియు, అఘోషాశ్చ=అఘోషములును, నగు చున్నవి. కణ్ఠం వివృణ్వతేచ = కంఠమును వివారవంతమును జేయుచున్నవి. అన్యేతు=తక్కిన వర్ణములన్నో, అనఁగా నచ్చులును వర్గ ప్రథమ తృతీయ పంచమములును, య ర ల వలును, ఘోషాః = ఘోష ప్రయత్న వంతము లును, సంవృతాః = సంవార ప్రయత్నము గలవియు, నాదభాగినః = నాద ప్రయత్నము గలవియు, స్యుః =అగును. అయుగ్మాః = వర్గ ప్రథమ తృతీయ పంచమములును, వర్గయమగాః=వర్గములలోని తృతీయ చతుర్థములగు యమము లును, యణశ్చ=యణ్ ప్రత్యాహార వర్ణములును, (య ర ల వ) అల్పాసవః= అల్ప ప్రాణసంజ్ఞ గలవి-తక్కినవి మహా ప్రాణసంజ్ఞ గలవని గ్రహింపనగును.

(౧౫౦) వెనుక వివరించిన రీతిని జాఠర ప్రేరణమున బయలు వెడలిన నిశ్వాసము వక్త్రములోని గళ వివరము ద్వారమునఁ బోవును. శ్వాసవర్ణో చ్చారణేచ్ఛ గల్గు నపుడు గళ వివరము వివృతమగు ననఁగాఁ దెఱవఁబడును. కావున నట్టి వివృతగళ వివరములోనుండి నిశ్వాస వాయువు నిర్నిరోధముగఁ బోవునపుడు జనించెడి వర్ణములు నాదరహితము లనఁగా శ్వాసములును, ఘోషవంతములు కానివనఁగా నఘోషములును నయి శ్వాసములు నఘోష ములు ననెడి యన్వర్థసంజ్ఞల నందును. వీని యుచ్చారణమునఁ గంఠమునందు వివృత ప్రయత్నము జరుగును గాన నది వివార మనిపించుకొనును. ఈ విష యమునె ప్రాతిశాఖ్యము లిట్లు చెప్పుచున్నవి.

"వివృతే శ్వాసః" (తైత్తి. ౨ అధ్యా. ౫ సూ.)

"వివరణం = కణ్ఠస్య విస్తరణం, సఏవ వివారాఖ్యో బాహ్య ప్రయత్నః, తస్మిన్సతి శ్వాసోనామ బాహ్య ప్రయత్నః క్రియతే. ఇతి శిక్షాయాం స్మర్యతే." (వైదికాభరణవ్యాఖ్యా.)

"అన్త్యా స్సప్త తేషా మఘోషాః" (ఋగ్వేదప్రా. ౧ పటల.) "సప్తోష్మాణః అఘోష సంజ్ఞా వేదితవ్యాః, యథా -శ ష స, అః, ꣳ క, ꣳ ప, అం, ఇతి .........వర్గేవర్గే ప్రథమ ద్వితీయౌ వర్ణౌ అఘోష సంజ్ఞౌ వేదితవ్యౌ, యథా—క ఖ చ ఛ ట ఠ త థ ప ఫేతి, పారిశేష్యా దన్యాని ఘోషవ త్సంజ్ఞాని వ్యఞ్జనాని" (ఉవ్వటకృత పార్షదవ్యాఖ్య.)

(౧౫౧)—ఇంక వక్తకు నాదోచ్చారణేచ్ఛ కల్గునపుడు గళవివరము సంవృత మనఁగా మూయఁబడిన దగును. కావున జాఠర ప్రేరణమున బయలువెడలిన నిశ్వాస మట్టి సంవృత గళవివరమును భేదించుకొని పోవుటచేతఁ గంఠవివర పార్శ్వస్థ చర్మాగ్రములందుఁ గంపము కల్గును. కాన నట్టి యెడలఁ బుట్టెడి వర్ణములు నాదవంతములు ఘోషవంతములు నయి నాదములు ఘోషములు ననెడి యన్వర్థసంజ్ఞల నందును. ఇటుఁ గంఠ సంవరణరూప ప్రయత్నము సంభవించును గాన నట్టి ప్రయత్నమునకు సంవార సంజ్ఞ సార్థక మగుచున్నది.

పయిని వ్రాసిన వివార సంవారాది ప్రయత్నము లోష్ఠప్రభృతి జిహ్వామూలావధిక వక్త్రమునకు బహిః ప్రదేశమున జరుగును. కాన నవి బాహ్యప్రయత్నము లనిపించుకొనును. ఈ బాహ్యమగు ప్రథమ ప్రయత్నమున వర్ణములు పుట్టింపఁబడును గాన దీని ననుప్రదాన మనియు సార్థకముగ వ్యవహరింతురు.

పయి విషయముల నీక్రిందిరీతిని ప్రాతిశాఖ్యములు చెప్పుచున్నవి. "సంవృతే కణ్ఠే నాదః క్రియతే" (తైత్తి. ౨ అధ్యా. ౪ సూ.)

అథ వర్ణానాం విశేషరూపోత్పత్తౌ ప్రథమ కారణభూతా అనుప్రదానాఖ్యా నాదాదయో బాహ్య ప్రయత్నా ఉచ్యన్తే. సంవరణం=కణ్ఠస్య సంకోచః। సఖలు సంవారోనామ బాహ్యప్రయత్నః। తస్మిన్సతి నాదాఖ్యో బాహ్యః ప్రయత్నః క్రియతే=ఉత్పాద్యతే; నాదధ్వని సంసర్గాద్ వ్యఞ్జనేషు ఘోషోనామ బాహ్య ప్రయత్నో జాయతే; ఇతి శిక్షాయాం స్మర్యతే" (వైదికాభరణ వ్యాఖ్య).

"నాదోఽనుప్రదానం స్వరఘోషవత్సు" (తైత్తి. ౨ అ. ౮ సూ.) "స్వరేషు ఘోషవత్సుచ వర్ణేషు, నాదః అనుప్రదానం భవతి. అనుప్రదీయతే అనేన వర్ణ ఇత్యనుప్రదానమ్ = మూలకారణమ్. అనుప్రదీయతే = ఉపాదీయతే జన్యత ఇత్యర్థః (త్రిభాష్యరత్న వ్యాఖ్య).

"వాయుః ప్రాణః కోష్ఠ్య మనుప్రదానం కణ్ఠస్య ఖే వివృతే సంవృతే వా ఆపద్యతే శ్వాసతాం నాదతాం వా వక్త్రీహాయామ్." (ఋగ్వేద.౧౩ పటలము).

" ............ప్రాణో వాయుః, కోష్ఠ్య ముదరం, కోష్ఠేభవం కోష్ఠ్యమ్, అనుప్రదానం=వాయు రనుప్రదీయతే ఇత్యనుప్రదానమ్, ... ... కణ్ఠస్య = గ్రీవాయాః, ఖే = గళస్య బిలే ఛిద్రే, వివృతే = విశాలే మహతి, సంవృతే = సంకుచితే సంశ్లిష్టే అల్పేవా సతి, ఆపద్యతే శ్వాసతామ్, శ్వాసత్వమ్, నాదతామ్=నాదత్వంవా, వక్త్రీహాయామ్=ఈహా=చేష్టా, వక్తు రీహా= వక్త్రీహా; తస్యామ్=వక్త్రీహాయామ్" (పార్షదవ్యాఖ్య).

(౧౫౨) పయిసందర్భమునుబట్టి "వివారము = (కంఠసంకోచము) సంవారము=(కంఠవికాసము)" అనెడి యాంధ్రవిజ్ఞాన సర్వస్వ వివరణము ప్రాతిశాఖ్యములకుఁ గేవలము విరుద్ధమని విశదమగుచున్నది.

(౧౫౩) వర్గాక్షరములలోని ద్వితీయ చతుర్థ వర్ణములకు సోష్మముల నెడి సంజ్ఞకలదు. వాని యుచ్చారణమున నధికమగు నిశ్శ్వాసవాయువు బయలు వెడలునని గ్రహింపనగును. హ శ ష స వర్ణములును, విసర్గ జిహ్వామూలీ యోపధ్మానీయములును ననుస్వారమును సహజముగ నూష్మములె యగుచున్నవి. కావున నట్టి యూష్మములును సోష్మములును మహాప్రాణము లనెడి యన్వర్థ సంజ్ఞ నందుచున్నవి. అట్టివాయ్వాధిక్యము లేని వర్గప్రథమ తృతీయ పంచమములును, నంతస్థములును, నల్పప్రాణములనెడి సార్థక నామము నందుచున్నవి. ఈవిషయముల కీక్రింది ప్రాతిశాఖ్యములు మూలములయి యున్నవి.

"ఉత్తరేష్టా ఊష్మాణః" (ఋగ్వేద ౧ పటల.)

"......ఊష్మా=వాయుః తత్ప్రధానా వర్ణా ఊష్మాణః, యథా,హ శ ష స అః ఁక ఁప అం ఇతి" (పార్షదవ్యా.)

"యుగ్మా=సోష్మాణౌ" (ఋగ్వేద ప్రాతి. ౧ పట.).

"యుగ్మా=ద్వితీయ చతుర్థా వర్ణౌ, సోష్మాణౌ వేదితవ్యౌ. అన్వర్థసంజ్ఞేయమ్, ఊష్మా=వాయుః తేన సహ వర్తన్త ఇతి సోష్మాణః,... ...(పార్షద వ్యాఖ్య).

(౧౫౪) హకారమును వర్గచతుర్థములను బల్కునిచ్చ గల్గునపుడు కంఠ వివరము కేవల సంవృతము కాదనియు, నింకఁ గేవల వివృతమును గాదనియు నట్టి మాధ్యమికమగు బాహ్య ప్రయత్నమునఁ గల్గు ధ్వనికి హకార

మను సంజ్ఞ చెల్లుననియు, హకారమును వర్గచతుర్థములును ఘోషవంతము లలోని మహాప్రాణములనియు నశ్లైవర్గ ప్రథమములకన్న వర్గద్వితీయముల యుచ్చారణమున నధికనిశ్వాసము బయల్వెడలును గాన నవి యఘోషములలో మహాప్రాణ సంజ్ఞ నందుచున్నవనియు నీక్రిందిరీతిని తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడి యున్నది. పై సందర్భమునుబట్టి శ ష స లును ననుస్వార విసర్గాదులును నల్పప్రాణములె యని తేలుచున్నది.

"మధ్యే హకారః" (తై త్తి- ౧ అధ్యా -౬ సూ).

"సంవృత వివృతయో ర్మధ్యే" = మధ్య ప్రకారే, యః శబ్దః క్రియతే స హకార సంజ్ఞో భవతి (త్రిభాష్యరత్న వ్యాఖ్య).

"హకారో హ చతుర్థషు" (తై త్తి ౧ అధ్యా. ౯ సూ).

"హశ్చ చతుర్థాశ్చ హ చతుర్థాః, తేషు హకారాఖ్యః ప్రయత్నః అను ప్రదానం భవతి. హ చతుర్థా ఘోషవత్సు మహాప్రాణా ఇతరే అల్ప ప్రాణాః. (శ ష స విసర్గాదు లల్పప్రాణములనుట యుచ్చారణానుభవము నకు సరిగనే యున్నది).

"భూయాన్ ప్రథమేభ్యోఽన్యేషు" (తై త్తి - ౧ అ. ౧౧ సూ.) "సాన్నిధ్యా చ్ఛ్వాస ఇతి లభ్యతే. ప్రథమేభ్యః అన్యేషు అఘోషేషు శ్వాసః భూయాన్ = అధికః, భవతి" (త్రిభాష్యరత్న వ్యాఖ్య.)

"తతశ్చ ప్రథమా అల్పప్రాణా అఘోషేషు; ఇతరేతు మహాప్రాణాః తదుక్తం శిక్షాయామ్.........మహతి వాయా మహాప్రాణాః అల్పేవాయా వల్పప్రాణాః, ఇతి" (వైదికాభరణ వ్యాఖ్య).

(౧౫౫) మహాప్రాణ శ్వాస నాదములను మాత్రమె శ్వాసములు నాదములు నని వాడుటయు నల్ప ప్రాణశ్వాస నాదములను నీషచ్ఛ్వాసములు నీషన్నాదములు నని వాడుటయుఁ, గొందఱకు సమ్మతమై యున్నది.

"అమోనునాసికా నహ్రౌ । నాదినో హ ఝషః స్మృతాః ।
ఈషన్నాదా యణ్ జశశ్చ । శ్వాసినస్తు ఖఫాదయః ॥
ఈషచ్ఛ్వాసాం శ్చరో విద్యా । ద్గోర్ధా మైత త్ప్రచక్షతే." (గోః= వాక్కు- యొక్క- ధామ =స్థానము = వ్యాకరణము) (పాణినీయశిక్ష).

(౧౫౬) పయివిషయములనె పాశ్చాత్య పండితులును సంగ్రహించుకొని రనఁదగును.

నిశ్వాసము వెడలెడి వాయుమార్గమున (Larynx)నర్ధచంద్రాకారము లగు రెండు చర్మము లుండుననియు(Vocal chords)నాదవర్ణోచ్చారణేచ్ఛ గల్గు నపు డాచర్మములు మీఁదికి లేచుటచేతఁ దచ్చర్మాగ్ర సంయోగమున నిశ్వాసము నిరోధింపఁబడుననియు, నట్టియెడల నిశ్వాసము వానిసంధిని భేదించుకొని పోవునపుడు నాదము జనించుననియు, నచ్చుల నుచ్చరించు నపు డట్టి చర్మాగ్రకంపజ మగు నాదమందు కంపముల సంఖ్యయొక్క న్యూనాధికత్వములచేత నుదాత్తాది స్వర భేదములు గల్గుననియు, నిఁక శ్వాసవర్ణోచ్చారణేచ్ఛ గల్గునపు డట్టి చర్మాగ్రములు వికాసమునందక తటస్థము లై యుండుటచేత నిశ్వాసము నిర్నిరోధముగ వెడలుననియు, నప్పుడు శ్వాసరూపముననె వర్ణోత్పత్తి యగుననియుఁ బాశ్చాత్య పండితులు చెప్పుచున్నారు. ప్రాచ్య పండితులు చెప్పెడి కంఠవివరమె పాశ్చాత్య పండితులు చెప్పుచున్న చర్మముల (Vocal chords) వివరముగా గ్రహించునపుడు వారియభిప్రాయము లందు భేద మగపడనేరదు.

(౧౫౭) నిశ్వాసము కంఠవివరమునుండి వెడలి మూర్ధమును దాఁకి వక్త్రమునఁ బ్రవేశించునని (సోదీర్ణో మూర్ధ్న్యభిహతో, వక్త్ర మాపద్య మారుతః) యీవఱకు వ్రాయఁబడియున్నది. (౧౪౨ వి.) ఈ విషయమునఁ బాశ్చాత్య పండితులు భిన్నాభిప్రాయులై యున్నారనియు, నందుఁ బాశ్చాత్య పండితుల యభిప్రాయమె యుక్తతరముగ నున్నదనియు నీక్రిందిరీతిని నాధునిక ప్రాచ్యపండితులు చెప్పుచున్నారు.

"మనవారి యభిప్రాయము చొప్పున మొదట మూర్ధపర్యంతము గాలి వెళ్లి మరలునపుడు మూర్ధసన్నికృష్టమగు నాసాద్వారమునకుఁ బోకుండుటకుఁ గారణము కాన్పింపదు. అటులు పోయిన ననునాసిక నిరనునాసిక విభాగము సిద్ధింపదు. మఱియు మూర్ధపర్యంతము వెళ్లినగాలి మరలి పేటికా వివరమునకు వచ్చునపుడు ముఖనాసికాద్వారములు సన్నికృష్టములు కావున నటులు ప్రసరించినచోఁ బేటికా వివరమున కధోభాగమున నున్న వాయు మార్గమునందుఁ గల్గెడు శ్వాసనాద విభాగమున కవకాశ ముండదు. కావున నిటఁ బాశ్చాత్యులరీతియె సమంజసమని యనవచ్చును" (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ౭ సంపుటము, చెన్నపురి విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారము, ౨౫౧ పుట).

పరిశీలింపఁగా నీవిషయమునఁ బ్రాచ్య పాశ్చాత్య పండితుల కభిప్రాయ భేదమున్నట్లగపడదు. చర్మాగ్రములనుండి వెడలెడి నిశ్వాసము పేటికాకారమగు వివరమునఁ (Pharynx) బ్రవేశించుననియు, నట్టి పేటికా కారమగు వివరమున కధోభాగమున వాయుమార్గమును నాహారమార్గమును ననెడి రెండు మార్గము లున్నవనియు, నచట నొక మాంసఖండ (Epiglottis) మున్నదనియు, నయ్యది యభ్యవహార సమయమున వాయుమార్గమును నిరోధించుననియు నట్లే యాపేటికాకార వివరమునం దూర్ధ్వమున ముఖనాసా మార్గములు రెండు గలవనియు నచటను నొక మాంసఖండ (Uvula) మున్నదనియు, నయ్యది కేవలోచ్ఛ్వాస నిశ్వాస గమనాగమన సమయములందును ననునాసిక వర్ణోచ్చారణ సమయములందును, దటస్థముగ నుండుననియు, నిరనునాసిక వర్ణముల నుచ్చరించు నిచ్ఛ గల్గునపుడు నాసామార్గమును గప్పుననియు, నట్టివిధానము లేనపుడు ముఖనాసామార్గములు రెంటను నిశ్వాసము ప్రసరించునుగాన ననునాసిక వర్ణములు జనించుననియుఁ బాశ్చాత్య పండితులు చెప్పుచున్నారు. ప్రాచ్య పండితులు చెప్పిన "మూర్ధన్యభిహతః" అనుదానిచే నుద్దేశింపఁబడిన మూర్ధము పాశ్చాత్యపండితులు చెప్పెడి పయి నుదాహరించిన పేటికాకార వివరమునకుఁ దిన్నగా మీఁద నుండెడి భాగమే కాని వేఱుకాదు. కావున వాయుమార్గమున మీఁదికిఁ బ్రవహించెడి నిశ్వాసము పేటికాకార వివరోర్ధ్వభాగమును దాఁకియె యా ప్రక్కనున్న ముఖ నాసామార్గములలోనికిఁ బోవుట సహజమగుటచేత నచట 'మూర్ధన్యభిహతః' అని చెప్పుట స్వభావోపన్యాసమే కాని వేఱుకాదు. కావున నచటఁ బ్రాచ్య పాశ్చాత్యపండితుల కభిప్రాయభేద మేమియు లేదు. శ్వాసనాదాన్యతర రూపము నందిన నిశ్వాసమే మూర్ధమును దాఁకి తోడనే ముఖ నాసామార్గములం జొచ్చునుగాన మూర్ధాభిఘాత పక్షమున శ్వాస నాదాన్యతరరూప సంభవమునకుఁ బ్రతిబంధ మేమియులేదు. సానునాసిక నిరనునాసికోచ్చారణేచ్ఛా భేదములనుబట్టియే యచటి మాంసఖండము మూలమున నాసామార్గ పిధాన తదభావములు సంభవించును గానఁ దద్విషయమునందును ననుపపత్తి లేదు.

(౧౫౭) వ్యాఖ్య. నన్నయాథర్వణులు వర్ణోత్పత్తి స్థానములను జెప్పియుండమింజేసి యిటఁ బాణినీయ శిక్షావచనములు మూలముగ గ్రహింపఁబడినవి. కణ్ఠ్యా విత్యాది:—

శ్లో. కంఠ్యా వహా విచుయశా । స్తాలవ్యా ఓష్ఠజా వుపూ ।
స్యు ర్మూర్ధన్యా ఋటురషా । దంత్యా ౡ తులసా స్స్మృతాః ।
జిహ్వామూలేతు కుః ప్రోక్తో । దంతోష్ఠ్యో వః స్మృతో బుధైః ।
ఏఐతు కంఠతాలవ్యా । వోఔ కంఠోష్ఠజౌ స్మృతౌ ।
అనుస్వారయమానాంచ । నాసికా స్థాన ముచ్యతే ।
అయోగవాహా విజ్ఞేయా । ఆశ్రయస్థానభాగినః ॥

(పాణినీయశిక్ష)

---

అహౌ = అవర్ణ హకారములు, కణ్ఠ్యౌ=కంఠస్థాన భవములు. స్యుః= అగుచున్నవి. ఇచుయశాః = ఇవర్ణమును, 'చ' వర్గమును, (ఉకారముతోఁ బలుకఁబడిన వర్గాద్యక్షరములు తత్తద్వర్గములకు సంజ్ఞ లగును) యకార శ వర్ణములును, తాలవ్యాః = తాలుస్థాన భవము లగుచున్నవి. ఉపూ=ఉవర్ణ మును, 'ప' వర్గమును, ఓష్ఠజౌ = ఓష్ఠస్థానభవము లగుచున్నవి. ఋటు రషాః = ఋ వర్ణమును, 'ట' వర్గమును రేఫ షకారములును, మూర్ధన్యాః = మూర్ధస్థానభవము లగుచున్నవి. ౡ తులసాః = ౡ వర్గమును, 'త' వర్గమును లకార సకారములును, దంత్యాః = దంతస్థాన భవము లగుచున్నవి. కుః = కవర్గము, జిహ్వామూలేతు = జిహ్వామూలమునం దగు నని, ప్రోక్తః = చెప్పఁ బడినది. వః = వకారము దంతోష్ఠ్యః = దంతోష్ఠ స్థానద్వయభవ మని, [పాణినీయ శిక్షలోని యీ శ్లోకమున 'దంతోష్ఠ్యః' అనియే ముద్రితమై యున్నది. అట్లయినను వేర్వేఱుగ దంతములందును నోష్ఠములందును జనించు నపుడే దంతోష్ఠ్య మన వలెననియు రెండిటి మొత్తమున నేకముగ జనించు నపుడు దంతోష్ఠ్య మనవలెననియు నీ ద్విస్థానికములగు వకారాదులు (చే, జే, వ, ఏ, ఐ, ఓ, ఔ) స్థానద్వయమునందును నేకముగా జనించునేకాని ప్రత్యే గముగ స్థానద్వయముచే వేర్వేఱుగఁ బలుకఁబడనేర వనియు, నిక్రింది వాచ స్పత్య కోశపంక్తులనుబట్టి విశదమగు చున్నది. "దంతోష్ఠ్యో వ ఇత్యాదా ఉభ యో రేవ వకారస్య స్థానత్వమ్. నతు ప్రత్యేకస్య. తథాసతి దంతోష్ఠ్యతా పరిశిష్యేత. అత స్తస్య దంతౌష్ఠ భవకార్య భాక్త్వమ్" వాచస్పత్య కోశము ౧౬౦౦, పుట. వ్యంజన వర్ణ విభాగాది సందర్భము] బుధైః - పండితులచేత, స్మృతః - చెప్పఁబడినది. ఏఐతు = ఏకా రై కారములు, కంఠతాలవ్యా = కంఠతాలు స్థానద్వయ భవములని, స్మృతౌ = చెప్పఁబడినవి. ఓఔతు = ఓకా రౌకారములు, కణ్ఠోష్ఠజౌ = కంఠోష్ఠస్థానద్వయ జాతములని చెప్పఁ

బడినవి. అనుస్వార యమానాం చ = అనుస్వారమునకును, యమములకును, నాసికా = నాసిక, స్థానమ్ = స్థానమని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. అయోగవాహాః = అనుస్వార విసర్గ జిహ్వామూలీ యోపధ్మానీయములు (అ+యోగ+వాహాః = అవర్ణాదుల యాశ్రయముచేత వ్యక్తి నందునవి) ఆశ్రయ స్థానభాగినః = తా మాశ్రయించిన వర్ణముయొక్క స్థానముకల వగుచున్నవి.

(౧౫౯) ఇంతకుమున్ను బాహ్య ప్రయత్నములు చెప్పఁబడినవి. ప్రకృతకారికలచేత నాభ్యంతర ప్రయత్నములు చెప్పఁబడుచున్నవి. వక్త్రమునకు బహిర్భాగమున జరపఁబడు ప్రయత్నములు బాహ్యప్రయత్నములని యీవఱకుఁ జెప్పఁబడియెను. వక్త్రాభ్యంతరమున ననఁగా వక్త్రమధ్యమున జరపఁబడు ప్రయత్న మాభ్యంతర ప్రయత్న మనఁబడును. అయ్యది యస్థిత స్థానకరణ స్పర్శనాది రూపమై (౧౬౮. ౧౬౫ వి.) యుండును. ఇచట ప్రసంగవశమున వక్త్రస్వరూపము దిఙ్మాత్రముగ విశదీకరింపఁబడుచున్నది.

(౧౬౦) పేటికాకారమగు గళ వివరమున కూర్ధ్వభాగమున నొక ప్రక్కను ముఖనాసాబిలములు గలవని యీవఱకు వ్రాసియున్నాను. అట్టి ముఖబిలము నారంభమున నున్న కాలక మనఁగాఁ గొండనాలుక మొదలుగ నోష్ఠముల వఱకుఁ గలభాగము వక్త్రమనిపించుకొనును. అందలి జిహ్వయొక్క మొదటి భాగము జిహ్వామూల మనఁబడును. దానికి మీఁదుగా నున్న శిరోభాగము హనుమూల మనఁబడును. దీనికి విపరీతముగ సైతము వాడుక గలదు. "హనుమూలే జిహ్వామూలేన కవర్గే స్పర్శయతి" తైత్తి. ౨ అధ్యా. ౩౫ సూ.) (౧౭౭ వి.) 'జిహ్వామూలీ యానుస్వారా హనుమూలేన' (శుక్లయజుః ప్రా. ౧ అధ్యా. ౮౩ సూ.) (౧౭౭ వి.) "ఋకా రల్కారా వథ షష్ఠ ఊష్మా జిహ్వామూలీయాః ప్రథమశ్చ వర్గః" (ఋగ్వేదప్రా. ౧ పటల. ౮ సూ.) (౧౭౭ వి.) జిహ్వామూలము మొదలుగ నోష్ఠముల వఱకు నున్న వక్త్రమున కిరుపార్శ్వముల నావరించియున్న దౌడల భాగమునకు హనువు లని పేరు. జిహ్వకు మీఁదుగా నుండెడి శిరోభాగమెల్లఁ దాలు వనఁబడును. అందలి గోళాకారమగు తాలు భాగము మూర్ధ మనఁబడును. తర్వాతి తాలుభాగమునె తాలు వందురు. తాలువునకు దిగువను దంతమూలమునకు మీఁదుగను నుండెడి ప్రదేశము వర్త్స్య మనఁబడును. దానికిమీఁదుగను తాలువునకు దిగువుగను నుండెడి చోటు బర్స్వ మనఁబడును. [('రేఫం వర్త్స్యమేకే' ప్రాఙ్గద వ్యాఖ్య:—వర్త్స్యశబ్దేన దన్తమూలా దుపరిష్టా దుచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే.

(ఋగ్వేద=౧ పటల, ౧౮ వి.) "ఉపసంహృతత రేవ జిహ్వాగ్ర మృకార ల్కారేషు బర్స్వే షూపసంహరతి" - (తైత్తి. ౨ అధ్యా. ౧౮ సూ.) (౧౭౭ వి.) - "బర్స్వోనామ రేఫ టకారస్థానయోః మధ్యప్రదేశః-" (వైదికాభరణ వ్యాఖ్య)] దంతముల మొదటిభాగమునకు దంతమూలమని పేరు. తర్వాత దంతములును దర్వాత నోష్ఠములును గలవనుట విదితమె. అభ్యంతర ప్రయత్న వివరణ సందర్భమునఁ బయివిషయములకుఁ బ్రమాణములు విశదము లగును.

తాలుశబ్దమునకు దౌడ యర్థమని కొన్నికోశములలోఁ వ్రాయఁబడి యున్నది.

"తాలువు - సం=వి-ఉ. న. దవుడ, కాకుదము" "కాకుదము=సం వి-అ-న. తాలువు -దౌడ" "దౌడ-దే-వి-బుగ్గలోపలి భాగము; తాలువు. సీ. ఆరేయికడ నెల్లవారును గోఁజదా, డలును నల్లని మేను గల నెలంత...(భార. వరాన ౧ ఆ) (శబ్దరత్నాకర కోశము)." "తాలు. ఉ న-కాకుదమ్. తె-నోటి లోపలి దౌడ" "కాకుదము-అ-న-తాలు, తె-నోటి లోపలి దౌడ." (సర్వశబ్ద సంబోధినీ కోశము) ఇట్టి వ్రాఁతలకు మూలము లింగాభట్టీయమె యనఁదగును- "తాలుతు కాకుదమ్" (అమరకోశము. ద్వితీయ కాండము. మనుష్యవర్గము, ౯౧ శ్లో.) "తలతి=ప్రతితిష్ఠతి జగ్ధ (దగ్ధ - తప్పు) శేష మత్రేతి." తాలు. ఉ-న- తల ప్రతిష్ఠాయామ్. భుక్తశేషము దీనియందు నిలుచును. నకారాంతంబును గలదు. "౧.కాకు ధ్వనివిశేషం దదాతీతి కాకుదమ్. దా-దానే. కాకు ధ్వని నిచ్చునది. ౨. దౌడపేళ్ళు" (లింగా భట్టీయ మనెడి గురుబాలప్రబోధిక, ౪౦౬ పుట).

భుక్తశేషము దీనియందు నిల్చునని యర్థము వ్రాయుటచే లింగాభట్టుగారికి 'తాలుకాకుద' శబ్దములకుఁ బుగ్గలలోపలి భాగమనెడి శబ్దరత్నాకరార్థమె యభిప్రేత మనక తీరదు. బుగ్గలోపలి భాగము (కాకు) ధ్వని నిచ్చున దెట్లగునని తలంపఁబడెనో తెలియకున్నది. ప్రామాణికములగు ప్రాతిశాఖ్యములందును, వాచస్పత్యాది కోశములందును దాలు వనఁగాఁ బైని వివరించిన మూర్ధోపరిభాగమగు తాలువనియె తలంపఁబడెను. ఇట్టిస్థితిలో నీ గురుబాల ప్రబోధికా కారుఁ డీ యపార్థము నేల వ్రాసెనని పరిశీలింప వలసి యున్నది. అరయనరయ నిందుల కమరకోశోద్ఘాటన మనఁబడు క్షీరస్వామికృత వాఖ్య మూలము కానోపునని తోఁచుచున్నది. "తలత్యాహారో

స్మిం స్తాలు'' "ఈషత్కవతే, కాకుం దదాతి వా కాకుదమ్'' (క్షీరస్వామికృతా మరకోశోద్ఘాటనము). దీనిని జూచియు, 'తల ప్రతిష్ఠాయమ్.' అనుధాతువు నర్థమును దలంచియు నాహారము తాలువున నెట్లు నిల్చునని యాలోచించి కావలయును 'ఆహారమ్' అను దానికి భుక్తశేషాహారపరముగా లింగాభట్టుగా రర్థముచేసి యుందురని తోఁచుచున్నది. కాని క్షీరస్వామి వ్యాఖ్య కిట్టి యర్థమును జేయ నక్కఱలేదు. నమలిన యాహారము జిహ్వామూలము మీఁదుగాఁ గంఠబిలమునఁ బ్రవేశించుటకు ముందట్టి తాలవును సంబంధించి యున్న జిహ్వాపయినె నిల్చును గాన నట్టి యర్థమునె క్షీరస్వామి యుద్దేశించి యుండవచ్చును. ఇంక నిట నిట్టి సందేహమేల యని వాచస్పత్యాది కోశకర్తలీ క్షీరస్వామికృతవ్యుత్పత్తినే యుపేక్షించి 'తరన్త్యనేన వర్ణా ఇతి తాలు' అను వ్యుత్పత్తిని జూపసాగిరి. ఈ వ్యుత్పత్తి తాలుశబ్ద పర్యాయమగు కాకుదశబ్ద వ్యుత్పత్తికి సరియగుచు నెంతయు యుక్తముగా నున్నది.

"తాలు-క్లీ. (తరన్త్యనేన వర్ణా ఇతి-తౄ+త్రోశ్చలః.' ఉణాది-౧-౫. ఇతి ఞుణ్. రస్య లశ్చ.) జిహ్వేంద్రియాధిష్ఠానమ్. యథా భాగవతే, 'ముఖతస్తాలు నిర్భిన్నం। జిహ్వా తత్రోపజాయతే......'' "కాకుదమ్, క్లీ (కాకుం దదాతీతి-కాకు+దా+క) తాలు ఇత్యమరః. ౨-౬-౯౧.'' (శబ్ద కల్పద్రుమ కోశము).

"తాలు. న.తరన్త్యనేన వర్ణాః. తౄ - ఞుణ్. రస్యలః. జిహ్వేంద్రియాధిష్ఠానే. (తేలో) స్థానభేదే. 'ముఖతస్తాలు నిర్భిన్నం। జిహ్వా తత్రోపజాయతే...(భాగ)... తాలుని చైక మస్థి, తచ్చ కపాలాకారమ్.'' "కాకుద-న. కాకుం దదాతి-దా + క. తాలుని అమరః. తాలునా కాకూచ్చారణాత్ తస్య తథాత్వమ్...'' (వాచస్పత్య కోశము).

"తాలు. N (తరన్త్యనేన వర్ణాః. తౄఅణ్. (ఉణ్?) రస్య లః cfun 1-5) The palate "తృషా మహాత్యా పరిశుష్కతాలవః...'' కాకుదమ్- "The palate'' (ఆప్టీ కోశము.)

పయి సందర్భమునుబట్టి తాలు శబ్దమునకు బుగ్గల లోపలి భాగ మర్థము కాదనియు, మూర్ధభాగమే యర్థమనియు విశదమగుచున్నది గదా. నాలుక యొక్క మధ్యభాగము తాలువునకుఁ దాఁకుటచేత 'చ' వర్ణము జనించుచున్నదనేడి ప్రాతిశాఖ్యములచేత (వి ౧౭౯) సయితము తాలు శబ్దమునకు మూర్ధోపరి భాగ మర్థ మనియే విశదమగుచున్నది గదా.

పయిరీతి నున్న ప్రామాణికుల యభిప్రాయముల నాలోకింపకయె యాధునిక వైయాకరణులు సయితము శబ్దరత్నాకరాదుల మాత్రమె చూచికొని తాలుశబ్దమునకు దౌడ లర్థమని ప్రామాదికముగా వ్రాసి యున్నారు.

“ఇ ఈ ఎ ఏ” అను నీయచ్చులతోఁ గలిసిన ‘చ, జ’ అనునవి తాలవ్యములు. (దౌడల సాహాయ్యమున నుచ్చరింపఁబడునవి) (బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక. బాల. సంజ్ఞా ౮ సూత్రపు వ్యాఖ్య. ౫ పుట).

తాలవ్యములను బలుకు నప్పుడు దౌడలు కదలును గాన వాని సాహాయ్యము సైతముండుటచేఁ బైయాధునిక కృతార్థము సమర్థించికొనవచ్చు ననుటకును వీలులేదు - తాలవ్యములనే కాక మోష్ఠ్యాదీతర వర్ణములను బలుకునపుడును దౌడల కదలిక యుండునుగదా. మఱియుఁ దాలువును జిహ్వామధ్యము తాఁకుటచే జనించుటవల్ల ‘చ’ వర్గమునకుఁ దాలవ్యత సార్థకమై యుండఁగా వానియుచ్చారణమున దౌడలు కదలును గాన నవి తాలవ్యములనియు, నక్కారణమునఁ దాలువనఁగా దౌడయనియుఁ జెప్పుట యుక్తము కాదుగదా.

౧౬౧—‘అ కు హ విసర్జనీయానాం కణ్ఠః’ అను సిద్ధాంతకౌముదీ వాక్యము కంఠ జిహ్వామూలముల పార్థక్యమును బాటించిన ట్లగపడదు. ఈవిషయమున నాధునిక పండితు లీక్రిందిరీతిని జెప్పుచున్నారు.

“కవర్గము—దీనికి జిహ్వామూలము స్థానము” ‘అకుహవిసర్జనీయానాం కణ్ఠః’ అను సిద్ధాంతకౌముదీగ్రంథమునుబట్టి దీనికిఁ గంఠము స్థానమైనటులు గాన్పించును. కాని యచటఁ (కవర్గవిషయమున) గంఠ మనఁగా జిహ్వామూలమనియే యర్థము. ఇట్లు శేఖరమునందు నిరూపింపఁబడినది” (ఆంధ్ర.సా.పరి. పత్రిక-౭ సంపుటము చెన్నపురి విశ్వ. పుస్తకభాండాగారము. వర్ణోత్పత్తి).

‘హనుమూలే జిహ్వామూలేన స్పర్శయతి’ (తైత్తి. ౨ అధ్యా. ౧౫ సూ.) ‘కణ్ఠస్థానౌ హకార విసర్జనీయౌ’ (తైత్తి. ౨ అధ్యా. ౪౬ సూ.) అనియిట్లు కవర్గమునకును హకార విసర్గములకును విభిన్నస్థానికత్వము తైత్తిరీయ ప్రాతిశాఖ్యమున వక్కాణింపఁబడెను. మఱియు నీ ప్రాతిశాఖ్యము ‘అకారమునకు’ హనువులు స్థానమని చెప్పుచున్నది. — అకారము కణ్ఠ్య మని చెప్పెడి ఋగ్వేద ప్రాతిశాఖ్యము సయితము ‘అ’ వర్ణమును ‘క’ వర్గమును విభిన్నస్థానికములను నుద్దేశముతోనే ‘కణ్ఠ్యోఽకారః’

'ఋకార లృకారా వథసప్త ఊష్మా జిహ్వామూలీయాః ప్రథమ శ్చ వర్గః' (ఋగ్వే. ౧ పట ౮ సూ.) అనియిట్లు 'అవర్ణమును' కంఠ్యముగాను 'క' వర్గమును జిహ్వామూలీయముగాను బృథక్కరించి చెప్పుచున్నది. పాణినీయశిక్షలోని కణ్ఠ్యా వహా వి త్యాది ప్రకృతకారికయందును 'అహలు' కంఠ్యము లనియుఁ గవర్గము జిహ్వామూలీయమనియు ఋగ్వేదప్రాతిశాఖ్యమందు వలెనె చెప్పఁబడియున్నది. అట్లే శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును 'ఋ కౌ జిహ్వామూలే' (శుక్ల. ౧ అధ్యా. ౬౫ సూ.) 'అ హ విసర్జనీయాః కణ్ఠే' (శుక్ల ౧ అధ్యా. ౭౧ సూ.) అనియిట్లు వాని యుత్పత్తిస్థానములకుఁ బార్థక్యమె యంగీకరింపఁబడినది. అహల యుచ్చారణమునందును గ వర్గోచ్చారణమునందును స్థానభేద మనుభవసిద్ధమై యున్నది. కావున 'అ కు హ' ల కేక స్థానికత్వము దుర్ఘట మనకతీరదు.

(౧౬౨)— స్థాన కరణ స్వరూప మచ్చుల కొకరీతిగను హల్లుల కొకరీతిగను జెప్పఁబడియున్నది. ఏ యవయవమునం దవయవాంతరము యొక్క యుపసంహారము సంభవించునో యా యవయవము స్వరములకు స్థాన మనఁబడును. ఏ యవయవ మవయవాంతరమునం దుపసంహరించునో యది స్వరములకుఁ గరణ మనఁబడును. అవర్ణోచ్చారణమున హనువులందు విచాల్యతరములగు నోష్ఠము లుపసంహరించును. కాన 'అవర్ణమునకు' హనువులు స్థానము. ఓష్ఠములు కరణము. ఉపసంహార మనఁగా నుపశ్లేషణము. అనఁగా సమీప స్థితినందుట. పయివిషయమునఁ బ్రాతిశాఖ్యము లిట్లు చెప్పుచున్నవి — "స్వరాణాం యత్రోపసంహార స్తత్ స్థానమ్" (తైత్తి. ౨ అ. ౩౧ సూ.) వైదికాభరణ వ్యాఖ్యః— "స్వరణాం తత్ స్థానమ్. యస్మి న్నవయవే అవయవా న్తరస్య ఉపశ్లేషః క్రియతే, యథా హనూ అవర్ణస్య. తత్రహి విచాల్యతరా ఓష్ఠా ఉపసంహ్రియేతే ... ...

"య దుపసంహరతి త త్కరణమ్" (తైత్తి-౨ అధ్యా ౩౨ సూ.) వైదికాభరణవ్యాఖ్య— "యదఙ్గ మఙ్గాన్తరే వక్త్రా ఉపసంహ్రియతే తత్ స్వరణాం కరణమ్ - యథా ఓష్ఠా వ వర్ణస్య"

(౧౬౩)— ఏ యవయవమునం దవయవాంతరముయొక్క స్పర్శము కలుగునో యాయవయవము హల్లులకు స్థానము. ఏయవయవ మవయవాంతరమును స్పృశించునట్లు చేయఁబడునో యా యవయవము హల్లులకుఁ గరణము. చవర్గోచ్చారణమునఁ దాలువు మధ్యమునందు జిహ్వామధ్యము

యొక్క స్పర్శము సంభవించును. కావున 'చ' వర్గమునకు స్థానము తాలువు. జిహ్వామధ్యము కరణము. ఈవిషయము లీక్రింది రీతిని ప్రాతిశాఖ్యము లందుఁ జెప్పఁబడి యున్నవి.

"అన్యేషాం తు యత్ర స్పర్శనం తత్ స్థానమ్" (తైత్తి. ౨ అధ్యా. ౩౩ సూ.) వైదికా— "స్వరేభ్యోఽన్యేషాం వ్యంజనానాం తత్ స్థానమ్, యత్ర స్పర్శనం క్రియతే, యథా హనుమూలం కవర్గస్య......... ఉత్తరోష్ఠః పవర్గస్య......ఊష్మాదిషు తు స్పర్శనాభావాత్ అతిదేశాదినా స్థానావగతిః."

"యేన స్పర్శయతి తత్ కరణమ్" (తైత్తి. ౨ అధ్యా ౩౪ సూ.) వైదికా:—"వ్యఞ్జనానాం తత్కరణమ్, యేనాంగేన స్థానం స్పర్శయతి యథా జిహ్వా కవర్గాదీనాం చతుర్ణాం వర్ణానాం, య ర ల వానాం చ, అధరోష్ఠం పవర్గ వకారయోః. ఊష్మాదీనాం తు కరణావగతి ర్వక్ష్యతే"

(౧౬౪)—పయిరీతిని స్థానకరణ స్పర్శనరూప ప్రయత్న మాత్రమె వర్గాక్షర విశేషోత్పత్తికిఁ గారణమని చెప్పఁబడినను నట్టిసందర్భమున నిశ్వాస మప్పటి స్పర్శమును విడఁగొట్టుకొని పైకి వచ్చుట సహజమె యగుట చేతఁ బాశ్చాత్య పండితులు చెప్పెడి విశ్లేషముకూడఁ బ్రాచ్యపండితులకు సమ్మతమె యనఁదగును. కాని యీ విషయమున నాధునిక ప్రాచ్యపండితు లీ క్రింది విధమున వ్రాసి యున్నారు.

"పాశ్చాత్య పండితులు స్థానకరణ సంయోగానంతరమందు విభాగ ముండవలయునని చెప్పిరి. మనవారు చెప్పలేదు. ఇచ్చట నుచ్చారయితల యనుభవమె ప్రమాణము. సజాతీయవర్ణసంయుక్త తత్తద్వర్ణోచ్చారణ స్థలమునందుఁ బూర్వవర్ణోచ్చారణమున విభాగమున్నటులు గాన్పింపదు. కావున విభాగమునకు నిమిత్తము సందిగ్ధముగ నున్నది. "(ఆంధ్రసాహిత్య పరి. ౭ సంపు. ౨౫౬ పుట చెన్నపురి విశ్వ. పుస్త.) తాల్వాదులను జిహ్వామధ్యాదులు తాఁకియే యున్న యెడల నిశ్వాసము పైకివెడల నేరదుగాన ధ్వన్యుత్పత్తియే కలుగఁ బోదు. ఇంతియకాక, బాహ్యప్రయత్న సిద్ధమై నిశ్వాసమునం దావేశించియున్న శ్వాసనాద భేదము వర్ణములందు సంక్రమింప నేరదు 'క్క' మొదలగు ద్విరుక్తస్థలములందు రెండువర్ణములు వేర్వేఱుగా నున్నవనుట యనుభవ విరుద్ధము. అట్టి వర్ణముయొక్క యుచ్చారణమున ద్విగుణ ప్రయత్న ముండునని మాత్రమె యెన్నఁదగును.

అట్టి ద్విరుక్త వర్ణోచ్చారణమున గాఢస్పర్శమును బటుతర విశ్లేషమును సంభవించును. కావునఁ గేవలస్పృష్టముల యుచ్చారణమున స్పర్శానంతర భావి విశ్లేషమే లేదనుటగాని ప్రాచ్యపండితుల కిట్టి సహజస్థితి యసమ్మత మనుటగాని సరికాదు. ఇంతయేల! యీక్రింది ఋగ్వేద ప్రాతిశాఖ్య గ్రంథ మునుబట్టి శౌనకుఁ డట్టివిశ్లేషమును వర్ణించియు నున్నాఁడని విశదమగుచున్నది.

"స్పృష్ట మస్థితమ్" (ఋగ్వేదప్రా. ౧౩ పట. ౯ సూ.)

పార్షదవ్యాఖ్య. "స్పృష్టం కరణం (అను ప్రదానమ్) స్పర్శానామ్." పరిశేషాత్తు దస్థితం వేదితవ్యమ్. అస్థితమితి యత్ర వర్ణస్థాన మాశ్రిత్య జిహ్వా న సంతిష్ఠతే త దస్థిత మిత్యుచ్యతే."

వర్గాక్షరములకుఁ గల స్పృష్ట ప్రయత్న మస్థితమె యగును. అనఁగా జిహ్వా తాల్వాది స్థానమును స్పృశించెడి స్పర్శము నిల్చునది కాదని యర్థము. అట్టి స్పర్శము నిశ్వాసముచే విడఁగొట్టఁబడును గాన నయ్యది యస్థిత మని పించుకొను నని తాత్పర్యము. ఇంక స్వరములయొక్కయు నూష్మముల యొక్కయు నుచ్చారణమున నట్టిస్పర్శ మక్కఱ లేదుగాన నట్టి యెడల జిహ్వా యుచ్చారణ కాలమునందలి స్థితినుండి మార్పునందదు. కావున నచటి యస్పృష్ట ప్రయత్నము మాత్రమె స్థిత మనిపించుకొను ననియు నీక్రిందిరీతిని శౌనకుఁడు సూత్రించి యున్నాఁడు.

"స్వరానుస్వారోష్మణా మస్పృష్టం స్థితమ్" (ఋగ్వేద ప్రా. ౧౩ పట ౧౧. సూ.)

పార్షదవాఖ్య. "స్వరాణా మనుస్వారస్య ఉష్మణాం చాస్పృష్టం స్థితం వేదితవ్యమ్, యత్రవర్ణస్థాన మాశ్రిత్య జిహ్వా అవతిష్ఠతే తత్ స్థిత మిత్యుచ్యతే." (ఋగ్వే-౭౯౯ పుట.)

(౧౬౫) పయిని వ్రాయఁబడిన యాభ్యంతర ప్రయత్నములు నాలుగు విధములు. వర్గాక్షరముల ప్రయత్నము స్పృష్టము. అంతస్థముల ప్రయత్న మీషత్ స్పృష్టము. ఊష్మములకును స్వరములకును బ్రయత్నము వివృతము. (ఏ ఓ ల ప్రయత్నము వివృతతరము. ఐఔల ప్రయత్నము వివృత తమము.) హ్రస్వాకా రోచ్చారణమునందలి ప్రయత్నము మాత్రము సంవృతము. ఈ విషయ మీక్రిందిరీతిని వ్రాయఁబడి యున్నది.

యత్నో ద్విధా—ఆభ్యంతరో, బాహ్య శ్చ. ఆద్య శ్చతుర్ధా:—స్పృష్టేషత్ స్పృష్ట వివృత సంవృత భేదాత్, తత్ర స్పృష్టం ప్రయత్నం స్పర్శా

నామ్, ఈషత్ స్పృష్ట మన్తస్థానామ్, వివృత మూష్మణాం స్వరాణాం చ, హ్రస్వ స్యావర్ణస్య ప్రయోగే సంవృతమ్. ప్రక్రియా దశాయాం తు వివృత మేవ." (సిద్ధాంతకౌముది. సంజ్ఞాప్రకరణము.)

"స్పృష్టి మస్థితమ్." (ఋగ్వేద ప్రా. ౧౩. పట. ౯ సూ.)

పార్షదః—స్పృష్టం కరణం స్పర్శానామ్... .. ...

"దుఃస్పృష్టం తు ప్రాగ్ఘకార చతుర్ణామ్." (ఋగ్వే. ౧౩ పట. ౧౦ సూ.) పార్షద వ్యాఖ్య—"దుస్పృష్ట మీషత్స్పృష్ట మిత్యర్థః హకారాత్ ప్రాక్ చతుర్ణాం వర్ణానాం యరలవానామ్"

"స్వరానుస్వారోష్మణా మస్పృష్టం స్థితమ్" (ఋగ్వే. ౧౩ పట. ౧౧ సూ.) పార్షద వ్యాఖ్యః—"స్వరాణా మనుస్వారస్య ఊష్మణాంచ అస్పృష్టం స్థితం వేదితవ్యమ్... ..." ఋగ్వేద ప్రాతి. ౭౯ పుట.)

"శిక్షాయాం చ స్మర్యతే, వివృత మూష్మణాం స్వరాణాంచ, సంవృత మకారస్య ఇతి." (వైదికాభరణ వ్యాఖ్యా. తైత్తిరీయ ప్రాతి. ౭౩ పుట.)

(౧౬౬) ఈ స్పృష్టాది ప్రయత్నములును వీనివలనఁ గల్గిన స్పర్శాది సంజ్ఞలును నర్థవంతములై యున్నవి.

అచ్చుల యుచ్చారణమునందు జిహ్వాది భాగములు తాల్వాదిస్థానముల నించుకేని స్పృశింపక సన్నిహితములై మాత్ర ముండుటచేత నపుడు వక్త్రము వివృతమై (తెఱవఁబడి) యుండునుగాన నట్టి స్వరోచ్చారణ ప్రయత్నమునకు వివృతసంజ్ఞ కల్గినది. సంధ్యచ్చుల (ఏ, ఓ, ఐ ఔ) యుచ్చారణమున వక్త్ర మధికముగాఁ దెఱువఁబడును గాన నట్టివాని ప్రయత్నములకు వివృతతరాది సంజ్ఞలు కలిగినవి. హ్రస్వాకారోచ్చారణమున నోష్ఠహనువులు నాతి సంవృతములై యుండునుగాన నట్టి ప్రయత్నమునకు సంవృత సంజ్ఞ కలిగినది.

వర్గాక్షరముల యుచ్చారణమునఁ దాల్వాది స్థానములను జిహ్వాదుల భాగములు స్పృశించును గాన నట్టిప్రయత్నము స్పృష్ట మనిపించుకొనుచున్నది. అట్టిప్రయత్నమున జనించెడి వర్ణములును స్పర్శము లనిపించుకొనుచున్నవి.

(౧౬౭) అంతస్థముల యుచ్చారణమునఁ దాల్వాది స్థానములను జిహ్వాదులభాగము లించుక స్పృశించునుగాన నట్టిప్రయత్నమున కీషత్

స్పృష్టసంజ్ఞ గలిగినది. మఱియు సంశ్లేష్టములు నాల్గిటి యుచ్చారణము నందును జిహ్వాదుల యంతములే తాల్వాదిస్థానములను స్పృశించునుగాన (౧౭౯. వి.) నట్టిప్రయత్నమున జనించిన వర్ణములకు 'అంతస్థ' సంజ్ఞ కలిగినది. ఈ విషయమున నభిప్రాయభేదములు గలవు. ఆధునికు లీవిషయమున నీక్రింది రీతిని జెప్పుచున్నారు.

"స్పర్శములకును (కకారాది మకారాంతవర్ణములకును) నూష్మములకును (శ ష సాదులకును) మధ్యమునఁ బఠింపఁబడుటచేత వీని కంతఃస్థములను పేరువచ్చినది." 'స్పర్శోష్మణా మన్తర్మధ్యే తిష్ఠన్తీతి అన్తఃస్థాః' (ఋగ్వేద ప్రాతిశాఖ్యము. పార్షద వ్యాఖ్య. ౨౮ పుట.) (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. ౭ సంపుట. చెన్న. విశ్వ. పుస్త. ౨౫౩ పుట.)

"అంతఃస్థములు:— ఉచ్చారణమున నచ్చులకును స్పర్శములకును నడుమ నుండుటచేతఁగాని వర్ణసమామ్నాయ మాతృకాపాఠమున స్పర్శలకును నూష్మములకును నడుమ నుండుటచేతఁగాని యంతఃస్థముల కానామము కలిగి యుండును." (ప్రమోదూతవత్సరాశ్వయుజ, భారతి.)

"య ర ల వ లకు నంతఃస్థములని పేరుకలుగుటకుఁ బాశ్చాత్య పండితులు వేఱొక కారణమును జెప్పెదరు. 'ఇ. ఉ. ఋ. ఌ' ఈ యచ్చులు య ర ల వ లుగా మార్పు నొందుటయు, య ర ల వ లు 'ఇ, ఉ, ఋ, ఌ' లుగ మార్పు నొందుటయు సంస్కృతభాషయం దగపడుచున్నందున 'య ర ల వ లు' అజ్ధర్మములు హల్ ధర్మములు గలవి. అట్లు రెంటికిని మధ్యస్థము లగుటచేత నంతఃస్థములని పేరు వచ్చినదని వారు చెప్పెదరు. ఈ కారణమునుబట్టి వీని కీనామము వచ్చినచోఁ దుల్యన్యాయమున 'ఇ, ఉ, ఋ, ఌ' వర్ణములకును నీనామము రావలసి యున్నదని సందేహము పొడముచున్నది." (ఆంధ్ర సా. ౭ సంపుట. చెన్న. విశ్వ. పుస్త. ౨౫౪ పుట.)

పై రీతిని స్పర్శోష్మములకు నడుమ నుండుటచేతనే యాపేరు వానికి వచ్చినచోఁ దుల్యన్యాయమున స్పర్శములకు 'ఆదు' లనియు నూష్మములకు 'అంతము' లనియు సంజ్ఞలు కలుగ వలదా యనియు సందేహము పొడమక మానదుగదా. కావున 'అంతస్థ శబ్దములోఁ బూర్వావయవము 'అంతర్' శబ్దము కాదనియు, నింక 'అంత' శబ్దమనియు గ్రహించుటయె యుక్తమని తోఁచుచున్నది. స్థానములను గరణములు స్పృశించుటచేత స్పర్శసంజ్ఞ వానికిఁ గల్గినదనుట సర్వసమ్మతమగుటంజేసి తదనుకూలముగా జిహ్వాంత భాగములె

యంతస్థములు నాల్గిటి యుచ్చారణమునందును నాయాస్థానములను స్పృశించునుగాన (౧౭౯ విష.) వానికి 'అంతస్థ' సంజ్ఞ కల్గెననుట సంగతముగా నున్నట్లగపడుచున్నది. ఇట్టివ్యుత్పత్తియే వైదికాభరణ వ్యాఖ్య యందే క్రింది రీతిని వ్రాయఁబడి యున్నది.

"ఏవం యకారాదీనాం చతుర్ణాం కరణానాం వ్యాపారనిష్పాద్యత్వా దంతస్థా ఇత్యాఖ్యా" (తైత్తిరీయ. ప్రా. ౨ అధ్యా. ౪౭ సూత్రవ్యాఖ్య)

"జిహ్వామధ్య ప్రభృతీనాం కరణానా మన్తస్థిత్వా ద్యవలా అన్తస్థా ఇత్యాఖ్యాయన్తే" తైత్తి. ౧ అధ్యా. ౮ సూ. వ్యా.)

(౧౬.౮) ఊష్మ మనఁగా వాయువు. కాన వాయు ప్రధానములగు వర్ణము లూష్మములను సన్వర్థసంజ్ఞ వానికి వెలయుచున్నది. వానియుచ్చారణమున స్థానకరణ స్పర్శ మించుకయు నుండదు. వక్త్రము తెఱచి యుండఁగా నిశ్వాసము బహిర్నిర్గత మగును. శౌనకునిచే నూష్మముగనే పేర్కొనఁబడిన విసర్గముయొక్క యుచ్చారణమున నిశ్వాస వాయువు కేవలముగ విసర్జింపఁబడునుగాన 'విసర్గము, విసర్జనీయము' అనుపేరు లన్వర్థములగుచున్నవి. జిహ్వామూల సానికములగు 'కఖల నాశ్రయించి యుండునుగాన 'ౘక' అనుచోటి విసర్గమునకు జిహ్వామూలీయసంజ్ఞ సార్థక మగుచున్నది. ఉపధ్మానము చేయఁబడు ననఁగా సర్పశ్వాసమువలె నూఁదఁబడును గాన 'ప ఫ' ల నాశ్రయించుటచే నోష్ఠ్యమగు 'ౘప' అనుదాని కుపధ్మానీయ సంజ్ఞ యర్థవంత మగుచున్నది. ఈ విషయములనె యీ క్రింది వచనములు వక్కాణించుచున్నవి.

"ఊష్మా వాయుః తత్ప్రధానా వర్ణాః, ఊష్మాణః, యథా 'హ శ ష స అః ౘక ౘప అం ఇతి' (పార్షదవ్యాఖ్య.)

"అః ఇతి విసర్జనీయః. వాయో ర్విసర్జనేన జన్యత్వాత్. 'ౘక' ఇతి జిహ్వామూలీయః. జిహ్వామూలేన జన్యత్వాత్, 'ౘప' ఇత్యుపధ్మానీయః ఉపధ్మానేన జన్యత్వాత్" (తైత్తిరీయ. ప్రా. ౧ అధ్యా. ౧౮ సూత్రేషు వైదికాభరణ వాఖ్య)

"ఉపధ్మానీయస్య ఉత్పత్తిస్థాన మోష్ఠః, సర్పశ్వాసవ దుచ్చారణమ్." (ముగ్ధబోధవ్యాకరణము, సంజ్ఞా. ౨౦ త్రేపు దుర్గాదాస వ్యాఖ్య.)

ఉపధ్మానీయ శబ్దమున కీ క్రిందిరీతిని వాచస్పత్య కోశమున వ్యుత్పత్తి వ్రాయఁబడెను. ఉకారమును 'పకార' మును నేస్థానముచేత నూఁదఁబడునో

యా యోష్ఠ స్థాన ముపధ్మానము, లేక 'ఉపాధ్మానము' నన:బడును. అట్టి యోష్ఠమున: బుట్టినదిగాన 'ౘప' అనునది యుపధ్మానీయము లేక యుపాధ్మానీయము నన:బడుచున్నది. అగ్ని నూ:దునప్పుడు ఉకార పకార (ఫూ?) శ్రవణమును ప్రసిద్ధమే కదా. "ఉశ్చ పశ్చ ఆధ్మాయేతే అనేన స్థానేనేతి వ్యుత్పత్తేః ఉపాధ్మానశబ్దః ఓష్ఠవచనః, తత్ స్థానోచ్చార్యత్వా దన్వితనామతా (ఉపధ్మానీయస్య) చావధేయా" (వాచస్పత్యకోశము. ౧౬౦౦ పుట. వ్యంజన వర్ణవిభాగ సందర్భము) "ఉపధ్మాన. పు. ఉ, ఉవర్ణః, పశ్చ ధ్మాయతే అనేన. ఉపధ్మాన. కరణే ల్యుట్, ఓష్ఠే" (వాచస్పత్యము.)

"ఉపధ్మానీయ. పు. ఉపధ్మానే ఓష్ఠే భవః, ఛ (ప్రత్యయము). 'పఫ' పరే విసర్గస్థానికే గజకుమ్భాకృతితయా లేఖనీయే వర్ణభేదే ఉపధ్మాన శబ్దే. ఉపాధ్మానీయ ఇతి కేచి దాహుః" (వాచస్పత్య కోశము.)

(౧౬౯) అచ్చు ననుసరించి యుచ్చరింప:బడునది గాన నది యను స్వార మన:బడుచున్నది. వ్యక్తముగా వర్ణింప:బడు నన:గా ధ్వనించును గాన నయ్యది వర్ణ మన: బర:గుచున్నది. స్వయముగా: బ్రకాశించున దన:గా నితరాపేక్ష లేక యుచ్చరింప:దగి యుండునది స్వర మన:బడును. లేదా "ఉదాత్తాది' స్వరములతో ధ్వనించునది గాన స్వర మన:బడును. అచ్చుల సాహాయ్యమున వ్యక్తములగు నన:గా నుచ్చరింప:బడును గాన హల్లులు వ్యంజనములను సార్థక నామమును బడయుచున్నవి. పై విషయములకు: బ్రమాణములు.

"అనుస్వర్యతే పశ్చాద్ధ్వే స్వరవ దుచ్చార్యతే ఇత్యనుస్వారః" (తైత్తిరీ. ౧ అధ్యా. ౧౮ సూత్రపు వైదికాభరణ వ్యాఖ్య). "వర్ణ్యన్తే వ్యక్తం ధ్వన్యన్త ఇతి వర్ణాః" తైత్తి, ౧ అ ౧ సూత్రపు వైదికాభరణ వ్యాఖ్య).

"స్వయం రాజన్తే నాన్యేన వ్యజ్యన్త ఇతి స్వరాః .........పరేణ స్వరేణ వ్యజ్యత ఇతి వ్యఞ్జనమ్...............య స్స్వయం రాజతే తం తు। స్వర మాహ పతఞ్జలిః। ఉపరిష్ఠాయినా తేన। వ్యజ్యం వ్యఞ్జన ముచ్యతే"

(తైత్తి. ౧ అధ్యా. ౫-౬ సూత్రముల వైదికాభరణ వ్యాఖ్య).

"తే ద్వాదశ స్వరసఞ్జ్ఞా వేదితవ్యాః, ఉదాత్తానుదాత్తస్వరితప్రచయా ఏష్వక్షరేషు స్థితాః. స్వర్యన్తే శబ్ద్యన్త ఇతి స్వరాః" ఋగ్వేద, ౧ పటల, తేస్వరా ఇతి సూత్రవ్యాఖ్య).

(౧౭౦) కంఠ్యములు:—

"కంఠ్యా వహా' విత్యాది ప్రకృత కారికయం దవర్ణ హకారములు కంఠ్యములని చెప్పఁబడియున్నది. దీనినిబట్టి 'అహా' ల యుచ్చారణమున వక్త్రాభ్యంతర స్థానకరణ సంబంధమే యేమియు లేదని విశద మగుచున్నది.

(౧౭౧) అకారము కంఠ్యమని ప్రాతిశాఖ్యములలో నెచ్చోటను జెప్పఁబడలేదని విట్నీదొరగారు వ్రాసిరి. (ప్రమోదూత సంవత్సరాశ్వయుజ భారతి.)

కాని శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును ఋగ్వేద ప్రాతిశాఖ్యమునందును నయ్యది కంఠ్యమని యీ క్రిందిరీతిని (౧౭౩ వి.) స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

మఱియు నీ 'అ' వర్ణమునకు హనువులు స్థానమనియు నోష్ఠములు కరణమనియుఁ దైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియున్నది. అవర్ణోచ్చారణమున హనువులనఁగా సృక్వలును నోష్ఠములును నాతివిశ్లిష్టములును నాత్యుపశ్లిష్టములును నై యుండును. అనఁగాఁ గేవలము నెడపడకయుఁ గేవలము కలిసికొనకయు నుండునని తాత్పర్యము. దీర్ఘప్లుతావర్ణముల యుచ్చారణమున విశ్లేష మించుక యధికముగను హ్రస్వావర్ణోచ్చారణమున నుపశ్లేష మించుక యధికముగను నుండునని యీక్రిందిరీతిని వ్రాయఁబడియున్నది.

"అవర్ణే నాత్యుపసంహృత మోష్ఠహను నాతివ్యస్తమ్" (తైత్తి. ౨ అధ్యా. ౧౨ సూ.) దీనివైదికాభరణ వ్యాఖ్య:—"అవర్ణే ఉచ్చార్యే ఓష్ఠయో రీషదసమాప్తః పరస్పరోపశ్లేషః కార్యః, ఏవం హన్వోశ్చ. తథా ఈషదసమాప్తః పరస్పర విశ్లేష ఓష్ఠయోః కార్యః, ఏవం హన్వోశ్చ. ...... హ్రస్వే అవర్ణే ఉపశ్లేషభూయస్త్వమ్. దీర్ఘప్లుతయో స్తు విశ్లేషభూయస్త్వమితి... ... ... అవర్ణస్య హనూ స్థానమ్. ఓష్ఠౌ కరణమ్"

మఱియు నీయవర్ణోచ్చారణమున జిహ్వ యెట్లుండునో పయిసూత్రమునఁ జెప్పఁబడలేదు గాన నట్టి యనాదేశవిషయమున జిహ్వ చలింపక యథాస్థితముగాఁ బ్రసరించి యుండునని యీ క్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

"అనాదేశే ప్రణ్యస్తా జిహ్వా" తైత్తిరీయ ప్రా. ౨ అ. ౨౦ సూ.) వైదికాభరణవ్యాఖ్య:—"యత్ర జిహ్వాయా వ్యాపారో నాదిశ్యతే అవర్ణాదౌ తత్ర సా ప్రణ్యస్తా ప్రసారితైవ భవేత్."

(౧౭౨) ఈయిరీతిని 'అ' వర్ణమునకు హనువులు స్థానమని చెప్పఁబడినను నయ్యది కంఠ్యమనుట విరుద్ధము కాదు. అద్దాని యుచ్చారణమున నిశ్వాసము కంఠబిలమునుండి వచ్చునుగాన నయ్యది కంఠ్య మనుటలో విప్రతిపత్తి లేదు. అట్లయినఁ దక్కిన వర్ణముల యుచ్చారణమున మాత్రము నిశ్వాసము కంఠబిలమునుండి రాదా? యని శంకింపఁజనదు. 'అ' వర్ణేతరముల యుచ్చారణమున నిశ్వాసము కంఠబిలమునుండి వచ్చునపుడు వక్త్రాభ్యంతర స్థానములందు వ్యాపారాంతరము లుండును. అవర్ణోచ్చారణమునం దన్ననో సకలస్వర సాధారణమగు వివృతప్రయత్నము యొక్క యాధిక్య న్యూనత్వములు తప్ప వేఱు వ్యాపారము లెవ్వియు నుండవు. ("యద్యపి సర్వేషాం వర్ణానా ముచ్చారణే కంఠవ్యాపార ఆవశ్య కస్తథాపి చకారాద్యుచ్చారణే తాల్వాది వ్యాపారోఽధికోఽప్యపేక్షిత ఇతి. తన్మాత్రకృతత్వేన వర్ణానాం వైలక్షణ్యమ్.")

కావునఁ గంఠబిలమునుండి నిశ్వాసమును రానిచ్చుట మాత్రమె యపుడు సంభవించును గాన నద్దానికి గంఠ్యత చెప్పఁబడెను. కావుననే కొన్ని ప్రాతిశాఖ్యములలో 'అ, వర్ణము కంఠ్యమనియుఁ జెప్పఁబడియున్నది.

"కణ్ఠ్యోఽకారః" (ఋగ్వేద ప్రా. ౧ పట).

పార్షదవ్యాఖ్య:—"... 'హ్రస్వాదేశే హ్రస్వదీర్ఘౌ సవర్ణౌ' వితి వక్ష్యత్యత 'అకార, ఆకారా' గృహ్యేతే..."

"అహ విసర్జనీయాః కణ్ఠే." (శుక్లయజుః ప్రా. ౧ అధ్యా. ౭౧ సూ.)

ఉవ్వటభాష్యము.—అకారో మాత్రికో ద్విమాత్రిక స్త్రిమాత్రిక ఇత్యేతే త్రయః హకార విసర్జనీయా ఇత్యేతే పఞ్చ వర్ణాః కణ్ఠ్యాః ప్రత్యేతవ్యాః.

(౧౭౩) అకారోచ్చారణమునందు వలెనే హకార విసర్గముల యుచ్చారణమునందును నిశ్వాసము కంఠబిలమునుండి వెడలివచ్చుట మాత్రమె సంభవించును గాన నవియుఁ గంఠ్యములె యనఁదగి యున్నవి. అకారోచ్చారణమునందు వలెఁ గాక హకార విసర్జనీయముల యుచ్చారణమునం దధికమగు నిశ్వాస మురస్సునుండియుఁ బెల్లగిలి వచ్చిన ట్లుండుట యనుభవ సిద్ధ మనుచుఁ గొందఱు వీని నురస్యములని చెప్పియున్నారు. అంతస్థముల తోను వర్గపంచమములతోను సంయోగించినట్టి హకారముయొక్క యుచ్చార

ణమునందు మాత్రమె యట్లు నిశ్వాస మురస్సునుండి వెల్లగిలి వచ్చునట్లుం డుట యనుభవ సిద్ధమనియు నట్టియెడల మాత్రమె హకార మురస్య మనియుఁ దక్కిన యెడల నయ్యది యనఁగా నసంయుక్త హకారము కంఠ్యమె యనియు మఱి కొందఱు చెప్పియున్నారు.

"అహ విసర్జనీయాః కణ్ఠే" (శుక్లయజుః ప్రా. ౧ అధ్యా. ౭౧ సూ.) (ఈ సూత్రమును దీనివ్యాఖ్యయుఁ బైనుదాహరింపఁబడియున్నవి).

"ప్రథమ పఞ్చమౌచ ద్వా వూష్మణామ్" (ఋగ్వేద ప్రా. ౧ పట).

పార్షదవ్యాఖ్యః— "......... ప్రథమో హకారః పఞ్చమో విసర్జనీయః, ఏతౌ చోష్మణాం మధ్యే కంఠస్థానౌ వేదితవ్యౌ......" "కేచి దేతా వురస్యౌ" (ఋగ్వేద ప్రా. ౧ పటలము.) పార్షదవ్యాఖ్యః— "కేచి దాచార్యా ఏతౌ హకార విసర్జనీయా ఉరఃస్థానా విచ్ఛన్తి—హ-అః."

కణ్ఠ స్థానౌ హకార విసర్జనీయౌ" (తైత్తిరీయ ప్రా. ౨ అధ్యా. ౪౬. సూ.) వైదికాభరణవ్యాఖ్యః—హకారస్య తూత్తమాన్తస్థ పరస్య ఉరస్యత్వం వేదితవ్యమ్......శిక్షాచైవ మాహ.

శ్లో. హకారం పఞ్చమై ర్యుక్త। మన్తస్థాభిశ్చ సంయుతమ్। ఉరస్యం తం విజానీయాత్ । కణ్ఠ్య మాహు రసంయుతమ్" (పాణినీయశిక్ష.)

(౧౭౪) ఇంక "అయోగవాహా విజ్ఞేయా। ఆశ్రయస్థాన భాగినః" అను మూలసూత్రము చెప్పున విసర్గమునకు స్వాశ్రయస్థాన భాగిత్వమునే గల దని విశదమగుచున్నది. అయోగవాహములలో జిహ్వామూలీయము (ᳵక) పరాశ్రితమై యుండు ననఁగా 'కఖల' నాశ్రయించి యుండును గాన ("నువీ పూర్వేణ సంయుక్తౌ। మూన్యౌతు పరగామినౌ" ॥ ౨౨౩. వి. ను—వీ = అనుస్వార విసర్గౌ. మూ—న్యౌ = ᳵక—ᳶప) వాని స్థానమగు జిహ్వామూలమె దీనికి స్థానమగుటలో విప్రతిపత్తి లేదు. అట్లె యుపధ్మానీయ ములకును 'పఫ'ల స్థానమగు నోష్ఠమే స్థాన మగుటయు ననుభవ సిద్ధమగు చున్నది. ఇంకఁ బరిశిష్ట మగు విసర్గమునకును ననుస్వారమునకును వానికిఁ బూర్వమందున్న స్వరముయొక్క స్థానమును జెప్పనలయుననుట మాత్ర మను భవసిద్ధమై యున్నట్లగపడదు. అట్లె హకారమును దనపై నిల్చిన స్వరము యొక్క స్థానము కలదగు నన్న యభిప్రాయము నైతె మనుభవసిద్ధమయి యున్నట్లు తోఁచదు. కావుననె యివి కేచిన్మతములుగాఁ బ్రాతిశాఖ్యము లలోఁ జెప్పఁబడి యున్నవి. "పూర్వాన్త సస్థానో విసర్జనీయః" (తైత్తిరీయ

(ప్రా. ౨ అ. ౪౮ సూ.) వైదికాభరణ వాఖ్య—"..........విసర్జనీయః పూర్వస్య స్వరస్య అన్తేన సమానస్థానో భవతీ త్యేకేషాం మతమ్......"

"ఉదయస్వరాది సమానో హకార ఏకేషామ్" (తైత్తి. ౨ అ. ౪౭ సూ.)

త్రిభాష్యరత్న వాఖ్య:—. "ఏకేషాం మతే హకారః ఉదయ స్వరాది సస్థానః అత్మన ఉపరి స్వరాది సస్థానః భవతీతి వారరుచో క్తమ్."

పయిసూత్రములలో "పూర్వాన్త" అనియు 'స్వరాది' అనియు నంతాది శబ్దముల ప్రయోగము సంధ్యచ్చులకై చేయఁబడెనని గ్రహింప వలయును. సంధ్యచ్చులలో స్వరద్వయ ముండునుగాన నట్లు చెప్పుట యావశ్యక మగుచున్నది. ఔకారముపై విసర్గము నిల్చునపుడు 'ఔ' కారములోని యుత్తరాంశమగు 'ఉ' కారముయొక్క స్థాన మచటి విసర్గమునకు గ్రహింపవలెనని తాత్పర్యము. అట్లే హకారముపై 'ఔ' కారము నిల్చునపు డందలి పూర్వాంశమగు 'అ' కారముయొక్క స్థాన మా 'హ' కారమునకు గ్రహింపవలెనని యభిప్రాయము.

(౧౭౫) అరయనరయ నవసానమునందలి విసర్గమునకుఁ బూర్వ స్వరస్థానికత్వము నంగీకరించుట యనుభవ సిద్ధమై యున్న ట్లగపడుచున్నది. అవసానమునందలి విసర్గము హకారమువలె నుచ్చారణమున వినఁబడు చుండును. మఱియు నట్టి విసర్గమునకు ముందుండెడి స్వరముసైత మట్టి హకారశ్రుతిలో మేళగించి యుండుట యనుభవసిద్ధమై యున్నది. దీనిని బట్టి యవసానమునందలి (అయోగ వాహములలోనిదగు) విసర్గమునకు సైత మాశ్రయస్థాన భాగిత్వ మనుభవసిద్ధమె యనఁదగునని తోఁచుచున్నది.

(౧౭౬.) జిహ్వామూలీయములు—

జిహ్వామూలేతు కుః ప్రోక్తః" అని యిట్లు ప్రకృతకారిక కవర్గీయములను మాత్రము జిహ్వామూలీయములనుగాఁ జెప్పుచున్నది. 'ఃక' మున్నగుచోట్ల విసర్గము సైతము కఖల నాశ్రయించున దగుటచేత "అయోగవాహా విజ్ఞేయా। ఆశ్రయస్థానభాగినః" అను మూలముచొప్పున జిహ్వామూలీయ మగుచున్నది. తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందు 'క' వర్గమునకు హనుమూలములు స్థానమనియు జిహ్వామూలము కరణమనియుఁ జెప్పఁబడియున్నది. మఱియు నిందు జిహ్వామూలీయము (ఃక) కవర్గస్థానికమె యని చెప్పఁబడినది. జిహ్వామూలముతో హనుమూలముల నడఁగా మీఁది శిరోభాగమును స్పృశించుట చేత 'క' వర్గము జనించుననియు జిహ్వామూల హనుమూలములు మిక్కిలి

సన్నిహితములై యుండుటచేత (ఇది యూష్మములలోనిది గాన స్థాన కరణ స్పర్శ ముండదు) జిహ్వామూలీయ ధ్వని కల్గుననియుఁ దైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియున్నది. పై సందర్భమునుబట్టి క వర్గము కంఠ్యమనియు 'అ' కు హ విసర్గములు సమానస్థానికములనియుఁ దెల్పెడి 'అ కు హ విసర్జనీయానాం కణ్ఠః' అను సిద్ధాంత కౌముదీ వాక్యము సరికాదనియు విశదమగుచున్నది. కావుననె యిచటి కంఠశబ్దము కంఠమూల పరమనఁగా జిహ్వామూలపరమని వాచస్పత్యమున వివరింపఁబడెను. "జిహ్వామూలేతు కుః ప్రోక్త ఇతిపాణిని శిక్షాభిధానాత్ కవర్గస్య కణ్ఠ మూలీయత్వమ్. కణ్ఠ్యత్వ వ్యవహారస్తు కణ్ఠ శబ్దస్య కణ్ఠమూలీయ పరతయా భాక్తఏవ; తవర్గస్య దన్తమూలీయత్వేపి దన్త్యత్వవత్, అన్యథా భగ్నదన్తస్య తదనుచ్చారాపత్తేః; జిహ్వామూలీయస్య ఆశ్రయస్థాన భాగిత్వే నోక్తేః తదాశ్రయస్య కోరపి జిహ్వామూలస్థాన త్వౌచిత్యాత్." (వాచస్పత్యము, ౧౬౦౦ పుట, వ్యంజన వర్ణవిభాగ.) "హనుమూలే జిహ్వామూలేన కవర్గే స్పర్శయతి" (తైత్తి. ప్రా. ౨ అధ్యా. 3౫ సూ.) "స్పర్శస్థానే షూష్మాణ ఆనుపూర్వ్యేణ" (తైత్తి. ప్రా. ౨ అధ్యా ౪౪ సూ.) త్రిభాష్య రత్న వ్యాఖ్య:— "ఊష్మాణ ఆనుపూర్వ్యేణ యథాక్రమేణ స్పర్శస్థానేషు ఉచ్చారణీయా భవన్తి. యథాజిహ్వామూలీయః కవర్గ స్థానే. . . . "

(౧౭౭)—ఋగ్వేద ప్రాతిశాఖ్యమునందు 'ఋ ౡ' వర్ణములు సైతము జిహ్వా మూలీయములె యనిచెప్పఁబడెను. శుక్లయజుః ప్రాతిశాఖ్యమున ఋవర్ణము జిహ్వామూలీయమనియు ౡ వర్ణము దంత్యమనియుఁ జెప్పఁబడెను. తైత్తిరీయప్రాతిశాఖ్య ప్రసంగమునుబట్టి చూడఁగా 'ఋ' వర్ణోచ్చారణమున స్వర రేఫములయు, ౡ వర్ణోచ్చారణమున స్వర లకారములయుఁ బ్రయత్నముల ఛాయలు సంభవించునని తేలుచున్నది. అట్లయినను బై ప్రాతిశాఖ్యములకుఁ బరస్పరవిరోధము లేదనఁదగియున్నది. అవర్ణము కంఠ్యమనుటలోఁ దైత్తిరీయ ప్రాతిశాఖ్యమునకు వైమత్యము లేనట్లె (౧౭౨ వి.) ఋ ౡ వర్ణములు జిహ్వామూలీయము లనుటయందును నద్దానికి వైమత్యము లేదని చెప్పవచ్చును. ఋ ౡ వర్ణముల యుచ్చారణమున స్వరోచ్చారణ ప్రయత్నచ్ఛాయలును రేఫ లకారోచ్చారణ ప్రయత్న చ్ఛాయలును గలవనిమాత్రమె తైత్తిరీయ ప్రాతిశాఖ్యము చెప్పుచున్నదిగాని యవి జిహ్వామూలీయములగుటకు విరుద్ధముగ నేమియుఁ జెప్పియుండలేదు. ఋ ౡ వర్ణముల

యుచ్చారణమున నట్టి స్వరవ్యంజన ధర్మములు మేళితములై యుండుటచేత వానిలోఁ గొందఱు స్వరధర్మముల నాశ్రయించియు మఱికొందఱు వ్యంజన ధర్మముల నాశ్రయించియు స్థానకరణములను జెప్పసాగిరి. ఋగ్వేదప్రాతిశాఖ్యము ఋ ౡ వర్ణములందలి స్వరాంశము నాశ్రయించి వానిస్థానమును జెప్పుచున్నది. శుక్లయజుఃప్రాతిశాఖ్య మన్ననో ఋ వర్ణస్థానమును స్వరధర్మము నాశ్రయించియు ౡ వర్ణస్థానమును వ్యంజనధర్మము నాశ్రయించియుఁ జెప్పుచున్నది. ౡ వర్ణము సాధారణముగ పదాదినుండక వ్యంజనస్థ మగుచునే భాషలో నగపడుచుండుటంజేసి కాంబోలును దానియందు స్వరధర్మ మల్పీయ మని తలఁచి యద్దానికి వ్యంజనధర్మము నాశ్రయించి స్థానమును జెప్పెనని తోఁచుచున్నది. 'కణ్ఠ్యావహా' విత్యాది ప్రకృతకారిక యన్ననో ఋ ౡ వర్ణములందలి వ్యంజనధర్మముల నాశ్రయించి వానిస్థానముల నుపదేశించుచున్నదని గ్రహింపవలయును. వీనిలోని స్వరభాగము కంఠ్యముకాక జిహ్వామూలీయ మయినట్లె రేఫ లకారభాగములు సైతము దంతమూలీయములుగాక దంతమూల సన్నిహితమగు బర్స్వము స్థానముగాఁ గల వగుచున్నవి. పయి విషయములందుఁ బ్రాతిశాఖ్యము లిట్లు చెప్పుచున్నవి.

"ఋకార ల్కారా వథ షష్ఠ ఊష్మా జిహ్వామూలీయాః ప్రథమశ్చ వర్గః" (ఋగ్వేద ప్రా ౧ పట. ౮ సూ.)

వాసిష్ఠవ్యాఖ్య:—ఋకారశ్చ ౡకారశ్చ షష్ఠ శ్చోష్మా జిహ్వామూలీయః ప్రథమశ్చ కకారాదివర్గః ఏతే జిహ్వామూలస్థానా వేదితవ్యాః"

"ఋకారౌ జిహ్వామూలే" (శుక్లయజుః ప్రా. ౧ అధ్యా. ౬౫ సూ.)

ఉవ్వటభాష్యము:—ఋ ౠ ఋ౩ ఇతి త్రయః, జిహ్వామూలీయః కవర్గ ఇత్యేతే దశవర్ణా జిహ్వామూలస్థానాః"

"ౡ లసతా దన్తే" (శుక్లః ప్రా. ౧ అధ్యా. ౬౯ సూ.)

ఉవ్వటభాష్యము:—"ౡ ౡ ౡ3 ఏతే త్రయః లకారః సకారః తవర్గ ఇత్యేతే దశ వర్ణా దంత్యాః."

"ఉపసంహృతతరే చ జిహ్వాగ్ర మృకార ల్కారేషు బర్స్వే షూపసంహరతి" (త్రై. ప్రా. ౨ అధ్యా. ౧౮ సూ.)

త్రిభాష్య రత్నవ్యాఖ్య:—"ఋకారే ౠకారే ౡకారే చ కార్యే హనూ ఉపసంహృతతరే భవతః జిహ్వాగ్రం చ బర్స్వే షూపసంహరతి నిక్షిపేత్. బర్స్వేషు ఇతి దన్త పఙ్క్తే రుపరిష్టా దుచ్చప్రదేశేషు ఇత్యర్థః...."

వైదికాభరణవ్యాఖ్య:—"...ర్సా (నాను రేఫ టకారస్థానయో ర్మధ్య ప్రదేశః......ఏతేషాం బర్స్వాః స్థానమ్. జిహ్వా హనూచ కరణమ్."

ఋ ౡ వర్ణము లుచ్చరింపఁబడునపుడు హనువులు సంవృతతరము లనఁగా సమీపానీతములగును. ఇది స్వరధర్మము. జిహ్వాగ్రము బర్స్వములం దుంపఁబడును. (ఇది రేఫ లకారముల ఛాయ). బర్స్వ మనఁగా రేఫ టకార స్థానముల మధ్యప్రదేశము. అనఁగా రేఫస్థానమగు (౧౮౪ వి.) వర్త్స్యము నకు మీఁదుగను 'ట' కారస్థానమగు (౧౮౨ వి.) మూర్ధమునకుఁ గ్రిందుగను నుండుప్రదేశము. పైసూత్రములలో నోష్ఠవ్యాపారము చెప్పఁబడలేదు గాన నట్టి యనాదేశస్థలమున నోష్ఠములు నాత్యుపసంవృతములై యుండును. (వి. ౧౭౧.౧౭౯.) (ఇది స్వరధర్మము.) ఋ ౡ వర్ణములు రేఫ లకార సంపృక్త ములని యీవఱకే వ్రాయఁబడెను, (౧౪౬ వి.)

పయిరీతి నంగీకరించినచో ఋ ౡ వర్ణములకు భేదము లేకపోవలసి వచ్చును. కాన జిహ్వాగ్రము ఋ వర్ణోచ్చారణమున బర్స్వమునం దుంపఁబడు ననియు ౡ వర్ణోచ్చారణమున దాని దిగువ భాగమగు వర్త్స్య మందనఁగా దంతమూలమునకు మీఁది భాగమం దుంపఁబడుననియు గ్రహింపనగును.

(౧౭౮)—పయి నుదాహరింపఁబడిన ఋగ్వేద ప్రాతిశాఖ్యమును బట్టియు శుక్ల యజుః ప్రాతిశాఖ్యమునుబట్టియు, 'జిహ్వా మూలేతు కుః ప్రోక్తః' అనెడి ప్రకృత కారికనుబట్టియు, 'క' వర్గమునకు జిహ్వా మూలము స్థానమని విశదమగుచున్నది. దీనికిఁ గరణము హను మూలమని సైతము శుక్ల యజుః ప్రాతిశాఖ్యమున నీ క్రింది రీతిని సూత్రింపఁబడెను.

"జిహ్వా మూలీయానుస్వారా హనుమూలేన" (శుక్ల. ప్రా. ౧ అధ్యా. ౮౩ సూ.) ఉవ్వట భాష్యము:—'జిహ్వా మూలస్థానా అను స్వారశ్చ హనుమూలేన క్రియతే... ..."

ఇది వెనుక వ్రాసిన తైత్తిరీయ ప్రాతిశాఖ్యాభిప్రాయములకు (౧౭౬ వి.) విపరీతముగ నున్నది.

తక్కిన వర్గముల స్పర్శములందును జిహ్వావయవములకే కరణత్వము చెప్పఁబడుచుండుటచేత నీ కవర్గ స్పర్శములకును జిహ్వాభాగమగు జిహ్వామూల మునకె కరణత్వము నంగీకరించుట యుక్తమని తోఁచుచున్నది. తక్కిన వర్గ ముల యుచ్చారణమునందువలెనె యీ కవర్గము నుచ్చారణమునందును జిహ్వా భాగముతోనె హనుమూల మనఁదగు మీఁది శిరోభాగము తాఁకఁబడుచుండుట

యనుభవసిద్ధమై యున్నది. కావున ఋగ్వేద ప్రాతిశాఖ్యమును శుక్లః యజుః ప్రాతిశాఖ్యమును ననుభవ విరుద్ధముగాఁ జెప్పిన వనుటకన్న జిహ్వామూలము నకు సరిగా మీఁద నుండెడి తాలుభాగమునె జిహ్వ మూలమనియు నట్టిక్రింది జిహ్వామూలభాగ మనఁబడెడి ప్రదేశమునె హనుమూల మనియు నీ గ్రంథ ములు తెలంచుచున్నవనుట యుక్తతరమై యుండును. (చూ. ౧౬౦. వి.)

(౧౭౯)—తాలవ్యములు:—

"ఇ చు యశా స్తాలవ్యాః" అని యిట్లు ప్రకృతకారిక 'ఇ' వర్ణ మును 'చ'వర్గమును యకార శవర్ణములును దాలవ్యము లని చెప్పుచున్నది.

ఇ వర్ణోచ్చారణమున జిహ్వామధ్యము తాలువునం దుపసంహరింపఁ బడును. ఇందోష్ఠములెట్లుండవలయునో చెప్పఁబడలేదు గాన "అకార వ దోష్ఠౌ" (తైత్తి. ౨ అధ్యా ౨౧ సూ). వైదికాభరణ వ్యాఖ్య—"ఓష్ఠావపి వ్యాప్తా రానాదేశే అకారవ ద్భవతః—అకారే యథా నాత్యుప సంహృతౌ తథా స్యాతామ్ ......" అనుచొప్పున 'అ' కారోచ్చారణము నందు వలెనే యత్యంత సమీపానీతములు కాకుండును. దీనికిఁ దాలువు స్థానము. జిహ్వామధ్యము కరణము.

చవర్గోచ్చారణమున జిహ్వామధ్యముచేఁ దాలువు స్పృశింపఁబడును. శ వర్ణమును నీస్థానమునందే జనించును గాని యది యూష్మము గాన నద్దాని యుచ్చారణమున స్థానకరణ స్పర్శ ముండదు. ఇంక నయ్యవి సమీప స్థితి నందును. యకారోచ్చారణమున జిహ్వామధ్యముయొక్క యంతము లచే ననఁగాఁ బార్శ్వములచేఁ దాలు వించుక స్పృశింపఁబడును. పయి విషయ ములను ప్రాతిశాఖ్యము లిట్లు చెప్పుచున్నవి.

"తాలౌ జిహ్వా మధ్య మివర్ణే" (తైత్తి. ౨ అధ్యా. ౨౨ సూ.)
వైదికా—ఉపసంహార తీత్యన్వయః"

"తాలౌ జిహ్వామధ్యేన చవర్గే" (తైత్తి. ౨ అధ్యా. ౩౬ సూ.)
వైదికా—"స్పర్శయతీ త్యన్వయః"

"స్పర్శస్థానే షూష్మాణ ఆనుపూర్వ్యేణ" (తైత్తి.౨అధ్యా.౪౪ సూ.)

"తాలౌ జిహ్వా మధ్యాన్తాభ్యాం యకారే" (తై. ప్రా. ౨ అధ్యా. ౪౦ సూ.)

వైదికాభరణ వ్యాఖ్య—"జిహ్వాయా మధ్యం = జిహ్వామధ్యమ్ తస్యాన్తౌ పార్శ్వభాగౌ ...... (తైత్తి. ౨ అధ్యా. ౧౭—౪౦ సూత్రముల వ్యాఖ్య.)

త్రిభాష్యరత్న వ్యాఖ్య—"జిహ్వాయా మధ్యం తస్యాన్తౌ తాభ్యాం = జిహ్వా మధ్యాన్తాభ్యామ్. (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౧౭—౪౦ సూ. వ్యాఖ్య.)

ఏతత్సూత్రార్థము నాధునికు లొకరు వేఱు విధముగ వ్రాసి యున్నారు.

"యకార ముచ్చరింపఁబడు నప్పుడు జిహ్వామధ్యాంతములతోఁ దాలువును స్పృశింపవలయును. 'తాలౌ జిహ్వామధ్యాన్తాభ్యాం యకారే' అను సూత్రముచే నీ యంశము చెప్పఁబడెను. చ వర్ణమునకు జిహ్వా మధ్య స్పర్శ ముండును. యకారమునకు జిహ్వాంతస్పర్శముకూడ నుండును." (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ౭ సంపుటము' చెన్న-విశ్వవిద్యాలయ పుస్తక భాం. ౨౫౬ పుట.)

ఈ ప్రసంగముంబట్టి పైని వ్రాసిన తైత్తిరీయ ప్రాతిశాఖ్య సూత్రములోని "జిహ్వా మధ్యాన్తాభ్యామ్" అను దానికి "జిహ్వా మధ్యముచేతను, జిహ్వాంతముచేతను," అని యిట్లు వీరర్థము చేసిన ట్లగపడుచున్నది. యకారోచ్చారణమునఁ దాలువునకు జిహ్వాంత స్పర్శమెంత ( = జిహ్వా తుదిభాగపు స్పర్శము.) మాత్రమును నుండఁబోదుగాన వీరి యర్థము ప్రామాదికమనియుఁ దైత్తిరీయ ప్రాతిశాఖ్య వ్యాఖ్యాతలు చేసిన యర్థమె సరియై యున్నదనియు గ్రహింపనగును.

(౧౮౦)—ఓష్ఠ్యములు:—

"ఓష్ఠజా వుపూ" అని యిట్లు 'ఉ' వర్ణమును 'ప' వర్గమును ఓష్ఠ్యములని ప్రకృతకారిక చెప్పుచున్నది.

ఉవర్ణోచ్చారణమున నోష్ఠము లుపసంహృతము లనఁగా సమీప గతములగును. మఱియు నిందు జిహ్వా 'అనాదేశే ప్రణ్యస్తా జిహ్వా' అను చొప్పునఁ (౧౭౧ వి.) బ్రసారిత మాత్రమై యుండును. దీనికి మీఁది పెదవి స్థానము. క్రిందిపెదవి కరణము.

ఇందోష్ఠములు వర్తులత్వము నంది ముందునకుఁ ద్రోయఁబడిన ట్లగునని పాశ్చాత్య పండితులు చెప్పెదరు. కాని యిట్టిస్థితి లేకుండుట యనుభవ విరుద్ధము కాదు.

ప వర్గోచ్చారణమునఁ గ్రింది పెదవితో మీఁది పెదవిని స్పృశించుట సంభవించును. ప ఫల నాశ్రయించెడి యుపధ్మానీయమును నోష్ఠ్యమె యయ్యు నది యూష్మము గాన నద్దాని యుచ్చారణమున స్థానకరణములు సన్నిహితములై యుండునేకాని వానికి స్పర్శ ముండదు. పయి విషయము లీ క్రింది రీతిని ప్రాతిశాఖ్యములచేఁ జెప్పఁబడినవి.

"ఓష్ఠోపసంహార ఉవర్ణే" (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౨౪ సూ.)

"వైదికా—"ఉవర్ణే ఉచ్చార్యే ఓష్ఠోపసంహారః కార్యః" "ఓష్ఠాభ్యాం పవర్గే" (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౪౯ సూ.) వైదికా—"తత్రాధరేణతు విచాల్యతరేణ ఉత్తరం (ఓష్ఠమ్) స్పర్శయతి."

(౧౮౧)—పయి సందర్భమునుబట్టి యోష్ఠ్యములకుఁ గ్రింది పెదవి కరణమనియు మీఁది పెదవి స్థానమనియు విశదమగుచున్నది.

శుక్లయజుః ప్రాతిశాఖ్యమునం దోష్ఠ్యములకు స్థాన కరణైక్యము చెప్పఁబడి యున్నది. అట్లయినను గ్రింది పెదవితో మీఁది పెదవిని దాఁకునట్లు పలుకుట యనుభవ సిద్ధమై యున్నది.

సమానస్థాన కరణా నాసికౌష్ఠ్యాః" (శుక్ల. ప్రా. ౧ అ. ౮౦ సూ.) ఉవ్వట భాష్యము—"హుంకారో నాసిక్యః, స చ నాసికాస్థానః. ఉపధ్మానీయా, ఓష్ఠ ఇత్యోష్ఠ్యస్థానాః, ఏతేషాం య దేవ స్థానం త దేవ కరణమ్."

(౧౮౨)—మూర్ధన్యములు:—

"స్యు ర్మూర్ధన్యా ఋ టు ర షాః" అని యిట్లు ఋవర్ణమును 'ట' వర్గమును రషవర్ణములును మూర్ధన్యము లని ప్రకృత కారిక చెప్పుచున్నది.

మూర్ధన్యోచ్చారణమునందుఁ బ్రతివేష్టితమగు ననఁగా మణవఁబడిన జిహ్వాగ్రముచే మూర్ధము స్పృశింపఁబడును. షవర్ణ మూష్మము గాన నద్దాని యుచ్చారణమున నట్టిస్పర్శ ముండదు. ఇంక నట్టి ప్రతివేష్టిత జిహ్వాగ్రము మూర్ధమునకు సన్నిహితమై యుండఁగా నాదరూప నిశ్వాసము వెడలి పోవును. కాఁగా దీనికి మూర్ధము స్థానము, ప్రతివేష్టిత జిహ్వాగ్రము కరణము. కాని యిట్టి ప్రయత్నము టవర్గ షకారముల యుచ్చారణములో మాత్రమె యనుభవ సిద్ధమెయున్నది. ఋ వర్ణ రేఫముల యుచ్చారణము లోని ప్రయత్నము దీని కించుక భిన్నముగా నుండుట యనుభవ సిద్ధమై యున్నది. ఋ వర్ణ విషయమునఁ బీవలకుఁ గొంత వ్రాసియున్నాను. (౧౭౭-వి. ౧౪౬) కావునఁ బ్రాతిశాఖ్యములందెల్ల ష టవర్గములు మాత్రమె కేవలము

మూర్ధన్యములుగా నీ క్రిందిరీతిని జెప్పఁబడి యున్నవి. "జిహ్వాగ్రేణ ప్రతివేష్ట్య మూర్ధని ట వర్గే" (తై. ప్రా. ౨ అ. ౩౭ సూ). వైదికాభరణ వ్యాఖ్య:— "మూర్ధా = శిరః తత్ర ప్రతివేష్టితేన జిహ్వాగ్రేణ స్పృశ్యతి" "స్పర్శస్థానే షూష్మాణ ఆనుపూర్వ్యేణ" (తై. ప్రా ౨ అ. ౪౪ సూ.) "మూర్ధన్యా షకార టకారవర్గా" (ఋగ్వే. ప్రా. ౧ పటల ౩౬ పుట) "షటౌ మూర్ధని" (శుక్ల. ప్రా. ౧ అధ్యా. ౬౭ సూ.)

"మూర్ధన్యాః ప్రతివే ష్ట్యాగ్రమ్" (శుక్ల. ప్రా. ౧ అధ్యా. ౭౮ సూ.) ఉవ్వట భాష్యము—"మూర్ధన్యాః షకార టవర్గా ఏతౌ ప్రతివేష్ట్య జిహ్వాగ్రేణ క్రియన్తే."

(౧౮౩)—రేఫము తవర్గ లకార సకారములతోపాటుగ దంతమూలీయమె యనియుఁ గొందఱమతమున నది వర్త్స్యస్థాన (దంతమూలములకు మీఁదిభాగము) భవమనియు శౌనకుఁడు చెప్పియున్నాఁడు. తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందును రేఫోచ్చారణమున జిహ్వాగ్రమధ్య భాగము దంతమూలముల యుపరిభాగము నించుక స్పృశించుట సంభవించునని చెప్పఁబడెను. కాత్యాయనుఁడు సైతము రేఫము దంతమూలస్థానిక మనియే శుక్లయజుః ప్రాతిశాఖ్యమునఁ జెప్పియున్నాఁడు. ఇందును జిహ్వాగ్రమె కరణ మని చెప్పఁబడెను. టవర్గమునకువలెఁ బ్రతివేష్టితజిహ్వాగ్రము కరణమని యెందును జెప్పఁబడియుండలేదు.

రేఫలకారములు రెండును దంతమూలీయములె యన్నచో వానికి భేదమే లేక పోవలసి వచ్చునని కావలయును శౌనకుఁడు 'రేఫం వర్త్స్య మేకే' అని పక్షాంతరము నుపన్యసించెను. కాత్యాయనుఁడు రేఫము దంతమూలీయ మనియు లకారము దంత్యమనియుఁ జెప్పుటచే విరోధము లేదయ్యెను. తైత్తిరీయప్రాతిశాఖ్యమునందును రేఫముయొక్క స్థానము దంతమూలమునకు మీఁది భాగమనియు లకారమునకు స్థానము దంతమూల మనియుఁ జెప్పుటచే విరోధము లేదయ్యెను.

ఋవర్ణమునకుఁ బర్స్వము స్థానమనియు బర్స్వ మనఁగా రేఫ ట వర్గ స్థానమధ్య భాగమనియు నీవఱకు వ్రాసియేయున్నాను (౧౭౭ వి.)

పై విషయము లీ క్రిందిరీతిని బ్రాతిశాఖ్యములలోఁ జెప్పఁబడియున్నవి.

"దంతమూలీయస్తు తకారవర్గః" (ఋగ్వే. ప్రా. ౧ పటల ౩౬ పుట)

"సకార రేఫ లకారాశ్చ (ఋగ్వేద. ప్రా. ౧ పటల 3౬ సూ.)

"రేఫం వర్త్స్య మేకే" (ఋగ్వేద. ప్రా. ౧ పటల 32 సూ).

పార్షదవ్యాఖ్య:—"వర్త్సే భవో వర్త్స్యః. వర్త్స శబ్దేన దంతమూలా దుపరిష్టా దుచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే"

"రేఫే జిహ్వాగ్రమధ్యేన ప్రత్యగ్దన్త మూలేభ్యః" తైత్తి. (ప్రా. ౨ అధ్యా. ౪౧ సూ.) వైదికాభరణవ్యాఖ్య—"దన్తమూలానా ముపరి స్పర్శయతి ..."

"రో దన్తమూలే" శుక్ల. (ప్రా. ౧ అధ్యా. ౬౮ సూ.)

ఉవ్వటభాష్యము:— "రేఫో దన్త మూలస్థానః ప్రత్యేతవ్యః"

"రశ్చ" (శుక్ల. ప్రా. ౧ అధ్యా. 22 సూ.)

ఉవ్వట భాష్యము:— "రేఫశ్చ జిహ్వాగ్రేణ క్రియతే ........"

(౧౮౪)—ఆధునిక పండితు లొకరు రేఫమునకు స్థానము బర్శ్వ మని వ్రాసియున్నారు.

"రేఫ ముచ్చరింపఁబడునపుడు జిహ్వాగ్రమధ్యభాగము దంతమూలముల యూర్ధ్వభాగమును స్పృశింపవలెను. ఈ భాగమునకు "బర్శ్వము" అనిపేరు. ఇదియే ఋకారమునకు స్థానము. ఈ విషయము "రేఫే జిహ్వాగ్ర మధ్యేన ప్రత్యగ్దన్త మూలేభ్యః" అనుసూత్రముచేఁ దెలుపఁబడెను." (ఆంధ్రసాహిత్య - పత్రిక, 2 సంపు. ౨౫౬ పుట. చెన్న. విశ్వ పుస్త).

పయిపంక్తులనుబట్టి వీరు తైత్తిరీయ ప్రాతిశాఖ్యమును మూలముగాఁగాని వ్రాసిరనుట స్పష్టము. అందు 'బర్స్వము' అనియున్నది. కాని 'బర్శ్వము' అనియుండలేదు. ఆప్టికోశములో నీ శబ్దము 'బర్స్వ'అనియె చూపఁబడినది. "(बर्स्व=బర్స్వ)Barswa. M. (Prob) The socket of a tooth V S; Krath."

మఱియు "ఉపసంహృతతరేచ జిహ్వాగ్ర మృకా రల్కా-రేషు బర్స్వేషూపసంహరతి" (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౧౮ సూ.) "బర్స్వో నామ రేఫ టకారస్థానయో ర్మధ్య ప్రదేశః" (వైదికాభర.) అను ప్రమాణములను బట్టి చూడఁగా ఋకార రేఫస్థానములు విభిన్నములనియు ('రేఫే జిహ్వాగ్రమధ్యేన ప్రత్యగ్దన్త మూలేభ్యః' (తైత్తి. ప్రా. ౨ అధ్యా. ౪౧ సూ.) రేఫస్థానమున కించుక మీఁదిభాగము 'బర్స్వ' మనెడి ఋ

వర్ణ్యపుస్థాన మనియు రేఫస్థానము దాని క్రింది వర్త్స్య మనఁదగు ప్రదేశమ నియు విశదమగుచున్నది. కావున "ఋకార రేఫములకు స్థానము బర్స్వ్యము" అనెడి పయి యాధునిక పండితాశయము సరికాదనక తీరకున్నది.

(౧౮౫)—పయిరీతిని రేఫమునకు స్థానము దంతమూలమని కాని దానికిని మూర్ధమునకు క్రింది బర్స్వ్యమునకును మధ్యప్రదేశమనికాని తేలు చున్నది. అంతియకాని మూర్ధము రేఫమునకు స్థానమని ప్రాతిశాఖ్యము లందుఁ జెప్పఁబడలేదు. పాణినీయ శిక్షయందును నితరపాణినీయ గ్రంథము లందును (సిద్ధాంత కౌముది - ఋ టు ర షాణాం మూర్ధా. 'స్యు ర్మూర్ధన్యా ఋ టు ర షాః' పాణినీయ శిక్ష) మాత్రము రేఫము మూర్ధన్య మని చెప్పఁ బడియున్నది. ఇంక ననుభవమునుబట్టి పరిశీలింత మనుటకును వీలులేదు. సామాన్యముగా నీరేఫమునె కాక యనేకవర్ణములను వానివానికిఁ జెప్పఁ బడిన స్థానకరణములకు ముందువెనుకటి భాగములచేతను సైతము పలికింపవచ్చును. వేయేల రేఫమును బై స్థానములందే కాక తాలువునందును బలికింపవచ్చును. కావుననే కొన్నియెడలఁ—వెనుక వ్రాయఁబడిన 'అకా రము' విషయమునందును, ముందు వ్రాయఁబడు 'లకారము' విషయము నందును—ప్రాతిశాఖ్యములకు సైత మభిప్రాయ భేదములు వెలయుచు న్నవి. కవర్గమును జిహ్వామూలము మొదలుగ మూర్ధము వఱకుఁ గలస్థానము లందెల్లఁ బలికింపవచ్చును. అట్టివానియందు దీపచ్ఛేద ముండక పోదు. కావునఁ ప్రాచీనకాలమందలి శుద్ధోచ్చారణమును గమనించి ప్రాతిశాఖ్య కర్తలు వానివాని స్థానకరణముల నుపదేశించి రను నమ్మికతో నాయాయివర్ణములకుఁ బ్రాతిశాఖ్యములలోఁ జెప్పఁబడిన స్థానకరణముల ప్రయత్నముచేతఁ గల్గెడి ధ్వనులె శుద్ధములనియుఁ దక్కిన ధ్వనులు కలుషితములె యనియు గ్రహింప వలయును. అట్టి యుచ్చారణకాలుష్యమువలననే వర్ణములందు వివిధములగు మార్పులు సంభవించుచుండును. అట్టి దుష్టోచ్చారణములు కొన్ని ఋగ్వేద ప్రాతిశాఖ్యప్రభృతులలోఁ జూపఁబడినవి (ఋగ్వేద. ప్రా. ౧౪ పటల. ౧౮౬. వి.)

ఒక్కొక్క వర్గమున కొక్కొక్క స్థానము చెప్పఁబడుటచేత సమాన వర్గీయవర్ణముల స్థాన మొక్కటే యని చెప్పకతీరదు. ప్రయత్నించి పలికినపు డక్లేకస్థానమునందే సమాన వర్గీయములను బలికింప వచ్చునేకాని యప్ర యత్న సిద్ధముగా నిపుడొక్కొక్క వర్గములోని వర్ణములను బలుకునపుడు మా

త్ర మవి యొక్క-చోటఁ బుట్టక స్వల్పభేదము గలతావులందుఁ బుట్టుచున్నట్లు తోఁచక మానదు. అట్లయినను నట్టిస్థానముల సమష్టినే యొక్కొక్క-స్థానముగాఁ బ్రాతిశాఖ్యములు చెప్పుచున్నవని గ్రహింప నగును.

(౧౮౬) రేఫోచ్చారణమున జిహ్వాగ్రమునందుఁ గంపము గలుగునని పాశ్చాత్య పండితులు చెప్పుచున్నారు. కాని లఘు వనఁదగు గీర్వాణ భాషలోని రేఫమునం దట్టి కంపము గలుగుట యనుభవసిద్ధమై యున్నట్లగపడదు. ఇంక నట్టి కంపము ద్రావిడభాషామాత్ర ప్రసిద్ధమగు నర్వాచీన శకట రేఫమనెడి ఱకారము(అలఘురేఫము)నుచ్చరించుటలోను ద్విరుక్త ఱకారము తెల్గున నుచ్చరించుటలోను మాత్ర మగపడుచున్నది. సంస్కృతమున 'రేఫ ద్విత్వ' ముండదు గదా. అట్టి కంపము సాంస్కృతిక రేఫోచ్చారణమున నున్నచో నట్టి యుచ్చారణము దుష్ట మనిపించుకొనును. రేఫోచ్చారణమున బర్బరతాదోషము త్యాజ్యమని ఋగ్వేద ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడెను. "అతిస్పర్శో బర్బరతా చ రేఫే" (ఋగ్వేద. ప్రా-౧౪ పటల. ౨౬ సూ.) పార్షదవ్యాఖ్య—"దుస్స్పృష్టో (ఈషత్ స్పృష్టః) రేఫః, సో౽తిస్పృశ్యతే - బర్బరతా చోచ్యతే. తౌ దోషౌ రేఫస్య వర్జయేత్ - బర్బరతా హ్యసౌకుమార్య మేవ."

(౧౮౭) అంతస్థములు లఘువులనియు నలఘువులనియు రెండువిధములు గలవని నన్నయ భట్టారకునిచేఁ జెప్పఁబడెను. (౩౭౨ వి.) అంతస్థముల యుచ్చారణమున,గల్గు స్థానకరణముల యీషత్ స్పర్శ మించుక శిథిలముగా జరగునపుడు జనించునవి లఘువులనియు నట్టి యీషత్ స్పర్శ మశిథిలముగా జరగునపుడు జనించు ధ్వనులు 'అలఘువు' లనియు గ్రహింప వలయును. ఈవిషయమునె వైయాకరణు లీక్రింది రీతిని జెప్పియున్నారు.

"యస్యోచ్చారణే జిహ్వా గ్రోపాగ్ర మధ్య మూలానాం శైథిల్యం స లఘూచ్చారణః" (సిద్ధాంత కౌముది) "లఘూచ్చారణే స్థాన కరణ శైథిల్యం జాయతే" (కాశికావృత్తి). ఈ రెండిటిలో గాశికాలక్షణమె యుక్తతరమై యున్నది. కౌముదీలక్షణమునఁ జెప్పఁబడిన ట్లొక వర్ణము నుచ్చరించునపుడు జిహ్వాగ్రాదుల కన్నిటికిని బ్రయత్నమే యుండదుగదా. కాన నందు జిహ్వాగ్రాదులలో నొక్కొక్కటి కని వివరించుకొనవలసియున్నది. మఱియు నీ లక్షణము "వ్యో ర్లఘు ప్రయత్నతర శ్శాకటాయనస్య" అనుసూత్రము నొద్ద యవల లఘ్వలఘుతలను నిరూపించు సందర్భమునఁ జూపఁబడినది. అట్టి స్థితిలోని కౌముదీలక్షణమున వకా రాలఘుత్వమునందలి యోష్ఠశైథి

చెప్పఁబడనే లేదు. కాఁగా నిందలి జిహ్వాశబ్ద ముపలక్షణార్థకమని వివరించికొన వలసియున్నది.

సంస్కృత భాషలో య వ ల కు మాత్రమె లఘ్వలఘూచ్చారణ భేదము గలదని చెప్పఁబడెను.

"వ్యో ర్లఘు ప్రయత్నతరః శాకటాయనస్య" (౮ అ - 3 పా. ౧౮ సూ.) భట్టోజీవృత్తిః—"పదాన్తయో ర్వకార యకారయో ర్లఘూచ్చారణౌ వ యౌ వాస్తోఽ చి పరే."

పదాంతములగు యకార వకారములకు "అచ్" ప్రత్యాహార వర్ణములు పరమగునపుడు వానిని లఘువులుగా సైతము పలుకవచ్చునని తాత్పర్యము. "భోయచ్యుత-అసావాదిత్యః" అనునవి లఘు యవల కుదాహరణములు.

సంస్కృతభాషలో ర ల లకు లఘ్వలఘుతా భేద మున్నట్లు శిక్షా ప్రాతిశాఖ్య వ్యాకరణములం దెచ్చటను జెప్పఁబడలేదు. కాని ఋగ్వేద ప్రాతిశాఖ్యమున ర ల ల యుచ్చారణములో నపపాఠములు కొందఱు చేయుచున్నారని యీక్రింది రీతిని జెప్పఁబడెను. రేఫ లకా రోచ్చారణములందు స్థానకరణముల కీషత్ స్పర్శము విధియై యుండఁగా నతిస్పర్శము చేయుదురనియు, శ్రుతికటుధ్వని (బర్బరధ్వని) చేయుదురనియుఁ జెప్పఁబడెను. మఱియు లకారోచ్చారణమున జిహ్వాగ్రాన్తములచే స్థానమును స్పృశింతు రనియు దోషముగాఁ జెప్పఁబడెను.

"అతిస్పర్శో బర్బరతాచ రేఫే" (ఋగ్వే. ప్రా-౧౪ పటల ౨౬ సూ.)

పార్షదవ్యాఖ్య—"దుఃస్పృష్టో రేఫః-సోఽతిస్పృశ్యతే, బర్బరతా చోచ్యతే-తౌ దోషౌ రేఫస్య వర్జయేత్. బర్బరతా ప్యసౌకుమార్య మేవ."

"జిహ్వాగ్రాన్తాభ్యాం చ వచనం లకారే" (ఋగ్వే. ప్రా. ౧౪. పటల ౨౭ సూ). పార్షద వ్యాఖ్య—"జిహ్వాగ్రేణ వక్తవ్యః లకారః యదా జిహ్వాయాః అన్తాగ్రాభ్యా ముచ్యతే తదా స దోషో భవతి. పూర్వోక్తా చాతిస్పర్శ బర్బరౌ త్రయో దోషా లకారస్య భవన్తి." లకారము యొక్క యిట్టి దుష్టోచ్చారణమె క్రమక్రమముగా వ్యాళ గరళ గోళాది సంస్కృతశబ్దములందలి యలఘు ళకారోచ్చారణమునకు బీజమయ్యెనా యని యాలోచింప వలసియున్నది. ళకారముయొక్క యీ యలఘూచ్చారణము శిక్షా ప్రాతిశాఖ్యాదులలోఁ జెప్పఁబడియుండమింజేసి యిది యర్వాచీన మనుటకు సందియము లేదు. కాని యెప్పటినుండియు నిది యారబ్ధమై వాఙ్మయమున

కెక్కెనో తెలియకున్నది. అహోబల పండితీయమున నుదాహరింపఁబడిన యీ
క్రింది కారిక భోజరాజుదని చెప్పఁబడియుండుటంజేసి పదునొకండవ శతా
బ్దమునాఁటికె యిది సంస్కృతమున రూఢమై వెలసియున్నదని నిశ్చయింప
నగును.

"తదుక్తం భోజరాజేనః—రలయో ర్లడయో స్తద్వ। ల్లళయో శ్శస
యో రపి। వబయో ర్నణయో శ్చాన్తే। సవిసర్గావిసర్గయోః। సబిన్దు కాబిన్దు
కయో। స్స్యా దభేదేన కల్పనమ్." (అహో. ౧౩౭ పుట). (ఇందలి భోజ
రాజేన' అనుపాఠము నా యొద్ద నున్న లిఖిత మాతృకలో నున్నది. శొంఠి
భద్రాద్రి శాస్త్రులుగారి టీకతో ముద్రించిన పుస్తకములో 'త్రిభోజనే'
అని యుంకుట ప్రామాదికము.)

పయి రీతిని గోళగరళ వ్యాళాది కతిపయ శబ్దములలో మాత్రమె యల
ఘు లకా రోచ్చారణ మాంధ్ర దేశమున వాడుకలో నున్నను సంస్కృతశబ్ద
ములం దెల్లెడను నట్టి యుచ్చారణము పాక్షికముగాఁ గర్ణాట దేశమున నున్న
దని యీ క్రింది కర్ణాట శబ్దానుశాసనమువలన విశదమగుచున్నది.

"లో ళః" (౧౩౯ సూ.)వృత్తిః—"లకారస్య ళ కారాదేశో వా భవతి—
జల = జళ, తిలక = తిళక... ... ...అయ మేవ క్షళ వ్యపదేశభాక్."

ప్రాకృత వ్యాకరణములలో నిట్టి సాంస్కృతి కాలఘు లకారమునకు
లఘు లకారము నీ క్రింది రీతిని విధించుట నరయఁగా నట్టి యుచ్చారణ
మింకను జిరకాలము క్రిందటనే సంస్కృతమునఁ బ్రసిద్ధమై యుత్తర దేశ
మున నిత్యమై వాఙ్మయమున కెక్కెనని చెప్పవలసియున్నది.

"ళో లః" (౩—౨—౪౮) పైశాచ్యాం ళో లకారః స్యాత్.
ముకుళో = ముకులో ; కోమళో = కోమలో ; (ఈ ళకార విధానమునుగూర్చి
మున్ముందు విపులముగా వ్రాయఁబడును).

ముందుదాహరింపఁ బోవు (౨౪౭ వి.) ద్రావిడభాషా ప్రసిద్ధమగు
గయ్యాళీత్యాది శబ్ద గత మూర్ధన్య ళకారము సంపర్కమునఁ గ్రమక్రమ
ముగా నీ యలఘు ళకారధ్వనియు నట్టి మూర్ధన్య ళకారధ్వనితో నభిన్న
మగుచు నద్దాని లిపితోనె (ఴ) వ్రాయఁబడ సాగెనని యెన్నఁ దగును.

అనుప్రదానా దిత్యాది కారికోక్తములగు వర్ణవైశేష్య సంపాదక
లక్షణము లెవ్వియు లేమింజేసి లఘ్వలఘువులు విభిన్నాక్షరములు కానే
రవు. అంతస్థముల లఘ్వలఘూచ్చారణములలో బాహ్యాంభ్యంతర ప్రయత్న

ములు తుల్యములై యగుటంజేసియు, స్థానకరణ స్పర్శమునందలి శైథిల్య తర భావ రూపభేదము మాత్రమె వెలయుచుండుటంజేసియు వానిని వేర్వేఱు వర్ణములుగఁ బరిగణింప నక్కఱలేదు. కావుననే శిక్షా ప్రాతిశాఖ్యములలో సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధములగు లఘు యవలకు వర్ణసమామ్నాయ మునఁ బృథగ్గణనము లేదయ్యెను. అట్లె ప్రాకృతవర్ణ సమామ్నాయమునం దును దద్భాషా ప్రసిద్ధములగు లఘు యకార లకారములకుఁ బృథగ్గణనము లేదయ్యెను. కావుననే నన్నయ భట్టారకుఁడును సంస్కృత మార్గానుసారియై తెలుఁగునఁ దా నంగీకరించిన లఘు య వ లకును నలఘు ర ల లకును వర్ణ సమామ్నాయమునఁ బృథగ్గణనమును జేయఁ డయ్యెను. (౨౧౭. వి.)

(౧౮౮)—పయిరీతినే ద్రావిడభాషా స్థిత మూర్ధన్య ళకార సంపర్క మునఁ దాద్రూప్యము నంది యట్టి ళకారముగనే నేఁటి యుచ్చారణములో నున్నను, "అగ్ని మీళే, ఏకనీళమ్ దేవహేళనమ్" మున్నగు వైదిక సంస్కృత స్థలములందలిది యలఘు లకారను కాదనియు దుఃస్పృష్ట డకారమనియు నెన్నఁ దగును. స్వర మధ్యగత డకారము నీషత్ స్పృష్టముగఁ బలుకుటచే నియ్యది జనించుచున్నది. స్వరమధ్య గతమగు డకారమును మూర్ధన్యముగఁ బలుకక కొన్ని శాఖలవారు జిహ్వామూలీయముగఁ బలుకు చున్నారని ఋగ్వేద ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియున్నది. ఇచటి డకార మీషత్ స్పృష్టముగఁ బలుకఁబడుటచేత దీనిని దుః స్పృష్టమని వాడు చున్నారు. (౨౨౮ వి.) పాణిని శిక్షలో నీ క్రింది రీతిని పేర్కొనఁబడిన దుః స్పృష్టశబ్దముచే వాచ్య మిదియే యనఁ దగును. "విసర్జనీయస్య దుఃస్పృష్ట స్యచ నోష్మ స్వాంతర్భావః— 'ఉష్మ విసర్జనీయ' ఇతి ( ౧—౧౨ ) పృథ గ్గ్రహణాత్ — 'పృక్త స్వరా త్పరో ళోడమ్' (౧౩—౧౬. ఇతి నిర్దేశ సామర్థ్యాచ్చ........... అత్ర డకార ళ కారయో (ర్భేదః?) రస్మ త్సం హితాయా మవిద్యమాన త్వేఽపి శుక్రియ బ్రాహ్మణే పితృమేధాదౌ చ విద్య మానత్వాత్ సమామ్నాన మత్ర క్రియతే" (తైత్తిరీయ ప్రాతిశాఖ్య వ్యాఖ్య—వైదికా—౧ అ ౧. సూ.)

త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా। వర్ణాః శమ్భు మ తే మ తాః।......। అనుస్వారో విసర్గశ్చ। ᳵ క ᳶ పౌచాపి పరాశ్రితౌ। దుఃస్పృష్ట శ్చేతి విజ్ఞేయః। ౡకారః ప్లుత ఏవచ" (పాణిని శిక్ష) ఈ విషయము ముందువిపులముగా విమర్శింపఁ బడును ౨౧౮ వి.)

“జిహ్వామూలం తాలు చాచార్య ఆహ స్థానం ళకారస్య తు వేద మిత్రః” (౯ సూ. ఋగ్వేద - ౧ పట - ౩౮ పుట)

“ద్వయో శ్చాస్య స్వరయో ర్మధ్య మేత్య సమ్పద్యతే స డకారో ళకారః” (౧౦) (ఋగ్వేదప్రా - ౧ పటల - ౩౮ పుట). ళ్హకారతా మేతి సఏవ చాస్య ఢకార స్సన్నూష్మణా సంప్రయుక్తః” (౧౧ సూ. ఋగ్వేద ప్రా - ౧ పటల. ౩౮ పుట) “ఇళా సాళ్హా చాత్ర నిదర్శనాని ... ...” (ఋగ్వేద ప్రా - ౧ పటల ౩౯ పుట).

ఋగ్వేదసాయన భాష్యమునందును నీవిషయమె వ్రాయఁబడియున్నది.

“అగ్నిమీళే పురోహితమ్” ఋగ్వేద ప్రా - ౧ అధ్యా. ౧ వర్గ ౧ ఋక్కు ౪౪ పుట.)

సాయన భాష్యము:—“అగ్ని నామకం దేవ మీడే స్తౌమి. ‘ఈడ స్తుతౌ’ ఇతిధాతుః - డకారస్య ళకారో బహ్వృచా మధ్యేతృసంప్రదాయ ప్రాప్తః - తథాచ పఠ్యతే:—

“అజ్మధ్యస్థ డ కారస్య। ళకారం బహ్వృచా జగుః। అజ్మధ్యస్థ ఢకారస్య। ళ్హకారం వై యథాక్రమమ్”

‘ఏకసీళమ్’ (తైత్తిరీయారణ్యకము. ౧౦ ప్రశ్నము - ౧ పన్నము) ‘దేవహేళనమ్’ (తైత్తిరీయారణ్యకము. ౧౦ ప్రశ్నము. ౬౦ పన్న). తెలుఁగు భాషలో నయితమిట్టి ళకారము ప్రాచీన కాలమున నుండెడిది. అయ్యది కాలక్రమమున మరల స్వస్వరూపము ననఁగా డకారరూపమునె తఱచుగఁ బొందినది. ఈ విషయమున, కె. వి. లక్ష్మణరావుగారిట్లు వ్రాసియున్నారు. “తెనుఁగు భాషయందు నీవర్ణము యుద్ధమల్లుని శాసనకాలము వఱకు నుండె ననుట స్పష్టము... ... ...ఇందును గుఱించి శోధింపగాఁ ౧౧ శతాబ్దమునకుఁ బూర్వపు తెనుఁగు దేశపు శాసనములలో నీయక్షరము కానవచ్చుచున్నది ... ... ...” (లక్ష్మణరాయవ్యాసావళి. యుద్ధమల్లుని బెజవాడ శాసనము, ౧౨౯ - ౧౩౨ పుట)

వీరు సరిగఁ బరిశోధింపక నయిరీతిని వ్రాసిరే కాని పదునొకండవ శతాబ్దమునకుఁ బిమ్మటి శాసనములలో నయిత మీయక్షర మగపడుచున్నది.

“ఖిల్లి (౧ పంక్తి, మూఁడవతేకు పెడప్రక్క) నళుము... ... పలుమటి ముయ్యాలికుఱ్ఱ గుంట (౨ పంక్తి, ౫ తేకు.) లేట్లిగుంట కోళు (3 పంక్తి ౫ తేకు) కాకణ్డివాళి, ముయ్యాలి కుఱ్ఱు. ఉత్తరతః మద్దిగుంట అటమెటిని,

గుంటయు". (ద్వితీయ కులోత్తుంగ చోళదేవుని పొందువ గ్రామశాసనము, ౧౧౩౪ క్రీస్తుశకము, ఇండియను ఆంటిక్వారీ, ౧౮ వాల్యము).

(౧౮౯)—ఇట్టి ఱకారము పఱగన్నడమునందు లౌకికసంస్కృత పదములలో సయితము వినఁబడుచున్నది. తమిళ భాషలో నేఁటికిని నీ ధ్వని వాడుకలో నున్నది. ద్రావిడ భాషలలో సైత మీఱకారము తఱచుగా డకారమునుండియే వెలయుచున్నది. అందును నిది స్వర పూర్వకమయియే యుండును. కర్ణాట శబ్దానుశాసనకర్తయగు భట్టాకలంకుఁడు వ్యాల గోలాదులగు సంస్కృతశబ్దములలోని లకారస్థానమున ళకారమును విధించి నట్లే నాడీ గుడాది శబ్దములలోని డకారస్థానమున ఱకారమును విధించి యున్నాఁడు.

"లో ళః" (కర్ణాటశబ్దా - ౨ పాద - ౧౩౯ సూ,) వృత్తి:—."లకారస్య ళకారాదేశో భవతి - ప్రయోగః— ... అలి = అళి, జల = జళ-"

"డో బహుళమ్" (కర్ణాటశబ్దా. ౨పాద ౧౪౦ సూ.) వృత్తి "డకారస్య ఱకారదేశో బహుళం యథాలక్ష్యం భవతి-గుడ=గుఱం. విడంగ=విఱంగ. గాడి=గాఱి. నాడి=నాఱి. ఖడ్గ=ఖఱ్గం."

ఇట్టి ఖఱ్గశబ్దము సంస్కృత సమాసమధ్యమునందును బ్రయోగింపఁబడుట గలదని యీక్రింది శాసన శ్లోక భాగమువలన విశద మగుచున్నది.

"యద్ధస్తఖఱ్గ పరిషా, (ధూ?) త మదాన్ధ మత్త। మాతఙ్గ మస్తక వినిర్గత మౌక్తికౌఘైః" (ద్వితీయ కులోత్తుంగచోడ దేవుని పొందువగ్రామ శాసనము. 3 రేకు - రెండవప్రక్క మొదటిపంక్తి - ఇండియను ఆంటిక్వారీ-౧౮ నెంబరు. వాల్యము-).

(౧౯౦)—కర్ణాటమున దేశ్యభాషలో సైత మనేక స్థలములందు డకారము ఱకారముగా మాఱును. ఇంతియకాక ప్రాచీన కర్ణాటభాషలోని ఱకారము నవీన కర్ణాటమున ళకారముగా మాఱుట నియతమై యున్నది. దీనినిబట్టి డకారముయొక్క ప్రథమపరిణామము ఱకారమనియుఁ దదనంతరపరిణామము ళకారమనియు విశదమగుచున్నది గదా. ఈరీతినే వైదిక సంస్కృతమునందలి మొదటి పాఠమున 'అగ్నిమీడే' అను రీతిని డకార ముండెడిదనియుఁ దర్వాతి పాఠమున 'అగ్నిమీఱే' అను రీతిని ఱకార ముండెడి దనియుఁ దదనంతర పాఠమున, ననఁగా నేఁటి పాఠమున 'అగ్నిమీళే' అను రీతిని ళకార మేర్పడిన దనియు నూహింప నగును. కావుననే వేదకాలమున నున్న

యట్టి టకారము ద్రావిడ మూర్ధన్య ళకారముగా నర్వాచీనులచే నుచ్చరింపఁ బడుచున్నది. అట్లై సంస్కృతములో వ్యాల గోలాది శబ్దములలోని యలఘు లకారము సైతము మూర్ధన్య ళకారము వలెనే పలుకఁబడుచున్నది. కావున టకార పరిణామ ళకారమును వ్యాల గోలదులలోని యలఘు ళకారమును 'ఌ' అనులిపితోనే సంస్కృతమున వ్రాయఁబడుట సంభవించెను.

(౧౯౧)—అప్పకవియుఁ బైని వ్రాసిన 'ఏక నీటమ్, దేవహేటనమ్' (౨౮౭ వి.) మున్నగు వానిని ళకార ఘటితములుగనే తలఁచి యీక్రింది రీతిని జర్చించి యున్నాఁడు. "సీ॥ ఏకనీళము దేవహేళనంబు నటంచు యాజుషామ్నాయంబునందు లేదొ। కాళనీళవ్యాళ గోళ హింతాళంబు లనుచు సంస్కృతభాష యందు లేదొ। గయ్యాళి త్రుళ్ళు నగళ్ళు వజ్రపుఁ దళ్కుఁ దాళికి నంచు నాంధ్రమున లేదొ। పాళంబెఱుంగని కూళ విరాళి పిసాళించు ననియు దేశ్యమున లేదొ। ... ...(అప్పక-౨ ఆశ్వా ౬౭-పద్య) "వేదమున మూర్ధన్య ళకార మొకటి కలదు. ఇది యచ్చుల మధ్యను డకార స్థానమునఁ గతిచిచ్ఛాఖా పాఠములలోఁ గనఁబడుచుండును. ఉ. ఈడే లేక ఈళే,....." అని యిట్లాధునిక పండితులు సైతము వ్రాసియున్నారు (ప్రమోదూత సంవత్సరాశ్వయుజ భారతి).

ఈటే, దేవహేటనమ్, ఏకనీటమ్' మున్నగుచోటులందలివి మూర్ధన్య ళకారములు కావనియు నవి జిహ్వామూలీయములగు నీషత్ స్పృష్ట డకార ధ్వనివిశేషములనియుఁ బైని వ్రాసిన ప్రాతిశాఖ్యములవలన స్పష్టపడుచుండుటచే నీయర్వాచీ నాభిప్రాయములు సరికా వనుటలో సందేహము లేదు గదా. వేయేల! ళకార మెన్నఁడును నెవ్వరిచేతను నీషత్ స్పృష్టముగఁ బలుకఁబడ నేరదుగదా. ఇట్టిస్థితిలో ద్రావిడ మూర్ధన్య ళకారమును లకార మూలకమగు గోలవ్యాలాది శబ్దములలోని యలఘు లకారమును నీషత్ స్పృష్ట డకారము జిహ్వామూలీయము నగు వైదిక టకారమును నభిన్నములనెడు నప్పకవి యాశయము కేవలము నసంగత మనుటలోను నెవ్వరును విప్రతిపన్నులు కాఁ జాలరుగదా.

(౧౯౨)—"లరయో ర్లడయో స్తద్వ ల్లలయో శ్శసయో రపి। వబయో ర్నణయో శ్చాన్తే। సవిసర్గావిసర్గయోః। సబిన్దు కాబిన్దుకయో। స్స్యా దభేదేన కల్పనమ్. (అహో.౧౩౭ పుట.) అను భోజరాజ వచనము సైతము పై యప్పకవి యాశయమునకు హస్తావలంబ మీయఁజాలదు." సకలకలం(స+కల కల, సకల+కలా) పుర మేత జ్జాతం సంప్రతి సుధాంశుబింబ మివ" మున ౨

కవిప్రయోగములలోని శబ్దశ్లేషములందలి లఘ్వలఘు లకారముల యభిన్న తను మాత్రమె యా వచనము చెప్పుచున్నది, గాని యది ద్రావిడ మూర్ధన్య ళకారముతో లకారమునకును దాని యలఘు రూపమునకును నభిన్నతను జెప్పుచుండ లేదు.

పయి భోజరాజ వచనములోని ల డ ల యభిన్నతను జలజడాది రూప ములలోఁ గల పర్యాయస్థితిని బరిశీలించు నపుడు సైతము, సంస్కృతమునందుఁ బ్రాచీన కాలమున ఱకార ముండెడి దని తోఁచక మానదు. పై నుదాహరిం చిన ప్రాతిశాఖ్య వచనముల చొప్పునఁ గొన్ని శాఖలవారు 'జడము' మున్నగు వానిలోని యజ్మధ్యస్థ డకారమును ఱకారముగా బలుకుచుండుటయు, నది నానాఁటికి మూర్ధన్య ళకారవలెగా మాఱి కాలక్రమమున లకారముగా మాఱుటయు సంభవించుటచే నట్టి జడ జలాది ద్వైరూప్య మేర్పడి యుండునని తోఁచు చున్నది. "జల-త్రి-జల-అచ్. డస్య లో వా. ౧ జడే ౨. ఉదకే.... ...... " (వాచస్పత్యము) "జడం. క్లీ. (జలతి లోకాన్ జీవయతీతి జల+అచ్, లడయో రైక్యాత్ - లస్య డత్వమ్.) జల మిత్యమరటీకాయాం రాజముకుటః (జలతి ఘనీభవతీతి-) సీసకమ్ ఇతి-రాజనిర్ఘణ్టః. (శబ్దకల్పద్రుమకోశ).

పై విధముననే కొన్ని సంస్కృత శబ్దములలోని డకారములను గొన్ని శాఖలవారు ఱకారములుగాఁ బలుకుచుండుటయు, నవి నానాఁటికి మూర్ధన్య ళకారములవలె మాఱి కాలక్రమమునఁ బ్రాకృత భాషలలో లకార రూపము నందుటయు సంభవించెనని యూహింపవలసి యున్నది. ఈక్రింది రీతిని డకా రము లకారమగుట కింతకన్న యుక్తతమమగు మార్గము వేఱొండు లేదన వచ్చును.

"టో ర్బడిశాదౌ లః" (౧-3-౨౮) ల్విత్యను వర్తతే. బడిశాదౌ టో ష్ట వర్గస్య లత్వంతు స్యాత్ -గుడః = గులో, గుడో.

'లల్ డోఽనుడుగే' (౧-3-30) అస్త్రోరఖో (అయుక్త స్యానాదౌ స్థితస్య) రచః పరస్య డస్య లకారో భవతి. అనుడుగే ఉడ్వాదిగణం వర్జయిత్వా. లిత్త్వా న్నిత్యం. గరుడః = గలులో-" (షడ్భాషా చంద్రిక, ౫౨—౫3 పుటలు) "డోలః" (౮-౧-౨౦౨) స్వరా త్పర స్యాసంయుక్త స్యాఽనాదే ర్డస్య ప్రాయో లో భవతి-వడవాముఖం = వలయా ముహం, గరులో. (సిద్ధహేమ చంద్ర శబ్దానుశాసనము, 3౮ పుట.)

పయిరీతిని స్వరమధ్యగత డకారములు నిత్యముగా [లేదా ప్రాయిక ముగా] లకారములుగా మాఱిన సంస్కృత శబ్దములు ప్రకృతమున వెలయు చుండుట నరయఁగా సంస్కృత భాషలో స్వరమధ్యగత డకారమును లకార ముగఁ బ్రాయికముగఁ బలుకుచుండెడి వారని తోఁచకమానదు గదా.

లఘ్వలఘు లకారములను దుఃస్పృష్ట డకారమును ద్రావిడ భాషా ప్రసిద్ధ మూర్ధన్య ళకారమును విభిన్నస్థానకరణ ప్రయత్నములు గలవై యున్నవి. సంవృతకంఠ వివరమునుండి బయలు వెడలు నాదరూప నిశ్వాసము జిహ్వామూలమునకు మీఁదనున్న మృదు తాలుభాగము నించుక తాఁకియున్న జిహ్వాగ్రమును వియుక్తముగఁ జేయుటచే దుఃస్పృష్ట డకారము జనించును. దంత మూలము నించుక తాఁకియున్న జిహ్వాగ్రము నట్టి నాదరూప నిశ్వాసము వియుక్తముగఁ జేయుటచేత నలఘు లకారము జనించును. అట్టి స్పర్శమున శైథిల్య మున్నచో లఘు లకారము జనించును. అలఘు లకారముయొక్క యుచ్చారణము ముద్దుమాటలలోని లకారోచ్చారణమువలె నుండును.

(౧౯౩)—ఇంక ద్రావిడ భాషలలోని మూర్ధన్య ళకారముయొక్క యుచ్చారణ మన్ననో మిక్కిలి విజాతీయమైనది. ప్రతివేష్టిత మనఁగా మణవఁ బడిన జిహ్వాగ్రము మూర్ధమును నించుక తాఁకెడు స్పర్శము నిశ్వాసముచే విడఁగొట్టఁబడుటవలన ద్రావిడ ళకారధ్వని సంభవించుచున్నది. మఱియు దీని యుచ్చారణమున నట్టి స్పర్శమును నిశ్వాసము విడఁగొట్టిన పిదప వక్త్ర వివరాధోభాగమున జిహ్వ చదికిలఁబడుటయు ననుభవసిద్ధమై యున్నది. ఇట్లు జిహ్వ చదికిలఁబడు జాడ యించుక మూర్ధన్య ణకారోచ్చారణము నందు సైత మగపడుచున్నది. పయిరీతి నియ్యవి పరస్పర విభిన్నములగుట చేతనే కర్ణాట వైయాకరణులు వీనిని అ ఱ, క్ష ళ, కుళములని ముత్త్రివిధ ములుగా నిట్లు విభజించియున్నారు.

"అత్రాయం నిష్కర్షః—లకార స్థానికాః క్షళాః (సంస్కృతశబ్దగ తా లఘులకారములు కన్నడమున ముకుళ, వకుళ మొ.) దాడిమ స్ఫటికాద్యన్య స్థానికా గణ పఠితాశ్చ అఱాః. (ఱకార ఘటితములు—దాఱిమ=దాడిమ —మొ.) శేషాస్సర్వే కుళాః. (ద్రావిడ దేశ్య మూర్ధన్య ళకారములు)"— మంజరీ మకరంద వ్యాఖ్య, ౯౦ పుట.)

(౧౯౪)—ఇట్టి ద్రావిడ ళకారము సంపర్కముననే తెల్గుభాషలోఁ గాలక్రమమున 'ఊళ్లు' (ఊళ్ళు) మున్నగు బహువచన శబ్దములలోని

యలఘు లకారములకును, వ్యాలము (వ్యాళము) గోలము (గోళము) మున్నగు తత్సమ శబ్దములలోని యలఘు లకారములకును నీద్రావిడమూర్ధన్య ళకారముయొక్క యుచ్చారణమును లిపియు సంభవించి యుండునని విమర్శకులు గ్రహింతురుగాక.

## దంత్యములు

(౧౯౫)—"దన్త్యా ఌ తు ల సాః స్మృతాః" అని యిట్లు ప్రకృతకారిక ఌ వర్ణమును 'త వర్గమును' లకార సకారములును దంత్యములని చెప్పుచున్నది. శుక్ల యజుః ప్రాతిశాఖ్యమునఁ గాత్యాయనునిచేత నయిత మిట్లె చెప్పఁబడెను. మఱియు వీనికి జిహ్వాగ్రము కరణమని కాత్యాయనుఁడు చెప్పి యున్నాఁడు. కాఁగా జిహ్వాగ్ర దంతముల స్పర్శమును నిశ్వాసము విడఁగొట్టుట చేత 'త'వర్గము పుట్టుచున్నదని తేలుచున్నది. సకార మూష్మము గాన నద్దాని యుచ్చారణమున నట్టి స్పర్శ ముండదు. ఇంక నట్టి జిహ్వాగ్రమును దంతములును సమీపానీతములై యుండఁగా నిశ్వాసము వెడలిపోవును. కావున నీ తవర్గ సకారములకు దంతములు స్థానము. జిహ్వాగ్రము కరణము.

"ఌ ల స తా దన్తే" (శుక్ల యజుః ప్రా. ౧ అధ్యా. ౬౯ సూ.)

ఉవ్వట భాష్యము:—"ఌ, ౡ, ఌ 3, ఏతే త్రయః లకారః సకారః తవర్గ ఇత్యేతే దశవర్ణా దన్త్యాః."

"దన్త్యా జిహ్వాగ్ర కరణాః" (శుక్లయ.౧అ.—౭౬సూ.)

ఉవ్వట భా:... "దన్త్యా జిహ్వాగ్రేణ క్రియన్తే......"

(౧౯౬.)—వెనుక వ్రాసిన రీతిని స్థాన కరణములందు సమీపస్థాన వ్యత్యాసము సంభవించుట సహజమె యగుటచేఁ బైరీతిని పాణినీయ శిక్ష యందును శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును జెప్పఁబడినను వీనికి దంతమూలములు స్థానమనుట యనుభవసిద్ధమై యుండును. కావుననే ఋగ్వేద ప్రాతిశాఖ్యమునందును తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందును వీనికి దంతమూలమె స్థానమనియు జిహ్వాగ్రము కరణమనియుఁ జెప్పఁబడెను.

పై పాణినీయ శిక్షలోని దంతశబ్దము సైతము దంతమూలపరమె యని వాచస్పత్య కోశమున నిట్లు వ్రాయఁబడి యున్నది.

"కవర్గస్య కణ్ఠమూలీయత్వమ్. కణ్ఠ్యత్వ వ్యవహారస్తు కణ్ఠమూలపర తయా భాక్త ఏవ. తవర్గస్య దన్తమూలీయత్వేపి దన్త్యత్వవత్. అన్యథా

భాగస్య దన్తస్య తదనుచ్చారాపత్తేః." (వాచస్పత్యకోశము, ౧౬౦౦ పుట, వ్యంజన వర్ణ విభాగ సందర్భము.)

అందును ౘ వర్ణ లకారముల యుచ్చారణమున నింకను వైలక్షణ్యము కలదు. ౘ వర్ణోచ్చారణ క్రమ మీ వఱకే వ్రాయఁబడెను. ల వర్ణమునకు దంత మూలమునందలి మీఁదిభాగము స్థానమని తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడియున్నది. అట్లె జిహ్వాగ్ర మధ్యభాగము కరణమని చెప్పఁబడియున్నది. కాఁగా జిహ్వాగ్రముతో దంతమూలమును స్పృశించుటచేత 'త' వర్గము జనించుననియు జిహ్వాగ్ర మధ్యభాగముతో దంతమూలము లందలి యుపరిభాగమును నించుక స్పృశించుటచేత లకారము జనించు ననియు విశదమగుచున్నది. దీనినిబట్టి త వర్గస్థానమగు దంతమూలమునకు మీఁది భాగము లకార స్థానమనియు దానిమీఁది భాగము రేఫ స్థానమనియు గ్రహింపవలయును. అట్లె కానిచో 'రేఫే జిహ్వాగ్ర మధ్యేన ప్రత్యగ్దన్త మూలేభ్యః' అనియు, 'దన్త మూలేషు లకారే' అనియు విభిన్నతను బోధించుచు సూత్రద్వయము నుపదేశించుట సంభవింపదు గదా. పై విషయములకుఁ బ్రమాణములు—

"దన్త మూలీయస్తు తకారవర్గః" (ఋగ్వేద ప్రా. ౧. పటల ౩౫ పుట)

"సకార రేఫ లకారాశ్చ" (ఋగ్వేద ప్రా. ౧ పటల. ౩౬ పుట.)

"రేఫం వర్త్స్య మేకే" (ఋగ్వేద ప్రా. ౧ పటల. ౩౭ సూ.)

పార్షదవ్యాఖ్యః—"వర్త్స్య శబ్దేన దన్తమూలా దుపరిష్ఠాత్ ఉచ్ఛూనః ప్రదేశ ఉచ్యతే."

"జిహ్వాగ్రేణ తవర్గే దన్తమూలేషు" (తైత్తిరీయ ప్రా. ౨ అ. ౩౮ సూ.)

వైదికాభరణ వ్యాఖ్యః—"జిహ్వాగ్రేణ యథావస్థితేన ఉత్తర దన్త మూలే ష్వధో భాగే స్పర్శయతి."

"స్పర్శ స్థానే షూష్మాణ అనుపూర్వ్యేణ" (తైత్తి. ౨ అధ్యా. ౪౪ సూ.) "దన్త మూలేషు లకారే" తైత్తి. ౨ అధ్యా. ౪౨ సూ.)

వైదికాభరణ వాఖ్యః—"దన్త మూలేషు ఉపరి భాగే స్పర్శయతి.

(౧౯౭)—శౌనకునివలెనే పాశ్చాత్యపండితులును లకార త వర్గములకు స్థానైక్యము నంగీకరించుచున్నారు. ఇంతియకాక లకార మీషత్ స్పృష్టము కాదనియు, దాని యుచ్చారణమునందును 'త' వర్గోచ్చారణమునందువలెనే కఠిన స్పర్శమె స్థానకరణములకు వెలయుచుండుననియుఁ జెప్పుచున్నారు. ఈ పక్షమున 'ద' కార లకారములకు భేదము లేదని చెప్పవలసి వచ్చుచున్నది. దకార లకారములు రెండిటి యుచ్చారణమునందును జిహ్వాగ్రము దంతమూలములను దాఁకుట తుల్యమే యైనను దకారోచ్చారణమున నట్టి స్పర్శమును నాదరూప నిశ్వాసము భేదించుట సంభవించుననియు లకారోచ్చారణమున నట్టి స్పర్శము భేదింపఁబడదనియు నిఁక నాదరూప నిశ్వాసము జిహ్వాగ్రపార్శ్వములనుండి వెడలిపోవుననియుఁ బాశ్చాత్య పండితులు వానికి భేదమును జెప్పుచున్నారు. అవసాన లకారోచ్చారణమునందువలెనే యవసాన నకారోచ్చారణమునందును స్పర్శము వీడకుండుట యనుభవసిద్ధమై యున్నది. కాని పాశ్చాత్య పండితులు నకారవిషయమున నిట్లు చెప్పకుండుట కేమి కారణమో తెలియకున్నది.

## దంత తాలవ్యములు

(౧౯౮) ఆంధ్ర భాషలో దంత్య చ జ లును గలవు. గీర్వాణభాషలో 'చ జ' లే యచ్చుతో నున్నను దాలవ్యములుగనే పలుకఁబడుచున్నవి. ఆంధ్రభాషయందన్నటో యట్లుగాక 'చ జ లు' 'అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ' అను నచ్చులతో నుండునపుడు దంతతాలవ్యములుగను, 'ఇ ఈ ఎ ఏ' లతో నుండునపుడు తాలవ్య మాత్రములుగను బలుకఁబడుచున్నవి. వీని విషయమున నాధునిక పండితు లొక రీక్రిందరీతిని వ్రాసి యున్నారు.

"కాలక్రమమున నీ చ జ ల నుచ్చరించుటలోఁ గొంతమార్పు గలిగి తాలు స్థానమునకు దూరమై దంతస్థానమునకు సన్నికృష్టమాయెను. ఈసన్నికర్షమునుబట్టి దంత్య చకారమునకుఁ జిహ్నముగా 'తకార సకార సంయోగ చిహ్నమును వ్రాయ మొదలిడిరి. ఈ యంశములు ప్రాచీన లిపిమార్గమును బాగుగఁ బరిశీలించిన వారందఱును గమనించియె యుందురు. (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, 7 వాల్యము, ౨౬౧ పుట. చెన్న. విశ్వ పు_స్త- భాం.)

ఈ యభిప్రాయము సరియై యుండలేదు. ఆంధ్రభాషలోని దంత్య చ జ లయందుఁ దాలవ్యతా సామగ్రి యంతరింపలేదు. తాలవ్యము లనఁగాఁ

కేవల తాలవ్యతా సామగ్రి గలవనియు, దంత్యము లనఁగాఁ దాలవ్యతాసామగ్రియేకాక దంత్యతా సామగ్రి సైతము గల దనియు నాంధ్రములోని చ జ ల విషయమున వాడిన దంత్యతాలవ్య శబ్దముల యర్థమును గ్రహింప నగునేకాని దంత్య చ జ లందుఁ దాలవ్యతా సామగ్రి యెడపడి దంత్యతా సామగ్రి యావేశించినదని భ్రమింపరాదు. దంత్య చ జ ల నేఁటి యుచ్చారణమునందును దాలవ్య చ జ లందువలెనే జిహ్వామధ్యము తాలువును స్పృశించుచునే యున్నది. మఱియు 'త ద' లకువలె జిహ్వాగ్రము దంతమూలములను స్పృశింపలేదు. అట్లయిన వీనిని దంత్యములని యెట్లుచెప్ప నగునని శంకింపరాదు. ఈ దంత్య చ జ లందుఁ దాలవ్యతా సామగ్రి పయిరీతిని వెలయు చుండఁగా జిహ్వామధ్యముయొక్క పార్శ్వభాగము, తన ప్రక్కనుండు దంతములను సయితము తాఁకుచుండుట యనెడి దంత్యతా సామగ్రియు వెలయుచున్నది. కాఁగా వీనిని దంత తాలవ్యములనుటయు సహజమె యైనను కేవల తాలవ్య చ జలకు వ్యావర్తకముగా దంత్య చ జ లన్నం జాలియుండుటచే నట్టివ్యవహారము కురుపాండవ వ్యవహార న్యాయమున విస్తరించినది. మఱియు వీనిని 'చ జ' లనుటచేతనే (తాలవ్య) వీనియందలి తాలవ్యతా సామగ్రి వ్యక్త మగుచుండుటచేత సైతము వీనికి 'దంత్య చ జ లు' అను వ్యవహారము దంతతాలవ్య చజ లను నర్థము నీయ సమర్థమగుచున్నది.

ఇఁక దంత్య చకారమును గొందఱు దాళపత్ర మాతృకా లేఖకులు 'త్స' అనెడు తకార సకార సంయోగ చిహ్నముగా వ్రాయుట దాని కేవల దంత్యతకొక ప్రమాణమని భ్రమింపరాదు. వారిలేఖనము తప్పుల తిప్ప యనుట సాహసముకాదు. వారు 'శత్రువులు' అను దానిని 'శతృవులు' అనియు వ్రాయుదురు. 'వృత్తి' అనుదానిని 'వ్రిత్తి' అని వ్రాయుదురు. 'సింహము' అనుదానిని 'సింహ్వము' అనివ్రాయుదురు. 'అమరంగ' అనుదానిని 'అమరంగ్గ' అనివ్రాయుదురు. ఇట్టివెల్లఁ బ్రామాణికము లనిపించుకొనవు గదా. మఱియు నట్టి లేఖనమె వివేక కృతమైనయెడల దంత్య జకారము సైతము 'ద్స' అను దకార సకార సంయోగలిపితో వ్రాయఁబడి యుండ నక్కఱ లేదా? అట్టి లేఖనమును గలదని యెవ్వరును జెప్పఁజాలరు గదా.

దంత్య చ జ లు నేఁడు 'చ̌ జ̌' అనురీతిని వ్రాయఁబడుటయుఁ గలదు. వానిమీఁది (౨) అనుగుణుతు. తకార సంశ్లేషరూపమై తాలవ్యతయందలి దంత్యతా సాంకర్యమును స్ఫురింపఁ జేయుచు నెంతయు సహజమై యున్నది.

నన్నయ భట్టారకుఁ డక్షరాకారముల నుపదేశించు సందర్భమున 'చ జ' లపై దంత్యతా స్ఫోరకముగ నొక బొట్టును నిల్పవలె ననుచు "దన్త్యే చజౌ గురు రతౌచ బిన్దు యుతౌ" అని చెప్పియుండెను. ఇట్లు లేఖన సౌకర్యమునకై మఱి కొన్ని నూతనపు గుర్తులను నుపదేశించెను. అట్లైనను నాతనికాలపు శాసనము లలోఁగాని యాతనికి ముందు వెనుకలఁ బుట్టిన శాసనములలోఁ గాని యట్టి లేఖనము పాటింపఁబడలేదు. లేఖకులు యథా పూర్వముగాఁ బ్రాచీన పద్ధతి చొప్పున నాంధ్రకర్ణాట సాధారణ లిపితోనె వ్రాయుచు వచ్చిరి. (౨౭౨ వి.)

## వకారము దంతోష్ఠ్యము

(౧౯౯) వకారోచ్చారణమునఁ గ్రిందిపెదవియొక్క బాహ్యాభ్యంతరములగు తుది భాగములు మీఁదిదంతములను స్పృశించును. ఓష్ఠ్యస్వరమధ్య మగునపుడు మాత్ర మోష్ఠబాహ్య ప్రదేశాంతము మీఁది దంతములను స్పృశించును. కావున దీని కుత్తర దంతములు స్థానము- అధరోష్ఠము కరణము. కాఁబట్టి దీనికి 'దంతోష్ఠ్యత' సమర్థ మగుచున్నది. కంఠ్యావహా విత్యాది ప్రకృత కారికలో 'దన్తోష్ఠ్యో వ స్స్మృతో బుధైః' అని చెప్పఁబడియున్నది. ఇందులకుఁ బ్రమాణాంతరములు :—

"ఓష్ఠాన్తాభ్యాం దన్తై ర్వకారే" (తైత్తి - ౨ అధ్యా. ౪౨సూ.)

వైదికాభరణవ్యాఖ్య:—(ఓష్ఠస్య బాహ్యాభ్యన్తర భాగ భిన్నత్వయా ద్వివచనం ప్రయుజ్యతే......వకారోత్పత్తౌ స్వభావతోఽధరోష్ఠ స్యాభ్యన్త రోఽన్తః, కరణం భవతి, యత్రతు అసౌ ఓష్ఠోపసంహారయో రోష్ఠ్యస్వరయో ర్మధ్యవర్తీ భవతి తత్ర సామార్థ్యా ద్బాహ్యోఽన్తః కరణమ్ ... "వో దన్తాగ్రైః" (శుక్లయ. ౧ అధ్యా. ౮౧ సూ.) ఉవ్వటభాష్య :—'వకారస్తు ఓష్ఠోఽపి దన్తాగ్రైః క్రియతే".

## సంధ్యచ్చులు.

(౨౦౦):—'ఏ ఓ ఐ ఔ' అను నాల్గచ్చులును సంధ్యచ్చు లనఁబడు చున్నవి. అందు 'ఏఐ' లు కంఠతాలవ్యములు. 'ఓఔలు' కంఠోష్ఠ్యములు. 'ఏఐలు' 'అకారేకార' సంధిభవములు. ఓ ఔ లు 'అకారోకార' సంధిభవ ములు. ఈ నాల్గిటిలోను మొదటిభాగమున 'అ' వర్ణాంశము కలదు. ఏ ఐ లలో 'ఇ' వర్ణాంశమును, 'ఓ ఔ' లలో 'ఉ' వర్ణాంశమును నుత్తరావ యవములై యున్నవి. అందేకారములోని 'అ' కారేకారములును 'ఓ

కారములోని 'అ' కారోకారములును సంశ్లిష్టావయవములై యున్నవి. అట్టివి క్షీర నీరన్యాయమున సంశ్లిష్టములై యుండుటచేతనే యుచ్చారణ మున వానికిఁ బ్రత్యేకి భాగ మగపడదు. అట్లయినను వాని యుచ్చారణ మున నట్టి సంశ్లిష్ట స్వరముల ఛాయలు మాత్రము వెలయుచుండును.

(౨౦౧)—ఐ ఔలలో వలెనే 'ఏ ఓ' లలో నుత్తారార్ధమున 'ఇ ఉ' లు వినఁబడలేదు గాన నవి సంధ్యచ్ఛులు కానేరవని పాశ్చాత్య పండితు లభిప్రాయ పడుచున్నారు. విసర్గము హకారమువలె వినఁబడుననియు దానికి ముందటి స్వరము దానిపైని వినఁబడుచుండు ననియు నట్టి నిదర్శనమునుబట్టి పరిశీలిం చినపుడు 'శమ్భుః = శమ్భుహు; హరిః = హరిహి' అనుచోటులందు వలెనే "రామైః = రామైహి; గ్లౌః = గ్లౌహు" అనుచోటులందును నుత్తరార్ధమున 'ఇ, ఉ' వర్ణములు వినఁబడుచుండుటచేత 'ఐ, ఔ' ల యుత్తరావయవములు 'ఇ' కా రోకారము లనుట యుక్తమనియు "హరేః=హరేహె; రామయోః= రామయోహొ" అనుచోటులం దట్లు 'ఇకారో కారములు' వినఁబడక 'ఏ ఓ' అనునవి వినఁబడుచుండుటచేత వాని యుత్తరావయములు 'ఇ, ఉ' అనునవి కావనియు నక్కారణమున 'ఏ ఓ' అనునవి సంధ్యచ్ఛులనుట యనుభవ విరుద్ధమనియుఁ గొందఱు చర్చించుచున్నారు. ఈ విషయమునఁ బాశ్చాత్యాశ యములనే యెత్తి వ్రాసిన భాషా శాస్త్రసంగ్రహమునుండి కొన్ని పంక్తు లుదాహరించుచున్నాను—

"సంస్కృత భాషాయాం విద్యమానా అసంకీర్ణా అచః 'అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ' ఇతి. తేషా మన్త్యే సన్ధ్యక్షరే ఇత్యస్మదీయాః నైతద్యు క్తమ్. తథాహి. సన్ధ్యక్షరం ద్వయో ర్వర్ణయో రవ్యవహితోచ్చారణేన సంజాయతే. య ద్యేకార అకారేకారయో స్సన్ధ్యక్షరం స్యాత్, తర్హి తయో రవ్యవహితోచ్చారణేన సంజాతః స్యాత్. ఏవ మోకారోఽపి. ఆనుభావికీ కాచి దపూర్వా యుక్తి రప్యత్ర ప్రదర్శ్యతే. రామః హరిః శమ్భుః ఇత్యత్ర విసర్గ శ్రవణే సునిపుణం విమృశ్యమానే 'రామహ, హరిహి శంభువు' ఇతిదృశ్యతే, ఏవ మత్ర విసర్గపూర్వవర్తినః తత్తదచః హకా రా త్పరతోఽపి శ్రూయన్తే, ఏవమేవ 'రామైః, గౌః, ఇత్యత్ర' రామైహి గౌహు' ఇతిశ్రూయతే, నతు, 'రామైహె, గౌహొ' ఇతి - తథా చాత్ర సునిశ్చిత సన్ధ్యక్షరస్థలేపి విసర్గావ్యవహిత పూర్వవర్తి ఐకార స్యా న్త్యావయవభూతః ఇకారో వా ఔకార స్యాన్త్యావయవభూత ఉకారో వా

శ్రూయతే. నతు ఐకారాత్మకం ఔకారాత్మకం సర్వమపి సన్ధ్యక్షరమ్. 'హరేః, శంభోః' ఇత్యత్ర 'హరేహె, శంభోహొ' ఇతి శ్రూయతే - (ఇచటి టిప్పణము:— రామాహ (రామాః) మతీహి (మతీః) వధూహు (వధూః) ఇత్యేతేష్వి వాత్రాపి హకారోపరి హ్రస్వభూత ఏవాచ్ శ్రూయతే. అనేన దీర్ఘాచాం ప్రాతిశాఖ్యోక్తం హ్రస్వ ద్వయాత్మకత్వం స్పష్టమ్) నతు 'హరేహి, శంభోహు' ఇతి. అత్రాపి యది ఏకారే ఇకారః, ఓకారే ఉకార శ్చిన్నావయవత్వే నాభవిష్యత్ తర్హి విసర్గావ్యవహిత పూర్వ వర్తిత్వా త్సప వాశ్రోష్యత. తస్మా న్నైతే సన్ధ్యక్షరే. కిం త్వఖణ్డా జ్ఞాతానా మకారాదీనా మివానయో రేవ శ్రవణ మిత్యనయో రఖణ్డాచ్ త్వం సుస్థ మిత్యల మతివిస్తరేణ. అత్ర ద్వే సన్ధ్యక్షరే స్తః "ఐ, ఔ" ఇతి - అకారేకారయో స్సంధినా ఐకారః, అకారోకారయో స్సంధినా ఔకార శ్చ భవతి"—(భాషాశాస్త్ర సంగ్రహము, ౧౮ పుట).

ఈక్రింద వివరింపఁబోవు రీతిని 'ఏ ఓ'లు ప్రశ్లిష్టావయవములగుటచే వాని తుదినున్న 'ఇ ఉ' ల శ్రవణము విశ్లిష్టావయవములగు 'ఐ ఔ' ల తుదిని వలె వినఁబడలేదను ప్రాతిశాఖ్యముల యాశయమును భాషాశాస్త్ర సంగ్రహకారులు గ్రహింపకుండుట వింతగానున్నది. ఈ సందర్భమున హకార హ్రస్వశ్రుతి సమర్థనమున కయి వీ రర్థజరతీయముగ నంగీకరింపక తీరని టిప్పణసందర్భమె వీరికి మంచిసమాధాన మగుచున్న దనవచ్చును. ఆకారాది దీర్ఘము లకారాది హ్రస్వద్వయాత్మకములనియు వానిలోని తుది హ్రస్వములు మాత్రమె హకారముపై వినఁబడుననియు వీరి యానుభావి కాపూర్వయుక్తి స్థిరపఱుచుచున్నది గదా. అట్టి యాకారాది దీర్ఘము లెల్ల సంధ్యచ్చులే యని వీ రంగీకరింతురా ?

మఱియు 'తత్' మున్నగుచోట్ల 'తతు' మున్నగురీతిని 'రామాత్' మున్నగుచోట్ల 'రామాత్తు' మున్నగు రీతిని వినఁబడునుగదా వానితుది 'ఉ'కారములుగాని ద్విత్వోత్వములుగాని తత్రత్యములని యంగీకరింతురా ?

(౨౦౨)—ఇంతియ కాక "తేషా మన్త్యే (ఏ ఓ) సన్ధ్యక్షరే ఇత్యస్మదీయాః ..." అను వీరి వ్రాఁతయు సరికాదు. అస్మదీయులగు ప్రాచ్యపండితు లందఱును 'ఏ ఓ' లు సంధ్యచ్చులని చెప్పియుండలేదు. శుక్లయజుఃప్రాతిశాఖ్యమునందు "ఏ" కార మికారముతోపాటు తాలవ్యమాత్రముగను, 'ఓ' కార ముకారముతోపాటుగ నోష్ఠ్యమాత్రముగను చెప్పఁబడెను.

మఱియు నందు 'ఐ ఔ' లలో మాత్రమె కంఠ్యస్వరము (అ) పూర్వావయ మనియు వానిలో 'ఐ' కారమునఁ (ఇ) దాలవ్యమును 'ఔ' కారమున (ఉ) ఓష్ఠ్యము నుత్తరావయవములనియు నీక్రిందిరీతిని జెప్పఁబడెను. దీనిని బట్టి కాత్యాయనుఁడు "ఐ, ఔ" లను మాత్రమె సంధ్యచ్చులనుగా ద్విస్థానికములనుగా నంగీకరించెనని విశదమగుచున్నది గదా.

"ఇ చ శే యా స్తాలౌ" (శుక్ల. ౧ అ. ౬౬ సూ.)

ఉవ్వటభాష్యము:—"ఇ ఈ ఇ ౩ ఇతి త్రయః చవర్గః శకార ఏకారో యకార ఇత్యేతే ఏకాదశ వర్ణా స్తాలుస్థానాః"

"ఉ వో పధ్మా ఓష్ఠే" (శుక్ల. ౧ అ. ౭౦ సూ.)

ఉవ్వటభా:—"ఉ ఊ ఉ ౩ ఏ తే త్రయః వకార ఓకార ఉపధ్మానీయః పవర్గ ఏ తే ఏకాదశ వర్ణా ఓష్ఠ్యాః."

"ఐకా రౌకారయోః కణ్ఠ్యా పూర్వా మాత్రా; తాలవ్యోష్ఠయో రుత్తరా" (శుక్ల. ౧ అధ్యా. ౭౩ సూ.)

ఉవ్వటభా:—"ఐకారస్య ఔకారస్యచ కణ్ఠ్యా పూర్వా మాత్రా అకారమాత్రా ఉభయోరపి పూర్వా, ఉత్తరా ప్రథమస్య తాలుస్థానా (ఇ) ............... ద్వితీయ స్యోత్తరా ఓష్ఠ స్థానా (ఉ) .........

(౨౦౩)—పయి రీతిని శుక్ల యజుః ప్రాతిశాఖ్య కర్త చెప్పియున్నను ప్రాతిశాఖ్యాంత రానురోధమునఁ గావలయు నువ్వటుఁడు "సన్ధ్యక్షరం పరమ్" (శుక్ల. ౧ అ. ౪౫ సూ.) అను కాత్యాయన సూత్రమున 'ఏ ఓ' లును సంధ్యక్షరములుగనె తాత్పర్యపడియున్నట్లు వివరించి యున్నాఁడు. ఇది సరికాదని ముందు విశదీకరింపఁబడును. (చూడుఁడు. ౨౦౯ వి.)

(౨౦౪)—పరిశీలింపఁగా 'ఏ ఐ ఓ ఔ' లు నాల్గును సంధ్యక్షరములె యని గ్రహించుటయె యుచితమై యున్నట్లగపడుచున్నది. ఏకారమున కచ్చుపరమగునట్టి సంధిలో 'అయ్' (ఐకారస్వరసంధిలో 'ఆయ్' వచ్చినట్లే) జనించును. అందు 'ఏ' కారములోని మొదటి 'అ' కారాంశమును దర్వాతి తాలవ్య స్వరాంశ ధర్మమును స్పష్టముగా నగపడుచున్నవి గదా. అట్లె 'ఓ' కారమున కచ్చుపరమగునట్టి సంధిలో 'అవ్' అనునది (ఔకారస్వర సంధిలో 'ఆవ్' వచ్చినట్లే) జనించును. అందును మొదటి 'అ' కారాంశమును దర్వాతి యోష్ఠ్య స్వరాంశధర్మమును వెలయుచున్నవి గదా. మఱియు

విశ్లిష్టావయవములగు 'ఐ ఔ' లు వికృతి నందుటలోఁ బ్రాకృతముచేఁ బ్రశ్లిష్టావయవములగు 'ఏ ఓ' లుగఁ బరిణమించుటయు వాని యభిన్నతకు నిదర్శనమై యున్నదన వచ్చును.

"ఐత ఏత్" (౧ ప. ౩౯ సూ.) (కాత్యాయన సూత్రము).

"ఐకారస్య భవే దేత్వ। ముత్సర్గేణ పదేపదే। శైలో నిగద్యతే సేలో॥ శైవలం సేఅలం మతమ్" (ప్రాకృతమంజరి).

"ఔత ఓత్" (౧ పరి. ౪౨ సూ.) (కాత్యాయన = వరరుచి సూత్రము) ప్రాకృతమంజరీ వివరణము:— "ఔకారస్య భవే దోత్వ। ముత్సర్గేణ పదేపదే। కౌముదీ కోముఈ తద్వ। త్కౌస్తుభ శ్చాపి కోత్థుహో"।

ఇంతియకాక 'ఏఓ' ల యుచ్చారణమునందు సైత మీక్రిందిరీతిని శ్లిష్టానికత్వము భాసిల్లుచున్నది.

(౨౦౫)—ఏకారము:-ఏకారోచ్చారణమున హనువు లుపసంహృతములగును. ఓష్ఠములించుక సన్నికృష్టములగును. (ఇవి 'అ'కారాంశచ్ఛాయలు)ఇంక జిహ్వామధ్యముయొక్క యంతములతో ననఁగా నిరుపార్శ్వములతోను మీఁది జభ్యముల ననఁగా హనుమూలముల యుపరిభాగమును స్పృశించుట సంభవించును. (ఇది ఇకారాంశచ్ఛాయ) ఇంక నిది వ్యంజనముపై నిలుచునపుడు జిహ్వామధ్యమును దాలువునం దుపసంహరించుట (ఇదియు నికారచ్ఛాయయె) యనఁగా సమీపాసయనము సంభవించును. దీనికి హనువులును దాలువులును స్థానములు, ఓష్ఠమును జిహ్వామధ్యమును గరణములు. అకారమునకు వలెనే దీనికిని బక్షాంతరమున హనువులకు బదులుగాఁ గంఠమును స్థానముగా గ్రహింపవలెను. కావుననే 'కంఠ్యావహా' త్యాది ప్రకృతకారికలో 'ఏఐ' తు కణ్ఠతాలవ్యా, అని చెప్పఁబడెను. పై విషయమునకుఁ బ్రమాణములు:—

'ఈష త్ప్రకృష్టౌ వేకారే' (తైత్తి. ౨ అధ్యా. ౧౫ సూ.)

త్రిభాష్య:— "ఏకారే కార్యే ఓష్ఠౌ ఈషత్ప్రకృష్టౌ స్యాతామ్. ప్రకృష్టతా=సన్నికృష్టతా."

"ఉపసంహృతతరే హనూ" (తైత్తి. ౨ అధ్యా. ౧౯ సూ.)

వైదికా—"హనూతు పరస్పర ముపశ్లేషితతరే భవతః"

"జిహ్వా మధ్యాన్తాభ్యాం చోత్తరాన్ జభ్యాన్ స్పర్శయతి" (తైత్తి. ౨ అధ్యా. ౧౭ సూ.)

వైదికా:—జిహ్వాయా మధ్యం జిహ్వామధ్యం, తస్యాన్తౌ పార్శ్వభాగౌ ... ...హనుమూలయో రుపరిప్రదేశౌ ఉత్తరజభ్వౌ॥......అవ్యఞ్జనపూర్వక ఏకారే స్పర్శనమ్. వ్యఞ్జనపూర్వకే తు న స్పర్శన మితివిభాగః।తథైవ దర్శనాత్.

“ఏకారేచ” (తైత్తి. ౨ అధ్యా. ౨౩సూ) ఏకారే కార్యే జిహ్వామధ్యం తాలా వుపసంహర్తవ్యమ్... ...సవ్యఞ్జ నేత్వేతత్ ... ... ... ”

(౨౦౬)—ఓకారము:—ఓకారోచ్చారణమునందును హనువులు నాతి వ్యస్తములై యుండును. (ఇది ‘అ’ కారాంశపు ఛాయ) ఓష్ఠములు పరస్పరమును మిక్కిలిగా నుపసంహృతము లనఁగా సమీపానీతము లగును.(ఇది ‘ఉ’ కారాంశపుఛాయ) దీనికి హనువులు నుత్తరోష్ఠమును స్థానములు. అధరోష్ఠము కరణము. అకారమునకు వలెనే దీనికిని బహ్యాంతరమున స్థానములలో హనువులకు బదులుగాఁ గంఠమును గ్రహింపవలెను. కావుననే ప్రకృత కారిక ‘ఓఔ కణ్ఠోష్ఠజౌ స్మృతౌ’ అని చెప్పుచున్నది. పై విషయములకుఁ బ్రమాణములు.

“ఓకారేచ” (తైత్తి. ౨ అధ్యా. ౧౩. సూ.)

త్రిభాష్య:— ఓకారే ఉచ్చార్యమాణే హనూ అతివ్యస్తే నభవతః (ఇది ‘అ’ కారాంశపు ఛాయ.)

“ఓష్ఠౌ తూపసంహృతతరౌ” (తైత్తి. ౨ అధ్యా. ౧౪ సూ.)

త్రిభాష్య:—“ఓకారే కార్యే ఓష్ఠౌ ఉపసంహృతతరౌ స్యాతామ్.

వైదికా:—“ఓకారస్య హనూ ఉత్తరోష్ఠశ్చ స్థానమ్. అధరోష్ఠః కరణమ్.”

ఋగ్వేద ప్రాతిశాఖ్యమున నచ్చులు సమానాచ్చులుగను సంధ్యచ్చులుగను విభజింపఁబడినవి. అందు “అకారాదులు(ఋ ౡ వర్ణములు తప్ప) సమానస్వరములనియు” ‘ఏ ఐ ఓ ఔ’ అనునవి సంధ్యచ్చులనియుఁ బేర్కొనఁబడినవి. ఇందులకుఁ బ్రమాణములు.

“ అష్టౌ సమా నాక్షరా ణ్యాదితః ” (ఋగ్వే. ౧ పట. ౧. సూ. ౧౭ పుట.)

“తత శ్చత్వారి సన్ధ్యక్షరా ణ్యుత్తరాణి (ఋగ్వే. ౧ పట. ౧ సూ. ౧౭ పుట.)

(౨౦౭)—ఐఔలు:—ఐకారౌకారములు సంధ్యచ్చులనుట సర్వసమ్మతమై యున్నది. ఈరెండిటి మొదటను నర్ధమాత్రికమగు ‘అ’కారభాగము కల

దనియు నుత్తరభాగ మైకారమున సార్ధైకమాత్రాకమగు 'ఇ' కారమనియు, నౌకారమున నట్లే యధ్యర్థ మాత్రిక మనఁగా సార్ధైకమాత్రాకమగు 'ఉ'కార ముత్తరభాగ మనియుఁ జెప్పుచున్నారు. అట్లగుటచేత నైకారమున యథాంశ ముగ 'అ' కారేకార స్థానకరణ ప్రయత్నములును, నౌకారమున యథాంశ ముగ 'అ' కారోకారస్థానకరణ ప్రయత్నములును సంభవించునని గ్రహింప వలయును. పయివిషయములకుఁ బ్రమాణములు.

"అకారార్ధ మైకా రౌకారయో రాదిః" (తైత్తి. ౨అధ్యా.౨౬సూ.)

వైదికా:—'అకారస్యార్ధ మకారార్ధమ్. తత్ ఐకారస్య ఔకారస్యచ ఆద్యవయవో భవతి. తేన తదీయాః స్థానకరణ ప్రయత్నాః తస్మి న్నంశే భవన్తి"

"ఇకారో ఽధ్యర్థః పూర్వస్య శేషః" (తైత్తి. ౨ అధ్యా. ౨౭.సూ.)

వైదికా:—"అధిక మర్ధం యస్మిన్ సో ఽధ్యర్థః అధ్యర్ధ మాత్ర ఇకారః పూర్వస్య ఐకారస్య శేషో భవతి. తేన తదీయాః స్థానకరణ ప్రయత్నాః తస్మి న్నంశే భవన్తి

"ఉకార స్తూత్తరస్య" (తైత్తి. ౨ అధ్యా. ౨౮ సూ.)

వైదికా:—"ఉకారో ఽధ్యర్ధమాత్రః ఔకారస్యశేషః తేన తదీయాః స్థానకరణ ప్రయత్నాః తస్మి న్నంశే భవన్తి

పయి సందర్భమునుబట్టి " ఇచటఁ ఐఔలలోఁ బరమందున్న 'ఇ, ఉ' అను నక్షరములు అర్ధమాత్రలు గనుక వానిని త్యజించి పూర్వమందున్న అకా రమునకే ప్రాధాన్యత (ఇట్టి యపశబ్దము లిందనేకము గలవు) యొసంగిరి"అను నాంధ్ర విజ్ఞాన సర్వస్వప్రసంగము కేవలమును భ్రామాదికమని విశదమగు చున్నది. (ఆంధ్రవిజ్ఞా. ౧ వాల్యుము, అక్షరసమామ్నాయ, ౪౦౭ పుట.)

పయిని వ్రాసినరీతి నైకారమునం దకారేకారములును (అ+ఇ) నౌకా రమునం దకారోకారములును (అ+ఉ)దుల్యభాగకములై సంధించుటచేత నవి క్షీరోదకన్యాయమునఁ బ్రశ్లిష్టావయవము లైన వనియు నక్కారణమున వానియందు సంధించిన యచ్చులకుఁ బృథక్ శ్రవణము భాసిల్లకున్న దనియు నైకారమునం దకారేకారములును నౌకారమునం దకారోకారములును బయిని వ్రాసిన రీతిని న్యూనాధికాంశములతో సంధించిన వగుటచేత నవి విశ్లిష్టా

వయవము లైనవనియు నక్కారణమున వానికిఁ బృథక్ శ్రవణము భాసిల్లు చున్నదనియు ఋగ్వేద ప్రాతిశాఖ్యమున నీక్రిందిరీతిని జెప్పఁబడియున్నది.

"మాత్రా సంసర్గా దవరేఽ పృథక్ శ్రుతీ" (ఋగ్వే ౧౩ పట. ౪౦సూ.)

పార్షదవ్యాఖ్య:—"అవరే పూర్వే ఏఓ ఇత్యేతే మాత్రాసంసర్గాత్ మాత్రయో స్సమయోః క్షీరోదకవత్ సజ్ఞాయతే. క్వాఽవర్ణమాత్రా క్వ చేవర్ణోవర్ణయో రితి. తస్మాత్తే అక్షరే అపృథక్ శ్రుతీ భవతః........
"హ్రస్వానుస్వార వ్యతిషఙ్గవత్ పరే" (ఋగ్వే. ౧౩ పట. ౪౧ సూ.)

పార్షద:—"పరే సంధ్యక్షరే ఐ ఔ ఇత్యేతౌ... ... ... హ్రస్వపరానుస్వారః పాదమాత్రాధికః ఉపధాచ తావతా న్యూనా, (౧౭ పుట) ఏవ మిహాపి ద్రష్టవ్యమ్. ఇవర్ణోవర్ణయో ర్భూయసీ మాత్రా.అల్పీయసీ అవర్ణస్య. యస్మాత్తయో ర్నైవమ్యా న్న క్షీరోదకవత్ సంసర్గో భవతి తస్మాత్తయో రవర్ణస్య ఇవర్ణోవర్ణయోశ్చ పృథక్ఛ్రవణం భవతి"

"యద్య ప్యేకారాదీనాం చతుర్ణా మపి సన్ధ్యక్షరాణా మేవం ద్విస్వరాత్మకత్వం సమానం తథాపి ఏతయోః (ఏ ఓ వర్ణయోః) ప్రశ్లిష్టావయవత్వాత్ప్రకారాన్తర మేవోక్తమ్" (తైత్తి. ౨ అధ్యా. ౨౯ సూత్రపు వైదికాభరణవాఖ్య)

(౨౦౮)—పయిసందర్భమునుబట్టి 'ఐ, ఔ' అనువానిలో నుత్తరావయవములు 'ఇ, ఉ' అనునవేకాని 'ఏ, ఓ' అనునవి కావని విశదమగుచుండుటచేత నీ క్రిందియువ్వటవ్యాఖ్య సరికాదనక తీరకున్నది.

"తత శ్చత్వారి సన్ధ్యక్షరాణి" (ఋగ్వే. ౧ పట. ౨౧ పుట)
పార్షద:—"........ఉత్తరాణి చత్వారి సన్ధ్యక్షర సంజ్ఞికాని భవన్తి అకారస్య ఇకారేణ ఉకారేణ ఏకారేణ ఓకారేణ చ సహ సన్ధా యాన్యక్షరాణి నిష్పాద్యన్తే తాని తథోచ్యన్తే. యథా. ఏ ఓ ఐ ఔ."

ఉవ్వటుఁడు శుక్లయజుః ప్రాతిశాఖ్యవ్యాఖ్యలో నయిత మిట్లే మూలవిరుద్ధముగ వివరించియున్నాఁ డనక తీరకున్నది.

"ఐకా రౌకారయోః కణ్ఠ్యా పూర్వా మాత్రా, తాల్వోష్ఠయో రుత్తరా" (శుక్లయ. ౧ అధ్యా. 23 సూ.)

ఉవ్వటవాఖ్య:—ఐకారస్య ఔకారస్య చ కణ్ఠ్యా పూర్వా మాత్రా అకారమాత్రా ఉభయోరపి పూర్వా. ఉత్తరా ప్రథమస్య తాలుస్థానా,

ఉత్తరా పూర్వే ఏకార ఇత్యర్థః. తద్యథా అ + ఏ = ఐ ఇతి. ద్వితీయస్యాప్యుత్తరా ఓష్ఠస్థానా. ద్వితీయస్యోత్తరా ఓకార ఇత్యర్థః. తద్యథా:— అ + ఓ = ఔ ఇతి. అత్ర కేచి దాహుః. అకార స్యార్ధమాత్రా, ఏకార స్యాధ్యర్ధా ఐకారే, అకార స్యార్ధమాత్రా ఓకార స్యాధ్యర్ధా ఔకారే ఇతి. తథాచోక్తమ్. (అర్ధమాత్రాతు కణ్ఠ్యస్య, ఐకారౌకారయో ర్భవేత్. ఇతి— అనేనైవ క్రమేణ ఏకా రౌకారౌ వ్యాఖ్యాతౌ.

(౨౧౯)—పై కాత్యాయన సూత్రములో 'ఐ' కారమునందలి యుత్తరావయవము మాత్రికమగు తాలవ్య మనియు 'ఔ' కారమునందలి యుత్తరావయవము మాత్రికమగు నోష్ఠ్యస్వరమనియు సూత్రితము చెప్పఁబడి యున్నది. కాఁగా ఐకారోత్తరావయవము 'ఇ' కారమనియు 'ఔ' కారోత్తరావయవము 'ఉ' కారమనియుఁ గాత్యాయనుఁడు చెప్పె ననియైనను గ్రహించుటలో విరోధమేమియు లేదు. మఱియుఁ గాత్యాయనుని మతమున 'ఇ' కారముతోపాటు 'ఏ' కారము తాలవ్యమాత్రమనియు, 'ఉ' కారముతోపాటు 'ఓ' కార మోష్ఠ్యమాత్రమనియుఁ జెప్పఁబడియున్నను బ్రకృత సూత్రమున మాత్రికమగు తాలవ్య మికారమే యనియు నట్లేమాత్రికమగు నోష్ఠ్య ముకారమే యనియుఁ గాత్యాయనాభిప్రాయమును గ్రహించుట యెంతయు యుక్తమై యున్నది. ఏ ఓ లలోఁ బూర్వభాగమునఁ గంఠ్యాంశమున్నదని కాత్యాయనుఁ డంగీకరించి యుండమింజేసి యాతనికి 'ఐ ఔ' లలో సంధించిన యచ్చులకు సూత్రాన్వైపమ్యము నంగీకరింప వలసిన ప్రసక్తి లేదయ్యెనని తోఁచుచున్నది. కాత్యాయనుని యుక్తి సందర్భమునకు విలక్షణముగా నువ్వటుఁడు 'ఏ, ఓ' లకును సంధ్యక్షరత్వము నంగీకరించుటయుఁ బై వ్యాఖ్యలో "అనేనైవ క్రమేణ 'ఏ' కా రౌకారౌ వ్యాఖ్యాతౌ" అని వ్రాయుటయు వింతగా నున్నది. "ప్రహైత్యకృతీ - భీమాద్ధత్యమ్" మున్నగుచోటులందలి 'ఐ, ఔ' ల సంధులలో 'ఏ, ఓ' లుత్తరావయవములగుట నరసి యువ్వటుఁడట్లు పొరవడి విభజించెనా యని యాలోచింప వలసియున్నది. పై రీతిగల సంధులలో నుత్తరావయవములగు 'ఏ, ఓ' లలోని యాద్యవయవమగు 'అ' కారాంశము పూర్వాకారముతో నైక్యము నందఁగాఁ బరిశిష్టము లుత్తరావయవమున 'ఇ, ఉ' అనునవే యగునుగాన నట్టి సంధులును 'ఐ, ఔ' లలో 'ఇ, ఉ' అనునవే యుత్తరావయవము లను సిద్ధాంతమున కనుకూలము లగుచున్నవని విమర్శకులు గ్రహింతురుగాక.

(౨౧౦)—'ఎ, ఒ' అను హ్రస్వము లాంధ్రభాషలో సుప్రసిద్ధములయి యున్నవి. ఇట్టి హ్రస్వములు వైదిక సంస్కృత భాషయందును గలవు. ఈ విషయమున నాధునిక పండితు లొక రిట్లు వ్రాసిరి. "సుజాతే' అనుటకు బదులుగా 'సుజాతె' అని హ్రస్వము నుచ్చరింతురు. తెనుఁగులో హ్రస్వము సుప్రసిద్ధము." (ఆంధ్రసా. పరి. పత్రి. ౭ వాల్యము, ౨౬౦ పుట, వర్ణోత్పత్తి. చెన్న. విశ్వవి. పుస్త. భాం.) పరిశీలింపఁగా నీయాధునిక పండితుల వ్రాఁత ప్రామాదికమె యైనను నీక్రిందిరీతిని వైదిక సంస్కృతమున హ్రస్వములగు 'ఎ,ఒ' లు గలవనుటలో సందియము లేదు. "సుజాతే అశ్వసూనృతే" అధ్వర్యో అద్రిభి స్సుతమ్' మున్నగు చోటులందు 'ఏ, ఓ' లకుఁ బరమైన 'అ'కారము కొన్ని యెడల లోపింపదనియు నట్లు లోపింపనప్పు డట్టి 'అ' కారము కొందఱి మతమునఁ బూర్వస్థములగు 'ఏ, ఓ' ల యొక్క సారూప్యమునంది హ్రస్వమగుటచే మాత్రికమై యుండుననియుఁ జెప్పఁబడి యున్నది.

"లుప్యతే త్వకార ఏకార ఓకార పూర్వః" (తైత్తి.౧౧ అధ్యా.౧ సూ.)

"అథాఽలోపః" (తైత్తి. ౧౧ అధ్యా. ౨ సూ.)

వ్యాఖ్య :— "అథ ఇత్యధికారః ........."

"సపూర్వ స్యార్ధసమ మేకేషామ్" (తైత్తి. ౧౧ అధ్యా. ౧౯ సూ.)

వైదికాభరణవ్యాఖ్య:—యో యమకార ఏకా రౌకారపూర్వో నలుప్యతే సఖలు స్వస్మాత్ పూర్వస్య వర్ణ స్యార్ధేన సదృశంరూప ముపగచ్ఛతి..."

పయి శ్రుతుల నుదాహరించు నపుడు "సుజాతే ఎశ్వసూనృతే" అను రీతి నుదాహరింపక 'సుజాతే ఎ అశ్వసూనృతే' అని యుదాహరించుట ప్రామాదిక పాఠమని యీ క్రిందిరీతిని కైయ టోద్ద్యోతములలో వ్రాయఁబడి యున్నది. "నను సభ్యా శ్ఛన్దోగానాం సాత్య ముగ్రిరాణాయనీయా అర్ధమేకార మర్ధ యన్తే 'సుజాతే ఎ అశ్వసూనృతే' 'అధ్వర్యో ఒ అద్రిభి స్సుతమ్' 'శుక్రన్తే ఎ అన్యత్' ఇతి" (మహాభాష్యము.)

"అన్తః పాదస్థస్య అవ్యపరస్య అకారస్య అర్ధ మేకార మర్ధ మోకారంచ విదధతి - 'సుజాతే ఎ అశ్వే త్యకారలేఖస్తు ప్రామాదికః -య్యట" (ఉద్ద్యోతము.)

(౨౧౧)—అనుస్వారము:—"అనుస్వార యమానాం చ నాసికా స్థానముచ్యతే" అనుచోప్పున ననుస్వారమునకును యమములకును నాసిక స్థానమని ప్రకృతకారిక చెప్పుచున్నది. యమములకును ననుస్వారమునకును నాసిక్య

మునకును (ఋగ్వేద ప్రసిద్ధమగు 'హ్ను' అనునది) నాసిక స్థానమని శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును జెప్పఁబడి యున్నది. వర్గపంచమములకు 'ఙ-ఞ-ణ-న-మ'లకు ముఖమునందలి తత్తద్వర్గోక్తావయవములును నాసికయు స్థానము లగుటచేత నవి ద్విస్థానికములు. యమములు సైతము ద్విస్థానికములు కానోపునని తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడెను. యమములకు నాసికామూలము కరణమనియు, ననుస్వారమునకు హనుమూలము కరణమనియు శుక్లయజుః ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడి యున్నది. నాసిక్యమునకు(హ్ను) నాసికయే స్థానమును గరణమును నని శుక్లయజుః ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడెను. అనుస్వారోచ్చారణమునందును వర్గ పంచమోచ్చారణమునందును నాసికారంధ్రము విస్తరించుననియు యమముల యుచ్చారణమునందు నాసాబిలము సంవృతమై యుండుననియుఁ దైత్తిరీయ ప్రాతిశాఖ్యమునఁ జెప్పఁబడెను. అయోగవాహములలోనిదగు ననుస్వారమునకుఁ బూర్వస్వరస్థానికత్వము గలదను 'అయోగవాహే' త్యాది ప్రకృత కారిక యీవఱకె విమర్శింపఁబడినది. పై విషయములకుఁ బ్రమాణములు:—

"యమానుస్వార నాసిక్యానాం నాసికే" (శుక్ల. ౧ అధ్యా. ౭౮సూ.)

ఉవ్వటభాష్యము:—"వర్గోత్తమాః ఙ ఞ ణ న మా అనునాసికా భవన్తి చకారాత్ స్వస్వస్థానా ద్యపరిత్యాగద్వారేణ నాసికాస్థానం ద్వితీయ మేషా మిత్యర్థః"

"ముఖనాసికా కరణోఽనునాసికః" (శుక్ల. ౧ అధ్యా. ౭౫ సూ.)

ఉవ్వటభాష్యము:—"ముఖసహితయా నాసికయా క్రియతే ఇతి ముఖనాసికాకరణః, ముఖనాసికాకరణో వర్ణోఽనునాసిక సంజ్ఞో భవతి"

"నాసిక్యా నాసికాస్థానాః" (తైత్తి. ౨ అధ్యా. ౪౯ సూ.)

త్రిభాష్యరత్న వ్యాఖ్య:—"నాసిక్యాః యమాః......"

"ముఖనాసిక్యా వా" (తైత్తి. ౨ అధ్యా. ౫౦ సూ.)

వైదికాభరణవ్యాఖ్య:—"ముఖంచ నాసికాచ ముఖనాసికమ్. తత్ర భవాః ముఖనాసిక్యాః...... ముఖశబ్దే నాత్ర పఞ్చాపి వర్గస్థానాని సంగృహీతాని........."

"నాసికావివరణా దానునాసిక్యమ్" (తైత్తి ౨ అధ్యా. ౫౨ సూ.)

వైదికా:—"అనునాసికా యేవర్ణా అనుస్వారోత్తమాదయః తేషామానునాసిక్యం నాసారంధ్రస్య విస్తరణాద్భవతి. నాసిక్యేషు (యమములందు) నాసికా సంవృతైవ భవతి......

(౨౧౨)— అనుస్వారము స్వపూర్వస్వరము నాశ్రయించియే యుండును. వర్గాక్షరములు పరమగు నపుడయ్యది తత్తద్వర్గ పంచమవర్ణ రూపము నందుట సంస్కృత భాషలోఁ గలదు. ఆంధ్రభాషలో నట్టియెడల ననుస్వారమె నిల్చును. మఱియు నాంధ్రమున వర్గేతరాక్షర పరకమగు ననుస్వార ముండనేరదు. సంస్కృతమునం దట్లు బిందువు వర్గపంచ మాకార మందు నపుడు పరహల్లుతో సంయోగ మేర్పడును గాన నట్టి యెడల నయ్యది పర స్వరము నాశ్రయించుననియు నంగీకరింప నగును. అవసానమున నుండు ననుస్వార విసర్గములుగాని వ్యంజనములుగాని స్వపూర్వ స్వరమున కంగములై యుండుననియు, స్వరద్వయ మధ్యగత వ్యంజనము పరస్వరమున కంగమనియు స్వరద్వయ మధ్యగతములగు ననుస్వార విసర్గములు మాత్రము స్వపూర్వ స్వరమునకే యంగములగు ననియు, సంయోగములలోని వ్యంజనములలో మొదటిది పూర్వస్వరమునకుఁగాని పరస్వరమునకుఁగాని యంగమగు ననియు, సంయోగమునందలి తక్కిన వ్యంజనములు పరస్వరమునకే యంగములగు ననియు, వర్ణములలో స్వరములకు మాత్రమె యక్షరసంజ్ఞ చెల్లుననియు, ఋగ్వేద ప్రాతిశాఖ్యమున నీక్రింది రీతిని జెప్పఁబడెను.

"ఉభయేఽక్షరాణి" (ఋగ్వేద ప్రా. ౧ పట.)

వార్గన వ్యాఖ్య:—"యే ఇమే హ్రస్వదీర్ఘ సంజ్ఞాః స్వరాః నిర్దిష్టాః..."

"అనుస్వారో వ్యఞ్జనం చాక్షరాఙ్గమ్" (ఋగ్వేద. ౧ పటల)

వార్గన:—"అనుస్వారో వ్యఞ్జనంచ అక్షరాఙ్గం స్వరాఙ్గ మిత్యర్థః ... 'ప్ర' ఇత్యస్య పకార రేఫా అకార స్యాఙ్గమ్. చక్రం యదిత్యత్ర కకార రేఫానుస్వారా అకార స్యాఙ్గమ్.

"స్వరాన్తరే వ్యఞ్జనాన్యుత్తరస్య" (ఋగ్వే. ౧ పట.)

వార్గన:—"...యస్తైకస్వరః తత్ర పూర్వాణి పరాణిచ వ్యఞ్జనాని తస్యైవాఙ్గం భవన్తి. అథపున ర్యాని స్వరయో ర్మధ్యగతాని తాని... ఉత్తరస్యైవాఙ్గం భవన్తి- నపూర్వస్య."

"పూర్వస్య స్యానుస్వార విసర్జనీయా" (ఋగ్వే. ౧ పట.)

వ్యాఖ్య:—"స్వరాన్తరే వర్తమానౌ (అనుస్వార విసర్జనీయౌ) పూర్వస్య స్వర స్యాఙ్గం భవతః.........

"సంయోగాది ర్వా" (ఋగ్వే. ౧ పట)

వ్యాఖ్య:—"సంయోగాదిభూతో వర్ణః స్వరాన్తరే వర్తమానః పూర్వస్య వా స్వర స్యాఙ్గం భవతి-పరస్య వా..."

(౨౧౩)—అనునాసిక్య మూఁదఁబడినపుడు పూర్ణానుస్వార మనియుఁ దేలికగా నుండునపుడు ఖండానుస్వారమనియు ద్వివిధముగ ననుస్వారము పరిగణింపఁబడుచున్నది. అనునాసిక్యము తేలికగా నుండుట యనఁగా నద్దానితోనున్న స్వరముయొక్క యుచ్చారణమున నాసాబిలము పూర్ణముగాఁ దెఱవఁబడక యీషద్వివృతమయి యుండుట యని గ్రహింపనగును. అట్టి యర్ధానుస్వారమువంటి ధ్వని సంస్కృతమునందును లేకపోలేదు. స్వరములు సానునాసికములనియు నిరనునాసికములనియు వైయాకరణులచేత ద్వివిధములుగాఁ బరిగణింపఁబడుచున్నవి. "స నవవిధోఽపి (హ్రస్వ దీర్ఘ ప్లుతములు ప్రత్యేకముగా నుదాత్తానుదాత్త స్వరిత భేదముల నందుట నొక్కొక్కయచ్చు తొమ్మిదేసి విధము లగుచున్నది.) ప్రత్యేక మనునాసికత్వాననునాసికత్వాభ్యాం ద్విధా" "అ ఇ ఉ ఋ" ఏషాం వర్ణానాం ప్రత్యేక మష్టాదశ భేదాః......" (సిద్ధాంత కౌముది. ౪ పుట).

అట్లయినను నట్టి రీతిని వర్ణపరిగణనము శిక్షా ప్రాతిశాఖ్యములలోఁ జేయఁబడలేదు. అనుస్వారవిశిష్ట స్వరముల కెట్లు వేర్వేఱు పృథగ్గణనములేదో యట్లే సానునాసికములగు స్వరములకు సైతము వేర్వేఱు వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము లేదయ్యెనని తోఁచుచున్నది. కావుననే యనుస్వారవిశిష్ట స్వరములకు వేర్వేఱ పృథగ్గణనమును మాని యొక్క యనుస్వారమును బృథగక్షరముగాఁ బరిగణించినట్లే సార్ధానునాసికములగు స్వరములను వేర్వేఱుగా గణింపక యట్టి యర్ధానునాసిక మనఁదగు ఖండానుస్వారమును బృథగక్షరముగ నంగీకరించుట యుక్తతర మనకతీరదు. కావుననే నన్నయభట్టారకాద్యాంధ్రలాక్షణికు లర్ధానుస్వారమును బృథగక్షరముగఁ బరిగణించి యున్నారు.

(౨౧౪)—సంస్కృతభాషలో 'య వ ల' లకు సైతము పాక్షికముగ సానునాసిక్యము గలదు. వీనియందలి సానునాసిక్యము సైతము పూర్ణము కాదనియుఁ దేలికయే యుండుననియు ననుభవమువలన విశదమగుచున్నది.

కావున సానునాసికములగు 'య వ ల' ల యుచ్చారణమునందు నాసా బిలము వర్గపంచమముల యుచ్చారణమునఁ దెఱవఁబడినట్లు (పూర్ణముగ) వివృతము కానేరదనియు నింక యమముల యుచ్చారణమునందువలె సంవృతమై లేదా యీషద్వివృతమై యుండుననియు గ్రహింపవలయును. 'యవల' ల సానునాసికోచ్చారణ మనఁగా నట్టి యానునాసిక్యము వానిముం దటి యుపధాభూతమగు స్వరమును సానునాసికముగాఁ బలుకుటయే యని యెన్న నగును. ఈ విషయమునే యువ్వటుఁడు శుక్లయజుః ప్రాతిశాఖ్య వ్యాఖ్యా సందర్భమున విశదీకరించి యున్నాఁడు.

"స్వరాణా మయం వైకల్పికో ధర్మః (సానునాసికత్వరూపః). అన్తస్థానాం రేఫవర్జితానాంచ. వాచనిక శ్చాయం ధర్మః. తద్యథా:— 'అను నాసిక ముపధా ప్రాగన్తస్థాయాః'..." (శుక్ల. ౧ పట - ౭౫ సూత్రము. 'ముఖనాసికా కరణోనునాసికః' అను సూత్రపు వ్యాఖ్య, ౨౭ పుట.)

"అనునాసిక ముపధా ప్రాగంతస్థాయాః" (శుక్ల 3 అధ్యా. ౧3౧ సూ.)

"ఉవ్వట:—హ్రస్వో దీర్ఘః ప్లుతః సానునాసికో నిరనునాసిక ఉదాత్తోఽ నుదాత్త స్స్వరిత ఇతి స్వరధర్మాః"

అన్తస్థా మన్తస్థా స్వనునాసికాం పర సస్థానమ్" (శుక్ల. ౪ అధ్యా. ౧౦ సూ.)

ఉవ్వట:—"అన్తస్థా మాపద్యతే మకారః. అన్తస్థాసు పరాసు పర స్యా న్తస్థాయాః సమానస్థానాం = యది నామానునాసికాం సమానామ్. యథా. (౧) సమ్‌యామి = సయ్యాఀ మిదమ్. (3) సవ్వఀపామి... (౪) తల్లోఀకమ్ పుణ్యమ్. రేఫేఽనుస్వారో విహితః."

అనునాసి కాననునాసికా భేదేన యవలా ద్విధా (సిద్ధాంతకౌము ది-౬ పుట.)

"లేల స్తోః" లే పరే తోర్లకార స్స్యాత్. తల్లయః విద్వాఀల్లిఖతి "వా ప దాన్తస్య" (౮-౪-౫౯)... ...సయ్యఀన్తా, సంయన్తా, సవ్వఀత్సరః = సంవ త్సరః. యల్లోఀకమ్ = యం లోకమ్. అత్రానుస్వారస్య పక్షే అనునాసికా య వలాః (సిద్ధాంత కౌముది ౨౫-పుట.)

"శ్లో॥ ఆద్యాయాః పఞ్చాశ। ద్వర్ణాః ప్రకృతేస్తు తే దశోనా స్స్యుః"

---

శ్లో. "యలో ద్విధాఽరో నిరను। నాసికః స్సానునాసికః। హాపోఽను నాసిక స్తేన। తత్ స్థానే సానునాసికః" (ముగ్ధబోధ వ్యాకరణము. హల్‌సంధి ౪౮ సూ.)

(౨౧౫)—పయి నుదాహరించిన యుత్పత్తిక్రమముగల వర్ణములలో వెనుక నుదాహరించిన స్థాన కరణవిభ్రమానుప్రదాన సోష్మతా పరిమాణ భేదములచేత వర్ణవిభేదము కలుగుచుండును. కకారఖకారము లేకస్థానికములును నేకకరణకములును శ్వాసములును నయినను వానిలో ఖకారమునందు సోష్మతారూప వాయు సంసర్గాతిశయ ముండుటచేత నట్టి ఖకారము కకారమునకన్న వేఱువర్ణముగఁ బరిగణింపఁబడుచున్నది. అట్లే 'కగ' లును సమాన స్థాన కరణకములు నల్పప్రాణములును నయి యున్నను గకారమునందు నాదానుప్రదాన ముండుటచేత నయ్యది పృథగ్వర్ణముగఁ బరిగణింపఁబడుచున్నది. అట్లే "గఘ" లు సమానస్థాన ప్రయత్నానుప్రదానకములయి యున్నను ఘకారమునందు సోష్మత యనఁగాఁ బ్రాణవాయు సంసర్గాతిశయ ముండుటచేత నయ్యది గకారమున కన్న భిన్నముగ నెన్నఁబడుచున్నది. 'అ, ఆ' అను రెండిటికిని స్థానకరణానుప్రదానములు తుల్యములె యైనను మాత్రా పరిమాణ భేదముచేత నయ్యవి వేర్వేఱు వర్ణములుగఁ బరిగణింపఁబడుచున్నవి. అట్లె తక్కినవిషయములలో భేదము లేకున్నను యకార మీషత్ స్పృష్టతా రూపభేదముచేత స్పృష్టమగు జకారముకన్న భిన్నవర్ణ మగుచున్నది. శ వర్ణమునకు వివృతము ప్రయత్న మగుటచేత స్పృష్టమగు చకారమునకన్న భిన్నవర్ణ మగుచున్నది. ఇట్లె యెల్లయెడలను వర్ణవైశేష్యమున కుపపత్తు లూహింప నగును.

(౨౧౬)—వ్యాఖ్య :—ఆద్యాయా ఇత్యాది :—పయికెత్తి చేర్పడినవర్ణములు సంస్కృత ప్రాకృతభాషలలో నెన్నెసి గలవో యనువిషయమున ననేక మతభేదములు గలవు. నన్నయభట్టారకుఁ డీక్రిందికేతిని సంస్కృతమునకు వర్ణ సమామ్నాయ మేఁబది యనియు మహారాష్ట్రప్రాకృతమునకు నలువది వర్ణము లనియు నాద్యాయా ఇత్యాదికారికార్థముచేఁ జెప్పుచున్నాఁడు.

ఆద్యాయాః = సంస్కృత భాషకు, పఞ్చాశద్వర్ణాః = ఏఁబదివర్ణములు, స్యుః = అగును. ప్రకృతేస్తు = ప్రాకృతములలోఁ బ్రధానమగు మహారాష్ట్రీ ప్రాకృతమునకన్నవో. దశోనాః = పదిచేతఁ దక్కువయగు,

"శ్లో॥ ద్విధాక ఏచో ఽనుస్వారో। విసర్గ షోడశ స్వరాః।
స్పర్శా అన్తస్థ తోష్మాణః। శ్చతు స్త్రింశ ద్ధలః స్మృతాః"

---

తే = అయేఁబడి వర్ణములై, స్యుః = అగును. వైదిక సంస్కృతమునందలి ప్లుతాదులు కావ్య భాషలో లేవని భావము.

"తత్రతు ప్రాకృతం నామ। మహారాష్ట్రోద్భవం విదుః" తదుక్తం దణ్డినా — "మహారాష్ట్రాశ్రయాం భాషాం। ప్రకృష్టాం ప్రాకృతం విదుః" (షడ్భాషాచంద్రిక. 3 పుట.) అను చొప్పునఁ బ్రాకృత భాషల షట్కములో మహారాష్ట్రి యనఁబడు ప్రాకృతమే ప్రకృష్టమైనదియుఁ బ్రధానమైనదియునై యున్నది.

"వినావిశేషం సర్వేషాం। లక్ష్మ ప్రాకృతవ న్మతమ్"
"శేషం ప్రాకృతవత్" (3 అ-౨ పా. ౨౬ సూ.)

అను ప్రాకృత వైయాకరణసూక్తులు పై విషయమునఁ బ్రమాణములగుచున్నవి.

(౨౧౭)—వ్యాఖ్య:- ద్విధాక ఇత్యాది- "శాస్త్ర మపౌరుష" మిత్యాదికము చొప్పున నాంధ్రవిద్యార్థులు సంస్కృతమును దదంతర్భూతమే యగు ప్రాకృతమును దెలిసియె యుందురని తలఁచి నన్నయభట్టారకుఁడు విస్తరభీతి నిట సంస్కృత ప్రాకృత వర్ణములను వేర్వేఱుగఁ బేర్కొని యుండలేదు. అథర్వణుఁడు సైతము సంస్కృత వర్ణ సమామ్నాయము నీసందర్భమున వివరించి యుండమింజేసి వరరుచి వచన మనుచు నప్పకవి యుదాహరించిన "ద్విధాక"ఇత్యాదికమగు పై కారిక యిట మూలముగఁ గ్రహింపఁబడెను.

ద్విధాకః = హ్రస్వదీర్ఘరూపములైన, 'అక్' ప్రత్యాహార వర్ణములును, (అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ) ఏచః=ఏచ్ ప్రత్యాహార వర్ణములును, (ఏ ఐ ఓ ఔ) అనుస్వారః = అనుస్వారమును, విసర్గః=విసర్గమును, అనెడి, షోడశ=పదునాఱును, స్వరాః సంస్కృత వర్ణసమామ్నాయ గతములైన యచ్చులు. "స్పర్శాః=కకారాది మకారాంతములగు ('కాదయో మావసానాః స్పర్శాః,) నయిదు వర్గముల యక్షరములును కఖగఘఙ=కవర్గము); చ ఛ జ ఝ ఞ=(చవర్గము); టఠడఢణ = (టవర్గము); తథదధన=(తవర్గము)' పఫబభమ = (పవర్గము) అంతస్థ ఊష్మాణః = అంతస్థములగు 'యరలవ; లును, ఱకారమును, నూష్మములగు శషసహలును,' అనెడి, చతుస్త్రింశత్ =

ముప్పదినాలుగు వర్ణములును, హాలః = సంస్కృతే వర్ణసమామ్నాయః గత ములగు హల్లులు; అని, స్మృతాః = చెప్పఁబడినవి.

అహోబలపతియు దీనిని వరరుచివచనముగనె యుదాహరించి యున్నాఁడు. (చూ. వి. ౨౫౧.)

ద్విధాక ఏచో......। సిద్ధి స్సంస్కృతశబ్దానామ్... ఋశివర్ణా... ఇత్యాది వరరుచి హేమచన్ద్రాదివ్యాకరణ ప్రవణోక్తి ర్న్యాసమ్ (అహో. ౧౩౫ పుట.)

(౨౧౮)—పయివర్ణములలోని 'ఱ' అనునది యాంధ్రకర్ణాట సాధారణలిపిలోనిది. ప్రాచీన కాలమున నాంధ్రమునకును గర్ణాటమునకును లిపి యొక్కటియే యుండెడిది. నానాఁటికి స్వల్పములగు మార్పుల నంది యయ్యది రెండు లిపులుగ నేర్పడినది. నేఁటికిని నాంధ్రకర్ణాటభాషల లిపులయం దంతగా భేదము లేదు. ఈ విషయము ముందు విస్తరింపఁబడును. ఈ 'ఱ' అను లిపిచే గుఱితింపఁబడు నక్షర మిపుడు తెలుఁగుభాషలో లేదు. ప్రాచీన కాలమున నుండెడిది. డకార మీషత్ స్పృష్టముగఁ బలుకఁబడినపుడు కలిగెడి ధ్వని యాలిపిచే గుఱితింపఁబడునని గ్రహింపవలయును. తమిళ భాషలో నియ్యది 'ழ' అను లిపిచే గుఱితింపఁబడుచున్నది. దీని ధ్వని యాంగ్లభాషలోని 'Plea-sure' అనుశబ్దమునందలి 'ష' అనుదానిని జాలవఱకుఁ బోలియుండును. "in the Tamil country it has often the Sound of the 's' in Pleasure (the French j)" అని దీని విషయమున 'పోపు' దొరగారు వ్రాసియున్నారు.

నాగర లిపిలో నియ్యది 'ळ' అనునాకారముతో లిఖింపఁబడుచున్నది. దీని నాధునిక పండితులు ళ కారముగనే పలుకుచున్నారు. ఇట్టి యలవాటుచే దీనిని ళళల యభేదము నాశ్రయించిన వారు ఌకారముగ (ఌ) సైతము వ్రాయుట గలదు. (చూ. 'తస్మిఌ్లహాల' ... శుక్లయజుః ప్రాతిశాఖ్యము. ౮. అధ్యా. ౨౯ సూ.) (చూ. 'ళ్హా కారతామేతి......ఇళాసాళ్హా...' ఋగ్వేద ప్రాతిశాఖ్యము, ౧ పటలము, ౩౮-౩౯ పుటలు.)

ఆంధ్రభాషలో దీనిధ్వని యిపు డంతరించినది. ఆంధ్రమునందును నియ్యది ప్రాచీన శాసనములలో నగపడుచున్నదని కీర్తిశేషులగు కె. వి. లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు (చూ. లక్ష్మణరాయ వ్యాసావళి). తమిళములో నీధ్వనిగల శబ్దము లాంధ్రభాషలో నున్నపుడు ప్రకృతమున నవి డకా

రముతోఁగాని శకారముతోఁగాని వెలయుచుండును. పఱగన్నడమున నీధ్వని విపులముగ నున్నది. హళెగన్నడమున నియ్యది శకారముగ మాఱి పోయినది. (ప్రాచీన కర్ణాటము 'పఱగన్నడము, హళగన్నడము' నని వాడఁబడును. నవీన కర్ణాటము హళెగన్నడమని వాడఁబడును.)

ఈధ్వని ద్రావిడాక్షర మనియు, సంస్కృతమున నీధ్వని లేదనియు నాధునికులు దలంచుచున్నారు. ఇయ్యది సంస్కృతమున సైతము ముండెడిదనియు, ద్రావిడభాషల సంపర్కమున నిది కాలక్రమమున శకారముగ సంస్కృత పండితులచేత సైతము పలుకఁబడుచున్నదనియు నీవఱకు విపులముగ వ్రాసియే యున్నాను. (౧౮౭—౧౯౪. విమ.) ప్రాచీనులగు వరరుచి నన్నయభట్టులకును నట్టి యభిప్రాయమె యున్నదని తలంపనగు నను నుద్దేశముతోఁ బయికారికలో నప్పకవీయమున శకారమున్నను నిందు ఱకారముగ మార్చి వ్రాసినాఁడను.

(౨౧౯)—మాహేశ్వర సూత్రములలో నీవర్ణము పేర్కొనఁబడలేదు గాన నిది సంస్కృతాక్షరము కాదనుకొనరాదు. మాహేశ్వర సూత్రములలో ఱకారమేకాక శకారమును బేర్కొనఁబడ లేదు. సర్వసమ్మతములగు మఱికొన్ని సంస్కృతాక్షరములు సైతము మాహేశ్వర సూత్రములలోఁ బేర్కొనఁబడి యుండలేదు. ప్రక్రియాసౌకర్యమునకయి మాహేశ్వరసూత్రములలో వర్ణములు గుదిగ్రుచ్చఁబడినవే కాని యవి సంస్కృత వర్ణసమామ్నాయ పారాయణమునకై చెప్పఁబడ లేదు. కాన వానిలోఁ జేరని వర్ణములు సంస్కృతమున లేవనుట సరికాదు. వాని క్రమమె మాతృకాపాఠ క్రమమనియు భ్రమింపరాదు. దుఃస్పృష్టమను పేరితో నీ ఱకారము పాణినీయ శిక్షలోనే వర్ణసమామ్నాయమునఁ గణింపఁబడి యున్నది. ఆధునికుల యభిప్రాయము చొప్పున నట్టి దుఃస్పృష్టము శకారమని (పాణినీయ శిక్షలో) యంగీకరింపఁబడినను నదియు మాహేశ్వర సూత్రములలోఁ బేర్కొనఁబడ లేదుగదా. అట్లే పాణినీయ శిక్షలో వర్ణాంతరములుగఁ బరిగణింపఁబడిన యనుస్వారము విసర్గము మున్నగునవియును మాహేశ్వర సూత్రములలోఁ బేర్కొనఁబడి యుండలేదు. అనుస్వార మనునాసికములచేతను విసర్గము రేఫశషసలచేతను నుక్తప్రాయములై యందమన్న నీ దుఃస్పృష్టము సైతము (ఱ) డకారముచే (౧౮౭-౧౮౯వి.) నుక్తప్రాయమే యన వచ్చును గదా. అట్టి యెడల 'ఱకారము' సంస్కృతాక్షరము కాదనుట పొసఁగనేరదు గదా. ఇంతయేల!

మాహేశ్వర సూత్రములలో హకారము రెండుసార్లు వచింపఁబడుటవే యా సూత్రములు వర్ణసమామ్నాయ పారాయణమునకై సూత్రింపఁబడలేదనుట కును, ప్రక్రియోపయోగార్థమై సూత్రింపఁబడిన వనుటకును బ్రబల నిదర్శనమై యున్నదిగదా.

(౨౨౦)—పయిరీతినే కర్ణాటశబ్దానుశాసన కర్తయగు భట్టాకలంకుఁడు చర్చించి యున్నాఁడు.

"తర్హి కిమర్థం పాణిన్యాదిభిః అక్షర సమామ్నాయః పృథగారబ్ధ ఇతి చేత్ కార్యార్థ మితి బ్రూమః. తత్రహి ప్రత్యాహారా ద్యనువాదేన కార్యవిధానమ్. నతు తఏవ వర్ణాః. సఏవ సన్నివేశః, తత్రాపఠితస్య ఌ (ఌ) కారస్య శిష్టేష్వేషు ప్రయోగ దర్శనాత్. అతఏవ తత్ర హకారస్య ద్విరుపదేశః, అతఏవచ పతఞ్జలిః పఠితస్యాపి ఌవర్ణస్య ప్రత్యాఖ్యాన మపఠితానా మప్యయోగవాహానా మటూపదేశం చాచూచుదత్..." (కర్ణాటకశబ్దాను శాసనము. మంజరి మకరందవ్యాఖ్య. ౯ పుట)

(౨౨౧)—మహేశ్వర సూత్రములచే లభించెడి సంజ్ఞలు ప్రకృతి గ్రంథమునందును నుపయోగించునవే యగుటచేత వాని నిట నుదాహరించుచున్నాను.

"అ ఇ ఉ ణ్, ఋ ఌ క్, ఏ ఓ ఙ్, ఐ ఔ చ్; హ య వ ర ట్, ల ణ్, ఞ మ ఙ ణ న మ్, ఝ భ ఞ్, ఘ ఢ ధ ష్, జ బ గ డ ద శ్, ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్, క ప య్, శ ష స ర్, హ ల్."

ఈపదునాల్గు సూత్రములును మాహేశ్వర సూత్రములని వ్యవహరింపఁబడుచున్నవి. పాణినిముని కీశ్వరుఁడు ప్రసాదించుటచేత నట్టి పేరు వీనికి గల్గెననియుఁ జెప్పుదురు. వీనిలోని తుదినుండెడి హల్లులు 'ఇద్వర్ణములు' అనఁబడును. పూర్వపూర్వ వర్ణము నుత్తరోత్తరమగు నిద్వర్ణముతోఁ జేర్చునపుడొక్కొక్క ప్రత్యాహార మేర్పడును. అక్ ప్రత్యాహార మనఁగా 'అ ఇ ఉ ఋ ఌ' వర్ణములని యర్థము. ఇట్లు ప్రత్యాహారములు ఘటించుటచేతనే 'అచ్' 'హల్' అను సంజ్ఞ లేర్పడినవని గ్రహింపనగును.

(౨౨౨)—వెనుక నుదాహరించిన రీతిని భట్టాకలంకుఁడు చెప్పినట్లె మాహేశ్వర సూత్రములలోని వర్ణక్రమము సరియైనది కాదు. లోక ప్రసిద్ధికి సరిగనున్న 'ద్వ్యాఖ్యాక' ఇత్యాది ప్రకృత కారికలోనిదే బహు సమ్మతమైన వర్ణక్రమమని గ్రహింపవలెను. ప్రాతిశాఖ్యములలో నెల్లఁ జాలవఱకీ

క్రమమే యంగీకరింపఁబడి యున్నది. అందు శుక్లయజుః ప్రాతిశాఖ్యము నుండి యీక్రింది సూత్రములు దాహరింపఁబడుచున్నవి.

"తత్ర స్వరాః ప్రథమమ్" (శుక్ల. ౮ అధ్యా ౧ సూ.)

మాతృమోదాఖ్య మగు నువ్వటభాష్యము:—వ్యాఖ్యాయన్త ఇతి శేషః; తద్యథా:—"అఇతి, ఆఇతి, ఆ౩ ఇతి; ఇఇతి, ఈ ఇతి; ఈ౩ఇతి. ఉఇతి, ఊఇతి, ఊ౩ఇతి, ఋఇతి, ౠఇతి, ౠ౩ఇతి, ఌఇతి ; ౡఇతి, ౡ౩ఇతి;" ('౩'=ప్లుత చిహ్నము).

"అథ సన్ధ్యక్షరాణి" (౮ అధ్యా. ౨ సూ.) "ఇతిస్వరాః" (౮ అ. ౩. సూ.)

మాతృ:—"వ్యాఖ్యాయన్త ఇతి శేషః. ఏఇతి, ఏ౩ఇతి; ఐఇతి, ఐ౩ఇతి; ఓఇతి, ఓ౩ఇతి ; ఔఇతి, ఔ౩ఇతి."

"అథ వ్యఞ్జనాని" (౮ అధ్యా. ౪ సూ.) "స్పర్శాః" (౮ అ. ౫ సూ.)

మాతృ:—"వ్యాఖ్యాయన్త ఇతి సూత్రశేషః: తద్యథా:—కితి, ఖితి, గితి, ఘితి, ఙితి, కవర్గః; చితి, ఛితి, జితి, ఝితి, ఞితి, చవర్గః; టితి, ఠితి, డితి. ఢితి, ణితి, టవర్గః; తితి, థితి, దితి, ధితి, నితి, తవర్గః; పితి, ఫితి, బితి, భితి, మితి పవర్గః."

అథాన్తస్థాః" (౮ అ. ౬ సూ.)

మాతృ:—"వ్యాఖాయన్త ఇతి శేషః: యితి, రితి, లితి, వితి."

"అథోష్మాణః" (౮ అ. ౭ సూ.)

మాతృ:—"వ్యాఖ్యాయన్త ఇతిశేషః, శితి, షితి, సితి, హితి;"

"అథాఽయోగవాహాః" (౮ అ. ౮ సూ.)

మాతృ:—"వ్యాఖ్యాయన్త ఇతిశేషః: అకారాదినా వర్ణసమామ్నాయేన సహితా స్సన్తః ఏతే వహ న్త్యాత్మలాభం ప్రాప్నువ న్త్యయోగవాహాః. (అ=అకారాదులతోడి, యోగ=కూడికచేత, వాహాః=ఆత్మస్థితి నందుచున్నవి. కాన నవి 'అయోగవాహము' లైనవి.)

"ꣳక ఇతి జిహ్వామూలీయః" (౯ సూ.); "ꣳప ఇత్యుపధ్మానీయః" (౧౦); "అం ఇత్యనుస్వారః"(౧౧సూ.); "అః ఇతి విసర్జనీయః" (౧౨సూ.); "హుఁ ఇతి నాసిక్యః" ౧౩ సూ.) మాతృ:—"అయం ఋక్ శాఖాయాం ప్రసిద్ధః."

"కుఁ, ఖుఁ, గుఁ, ఘుఁ ఇతి యమాః" (౧౪ సూ.)

"ఏతే పఞ్చషష్టి వర్ణా బ్రహ్మరాశి రాత్మవాచః" (శిక్షా). "త్రయో-
వింశతి రుచ్యన్తే। స్వరా శ్శబ్దార్థ చిన్తకైః। ద్విచత్వారింశ ద్వ్యఞ్జనాః। ఏతా-
వాన్ వర్ణ సంగ్రహః" (శుక్ల. ౮ అధ్యా. ౨౫ సూ.)

ఈ శుక్లయజుః ప్రాతిశాఖ్యమున దుఃస్పృష్టములు వేఱుగఁ బరిగ-
ణింపఁబడకున్నను గాత్యాయనముని వానిని వెనుక వ్రాసిన రీతిని
(౨౧౯. వి.) డ ఢలచేతనే గతార్థములుగఁ సంగ్రహించెనని గ్రహింప వలసి
యున్నది. అతఁడు పై "త్రయోవింశతి" ఇత్యాది సూత్రమున నుద్దేశించిన
యఱువదియైదు వర్ణములలోను గొన్ని మాధ్యందిన శాఖలో లేవని
చెప్పుటలో నీ దుఃస్పృష్ట వర్ణములను సైతి మినహాయించిన రీతిని చేర్కొని
యున్నాఁడు. కాఁగాఁ బై సందర్భమున దుఃస్పృష్టములు వేఱుగఁ జెప్పఁ
బడకున్నను నవి పయి పంచషష్టి వర్ణములలో నంతర్భూతములని సూత్రి
కర్త హృదయము నెన్నఁదగును.

"తస్మిల్లళ్హ (తస్మిన్. ళ, ళ్హ చూ. ౨౧౨ విష.) జిహ్వామూలీ యోప
ధ్మానీయ నాసిక్యా న సన్తి మాధ్యందినానామ్." (శుక్లయ. ౮ అ. ౨౯ సూ.)
ఈ సందర్భమునుబట్టి యీ 'ళ, ళ్హ' అనెడి దుస్పృష్టములను సైతము
పరిగణించిన యెడల నఱువది యేడు వర్ణము లగుచున్నవని గ్రహింపనగును.

ఇందుఁ జేర్కొనఁబడిన వర్ణసమామ్నాయమునఁ దొమ్మిది ప్లుతము
లును రెండు జిహ్వామూలీ యోపధ్మానీయములును "హుఁ" కారమును,
నాలుగు యమములును ననెడి పదునాఱు వర్ణములు "ద్విర్ధాక" ఇత్యాది
ప్రకృత సూత్రమున లేనివి చెప్పఁబడినవి. కావ్యవాఙ్మయమున వీనికి
వాడుక లేనందున నివి ప్రకృత కారికలో నుపేక్షింపఁబడినవి.

(౨౨౩)—అనుస్వార విసర్గములు ప్రకృత కారికలో (ద్విర్ధాక...)
స్వరములలోఁ జెప్పఁబడి యుండఁగాఁ బయి ప్రాతిశాఖ్యమున హల్లులలోఁ
జేర్కొనఁబడినవి. అనుస్వారమునందు స్వరవ్యంజన ధర్మములు రెండును
నుండుటచేత నయ్యది యుభయము ననుభయము ననఁదగును. విసర్గమును
దాని పరిణామములై యగు జిహ్వామూలీ యోపధ్మానీయములును ప్రాతి
శాఖ్యములం దెల్ల వ్యంజనములుగనె పరిగణింపఁబడి యున్నవి. అనుస్వారము
నందువలెనే విసర్గ జిహ్వామూలీ యోపధ్మానీయములందును స్వరధర్మము
సైతము గలదని పాణినీయులు చెప్పుచున్నారు. మహాభాష్యమున ననుస్వార
విసర్గముల కట్ ప్రత్యాహారమం దుపసంఖ్యానము చేయఁబడెను.

"అనుస్వార విసర్గ జిహ్వామూలీ యోపధ్మానీయానా మకారోపరి శర్షుచ పాఠ స్యోపసంఖ్యానమ్" (సిద్ధాంత కౌముది).

ముగ్ధబోధవ్యాకరణ వ్యాఖ్యాతయు నిట్లే యభిప్రాయ పడి యున్నాఁడు. "నుపీ పూర్వేణ సంయుక్తౌ। మూనీ త్వతు పరగామినా। చత్వారోఽయోగవాహా స్స్యుః। ర్ణత్వకర్మ ణ్యచో మతాః। అచః స్వయం విరాజన్తే। హసస్తు పర మాశ్రితాః" (ముగ్ధబోధవ్యాఖ్య. దుర్గాదాస విరచితము. ౨౦ సూత్రపు వాఖ్య) ("ను = అనుస్వారము; వి = విసర్గము; మూ = జిహ్వామూలీయము; నీ = ఉపధ్మానీయము; అచః = స్వరములు; హసః = హల్లులు;" అనునివి ముగ్ధబోధవ్యాకరణ సంజ్ఞలు.)

పయిరీతిని మతభేదము లుండుటచేతనే యనుస్వార విసర్గములు మాతృకాపాఠమున నజ్ఝల్లుల నడుమఁ బఠింపఁబడుచున్నవి.

(౨౨౮)—ఋకారాదిని బాదమాత్రస్వరూపమగు 'అ' కారాంశము వినఁబడుచున్నదని కావలయును నయ్యది వర్ణక్రమమునఁ 'అ' వర్ణము నకుఁ దర్వాత ఋగ్వేద ప్రాతిశాఖ్యమునఁ బఠింపఁబడినది.

"అక్షార ర్కారా వి ఉ ఏ ఓ ఐ ఔ" (ఋగ్వేద ప్రా. ౧ పట-౧ సూ.)

ఇందు 'ఏచ్' ప్రత్యాహార వర్ణముల వరుసలో సైతము మార్పు గలదు. ప్రశ్లిష్టావయవములగు (వి. ౨౦౭) వక్రములు చెప్పఁబడిన తర్వాత విశ్లిష్టావయవములగు వక్రతము లిందుఁ బేర్కొనఁబడినవి. ౡకార మిందగపడదు. 'కౢప్' ధాతువునందలి ఋకారము రేఫసంపృక్త మగుటకు మాఱుగ లకారసంపృక్త మయ్యేనేని ౡకార మేర్పడును గాన ౡకారమును వేఱుగఁ బఠింపనక్కఱలేదని శౌనకుఁడు తలంచి నట్లిందలి సందర్భాంతరమున విశదమగుచున్నది.

"తస్యైవ లకారభావే ధాతౌ స్వరః కల్పయతౌ ౡకారః" ఋగ్వేద ప్రాతిశా. ౧౩ పట. ౩౫ సూ.)

పార్షదవ్యాఖ్య:—తస్య ఋకారస్య స్థానే రేఫస్య లకారభావే యదాయదా స రేఫః లకార మాపద్యతే తదా ౡకారో భవతి – స్వరసంజ్ఞకశ్చ భవతి."

పయిరీతినే హల్లుల పాఠముయొక్క క్రమములో సైతమట్టి వ్యత్యాసము లిందుఁ గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

(౨౨౫)—పాణినీయ శిక్షయం దఱువది మూడు వర్ణములు గాని యఱువదినాల్గు వర్ణములుగాని సంస్కృత వర్ణసమామ్నాయమని యీక్రింది రీతిని జెప్పఁబడెను.

శ్లో॥ "త్రిషష్టి శ్చతుష్షష్టిర్వా । వర్ణా శ్శమ్భుమతే మతాః । ప్రాకృతే (వైదిక భాషయందు) సంస్కృతే చాపి । స్వయం ప్రోక్తా స్స్వయంభువాః స్వరా వింశతి రేకశ్చ। స్పర్శానాం పఞ్చవింశతిః। యాదయశ్చ (అంతస్థములు) స్మృతా హ్యష్టౌ। చత్వారశ్చ యమాః స్మృతాః। అనుస్వారో విసర్గశ్చ। ×క×పౌ చాపి పరాశ్రితౌ దుఃస్పృష్టశ్చేతి విజ్ఞేయః। ఌకారః ప్లుత ఏవచ."

ఇందు 'స్వరావింశతి రేకశ్చ' అని మొదట స్వరములను వేఱుగఁ జెప్పి తుది నడుమ హల్లులను సయితము చెప్పిన పిమ్మట 'ఌకారః ప్లుత ఏవచ' అని చెప్పుటచేత ఌకార ప్లుతమును గణించుట స్వారసము కాదనియు, దానిని గణించిన పక్షాంతరమందె యఱువదినా ల్గగుననియుఁ బయిశ్లోకములోఁ జెప్పఁబడె నని విశదమగుచున్నది. ఌకారమునకుఁ బాణిని దీర్ఘమునే యంగీకరింపలేదు. కాన దానిప్లుతమును స్వరసముగా గ్రహింపకుండుటయు న్యాయ్యమే యగుచుండును. కావుననే వాచస్పత్యకోశకర్త ఌవర్ణమునకుఁ బ్లుతము కలదనుట సరికాదని యీక్రిందిరీతిని వ్రాసెను.

"ఌకారః - స్వరవర్ణభేదః - సచ దంతమూలీయః ... ... అస్య ప్లుత తోక్తి శ్చిన్త్యా." (వాచస్పత్యము ౧౮౬౦ పుట.)

దుఃస్పృష్ట (ఈషత్ స్పృష్ట)డకారము దుఃస్పృష్ట (ఈషత్ స్పృష్ట)ఢకారము ననెడి రెండువర్ణములు శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును, ఋగ్వేదప్రాతిశాఖ్యమునందును జెప్పఁబడినను వానిలోని దుఃస్పృష్ట ఢకారమునకుఁ దచ్ఛాఖలోఁ బ్రయోగాభావమునఁ గావలయుఁ దైత్తిరీయప్రాతిశాఖ్యమున ముందు దాహరింపఁబోవు రీతిని నది పరిగణింపఁబడలేదు. ఒక్క దుఃస్పృష్ట డకారము మాత్రమె పరిగణింపఁబడెను. అట్లె పాణినీయ శిక్షయందును నొక్క దుఃస్పృష్టము మాత్రమె పేర్కొనఁబడెను. కాఁగాఁ బయిశుక్లయజుఃప్రాతిశాఖ్యమున నుద్దేశింపఁబడిన వర్ణము లఱువదేడిటిలోను ఌకారదీర్ఘమును దుఃస్పృష్ట ఢకారమును నాసిక్య మనఁబడెడి 'హుఁ' కారమును నను మూఁడువర్ణము లిందుఁ జేర్కొనఁబడలేదనియు నక్కారణమున నిం దఱువదినాల్గు వర్ణముల సంఖ్య యేర్పడెననియు గ్రహింపవలెను.

(౨.౨౮)—పాణినీయ శిక్షావచనములోని యీ దుఃస్పృష్టశబ్దము చేతఁ బయిరీతి నీషత్ స్పృష్ట డకారమును గ్రహింపరాదనియు, 'హోతౄ౯ ఌ కారః' మున్నగుచోటులందు 'ఌ తి సవర్ణే ఌవా' అను వార్త్తికముచే విధింపఁ బడిన మాత్రిక లకారద్వయగర్భ ఌకారమును గ్రహింపవలెననియు వాచస్పత్యకోశములోని యీక్రింది ప్రసంగమువలన విశదమగుచున్నది.

"దుఃస్పృష్టశ్చేతి విజ్ఞేయః। ఌకారః ప్లుత ఏవచేతి శిక్షోక్తేః ... ఌకారస్య లకార ద్వయయుక్తత్వేన ఈషత్ స్పృష్టతయా దుఃస్పృష్టత్వేన ..." (వాచస్పత్యము ౧౫౯-౭ పుట. స్వర వర్ణ విభాగాది సందర్భము.)

ఈ విషయము ఌకార దీర్ఘవర్ణ విమర్శసందర్భమున (౨౩౭ వి.) విపులముగా విమర్శింపఁబడును గాన నిట ముఖ్యములగు తన్నిరాస యుక్తులు మాత్రమె చూపఁబడుచున్నవి.

లకారద్వయగర్భిత ఌకారమును దుఃస్పృష్టముగా ననఁగా నీషత్ స్పృష్టముగాఁ బలుకుట యనుభవవిరుద్ధము. మఱియు వైదిక సంస్కృతమునఁ బ్రసిద్ధమై యున్న "అగ్నిమీళే, దేవహేళనమ్, ఏకనీళమ్, ఇళా" మున్నగు చోటులలోని యీషత్ స్పృష్టమగు డకారప్రకృతిక ళకారమును వర్ణసమామ్నాయమునఁ బరిగణింపలేదనుటయు, వైదికభాషలో నెచ్చటను బ్రయోగములేని లకారద్వయగర్భ మాత్రిక ఌకారము పరిగణింపఁబడెననుటయు సరికాదుగదా. మఱియుఁ బ్రాతిశాఖ్యములలో నెల్ల డకార ప్రకృతిక ళకారమె సంస్కృతవర్ణ సమామ్నాయములో దుఃస్పృష్టముగఁ బరిగణింపఁబడు చుండుటచేతఁ దద్విరుద్ధమగు నీ సమన్వయము సంప్రదాయ సిద్ధమును గానేరదుగదా.

(౨.౨౯)—తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునం దేఁబదితొమ్మిది వర్ణములు సంస్కృత వర్ణసమామ్నాయమని చెప్పఁబడెను. పైని వ్రాసిన పాణినీయ శిక్షలోఁ జెప్పఁబడిన యఱువదినాల్గువర్ణములలోను 'ఋ, ఌ, ఏ, ఐ, ఓ, ఔ' అను వానిప్లుతము లాఱును నుపేక్షింపఁబడిన వని "షోడశాదితః స్వరాః" (తై. తి. ౧౭-౫సూ.) అను సూత్రమువలన వ్యక్తమగుచున్నది. ఈ విధమున నేఁబదియెనిమిదియే కావలసియున్నను నీశాఖలో యమములైదని యంగీకరింపఁబడుటచేత నేఁబదితొమ్మిదివర్ణము లేర్పడుచున్నవి. ఈవిషయమె వైదికాభరణవ్యాఖ్యలో నీక్రిందిరీతిని విశదీకరింపఁబడెను.

"అథ వర్ణసమామ్నాయః" (తైత్తి. ౧ అ ౧ సూ
వైదికా) ... ... ...

"శ్లో॥ "హ్రస్వదీర్ఘ ప్లుతావర్ణే। వర్ణోవర్ణా ఋఋూ౯ చ।
ఏ ఐ ఓ ఔ ఇతిజ్ఞేయాః। షోడశైతాదితః స్వరాః।
కఖౌ గఘౌ ఙచఛజా। ఝఞౌ టఠడఢా ణతౌ।
థదౌ ధనౌ పఫబభ। మాః స్పర్శాః పఞ్చవింశతిః।
యరౌ లవౌ చతస్రోన్త। స్థాశ్చ శకశషస శషహాః
షడూష్మాణో విసర్గాను। స్వారా ళో నాస్యపఞ్చకమ్॥
ఇత్యేకోనాః షష్టివర్ణా। అస్మత్ స్వాధ్యాయవర్తినః॥"

(౨౨౮)—పాణినీయ మతానుసారముగనే ౯వర్ణదీర్ఘము నంగీకరింపని పై వ్యాఖ్యయందలి పై కారికలలో దుఃస్పృష్టమని సందిగ్ధముగఁ జెప్పక 'ళో' (ళ) అని స్పష్టముగాఁ జెప్పఁబడుటచేత నిచట డకార ప్రకృతిక మగు ళ వర్ణమె పరిగణింపఁబడె ననుటలో విప్రతిపత్తియే లేదు. ఇంత యేల! ఆ వ్యాఖ్యాతయే "పృక్తస్వరా త్పరో ళో డమ్ (౧౩ అ. ౧౬ సూ) ఇతి ళకారః" అని వివరించి యున్నాఁడు. పృక్తస్వరాదిత్యాది సూత్రమున నిక్రింది రీతిని వ్యాఖ్యచేసియున్నాఁడు.

"పృక్తస్వరా త్పరో ళో డమ్" (తైత్తి. ౧౩ అ. ౧౬ సూ.)

త్రిభాష్యరత్నవ్యాఖ్య:—"పృక్తస్వరాత్ =ఋకారా త్పరో ళకారః దుఃస్పృష్టసంజ్ఞో డకార మాపద్యతే పౌష్కరసాదే ర్మతే యథా 'మృడా తీదృశే. పృక్తస్వరా దితి కిమ్ – నళం ప్లవమ్. ఇతిశాఖాంతరే..."

వైదికాభరణవ్యాఖ్య—"పృక్తస్వరోనామ ఋకారః. ౯ కారశ్చ రేఫ లకార సంపృక్తత్వాత్. తస్మా త్పరో ళకారః డకార మాప్నోతి, పౌష్కర సాదే ర్మతాత్.."

ఋ ౯ వర్ణములకుఁ బరమగు ళ కారము డకారమగునని పయి సూత్రమున కర్థము. (స్వరమధ్యగతమయ్యు ళ కారము నిలువదని భావము.)

(౨౨౯)—వర్ణ సమామ్నాయమునఁ గొందఱు స్వరముల కన్నిటికిని హ్రస్వ దీర్ఘ ప్లుతముల నంగీకరించి పరిగణించుటయుఁ గొందఱు పయిని వ్రాసిన రీతిని గొన్నిటి ప్లుతములను మాత్రమె పరిగణించుటయు నింకను గొందఱు ప్లుతములనే పరిగణింపకుండుటయుఁ గలదు. "... ... ... ...

... ... త్రముచ్యతే నాస్మిస్త సంహితాయామ్” “ౡ వర్ణ దీర్ఘం పరిహాప్య స్వరాః షడ్వింశతిః ప్రోక్తాః. ఇత్యాదినా అష్టవర్ణా నుక్త్వా అష్ట పఞ్చాశత్వ స్యార్థం పునరపి ఋ వర్ణప్లుతం ౡ వర్ణ ప్లుతం సన్ధ్యక్షర హ్రస్వ ప్లుతాం శ్చేతి దశస్వరాన్ పరిహాప్య షోడశ స్వరపక్ష ఉక్తః... ...” తై త్తి. వైదికా భరణ వ్యాఖ్యా. ౧ అధ్యా. ౧. సూత్రపు వ్యాఖ్య.)

“తస్మిన్ ల్ల ళ్హ (ట-ళ్హ చూ. ౨౧౮-౨౨౨ విష.) జిహ్వామూలీ యోపధ్మానీయ నాసిక్యా న సన్తి మాధ్యం దినానామ్. (శుక్లయ. ౮ అ. ౨౯. సూ.)

“ౡకారో దీర్ఘః ప్లుతా శ్చైక వర్జమ్” శుక్లయ. ౮ అ. ౩౦ సూ.)

(౨౩౦)—‘సంస్కృత వర్ణసమామ్నాయ కథన విషయమునఁ బయి రీతిని వివిధములగు మతములు గలవు. అందు “ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః” అను ప్రకృతకారికలో నన్నయభట్టుద్దేశించిన యేఁబదివర్ణములును నెవ్వి యని పరిశీలింపవలసి యున్నది.

“అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ౡ ఏ ఐ ఓ ఔ” అను స్వరములు పదమూఁడును ననుస్వార విసర్గములు రెండును స్పర్శము లిరువదియైదును నంతస్థోష్మము లెనిమిదియును లౌకిక సంస్కృతమునం దెల్లయెడలను సుప్ర సిద్ధముగ నగపడుచుండుటంజేసి యా నలువదెనిమిదిటిని నుద్దేశించె నను టలో విప్రతిపత్తి యుండనేరదు. కాఁగాఁ దక్కిన రెండును నేవియో యని యాలోచింపవలసి యున్నది.

పయిని విశదీకరించిన యమములు నాల్గని కొందఱును నైదని కొందఱును నిట్లు చెప్పియుండుటంజేసియు నయ్యవి వైదిక సంస్కృత మాత్రప్రసిద్ధలగుటం జేసియు వానిని విడిచెననుటలో సందేహము లేదు. అట్లె తైత్తిరీయ ప్రాతి శాఖ్యములో నంగీకరింపఁబడినట్లు ‘అ, ఇ, ఉ’ అనువాని ప్లుతములు మూఁడి టిని మాత్రము గ్రహించినను బంచాశత్సంఖ్య కుదురుపడదు. కాన నన్న యభట్టు ప్లుతములనె యుపేక్షించె ననుటకును సందియము లేదు.

(౨౩౧)—ప్లుతము “వాక్యస్య టేః ప్లుత ఉదాత్తః” “దూరాద్ధూతేచ” ఇత్యాది సూత్రములచే నుదాత్త స్వర సిద్ధ్యాదికమునకయి విధింపఁ బడినదే గాని దానికి వాడుక లేదనియు నయ్యది శాస్త్రవిధాన సిద్ధమనియు నీ క్రిందిరీతి నహోబలపతి చెప్పియున్నాఁడు.

"హ్రస్వస్యైవ దీర్ఘస్యాపి సిద్ధత్వేన (లోకవ్యవహార సిద్ధత్వేన—శిక్షా శ్లోకా ద్దృశ్యా) ద్వయోః పార్థక్యేన పరిగణనా. ప్లుతస్య తు విధివిషయత్వా న్న పరిగణనేతి హి సంప్రదాయః" (అహో. ౧౩౬ పుట.)

దూరాహ్వాన గాన రోదనాదులందలి ప్లుతస్వరమునందుఁ ద్విమాత్రా కాలముకన్న నధికమగు కాల దైర్ఘ్యము వెలయుచుండుట యను భవ సిద్ధమై యున్నను నవవస్థా ప్రసంగముచేఁ గావలయును ప్రాచీనులు త్రిమాత్రాకాల పరిమితిని మాత్ర మంగీకరించి యున్నారు. లౌకిక సంస్కృత సంబోధనములందు 'రామ, శంభో, హరే' అని యిట్లు హ్రస్వదీర్ఘ స్వర ములు మాత్రమే ప్రయుక్తము లగుచుండుటచేతఁ బ్లుతస్థితి నంగీకరింపవల సిన యావశ్యకత యగపడదు.

"ఉ॥ ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాముభార్యఁ జుం
డో జనులార యడ్డుపడ రో సురలార......" (భాస్కర రా).

ఇట్టి దూరాహ్వానాదులందలి స్వరములు లఘువులుగా ననఁగా హ్రస్వ ములుగా నైతము ప్రయుక్తములై యుండుట విపులముగ నగపడుచున్నది. ఇంకఁ బాక్షిక ప్లుత స్థితికిని మూలము మృగ్యమై యున్నది.

మఱియు "హ్రస్వం లఘు" "సంయోగే గురు" "దీర్ఘంచ" అనెడి పాణిని సూత్రములలోఁ బ్లుతము గురువని వేఱుగఁ జెప్పఁబడమింజేసి యది లఘువే యనియుఁ బయి పద్యములోని ప్రయోగములవంటి స్థలములలో 'జనులార' మున్నగుచోటు లందలి తుది 'అ' కారము లఘువగు ప్లుతమే యనఁదగుననియు గొందఱు తలంచుచున్నారు. ద్విమాత్రాక స్వరమే గురు వగునపుడు త్రిమాత్రాకము గురువగు ననుట కైముత్యన్యాయ సిద్ధమె కదా. ఈవిషయమె యీక్రింది యువ్వటకృత ఋగ్వేద ప్రాతిశాఖ్య వ్యాఖ్యలో విశదీకరింపఁబడియున్నది.

"గురూణి దీర్ఘాణి" (ఋగ్వేద. ౧ పటలము.)

పార్షదవ్యాఖ్య:—"యాని దీర్ఘా ణ్యక్షరాణి తాని గురుసంజ్ఞకాని వేదితవ్యాని, ప్లుతస్యాప్యత్ర గ్రహణం ద్రష్టవ్యమ్, యో హి ద్విమాత్రం గురుం కల్పయతి కల్పయత్యే వాసౌ త్రిమాత్ర మపీతి"

ఇంతయేల! సంస్కృతాంధ్ర కవు లెల్లరును జతుర్మాత్రా గణములతో నడచు నార్యా కందాదులలో దూరాహ్వానాది సంబోధనములందలి స్వరము

లను హ్రస్వములుగను దీర్ఘములుగను మాత్రమె తలంచుచు హ్రస్వ ముల నేకమాత్రాకములుగాను దీర్ఘములను ద్విమాత్రాకములుగాను ప్రయోగించుచు వచ్చిరే కాని యెచ్చటను దూరాహ్వాన సంబోధనాదుల లోని స్వరమును త్రిమాత్రాకమునుగా లెక్కించి ప్రయోగించి యుండలేదు. వైయాకరణులు ప్లుత మన్నది వైభాషికమె యని చెప్పియున్నను నట్టి పాక్షిక స్థితినైన నిరూపించు ప్రజల ప్రయోగ మొక్కటైన లౌకికకావ్య వాఙ్మయ మున లేమింజేసి నన్నయభట్టారకుఁ డద్దాని నుపేక్షించె ననియె నిశ్చయింప నగును.

(౨౩౨)—అప్పకవ్యాదులు సరిగా నాలోచింపక ప్లుత యతిని జెప్పు సందర్భములో యథాప్రసిద్ధిగాఁ బ్లుతము త్రిమాత్రాకమనుచుఁ జెప్పిరే కాని లౌకిక వాఙ్మయమునఁ ద్రిమాత్రాక ప్లుత స్వరాంగీకారము నకుఁ గల యావశ్యకత యేమో పరిశీలింపరైరి.

క॥ పలుకుల తలఁ గల వ్రాలకు। వలనగుచోఁ బ్లుతము నిలిపి వానికి రెండున్।
వళులుగఁ జెప్పిన కావ్యం। బుల నది కాకుస్వరంబు ప్లుతవళియు నగున్॥
(అప్పక. 3 ఆ. ౨౮౧ ప.)

ఆ॥ వె॥ ఏకమాత్రె హ్రస్వ మినుమడించిన దీర్ఘ మయ్యె మూఁడుమాత్ర
[లైనఁ బ్లుతము।
భీతి శోక తర్కగీత దూరాహ్వాన। సంశయార్థములను జరగుఁ బ్లుతము॥
(అప్పక. 3 ఆ. ౨౮౨ ప.)

దూరాహ్వానప్లుతము:—

తే॥ ఆదితేయార్చితాంఘ్రి పద్మా యనంగ॥ ద్వారకాపుర మధ్య సద్మా
[యనంగ।
నసురకులవైరి వీరులారా యనంగ। రసికచిత్తాబ్జవాసులారా యనంగ॥

పై సంబోధనముల తుదిస్వరములు దీర్ఘ మాత్రములె యైయున్న వనఁదగునుగదా. (అప్ప - 3 ఆ. ౨౯౦ ప).

(౨౩౩)—అథర్వణాచార్యుఁడు సంబోధనమున దీర్ఘమునే స్వర సముగా విధించి దూరాహ్వానాదులలోఁ బ్లుతమును గొందఱు చెప్పుదురని యీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

"సమ్బోధనే వా దీర్ఘః స్యాత్। ప్రయోగస్య తథాగతేః"

భవే దత్రాదితా మేవ। పక్షత్వం ప్రకృతే స్మృతః ॥ ౧౦ ॥
సమ్బోధనే ప్లుతం ప్రాహుః। కేచి ద్దూరాదికేష్విహ ॥ ౧౧ ॥

(అథర్వణ కారికావళి - అజంతపరిచ్ఛేదము).

ఇట్లు ప్లుతస్థితి నన్నయభట్టారకునకే కాక యథర్వణునకును నస్వరసమె వైయున్నది. నన్నయ భట్టారకుఁడు చింతామణిలో సంబోధన దీర్ఘమును విధించియే యుండలేదు. అతఁడు విధించినట్లు చేసిన యహోబలపతి వ్యాఖ్య (అహో. ౨౮౬ పుట) మూలాభిప్రేతము కాదు. పరిశీలింపఁగా సంబోధనమునఁ బ్లుతము దీర్ఘస్వర రూపముగ (ద్విమాత్రాకి) నంతయు తర్వాది స్వరములవలెనే నిల్చుచుండును గాన నట్టి దీర్ఘస్వరములను విధింప నక్కఱ లేదని నన్నయభట్టు తలంచియే దీర్ఘ విధానము చేసియుండ లేదని తోఁచుచున్నది. ఆపక్షముననే యట్టిస్వరముల కుభయ యతులు సమూలము లగును. అట్లు దీర్ఘరూప ప్లుతస్వరము యథావ్యవహారముగ వచ్చు ననుతలంపుగల వాఁడగుటచేతనే "ఉజతౌ తు న ప్లుత స్స్యా త్సమ్బుద్ధా విత్యూతాం విదుః కేచిత్" అని యిట్లుకారాంత సంబోధనములందు "శంభ, శంభా" మున్నగు రూపములను వారించుచు "శంభూ" అను రూపము నంగీకరించి యుండెను. త్రిమాత్రాకప్లుత విధానము పై "ఉజతౌత్వి" త్యాది చింతామణి సూత్రము చేయుచున్నదను వ్యాఖ్య మూలాభిప్రేతము కాదు. అకారాంతాదులకుఁ బ్లుత విధానమునేకాక దీర్ఘ విధానము నైనఁ జేయని చింతామణి కర్త 'ఉ' కారాంతములకు మాత్రము ప్లుతవిధానమును జేసియుండునా ? ఇంక 'అత్త్వాదుఙ్కులు' రావనియు దీర్ఘరూపప్లుతము తక్కిన వానికి వలెనె 'ఉకారాంతములకును' వచ్చుననియు మాత్రమె యీసూత్రముచేఁ జెప్పఁబడుచున్నదని గ్రహింపనగును. భారతాది పర్వమున నన్నయభట్టు ప్రయోగించిన 'జరత్కారూ' అను సంబోధనము నందలి స్వరము దీర్ఘరూపమే యనియు నది ప్లుతమనవలసిన దూరాహ్వానాది ప్రసక్తి యచట లేదనియు నెఱుంగునది.

"వాసుకియుఁ దన చారులవలన నంతయు నెఱింగి నిజసహోదరియైన జరత్కారుం దోడ్కొని జరత్కారు మహామునిపాలికిం బోయి యిట్లనియె.

శా॥ ధన్యుండ బయ్యె భవత్కులం బతికృతార్థం బయ్యె నస్మత్కులం।
బన్యోన్యానుగుణాభిధానములఁ జిత్తానంద మొందెన్ వివే।
కన్యాయాన్విత భూసురోత్తమ జరత్కారూ జగన్మాన్య యీ।
కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కారున్ మదీయానుజన్॥
(భార. ఆది. ౨ ఆ. ౧౯౮ ప).

(౨౩౮)—లౌకిక దూరాహ్వానములందు ద్రాఘిష్ఠ స్వరోచ్చారణము ప్రసిద్ధమై యున్నను గావ్య వాఙ్మయమున సంబోధనము లందట్టి స్వరదైర్ఘ్య మనావశ్యక మని తలంచువాఁడు కావుననే నన్నయభట్టారకుఁ డీక్రింది దీర్ఘస్వర ప్రయోగార్హ దూరసంబోధన స్థలములందును హ్రస్వ స్వరములనే ప్రయోగించి యున్నాఁడు.

"సీ॥ హా మహారాజ మహామహీరక్షణదక్షదక్షిణబాహుదండ దండి। తారాతి నిషధ రాజాగ్రణీ......ఆ.వె. పొదలలోన డాఁగి పొడసూప కిట్లేల। యున్నవాఁడవు... ... ... ... (భార. అర. ౨ ఆ ౮౧ ప.)

ఆ. వె. ఇంకనైన నన్ను నేల యాలింపవు। నాకు శరణ మగుము నాథ యనుచు। నఱచుచున్న దాని యాక్రందన ధ్వని। వినుచు నొక్క యెఱుక వేగవచ్చి" (భార - అర ౨ ఆ - ౮౭ ప.)

(౨౩౯)—ప్రకృత మనుసరింతము—ఇంకఁ బంచాశత్సంఖ్యకుఁ గొఱవడియున్న యా రెండువర్ణములు నెవ్వియను విషయము పరిశీలింపఁ వలసియున్నది. అట్టి రెండువర్ణములును నన్నయ జిహ్వామూలీ యోపధ్మానీయము లని తలఁచెనో లేక 'ఱ'కార దుఃస్పృష్ట డకారములని తలఁచెనో యను రెండు పక్షములు ముఖ్యముగా విమర్శింపఁదగి యున్నవి.

"కుప్వోః ఁక ఁపౌ చ" (౮ - ౩-౩౭) కవర్గే పవర్గేచ పరే విసర్జనీయస్య క్రమాత్ జిహ్వామూలీ యోపధ్మానీయా స్తః చా ద్విసర్గః ......క ఁకరోతి-కఃకరోతి. కఁఖనతి-కఃఖనతి. కఁపచతి-కఃపచతి" (సిద్ధాంత కౌముది.) అనుచొప్పిన జిహ్వామూలీయోపధ్మానీయములు విసర్గాపరావతారములై యగుటచేతను నవి పరస్థిత క ఖ ప ఫ లనుబట్టి పాక్షికముగఁ గల్గిన విసర్గ పరిణామ రూపములై యగుటచేతను వెనుక వ్రాసినరీతిని శుక్లయజుః ప్రాతిశాఖ్యమున మాధ్యందిన శాఖవారు వీనిని వేఱుగ నంగీకరింపనట్లె యనన్న భట్టారకుఁడును వీనిని బరిగణింపక 'ఱ'కార దుస్స్పృష్ట డకారములతో

డనె పంచాశత్సంఖ్యాపూరణము గావించు చెంచె ననుట యుక్తము. ఇట్లు గ్రహించునప్పుడె "ప్రకృతేష్టు తే నశోనాః స్యుః" అనెడి యనంతర సూత్రమును ముందు విమర్శింపఁబోవు రీతిని సుసంగతము గాఁగలదు.

(౨౩౬)—అహోబల పండితుఁడును నిట్లె యభిప్రాయపడి యున్నాఁడు- "జిహ్వామూలీయోపధ్మానీయయో స్తు నోభయత్రాపి పరిగణనమ్. తయో ర్విసర్గాత్మకత్వేన వర్ణాంతరత్వాభావాత్." (అహో. ౧౨౮ పుట.)

అధునాతన పండితులును నిట్లె యభిప్రాయపడి యున్నారు. "పదాంత రేఫ సకారములు క కార ఖకారములకుఁ బూర్వము విసర్గలోనికి కాక జిహ్వామూలీయములోనికిని, పకార ఫకారములకు పూర్వ ముపధ్మానీయములోనికిని, మాఱునని కొందఱును మాఱవచ్చునని కొందఱును, వైయాకరణులు చెప్పియున్నారు. ఈ భేదము వైయాకరణులు కల్పించినది గాని నిజముగా నాలోచింప విసర్గమునకును వీనికిని భేదమున్నట్టు గనఁబడదు. గ్రంథములో నివి సాధారణముగా వేఱు వేఱు గుర్తులతో సూచింపఁబడుట లేదు." (ప్రమోదూతసంవత్సరాశ్వయుజ భారతి.)

(౨౩౭)—పయిరీతిని జిహ్వామూలీయోపధ్మానీయముల నుపేక్షించి ఌకార దుఃస్పృష్ట డకారములను వర్ణ్యముగ నుద్దేశించె ననుపక్షమునకు "ఌవర్ణస్య దీర్ఘాభావాత్త్"ని యిట్లు ఌకారదీర్ఘము నంగీకరింపని పాణిని మతము బాధకమై యున్నది. ఌకార దీర్ఘమునకు సంస్కృతమునఁ బ్రయోగములేదని కొందఱు తలంచుచున్నారు. తైత్తిరీయప్రాతిశాఖ్యమునందును ఌకార దీర్ఘ మంగీకరింపఁబడలేదు. అట్లయినను ఋగ్వేదప్రాతిశాఖ్యమునందును, శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందును, నయ్యది పరిగణింపఁబడినది. శుక్లయజుః ప్రాతిశాఖ్యమునందలి పై విషయ మీావఱ కుదాహరింపఁబడియున్నది. (వి. ౨౨౨.) ఋగ్వేదప్రాతిశాఖ్యమున నీ క్రిందిరీతి నున్నది.

"పఞ్చస్వపి తాని సన్తి" (ఋగ్వే— ౧ పట — ౨ సూ.)

పార్షదవ్యాఖ్యా:—"తాని కాని దీర్ఘాణీ త్యర్థః పఞ్చస్వపి హ్రస్వేషు (అ ఇ ఉ ఋ ఌ) ద్వితీయా భవన్తి."

ప్రాతిశాఖ్యాదులలోఁ బ్రసిద్ధమై యున్న సంస్కృత వర్ణసమామ్నాయమునఁ గొన్నివర్ణములు లోపింపఁగాఁ గొఱవడిన వర్ణములే ప్రాకృతమునందు వర్ణసమామ్నాయ మగుచున్నదని చెప్పుటలో హేమచంద్రాచార్యుఁడు

ౡకారవిషయమున నిక్రిందిరీతిని ప్రసంగించి యుండుటంజేసి సంస్కృతవర్ణ సమామ్నాయమునందలి ౡకారస్థితి నాతఁ డంగీకరించెనని విశదమగుచున్నది.

"ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష విసర్జనీయ ప్లుతవర్జో వర్ణసమామ్నాయో లోకాదవగన్తవ్యః" (సిద్ధహేమచంద్ర ప్రాకృత శబ్దానుశాసన వృత్తి. ౮ అధ్యా. ౧ పాద ౧ సూత్ర).

(౨౩౮)—ముగ్ధబోధవ్యాకరణములో (వోపదేవకృతము) ఌకారమునకు హ్రస్వదీర్ఘప్లుతములు మూఁడును గలవని చెప్పఁబడుటయేకాక దానికి సవర్ణదీర్ఘము సైతము సూత్రింపఁబడియున్నది.

"ఌత్రయం త థ ద ధ న ల స వో దన్త్యాః (సంజ్ఞా. ౬. సూ).

"సవర్ణే ర్ఘః" "ర్ణే (సవర్ణే) పరే పూర్వస్య ర్ణేన సహ ర్ఘః (దీర్ఘః) స్యాత్ ... ... శక్ల+ఌ దన్తః = శక్లౡదన్తః."

దుర్గాదాసవ్యాఖ్యా:—"శక్లధాతుః, శక్లనామా కశ్చిద్వా. శక్లౡదన్త ఇతి ౡకార దీర్ఘస్య ప్రయోగో నాస్తీతి పాణిని క్రమదీశ్వరౌ ..." (సంజ్ఞా—౨౨ సూ.)

(౨౩౯)—శబ్దకల్పద్రుమకోశమున ౡకార దీర్ఘము గలదని చర్చింపఁబడుటయే కాక యట్టి ౡకారమున కాగమ శాస్త్రమునందుఁ గల యుపయోగమును, కోశములలోని ౡశబ్ద తదర్థములును నుదాహరింపఁబడి యున్నవి.

"ౡ-వ్య. దేవనారీ, నార్యాత్మా మాతా ఇతి మేదినీ. ౡః, స్త్రీ, దైత్యస్త్రీ, ఇత్యేకాక్షరకోశః, దనుజమాతా, కామధేనుమాతా, ఇతి కశ్చిదేకాక్షరకోశః. ౡః-పుం. సర్వః మహాదేవః.-ఇతి కశ్చిదేకాక్షరకోశః. ౡ-దీర్ఘ ౡకారః సతు దశమస్వరవర్ణః. అస్యోచ్చారణ స్థానం దన్తః." (యథా ముగ్ధబోధే "ఌత్రయం త థ ద ధ స ల సా వోద న్త్యాః... ...)

"ౡకారం పరమేశాని । పూర్ణచన్ద్ర సమప్రభం। పఞ్చదేవాత్మకం వర్ణం। పఞ్చప్రాణాత్మకం సదా। ... ... " ఇతి కామధేనుతన్త్రమ్ - (వఙ్గీయ భాషాయామ్) అస్య లేఖన ప్రకారో యథా:—

"తత్రోడ తుల్య రూపాచ । రేఖా సా వైష్ణవీ స్మృతా । తాసు వన్ద్యాః సురేశానీ । దుర్గా వాణీ సరస్వతీ" ఇతి వర్ణోద్ధార తన్త్రమ్. తన్నామాని యథా.—

"ౡకారః కమలా హర్షా। హృషీకేశో మధువ్రతః। సూక్ష్మా కాన్తి ర్వామగణ్డో। రుద్రః కామోదరీ సుతా। ...... ఇతితన్త్రిశాస్త్రమ్, మాతృకాన్యాసే వామగణ్డే న్యస్యతయా తన్త్రశాస్త్రఽప్యభిధానమ్. మాతృకాన్యాసమన్త్రో యథా:—

"ఌం నమో దక్షిణగణ్డే. ౡం నమో వామగణ్డే"

"ముగ్ధబోధమతే తన్త్రిమతేచ ఌకారస్య దీర్ఘత్వ మస్తి. అత్రేదం జ్ఞాతవ్యమ్—ఌకారస్య (పాణినిమతే) దీర్ఘత్వాభావేఽపి "ఌతి ౡవేతి వార్త్తికోక్తేః ౡకార ఏవ తత్రవిధేయః—తేన "హోతౢకారః" ఇత్యాదౌ ౡకారస్య వ్యవహారః. ముగ్ధబోధేఽపి ఏతదనుసారేణ ఏకమాత్ర ద్విమాత్ర త్రిమాత్రాపేక్షా 'ఌత్రయ' మిత్యుక్తం తేన న విరోధః"

(౨౮౦)—పాణిని మతమున ఌకార దీర్ఘము లేకున్నను 'ఌతి ౡవా' అను వార్త్తికము చెప్పున ౡకార దీర్ఘము గలదనుచుఁ బయిరీతిని శబ్దకల్ప ద్రుమమున వ్రాయఁబడినది. ఈ వార్త్తికమునకు పలు విధములగు నభిప్రాయము లగపడుచున్నవి. ఆ విషయ మింట దిఙ్మాత్రముగఁ జూపఁబడును.

'అక స్సవర్ణే దీర్ఘః' (౬-౧-౧౦౧) అను పాణినీయ సూత్రముచెప్పున 'అ, ఇ, ఉ, ఋ, ఌ' అనువానికి సవర్ణమగు నచ్చుపరమగునప్పుడు దీర్ఘ మేకాదేశము సిద్ధించుచుండఁగా ఋఌ వర్ణముల విషయమున వార్త్తిక కారునిచే విశేషవిధి యీక్రింది రీతిని జేయఁబడెను.

"ఋతి ఋవా" "ఌతి ఌవా" సవర్ణమగు ఋవర్ణము పరమగునపుడు హ్రస్వ ఋవర్ణము వికల్పముగ నేకాదేశమగును. పక్షాంతరమున సవర్ణ దీర్ఘముగ ౠకారము వచ్చును. హోతృ+ఋకారః=హోతృకారః, హోతౄకారః. అట్లె సవర్ణమగు ఌవర్ణము పరమగునపుడు హ్రస్వ ఌవర్ణము వికల్పముగ నేకాదేశమగును. పక్షాంతరమున సవర్ణదీర్ఘము వచ్చును. అనఁగా ఌవర్ణదీర్ఘము పాణినీయ సమ్మతము గాదు గాన "ఋ ఌ వర్ణయో ర్మిథ స్సావర్ణ్యం వాచ్యమ్" అనుచెప్పున ఋ ఌ వర్ణములు సవర్ణములుగాన దీర్ఘమగు ౠకారమె వచ్చును. (హోతృ+ఌకారః = హోతౢకారః హోతౄకారః) అని యిట్లు ప్రాచీన వైయాకరణులు వ్యాఖ్య చేసిరి. ఈ విషయ మీక్రింది తత్త్వబోధిన్యాది వాక్యములవలన వ్యక్తమగుచున్నది. "ఏతేన దీర్ఘే

ప్రాప్తే హ్రస్వ ఋకారో హ్రస్వ ఌకారశ్చ విధీయత ఇతి ప్రాచో వ్యాఖ్యాన మాకర విరుద్ధమ్" (౨౨ పుట, తత్త్వబోధినీసహిత సిద్ధాంత కౌముది.) "వర్ణద్వయం ద్విమాత్రమితి - యత్తు ప్రాచా వ్యాఖ్యాతం దీర్ఘే ప్రాప్తే హ్రస్వఋకారో ఌకారశ్చ విధీయతఇతి తద్భాష్యకైయటాది విరోధా దుపేక్ష్యమ్, (ప్రౌఢమనోరమ. ౧౯ పుట)

(౨౪౧)—పయి వ్యాఖ్యలచే సూచితమగు ప్రాచీన వ్యాఖ్య చెప్పున హ్రస్వ ఋ ఌ వర్ణవిధానము సై వార్త్తికములచేఁ జేయఁబడలే దనియు నావార్త్తికములలోని ఋ ఌ వర్ణములు సామాన్యస్వరములు కావ నియు నందలి ఋ వర్ణమును ద్విమాత్రికమును రేఫద్వయ గర్భితము ననియు, నట్టి రేఫద్వయ మొక మాత్ర యనియు దాని కిర్వంకలనున్న ఋకారము మా త్రిక స్వరభాగమనియు నట్లె రెండవ వార్త్తికములోని ఌ వర్ణమును ద్విమాత్రికమును లకారద్వయ గర్భితము ననియు నట్టి లకారద్వయ మొక మాత్ర యనియు దాని కిర్వంకలనున్న ఌకారము మాత్రిక స్వరభాగమనియు గ్రహించుట భాష్యాదిసమ్మతమని భట్టోజీ దీక్షితుల యభిప్రాయము. కాఁగా "హోతృ+ఋకారః" అనుచో 'హోతౄకారః' అను పాక్షికరూప మును బయిని వ్రాసిన రీతిని రేఫద్వయగర్భితమగు ఋకార రూపమును సిద్ధించుచున్నవి. ఇట్లె 'హోతృ + ఌకారః' అనుచోటను 'హోతౄకారః' అను పాక్షికరూపమును బయిని వ్రాసిన రీతిని లకారద్వయ గర్భిత ఌకార రూపమును సిద్ధించుచున్నవి.

"ఋ తి ఋ వా. ఌ తి ఌ వే త్యుభయత్రాపి విధేయం వర్ణద్వయం ద్విమాత్రమ్; ఆద్యస్య మధ్యే ద్వౌ రేఫౌ. తయో రేకా మాత్రా. అభితోఽ జ్భక్తే రపరా. ద్వితీయస్యతు మధ్యే ద్వౌ లకారౌ, శేషం ప్రాగ్వత్" (సిద్ధాంత కౌముది. ౨౧ పుట.)

పాణిని మతమున ద్విమాత్రికదీర్ఘ ఌ కార మప్రసిద్ధ మను సిద్ధాం తము ననుసరించుటకయి ప్రోక్కఁబడిన యీమార్గమునం దెవ్వరిమతమునను ప్రసిద్ధిలో లేనట్టియుఁ బలుక శక్యముగానట్టియు (చూ. విష ౧౪౬) మాత్రిక స్వర మధ్యగత వ్యంజన ద్వయస్థితి నంగీకరింపవలసిన యనుపపత్తి దుర్వార మగుచున్నది. వాచస్పత్య కోశమున నట్టి రేఫద్వయము లకారద్వయమును లేఖనమునందును జూపఁబడినవి.

పయి వార్తికద్వయములో మొదటిదానిని 'ఋ తి సవర్ణే ౠవా' అని పఠించి దానిచే రేఫద్వయయుత ఋవర్ణము విధింపఁబడినదని గ్రహింప వలయుననియు (హోతృ+ఋకారః = హోతౄకారః హోతృకారః), నట్లే రెండవదానిని 'ఌతి సవర్ణే ౡవా' అని పఠించి దానిచే లకార ద్వయ యుత ఌకారము విధింపఁబడుచున్నదని గ్రహింపవలయుననియు నీ పక్షమున నట్టి హల్లుల ద్వికి మొకటిమాత్రయు వాని కిరువంకలను గల స్వరభాగ మొక మాత్రయు కలిసి యా విధేయవర్ణము ద్విమాత్రిక మగుచున్నదనియు నిట్లు వాచస్పత్యకర్తయు సమన్వయించి యున్నాఁడు.

"ౡకారః—(ॡ कारः) తన్త్రిమతే ముగ్ధబోధమతేచ స్వరవర్ణభేదః పాణినిమతే తస్య దీర్ఘత్వం నాస్తి......అత్రేదం బోధ్యమ్—ఌవర్ణస్య (పాణినిమతే) దీర్ఘత్వాభావేపి ఌతి ౡవేతి వార్తికోక్తేః లకార ద్వయయుత ఌవర్ణ ఏవ తత్ర విధేయః. తత్ర లకార ద్వయ రూప వ్యఞ్జన ద్వయస్య ఏకా మాత్రా. అచశ్చాపరా. ఇతి ద్విమాత్రత్వమ్. తేన హోతౡకార ఇత్యాదౌ దీర్ఘత్వ వ్యవహారః......ఏవం సర్వసామఞ్జస్యే ఌవర్ణస్య న దీర్ఘకల్పనమితి సూక్ష్మ మీక్షణీయమ్," (వాచస్పత్యము. ౧౪౪౮ పుట.)

ఈ దీక్షిత వాచస్పత్య సమన్వయపద్ధతి సంప్రదాయ విరుద్ధముగ నున్నది. అక్షరముల మాత్రా పరిగణమున హల్లుల పరిమాణములను లెక్కించుట కేవలము నప్రామాణిక విషయమై యున్నది. అట్లే పరిగణించి నచో 'క్త' అనునది ద్విమాత్రికమనియు (౧౪౫ - ౧౪౬ వి.) 'క' అనునది యధ్యర్ధమాత్రాకమనియును నప్రమాణముగాఁ జెప్పవలసి వచ్చును గదా. ఈ విషయ మింకను విపులముగా మున్ముందు నిరాకరింపఁబడును. (౨౪౪ వి.)

పయిరీతినే యీ విషయమున నహోబలపతియుఁ గొన్ని యపమార్గ ములను ద్రొక్కి సమన్వయించి యున్నాఁడు. "ఌ వర్ణస్య ద్వైవిధ్య మిత్యత్ర తస్య దీర్ఘాభావాత్ ప్లుతేన ద్వైవిధ్యమితి కేచి దాహుః. తస్య సాక్షాద్దీర్ఘాభావేపి ఋ వర్ణ సవర్ణత్వేన తద్దీర్ఘ మాదాయ దీర్ఘవత్త్వమితి కేచి దవదన్. అత్రేయం చిన్తా :—హ్రస్వస్యేవ దీర్ఘస్యాపి సిద్ధత్వేన ద్వయోః పార్థక్యేన గణనా, ప్లుతస్య తు విధివిషయత్వా న్న పరిగణనేతి హి సంప్రదాయః. ఏవం స్థితే ఌ వర్ణ ప్లుతస్యైవ విశిష్య గ్రహణ మిత్యప్రామాణి

కమేవ, నహా తేన ప్రయోజన మితి. ఋ వర్ణ దీర్ఘేనైవ దీర్ఘవత్త్వం ప్రామాణికమ్, అణుదిత్సవర్ణస్య చాప్రత్యయ ఇతి గ్రహణక శాస్త్రానుగతా దృకార త్రింశత స్సంజ్ఞా ౡ కారశ్చ తథావిధ ఇతి సిద్ధాన్తాత్. అతఏవ హోతృ+ ౡ కార ఇత్యత్ర సవర్ణదీర్ఘే హోతౄకార ఇతిరూపం సిద్ధమ్. (అహో ౧౩౬ పుట.)

హ్రస్వదీర్ఘ ప్లుత భేదములచేఁ ద్రివిధమగు స్వర ముదాత్తానుదాత్త స్వరితభేదములచేఁ దొమ్మిదివిధము లగుచున్నదనియు నయ్యవి మరల ననునాసి కాననునాసిక భేదములచే నష్టాదశభేదము లగుచున్నవనియు ౡ వర్ణమునకు దీర్ఘము లేకుండుటచే నద్దానికిఁ బండ్రెండు భేదములు మాత్రమే వెలయుచున్నవనియు ఋ ౡ వర్ణములకు మిథస్సావర్ణ్య ముండుటచేత ఋ వర్ణముయొక్క పదునెనిమిది భేదములతోను ౡ వర్ణ ద్వాదశ భేదములను జేర్పఁగా నయ్యది ముప్పది భేదములు గలదగుచున్నదనియుఁ బాణినీయులు వివరించి యున్నారు.

"ఊకాలో జ్ఝ్రస్వదీర్ఘ ప్లుతః" (౧ - ౨ - ౨౭) ఉశ్చ ఊశ్చ ఉ '౩' శ్చ వః. వాం కాల ఇవకాలో యస్యసోచ్ క్రమాత్ హ్రస్వ దీర్ఘ ప్లుతసంజ్ఞస్స్యాత్. స ప్రత్యేక ముదాత్తాదిభేదేన త్రిధా... ... ...స నవ విధోఽపి ప్రత్యేక మనునాసి కాననునాసికత్వాభ్యాం ద్విధా...తదిత్థమ్. అ ఇ ఉ ఋ ఏషాం వర్ణానాం ప్రత్యేక మష్టాదశభేదాః. ౡ వర్ణస్య ద్వాదశ... ... ఋకార త్రింశతః సంజ్ఞా. ఏవం ౡ కారోఽపి... ...(సిద్ధాంత కౌముది. సంజ్ఞా, ౪-౬ పుటలు.)

హ్రస్వ మాఱువిధములును దీర్ఘ మాఱువిధములును బ్లుత మాఱు విధములును గలసి పదునెనిమిది భేదము లగుచున్నవి. ౡ వర్ణమునకు దీర్ఘము లేమింజేసి పండ్రెండు విధములే యగుచున్నది. ఇట్టి పాణినీయ మతమునే యనుసరించి వివరించుచు నహోబల పండితుఁడు "ద్విధాః" ఇత్యాది సూత్రముచొప్పున ౡ వర్ణ ద్వైవిధ్యమును వివరించుటలోఁ బ్లుతము శాస్త్ర మాత్ర సిద్ధమగుటచే (౨౩౧ వి.) నద్దానికిఁ బరిగణనము లేదనియు 'ద్విధాః' అనుచోటి అక్షరములలోని 'అ, ఇ, ఉ, ఋ' అనువాని ద్వైవిధ్యము పక్షమున హ్రస్వదీర్ఘములను బరిగణించి ౡ కార ద్వైవిధ్య పక్షమున మాత్రము హ్రస్వ ప్లుతములను బరిగణించుట యసంగతమనియు నక్కా

రణమున ఌకారమునకు సహజముగ దీర్ఘము లేకున్నను "హోతృ + ఌ కారః = హోతౄకారః" అనుచోట సిద్ధించిన ౠకారరూప దీర్ఘమునే ఌ వర్ణ దీర్ఘముగఁ బరిగణింపనగు ననియుఁ బైరీతిని వ్యాఖ్య చేసియున్నాఁడు. కాని యీ రీతిని సవర్ణ దీర్ఘ విధిలో సిద్ధించిన ౠకారమును సహజమగు ౠకారమును నభిన్నములే యగుటచేత వానికిఁ బృథగ్గణన మసంగత మగుచు ఘట్టకుటీ ప్రభాత న్యాయమునఁ బంచాశత్సంఖ్యా ప్రాప్తి కాకుండుట యీతని సమన్వయమున దుర్వార మగుచున్నది.

"రలయో ర్లడయో స్తద్వ దిత్యాదికము (౧౯౨. వి.) చెప్పిన నభిన్నములగు ర ల లు మున్నగు వానికివలెనే యభిన్నములగు సహజౠకారమునకును బైవిధమున ఌ వర్ణజన్య ౠకారమునకును బృథగ్గణన మవిరుద్ధమని వ్యక్తపఱచుటకుఁ గావలయు సహోబలపతి యీసందర్భమున నట్టి ర ల లు మున్నగువానికిఁ గల యభిన్నతా వ్యవహారములను బ్రసంగించియున్నాఁడు. కాని యట్టి ర ల లు మున్నగువాని యభిన్నత శ్లేషాదులలో మాత్ర ముపచరింపఁదగిన దగుటచేతను (౧౯౨. వి.) నట్టి ర ల లు మున్నగువాని యుచ్చారణమున స్థానప్రయత్నాది భేదము వెలయుచుండుటచేతను వానిసామ్యము వీని కెంతమాత్రమును సరిపడనేరదు. అనుప్రదానాదిత్యాదికము (౧౮౧. వి.) చెప్పిన నీ ఌ కారజన్య ౠకారమునకు వర్ణవైశేష్యమును సంపాదించుట కవకాశము లేదుగదా.

(౨౮౨)—ఇఁక వెనుక నుదాహరించిన (౨౩౯. వి.) శబ్దకల్పద్రుమ సమన్వయపక్షము నాల్గవదయి యున్నది. ఈపక్షమునఁ బయి వార్త్తికములలో రెండవదానిని "ఌ తి ౡ వా" అని పఠింపవలయుననియు నీ వార్త్తికమునందలి విధేయము ౡ వర్ణమనియుఁ బాణిని మతమున ఌ వర్ణ దీర్ఘము లేకుండుటచేత ఋ ఌ వర్ణ సావర్ణ్యమునుబట్టి "శక్ల + ఌ దన్తః" అనుచోట "శక్లౄదన్తః" అని సవర్ణదీర్ఘసంధి నిత్యముగా సిద్ధించుచుండఁగా వార్త్తికకారుఁడు ఌ వర్ణ దీర్ఘము నంగీకరించి ఌ తి ౡ వేతి వార్త్తికమును బఠించి పాక్షికమగు ౡకార ఘటిత (శక్లౡదన్తః) రూపమును సైతము విధించెననియు విశదమగుచున్నది. ఇట్లే "ఋతి ౠవా" అని మొదటి వార్త్తికమును సైతము పఠింపవలయుననియు నచట 'హోతౄకారః' అని సిద్ధించుచుండఁగా 'హోతౡకారః' అను పాక్షికరూపము పయి వార్త్తిక మతమున సిద్ధించుచున్నదనియు శబ్దకల్పద్రుమ సమన్వయపక్షమున నెన్నఁదగును.

(౨౮౩)—వాచస్పత్య కోశకర్త యీవార్త్తికద్వయమును వెనుక వ్రాసినరీతిని సంప్రదాయ విరుద్ధముగ సమన్వయించుటే కాక వెనుక నుదాహరించిన (౨౨౫ వి.) పాణిని శిక్షావచనములోని దుఃస్పృష్ట శబ్దముచేతఁ దన సమన్వయముచొప్పున సిద్ధించెడి రేఫద్వయగర్భిత ఋ వర్ణమును లకారద్వయగర్భిత ఌ కారమును గ్రహింపఁబడుచున్నవనియు నీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

“ఌకారః (ऌकार:) తన్త్రిమతే ముగ్ధబోధమతే చ స్వరవర్ణభేదః. పాణినిమతే తస్యదీర్ఘత్వం నాస్తి... ...అత్రేదం బోధ్యమ్. ఌ వర్ణస్య దీర్ఘత్వాభావేపి ‘ౡతి ఌవే’తి వార్త్తికోక్తేః లకారద్వయయుత ౡ వర్ణ ఏవ తత్రవిధేయః తత్ర లకారద్వయ రూప వ్యఞ్జనద్వయస్య ఏకా మాత్రా, అచశ్చాపరా, ఇతి ద్విమాత్రాకత్వమ్. తేన హోతౡకార ఇత్యాదౌ దీర్ఘత్వ వ్యవహారః... ...అతఏవ శిక్షాయాం ‘దుస్స్పృష్టశ్చేతి విజ్ఞేయ, ఌకార ప్లుతఏవచేతి ఋకార ఌకారయో ర్దుఃస్పృష్టతోక్తిః, దుఃస్పృష్టత్వం ఈషత్ స్పృష్టత్వమ్. తస్య రకార లకారాదిత్వఏవ సంభవతి. “అచోఽస్పృష్టా యణస్త్వీషత్, నేమ స్పృష్టా శ్శల స్తథా” ఇతి శిక్షాయాం యరలవానా మీషత్ స్పృష్టతోక్తేః, తేన ఋకార ఌకారయో రీషత్ స్పృష్టత్వా ద్దుః స్పృష్టత్వమ్. ఏవం సర్వసామఞ్జస్యే ఌవర్ణస్య న దీర్ఘ కల్పన మితి సూక్ష్మ మీక్షణీయమ్”(వాచస్పత్య. ౧౪౫౮ పుట.) ఈ విషయమె వాచస్పత్య కోశమున స్థలాంతరమునందును (స్వరవర్ణ విభాగాది సందర్భము. ౧౫౯౭ పుట.) వ్రాయఁబడి యున్నది.

(౨౮౪)—ఈ వాచస్పత్యకోశకర్త సమన్వయము సరియైయుండ లేదని యీవఱకే వ్రాసియున్నాను. (౨౮౧) వాచస్పత్య కోశము శబ్దకల్పద్రుమమును జూచి వ్రాయఁబడిన దగుటచేత నీ సందర్భములోని శబ్దకల్పద్రుమకోశ సమన్వయపక్షమున నంగీకరింపఁబడిన ఌ కార దీర్ఘరూపమును (శక్లదన్తః) నిరాకరించుటకే పయిరీతిని వాచస్పత్య కోశకర్త వ్రాసెనని తోఁచుచున్నది. వెనుక వ్రాసినరీతిని (౨౮౧. వి.) స్వరాంగములగు హల్లులకు మాత్రాపరిగణనము చేయుటలోఁ బృథగ్గణనము

సంప్రదాయ విరుద్ధమగుటచేత నీ భట్టోజి దీక్షిత వాచస్పత్యకారోక్త సమన్వయములు కేవలము నిరాకరణీయములై యున్నవి. ఈ సమన్వయపక్షమున 'క్తృ' మున్నగు వానిని ద్విమాత్రికములనుగా లెక్కింపవలసిన యసంగతి దుర్వారము గదా. (చూ - విష ౧౮౫ - ౧౮౬).

మఱియుఁ బాణినిముని తనశిక్షా వచనములోని దుఃస్పృష్ట శబ్దముచే లకారద్వయ యుత ఌ కారమును గ్రహించి యద్దానిని ఌ కార దీర్ఘ రూపముగా సమ్మతించియే యున్న యెడల ఌతి ౡ వేతి వార్త్తిక పూరణము సిద్ధసాధనమే యగుచు ననావశ్యకమే యగును గదా. ఇంతియ కాక తుల్య న్యాయమున ౡ కారముతో పాటు ౠకారమును సైతము (ఋతి ౠ వేతి వార్త్తికసిద్ధము) దుఃస్పృష్ట ఋకారదీర్ఘ రూపాంతరముగా నంగీకరింప వలసియుండుటచేత నఱువదియైదు వర్ణములు సంస్కృతవర్ణ సమామ్నాయమున కేర్పడవలసి వచ్చునుగాన "త్రిషష్టి శ్చతుష్షష్టి ర్వా। వర్ణాః శమ్భుమతే మతాః" అనెడి యాశిక్షావచనములోని యారంభ వాక్య మసంగతము కావలసి వచ్చునుగదా. మఱియు నట్టి హల్లుల ద్వికమునకు ముందటి స్వరమునకు సంయుక్త పూర్వస్థితిచే ననిష్టమగు గురుత్వము దుర్వారమగును గదా. ఇంతియకాక యిందలి దుఃస్పృష్టత చేతఁ గల్గిన వర్ణవిశేషముల నంతస్థములలోఁ బరిగణించి యుండుటచేత వానికే యిచటఁ బునఃపరిగణనము కేవలము నసంగతమగుచున్నది. మఱియుద్విమాత్రాక దీర్ఘ ౠ కారము సర్వసమ్మతమయి యుండఁగా "పాలకై ఱాలు మోసిన" రీతిని "ఌ తి ౡ వే" తి వార్త్తిక తుల్యన్యాయమున 'ఋతి ౠ వే' తి వార్త్తిక పాఠము నంగీకరించుటయు నచటసైతము రేఫద్వయగర్భిత ఋకార రూపము నంగీకరించుటయు సంస్కృత భాషలో నప్రసిద్ధమగు రేఫద్వయ సంయోగావస్థితి నంగీకరించుటయుఁ (ఢ్రలోపే పూర్వస్య దీర్ఘో ణః) గేవలము నసంగతములై యున్నవి. ఇంతియకాక యేతాదృశ ఌ కారదీర్ఘ రూపతుల్య న్యాయమున ఌ వర్ణ ప్లుత విషయమునందు సైతము లకారచతుష్టయయుత ఌ కారము నంగీకరించుట న్యాయ్య మగుటచేతను నట్టిప్లుత ఌ కారము సైతము దుఃస్పృష్టమే యగుటంజేసి 'ఌ కారః ప్లుత ఏవచ' అనెడి పాణిని శిక్షావచనములోని ఌకారప్లుతపరిగణన మప్రసక్తమగుచున్నది. మఱియు నిట్టి

విపరీతకల్పనము చేసి పాణినిశిక్షలోని దుఃస్పృష్ట శబ్దమునకు వేఱువిధముగ గతి కల్పించి వైదిక భాషలోఁ బ్రసిద్ధమై యున్నట్టియు వెనుక నుదాహరించిన రీతిని ఋగ్వేద ప్రాతిశాఖ్యమునందును శుక్ల యజుః ప్రాతిశాఖ్యమునందును తైత్తిరీయ ప్రాతిశాఖ్యమునందును బరిగణింపఁబడియున్నట్టియు ళకారమునకుఁ (ళ) బాణినిశిక్షలోఁ బరిగణనము లేదనుట యెంత మాత్రము యుక్తము కానేరదు గదా.

(౨౮౫)—ప్రసంగ వశమున నింతగా వ్రాయవలసి వచ్చెను గాని తుదికిఁ పాణినీయ శిక్షలో నెట్లున్నను వెనుక నుదాహరించిన రీతిని(వి.౨౩౯) ప్రాతిశాఖ్యములు తంత్రగ్రంథములు కోశములు మున్నగువానియందును ఛందశ్శాస్త్రమునందును (ళాకారము గగనబీజము) బ్రసిద్ధమయియున్న ళాకారమును నన్నయభట్టు పరిగణించి యుండెననుటలో ననుపపత్తి యేమియు లేదుగదా. అట్టియెడల నిఁకఁ బంచాశద్వర్ణ సంపత్తి కొక్క వర్ణము మాత్రమె కొఱవడియుండునుగాన నయ్యది ప్రాతిశాఖ్యములలోను వైదిక సంస్కృత భాషలోను కర్ణాటాది దేశములలోని లౌకిక సంస్కృత శబ్దములలోను వెనుక నుదాహరించినరీతిని బ్రసిద్ధమైయున్న (వి.౨౧౮-౧౮౮) డకార ప్రకృతికమగు ళకారమె నన్నయాభిప్రేతమై యుండునని చెప్పుట మిక్కిలి యుక్తము గదా.

(౨౮౬)—అట్లేఁబడవ వర్ణము ళకారమని గ్రహింపక యాంధ్ర వైయాకరణులు వివిధములుగ నీక్రింది రీతిని వ్యాఖ్యలు చేయుచువచ్చిరి. అనంతామాత్యుఁడు వెల్లంకి తాతంభట్టు మున్నగువారు ల ళ లభిన్నములె యనుచు నాగమ శాస్త్రము ననుసరించి క్షకారమును జేర్చి పంచాశత్సంఖ్యను బూరింపసాగిరి. అప్పకవి అహోబలపండితాదు లలఘు లకారమును జేర్చి పంచాశత్సంఖ్యను బూరింపసాగిరి.

కం॥ కచట తపవర్గ వర్ణము।
లెచటన్ స్పర్శలగు నిరువ దేనై మఱి యం।
దుచితగతిన్ ఇజణనమ।
ప్రచయం బనునాసికాఖ్యఁ బ్రస్తుతి నొందున్॥ ౧౨౩.

కం॥ యరలవ లంతస్థలు నాఁ।
బరఁగును శషసహలు తేటపడు నూష్మలనన్।

సొరిది క్ష కారము గూడఁగ
సరి నేఁబది యయ్యె వర్ణ సంఖ్య ధరిత్రిన్॥ ౧౨౮.

కం॥ ళలలకు భేదము లేదను
పలుకున ళాదొలఁగి యైదుపదులగు వర్ణం
బులు సంస్కృత భాషకు మఱిఁ
దెలుఁగున అళలనఁగ రెండధిక మంద్రు హరీ॥ ౧౨౯.

(అనంతుని ఛందోదర్పణము)

అ వె. వ్యంజనములు హల్లులనఁ గకారాదిగా।
క్షాంతమైన వర్ణసంచయంబు।.........
.........(తాతంభట్టు కవిచింతామణి, ప్రాచ్యలిఖిత
పుస్తకభాం. ౧౧-౧౮-౬ నెంబరు తాళపత్రమాతృక.)

(౨౮౭)—ఆగమ శాస్త్రమున బీజాక్షరములను జెప్పుటలో క్షకారమును గలిపి యేఁబదివర్ణములు చెప్పఁబడుటచేత నద్దాని ననుసరించి యనంతామాత్యాదులు పై రీతిని క్షకారమును బరిగణించిరనియు నయ్యది కకార షకార సంయోగ రూపమగుటచేత వర్ణసమామ్నాయమునఁ బ్రత్యేక వర్ణముగ గణించుట సరికాదనియు గోళ గరళ వ్యాళాది శబ్దములలోని యలఘు లకారమును బరిగణించుటయే యుచితమునియు నయ్యది లకారమునకన్న భిన్న మనుట యనుభవ సిద్ధమును బహు సమ్మతమును నయి యున్నదనియు నప్పకవ్యాదు లీ క్రింది రీతిని జర్చించి యున్నారు.

"చమత్కారచంద్రికాయామ్:—శ్లో. అకారాది క్షకారాంతా వర్ణాః స్యు ర్మాతృకాహ్వయాః।" (అప్పక. ౨ ఆ. ౪౭౦ ప.)

"మహావిద్యలోని శ్లోకములు—శ్లో. మూలాధారం గుదస్థానం। స్వాధిష్ఠానం తు మేహనమ్। నాభిస్తు మణిపూరాఖ్యం। హృదయాబ్జ మనాహతమ్। తాలుమూలం విశుద్ధాఖ్య। మాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్। సహస్రారం బ్రహ్మరన్ధ్రి మిత్యాగమ విదో విదుః॥

శ్లో. ఆధారస్తు చతుర్దళోఽరుణరుచి ర్వాసాన్త వర్ణాశ్రయః। స్వాధిష్ఠాన మనేక వైద్యుతనిభం బాలాన్తషట్పత్రకమ్। రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాన్తకమ్। పత్రై ర్ద్వాదశభి స్త్వనాహతపురీ హైమీ కఠాన్తాన్వితా। ద్వ్యష్టారం స్వరషోడశైశ్చ సహితం జ్యోతి ర్విశుద్ధాంబుజమ్।

హాంక్షేత్యక్షర పద్మపత్రయుగళం రత్నోపమాజ్ఞాపురీ । తస్మాద్దూర్ధ్వ మధో ముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదమ్ । నిత్యానందమయీ సదాశివపురీ, శక్త్యై నమ శ్శాశ్వతమ్॥ (అప్పక. ౨ ఆ. ౬౮ ప.)

ఇందు శక్తిదేవతయొక్క యవయవములను మూలాధారాది పద్మ సంజ్ఞికములనుగాఁ జెప్పి యా యా పద్మముల దళముల సంఖ్యలను జెప్పుచు నందొక్కొక్క దళమున నొక్కొక్క యక్షరమును నిల్పవలెనని చెప్పఁ బడెను. అందలి సంస్కృత వర్ణముల సంఖ్య క్షకారమును గలిపి యేఁబదిగఁ జూపఁబడెను. అహోబలపతి యిట్టి యాగమశాస్త్ర ప్రామాణ్యమున క్షకారమును బ్రత్యేక వర్ణముగ నెన్నరాదని యీక్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"ఆది క్షాన్తాః స్మృతా వర్ణా ఇత్యాగమవ్యవహార మాత్రేణ న క్షకారస్య వర్ణాన్తరత్వేన గణనా। అన్యథా సంయుక్తత్వాఽవిశేషాత్ స్త్రాదీనామపి వర్ణాంతరత్వేన గణనా స్యాత్। క్షస్య వర్ణాంతరత్వాభావే ధాతుపారాయణ్కైర్భిక్షాది ధాతూనాం షాంత మధ్యే పాఠ ఏవ మానమ్................ న చైవం ళకారస్యా ప్యవర్ణాంతరత్వమ్. తస్య మాహేశ్వర సూత్రానుక్తత్వేపి 'లళయో ర్లడయో శ్చైకత్వ మితి శాబ్దిక శిఖాతంవసై రుక్తత్వాత్ లోళ ఇతి వాల్మీకిభి రుక్తత్వాత్. లళయో రుచ్చారణస్య లోకవేదయో ర్భిన్నత్వేన ప్రతీయమానత్వాచ్చ న ళ స్యాఽవర్ణాంతరత్వం వక్తుం శక్యతే. (అహో. ౧33 పుట).

అహోబలపండితుఁడు సరిగా నాలోచింపలేదు గాని గళ్, క్షుళ్, క్ష్వేళ్, దళ్ మున్నగు ధాతువులు మాత్రము లాంత ధాతువులలోఁ బరిగణింపఁబడ లేదా? కాళనీళాది శబ్దము లమరకోశా (నానార్థవర్గ) దులలో లాంత శబ్దములలోఁ బరిగణింపఁబడలేదా? కొన్ని శబ్దములందు లకారమున కలఘూచ్చారణము వాడుకలో నవీనముగఁ బ్రసిద్ధి కెక్కి యుండుటచేతఁ గొందఱాధునికులు 'లళయో రభేదః' అని ళకారస్థితిని వేరొక్కన్నంత మాత్రమున నది వర్ణాంతర మనిపించుకొనఁ గల్గునా? అప్పకవియు నిట్లె ళకారము వర్ణాంతర మనుచు నీక్రింది రీతిని జర్చించి యుండెను.

గీ. కాకు షా జడ్డమై క్షకారమగుట।
దలఁప కేఁబది లిపులలో దానిఁ గలిపి।
తొలుత భిన్నాక్షరం బైన దొడ్డ ళాను।
విడిచిపెట్టె ననంతుఁడు వెఱ్ఱి గాఁడె॥ (అప్పక. ౨ ఆ. ౬౯ ప.)

సీ. ఏకనీళము దేవహేళనంబు నటంచు ।
యాజుషామ్నాయంబునందు లేదొ ।
కాళనీళవ్యాళగోళ హింతాళంబు ।
లనుచు సంస్కృత భాషయందు లేదొ ।
గయ్యాళి త్రుళ్ళు నగళ్ళు వ్రజఘ్రుదళ్ళు ।
దాళికి నంచు నాంధ్రమున లేదొ ।
పాళంబెఱుంగని కూళ విరాళి ప్రి ।
సాళించు సనియు దేశ్యమున లేదొ ॥

తే.గీ॥ యాగమజ్ఞులు దొడ్డ బీజాక్షరంబు ।
లందు లేకున్కి సన్నంబు నదియుఁగూడ ।
నొకటిగాఁజేసి బీజోపయోగి గాన ।
ళ్ళాను జేకొని రది శబ్దసరణి గాదు॥ (అప్పక. ౨ ఆ. ౬౭ ప.)

(౨౮౮)—పయిని వ్రాసిన యహోబలప త్యప్పకవుల యుక్తులవలన నలఘు ళకారమె వేఱుగ లేదను ననంతామాత్యాదుల మతము పరాస్తమగు చున్నది గాని యా యలఘు ళకారమును బృథగ్వర్ణముగాఁ బరిగణించుట సరి కాదని యీవఱకు విపులముగా విమర్శించి చూపియే యున్నాను. అట్లే యేక నీఱ దేవహేఱనాది శబ్దములలోని ఱకారమును గోళగరళాది శబ్దములలోని యలఘు ళకారమును, గయ్యాళీత్యాది దేశ్యశబ్దములలోని మూర్ధన్య ళకార మును నేకముచేసి ప్రసంగించుట కేవలము నసంగతమనియు నీవఱకు సప్ర మాణముగ విశదపఱిచియే యున్నాను. (వి. ౧౯౧)

(౨౮౯)—చింతామణికర్త "ప్రకృతే స్తు తే దశోనా స్స్యుః" అని చెప్పుటచేత నయిత మాతఁడు సంస్కృత పంచాశ ద్వర్ణములలో ఱకారము నుద్దేశించెనని విశద మగుచున్నది. తద్విషయ మిట విశదీకరింపఁబడు చున్నది.

"ప్రకృతే స్తుతే దశోనాః స్యుః" అనుదానిచే నన్నయ భట్టారకుఁ డుద్దేశించిన పది వర్ణము లెవ్వియో యను విషయము నథర్వణుఁడు వివరించి యుండమింజేసియు హేమచంద్రాదులు చెప్పిన ప్రాకృత వర్ణ సమామ్నాయ సంగ్రహ వచనములు సుసంగతము లయి యుండమింజేసియు నా రచించిన ఋ ౡ వర్ణా విత్యాదికారిక మూలముగఁ జేయఁబడినది.

ఋఌవర్ణౌ హ్రస్వదీర్ఘౌ । ఐజ్విసర్గౌ వినా స్వరాః ।
దుఃస్పృష్టతుం శషౌ వర్ణౌ । వినా స్యుః ప్రాకృతే హలః॥

ఋ ఌ వర్ణౌ ఇత్యాది కారికావ్యాఖ్య:—హ్రస్వదీర్ఘౌ=హ్రస్వదీర్ఘము లగు, ఋఌవర్ణౌ = ఋఌ వర్ణములను, (ఋ ౠ ఌ ౡ) ఐజ్విసర్గౌ = ఐచ్ ప్రత్యాహార వర్ణములను, (ఐఔ) విసర్గమును, వినా = వినాగా, మిగిలిన సంస్కృత స్వరములె, ప్రాకృతే=మహారాష్ట్రి యనఁబడెడి ప్రాకృత భాషాభేద ములో, స్వరాః = అచ్చులు, స్యుః = అగును. దుఃస్పృష్టతుమ్ = దుఃస్పృష్ట తుకారమును, శషౌవర్ణౌ = శషలను, వినా = వినాగా, మిగిలిన సంస్కృత హల్లులె, ప్రాకృతే=మహారాష్ట్రీ భాషలో, హలః=హల్లులు, స్యుః=అగును.

(౨౫౦)—ఈపట్టున నప్పకవి యీక్రింది హేమచంద్ర వచనము నుదా హరించి యున్నాఁడు.

శ్లో. "ఋఌవర్ణౌ హ్రస్వదీర్ఘౌ। వై జాద్యా వనునాసికౌ
శషౌచ దశతే న్యూనాః। ప్రాకృతోక్తిషు సర్వశః॥"

ఇయ్యది హేమచంద్ర వచనమనుట విశ్వసనీయమై యుండలేదు. హేమ చంద్రుఁడు తనరచించిన ప్రాకృత శబ్దానుశాసనపు వృత్తిలో విసర్గమును సైతము సంస్కృత వర్ణములలోనుండి తొలఁగించి ప్రాకృత వర్ణసమామ్నా యము నుపదేశించి యున్నాఁడు. మఱియు నాతఁడు సంస్కృత వర్ణసమా మ్నాయ మేఁబది వర్ణములే యను తలంపు గల్గియుండమింజేసి శిక్షా ప్రాతి శాఖ్యాదులలోఁ జెప్పఁబడిన వైదిక సంస్కృత వర్ణసమామ్నాయమునందలి ప్లుతస్వరములను సైతము నిషేధించి యున్నాఁడు. ఇంతియకాక ఙఞలు స్వవర్గ సంయుక్తము లగుచుఁ బ్రాకృతమున వెలయుచున్నవనియును జెప్పి యున్నాఁడు.

"ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష విసర్జనీయ ప్లుత వర్జో వర్ణసమా మ్నాయో లోకా దవగన్తవ్యః। ఙఞౌ స్వవర్గ సంయుక్తౌ భవతఏవ........."
(సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనవృత్తి ౮ అధ్యా ౧ పాద. ౧. సూత్రము).

ఇట్టి యభిప్రాయమును సంగ్రహింపని పయిని వ్రాసిన యప్ప కవీయోదాహృతవచనముగాని దాని యభిప్రాయముగాని హేమచంద్రుని దనుట విశ్వసనీయము కాదు గదా.

(౨౫౧)—సంస్కృతమున కేఁబది వర్ణములనియుఁ బ్రాకృతమునకు నలువది వర్ణములనియు సన్నయ భట్టుచలెనె లక్ష్మీధర పండితుఁడీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

శ్లో॥ సిద్ధిః సంస్కృత శబ్దానాం। భవే త్పఞ్చాశదక్షరైః ।
ప్రాకృతానాంచ సిద్ధి స్స్యాత్ । త్రై శ్చత్వారింశ దక్షరైః ।
ఋౡవర్ణా విన్నై కారా । కారాభ్యాంచ దశ స్వరాః ।
శషా వసంయుక్తజఞా । విన్నై వాన్యే హలో మతాః ॥

"అసంయుక్త ఙకార ఞకారయోరపి ప్రయోగా భావః సూత్రకారవ్య వహారా దేవ నిర్ధారితః. "శుల్కేఙ్గ" ఇతి సూత్రేణ శుల్కశబ్దే సంయుక్త ఙాన్తా న్త గకార విధానాత్,"ప్రాక్ శ్లాఘా ప్లక్ష శార్ఙ్గే జ్ఞాత్ " ఇతి సూత్రేణ ఞాత్ ప్రాగత్వ విధేశ్చ "శ్చే ర్వృశ్చికే ఞ్చుర్వే" తిసూత్రేణ వృశ్చికశబ్దే 'శ్చ' ఇత్యస్య ఞాన్తా న్త చకారవిధేశ్చ, " (షడ్భాషాచంద్రిక, ఉపోద్ఘాతము ౫ పుట.)

పయిని వ్రాసిన ఋ ౡ వర్ణా విత్యా ద్యప్పకవీయోదాహృత వచనమును, సిద్ధిరిత్యాది షడ్భాషా చంద్రికోదాహృత వచనములును, వెనుక నుదాహరించిన "ద్విధాక" ఇత్యా ద్యప్పకవీయోదాహృత వచనమును వరరుచిహేమచంద్రాదుల వనుచు నహోబలపండితుఁ డీక్రిందిరీతిని వ్రాసి యున్నాఁడు. కాని యుపలబ్ధములగుచున్న వారి గ్రంథములలో నియ్యవి యగపడలేదు.

"శస్య గ్రాహ్యత్వే షస్య అగ్రాహ్యత్వే ౡ వర్ణస్య ద్వైవిధ్యే—
శ్లో॥ ద్విధాక ఏచో ఽ నుస్వారో । విసర్గ ష్షోడశ స్వరాః ।
స్పర్శా అన్తస్థ ళోష్మాణ । శ్చతుస్త్రింశ ద్ధలః స్మృతాః ॥
సిద్ధి స్సంస్కృత శబ్దానాం । భవే త్పఞ్చాశదక్షరైః-।
ప్రాకృతానాంచ సిద్ధి స్స్యా। త్త్రై శ్చత్వారింశదక్షరైః।
ఋ ౡ వర్ణా విన్నై కారా।కారాభ్యాంచ దశ స్వరాః।
శషా వసంయుక్త ఙ ఞా, విన్నై వాన్యే హలో మతాః।
ఋ ౡ వర్ణావ్రహ స్వదీర్ఘా। నైఙాద్యా వనునాసికౌ।
శషౌచ దశ తే న్యూనాః। ప్రాకృతోక్తిషు సర్వతః॥
ఇత్యాది వరరుచి హేమచంద్రాది వ్యాకరణ ప్రవణోక్తి ర్మానమ్. "

(అహోబలపండితీయము ౧౩౫ పుట) హేమచంద్రుఁడు శిక్షాప్రాతిశాఖ్యములలోని సంస్కృత వర్ణసమామ్నాయమును మనమున నిడికొని పయిరీతిని జెప్పెనని యాతఁడు చేసిన ప్లుత నిషేధమునుబట్టి విదితమగుచున్నదని యీవఱకు వ్రాసియే యున్నాను. (౨౫౦ వి.) అట్టి హేమచంద్ర వాక్యమున కీక్రింది చండ వ్యాకరణ గ్రంథము మూలము కానోపును.

"న ప్లుత జ న ఞాః" (చండకృత ప్రాకృతలక్షణము. ద్వితీయమగు స్వరవిధానము ౧౯ సూ.) ప్లుత వర్ణాః జకార నకార ఞకారాశ్చ ప్రాకృతే న భవన్తి. శ్లోకః—

"ఐ ఔ స్వరౌ తతః పశ్చాత్। ఋ ౠ ఌ ౡ చతుః స్వరాః అః జ ఞ న శ షా స్సన్తి। ప్రాకృతే నైవ కర్హిచిత్" నకారము ణకారముగాఁ గాని జకారముగాఁ గాని మాఱు నను నుద్దేశముతోఁ గావలయుఁ జండుఁడు నకారము సైతము ప్రాకృతమున నుండదని సూత్రించెను. అట్లయినను బదాది నకారము ణకారముగ మాఱకుండుటయుఁ గలదుగాన నకారము లేదనుట సరికాదని కావలయు నట్టి చండుని యాశయమును హేమచంద్రుఁడు పాటింపఁడయ్యె.

"నో జః" స్వరా త్పర స్యాసంయుక్తస్య అనాదే ర్నస్య ప్రాయో జో భవతి. సంహననం=సంహజణం. సంహణణం (చండ. ప్రాకృ. స్వరవి 35) "తవర్గస్య చటవర్గా" తవర్గస్య స్థానే చటవర్గా భవతః యథాసంఖ్యం.ఉదా:— నిత్యం=ణిచ్చం........" (చండప్రాకృ. వ్యంజన. వి. ౧౭ సూ.)

"ఆదే స్తు" (౧ - ౩ - ౫౩) న ఇత్యనువర్తతే. ఆదే ర్నకారస్య ణో వా స్యాత్.నరః=ణరో,నరో.నతః=ణఓ,నఓ.అస్తో రిత్యేవ(అసంయుక్తస్యైవ). న్యాయః=నాఓ" (షడ్భాషాచంద్రిక ౫౫పుట). ఈ పక్షమున నాతఁడు యమములను, దుఃస్పృష్టమును, జిహ్వామూలీయమును గాకున్నను నుపధ్మానీయమును, నిషేధింపకుండుటకుఁ గారణము తెలియకున్నది. (దీని కహోబలపతి చెప్పిన సమాధానము ముందు వ్రాయఁబడును. (౨౫౮ వి.)

ఇంకఁ బయిని వ్రాసిన "ఋ ఌ వర్ణౌ విన్నైకారౌ। కారాభ్యాం" మిత్యాదివచనము సైతము సరియై యుండలేదు. జ ఞ లు సంయుక్తావస్థలోఁ బ్రాకృతశబ్దము లందుండునని యంగీకరించుచున్న తద్వచనకర్త

వానిని వర్ణసమామ్నాయమునుండి తొలగించుట కేవలము నయుక్తికమై యున్నది.

(౨౫౨)—పయి వచనములయొక్కయు హేమచంద్రాచార్య వృత్తి యొక్కయుఁ బ్రణాళినిబట్టి పరిశీలింపఁగా వానియందుఁ జెప్పఁబడిన ప్రాకృత వర్ణసమామ్నాయము మహారాష్ట్రీ ప్రాకృత మాత్రమునకే యనెడి నా వ్యాఖ్యానము రూఢమూల మగుచున్నది. అట్లు కానియెడల మాగధీప్రాకృతమున శవర్ణముండుట యీ క్రింది రీతిని నిర్వివాదమై యుండఁగా నయ్యది పయిని వ్రాసిన యెల్లవచనములందును నిషేధింపఁబడుట విరుద్ధమె యౌను గదా. (దీనికిని నహోబలపతి సమాధానము ౨౫౭ విషయములోఁ జూడఁ దగును.)

"స్రోః శ్లౌ" (౩-౨-౩౬) "సకార రేఫయో ర్మాగధ్యాం శకార లకారౌ యథాక్రమం భవతః" (షడ్భాషా చంద్రిక ౧౮౫ పుట.) "రసో ర్లశౌ" (౮-౪-౨౮౮) 'మాగధ్యాం రేఫస్య దన్త్యసకారస్యచ స్థానే యథాసంఖ్యం లకార స్తాలవ్య శకారశ్చ భవతి.' ర:—నలే (నరే) కలె (కరే) స:—హంశే, శుదం, (హంసే, సుతమ్). ఉభయోః:—(రసలకు నుదాహృతులు) శాలశే, పులిశే (సారసే, పురుషే.) (సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనము.)

అట్లు పైశాచీ భాషలో నసంయుక్త ఞకారము సైతమీ క్రిందిరీతిని వెలయుచుండుటచేత నద్దానిని నిషేధించుటయు విరోధించుచున్నది.

"రాజ్ఞో జ్ఞో వా చిఞ్" (౮-౪-౩౦౪) పైశాచ్యాం రాజ్ఞ ఇతిశబ్దే యో జ్ఞకారః తస్య చిఞ్ ఆదేశో వా భవతి. ఉ. రాచిఞో లపితం, రఞ్ఞో లపితం. రాచిఞో ధనం, రఞ్ఞోధనం. (సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనము.)

అట్లు మాగధీభాషలో విసర్గ మీక్రిందిరీతిని వెలయుచుండుటచేత నద్దానిని హేమచంద్రుఁడు నిషేధించుటయు విరుద్ధ మనక తీరదు.

"క్షస్య ⁒కః (౮-౪-౨౯౬) మాగధ్యా మనాదౌ వర్తమానస్య క్షస్య '⁒కో' జిహ్వామూలీయో భవతి. య⁒కే (యక్షే) ల⁒క శే (రాక్షసే) (సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనము.)

హేమచంద్రుఁ డుపధ్మానీయమును నిషేధింపకుండుటచేత నాతఁడు చేసిన విసర్గనిషేధము జిహ్వామూలీ యోపధ్మానీయములను సైతము స్పృశించుచున్న దనక తీరదు.

పయి సందర్భమునుబట్టి జిహ్వామూలీ యోపధ్మానీయములే కాక విసర్గము సైతము యాధునిక వ్యాకరణములలోఁ బరిగణింపఁబడకుండుట సరికా దనకతీరదు. హేమచంద్రాదుల వలెఁగాక వీరు మాగధ్యాదులలోఁ గల శవర్ణమును సైతము పరిగణించుటచే నిట్లు మాగధిలోనే యున్న జిహ్వామూలీయమును బరిగణింపకుండుట ప్రామాదిక మనకతీరదు.

(౨౫౩)—పయి సందర్భమునుబట్టి ఋ ౠ వర్ణా విత్యాదివచన కర్తయు హేమచంద్రుఁడును మహారాష్ట్రీ ప్రాకృతవర్ణ సమామ్నాయమును మాత్రమె యుద్దేశించి చెప్పిరనుటకు సందేహములేదు. కాని యాపక్షము నందును "ఋ ౠ వర్ణా విసే" త్యాది వచనకర్త, మహారాష్ట్రీ ప్రాకృతమునలేని విసర్గమును నిషేధింపకుండుట యుక్తముకాదు. ఇఁక నట్లు నిషేధించినచో సంస్కృతవర్ణ సమామ్నాయ మేఁబది వర్ణములలోను బదునొకండు వర్ణములు నిషిద్ధములై, "ప్రాకృతానాంచ సిద్ధిః స్యాత్, తైశ్చత్వారింశ దక్షరైః" అను వాక్యము పరాస్తము కాఁగలదు. ఇంక విసర్గమును నిషేధించినను శిక్షాప్రాతిశాఖ్యముల ననుసరించిన హేమచంద్రుఁడీపట్టున జిహ్వామూలీయోపధ్మానీయములు రెండిటిని సైతము నిషేధింపకుండుట సరికాదు. మఱియు నీక్రిందిరీతిని మహారాష్ట్రీ ప్రాకృతమునందు 'ఐ' కారము వెలయుచున్నదనక తప్పనందున ఋ ౠ వర్ణా విత్యాదివచన కర్తయు హేమచంద్రుఁడును 'ఐ' కారమును నిషేధించుటయు సరికాదనక తీరదు.

'అయి ఐ' (౨-౧-౭౮) అయీత్యర్థే ఐ ఇతి, వా, ప్రయోజ్యమ్. అతఏవ వచనా దైకారస్యాపి ప్రాకృతే ప్రయోగః - ఐ సహి. పక్షే, అఇ సహి, (అయిసఖి) (షడ్భాషాచం. ౧౦౮ పుట.)

"అయా వైత్" (౮-౧-౧౬౯) "అయిశబ్దే ఆదేః స్వరస్య పరేణ సస్వర వ్యంజనేన సహ ఐత్ వా భవతి. ఐ, (చీహేమి.) అఇ ఉమ్మత్తిఏ (అయి ఉన్మత్తే) వచనా దైకారస్యాపి ప్రాకృతే ప్రయోగః" (సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనము).

పయి సందర్భమునుబట్టి "ఐ ఔలుగలవని చిన్నయసూరి వ్రాసెను గాని ఐ ఔ లేప్రాకృతమునందును గనఁబడలేదు" అనెడి యాధునికవైయాకరణ వాక్యము సరికా దనకతీరదు.

ఇఁకఁ బయి సూత్రములనుబట్టి 'ఌ' కారమును నిషేధింపనియెడలఁ జత్వారింశత్సంఖ్య కుదురుపడ నేరదు.

శిక్షా ప్రాతిశాఖ్యముల ననుసరించిన హేమచంద్రుఁడు దుఃస్పృష్ట మును, ద్విధాక ఇత్యాదివచనమున 'ళోష్మాణః' అనుపాఠము నంగీకరించిన ఋ ఌ వర్ణా వినేత్యాది వచనకర్త యలఘు లకారమును, నిషేధించి యుండ నందున హేమచంద్రుని పక్షమున దుఃస్పృష్ట ళకారమును, వచనకర్త పక్ష మున నలఘు లకారమును ప్రాకృత వర్ణసమామ్నాయమునఁ గలవని తేలు చున్నది.

(౨౫౪)—కాని దుఃస్పృష్ట డకారము (ళ) ప్రాకృతమున నున్నదను టకు నిదర్శనము లగపడవు. ఇంకను నయ్యది లేదనుటకుఁ గొన్ని నిదర్శనములు కన్పట్టుచున్నవి. సంస్కృత శబ్దములలో దుఃస్పృష్ట డకారము ళకారముగా మాఱి నానాఁటి కింకను లకారరూపము నందిన సంస్కృతభవపదములు ప్రాకృతమునఁ గలవని యీక్రింది సూత్రములవలన విశదమగుచున్నది. (వి. ౧౭౩.)

"టో ర్బడిశాదౌ లః" (౧-౩-౨౪) "త్వౌత్యనువర్తతే. బడిశాదౌ టో ష్టవర్గస్య లత్వంతు స్యాత్. గుడః = గులో - గుడో." (తుణా).

"లల్ డో నుడుగే" (౧-౩-౩౦) 'అస్త్ర రఖో (అయుక్త స్యానాదౌ వర్తమానస్య) రచః పరస్య డస్య లకారో భవతి, అనుడుగే ఉడ్వాది గణం వర్జయిత్వా. లిత్త్వా న్నిత్యమ్. గరుడః = గలులో' (షడ్భాషా చంద్రిక. ౫౨-౫౩-పుటలు.)

"డోలః" (౮-౧-౨౦౨) "స్వరా త్పర స్యాసంయుక్త స్యానాదే ర్డస్య ప్రాయో లో భవతి, వడవాముఖమ్, వలయాముహం, గరుడో=గరులో.
(సిద్ధహేమచంద్ర శబ్దానుశాసనము ౩౪ పుట).

(౨౫౫)—ఇఁక నలఘు లకారోచ్చారణము సంస్కృతమున నన్నయ భట్టు నాఁటికున్నదనుట నిశ్చయమె యైనను నద్దానికి వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము చేయుట "అనుప్రదానా" దిత్యాది వర్ణవైశేష్య ప్రతిపాదక మూల కారికకే కాక నన్నయసిద్ధాంతమునకును విరుద్ధమె యని యీవఱకు విశదీకరించియె యున్నాను. (వి. ౧౭౮) కాన నట్టి యలఘు లకారమును (ల) జేర్చి నన్నయ భట్టారకుఁడు సంస్కృతమునకు వర్ణము లేఁబది యనిచెప్పె ననుట కేవలము నసంగతము గదా.

పయి సందర్భమునుబట్టి ప్రాకృతభాషా భేదషట్కముయొక్క వర్ణ సమామ్నాయ సంఖ్య నలువది యనుట యెట్లును బొసఁగ నేరదనియు మహా రాష్ట్రీ ప్రాకృతమునకు సైతము హేమచంద్రుఁడును ఋ ౠ వర్ణా వినేత్యాది వచనకర్తయుఁ జెప్పిన రీతిని జత్వారింశత్సంఖ్య కుదురుపడనేరదనియుఁ జెప్పు టకు సందేహము లేదు.

కాఁబట్టి నా రచించిన కారిక చొప్పున 'ఋ ౠ ఌ ౡ ఐ ఔ శ ష వర్ణములును దుఃస్పృష్ట డకారమును (ఌ) విసర్గమును దప్పఁ దక్కిన యేఁబది సంస్కృత వర్ణసమామ్నాయములోని నలువది వర్ణములును మహారాష్ట్రీ ప్రాకృతమునకు వర్ణసమామ్నాయమని చెప్పుటయె యుక్తమని గ్రహింప వలయును.

(౨౫౬)—ఈక్రింది చండకృత ప్రాకృతలక్షణ గ్రంథమునుబట్టి 'ఐ ఔ' లును మహారాష్ట్రిలోఁ గలవని శంకించుట కవకాశ మగపడుచున్నది. "ఐదౌతౌ చ కేషాంచి న్మతే భవతఏవ. కైతవమ్=కైఅవం. సౌదర్యమ్= సౌఅరిఅం. కౌరవాః=కౌలవా..." (చండ-ప్రాకృ. స్వరవిధానము ౧౯ సూ.)

కాని పయివానిలోని 'కౌలవా' అను నుదాహృతినిబట్టి యిట్టి రూప ములు పైశాచీ మాగధీ ప్రాకృతవిషయము లయియుండవచ్చునని యూహింప నగును. "పైశాచ్యా రణయో ర్లనౌ" పైశాచ్యాం రేఫస్య లకారో భవతి. ణకారస్య నకారః......" "మాగధికాయాం రసయో ర్లశౌ" (౪౩ సూ.) 'మాగధికాయాం రేఫ సకారయో ర్లశౌ భవతః......" (చండ. ప్రాకృ. వ్యంజన విధానము ౪౨—౪౩సూ.)

ఈక్రింది హేమచంద్ర గ్రంథమునుబట్టి 'కౌరవా' అనియే యున్న దని శంకింపరాదు. "ఐదౌతౌ చ కేషాంచిత్. కైతవమ్=కైఅవం, సౌదర్యమ్= సౌఅరిఅం' కౌరవాః=కౌలవా (సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనము ౮ అధ్యా ౧ పా. ౧ సూత్రపు వృత్తి) ఈ హేమచంద్ర వాక్యములు వెనుక వ్రాసినరీతిని (౨౫౧ వి.) బయి చండకృత ప్రాకృత లక్షణ గ్రంథమునుండి యెత్తి వ్రాసినవే యనియు నక్కారణమున "కౌరవా" అనుచో "కౌలవా" అనియె యుండవలయుననియుఁ దద్వాక్య ప్రణాళినిబట్టియె విశదమగుచున్నది గదా. ఇచటనె కాక 'సౌందర్యమ్' అనుచోట సయితము తప్పు పడినది. అచట "సౌదర్యమ్" అని యుండవలయును. 'సౌన్దర్య' శబ్దములోని దకారము నకార సంయుక్తమగుటచేత "క గ చ జ త ద ప య వాం ప్రాయోలుక్"

(చండ - ప్రాకృ - వ్యంజన విధానము ౩౮ సూ.) 'స్వరాత్ పరేషా మనాది భూతానా మసంయుక్తానాం క గ చ జ త ద ప య వాం ప్రాయో లు గ్భవతి" అను నియమము చొప్పున లోపింపనేరదుగాన "సాఅరిఅం" అనురూపమె సిద్ధింపదు గదా.

(౨౫౭) మఱియుఁ జండుఁడును హేమచంద్రుఁడును 'ఐడౌ' లస్థితి సమ్మతము కాకుండుటచేతనే 'కేషాంచి' చ్ఛబ్దముతో నిరసించిరి. అక్కారణమునను నవి వాఙ్మయమున మృగ్యములగుటచేతను జండ హేమచంద్రులె కాక వరరుచి వాల్మీక్యాదులు నయితే మట్టిరూపములకు సూత్ర రచనముచేసి సాధింపరైరి. కాఁగానే నన్నయ భట్టారకుఁడు నయితేము వానిస్థితిని బాటింపఁడయ్యెనని చెప్పినను జెప్పవచ్చును. ఇఁక వెనుక నుదాహరించిన 'అయి ఐ' అను వాల్మీకి (త్రివిక్రమ) సూత్రము చొప్పున 'ఐ' శబ్దము మహారాష్ట్రీ ప్రాకృతమునఁ గల దనక తీరనందున 'ఐ' కార నిషేధము సరికాదను నాక్షేపము తగులక తీర కున్నది. అయినను నట్టిశబ్ద మొక్కటి మాత్రమె సాక్షికముగా నుండుటచేత నద్దానిని నన్నయభట్టారకుఁడు పాటింపఁడయ్యెనా యని యాలోచింపవలసి యున్నది. లేదా ప్రామాణికుఁడగు నన్నయ భట్టారకునం దంతమాత్రపు లోపమును నంగీకరించుటకన్న 'అయి ఐ' అను సూత్రముచేత సిద్ధించుచున్న 'ఐ' శబ్దము సంస్కృత శబ్దగతము కాదనియు నయ్యది ప్రాకృత వ్యాకరణ మాత్రసిద్ధ మనియు, సంస్కృత శబ్దగతములగు నేఁబది వర్ణములలోను నేయే వర్ణములు సంస్కృతభవములగు మహారాష్ట్రీ ప్రాకృత శబ్దములలో లోపించునో లేదా వర్ణాంతరములుగాఁ బరిణమించునో యవి మాత్రమె పది వర్ణములనుచు 'ప్రకృతేస్తు తే దశోనాః స్యుః' అని యిట్లు నన్నయభట్టారకుండు సూత్రించె ననియుఁ జెప్పుట యుక్తతరమై యున్నది. పరిశీలింపఁగా 'అయి ఐ' అనుచోట "అయి అఇ అనుపాఠము గ్రంథకృదభిప్రేత మేమో యనియు 'ఐ' అను పాఠము లేఖకాది ప్రమాదకృత మేమో యనియుఁ దోఁచెడిని. (చూ. ౭౯. VII వి.)

(౨౫౮)—అహోబల పండితుఁడు "ప్రకృతే స్తుతే దశోనాః స్యుః' అనుసూత్రమును బ్రాకృతభాషాషట్క వర్ణసమామ్నాయపరముగా సమన్వయించుటకయి యత్నించుసందర్భమునఁ జాలవఱకిట్టి మార్గమునె త్రొక్కి యున్నాఁడు.

"ప్రకృతే స్తు తే దశోనాః స్యు రితి—దశవర్ణా ఊనా యేషాం తే-దశోనాః-ప్రకృత్యాం దశోనా స్తే పఞ్చాశద్వర్ణా భవన్తి. ప్రాకృతశబ్ద నిష్పత్తి శ్చత్వారింశద్వర్ణై ర్భవతీత్యర్థః. తత్ర ఊనా దశవర్ణాశ్చ ఋ ౠ ఌ ౡ ఐ ఔ వర్ణా అసంయుక్త ఙ ఞా శషాచేతి-ఉక్తంచ భాషాశబ్దానుశాసనే, శషా వసంయుక్త ఙ ఞా వితి. [దీనినిబట్టి హేమచంద్రుని శబ్దానుశాసనము నీతఁడు చూడలేదనియు నట్టి గ్రంథము గలదని మాత్రము వినియుండెననియు దోఁచుచున్నది. "శషా వసంయుక్త ఙఞా విత్యాదికారిక సిద్ధహేమచంద్ర శబ్దానుశాసనమున లేదు. దానియభిప్రాయము మాత్రము గలదు. (౨౫౦ వి.) శషా విత్యాదికారిక గ్రంథాంతరములోనిది. షడ్భాషా చంద్రికలో నగపడు చున్నది. (వి. ౨౫౧)]. తేన శుల్కేఙ్గ మిత్యాది సూత్రనిష్పాదితానాం 'సుఙ్గో,' మఞ్జులో' ఇత్యాది రూపాణాం సంయుక్త ఙ ఞ వర్ణాన్వితత్వేపి నకశ్చి ద్దోషః [ఋ ౠ ఌ ౡ ఐ ఔ వర్ణా అసంయుక్త ఙ ఞ గా వర్ణాన్వితత్వేపి న కశ్చి ద్దోషః' అని ముద్రితాహోబల పండితీయములో నున్నది. గ్రంథభ్రంశ జనితమగు నీయసంగతినైనఁ జూచికొనక 'మక్కికి మక్కిగా' 'ముకస్య ముక్కోఽర్థః' అనునట్లుగాఁ డీక వ్రాయఁబూనిన శ్రీ౦తి భద్రాద్రిశాస్త్రులు గారు "ఋ ౠ ఌ ౡ ఐ ఔ వర్ణములు సంయుక్తములుగాని ఙ ఞ గ వర్ణములు ఇతర వర్ణములతోఁ గూడినను దోషములేదు." అని వ్యాఖ్య చేసిరి. వ్యాఖ్యయెల్లఁ జాలవఱకిట్లే యున్నది. ఇచటి గ్రంథపాత మును నాయొద్దనున్న లిఖితమాతృకనుబట్టి పైరీతిని సవరించి వ్రాసితిని.] శ ష వర్ణ నిషేధస్య సంస్కృతీయ విషయత్వేన "స్రోః శ్లా" వితి మాగధ్యాం శ వర్ణస్య విద్యమానత్వేపి నవిరోధః. (శోభనమ్ = శోభణం.) ప్రాకృత్యాం విసర్గస్య సాక్షా దభావేపి 'క్ష ×కః' ఇతి సూత్రే తత్ స్థానికస్య జిహ్వా మూలీయస్య సత్త్వాత్ తస్యాపి విద్యమానతుల్యతేతి తావన్మాత్రా శయేన భాషాశబ్దానుశాసనగ్రంథే దశస్వరా ఇత్యుక్తమితి తత్తాత్పర్యం తాత్పర్య విదో విదాంకుర్వన్తు." (అహో ౧౩౪-౧౩౫ పుటలు).

పయిరీతిని 'క్ష ×కః' అనుమాగధి సూత్రముచేతఁ బ్రాకృతవర్ణ సమామ్నాయములో విసర్గస్థితి నంగీకరించుటనుబట్టి పరిశీలించునప్పు డహోబలతి ప్రాకృతభేద షట్కసామాన్యమునకు వర్ణసమామ్నాయము నలువదియక్షరములని సాధించుటకు యత్నించినట్లు తోఁచకమానదు గదా. అట్లయినను నీ పక్షమునకు వెనుక నుదాహరించినరీతిని 'రాచి ఖోలపితమ్' అని యిట్లు

పైశాచీభాషలో నసంయుక్త ఇకారము సయితము వెలయుచుండుట బాధకమె యగుచున్నది. ఈ ఇకారము సంస్కృత శబ్దగతమె యగుటచేత నాతఁడు ద్రొక్కిన మార్గమున సమాధానము లభింప నేరదు.

(౨౫౯)—అహో బలపతియు 'ళో ష్మాణః' అను పాఠము నంగీకరించి ద్విధాక ఇత్యాది శ్లోకము చెప్పున (వి. ౨౧౭) నలఘు లకారమునకు సంస్కృత వర్ణసమామ్నాయమునఁ బృథగ్గణనము చేయువాఁడును, నట్టి యలఘు లకారమును నిషేధింపని కారణమునఁ బ్రాకృతవర్ణసమామ్నాయమునందును నస్థానిని బరిగణించువాఁడును నగుటచేత సయిత మీతని సమన్వయము నన్నయభట్ట సిద్ధాంత విరుద్ధమై యగ్రాహ్య మగుచున్నది. వర్ణవైశేష్య లక్షణములను బ్రతిపాదించు 'అనుప్రదానా' దిత్యాది కారికనుబట్టియు 'లఘువో లఘువశ్చేతీ' త్యాది చింతామణి కారికనుబట్టియు నంతస్థముల లఘ్వలఘువులకుఁ బృథగ్గణనము చేయుట సరికాదని యీవఱకు విపులముగాఁ జర్చించి చూపియే యున్నాను గదా. (వి. ౧౫౭).

అలఘు లకారమునకు సంస్కృతమందు వలెనే ప్రాకృతమందును బృథగ్గణనము వలనుపడదని మాత్రమె నా యభిప్రాయము కాని యది ప్రాకృతమున లేదని కాదు. సంస్కృతమునందు వలెనే ప్రాకృతమునందును 'కోమళో, ముకుళో' మున్నగు శబ్దములలోనయ్యది యున్నదనుటకు విప్రతిపత్తి యేమియు లేదు. మఱియు నది లేదనుట కుపపత్తి సైత మగపడుచున్నది. పైశాచీభాషలో నట్టి యలఘు లకారమునకు లఘూచ్చారణమె గలదని యీక్రింది రీతిని బ్రాకృత వైయాకరణులు సూత్రించి యున్నారు.

"ళో లః" ((3-౨-౪౫) "పైశాచ్యాం ళకారస్య లకార స్స్యాత్—కలమో, కోమలో, ముకులో" (షడ్భాషాచంద్రిక. చెన్నపురి విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారము. (CI-No-35-1886 సంవత్సరమున మైసూరు విద్యాతరంగిణీ ముద్రాలయమున ముద్రితము).

(౨౬౦)—ఈవిషయమున నభిప్రాయభేదములు గలవు. పైశాచీతర ప్రాకృతములలో నలఘు లకారము లేదనియుఁ బైశాచీ ప్రాకృతము నందు మాత్రమె లఘు లకార స్థానమున నలఘులకారము 'లోళః' అను సూత్రముచే విధింపఁబడుచున్నదనియుఁ జెప్పుచుఁ గొంద ఱర్వాచీను లీక్రింది

రీతిని బయి సూత్రమును దాని యుదాహరణమును దార్మాఱుచేసి ముద్రిం పించుచున్నారు.

"లో ళః" (౩-౨-౮౮) పైశాచ్యాం లకారస్య ళకార స్స్యాత్. కమళో, కోమళో, ముకుళో, (1916 సంవత్సరమున ముద్రితమగు బొంబాయి గవర్నమెంటు గ్రంథమాల, షడ్భాషాచంద్రిక).

"లో ళః" (౮—౪—౩౦౮) పైశాచ్యాం లకారస్య ళకారో భవతి. సీళం—కుళం—జళం—సళిళం—కమళం. (1900 సంవత్సరమున ముద్రితమగు బొంబాయి గవర్నమెంటు గ్రంథమాల, 60 నెంబరు పుస్తకము. చెన్న-విశ్వ-పుస్తక భాం. సిద్ధహేమచంద్ర శబ్దానుశాసనము.)

అట్లయినను నీ శబ్దానుశాసన పుస్తకములోనే పాఠాంతరములుగఁ బై "సీళం" మున్నగు శబ్దములు లకార ఘటితములుగఁ జూపఁబడియున్నవి. ఇంతియకాక యీ సూత్రమున కుదాహరణముగఁ జూపఁబడిన కుమారపాల చరితములోని 'కిలజేతవ్వా' (౮ సర్గము - ౬ శ్లోకము) అను శ్లోకము నందును, "కిల—లోలః" (౩౦౮) అనెడి యద్దాని వివరణమునందును లకారఘటిత రూపములె యగపడుచున్నవి. భామహాకృత ప్రాకృత ప్రకాశమునఁ (ఇది వరరుచి సూత్రములకు వృత్తి) జూపఁబడిన టిప్పణమునందు 'లోలః' (౮—౪—౩౦౮) 'లకారస్య లకార ఏవ - సీలం, కులం—సలిలం' అని యిట్లు పయి హేమచంద్ర సూత్రమును, దాని వృత్తియు నుదాహరింపఁబడియున్నవి. (౧౦ పరిచ్ఛేదము, ౧౨౭ పుట.)

పయి రీతి నధునాతన ప్రాకృత పండితు లీవిషమున భిన్న భిన్నాభిప్రాయములగుచు వారి వారికి సమ్మతములగు రీతులను ముద్రింపించుటంజేసి వాల్మీకి హేమచంద్రుల సత్యములగు పాఠము లెవ్వియో నిర్ణయించుట దుశ్శకమై యున్నది.

పరిశీలింపఁగా వెనుక నుదాహరించిన "రలయో ర్లడయో స్తద్వల్లళయో" రిత్యాది భోజరాజ వచనముచొప్పున సంస్కృతమునందె చాల కాలము క్రిందట—నిస్సందేహముగా హేమచంద్రునికిఁ బూర్వకాలమున—వెలసియున్న యీ యలఘు లకారము విధానము లేకయే ప్రాకృతమున లఘు లకారమయ్యె ననుట యుక్తిసహము కానేరదు. సంస్కృతాంధ్రములందువలెనె ప్రాకృతమునందును విధాన మక్కఱలేకయే యీ లఘ్వలఘుతలు వ్యవహారముననే సిద్ధించుననుటకు వలనుపడదు. అట్లైనచోఁ

చి॥ శ్లో. షట్త్రింశ దత్ర తేఽన్యే ।
చాను ప్రవిశన్తి శబ్దయోగవశాత్ ।
ద్వివిధా ది దు దే దో తోః।
చో వక్రతమా వనుస్వారౌ ।
క గ చ జ యు గ ట డ ణ త ద న।
ప బ మ య ర ల వ స హ ళం తు హల్వర్గః ॥

---

పైశాచీ భాషలో మాత్రము తత్పక్షమున నలఘు లకార విధానము చేయనేల ?

మఱియుఁ బైశాచీ ప్రాకృతమున మూర్ధన్యముల చోట్ల నెల్ల దంత్యములను బలుకుచుండుట సహజమై యున్న ట్లీక్రింది వాల్మీకి (త్రివిక్రమ) సూత్రములవలన విశదమగుచుండుటంజేసి చాలవఱకు మూర్ధన్య ళకారమును బోలిన యుచ్చారణము గల యలఘు లకారమునకు లఘులకార విధానము చేయఁబడె నను పక్షమె పైశాచీ ప్రక్రియకు సహజమై యుండునని యీసందర్భమున దృఢముగఁ జెప్పవచ్చును. లఘ్వలఘు లకారములు రెండును దంతమూలీయములే యైనను గాలక్రమమున ద్రావిడ మూర్ధన్య ళకార సంపర్కమున నలఘు లకారమున కట్టి యుచ్చారణము సంభవింప నోపునని యీ వఱకు వ్రాసియె యున్నాను.

## పైశాచీ భాషలోని దంత్య విధానములు

“నో ణనోః పైశాచ్యామ్” (3—౨—౪3) “పైశాచ్యాం భాషాయాం ణకార నకారయోః నకారో భవతి—ఉ. రామేన (రామేణ) నకారస్యాపి పున ర్నకార విధానం ణాదేశబాధనార్థమ్—” (షడ్భాషాచంద్రిక - ౧౮౭ పుట.)

“టో స్తు తు” (3—౨—౫౧) “పైశాచ్యాం టు ఇత్యస్య తు ఇతి వా స్యాత్ - వటుకః = వతుకో, కుటుంబం = కుతుంబం, పటుదేహః = పతుదేహః—(షడ్భాషాచంద్రిక. ౧౮౯ పుట.)

(౨౬౧) వ్యాఖ్య—షట్త్రింశదిత్యాది-అత్ర = ఈ యచ్చాంధ్రభాషయందు, షట్త్రింశత్ = ముప్పదియాఱు వర్ణములు, అగును. తేచ = ఆ ముప్పదియాఱును, అనఁగా నా ముప్పదియాఱిటిలో నున్న సంస్కృతాక్షరములును, అన్యేచ = ఆ ముప్పదియాఱిటిలోఁ జేరని యితర సంస్కృతాక్షర

ములును, శబ్దయోగవశాత్ = సంస్కృతసమ శబ్ద ప్రయోగమువలన, అను ప్రవిశన్తి = ప్రవేశించుచున్నవి. ఉ: పిత్య్రాణము, క్లృప్తము, శార్ఙ్గము, ఆజ్ఞ, దుఃఖము, శంక, షండము. మొదలైనవి.

అచ్చాంధ్రమునందలి యీ ముప్పదియాఱు వర్ణములను జేర్కొను చున్నాఁడు. ద్వివిధ=హ్రస్వదీర్ఘ రూపములగు, అదిదు దేదోతః = 'అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ' అను వర్ణములును, వక్రతమా = ఐ ఔ లును, అనుస్వారా = అర్ధానుస్వార పూర్ణానుస్వారములును, అచః = అచ్చాంధ్ర వర్ణ సమామ్నాయమునందలి యచ్చులయి యున్నవి.

క గ = క కార గకారములును, చజయుగ = చకార చకార జకార జకారములును, ట డ ణ ... ళంతు = టకార డకార ణకార తకార దకార నకార పకార బకార మకార యకార రేఫ లకార వకార సకార హకార ళకారములును నన్ననో, హల్వర్గః = అచ్చాంధ్ర వర్ణ సమామ్నాయమందలి హల్లుల సముదాయము.

"వక్రతమా వథా ప్యనుస్వారా" అనుపాఠము పక్షమున ఖండపూర్ణాను స్వారములు సైతము హల్లులలోనివే యని యన్వయింపనగును. "అనుస్వారో వ్యఞ్జనం వా స్వరం వా" అను ప్రాతిశాఖ్యసూత్ర మట్టి సమన్వయమున కాధారము కాఁగలదు.

(౨౬-౨)—పయిసందర్భమునుబట్టి, యచ్చాంధ్రమున (ఆంధ్ర దేశ్య తద్భవములందు) వర్గయుక్కులనఁగా 'ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ' అను మహాప్రాణవర్ణములు లేవని తేలుచున్నది. తమిళ దేశ్య తద్భవములలో సయిత మీ వర్గయుక్కులు లేవు. కర్ణాట దేశ్య తద్భవములలో సయిత మివి సాధారణముగా నుండవని నాగవర్మ యీ క్రింది రీతిని జెప్పియున్నాఁడు.

"నాత్ర ప్రాయేణ వర్గాణాం ద్వితీయ చతుర్థాః" (కర్ణాట భాషా భూషణము, సంజ్ఞా. వి. ౧౧ సూ.) వృత్తి "......ప్రాయేణేతి వచనాత్ సంఖ్యానుకరణాదా దృశ్యన్తే.......ఇర్ఛాసిరం (రెండువేలు)......ఘణనె......". కర్ణాటశబ్దమణి దర్పణ కర్తయగు కేశిరాజన్ననో సంఖ్యావాచకేతరములందును నీ వర్గయుక్కు లుండుట సహజమె యని యీ క్రిందిరీతిని జెప్పెను.

కం. "ఒళవు మహాప్రాణంగళ్ । విళసత్కర్ణాట భాషెయొళ్ కెలవు నిజో । జ్జ్వళమాగి..." (అక్షరసంజ్ఞా. ప్ర. ౧౫ సూ.)...వక్ఖాణం, దెక్ఖాణం ...

అట్లయినను గర్ణాటభాషాకవనమున వర్గప్రాసము ప్రసిద్ధమై యుండుట చేత నీ వర్గయుక్కుల స్థితిని స్థిరపఱుచు ప్రయోగములు గలవా లేవా యని విచారించుట కవకాశమే లేదు.

ఇంకఁ దెలుఁగునను నీ వర్గయుక్కులు గలవని యర్వాచీనులు తలంచు చున్నట్లగపడుచున్నది. శబ్దరత్నాకర కోశమునందలి కొన్ని యచ్చాంధ్రపద ములం దియ్యవి యగపడుచున్నవి.

ఖద్ది(దే)=బలము.
ఖాణము-(వై,గ్రా.) = దాణ.
ఖవణించు, ఖవణిల్లు } (దే)=ప్రవర్తిల్లు.
ఖవర, వఖర, వరఖ } (దే)=నేర్పరి.
ఖవళి(దే)=మోసము.
ఖవిణ(దే)=డంకా.
ఖింగణా(దే)=బాలుఁడు.
ఖీవి(దే)=వైభవము.
ఖేవ(దే)=ఒప్పిదము.
ఖోలా(దే)=తెగ.

ఠావు(వై-గ్రా)=స్థానము.
ఠాయి(వై-గ్రా)=స్థాయి.
అవఘళించు(దే)=మీఱు-వ్యాపించు.
అవఘళము-(దే)సామర్థ్యము, వ్యాపనము.
అవఘళుఁడు (దే)-వ్యాపకుఁడు.
జెఱభి-(దే)కులట.
అభిని(వై.గ్రా)=అహిఫేనము= నల్లమందు. (ఉరుదుభాషలో అఫిన్).
ఖఠిల్లు, పెఠిల్లు } ధ్వన్యనుకరణ శబ్దము
ఘాంఘమిత=ధ్వన్యనుకరణము.

పయిరీతిగల శబ్దములలో ఠాయి మున్నగు వైకృతములం దట్టియనాంధ్రవర్ణము లుండుటచేతఁ గావలయు నవి 'గ్రా' అను చిహ్నముతో (గ్రా = అనింద్య గ్రామ్యము) శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడినవి. రోజు వజీరు మున్నగు పదములు హిందుస్థానీపదములనియు, రోడ్డు మున్నగునవి యాంగ్ల పదములనియు శబ్దరత్నాకరమున వ్రాయఁబడి యుండఁగాఁ బయినివ్రాసిన ఖద్ది ప్రభృతు లట్లన్యదేశ్యములుగ నుదాహరింపఁబడకుండుటంజేసి యవి యాంధ్రదేశ్యములే యనుట శబ్దరత్నాకర హృదయమని చెప్పుటలో సందేహ ముండదు. అట్టియెడల నా ఖద్ది ప్రభృతిశబ్దములు నయిత మనాంధ్రవర్ణ యుక్తము లగుటంజేసి యవి మాత్రమేల యనింద్యగ్రామ్యములుగా నుదా హరింపఁబడవయ్యెనో తెలియరాకున్నది. శబ్దరత్నాకరమునం దగపడు చున్న యింకొక సంప్రదాయముచొప్పున నీ ఖద్దిప్రభృతులు 'కద్ది' మున్నగు

రీతి నుదాహరింపఁబడవలసి యుండును. వీనిలోని మహాప్రాణ వర్ణస్థితి ననఁగా వర్గయుక్కులస్థితిని సమర్థించెడి ప్రాసాదిఘటిత ప్రామాణిక ప్రయోగములను శబ్దరత్నాకరము చూపియుండలేదు. కాని యప్పకవి వర్గయుక్కులు పరమగునపుడు బిందువు వచ్చుచోటుల నుదాహరించు సందర్భములో నిచ్చిన ప్రయోగములలో నొక రెండుప్రయోగము లగపడుచున్నవి. "టవర్గద్వితీయమునకు త్రైశంకవోపాఖ్యానములోను గవిసింగరన్న ప్రయోగము.

కం॥ ఢుంఠీశు భైరవుని శితి। కంఠు విశాలాక్షి దండకరు జాహ్నవి నై। కుంఠపతి గుహుని లోలా। ర్కుం శేవలు మీఱ భూవరుఁడు ఫొడఁగనియెన్" (అప్పకవి. ౫ ఆ. ౧౫౪ ప.)

టవర్గచతుర్థంబునకు అధర్వణాచార్యుల విరాటపర్వమునందు—

గీ॥ ఢాంఢమితభేరికాధ్వానముం ఢులీని। నాదమును మిన్నుముట్ట న నారతంబు। పెక్కు గంధర్వపతులు నల్దిక్కులందుఁ। గాచు సౌగంధికంబుఁ దేఁగలరె యొరులు. (అప్పక. ౫ ఆ. ౧౫౫ పద్య.)

ఇట్టి ప్రయోగములనుబట్టి యచ్చాంధ్రమున వర్గయుక్కు లుండుట ప్రాచీనమహాకవి సమ్మతము కాకున్నను నర్వాచీన కవిసమ్మత మనుటలో సందేహము లేదనియుఁ గర్ణాటమునందువలెనే తెల్గునందును గాలక్రమమున వర్గయుక్కుల స్థితి యరుదుగ వాడుక కెక్కెననియు నంగీకరించుట యుక్తమని తోఁచుచున్నది.

ధ్వన్యనుకరణశబ్దముల నుదాహరించుటలో నయితము శబ్దరత్నాకరమున నొక నియమ మగపడకున్నది. కఠిల్లు పెఠిల్లు మున్నగు కొన్నిశబ్దములు వర్గయుక్కులతోడనే యంగీకరింపఁబడియున్నవి. అవి యనింద్యగ్రామ్యములని వ్రాయఁబడలేదు.

"కఠిల్లు, దే-వి. హాతియందగు ధ్వన్యనుకరణము......"

"పెఠిల్లు, దే-వి. 1 హాతియందగుధ్వన్యనుకరణము......2 పిడుగుపడుట యందగు ధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు పెఠిల్లు పెఠిల్లు; పెఠిల్లు పెఠిలు) "క॥ ధళధళమెఱపులు మెఱవఁగఁ। బెళపెళ నుఱుముచుఁ బెఠిల్లు పెఠిలునఁ బిడుగుల్। నలుగడఁ బడ బెడిదపు ధారలు గల బలువాన జలధరంబులు గురిసెన్॥ కళా. ౪ ఆ." (శబ్దరత్నాకర కోశము)

ఈ యుదాహృతిలోని ధళధళశబ్దము శబ్దరత్నాకరమున నుదాహరింపఁ బడలేదు. (అప్పకవి చూపిన ఛాంధమిత శబ్దమును లేదు) సరేకదా యది తళ తళ శబ్దముగా మార్పఁబడినట్లును దోఁచుచున్నది.

"తళతళ - దే-వి... ...మెఱయుటయందగు అనుకరణము-" క॥... పార్థునిపై న । గ్గలిక నడరెఁ దాఁటిసిడము । తళతళమని మెఱయఁ గురుపితా మహుఁ డధిపా॥ (భార. భీష్మ. ౨ ఆ. శబ్దరత్నాకరకోశము).

ఇచటఁ జేసినమార్పు యుక్తమే యనఁదగియున్నను నీక్రింద వ్రాయు రీతిగల కొన్ని యెడల నట్లుచేయుట కేవలము నకృత్యమని చెప్పక తీరకున్నది.

"గుబాలు. దే-వి. 1. గుబేలుయొక్క రూపాంతరము. "గుబాలునన్ లకుముకుల్ క్రందై పడున్ లేచు" ఆము. ౧ ఆ. 2.పగులుటయందగు ధ్వన్యను కరణము. "దరులు గుబాలునం బగుల" శేష. ౧ ఆ......"(శబ్దరత్నాకర)
"గుబేలు - దే. వి 1 పడుటయందగు ధ్వన్యనుకరణము. క॥ మఘవాహి తుఁడున్ । దనపాటునఁ దేరొఱఁగన్ । బెనుగుబ్బలిపడినగతి గుబేలునఁ బడి యెన్. రామా. ౮ ఆ." (శబ్దరత్నాకరకోశము).

"దిందిం. దే. వి. దిమిదిమి యొక్క రూపాంతరము." (శబ్ద రత్నా కరము.)

"దిమి దిమి. దే. వి. మద్దెల మ్రోఁతయందగు ధ్వన్యనుకరణము. "దిమిదిమి యనుచు మద్దెల మ్రోయ. రా. కిష్కిం. కాం." (శబ్ద రత్నా కరము).

"బోరు. దే. వి. వాన కురియుటయందగు ధ్వన్యనుకరణము. (వాన బోరున కురియుచున్నది)...." (శబ్దరత్నాకరము).

శబ్దగతములగు వర్గయుగ్వర్ణములను మార్చుటలో నింకను ననేక స్థలములందు శబ్దరత్నాకర కర్త యిట్లె యపమార్గమునఁ బోవుచు వచ్చెను.

"మక్కా. వై. వి. యవన దేశమునందలి ముఖ్యపట్టణము. * (ఈ పువ్వు గురుతుచేత దీని ప్రకృతియొక్క యర్థ మీ వికృతిలో మాఱినదని తెలుపఁబడుచున్నది)." (శబ్దరత్నాకరము).

"మక్కా (వికృతి) ద్వీపాంతరమునందలి యొక పట్టణము. * (ప్రకృతి) మఖ." (వైకృత దీపిక).

మఖ....అ - పుం - ము. 1 యజ్ఞము. ౭. ఒకానొక దీవి." (శబ్ద రత్నాకరము).

పయి సందర్భమునుబట్టి మక్కా శబ్దము వైకృతమనియు ద్వీపవిశేష వాచియగు మఘ శబ్దము ప్రకృతిగాఁ గలదనియు శబ్దరత్నాకర కోశకర్త తలంచె ననుటకు సందేహము లేదు గదా. అరబ్బీ దేశములోని యొక పుణ్య క్షేత్రమునకు వాచకముగాఁ దురకలు దీనిని 'మఖ్ఖా' అందురు. కాని దీనిని సంస్కృతభవమగు నచ్చాంధ్ర శబ్దముగాఁ దలంచుటచే నిందు మహా ప్రాణమగు ఖకారమున్నదనుటకు శబ్దరత్నాకర కోశకర్త యంగీకరింపఁ డయ్యెను. కాని తురకల రాజ్యము కాలములోనిదగు (A. D. 1442 ప్రాంతము) నరసభూపాలీయమున మూర్తికవి దీనిని 'మఖ్ఖా' అను రూప ముతోనె గ్రహించి ప్రాసస్థానమున నిబంధించి దుష్కరప్రాసఘటనా చాతురిని జూపియున్నాఁడు.

* శా॥ మఖ్ఖా మండువ పండువా భయద దోర్మాహాత్మ్య, ధాటీ మహా।
తుఖ్ఖార ప్రతిరుద్ధ భూభువన, హిందూరాజ్య సంస్థాపనా।
ప్రాఖ్ఖద్యోతకులోత్థిత ధ్వజపటప్రాయ ప్రసర్పద్యశ।
స్రుఖ్ఖర్వీకృత శర్వకంకణ నమస్యా జాల కోలాహలా॥
(నరస భూపాలీయము, ౫ ఆ - ౨౮౮ ప.)

ప్రసిద్ధాంధ్ర మహాకవి ప్రయోగ మిట్లుండఁగా శబ్దరత్నాకర కోశ కర్త పయిరీతిని వ్రాయుట కేవలము ప్రామాదిక మనక తీరదు గదా.

ఈ విషయమునఁ గొన్ని చోటులందు వైకృత దీపికా శబ్దరత్నాకర ములకుఁ బరస్పర విరోధము సయితే మగపడుచున్నది. గ్రంథ విస్తర భీతిచే నొక్క స్థలమును మాత్రము చూపుచున్నాను.

"వటారి (వికృతి) శూరుఁడు * (ప్రకృత్యర్థ మించుక మారెనని పువ్వు గుఱుతుచే సూచింపఁబడుచున్నది) వఠరః - (ప్రకృతి) (వైకృతదీపిక)

ఈ వఠర శబ్దముయొక్క తత్సమరూపము శబ్దరత్నాకరమునఁ జూపఁ బడలేదు సరేకదా వఠర, వఠారి, వటారి శబ్దములు సమర్థ శబ్దార్థకములగు దేశ్యములుగా నందుఁ జూపఁబడియున్నవి. కాని సంస్కృతకోశములలో వఠర, వటర శబ్దములు రెండును నగపడుచున్నవి.

* మఖ్ఖా...=మక్కా యనెడి సముద్రతీరములో నుంటయొ పండుగగాఁ గల తురకల కథయు మిచ్చు.

"వఠర. పుం. (వఠ సామర్థ్యే అరన్,) మూర్ఖే. అమ్బష్టేచ; శఠే, మన్దేచ. త్రి; (త్రిలింగకము)" (శబ్దస్తోమ మహానిధి; (వాచస్పత్యసారము.) ఇందు వటరశబ్దములేదు).

"వఠరః - అ - త్రి, శఠః - ౨ మందః - "

వటరః- అ - పు. కుక్కుటః - ౨ వేష్టః - ౩. శఠః - ౪. చోరః - ౫ చఞ్చలః - (సర్వ శబ్ద సంబోధిని).

ఇట్లు వఠర వటర శబ్దములు సంస్కృత కోశములలో వెలయుచుండఁగా వైకృత దీపికలో వటారి శబ్దము వఠర శబ్దభవమని వ్రాసిన శబ్ద రత్నాకరకోశ కర్త, శబ్ద రత్నాకరమున నీ క్రిందిరీతిని 'వఠర, వఠారి, వటారి, ఠవర శబ్దములు దేశ్యములని వ్రాయుట విరుద్ధమనక తీరదు గదా.

"ఠవర- దే - విణ. నేర్పరి. క. కొమ్మపయిఁ బక్షిపాతము। నెమ్మోయి నెఱపుదు విదేల యేఁచెద నకటా। కమ్మఁగ నవాతు చక్కెర। కమ్మగ మాటాడు ఠవర కలకంఠవరా ॥ విజ - ౩ ఆ." (కొమ్మ = స్త్రీ - శాఖ. నవాతు = గడ్డ చక్కెర)

"వఠర. దే - వి. సమర్థుఁడు. ద్వి. వఠరవై కొంచెపు వారిపైఁ జూపు। నటన మా ముందఱ నడవదెల్లపుడు. (భాగ - ౧. స్కం. ఠవరకు మాఱు రూపము)" (ఇచట కోశకర్త టఠ ప్రాసమును సైత మంగీకరించెను).

"వఠారి. దే-విణ. వఠరయొక్క రూపాంతరము సీ॥ జలజ కేసరరాజి జల్లెడ మూకఁగా! దాఁటువఠారి రథ్యములతోడ. ఉ. హరి. ౨. ఆ."

"వటారి, దే. విణ. సమర్థము. వటారి తనంబునం గటారులు వెతికి కొని. ఉ. హరి. ౬. ఆ. (వఠారియొక్క రూపాంతరము. శబ్ద రత్నాకరము).

పయి ప్రయోగములలోని ఠకార సాధక విజయవిలాస ప్రయోగ మనియత శబ్దాలంకార ఘటిత మగుటచేతను 'ట' కార సాధక మగు భాగవత ప్రయోగము నియతమగు ప్రాసమున నిబద్ధమగుటచేతను 'ట' కార యుక్త రూపము సంగీకరించుటయె యుక్త మనఁదగియున్నది. అప్రసిద్ధ ట, ఠ ప్రాసాంగీకారముచే భాగవత ప్రయోగమును వారించుకొని ఠ కార యుక్త రూపము సంగీకరించుటయు నందును శబ్దార్థ సామ్యము గల ప్రకృతి యగపడుచుండఁగా నట్టి రూపమును వైకృత మనుట మాని దేశ్యమనుటయుఁ నిరాధారములై యసంగతము లగుచున్నవి.

(౨౬౩)—— ప్రాకృత సమములు తెనుఁగునఁ గలవని చెప్పఁబడి యున్నను ప్రాకృత శబ్దములలో నచ్ఛాంధ్రవర్ణ యుక్తములగు శబ్దములను మాత్రమె తెనుఁగులో వాడుకొనుట సంప్రదాయమై యున్నది. సంస్కృత శబ్దములను వలె సాధారణముగా నెల్ల ప్రాకృత శబ్దములను దెనుఁగున వాడు కొనెడి సంప్రదాయము లేదు. అచ్ఛాంధ్రవర్ణములలోఁ జేరని వర్గ ద్వితీయ చతుర్థాదులు ప్రాకృత శబ్దములలో వెలయుచున్నను నట్టి యక్షరములతోఁ గూడిన ప్రాకృత శబ్దములు తత్సమములుగ, నే కవిచేతను బ్రయోగింపఁబడి యున్న ట్లగపడదు. కావుననే కదా యథర్వణుఁడు సంస్కృత శబ్దములనే ప్రకృతులనుగాఁ గొని తత్సమములను దద్భవములను దెనుఁగున నుపదేశించి యున్నాఁడు. ఇంత యేల! నన్నయభట్టారకుఁడు సైతము సంస్కృత శబ్దములనుండి సంస్కృత సమములను సాధించు సూత్రములను విపులముగా నుపదేశించెనే కాని ప్రాకృత శబ్దములనుండి ప్రాకృత సమములను సాధించెడి సూత్రము నొకటినైనను బ్రత్యేకముగా సూత్రించి యుండలేదు గదా. నన్నయభట్టారకుఁడు దంత్య చ జ లను వేఱుగ నాచ్ఛికవర్ణసమామ్నాయమున గణించుటంబట్టి ప్రాకృతవర్ణ సమామ్నాయమున దంత్య చ జ ల స్థితి నాతఁ డంగీకరింపఁలేదనుట నిశ్చయము. కావున 'జడా, జమో' అను ప్రాకృత శబ్దముల తత్సమ రూపములు 'జడ, జముఁడు' అని బాలవ్యాకరణ కర్త యుదాహరించుట నన్నయాభిప్రాయ విరుద్ధమని గ్రహింపనగును. మంచ శబ్ద భవము మంచేమనియు, రాజశబ్ద భవము 'రాజే' అనియుఁ జెప్పు చున్నట్లె 'జటా' శబ్ద భవము 'జడ' అనియు, యమశబ్ద భవము 'జముఁడు' అనియు గ్రహించుట నన్నయాశయానుకూలమై యుండును. లేదా యవి ప్రాకృత భవములని యైనఁ జెప్పవలసి యుండును.

(౨౬౪)——షట్త్రింశ ద్రేఫేత్యాది ప్రకృత కారిక లప్పకవీయ చింతామణిలో వేఱు విధముగ నుదాహరింపఁబడియున్నవి.

> "సప్త త్రింశ దిహాన్యే చానుప్రవిశన్తి శబ్దయోగ వశాత్ ।
> ద్వివిధా ... య రయుగ లయుగ వసహాశ్చ హాలః॥"
>
> (అప్పకవ్యుదాహృత చింతామణి.)

శకటరేఫమును వర్ణాంతరముగఁ బరిగణించుట యుక్తమనియుఁ, దత్పక్షమున నాంధ్రమునకు ముప్పదేడు వర్ణము లగుచున్నవనియు, నక్కారణమునఁ బయి పాఠాంతరము సాధువే యనియు నహోబల పండితుఁ డీ క్రింది రీతిని వ్రాసియున్నాఁడు.

"షట్త్రింశం దత్ర :—అత్రశుద్ధ వికృతౌ, షట్త్రింశ ద్వర్ణానాం వ్యవహారః. రస్త్వత్ర గృహ్యతే ద్వివిధ ఇతిరేఫస్య ద్వైవిధ్య కథనేన గురురేఫస్య వర్ణమధ్యే పరిగణన దశాయాం, సప్తత్రింశ దిహాన్యే, ఇత్యప్యుకవి పుస్తక పాఠోపి సాధురేవ. తస్య రేఫ భేదత్వేన అవర్ణాంతరత్వా దపరిగణన దశాయా మయం పాఠ ఇతి వివేకః" (అహో. ౧౩౬ పుట)

పయి రీతి నహోబల పండితుఁడు షట్త్రింశత్పాఠ సప్త త్రింశత్పాఠములు రెండును సాధువులె యనుట విమర్శ సహమై యుండలేదు. సప్త త్రింశదిత్యాది పాఠము ప్రక్షిప్తమనుటకు సందేహము లేదు. వెనుక నుదాహరించిన రీతిని (౧౮౭ వి.) లఘ్వలఘువులు రెండిటికిని బృథగ్గణనము చేయుట 'అనుప్రదానా' దిత్యాది (౧౪౧ వి.) శాస్త్రమునకు విరుద్ధమును నన్నయాభిప్రాయమునకు (౧౮౭ వి.) విరుద్ధమును నగుటంజేసి సప్త త్రింశదిత్యాది పాఠము గ్రాహ్యము కాదని గ్రహింప నగును. "యచ్ఛ్రుతి మార్యా లఘు యం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" అని యిట్లు కంఠోక్తముగఁ జెప్పఁబడిన లఘు యకారమునకు సయితము నన్నయ భట్టారకుఁడు పృథగ్గణనము చేయకుండుటచేత లఘ్వ లఘువులకుఁ బృథగ్గణనము చేయుట చింతామణి కర్తృభిప్రేతము కాదనుటలో సందేహము లేదు. "లఘువో లఘవశ్చేతి, ద్వేధాన్తస్థా న్వదన్తి శాస్త్రారః।" అను చొప్పున నంతస్థములు నాల్గింటికిని దుల్యముగనే లఘ్వలఘుతలను జెప్పి యందు యవల విషయమునఁ బృథగ్గణనము చేయక రలల విషయమున మాత్రము చేయుట నన్నయాభిప్రాయమని యెంతమాత్రమును విశ్వసింపఁజాలము గదా. మఱియు నీపాఠాంతరమునందు 'ర యుగ' అనుదానితో పాటుగ 'ల యుగ' అని చెప్పఁబడుట నరయఁగా నలఘు లకారమును (ఊల్లు) నచ్చాంధ్రవర్ణ సమామ్నాయ గత ళ కారమును (గయ్యాళి) నభిన్నములుగఁ బాటింపఁబడినట్లు సయితము విశదమగుచున్నది. నేఁటి యుచ్చారణమున వీనికి భేద మగపడకున్నను నలఘు లకారము దంత్యమును ళ కారము మూర్ధన్యమును నగుటచేత వీని యభిన్నత చింతామణి హృదయమనికాని శాస్త్రీయమనికాని యెంతమాత్రమును జెప్పరాదు గదా.

బాలవ్యాకరణకర్తయు నవి భిన్నములనియె గ్రహించి 'ఏళులు, పాళులు త్రాళులని (ఇవి యపశబ్దములనియు 'ఏలు'=(ఏళ్ళు) అనురీతిని

వ్రాయవలెననియు గ్రహించునది. చూ. వ్యా-సం. ౨౦౦ విష. ౭౪౪ పుట.) 'బహుత్వమందు రలడల కాదేశమయిన ళకార మలఘువు....... వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని యలఘు ళకారము గాదని యెఱుంగునది.' (బాల. సంజ్ఞా. ౧౮. సూ.) అని యిట్లు వ్రాసి యున్నాఁడు. ఈ మార్గమునే యనుసరించుచుఁ ద్రిలింగలక్షణశేషకర్తయు "య వలలవలె రేఫంబును బ్రయత్న (లఘ్వలఘు) భేదంబుచే ద్వివిధంబుగాన శబ్దానుశాసనాదులచే నలఘు రేఫము వర్ణాంతరముగ గ్రహింపఁబడదయ్యె." అని యిట్లు నన్నయభట్టారకాశయము విశదీకరించెను.

పయి బాలవ్యాకరణవాక్యమునకు "వర్ణసమామ్నాయగత ళకారము వర్ణాంతరముగానట్టి యలఘులకారము కాదు. అనఁగా వర్ణాంతరమైనయలఘు ళకారమెయని నిశ్చితార్థము" అని యిట్లు గుప్తార్థ ప్రకాశికాకర్త వ్యాఖ్యా నము చేయుట కేవలము సాహసమూలకమై యున్నది. బాలవ్యాకరణకర్త కే యట్టి యభిప్రాయమున్నయెడల 'ఏళులు పాళులు త్రాళు'లని బహుత్వ మందు "రలడల కాదేశమైన ళకార మలఘువు" అని యిట్లు గయ్యాళీత్యాది శబ్దగత ళకారమును బృథక్కరించి లకారవిశేషమున కలఘుత్వమును విశే షించి చెప్పియుండునా? మఱియు నట్లుగ నలఘు లకారమునె వర్ణసమా మ్నాయమున బరిగణించి యున్నయెడలఁ దుల్యన్యాయమున నలఘు రేఫమును సైతము సూరి వర్ణసమామ్నాయములోఁ బరిగణింపకుండునా?

నన్నయభట్టు కాలమున "త్రాడు" మున్నగుశబ్దముల డకారమునకు బహువచనపరకత్వమున నలఘు లకారపరిణామము పండితసమ్మతమై యుండ లేదనియు నప్పటి రలలు తుదినిగల శబ్దముల బహువచన రూపములందు మాత్రమె యలఘు లకార పరిణామము సమ్మతమయి యుండెడిదనియు "రోలః" అనెడి సూత్రపు వ్యాఖ్యానము సందర్భమున విశదీకరింపఁబడును. ఈరేఫ లకారాంత శబ్ద బహువచనరూపములలో సైత మర్వాచీనబాల వ్యాకరణాదులు సాధించురీతిని శబ్దావయవ వర్ణాదేశమే కాక బహువచన లకారము సైతె మలఘువుగనే పలుకవలయునని చింతామణి హృదయమై యున్నది. 'ఊళ్లు' అనుసంయోగములోని తొల్తటివర్ణమును ళకారముగను దాని కవ్యవహితపరముగానున్న వర్ణమును లఘులకారముగను బలుకుట యెంతమాత్రమును శక్యముకాదు గదా. చింతామణికర్త యంతస్థముల కలఘుత్వమునుగాని లఘుత్వమునుగాని యాదేశించుట యనావశ్యకమనియు

వానిలఘ్వలఘుతలు పండితవ్యవహారమునుబట్టి గ్రాహ్యము లగుచుండు ననియుఁ (నేఁడు సంస్కృతశబ్దములలో గోళ గరళాది శబ్దములందలి యలఘూచ్చారణమును ఫల కులాది శబ్దములలోని లఘూచ్చారణమును వ్యవహార వేద్యము లగుచున్నట్లే) దలంచినవాఁడు గాన నాతఁ డట్టి లఘ్వలఘుతల నాదేశించి యుండలేదు. ఊర్వ్యాది శబ్దములలోని రేఫమునకు లకారము వచ్చు నని చెప్పుటమాత్ర మావశ్యకమగుటచేత 'రోలః' అని మాత్రమే సూత్రించి "ఊళ్లు=(ళ్ళు)" మున్నగు రూపములను సాధించినవాఁ డయ్యెను. అచటి లకారములు రెండును నలఘూచ్చారణము కలవే యనుట పండిత వ్యవహార వేద్యమే కాఁగలదని యాతఁడు తలంచినవాఁ డయ్యెను. కాఁగా "ఊళ్లు=(ళ్ళు)" అను చోటి లకారములు రెంటికిని నలఘూచ్చారణమే యుండు ననుటలోఁ జింతామణి ప్రక్రియ విరోధింపదు. బాలవ్యాకరణమునం దట్లుగాక ర ల డ లకు మాత్రమే బహువచన లకారము పరమగునప్పు డలఘు లకార మాదేశింపఁ బడుటచేత నచటి బహువచన లకారమున కలఘుత్వము సిద్ధింపనేరదు. చింతామణి యొక్క పయిగభీరాశయమును గ్రహింపఁజాలక యందు శబ్దావయవ రేఫమునకుమాత్ర మలఘు లకార మాదేశింపఁబడి బహువచన లకారమున కలఘుత్వ మాదేశింపఁబడలేదన్న తలంపున బాలవ్యాకరణకర్త యిట్టి ప్రమాదమునకు లోనయ్యెనా యని యాలోచింపవలసి యున్నది.

పయి సందర్భమునుబట్టి యంత్యస్థముల లఘ్వలఘురూపములకుఁ బృథగ్గణనముచేయు పక్షములోనిదగు సప్తత్రింశ దిత్యాదిపాఠము నన్నయ సమ్మతము కాదనియుఁ బ్రక్షిప్తమనియుఁ జెప్పుటకు సందేహములేదు. అలఘు లకారమును లఘులకారము వలెనే దంతమూలీయము. వర్ణసమామ్నాయగత ళ కారమన్ననో మూర్ధన్యము. అయ్యైనను వానికిఁగల యుచ్చారణభేదము కాలక్రమమున నశించుటనుబట్టి 'య ర ల వ స హ ళంతు హల్వర్గః' అనుదానిలోఁ జేర్కొనఁబడిన ళకార మలఘులకారమేయని భ్రమించి యీపక్షమునందుఁ దుల్యన్యాయమున నలఘురేఫము సైతము పరిగణింపఁబడుట యుక్తమను తలంపునఁ బ్రక్షిప్తపాఠకర్త యట్టిపాఠమును గల్పించెనా యని యాలోచింపవలసి యున్నది.

'1 తాటాకు 2. మట్టాకు' మున్నగు శబ్దములలోని యికారాకార సంధిని జనించిన విలక్షణమగు 'ఆ' వర్ణ మొకటి వినఁబడుచున్నది. 'త్స, ష

జ్ఞ' అను సంయోగములలోఁ దత్తత్సంయుక్తాక్షరములవలనఁ గలుగవలసిన ధ్వనులకు విలక్షణములగు ధ్వనులు వాడుకలో నున్నవి. మఱియు 'బ్రహ్మ, మధ్యాహ్నము, జిహ్వ' మున్నగు హకారఘటిత సంయోగములలోఁ బరాక్షరధ్వని మొదట వినఁబడుచున్నది. 'ఫ్రూఫులు, సాఫుగా' మున్నగుట్లుచో వింతయగు ఫకారరూపా (f) న్యదేశ్యధ్వని తెల్గునఁ బ్రవేశించినది. ఇట్టివెల్ల నైయాకరణోపేక్షితములై యున్నవి.

(౨౬౫)—నన్నయభట్టారకుని కాల మాంధ్రలిపిలోఁ (ఆంధ్రకర్ణాట సాధారణలిపి) గొంత మార్పుకలిగెడి కాలమై యుండెను. క్రీస్తుశకము ౧౦౨౨ సంవత్సరమునఁ జేయఁబడిన రాజరాజు కోరుమిల్లి శాసనమందలి తలకట్లంతకు ముందటిస్థితికంటెఁ గేవలముగా మాఱియున్నవి. అనఁగా నంతకు ముందటిశాసనములలో '–' అనురీతిని దిన్నని రేఖగా వ్రాయఁబడెడి తలకట్టా శాసనములో ' ´' అనురీతిని జంద్రవంకను బోలి యున్నది.

అప్పటి కాంధ్రకర్ణాటముల కొక్కలిపియే వాడుకలో నుండెడిది. (నేఁటికిని నాంధ్రకర్ణాటలిపుల కంతగా భేదములేదు) అట్లగుటచేత నట్టి యాంధ్రకర్ణాట సాధారణ లిపిలోని కొన్నిలోపములను మాన్పియుఁ గొన్ని నూతన కల్పనములను జేసియు నాంధ్రమునకు సులభలేఖ్యమును సంక్షిప్తతమమును సయుక్తికమును నప్పటికి వాడుకలోనున్న లిపి నెఱిఁగినవారికి సుగ్రహ మనఁదగినదియు నయియుండు ప్రత్యేకలిపిని నన్నయభట్టారకుఁడు వెలయింప నెంచెను. అప్పు డాంధ్రకర్ణాట సామాన్యలిపిని వ్రాయుటలో నాంధ్రులు కొంత మార్పుచేసి వ్రాయుట యారంభించుచుండుటచేత నాంధ్రప్రబంధ వాఙ్మ యారంభకాలమగు నాసమయమున భావిగ్రంథ స్థైర్యమున కనువగురీతిని లిపి సంస్కారముచేసి యద్దాని యాకారమును దనవ్యాకరణమున నిరూపించుట యావశ్యకమని యాతఁడు తలంచి యుండెను. క్రీస్తుశకము ౧౦౦౩ సంవత్సరపు దనఁబడుచున్న శక్తివర్మప్రభుబెజ్జు శాసనము వఱకును (చెన్న. విశ్వ. పుస్త ౨. వాల్యుము. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక ౩౯౯ పుట) ప్రాచీన లిపియే యనఁగా నావఱకున్న యాంధ్రకర్ణాట సాధారణ లిపియే వెలయుచున్నను ౧౦౨౨ క్రైస్తవాబ్దమునఁ జాళుక్యుఁడే యగు రాజరాజుచేసిన కోరుమల్లి శాసనమున (ఇండియన్ ఏన్టిక్వేరి ౧౪ వాల్యుము ౫౦ పుట) నట్టి తలకట్టు మార్పు సార్వత్రికముగ నున్నది. దీనినిబట్టి యప్పటికే నన్నయ లిపి సంస్కారము చేయనారంభించెనని విశదమగుచున్నది. పరిశీలింపఁ

చం॥ బాలేన్దు పరిధి శృఙ్గా । వర్తకుశగ్రన్థి దాత్ర పరశు సమాః ।
ఆద్యా ఇభకరతుల్యా । స్తద్దీర్ఘా శ్శూలసన్నిభా వన్యౌ।
దర, శార్ఙ్గ, పిప్పలద, శాఙ్కుశ, పన్నగ, సన్నిభాః క్రమా త్పరుషాః ।
స్తమ్భవిలేఖాధిక్యే । స్తఏవ వర్గద్వితీయ వర్ణాద్యాః ।
కీర, తరి, హస్తిమస్తక, । శుక్తి, తులాఽఽసన, వితర్ది, సీర, సమాః ।
అన్తస్థా శ్చోష్మాణో । దన్త్యచజౌ గురు ర లౌ చ బిన్దుయుతౌ ॥

---

గా నీ విషయ మొక్కటియె చింతామణి నన్నయ కర్తృకమని స్థాపింపఁ జాలి యున్నది. అచ్చులకును, గొన్ని హల్లులకును, బ్రత్యేకస్థితిలోను గుణితము లోను గల్గు నాకార భేదముల నుపేక్షించి యట్టి యాకారద్వయములో నొక్క యాకారమే యెల్లయెడలను నుండునట్లు సంస్కరింపఁ దలంచుటచేత ( ) అను నాకారముగల 'అ' కారపుచిహ్నము దానికిసంక్షేపమగు '✓' అనుదానిరీతిని జంద్రవంకవలె నెల్లయెడల నుండుటయె యుక్తమని యాతఁడు తలఁచి యుండెను. కాలక్రమమున నట్టిసంస్కారమేకాక మఱికొన్ని యావశ్యకము లనఁ దగు సంస్కారములను సైతమాంధ్రకర్ణాట సాధారణ లిపిలో సంగీకరించి యీక్రిందిరీతిని లిపిస్వరూపము నుపదేశించెను.

వ్యాఖ్య:—బాలేంద్విత్యాది—ఆద్యాః=(అ+ఆద్యాః) అవర్ణాదికము లగు నక్షరములు, బాలేన్దు = బాలచంద్రునితోడను (✓=అ), పరిధి = పరివేషముతోడను (○=ఇ), శృఙ్గ = వృషభాదుల కొమ్ముతోడను ( ) = ఉ), ఆవర్త = నీటి సుడితోడను ( = ఋ), కుశగ్రంథి = దర్భముడితోడను (శ్రాద్ధాదులలో వాడెడి పవిత్రపు దర్భముడితోడను) ( = ఌ), దాత్ర= కొడవటితోడను ( = ఎ), పరశు = గండ్రగొడ్డటితోడను ( = ఒ), సమాః=తుల్యములగు నాకారములు గలవగుచున్నవి. తద్దీర్ఘాః = వాని దీర్ఘములు, ఇభకరతుల్యాః = ఏనుఁగుతొండము వంటి యాకారము గలవగుచున్నవి. 'అ' కారాది చిహ్నములతో నట్టి దీర్ఘపుగుర్తును జేర్పవలెను.
 = ఆ ; = ఈ ; = ఊ ; = ఏ ; = ఓ; ( = ఓ. ఇట్లు కొన్ని యెడల నగపడుచున్నది) అన్యౌ= తక్కిన వనఁగా 'ఐ' కారమును 'ఔ' కారమును, శూలసన్నిభౌ = శూలమువంటి ( ) యాకారము గలవగుచున్నవి. అనగా 'ఎ' కారచిహ్నముతో శూలాకారమును జేర్పఁగా 'ఐ' కారచిహ్నమును ( = ఐ) 'ఒ' కారచిహ్నముతో శూలాకారమును జేర్పఁగా 'ఔ' కారచిహ్నమును ( ) నేర్పడునని భావము.

అట్లై యంగీకరింపక కేవల శిరోమాత్రాకారమె (ᒪ) రెండిటికిని జిహ్న
మని యథాశ్రుతముగా నర్థముచేసినచో నారెండిటికిని భేదము లేకుండ
నన్నయ చెప్పె ననవలసివచ్చును గదా. పైని వ్రాసినరీతి నానవతకు సంజ్ఞి
తములో నున్న యచ్చుల చిహ్నములె వాని ప్రత్యేకస్థితిలో నైనను నుండఁ
దగునని సవరించె ననదగును. ఔకార మానవతకు '൭' అనురీతి నున్నను
నది 'ఒ ఓ' లయాకారములతో నభిన్నమై యైపోవునని సందేహించియు
వక్రతమములు రెంటికిని నాకారములో నేకరీతి కొంతె యుండుట యుక్తమని
తలఁచియుఁ గావలయును 'ఏ, ఒ' అను వాని యాకారముల మీఁద నేకాకార
మగు '⌐' శిరోలచిహ్నమును జేర్పఁగా 'ఐ, ఔ' లు వరుసగా నేర్పడునని
సవరించియుండెను.

పరుషాః = పరుషములగు క చ ట త ప లు, వరుసగా, దర =
శంఖముతోడను (ɤ = క్), శార్ఙ్గ = ధనుస్సు తోడను (ப = చ్)
(ఇది నారి యాకర్షించిన యనఁగా నెక్కిడిన వింటివలె నున్నది), పిప్పల
దళ = రావియాకులోని సగముతోడను (ɾ = ట్), అఙ్కుశ = ఏనుఁగును
త్రోలెడి యాయుధముతోడను (൭ = త్), పన్నగ = పాము తోడను
(Ꮭ = ప్) (ఇది పడగయెత్తిన పామువలె నున్నది), తుల్యములగు నాకార
ములు గలవగుచున్నవి. పరుషముల యీ యాకారము లప్పటి
కున్న యాంధ్ర కర్ణాట సాధారణ లిపిలోనివే కాని నన్నయ కల్పించినవి
గావు. స్తమ్భవిలేఖాధిక్యైః = స్తంభాకార రేఖల విలేఖనముల యొక్క
యాధిక్యములచేత; తద్వత = ఆ కచటతపలె, వర్గ ద్వితీయ వర్ణాద్యాః =
వర్గులలోని ద్వితీయ వర్ణములు మున్నగునవి యగుచున్నవి. (దీని సవర్ణాణ
కారికలు సవరింపఁగలవు.) ఇంక నీక్రింద సంస్థాపిష్మముల యాకారములు
వర్ణింపఁబడుచున్నవి. వానిలో యకార రేఫ లకారములు తప్పఁ దక్కిన వాని
యాకృతులు ప్రాచీనాంధ్రకర్ణాట సాధారణ లిపిలోనివే కాని కల్పిత
ములు కావు. మఱియు నవి గుణితములోను ననఁగా హలంతర సంయోగా
వస్థలోను బ్రత్యేక స్థితిలోను నొక్కరీతినే యున్నవి. ఇంక యకార రేఫ లకా
రములకు మాత్ర మాంధ్రకర్ణాట సాధారణ లిపిలోని గుణితము నందున్న
ప్పటి—అనఁగా హలంతరముపై నిల్చియున్నప్పటి—యాకారములె గ్రహిం
పఁబడెను. కాఁగా నచ్చులకు వలెనె హల్లులకును హలంతరముపై నిల్చునపుడు
వ్రాయఁబడెడి గుణితములోని సంక్షేపరూపములే నన్నయచే సంగ్రహింపఁ

బడినవని యెన్న నగును. సంయోగమునకు సూచకముగఁ గ్రింద వ్రాయుటలో యకారాకారము (యు) మ (ౘ) వర్ణ లిపికిని లకారాకారము 'ఉ' కారలిపి కనఁగాఁ గొమ్మునకును నభిన్నముగా నగపడును గాన వాని గుణితరూపములను దీసికొనుట యావశ్యకమయ్యెను. అన్తస్థాశ్చ=య ర ల వ లు ను, ఊష్మాణః= శషస హ లును - వరుసగా - కీర=చిలుకతోడను (య్ = య్.) (ఇది తోఁక నించుక యెత్తిన చిలుకవలె నున్నది గదా.), తరి = (నౌ. పాఠాంతరము) ఓడతోడను (ర = ర్), హస్తిమస్తక = గజశీర్షము తోడను (ల = ల్), శుక్తి = ముత్యపుఁ జిప్పతోడను, (వ = వ్), తులా = త్రాసు తోడను (శ = శ్), ఆసన = వేత్రాసనము తోడను, (ష = ష్), వితర్ది = వేదికతోడను (స = స్), సీర = నాఁగటి తోడను (హ = హ్) = సమాః = సమానమైన యాకారములు గలవగుచున్నవి. దన్త్యచ జౌ = చ్రజలును, సురేఫలౌచ = అలఘువులగు రలలును, బిన్దుయుతౌ = ఊర్ధ్వమున నొక బొట్టుతోఁ గూడి యేర్పడుచున్నవి. (చ = చకారము. జ = జకారము. ఱ = అలఘు రేఫము = ఱకారము. ళ = అలఘులకారము.) ఆంధ్ర కర్ణాట సాధారణ లిపిలో 'ఱ ళ' అనునాకారములు గలవు. కాని దంత్య చ జ ల కు విశేషా కారములు లేవు. నన్నయ 'ఱ ళ' అను వానిని నైతముపేక్షించి నయుక్తికముగఁ బయి యాకారములను గల్పించెను. అట్లే వర్గద్వితీయాములకును సయుక్తికము లనఁదగు నాకారములను గల్పించెను. అట్టి సయుక్తికత్వ మిటఁ జూపఁబడుచున్నది.

వెనుక నుదాహరించిన వర్ణోత్పత్తి సందర్భమునుబట్టి (౧౮౭ - వి) యలఘు రలలు లఘు రలలకు భిన్నములగు వర్ణాంతరములు కామిం జేసి వానికి లఘు రల చిహ్నములె యలఘుత్వ సూచకమగు నలంతి మార్పుతో నుండుటయు నట్లె దంత్య'చజ'లయందును దాలవ్యత పీడ కుండుటచేతఁ (౧౫౮.వి) దాలవ్య చజల చిహ్నములె దంత్యతారూపవిశేషమునకు గుఱుతగు నలంతి మార్పుతో నుండుటయు మిక్కిలి యుక్తియుక్తముగా నుండునుగదా.

పయి రీతినె వర్గ ద్వితీయములందుఁ బ్రథమములకన్న సోష్మతా రూపవిశేషము మాత్రము కలదు గాన నద్దానికి సూచకముగ వర్గ ప్రథమ చిహ్నము పైనొక స్తంభాకారరేఖను నిల్పినచోనది వర్గ ద్వితీయ చిహ్నమగును. అట్లె వర్గ తృతీయములందు నాదితా రూపవిశేషమునకు గుఱుతుగను వర్గద్వితీయ చిహ్నమునకు వ్యావర్తకముగను వర్గులలోని తీయద్వి

విశేషమునకు సూచకముగను వర్గ ప్రథమలిపిపై రెండు స్తంభాకార రేఖలను నిల్పినచో నది వర్గతృతీయ చిహ్నమగును. అట్లె వర్గతృతీయముల కన్న సౌష్మత్వ విశేషము మాత్రము వర్గచతుర్థములం దుండును గాన నట్టితృతీయ విశేషమునకు సూచకముగా వర్గతృతీయముపై మఱొక స్తంభాకార రేఖను నిల్పఁగా ననఁగా వర్గప్రథమ లిపిపయిని మూఁడు స్తంభాకార రేఖలను నిల్పఁగా నది వర్గచతుర్థ లిపియగును. ఆవిధముననే వర్గప్రథమమున లేని నాదానునాసిక్య మేళనమనెడి నాల్గవ విశేషమునకు సూచకముగను వర్గచతుర్థలిపికి వ్యావర్తకముగను వర్గతృతీయ నాదవర్ణ లిపిపై రెండు స్తంభాకార రేఖలనఁగా వర్గప్రథమ లిపిపై నాల్గు స్తంభాకార రేఖలను నిల్పినచో నది వర్గపంచమ లిపి యగును. ఈవిషయములనె నన్నయ భట్టారకుఁడు "స్తమ్భవిలేఖాధిక్యే స్తపవ వర్గ ద్వితీయ వర్ణాద్యాః" అనుదానిచేత నుపదేశించి యున్నాఁడు.

ఈ స్తంభవిలేఖేత్యాది కారికచేఁ జెప్పఁబడిన యా స్తంభాకార రేఖ లాయావర్ణముల మీఁదను నిల్పవలెనో క్రిందను నిల్పవలెనో యన్న విషయమున నిర్ణయ మాకారికలో స్పష్టముగాఁ జెప్పఁబడకున్నను శ్వాసమునకుఁ బయినె సౌష్మతాదులు వినఁబడుట యనుభవసిద్ధమగుటంజేసి యట్టివానికి గుఱుతులగు నీస్తంభాకార రేఖలను శ్వాసములగు వర్గ ప్రథమముల మీఁదను లిఖించుటయే గ్రంథకృదుద్దేశమై యుండునని తలఁపనగును.

కార ప్రత్యయము చేర్చుట వర్ణపారాయణము చేయుట వర్ణనిర్దేశము చేయుట మున్నగుచోటులం దుచ్చారణార్థకముగ 'అ' కారము హల్లులపై నిల్పుట సంప్రదాయమగుటంజేసి యట్టి 'అ' కారచిహ్నమగు చంద్రవంకవంటి ' ' అనుగుర్తుతోఁ జేర్చి కవర్గమును జూపుచున్నాను. ఉదా: [చిహ్నము]=క ; [చిహ్నము]=ఖ ; [చిహ్నము]=గ ; [చిహ్నము]=ఘ ; [చిహ్నము]=ఙ. ఇట్లె తక్కిన వర్గాక్షరములను లిఖించి కొనునది.

పయి రీతిని వర్గమున కొక్కొక్క యక్షరమును నావఱకున్న దానినె యంగీకరించి తక్కిన వర్గీయాక్షరముల నద్దాని మీఁది స్తంభాకార రేఖల సంఖ్యను బట్టి గ్రహించునట్లు చేసిన యీ యేర్పాటావఱ కాంధ్రకర్ణాటలిపి కలవాటు పడినవారికి సుగ్రహమె యగుటచేత నీనన్నయ రచన మెంతయు శ్లాఘ్యమై యున్నదనక తీరదు.

(౨౬౬)—నన్నయభట్టు కాలమునాఁటికి వాడుకలో నుండెడి దని యంగీకరింపఁ దగియున్న శాసన ప్రసిద్ధమగు నాంధ్రకర్ణాట సాధారణ లిపిలో 'అ' కారాద్యచ్చులు హల్లులపై నిల్చునపుడు మాత్రము చాలవఱకుఁ బై యాకారములతో నున్నను (కొన్ని భేదములు లేకపోలేదు. అకారము నకుఁ బ్రాచీన చిహ్నము '_' అను తిన్ననిగీఁత, అప్పటి మార్పులో '✓' అను చంద్రవంకవంటి గీఁత) నవి ప్రత్యేకముగ నిల్చునపుడు మాత్ర మీక్రిందిరీతిని వేఱువిధములగు నాకారములతో వెలయుచుండెడివి. అట్లె వర్గాక్షరములలో నయుతము వర్గద్వితీయాదులకు వర్గప్రథమములను సంబంధించిన పైని జూపిన కల్పితరూపములకన్న భిన్నములగు నాకారములు వేర్వేఱుగ నుండెడివి.

"[illegible]=అ, [illegible]=ఆ, [illegible]=ఇ, [illegible]=ఉ, [illegible]=ఎ, ఖ=ఖ, [illegible]=గ [illegible]=ఘ, జ=జ, [illegible]=డ, [illegible]=ణ, [illegible]=థ, [illegible]=ద, [illegible]=ధ, [illegible]=న, [illegible]=ఫ, [illegible]=బ, [illegible]=భ, [illegible]=మ," (భారతీయ ప్రాచీనలిపిమాల ౪౮. లిపి పత్రము. ౧౦ శతాబ్దపులిపి) ఏడవ శతాబ్దమునకును బూర్వపుదే యని యెల్లరును నంగీకరించుచున్న శాలంకాయన నందివర్మ పెదవేఁగి శాసన పత్రమునఁ (రక్తాక్షి సంవత్సర శ్రావణమాసపు భారతి. చెన్న. విశ్వ. పుస్త. ౧ వాల్యము - ౧.౨౨ పుట) దక్కిన మఱికొన్ని యక్షరముల యాకృతు లగపడుచున్నవి. "[illegible]=జ, [illegible]=ఫ, [illegible]=ర, [illegible]=ఇ, [illegible]=ఐ"_ ఈ శాసన లిపిలో 'క' కారాదులగు కొన్ని యక్షరముల యాకృతులలో నించుక భేదముగల యాకృతులును నగపడుచున్నవి.

(౨౬౭)—పయిరీతిని వర్గద్వితీయాదులకును బ్రత్యేకముగ నుండెడి యచ్చులకును వేఱు విధములగు చిహ్నములు ప్రసిద్ధములయి యుండుటయే కాక చింతామణికర్త కొన్ని వర్ణములకుఁ జేసిన నవ్యకల్పనము గల యాకారములతో వ్రాయఁబడిన శాసనాద్రిప్రమాణ మొక్కటైనను నగపడదు. కాఁగాఁ జింతామణి కర్త యాంధ్రకర్ణాట భాషలకు సమష్టిగానున్న ప్రాచీన లిపిని గొంత సవరించి యాంధ్రమునకు శ్రేష్ఠమగు ప్రత్యేక లిపిని వెలయింప సమకట్టె ననియు నప్పటి లేఖకు లావఱకున్న యాంధ్రకర్ణాట సాధారణ లిపి కలవాటుపడి యున్నవారగుటచే నట్టి నూతన లిపిని బాటింప రైరనియుఁ జెప్పుటకు సందేహము లేదు. చింతామణి కర్త సంస్కరించిన యా నూతన లిపిలో వర్గద్వితీయాదుల చిహ్నము లావఱకున్న యాంధ్ర

కర్ణాట సాధారణలిపిలోని చిహ్నములకన్న భిన్నములై యున్నను, వర్గ ప్రథమములయు నంతస్థోష్మములయుఁ జిహ్నములు భేదింపక యీ పదవ శతాబ్దపు లిపిలోనివే యైయున్నవి. తరువాత నట్టివానిలోనివగు " ౘ = (చ) = (త) = (ప) = (ర) = (శ) = (హ) = (అ) = (ఈ) = (ఊ) = (ఒ) "—అను నాకృతులు బొత్తిగా మాఱిపోయినవి. అట్లు మాఱిపోవుటచేత నట్టియాకారముల నుత్తరోత్తరాంధ్రలోకము విస్మరించిన దనుటలో సందేహము లేదు. అట్లు విస్మృతములనఁదగిన యీ ప్రాచీ నాంధ్రకర్ణాట నాధారణ లిపిలోని వర్గ ప్రథమములయు నంతస్థోష్మములయు నాకృతులనే యుపపాదించుచున్న చింతామణిలోని లిప్యుద్ధారక శ్లోకము లప్పక వ్యాహోబలపండితాద్యర్వాచీనులచేఁ బ్రక్షిప్తము లయినవని చెప్పుట కెంతమాత్రమును నవకాశము లేదు. ప్రాచీన కాలపు లిపులను గ్రహించుటకుఁ దగిన సదుపాయములు లేని కాలములోనివా రగుటచేతను ముందు వివరింపఁబడుకొనిని నట్టి శ్లోకముల యర్థమునె సరిగ నెఱుఁగనివారగుటచేతను నర్వాచీనులట్టి ప్రాచీన లిపుల యాకారములను జూపెడి కారికలను బ్రక్షిప్తములు చేసిరనుట యెంతమాత్రమును విశ్వసనీయమై యుండనేరదు గదా.

(౨౬౮)—ప్రాచీనమగు నాంధ్రకర్ణాట సాధారణలిపియందుఁ జింతామణికర్త చేసిన సంస్కారము దురదృష్టవశమున వాడుకకెక్కకున్నను నయ్యది మిక్కిలియుక్తమై యున్నదనుటకు సందేహము లేదు.

అచ్చులకుఁ బ్రత్యేకస్థితిలో నొకయాకారమును, హల్లులపయి నిల్చునపుడు వేఱొకయాకారమును నుండుటకన్న నెల్లయెడలను నొక్కధ్వని కొక్కయాకారమే యుండుట యుక్తతరమును లేఖనసౌకర్యకారియు ననావశ్యకలిపి విస్తృతి సంక్షేపకారియు నయి యుండు ననుటకు సందేహ ముండదుగదా. అట్లే హల్లులకును హలంతరసంయోగమున నాకృతిమాఱక యేకరీతినె యుండుటయు మిక్కిలి యుక్తమయి యుండును గదా. అట్లె స్థానప్రయత్నతౌల్యము గల యొక్కొక్కవర్గములోని వర్ణముల కొక్కొక చిహ్నమే ప్రధానమై యుండుటయు నద్దానియం దావేశించిన వర్ణవైశేష్య సంపాదక శ్వాసోష్మతానాదితా ననాసిక్యాదుల కనుమాపకములుగా నట్టి ప్రధానలిపి పైనే స్తంభాకారాది రేఖలను లిఖించుట, వానివానికెల్ల వేర్వేఱుగఁ బ్రత్యేక లిపులుండుటకన్న నెంతయు యుక్తతరమును వర్ణోత్పత్తిచరిత్ర రకమును స్ఫో

సంక్షేపమార్గమును నయి యుండు ననుటలో విప్రతిపత్తి లేదు గదా. ఱకార ధ్వని చింతామణికర్త కాలముననకే డకారముగ వెలయుటచేత నాడకారలిపి చేతను ద్రావిడ మూర్ధన్య ళకారధ్వని సైతము చాలవఱ కలఘు లకారధ్వనికే సన్నిహితమై యుచ్చరింపఁబడుచుండుటచేత మూర్ధన్య ళకారము సైత మలఘు లకారలిపిచేతను గుఱుతింపఁబడుఁగాక యని తలఁచి కావలయును జింతామణికర్త వానికి వేర్వేఱ చిహ్నములను వర్ణింపఁ డయ్యె. ఇంక ఖండ పూర్ణానుస్వారముల "ఁ, ం" అనునాకారములు "సిద్ధ సాధ్య శ్చానుస్వారః । పూర్ణార్ధభేదతో ద్వివిధః । హ్రస్వా తూర్ణోఽపి భవే । దీర్ఘా చ్చే త్ఖణ్డఏవ స జ్ఞేయః" అనెడి (౩౦౮ వి.) సూత్రములోని పూర్ణ శబ్దము చేతను నర్ధ ఖండ శబ్దములచేతను వ్యక్తములు కాఁగలవని తలంచి కావలయును జింతామణికర్త వానిలిపిని వర్ణింపఁడయ్యె. పూర్ణానుస్వారలిపులు రెండిటిని లిఖించినచో విసర్గలిపి యేర్పడుట ప్రసిద్ధమగుటచేత విసర్గాకారమును సైతము వేఱుగ వర్ణింపఁడయ్యె నని యెన్నవగును. అనుస్వారమును బరస్థిత వర్ణము తలపై వ్రాసెడి ప్రాచీనసంప్రదాయ మాంధ్రకర్ణాట సాధారణలిపిలో నన్నయ నాఁటికే మాఱి పూర్వాక్షరమునకుఁ గుడిప్రక్కను వ్రాసెడి యల వాటు వచ్చియుండుటచేతఁ దంత్య చ జ లకును నలఘు రలలకును బొట్టును చజలయు రలలయుఁ దలలపై (అనుస్వారవ్యావర్తకముగా) వ్రాయవలెనని చింతామణికర్త సూత్రించెను.

(౨౬౭)—అనుస్వారలేఖనవిషయమున నద్యతన శాసన పరిశోధకుల యభిప్రాయములు కొన్ని యిచట విమర్శింపఁబడుచున్నవి. "ఈ శాసనములందు నర్ధానుస్వారమును గుఱించి యొక విశేషము కలదు, అది యెప్పుడును బూర్ణానుస్వారముగనే వ్రాయఁబడుచుండెను. తాటాకుగ్రంథములలోఁ గూడ నిట్లే వ్రాయుచుండిరి......ఇటీవలి యాంధ్రవైయాకరణులు అర్ధానుస్వారమునకు 'ఁ' అను గుర్తును గల్పించిరి...... పురాతనశాసనములలో నీగుర్తు కానరా నందునను దీనికి బదులు పూర్ణబిందువే కానవచ్చుచున్నందునను ఈ గుర్తు ఉచ్చారణలో లోపించిన తర్వాత నాంధ్రవైయాకరణులచే వాడఁబడెనని తోఁచుచున్నది." (ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము. ౧ వాల్యము. ౩౮౦ పుట.)

"దీనికి బిందువని పేరుండుటచే నిది మొదటఁ జుక్కగ నుండెను...... అనుస్వారము గీటునకు పైభాగముననే కానవచ్చును. ౧౩ వ శతాబ్దము తరు

వాతను నది గీటుమీఁదనే (గీటుకంటు కొని) వ్రాయఁబడియె. పిదప నక్షర
మునకుఁ బరముగ వ్రాయు నాచారము వచ్చెను......—౧౫ శతాబ్దము
నకుఁ బూర్వము వర్గాక్షరములకుఁ బూర్వము బిందువు నుపయోగించు వారు
కారు. కాని యప్పటి నుండియు 'ఙ ఞ న మ' అను హల్లులకు మాఱుగ వర్గా
క్షరములకుఁ బూర్వము బిందువునే యిప్పటి వఱకు వాడుచున్నారు. కొన్ని
దినముల వఱకు 'ణ' కారమునకు మాఱుగా వ్రాసెడువారు కారు. తరు
వాత దానికి మాఱుగను వాడఁజొచ్చిరి........." (ఆంధ్రవిజ్ఞాన సర్వ
స్వము. ౧ వాల్యుము. ౩౭౮. ౩౭౯ పుట.)

"శాసనములందుఁగాని పూర్వపు వ్రాఁతపుస్తకములందుఁ గాని
యఱ (ర?) సున్న యెచ్చటను గానరాదు. అది యుండవలసినచోటఁ గూడ
నిండు సున్నయే కనఁబడుచున్నది. ప్రాచీన శాసనములలో నిండు సున్నకు
బదులు వర్గాంత్యానునాసికాక్షరములు కనఁబడుచున్నవి. అనఁగా—కట్టిఞ్చి,
తమ్ముణ్ణు, అన్తహేనియు, ఫలమ్ము, ఇత్యాదిరూపంబులు కనఁబడుచున్నవి.
దీనినిబట్టి చూడఁగాఁ దెనుఁగులో ననుస్వారమని వాడఁబడుచున్నది.
వర్గాన్త్యానునాసికాపరరూపమనియు అది తొలుత ననునాసికాక్షరము
గనే వ్రాయఁబడు చుండి కొంతకాలమైన పిదప సౌకర్యార్థము బిందురూప
ముగ వ్రాయఁబడెననియు......" (శాసన పద్యమంజరి-పీఠిక IV పుట.)

"అనుస్వార పూర్వాక్షరము పెక్కు తావుల ద్విగుణీకరింపఁబడినది.
అట్లు కానిచోటులునుం గలవు." (శాసన పద్యమంజరి. పీఠిక. VI పుట).

(౨౭౦)—ఈకాలపుశాసన పరిశోధకులలో నగ్రగణ్యులగు కె. వి.
లక్ష్మణరావుగారును, జయంతి రామయ్యపంతులవారును నిట్లు వ్రాయుట
చాల వింతగ నున్నది. ఇట్లు వ్రాసిన లక్ష్మణరావుగారే యుదాహరించిన
విజ్ఞాన సర్వస్వమునందలి యాసందర్భములోనిదేయగు (౩౭౬ పుటకుఁ
దర్వాత) ౧౨౩౧ క్రైస్తవాబ్దపు కాకతి గణపతి శాసనపుఁ బ్రతిబింబము
నం దెల్లయెడలను ననుస్వారము పూర్వాక్షరమునకుఁ బరమందె వెలయు
చున్నది గాని గీటుమీఁదను గాని గీటునకంటి గాని యెచ్చటను నుండలేదు.
వర్గాక్షరములకుఁ బూర్వమం ("దానన్తి, కాన్త, సమన్తాత్" అను మూడు
చోటులు మాత్రము తప్ప) దెల్లెడలను ననుస్వారమె లిఖింపఁబడియున్నది.
"శ్రీకాంతా (౧ పంక్తి) బ్రహ్మాండఖండే (౪ పంక్తి) శంభోః (౫ పంక్తి)
గంగా (౭ పంక్తి) కించన్యేషు (౨౬ పంక్తి)" మున్నగు చోటులందెల్ల

నందు బిందువులె వ్రాయఁబడియున్నవి. ఆ సందర్భముననే చూపఁబడిన నందంపూడి (క్రీ. శ. ౧౦౫౩) శాసనపుఁ బ్రతిబింబమునం దెచ్చటను బిందువు లిఖింపఁబడి యుండలేదు. దాని చోట ననునాసికములె వ్రాయఁబడినవి. ఈ శాసనములో నంతటను విసర్గముల బిందువులు బొట్టులుగానే యున్నను 'ఐశాన్యతః' (౭ పంక్తి) అనుచోటఁ బూర్ణచంద్రాకారముగ నున్నవి. తొమ్మిదవ శతాబ్దములోనిదగు నద్దంకి తరువోజ శాసనమునందును బిందువులు పూర్ణచంద్రా కారములుగనె యున్నవి. (శాసనపద్యమంజరి. 1929 సంవత్సరపు భారతిలో సైత మీశాసనపుఁ బ్రతిబింబము గలదు.) యుద్ధమల్లుని బెజవాడ శాసనపుఁ బ్రతిబింబమునందుఁ గొన్ని యెడల ననుస్వారము చోట బొట్టులె యగపడుచున్నను గొన్ని యెడలఁ బూర్ణచంద్రాకారపు సున్నల వ్రాఁత యగపడుచున్నది. అశ్వమేధంబు (౧౮ పంక్తి) మఠంబును (౨౫ పంక్తి); దానుం గట్టించె (౪౦ పంక్తి) అమరంగ (౪౩ పంక్తి); ఇబ్లేమూఁడవ రేకులోని యస్పష్టశాసన భాగ ప్రతిబింబములోని పెక్కు చోటులందలి బిందువులు '౦' అను రీతిని బూర్ణ చంద్రాకారముగనె యగపడుచున్నవి. దీనినిబట్టి నన్నయభట్టారకునకుఁ బూర్వకాలమందె బిందువునకు బొట్టుయొక్కయాకారము పోయి పూర్ణ చంద్రాకారము వచ్చినదనియు, లేఖన సౌకర్యమునకయి యది బొట్టుగఁ గొన్ని యెడలఁ బడుచు వచ్చెననియు నక్కారణముచేతనే నిండు సున్నను బూర్ణమనుచును, నరసున్నను ఖండమనుచును నాతఁడు వాడెననియు గ్రహింపవలయును. అట్లయినను బ్రాచీనకాలమునందు శాసన ప్రతిబింబములలోఁ బెక్కుచోటుల బొట్టుల యాకారములును నగపడుచుండుటంబట్టి యనుస్వారమునకు బిందుశబ్దమును యాథమై నిల్చిపోయెనని గ్రహింపనగును.

పయిని వివరించిన నందంపూఁడి శాసనమున నర్ధానుస్వార ముండఁదగిన చోటులం దొక్కచోటనైన బిందువుగాని దానికిఁ బ్రతియగు వర్గపంచమము గాని లిఖింపఁబడి యుండలేదు.

౧ పంక్తి. "ఇయ్యూరియు బిల్లెమ... నెరపులయు బొలగరుసు."

౨ పంక్తి. - "నెరపులయు బొలగరుసున."

ఇట్టిచోటులం దెల్ల నేబిందువును నగపడదు. కాని యాయాచోటులందు నేఁటి తెనుఁగుతో వ్రాసి చూపుటలో మాత్రము లక్ష్మణరావుగారు పూర్ణ బిందువులను వ్రాసియున్నారు.

అల్లి యుద్ధమల్లుని బెజవాడ శాసనపు ప్రతిబింబమునందును (క్రీ. శ. ౯౦౦) నర్ధానుస్వార ముండఁదగినచోటులం దేబిందువుయొక్కయుఁ జిహ్నము లగపడవు. రామయ్యపంతులుగారు మాత్ర మట్టి చోటులలోఁ గొన్నిట నేఁటి తెనుఁగుతో వ్రాసి చూపుటలోఁ బూర్ణబిందువును వ్రాసిరి.

"పరగగ, (౭ పంక్తి); బెజవాడ గొమరస్వామికి (౭ పంక్తి) విడిసిన బ్రోలగల (౧౫ — ౧౬ పంక్తులు) చేబ్రోలు (౨౨ పంక్తి); ఇచ్చుగని (౨౭ పంక్తి); దీని జేబ్రోలు (౨౯ పంక్తి; ఒడబడి (౪౬)."

దీనినిబట్టి యానాఁటి లేఖనమున నరసున్నను వ్రాసెడి యలవాటు లేదని విశదమగుచున్నది. అట్లయినను నీ శాసనమున మఱికొన్ని యెడల బిందువులును బిందు స్థానీయ వర్గపంచమములును నుండుటం జూచియు వేఱు శాసనములలో బిందువునకుఁబరమందలిహల్లులకు ద్విత్వలేఖనము కొన్నిటఁ జూచియు బిందు పూర్వక హల్లు ద్విరుక్తముగ వ్రాయఁబడు సంప్రదాయ మాదినుండియుఁ గలదని భ్రమించినవారగుటం జేసి శాసన పరిశోధకు లా నిండుసున్న లున్నచోటులెల్ల నరసున్నలుండు చోటు లనుకొనుచుఁ బయి రీతిని వ్రాయసాగిరని తోఁచుచున్నది. నన్నయకాలము వఱకుఁ గల శాసనములం దెచ్చటను నిండు సున్నకుఁ దర్వాతి హల్లును ద్విరుక్తముగ వ్రాయు సంప్రదాయ మగపడదు. అట్టి సంప్రదాయ మర్వాచీన శాసనాదులలోను దాళపత్రమాతృకలలోను నుండుటను జూచి యెల్ల యెడలను నాదినుండియుఁ గలదనుట సత్యవిదూర మనక తీరదు. ఇట్టి యర్వాచీన లేఖనము తన కాలము నాఁటి తాళపత్రమాతృకలలో సైతము వెలసియుండుటను జూచియె యప్పకవి యీ క్రిందిరీతిని నిరసించి యుండెను.

కం॥ వల బొట్టులపై వర్ణం
బులు క్రిందట నవియె మరల మూఢమతులు జ
డ్డలు చేసి వ్రాయుచుందురు
విలిఖింపరు వాని రెండు ద్విత్వము లార్యుల్॥

ఆ॥ వె॥ హల్లుమీఁదనున్న హల్లు దానికి ద్విత్వ
మొందుఁగాని వేఱె యొకటఁగాదు
సంధివేళ నది విచారించి వ్రాయుచోఁ
బాపరెందు దానిఁ బ్రాజ్ఞులెల్ల॥

(అప్పకవీయము ౨. ఆ. ౪౫. ౪౬.)

ఇఁక యుద్ధమల్లుని శాసనములో వ్రాయఁబడియున్న యనుస్వారములు పూర్ణములె గాని యర్ధములు కావు. అచటఁ బూర్ణములున్నను నర్ధములున్నను ఛందోభంగము లేదు. కాన నవి ఖండములకు బదులుగ వ్రాయఁబడిన వనెడి శాసన పరిశోధకుల యభిప్రాయము సరికాదు. తెలుఁగు నందలి యక్కరల యింద్ర గణములలో మగణ సగములును, సూర్య గణములలో గగ సగణములును నుండెడివి. ఇందులకు బెజవాడ శాసనాక్కరల లోని 'భూవల్లభుం డత్తిఁన్' 'కొమరస్వామికి' 'గొరగల్గాక' అను స్థలములు ప్రబలసాక్ష్యము నిచ్చుచున్నవి.

ఆ॥ వె॥ "ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల
నైన గణము లిన సురాధిపేందు
గణము లక్షరోప కరణంబు లవి యాది
లఘుగణంబు మొదల లఘువు నిలుప॥"

(కావ్యాలంకారచూడామణి. ౮ ఉల్లాసము.)

అను ప్రాచీనాక్కరల గణములను దెలుపు పెద్దిరాజు పద్యము సైతము పై విషయమునఁ బ్రబల నిదర్శనమగుచున్నది. కవి జనాశ్రయము నందు నిట్లె చెప్పఁబడెను. తెల్గులోని యిట్టి యినేంద్ర గణములకు మాఱుగ నున్న కర్ణాటములోని బ్రహ్మవిష్ణు గణము లెల్లపద్య జాతులందును నిట్టి స్థితితోనె యున్నవి. ద్వితీయ తృతీయ చ్ఛందః ప్రస్తారసిద్ధ గణములలో మొదటి యొకటి రెండు గణములను విడిచి తక్కినవానిని మాత్ర మినేంద్ర గణములనుగా గ్రహించు సంప్రదాయ మప్పకవీయమునాఁటికి వెలసినది. కాఁగా బెజవాడ శాసనాక్కరలలోని యీక్రింది చోటులందలి పూర్ణానుస్వారములను వానికి మాఱుగ నుండు ననునాసికములను ఖండానుస్వారములనుగా గ్రహింప నక్కఱలేదు. (చూ. 'ఉపగణములు' అను నావ్యాసము. ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు జర్నలు యువ సంవత్సరాది సంచిక.)

"విస్తర, శ్రీ యుద్ధ, మల్లు, ణ్డనవద్య, విఖ్యాత, కీర్త్తి, (3 పంక్తి)

"... రక్షయుంగాను న్దమతాత మల్లపరాజు, వేరెఱు, దానుం గట్టించెం గ్రమంబున" ౩౮—౪౦ పం)

పయిరీతినె, మఠంబు (౬ పంక్తి), త్రిణయను, సుతుణ్డొణ్డు (౨౧ పంక్తి), మఠంబును (౨౫ పంక్తి), అను చోటులందు నయిత మాకాలపు

టక్కరల గణముల వేఱు విధమగు పై లక్షణముచేత నిర్బాధముగ సమర్థింప నగును. ఈ మూఁడు స్థలములనుబట్టి బెజవాడ శాసన రచయిత కం॥ "ఒక గురువు రెండు లఘువులు। నకలంకత సమమ కాన..." (కావ్యాలంకార చూడామణి. ౯ ఉల్లాసము.) అను ఛందస్సంప్రదాయము ననుసరించి గగ తుల్యమగు జగణమును నినగణముగను, మగణ తుల్యములగు యలమును జలమును నింద్రగణములుగను నంగీకరించెనా యని యాలోచింపవలసి యున్నది. లేదా ప్రస్తరింపఁబడిన ద్వితీయ తృతీయచ్ఛందముల గణములలో నన్నిటికిని మొదట నొక లఘువు చేర్చి యినేంద్రగణములనుగ వాని నంగీ కరించియుండునా యని యైన నాలోచింప నగును. (చూ ౩౮౮ విష.)

పయిరీతినున్న ప్రాచీనకాలపుటినేంద్ర చంద్ర గణముల స్వరూపమును గ్రహింపక యాయాచోటులందలి పూర్ణబిందువులను దేల్చి యర్ధబిందువులుగఁ బలుకవలెననుచు శాసనపరిశోధకు లర్వాచీనములగు నినేంద్రగణములతో గుదురుపాటుచేయ యత్నించుట యుక్తముకాదుగదా. ఎన్ని లేనిపోనిదారులు ద్రొక్కినను 'గొరగల్లా, అర్థిన్, కొమర (స్వా)' అనుస్థలములు నా చెప్పిన గణముల నంగీకరింపనిచోఁ గుదురుపాటు కానేరవు గదా.

మఱియు 'నొకరీతిని వ్రాయుట వేఱొకరీతిని జదువుట, అనుపద్ధతి నన్నయకాలమువఱకుఁ గల ప్రాచీనశాసనములలో నగపడదు. తర్వాతివా రట్టి ఛందోవిశేషములను గ్రహింపఁజాలక వానియందట్టి యపమార్గములు గలవని భ్రమించి యట్టియపమార్గములతో వ్రాసిన వ్రాసి యుండవచ్చును.

బెజవాడ శాసనమునందు "పరగంగ (౭పంక్తి;) ఫలం బుపేక్షి (౧౪ పంక్తి); నుం గార్తికేయునకు (౨౬ పంక్తి); దీనిం జేబ్రోలు (౨౬ పంక్తి); ఒడంబడి (౩౬ పంక్తి);" అని యిట్లు ప్రతిబింబమున లేని బిందువులు రామయ్యపంతులవారు వ్రాసి చూపుటకుఁ గారణమేమో తెలియకున్నది.

కేవలప్రాచీనమగు శాలంకాయన నందివర్మ శాసనమునందుఁ బదమధ్యమందలి యనుస్వారమునకు బదులుగా వర్గాక్షర పరకత్వమునఁ దత్తద్వర్గ పంచమాక్షరము లెల్లెడలను వ్రాయఁబడియున్నవి. అట్టివర్గపంచ మములు పరమందున్న వర్గాక్షరములతో సంయుక్తములుగ వ్రాయఁబడి యున్నవి. పదమధ్యేతరస్థలములందును వర్గేతరాక్షర పరకస్థలములందును బిందువులే లిఖింపఁబడియున్నవి. అట్టిబిందువులు పరాక్షరముల తలపై వ్రాయఁ

బడియున్నవి. (రక్తాక్షి సంవత్సర శ్రావణ భారతి. చెన్న, విశ్వ, పుస్త, ౧ వాల్యుము. ౧౨౨పుట) ఇయ్యది సంస్కృతభాషామయమగు శాలంకాయన నందివర్మ పెదవేఁగిశాసనము. ఏడవ శతాబ్దము నాఁటిది. ఇట్టే ప్రాచీనశాసనముల లేఖనము వెలయుచున్నది. వీనిలోఁ బదమధ్యమున వర్గాక్షర పరకత్వమున మాత్రము 'అనుస్వారస్యయయి పరసవర్ణః' అను పాణిని సూత్రము చొప్పున బిందువుచోట ననునాసికము వ్రాయఁబడి నంత మాత్రమునఁ దక్కినచోటులం దెల్ల బిందువులే యుండఁగా బిందువునకుఁ బ్రథమమున స్థితియే లేదనుట యుక్తమా? కాలక్రమమున 'కపవర్గ' పరకబిందువులును నింకను గొన్నాళ్లకు 'కచప' వర్గ పరకబిందువులును' బద మధ్యమునందు సైతము బయలు వెడలలేదా ?

యుద్ధమల్లుని బెజవాడశాసనమునందు 'ట త' వర్గాక్షరములకుఁ బూర్వమందున్న బిందువు మాత్రమే తత్తద్వర్గ పంచమములతో వ్రాయఁబడెనుగాని తక్కిన మూఁడువర్గములకును బూర్వమందున్న బిందువు తత్తద్వర్గ పంచమాక్షరరూపమున లిఖింపఁబడి యుండలేదు. ఆలిఖింపఁబడిన బిందువులు సైతము గొన్నియెడలఁ బరాక్షరముల తలపైని, గొన్నియెడలఁ బూర్వపరాక్షరముల నడుమను లిఖింపఁబడి యున్నవి. అట్లుతలపై వ్రాయఁబడుటలో సైతము పూర్వాక్షరమును జేరవలసిన యాయనుస్వారము పరాక్షరము తలపై (సంయోగము వంటిది గాన) లిఖింపఁబడుచు వచ్చెను. 'మఠంబు' (౧౦. పంక్తి.). ఇందలి బిందువు 'ఠబు' అను వానినడుమ నున్నదిగాని వానిలో దేనితలమీఁదను లేదు. 'వెలయఁగ' (౧౪ పంక్తి.). ఇందలి సున్న గకారము తలమీఁద నున్నది. 'వెల్వఁజించిన' (౧౬ పంక్తి.). ఇందలి సున్న 'జిచి'అను వానినడుమనే యున్నదిగాని దేనితలమీఁదను లేదు. 'లింగ' (౧౭ పంక్తి.). ఇందలి సున్న 'లిగ' అను వానినడుమనే యున్నది.

రాజనరేంద్రుని కోరుమల్లిశాసనములో (క్రీ. శ. ౧౦౨౨.) "క చ ప" వర్గాక్షరపరకత్వమున బిందువే వ్రాయఁబడియున్నది. అయ్యది పూర్వపరాక్షరముల నడుమనే వ్రాయఁబడి యున్నదిగాని దేనితలమీఁదను వ్రాయఁబడియుండలేదు. ఉ. పం·కరుహ=పంకరుహ' పదునొకొండవ శతాబ్దము నాదియందే కచప వర్గ పరకత్వమున బిందువే వ్రాయఁబడుటయు నయ్యది పూర్వపరాక్షరముల నడుమ వ్రాయఁబడుటయు వెలసియుండఁగా బదుమూఁడవ శతాబ్దమునకుఁ దర్వాత బిందువు పూర్వాక్షరమునకుఁ బరముగ

వ్రాయఁబడు నాచారము వచ్చినదనియుఁ బదునేనవ శతాబ్దము వఱకును బిందువు వర్గపంచమరూపముననే వ్రాయఁబడెడిదనియుఁ జెప్పుట యెంత మాత్రమును సరికాదుగదా.

ద్వితీయ కులోత్తుంగచోళ దేవుని పాండువగ్రామ శాసనమునందు (ఇండియన్ ఏన్‌టిక్వెరీ. ౧౮ నెంబరు ౫౭ పుట) 'క త ప వర్గ' పరకత్వముననే కాక ట త వర్గ పరకత్వమునందును ననేకస్థలములలో బిందువే వ్రాయఁబడియున్నది. అందును 'త' వర్గ పరకత్వమున సంస్కృత పదమధ్యమునందును బిందువే పెక్కుచోట్ల వ్రాయఁబడియున్నది. ఉ. వల్లభేంద్ర (౧ ఱేఁకు. ౯ పంక్తి); చంద్ర-(౩ ఱేఁకు పెడప్రక్క ౮ పంక్తి;) గుంట (౫ ఱేఁకు) ఇది పెక్కుచోట్లఁ గలదు.

పయిసందర్భమునుబట్టి పండ్రెండవ శతాబ్దము నాఁటికే సకల వర్గ పంచమాక్షర పరకత్వమునందును బిందువు ధారాళముగ లిఖింపఁబడెడి యాచారము వచ్చె ననక తీరదుగదా.

ఈసందర్భమున నాంధ్రలిపి స్వరూపము దిఙ్మాత్రముగ 'భారతీయ ప్రాచీనలిపిమాల, యాంధ్రవిజ్ఞాన సర్వస్వము, బర్నలుదొరగారి దక్షిణ హిందూదేశ లిపిశాస్త్రము' అనువానినుండియు నీక్రింది కొన్ని శాసనముల నుండియు సంగ్రహించి వ్రాయఁబడుచున్నది.

రక్తాక్షి సంవత్సర (క్రీ. శ. ౧౯౨౪) శ్రావణ భారతిలో (చెన్న. విశ్వ. పుస్త. ౧ వాల్యు. ౧౨౨ పుట) నయిదవ శతాబ్దపు (కొందఱేడవ శతాబ్దపు దందురు) శాలంకాయన నందివర్మ పెదవేఁగి శాసనము గలదు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక యెనిమిదవ వాల్యమునఁ (చెన్న. విశ్వ. పుస్త). బదవశతాబ్దపు యుద్ధమల్లుని బెజవాడ శాసనపుఁ బ్రతిబింబము గలదు. ఇండియన్ ఏన్‌టిక్వెరీ పదునాల్గవ వాల్యమున నేఁబదవపుటలోఁ గోరుమల్లి శాసనపుఁ (క్రీ. శ. ౧౦౨౨) బ్రతిబింబము గలదు. ఇందే కులోత్తుంగ చోళదేవుని (క్రీ. ౧౧౩౪) పాండువగ్రామశాసనపుఁ బ్రతిబింబమును గలదు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక రెండవవాల్యమున "పభుబజ్జు" (క్రీ. ౧౦౦౩) శాసనప్రతిబింబము గలదు.

అందుఁ బెదవేఁగి శాసనములో(౭శతాబ్దపుది) హల్లుతలమీఁది 'అకార' చిహ్నము '-' తీసివేయఁగాఁ బొల్లహల్లుయొక్కయు సంయోగములోని

పరహల్లుయొక్కయుఁ జిహ్నమేర్పడుచు వచ్చెను. ‖ = మ్. ౕ=ట్. నేఁటిపొల్లు గుఱుతు కేవల మర్వాచీనము. పై శాసనమున హల్లులకు గుణితములోను బ్రత్యేకస్థితిలోను నాకారభేదము లేదు. ఎ ఏ లకును, ఒ ఓ, లకును ద డ లకును బరస్పరభేద మగపడదు. పదమధ్యమునందు వర్గాక్షరములు పరమగునపుడు మాత్రము బిందువు తత్తద్వర్గ పంచమరూపమున నున్నది. తక్కిన యెల్ల యెడలను బిందువే వెలయుచున్నది. ఆ బిందువు పూర్వాక్షరము తలపై వ్రాయఁబడియున్నది. ఈ శాసనమునఁ గల 'Ŧ' అను నాకారమే నేఁటి 'ꝁ=క' అను లిపికి మూలము కానోపును. '✝' అనునాకృతియె నేఁటి కావడికిని (ర) మూలము కానోపును. '( ౚ' అను తకారరూపమే నేఁటి తావడికి మూలము కానోపును. పై శాసనములోని 'ᔕ' అను నకారాకారమే నేఁటి నావడికి (౨) మూలమనఁ దగును. 'న ' అను నకారాకారము మీఁది 'ఁ' కార చిహ్నము పోఁగా మిగిలిన 'ప, అనునది నకారలిపికి భిన్నముగా నుండుటకయి దాని నర్వాచీనులు 'న్' అని వ్రాయసాగిరి. ఇట్లే పావడితోడి భిన్నతకై '౨' అను నేఁటి నావడి యేర్పడియుండును. పెదవేఁగి శాసనములోని '‖' అను మకార వ్యంజనపు చిహ్నము నేఁటి మావడికి (--ు) మూలము కానోపును. ఈ శాసనములోని లకారమునందలి (ఙ) క్రిందిభాగమే నేఁటి లావడికి మూలము కానోపును. ప్రాచీనరేఫరూపమే (U) నేఁటి క్రావడికి మూలము కానోపును.

| నేటి తెలుగులిపి | అశోక శాసనలిపి | బ్రాహ్మీలిపి | నేటి నాగరలిపి | నేటి తమిళలిపి | నేటి కర్ణాటలిపి | ౫ శతాబ్దపుతెలుగు నందివర్మ పెదవేగి శాసనలిపి | ౧౦ శతాబ్దముతెలుగు బెజవాడ శాసనలిపి | ౧౦౭౩ క్రీ. శక్తివర్మ పథుపల్లి శాసనలిపి | ౧౦౭౪ క్రీ. రాజరాజు కోరుమల్లి శాసనపు లిపి | ౧౧౩౪ క్రీ. పాంబవ గ్రామ శాసనలిపి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | 𑀅 | 𑀅 | अ | அ | ಅ | అ | అ | అ | | అ |
| ఆ | 𑀆 | 𑀆 | आ | ஆ | ಆ | ఆ | ఆ | | ఆ | ఆ |
| ఇ | 𑀇 | 𑀇 | इ | இ | ಇ | | ఇ | ఇ | | ఇ |
| ఈ | 𑀈 | 𑀈 | ई | ஈ | ಈ | | ఈ | | ఈ | ఈ |
| ఉ | 𑀉 | | उ | உ | ಉ | | ఉ | ఉ | ఉ | ఉ |
| ఊ | | | ऊ | ஊ | ಊ | | | | | |
| ఋ | | | ऋ | | ಋ | | | | | |
| ౠ | | | ॠ | | ೠ | | | | | |
| ఌ | | | ऌ | | ಌ | | | | | |
| ౡ | | | ॡ | | ೡ | | | | | |
| ఎ | | | | எ | ಎ | ఎ | ఎ | | | |
| ఏ | 𑀏 | 𑀏 | ए | ஏ | ಏ | | | ఏ | | |
| ఐ | | | ऐ | ஐ | ಐ | | | | | |
| ఒ | | | | ஒ | ಒ | | | | | |
| ఓ | 𑀑 | 𑀑 | ओ | ஓ | ಓ | | | | | |
| ఔ | | | औ | ஔ | ಔ | | | | | |
| క=క | 𑀓 | 𑀓 | क | க | ಕ | క | క | క | క | క |
| ఖ | 𑀔 | 𑀔 | ख | | ಖ | ఖ | ఖ | ఖ | ఖ | ఖ |
| గ | 𑀕 | 𑀕 | ग | | ಗ | గ | గ | గ | గ | గ |
| ఘ | 𑀖 | 𑀖 | घ | | ಘ | ఘ | ఘ | ఘ | ఘ | ఘ |
| ఙ | 𑀗 | 𑀗 | ङ | ங | ಙ | ఙ | | | | |
| చ | 𑀘 | 𑀘 | च | ச | ಚ | చ | చ | చ | చ | చ |

(౨౭౧)—వెనుక నుదాహరించినరీతిని బైనివ్రాసిన యాంధ్రకర్ణాట సాధారణలిపిని సంస్కరించి యాంధ్రమునకుఁ బ్రత్యేక లిపిని నన్నయభట్టారకుఁడు గల్పించినను నయ్యది వాడుక కెక్కలేదనియు నన్నయభట్టునకు ముందును వెనుకను నాంధ్రకర్ణాట సాధారణలిపియే వాడుకలో నిల్చెననియుఁ బై నుదాహరించిన శాసనముల లిపులవలన విశదమగుచున్నది గదా. ఎంత యుక్తమయినదియైనను మార్పు జనసామాన్యముచే నంగీకరింపఁబడకుండుటయుఁ బ్రాఁతపద్ధతియే యవలంబింపఁబడుచుండుటయుఁ గ్రొత్తవిషయములు కావు.

నన్నయభట్టు తలంచిన ఖండానుస్వార చిహ్నము కాలక్రమమున ముద్రణములలో వాడుక కెక్కినది. దంత్య చ జ లకుఁ దాలవ్య చ జ లపై నన్నయభట్టు చెప్పినట్లు బొట్టు నిడకున్నను నర్వాచీనులు '౹' అను చిహ్నమును వ్రాయుట గలదు. దీనిని నయిత మంతటను వ్రాయు నలవాటు లేదు. ఇయ్యది దంత్యమగు తకారముయొక్క గుణితములోని నేఁటి యాకారమని యెన్నఁ నగును.

నన్నయభట్టారక కల్పిత నూతన చిహ్నములు శాసనాదులను వ్రాసెడి జనసామాన్యపు వాడుక కెక్కకున్నను నాకాలపు పండితుల యెఱుకలో నుండెడివని చెప్పవచ్చును. కావుననే యట్టి నన్నయ భట్టారకలిపి నీక్రిందిరీతి నథర్వణాచార్యుఁ డించుక సవరించుట తటస్థించెను. నన్నయభట్టారకలిప్యాధారక కారికలలో వర్గద్వితీయాదుల యాకారములు "స్తమ్భ విలేఖాధిక్యే స్తపవ వర్గద్వితీయ వర్ణాద్యాః" అను రీతిని జెప్పఁబడెను. అట్లే యర్ధానుస్వార పూర్ణానుస్వార చిహ్నములు వేఱుగఁ జెప్పఁబడక ఖండపూర్ణ శబ్దములచేతనే సూచింపఁబడెను. కాన నట్టివానినెల్ల నథర్వణుఁడు కొన్ని సవరణములతో లెస్సగా నీక్రిందిరీతిని వివరించెను.

ప్రాచీనతమకాలమున 'అ' కారచిహ్నమగు తలకట్టు హల్లులమీఁద '–' అను నాకారము గలదిగ వ్రాయఁబడు సంప్రదాయ ముండెడిది. అట్టి సంప్రదాయము నన్నయనాఁటికే మాఱుట కారంభించెను. నన్నయనాఁటికే తలకట్టు '✓' అనురీతిగ వ్రాయువాడుక వచ్చినది. నన్నయభట్టారకుఁడే యట్టి మార్పు నంగీకరించి 'అ' కారచిహ్నమే తలకట్టు గాన నదిబాలచంద్రాకారముగ నుండునని బాలేందు పరిధీత్యాదికముచే నుపదేశించి యున్నాఁడు.

వికృ— పఞ్చ వర్గాదయో వర్ణా। శృఙ్గశార్ఙ్గాదిసన్నిభాః

తిర్యగ్రేఖాయుజశ్చోర్ధ్వం। దణ్డరేఖాన్వితా అధః॥

తఏవచ ద్వితీయాః స్యుః। రూర్ధ్వరేఖా ద్వికాన్వితాః॥

ప్రథమాస్తు తృతీయాః స్యుః। స్తృతీయాస్తే చతుర్థకాః॥

రేఖాద్వయాధోదణ్డేన। యుక్తాః స్యు రనునాసికాః॥

మిళద్దణ్డ ద్వయోపేతాః। ప్రథమా లిపయః స్మృతాః॥

పూర్ణేన్దు సదృశః పూర్ణ। స్త్వర్ధ స్త్వర్ధేన్దు సన్నిభః॥

---

(౨౨౩)—వ్యాఖ్య :-పంచవర్గాదయ ఇత్యాది-శృఙ్గశార్ఙ్గాది సన్నిభాః = నన్నయ భట్టారకుఁడు దరశార్ఙ్గేత్యాది కారికలచే వర్ణించిన శృఙ్గ శార్ఙ్గాదులతో సమానమైన పరుసములు యాకారములు, ఊర్ధ్వం = పై భాగమున, తిర్యగ్రేఖాయుజశ్చ = అడ్డు రేఖతోఁ గూడినవియు నగుచు, వర్గాదయః = పరుషములగు కాది వర్గముల ప్రథమాక్షరములైన, పఞ్చ వర్ణాః = అయిదు వర్ణములును (అగుచున్నవి). తఏవ = ఆ వర్గ ప్రథమములె, అధః = క్రిందను, దణ్డరేఖాన్వితాః = దండాకార రేఖతోఁ గూడినవగుచు, ద్వితీయాః = కాదివర్గముల ద్వితీయములు, స్యుః=వరుసగ నగును. ([illegible] = ఖ్ ; [illegible] = ఛ్ ; [illegible] = ఠ్ ; [illegible] = థ్ ; [illegible] = ఫ్ ;). ఊర్ధ్వరేఖా ద్వికాన్వితాః = తలమీఁద రెండు తిర్యగ్రేఖలతోఁ గూడిన, ప్రథమాస్తు = కాదివర్గముల మొదటి వర్ణములె, (ఆ వఱకుఁ బొల్లుహల్లగుటను సూచించు రేఖ యుండఁగా నాదితా సూచకమగు మఱొక రేఖయు నూర్ధ్వమున నుండు ననుట) తృతీయాః = తత్తద్వర్గతృతీయ వర్ణములు, స్యుః = అగును. [illegible](=గ్ ; [illegible] = జ్ ; [illegible] = డ్ ; [illegible]=ద్; [illegible]=బ్ ;). తే తృతీయాః=ఆ వర్గతృతీయ వర్ణములె, రేఖాద్వయాధోదణ్డేన = ఆ వఱకుఁ దలమీఁద నున్న రేఖాద్వయమునకుఁ దోడుగాఁ గ్రింద నొక దండాకార రేఖతో, యుక్తాః = కూడినవగుచు, చతుర్థకాః = ఆయావర్గుల చతుర్థవర్ణములు, స్యుః=అగును. ([illegible]=ఘ్ ; [illegible]=ఝ్ ; [illegible]=ఢ్; [illegible] = ధ్; [illegible] = భ్;) ప్రథమాః లిపయః = కాదివర్గముల ప్రథమాక్షర చిహ్నములు, మిళద్దండద్వయోపేతాః=కలిసికొన్న దండాకార రేఖల ద్వికముతోఁ గూడికొన్నవై, అనునాసికాః=ఆయావర్గుల యనునాసికాక్షరములుగా, స్మృతాః = చెప్పఁబడును. ([illegible]=ఙ్ ; [illegible]=ఞ్ ; [illegible] = ణ్ ; [illegible] = న్; [illegible] = మ్). కాదివర్గులు 'అ' కారాది స్వరవిశిష్టము లగునపుడును నిట్టి వర్ణమై

శేష్య చిహ్నములను 'అ' కారాదుల గుఱుతులగు బాలచంద్రా కారాదులపై నిలుపవలెనని యెన్నునది. పూర్వోక్త కారికయందు 'అ' కారవిశిష్టకవర్గ మీరూపం బడుచున్నది. ≈ క; ≈ ఖ; ≈ గ; ≈ ఘ; ≈ ఙ. పూర్ణేందు సదృశః = పూర్ణచంద్రునివంటి యాకారముగలది, పూర్ణః = పూర్ణబిందు లిపి యగును. (౦); అర్ధేందు సన్నిభః=అర్ధ చంద్రాకారము గలది, అర్ధః = ఖండబిందు చిహ్నమగును. (ఁ).

(౨౭౮)—ప్రాచీన శాసనములలో నాయా వర్ణముల తలకట్టు గీఁత ( - ) తీసివేయుటచేతనే వాని వాని పొల్లులకు గుఱుతు లేర్పడుట ప్రసిద్ధమై యుండెడిది. (నందివర్మ పెదవేఁగి శాసనమున నిట్లున్నవి — = త్; = న్; = మ్. యుద్ధమల్లుని శాసనమున - ౭ పంక్తి = న్.). కాని నన్నయభట్టుకాలమునాఁటి కట్టి పొల్లులపై నద్దుగీఁత గీయుటయు ననెడి వాడుక రాసాగె ననక తీరదు. లిపిసంస్కరణకాలమువాఁడగు నన్నయ భట్టారకుఁ డట్టి పొల్లుగుఱుతగు తిర్యగ్రేఖను వ్రాయని ప్రాచీన పద్ధతియే యనఁగా తలకట్టు గీఁత వ్రాయమానెడి పద్ధతియె యుక్తమును సంక్షిప్తతరమును నయియుండునని తలంచి కావలయును నట్టితిర్యగ్రేఖాలేఖనమును బొల్లు గుఱుతుగా నుపదేశింపఁడయ్యెను. ఇంకఁ బ్రాచీన పద్ధతి చొప్పునఁ దలకట్టు గీఁతలేని యా యా వర్గ ప్రథమాక్షర లిపులనే దరశాగ్రేత్యాది కారికచే నుపదేశించియుండెను. నన్నయభట్టాభిప్రేతములగు పొల్లులగు పరుషముల యాకారములివి:- =క్, =చ్, =ట్, =త్; =ప్; బాలేందు పరిధీత్యాది కారిక చొప్పున హ్రస్వాకారరేఖయగు బాలేందు చిహ్నముతోఁ గూడిన నన్నయాభిప్రేత పరుషాక్షరాకారము లివి— = క, చ; =ట; = త; = ప.

అథర్వణాచార్యుని నాఁటికిఁ బొల్లులకు గుఱుతుగాఁ బ్రాచీనపు హల్లుల పైఁ దిర్యగ్రేఖను సైతము లిఖించుట యనెడి-నన్నయనాఁటికె యంకురించిన యాపద్ధతి రూఢమయి విస్తరిల్లుటచే నాతఁడు నన్నయోపదిష్ట లిపిని సవరించుటలోఁ దిర్యగ్రేఖను సైతము లిఖించునట్లు "పఞ్చ వర్గాదయో వర్ణాః శఙ్ఖశాగ్రాది సన్నిభాః। తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వమ్" అని సవరించిన వాఁడయ్యెను. ఈ సందర్భమునుబట్టి పొల్లు హల్లులకు గుఱుతుగ వర్ణముల మీఁద దిర్యగ్రేఖ నుపదేశింపని యా చింతామణి కారికలు ప్రాచీన

ము లనఁగాఁ బదునొకండవ శతాబ్దము నాఁటివనియు, నట్లగుటంజేసి యవి నన్నయ కర్తృకములు కానోపుననియుఁ జెప్పెడి యభిప్రాయ మెంతయు గూఢమూల మగుచున్నది గదా.

(౨౭౫)—ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునం దిచటి తిర్యగ్రేఖాశబ్దముచేఁ దలకట్టులు చెప్పఁబడుచున్నవని వ్రాయఁబడియున్నది.

"అయిదు వర్గముల ప్రథమాక్షరములు (క చ ట త ప) శంఖ శార్ఙ్గాదిక మువలె నుండును. ఆ యక్షరములకు మీఁది భాగమందు తిర్యగ్రేఖలు (వంక గీట్లు అనఁగా తలకట్లు) ఉండును." (ఆంధ్ర విజ్ఞానసర్వస్వము, ౧ వాల్యుము. ౩౮౩ పుట, 'అక్షరములు' అను శబ్దమునొద్ద,). నేనును నింతవఱకు ముద్రించి యున్న నారచించిన పుస్తకములందును నట్టియపమార్గముననే తదనుసారముగ వ్రాసియున్నాను. అట్లయినను బాలచంద్రాకారమగు '✓' అనునది తలకట్టునకు గుఱుతుగను దిర్యగ్రేఖయగు '/' అనునది పొల్లు హల్లునకు గుఱుతుగను నధర్వణునిచేఁ జెప్పఁబడెనని యెన్నుటయె యుక్తమని గ్రహింపనగును. అధర్వణోపదిష్ట పరుషముల పొల్లు రూపము లివి:— [illegible]=క్ ; [illegible]=చ్ ; [illegible]=ట్ ; [illegible]=త్ ; [illegible]=ప్ ; ఇంక నధర్వణోపదిష్టములగు తలకట్టులుగల పరుషము లివి— [illegible]=క ; [illegible]=చ; [illegible]=ట; [illegible]=త ; [illegible]=ప.

(౨౭౬)—ఆంధ్ర శబ్దచింతామణి తలకట్టు లిపియుఁ బొల్లు గుఱుతు లిపియు, మాఱెడి సంధి కాలములోనిదయినట్లె యధర్వణకారికావళి వర్గద్వితీయచతుర్థముల యెత్తులకు గుఱుతుగ నధోదండ రేఖ లిడెడు సంప్రదాయము వచ్చుచున్న సంధికాలములోనిదై యుండెను. ఈ యధోదండరేఖ బర్నెల్ దొరగారి సౌదిండియను పేలియాగ్రఫీలోని పండ్రెండవ శతాబ్దపు (క్రీ. శ. ౧౧౩౮) ఏనిమిదవ పటమున నొక్క-చోట మాత్రమె యగపడుచున్నది. మఱియు నందలి దొమ్మిదవ పటమున (క్రీ. శ. ౧౩౫౬) 'థ భ' లకు ధారాళముగ నధోదండరేఖ లగపడుచున్నవి. ఆ శాసనములోనే యొకచోట నధోదండరేఖ యుండుటయు మఱొకచో లేకుండుటయుఁ గలదు. అనితల్లి కలువచేరు శాసనములో (క్రీ.శ. ౧౮౨౩) నధోదండ రేఖలు లేకుండుటయే తఱచైయున్నను గొన్ని చోట్లమాత్ర మగపడుచున్నవి—"పృమ్యత్పుమ్స ఫలావనమ్రతరుభిః" (౨౨ పంక్తి) అను చోటి ఫభలు, 'భీమేశః' అనుచోటి (౧౯ పంక్తి) భకారము మొదలగునవి యధోదండ రేఖాంకితము లై యున్నవి.

రాయబహాదూర్ పండిత గౌరీశంకర హీరాచంద ఓఝూ రచితమగు భారతీయ ప్రాచీన లిపిమాలలోని పదునేనవ శతాబ్దపు ఱేబది యొకటవ లిపి పత్రమునం దొక్కచోట్ల నైనను నొత్తువర్ణముల కధోరేఖాంకితత్వ మగపడదు.

(౨౭౭)—పయిరీతి నొత్తువర్ణముల యధోదండ రేఖాంకితత్వము ప్రాచీనశాసనములలో నరుదుగ నుండుటకుఁ గారణము నాలోచింపవలసి యున్నది. పరిశీలింపఁగాఁ బ్రాచీనమగు నాంధ్రకర్ణాట సాధారణ లిపియందలి వర్గప్రథమ ద్వితీయములకును, నట్లే వర్గతృతీయ చతుర్థములకును లిపిలో భేదము వెలయుచుండుటంజేసి యట్టి వర్గయుక్కుల కధోదండరేఖాంకితత్వ మనావశ్యకమయి యుపేక్షితమగుచు వచ్చెనని చెప్పవచ్చును. [illegible], ఖ (క ఖ) గ, [illegible] (గ, ఘ) [illegible], [illegible] (చ, ఛ) జ, ఝ, (జ, ఝ) ట, ఠ (ట, ఠ) [illegible] డ (డ, ఢ) [illegible], థ (త, థ) [illegible], ద (ద, ధ) [illegible] [illegible] (ప; ఫ) బ [illegible] (బ, భ.) ఇఁక నన్నయాథర్వణోపదిష్టలిపియం దన్ననో వర్గప్రథమాక్షరమే వర్గద్వితీయాదులకును బ్రధానలిపియై యుండుటంజేసి యట్టి స్తంభాకారరేఖలకును నధోదండాకారరేఖలకును నావశ్యకత కల్గియున్నది.

పయిసందర్భమునుబట్టి యొత్తువర్ణముల కథర్వణోపదిష్టములగు నధోదండాకారరేఖ లాంధ్రకర్ణాట సాధారణలిపిలో సార్వత్రికముగా నావశ్యకములు కాకున్నను గొన్నిటికిఁ గొంతవఱ కావశ్యకములని తోఁచుటంజేసి జనసామాన్యము నన్నయాథర్వణోపదిష్టలిపి సంస్కారమును బూర్తిగా వాడకకుఁ దేకున్నను నీ యొత్తువర్ణముల కధోదండాకారరేఖల నిచ్చు పద్ధతిని మాత్ర మొకొక్కప్పు డపేక్షించుచు నొకొక్కప్పుఁ డుపేక్షించుచు రాఁగా గాలక్రమమున నట్టి యధోదండాకారలేఖన మాంధ్రకర్ణాట సాధారణలిపిలో విస్తరించె నవఁగా నాంధ్రులును గర్ణాటులును నట్టి యొత్తులను సార్వత్రికముగ వ్రాయసాగిరని తోఁచుచున్నది. ఇట్లే యథర్వణుఁడు చెప్పిన యనునాసికముల గుఱుతగు మిళద్దండద్వయరేఖ 'జ, ఞ' లమీఁద నిల్చెనని తోఁచుచున్నది. తక్కినచోట్ల లిపిసాంకర్యము గల్గనేరమింజేసి యీ రేఖ నిల్చుట యనావశ్యకమై యుపేక్షితమయ్యె ననఁదగును.

(౨౭౮)—ఒత్తువర్ణముల కీ యధోదండరేఖ నిడెడి శాసనములలోఁ బ్రాచీనతమము నా చూచినంతవఱ కన వేముని వనపల్లిశాసనమై యున్నది.

(క్రీ. శ. ౧౩౦౦. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము ౩౭౬ పుట) ఇందును నీరేఖ కొన్ని యెడల మాత్రమే వ్రాయఁబడియున్నది. అదియు '1' అనురీతి నున్నది. (చూ - ఫాలఫలక (౭ పంక్తి) నాభి (౭ పంక్తి) త్రిభిః (౧౦ పంక్తి). పయి సందర్భమునుబట్టి యధోదండరేఖను నుపదేశించుచున్న యధర్వణకారికావళి పదుమూఁడవ శతాబ్దము నాఁటిదను నభిప్రాయము దృఢమూలమగు చున్నది గదా.

(౨౭౯)—ఒత్తువర్ణముల కధోదండరేఖ నిడెడి పద్ధతి యూరకయే లోకములోనికి రాఁగా నద్దాని నధర్వణుఁ డుపదేశించె ననుటకన్న నధర్వణుఁడు నన్నయోపదిష్టలిపిని సంస్కరించుటలో నధోదండరేఖ నొత్తువర్ణములకు లిఖింపవలెనని చెప్పఁగా నది కాలక్రమమున వాడుకకెక్కె ననుటయే విశ్వసనీయమై యున్నదని చెప్పవచ్చును. అధోదండరేఖ యొత్తువర్ణముల కిడెడి పద్ధతి యొంతమాత్రమును నంకురింపని కాలమునందే నన్నయభట్టు స్తంభాకారరేఖలను వర్గద్వితీయాదులకు గుఱుతుగా నక్షరముల తలపై లిఖింపవలెనని యొక నూతనకల్పనమును జేసి యుండుటచేతను, నట్టిలిపిని సంస్కరించుటలో నధర్వణుఁ డట్టి స్తంభాకారరేఖను నొత్తువర్ణముల కధోభాగమున నిడవలెనని యావశ్యకతనుబట్టి సంస్కరించుటచేతను, నట్టి యధోదండ రేఖాలేఖనము పైని వ్రాసినరీతిని ప్రాచీనమగు నాంధ్రకర్ణాట సాధారణలిపిలో లేకుండుటయేకాక యనావశ్యకమై (౨౭౭-విష) యుండఁగా నన్నయాధర్వణోపదిష్టలిపి కత్యావశ్యకమై యుండుటచేతను, నట్టి యధోదండ రేఖాలేఖనము నన్నయాధర్వణోపదిష్టలిపి మూలకమే యనుట యెంతయు విశ్వసనీయమై యున్నది గదా. ఇట్లే మిశ్రదండద్వయరేఖ 'జ ఞ' ల మీఁద నిల్చుటకును నధర్వణుఁడు సవరించిన సవరణమే మూలమగుచున్నదనుట యుక్తము గదా.

నన్నయభట్టారకుఁడు తత్తద్వర్గాక్షరములకెల్లఁ దత్తద్వర్గ ప్రథమాక్షర చిహ్నమే సామాన్యపు గుఱుతై యుండునట్లుగఁ గల్పించినవాఁడగుటం జేసి వర్గద్వితీయాది వర్ణవైశేష్యమునకు గుఱుతుగాఁ దత్తద్వర్గ ప్రథమలిపులపయి స్తంభాకారరేఖలను లిఖింపవలెనని యొకకల్పనముచేసి యుండఁగా నట్టి లేఖనమున వర్గాక్షరములపై నుండెడి మూఁడేసి నాలుగేసి స్తంభాకార రేఖలు శీఘ్రపఠనాది విషయమున సుగ్రహములు కానేరవని తలంచి కావలయు నధర్వణుఁ డట్టి లేఖనమును సవరించుటలో నట్టి స్తంభాకారరేఖలను రేవల మొక్కచోటనే మీఁదనే వ్రాయక క్రింద నొత్తు గుఱుతులను

మీఁదను దక్కిన నాదవత్త్వాది విశేషముల గుఱుతులను స్తంభాకారరేఖలనుగాని లిఖింపవలెనని యేర్పాటు చేసెను. ( = క ; = ఖ ; =గ; =ఘ; =జ.) అట్లే తక్కిన వర్గాక్షరములకు వ్యావర్తకముగ నుండునట్లును వర్గప్రథమములపైఁ గల్గుచున్న నాదితానునాసిక్య మేళన రూపవర్ణవైశేష్యమునకు సూచకమగునట్లును మిళద్దండ ద్వయరేఖాకల్పనమునైతము వర్గపంచమముల విషయమున నెంతయు యుక్తమై యున్నది.

(౨౮౦)—చింతామణి వికృతి వివేకములలోని యీ లిప్యుద్ధారక కారికల కర్థముచేయుటలోఁ బలుగురు వ్యాఖ్యాతలు పలువోకలను బోయి యున్నారు.

చింతామణి టీకాకర్తయగు బాలసరస్వతీ మహోపాధ్యాయుఁడు బాలేంద్విత్యాది చింతామణి కారికల కర్థము తెలిసికొన లేకయే వానిని మూలములోఁ జేర్పక విసర్జించెనని తోఁచుచున్నది. వికృతివివేక వ్యాఖ్యాతయగు ద్వితింత్రిణీ సీతారామకవి 'పంచవర్గాదయ' ఇత్యాద్యథర్వణకారికలను మూలములోఁ జేర్చియు వ్యాఖ్య చేయలేదు-అప్పకవియు సహోబల పండితుఁడును వీని కొకరీతిని వ్యాఖ్యచేసి యున్నారు. అట్టివ్యాఖ్యలు ముందు విమర్శింపఁ బడును.

(౨౮౧)—దక్షిణ హిందూదేశలిపి శాస్త్రమును రచించిన బర్నెలు దొరగారథర్వణములగు 'పంచవర్గాదయ' ఇత్యాది కారికల నుదాహరించి వానికి సరిగ నర్థమగురీతి యగపడదని యీక్రింది విధమున వ్రాసియున్నారు.

" There is much here very unintelligible, but the description of the letters clearly points to about 1200 A.D. The Canarese Basavapurana (of 1369 A. D. ) mentions the Telugu Canarese, Grantha, Tamil (Dravila), Lata (i. e. Lata or Gujarat) and Persian alphabets, and this would seem to indicate that there was then a greater distinction between the Canarese and Telugu alphabets than we actually find " (South Indian Paleography Page 31. )

బర్నెలు దొరగారు పైయథర్వణ కారికల యర్థము సరిగ గ్రహింపఁ జాలకున్నను నాకారికలలో వర్ణింపఁబడిన లిపి పండ్రెండువందల క్రైస్తవాబ్దపు నాఁటిదని మాత్రము నిశ్చయించిరి. పదునాల్గవ శతాబ్దము(క్రీ. శ. ౧౩౬౯)లోనిదగు కన్నడ బసవపురాణమున నాంధ్రకర్ణాటాది భాషల వర్ణసమ్నాయ

ములు ప్రసంగింపఁబడుటచేత నంతకుముందుఁ గొంతకాలము క్రిందట నె యాంధ్రకర్ణాటములకు వర్ణభేదమును లిపిభేదమును గల్గియుండు ననియు నిప్పుడు మనము గ్రహించినదానికన్న నత్యధికభేద మాంధ్ర కర్ణాటముల కుండి యుండుననియు నూహించి యథర్వణకారికానర్దిత లిపి యట్టి ప్రాచీ నాంధ్రలిపియై యుండునోపునని యేమోమో బర్నెలు దొరగారు పై రీతిని వ్రాసియున్నారు.

(౨౮౨)—ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమును వ్రాసిన కె. వి. లక్ష్మణరావు గారు, బర్నెలు దొరగారివలెఁ బయి యథర్వణకారికల యర్థము తెలియ లేదనక యింతరీతిని వివరించిరి. (ఆంధ్రవిజ్ఞాన - ౧ వాల్యము - ౩౮౩ పుట - మొదటి ఎడిషను). మఱియు నట్టి యర్థమునందు సందేహించి సరియగు మాతృక లభింపమిచే నట్టి యర్థము విషయమునఁ బండితులు భిన్నాభి ప్రాయులు కావచ్చుననియు వ్రాసిరి. ఇంతియకాక బర్నెలు దొరగారా కారికలు పండ్రెండవ శతాబ్దమునాఁటివనుట సరికాదనియు వానియం దర్ధా నుస్వార మర్ధచంద్రాకారమున నుండునని వర్ణింపఁబడియుండుటచేతను, నర్ధాను స్వారము భిన్నరూపమును (అర్ధేందురూపమును) దాల్చుట (౧౬ లేక ౧౭) పదునే డవశతాబ్దమునఁగాని సంభవింప కుండుటచేతను (అప్పులోమాత్రమె యుండుట చేత నీ గుఱుతు 'ఁ' ౧౭ లేక ౧౮ శతాబ్దమున మాత్రమె వచ్చెను) నా కారికలు గల వికృతివివేకము పురాతనగ్రంథము కాదేమోయనియు(అప్పకవీయమునను గలవే) వ్రాసిరి. ఎట్లువ్రాసినను "అయినను ఈవిషయ మింకను విచారణీయము" అని వీరు వ్రాసియుండుటచేత (౩౮౪ పుట) వీరివ్రాఁత యంతగా విమర్శింప వలసిన యావశ్యకత లేదు.

(౨౮౩)—శాసనలిపి పరిశోధన విషయమున నగ్రగణ్యులగు బర్నెలు దొరగారును లక్ష్మణరావుగారును బైనివ్రాసిన నన్నయాథర్వణ కల్పిత లిపి యొకప్పుడు వాడుకలో నుండెడిదని తలంచుట మిక్కిలి వింతగా నున్నది. "ఈయక్షరముల యాకారము లెట్టివియైనను అవియప్పకవి కాలము లోని వని చెప్పుటకు వీలులేదు. అంతకుఁ బూర్వకాలపు లిపియై యుండ నోపును..." (ఆంధ్రవిజ్ఞాన. ౧ వాల్యుము. ౩౮౨ పుట. మొదటి ఎడిషను) అని యిట్లు లక్ష్మణరావుగారు వ్రాసియున్నారు. ప్రాచీన శాసనములలో నున్న లిపిని బోలిన గుణితస్వరములయుఁ బరుషాంతస్థోష్మములయు నాకార ముల వర్ణనమును జూచి తక్కిన యక్షరముల యాకారములును నొకప్పుడు

వాడుకలో నుండెడివని వీరు భ్రమించిన ట్లగపడుచున్నది. గుణితే స్వరూపముల యాకారములతోఁ బ్రత్యేకస్థితిలోని స్వరములను వ్రాయుటగాని వర్గ ప్రథమేతరాక్షరములను స్తంభ రేఖాయుతముగఁ బయి నన్నయాథర్వణవర్ణితాకారములతో వ్రాయుటగాని నన్నయ సంబంధముగల చాళుక్య శాసనములందే కాక యెచ్చటను నేకతామ్రపుశాసనములందును మచ్చునకైన నగపడకుండుటం జేసి యట్టి లిపి వెనుక నుదాహరించిన చొప్పునఁ బండితుల యెఱుకలో మాత్రముండెడిదనియు నక్కారణమున నద్దాని నుపలభ్యమాన శాసనసామగ్రిచే నిరూపించుట కెంతమాత్రమును వలనుపడదనియుఁ బై యథర్వణకారికలలో లక్ష్మణరావుగా రనుకొన్నట్లు పాఠ ప్రమాదములు లేవనియు గ్రహింపనగును.

(౨౮౪)—వికృతి వివేకము బాలసరస్వత్యప్పకవులకు లభింపకున్నను వారి కందలి కొన్ని కారికలు పండితశ్రుతి పరంపరాయాతముగా లభించి యుండెనని వారి వివరణములవలన విశదమగుచున్నది. బాలసరస్వతీయ వ్యాఖ్యానమున ననేకస్థలములం దథర్వణకారికలాయాసందర్భములలోఁ బ్రమాణములుగఁ జూపఁబడి యున్నవి. అప్పకవీయమున ననేకస్థలములం దథర్వణకారికల యర్థము వివరింపఁబడి యున్నది. కావుననే బాలేన్ద్విత్యాధి చింతామణి కారికలను వివరించు సందర్భమునఁ బంచవర్గాదయ ఇత్యాద్యథర్వణ కారికావళిచేఁ జేయఁబడిన సవరణముతోనే యప్పకవి యాంధ్రీకరించి యున్నాఁడు.

"మూ-సూ- బాలేన్దు పరిధి శృఙ్గా। వ_ర్త కుశగ్రన్థి దాత్ర పరశు సమాః। ఆద్యా ఇభకరతుల్యా। స్తద్దీర్ఘా శ్యాలసన్నిభా వన్యా॥"

సీ. విదియ చంద్రునిమాడ్కి వెలయు నత్వము దాని,
కుడివంక శృంగంబు కొన గుణింపఁ।
బ్రభవించుఁ దక్కిన ప్రాణంబు లెల్లను,
నడిమికి గుడిఁజుట్టి విడువ నిత్తు।
కుడి నావుకొమ్ముకై వడి వ్రాయ నుత్వంబు,
క్రిందను సుడినిల్పు ఋత్వ మయ్యె।
వలపల మీఁదికి మెలిగొన్న ఇస్వర।
మెడమ (నె తప్పు) కెత్వం బొప్పుఁ గొడవలి క్రియ॥

తే-గీ. యామ్యమున గండ్రగొడ్డలి యట్లొనర్పఁ।
గ్రాలు నోత్వ మిన్నింటి దీర్ఘములు కుడిని।

గరికరాకృతిఁ దనరు డాకడ వలపల ।
నమరు నైత్వోత్వములు త్రిశూలములకరణి ॥

(ఈ పద్యముక్రింద నిందు వర్ణితములగు రేఖలనుచుఁ గొన్ని యుదాహరింపఁబడినవి. అవి ముందు విమర్శింపఁబడును.) (అప్ప. ౨ ఆ. ౨౧ ప.)

"మూ-దరశార్ఙ్గ పిప్పలదళాఙ్కుశ, పన్నగసన్నిభాః క్రమాత్ పరుషాః।
స్తమ్భ విలేఖాధిక్యే, స్తపవ వర్గద్వితీయవర్ణాద్యాః॥"

సీ. శంఖశార్ఙ్గద్విపాశనదళాంకుశపన్న,
గాకృతులకు (ను. తప్పు) మీఁద నస్తురేఖ ।
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబు,
లైదును వరుసఁ జెన్నారుచుండుఁ ।
గ్రిందఁ గంబము పోల్కి గీటొక్కటిడిన నా,
ద్యములుం రెండవ లిపులై పొసంగుఁ ।
బైనున్నగీటు ని (లి. తప్పు) బ్బడి సేయఁ బ్రథమాక్ష,
రంబులు సరళవర్ణంబు లగును ॥

తే-గీ. గంబమొక్కటి రేఖాయుగంబుక్రింద ।
వ్రాసినఁ దృతీయములు (ను. తప్పు) చతుర్థంబు ల (న. తప్పు)గును ।
నిలువు గీటులు రెండునుం గలిసి తమ్ముఁ ।
గదియఁ దొల్లింటి వనునాసికంబు లగును ॥

(ఇందు వర్ణింపఁబడిన రేఖలును నప్పకవీయమున నుదాహరింపఁబడియున్నవి. అవియు ముందు విమర్శింపఁబడును.) (అప్ప. ౨ ఆ. ౩౮ పద్యము)
"మూ. కీర తరి హస్తిమస్తక, శుక్తి తులాసన వితర్ది సీర సమాః ।
అనస్థా శ్చోష్మాణో, దన్త్య చ జౌ గురు రలౌచ బిన్దుయుతౌ."

తే-గీ. శుక తరి మతంగభవకుంభ శుక్తి సన్ని ।
భంబు లంతస్థములు తులా భద్రపీఠ ।
వేదికా హాల నిభములు శాదిలిపులు ।
దంత్యచజ గురురలలకుఁ దనరు బొట్లు॥

(ఇందు వర్ణితములగు రేఖ లిచట వ్రాయఁబడినవి. అవియు ముందు విమర్శింపఁబడును.) (అప్ప - ౨. ఆ - ౩౯ ప.)

(౨౮౫)—ఈ సందర్భమున నీ యక్షరములను సంబంధించిన మఱి కొన్ని పద్యము లప్పకవీయమునఁ గలవు. వాని నిట నుదాహరించుచున్నాను.

తే॥ గీ॥ సగము జాబిల్లివలె వ్రాయ సగము సున్న ।
నిండు జాబిల్లివలె వ్రాయ నిండు సున్న ।
యయ్యె నీ భేదములెఱింగి యాంధ్రకృతుల ।
వ్రాయఁదగు బిందువులు పొండవేయపక్ష ॥ ॥ 33 ॥

కం॥ పొల్లులయి తాము పుట్టియు ।
హల్లులు ప్రాణములతోడ నంబుధి తనయా ।
వల్లభ కూడి కదా తల ।
ముళ్ళు గుడులు శృంగములును మొదలుగఁ దాల్చున్ ॥ ॥ ౩౬ ॥
(వీని క్రింద స్వరగుణిత మిం దుదాహరింపఁబడెను.)

తే॥ గీ॥ ఎన్నిహల్లులు జడ్డలై యున్న నేమి ।
పొల్లులకు మీఁద నుండెడి హల్లులెల్ల ।
గడపటను వ్రాయు ద్విత్వమొక్కటియె తాల్చు ।
దాని తలకట్లు మొదలయిన వానినెల్ల ॥ ॥ ౩౯ ॥

(ఇందలి ద్విత్వ శబ్దముచే సంయోగములోని ప్రథమేతర హల్లు చెప్పఁబడును.)

తే॥ గీ॥ మొదల రేఫాక్షరంబు నాపిదప దాని ।
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు ।
ముందు జడ్డయు వెస రేఫమునకు బదులు ।
గిలుక లిఖియించి వచియింతు రిలఁ గుమతులు ॥ ॥ ౪౧ ॥

(అప్ప. ౨ ఆశ్వా.)

(౨౮౬)—పయి యప్పకవీయ పద్యములలోనిదగు "సీ॥ శంఖశార్ఙ్గ ద్విపాశన." అను సీసపద్యమునందుఁ బై నుదాహరించిన "దరశార్ఙ్గ పిప్పలదళాఙ్కుశ పన్నగసన్నిభాః క్రమాత్ షడుషాః" అనుచింతామణి భాగమువూత్రమె యాంధ్రీకరింపబడె ననియు, "స్తమ్భ విశేషాధిక్యేస్త ఏవ వర్గద్వితీయ వర్ణాద్యాః" అను చింతామణి కారికాభాగ మాంధ్రీకరింపఁబడలేదనియు నింకను "పఞ్చ వర్గాదయో వర్ణాః । శఙ్ఖ శార్ఙ్గాది సన్నిభాః । తిర్యగ్రేఖా

యుజ శ్చోర్ధ్వమ్..." అనునది మున్నగు (చి. ౨౭౫) వెనుక నుదాహరించిన యథర్వణుఁడు సవరించి చెప్పిన వచనముచే నాంధ్రీకరించఁ గీనవనియుఁ జెప్పుటకు సందేహము లేదుగదా. అట్లే "తే. పగను జాబిల్లివలె వ్రాయ..." మున్నగు పద్యములు "ప్రాణ్ణేన్న సహ్యశః ప్రూర్ణః..." అనెడి వెనుక వివరించిన యథర్వణకారిక కాంధ్రీకరణమని చెప్పుటకును సంశయము లేదుగదా.

పయి రీతిని జింతామణ్యథర్వణ కారికలను జోడించి యాంధ్రీకరించుటయే కాక యట్టి యాంధ్రీకరణములోఁ గొన్ని స్వకల్పితములగు వివరణములను సయితి మప్పకవి చేసియున్నాఁడు. ఆ విషయ మిటఁ జూపఁబడుచున్నది.

(౨౮౭)—హల్లులపయి నిల్చునప్పటి స్వరముల యాకారములె వానికిఁ బ్రత్యేకస్థితిలోని యాకారములును నగునట్లు చెప్పెడి చింతామణ్యాశయమును నప్పకవి మార్చి చెప్పలేదు. కాని యట్టి స్వర స్వరూపములను నిరూపించుటలో నొక వింతయగు మార్పును జేసియున్నాఁడు. నేఁటికాలమందే కాక ప్రాచీనకాలమందును హల్లులపై నత్వమును బుత్వమును నిల్చునపుడు వ్యర్థముగాఁ దలకట్టు '–' అనునది ప్రాచీనకాలమందును '✓' అనునది తర్వాతికాలమునందును లిఖించెడి యాచారము గలదు. అట్టి సంప్రదాయమును మూలముగాఁగొని యాతఁ డకారేతరములగు నెల్ల స్వరముల యాకారములును 'అ' కార చిహ్నమగు తలకట్టున కే రేఖా విశేషములను దగిలించుటచేత నేర్పడునని యుపదేశింపనెంచి "సీ. విదియచంద్రుని మాడ్కి వెలయు నత్వము దాని, కుడివంక శృంగంబు కొన గుణింపఁ। బ్రభవించుఁ దక్కిన ప్రాణంబు లెల్లను" అని యిట్లు వర్ణించి యున్నాఁడు. ఇట్టి యభిప్రాయముతోనె యెల్ల స్వరముల యాకారములను నిరూపించుటలోను నాతఁ డట్టి తలకట్టు గురుతునకే రేఖా విశేషముల నిక్రింది రీతిని దగిలించి వర్ణించి యున్నాఁడు. "నడిమి గుడిచుట్టి విడువ నిత్తు" [ = ఇ) "కుడి నావు కొమ్ము కైవడి వ్రాయ నుత్వంబు" ( = ఉ) "క్రిందను సుడిసిల్ప బుత్వమయ్యె" ( = ఋ) "వలపల మీఁదికి వెలిగొన్న ఌ స్వరము," ( = ఌ) "ఎడమ కెత్వం బొప్పుఁ గొడలిక్రియ" ( = ఎ) "యామ్యమున గండ్రగొడ్డలి యట్లొనర్పఁ గ్రాలు నొత్వము" ( – ఒ) "డాకడ వలపల నమరు నైత్వోత్వములు త్రిశూలముల కరణి" ( = ఐ) ( = ఔ). ఇట్లే వానివాని దీర్ఘములు సైత మాయా స్వరముల యాకారములకుఁ గుడిప్రకను గజహస్తా

కారమున ననఁగా "J = అ" అను నాకారమున నిల్చుననియుఁ జెప్పెను. (అప్పకవి నాఁటి శాసనములలోని 'అ' కార దీర్ఘ మిట్లెయున్నది.) "ఇన్నింటి దీర్ఘములు కుడిని | గరికరాకృతిఁ దనరు" అని యిట్లు చెప్పియున్నాఁడు—
J=ఆ, [ ]=ఈ, [ ]=ఊ, [ ]= ౠ, [ ]=ఌ, [ ]=ఏ, [ ]=ఓ.

(౨౮౮)—ప్రాచీన శాసన లిపిలో సైతము హల్లుపై నుత్వ ఋత్వములు నిల్చునపు డా హల్లు వ్యర్థమైన 'అ'త్వ చిహ్నమగు తలకట్టుతోఁ గూడి యుండుట నిజమె యైనను నట్టి తలకట్టుతో నుత్వ ఋత్వ చిహ్నము లదికి యుండుట యెంతమాత్రమును నేకాలపు శాసనములందు లేదు. నేఁటి లిపిలో సైతము నట్లదికియుండలేదు. ఇంక నట్టి చిహ్నము లా హల్లు క్రిందను వలపలను లిఖించుట మాత్రము వాడుక. ([ ]=కు. [ ]= కృ.) ఇంకఁ దక్కిన స్వరములు నిల్చునపుడు తలకట్టు చిహ్నము లేశమైనను నుండదు. ([ ]=కి, [ ]=కె, [ ]=కొ). ఇంతియ కాక యప్పకవి సయితము స్వరములకు హల్లులపై నిల్చునపుడొక యాకారమును, ప్రత్యేకస్థితిలో నొక యాకారమును గలదని చెప్పినవాఁడు కావుం జేసి ప్రత్యేకస్థితిలోఁ దక్కిన స్వరములకే కాక ఉత్వ ఋత్వములకు సయితము 'అత్వ' చిహ్నముతో సంబంధము గలదని చెప్పుట యసంగతమును నయుక్తికమును నగుచున్నది. కావుననే స్వరముల ప్రత్యేకస్థితిలోని యాకారములను జెప్పెడి "బాలేందృత్వాది" చింతామణి కారికలో 'అ' కారేతర స్వరముల యాకారములందు 'అ'త్వ చిహ్నమున కేమాత్రమును సంబంధము చెప్పఁబడలేదు. పరిశీలింపఁగాఁ జింతామణి తక్కిన స్వరములే కాక 'ఉ'త్వ ఋత్వ'ములు సైతము హల్లులపై నిల్చునపుడు వ్యర్థమగు తలకట్టు లిఖించెడి శాసన సంప్రదాయము నుపేక్షించెననియె యద్దాని సందర్భమునుబట్టి వ్యక్తమగుచున్నది.

మఱియు 'ఐత్వౌత్వములు' శూల సన్నిభములని చింతామణి కారికలోఁ జెప్పఁబడియుండఁగా నప్పకవి 'త్రిశూలముల కరణి' అని చెప్పియున్నాఁడు. ఈ మార్పునకును మూల మగపడదు. మఱియు ఌ కారమునకు శిగ్రంథివంటి యాకారము గలదని చింతామణి కారిక చెప్పుచుండఁగా నప్పకవి 'మెలి'వలె నుండునని చెప్పుటకును గారణము తెలియకున్నది. ఌకారము శాసనములలో సాధారణముగా దుర్లభమగుటం జేసి యావిషయమున నేమి చెప్పుటకును నవకాశము లేకున్నది.

(౨౭౯)—అప్పకవీయమున నుదాహరింపఁబడిన యీ లిప్యుద్ధారక శ్లోకముల యుదాహరణములందలి రేఖలు విజ్ఞాన సర్వస్వకారులుచెప్పినట్లె యొక్కొక్కమాతృకలో నొక్కొక్కవిధమున నున్నవి. ముద్రణములందు సైత మొక్కొక్క దానిలో నొక్కొక్కరీతి నున్నవి. కొన్ని ముద్రణములం దున్నత్తునిచే వ్రాయఁబడిన రీతిని బొత్తిగా నసంగతములై యున్నవి. అప్పకవీయమునుండి యుదాహరింపబడినట్లు చూపఁబడిన యహోబలపండితీయో దాహరణములలో సైత మేతద్విషయకమగు గ్రంథము కేవలము నసంగతము గనే యున్నది. కొన్నిటిలో నేఁటి వాడుకలోనున్న "అ ఆ ఇ ఈ" మున్న గునవి బాలేంద్విత్యాది కారికక్రిందను "క ఖ గ ఘ" మున్నగునవి దరశాస్త్రేత్యాది కారికక్రిందను నుదాహరింపఁబడియున్నవి. ఆంధ్ర విజ్ఞానసర్వస్వమున నుదాహరింపఁబడిన (౧ వాల్యము, అక్షరములు, ౩౮౩ పుటకు వెనుక) 'అప్పకవి' అనుపటమునందు మాత్రము మూలార్థానుసరణము కొంతవఱ కగపడు చున్నది. విజ్ఞాన సర్వస్వకారు లప్పకవీయ మాతృకలలోని యసంగతిని వారింప యత్నించి యొకరీతిని సవరించిరని యెన్నదగును.

(౨౮౦)—వావిళ్ళవారిచే ముద్రింపఁబడిన యప్పకవీయమున "ఈ రూపములు సరియయినవి కావు. పూర్వకాలపు వ్రాఁత ఎట్లుండెనో తెలియ గోరువారు బర్నెలువ్రాసిన 'సౌదిండియన్ పేలియాగ్రఫీ' అనే పుస్తకముగాని ఆంధ్రవిజ్ఞాన సర్వస్వముగాని చూడవలెను" అని (ఫుట్‌నోటులో) వ్రాయఁ బడియున్నది. దీనినిబట్టి దీనిముద్రణపు సంస్కర్తలు విజ్ఞానసర్వస్వమును జూచి యున్నట్లు గనపడుచున్నను వర్ణముల యాకృతుల నుదాహరించుటలో నద్దానినైన సరిగాఁ జూచికొన్నట్లగపడదు. విజ్ఞాన సర్వస్వకారు లప్పకవీయ పద్యములోని "దానికుడివంక శృంగంబుకొన గుణింపఁ బ్రభవించుఁ దక్కిన ప్రాణంబులెల్లను" అను వాక్యము నొకరీతిగ నర్థముచేసికొని హల్లులమీఁద నిల్చు నచ్చుల గుణితాకారములను జూపిరి. ఈ సంస్కర్త లట్టివిజ్ఞాన సర్వస్వ గ్రంథమునుగాని పయి యప్పకవీయ వాక్యమునుగాని సరిగాఁ జూచికొనక హల్లులపై నిల్చునప్పటి యచ్చులకు నేఁటి యాకారములే బాలేంద్విత్యాది కారికక్రింద నుదాహరించిరిగాని పయి యప్పకవీయ పద్యానుసారముగాఁ 'అ' త్వచిహ్నముతోఁడి మేళన మితరస్వరముల యాకారములలోఁ జూపి యుదాహరింపలేదు. మఱియు, నట్లె "ఇన్నింటి దీర్ఘములు కుడిని, గరికరా

కృతిఁ దనరు'' అను నప్పకవీయసూక్తికి సరిగ '—' అనెడి నేఁటి దీర్ఘపుగుఱు తునే యుదాహరించిరి.

✓ ఇది అ కారము. ⌐ ఇది ఆకారము. ౚ ఇది ఇ కారము. ౘ ఇది ఈకారము. ( ) ఇది ఉ కారము. ౝా ఇది ఊకారము. (అప్పక. ౨ ఆ. ౪౭ పుట. ౨౧ పద్యముక్రింద )

"కరికరాకృతి" అను నప్పకవి వాక్యమునకు మూలమగు చింతామణి వాక్యము "ఇభకరతుల్యాః" అనునదై యున్నది. ప్రాచీనశాసనలేఖనమును బట్టియు నట్టియాకృతిని వర్ణించిన యా చింతామణివాక్యమునుబట్టియు నచటి యిభకరాకృతిని 'ɹ' అను రేఖగా నెన్నుట యుక్తము. (ɣJ=పా ⋂J=శా. యుద్ధమల్లునిశాసనము ౧ పంక్తి). కాలక్రమమున ప్రాచీనదీర్ఘలిపి "˥=ɹ= ɺ=˥=˥ ˥=—" అనురీతిని ప్రకృతదీర్ఘలిపిగాఁ బరిణమించి యుండును. అట్లే 'ఇ' కారాదుల దీర్ఘముల యాకృతులును ప్రకృతాకారముగాఁ బరిణమించి యుండవచ్చును. "ᘓ=ᘓ=ᘓ=ᘓ=ᘓ=ᘓ=(ఈ);" "ᘓ= ᘓ=ᘓ=ᘓ=ᘓ=ᘓ=(ఊ)." కావునఁ బ్రాచీనాకారములను దెలుపుఁ జింతామణి కాంధ్రీకరణమగు నప్పకవీయవాక్యములోని కరికరా కృతిగల దీర్ఘమును జూపునపుడు 'ɹ' అనురేఖను జూపుట యుక్తముగాని '—' అనురేఖను జూపుట యుక్తము కాదు. తుది కప్పకవినాఁటికి సైతము 'అ'కారదీర్ఘము '˥J' అను నాకారముతో నున్నదిగాని (చూడుఁడు. సౌదిండి యన్ పేలియాగ్రఫీ—XXXI పటము) '—' అనెడి యప్పకవీయ ముద్రణ సంస్కర్తలు చూపిన నేఁటి యాకృతితో నుండలేదు.

(౭౯౧)—ఆంధ్రభిజ్ఞానసర్వస్వమునం దన్ననో సైరీతినిగాక యప్ప కవీయములోని "దానికిఁ గుడివంక శృంగంబు కొన గుణింపఁ బ్రభవించుఁ దక్కిన ప్రాణంబులెల్ల" (వి. ౨౮౭) అను వాక్యమున కొకరీతిని సరిగ నుండు నట్లుగ హల్లులపై నిల్చు నాయా స్వరముల గుణితాకారములు చూపఁబడినవి. అకారాదుల దీర్ఘముమాత్రము'—'అను నేఁటిరూపముతోనే యందును నుదా హరింపఁ బడియెను. అ=ి' ఆ=ᘓ' ఇ=ి' ఈ=ᘓ, ఉ, ᘓ' ఊ=ᘓ; ౼—ౘ, ఏ=ᘓ' ఒ=ᘓ' ఓ=ᘓ' ఔ=ᘓ' అం=౦౦' అః=౦ః (=ᘓ.)
(ఆంధ్రభిజ్ఞానసర్వస్వము, ౧ వాల్యుము, ౯౮౨ పుట, మొదటిమొడిషను.

భిజ్ఞానసర్వస్వకారుఁడు లంప్లుకివ్యక్తిప్రేపబలగు స్వరముల యాకార ముల నిట్లు కొంతసరిగఁ జూపియు హల్లులపయి స్వరములు నిల్చునప్పటి యాకా

రములు మాత్రము చాల వింతగనుండునట్లు చూపియున్నారు— = క;
= కా; = కి, = కీ; = కు; = క్రూ మొదలయినవి.

వీరి యీ యుదాహృతులను బట్టి చూడఁగా గుణితములో 'అ'కారాది స్వరములు హల్లులతలపై నిలువక వాని కుడిప్రక్కను నిల్చునని యప్పకవి చెప్పినట్లు వీ రభిప్రాయపడిరని తోఁచుచున్నది. కాని యట్టి యభిప్రాయము చింతామణి కారికలోఁగాని యప్పకవి యాంధ్రీకరణములోఁగాని లేనందున నట్టి యుదాహృతులు ప్రామాదికము లనక తీరదు. అయినను నీ యుదాహరణ సందర్భమునందలి ప్రమాదములకు వీ రీక్రిందిరీతిని సమాధానము చెప్పియున్నారు. "ఈ వ్రాతలిపులు అప్పకవీయముయొక్క యొక్కొక్క వ్రాఁత ప్రతులలో నొక్కొక్క విధముగ నున్నవి. కావున వీని స్వరూపము స్పష్టముగఁ జూపుటకు వీలు లేదు. కావున నొకటి రెండు ప్రతులలోనుండి యీ అక్షరములను ఎత్తి "అప్పకవి" అన్న పదమునందుఁ జూపఁబడినవి" (ఆంధ్రవిజ్ఞాన, ౧ వాల్యుము, ౩౮౨ పుట, మొదటి యెడిషను).

(౨౯౨)—హల్లుల యాకారములను జెప్పుచున్న "వర్గశార్ఙ్గ పిప్ప లేత్యాది చింతామణి కారికలను యథాస్థితముగఁ నాంధ్రీకరింపక వానిని సవరించిన 'పంచవర్గాదయ' ఇత్యాద్యథర్వణకారికలలోని సవరణములను జోడించి యప్పకవి యాంధ్రీకరించెనని యీ వఱకే వ్రాసియున్నాను. అట్లాంధ్రీకరించుటలో సైతము కొన్ని వ్యత్యాసము లగపడుచున్నవి. "తిర్య గ్రేఖాయుజ శ్శోర్ధ్వమ్" అను మూలములో లేని 'వలపల' అనుదాని నచటఁ జొనిపి యున్నాఁడు. హల్లుయొక్క పొల్లుగుఱుతు వలపలికె యడ్డముగా నక్షరముపయి గీయుట శాసనములందును నగపడుచుండుటచేత నయ్యది విరుద్ధము కాదు. కాని వర్గప్రథమమున కధోదండ రేఖ నిడుటచేత వర్గద్వితీయ మేర్పడునని చెప్పినట్లే వర్గతృతీయలిపి కధోదండ రేఖ నిడుటచేత వర్గచతుర్థ మేర్పడునని చెప్పుట మూలకారికార్థమును న్యాయ్యమును నయి యుండఁగా "కంబ మొక్కటి రేఖాయుగంబుక్రింద వ్రాసినఁ దృతీయంబులు చతుర్థంబు లగును" అని యిట్లు వేఱువిధముగాఁ జెప్పియుండుట న్యాయ్యమయి యున్నట్లగపడదు. పరిశీలింపఁగా "తృతీయాన్తే చతుర్థకాః। రేఖాద్వయాధో దండేన। యుక్తాః స్యుః" అను నథర్వణవచనమున కప్పకవి రేఖాద్వయముయొక్క యధోభాగమున దండాకారరేఖ యిడుటచేత వర్గతృతీయములే వర్గచతుర్థము లగుచున్న

వని యర్థముచేసిన ట్లగపడుచున్నది. ఆ కారికలకట్టి యర్థము సైతము చేసినం జేయవచ్చునుగాని యట్టి యర్థము ముందుఁజూపెడి కారణములచే స్వారసికమై యుండలేదు.

అహోబల పండితుఁడును నప్పకవి ననుసరంచియే యీ క్రిందిరీతిని "పంచవర్గాదయ" ఇత్యాద్యర్థర్వ్యః కారికల కర్థము వ్రాసియున్నాఁడు.

"తిర్యగ్రేఖాయుజ శ్చేదూర్ధ్వ" మిత్యస్య పూర్వేణాన్వయః' అధో దణ్డరేఖాన్వితా స్తఏవ ప్రథమ వర్ణా ద్వితీయవర్ణాః స్యుః. ప్రథమా ఏవోర్ధ్వ రేఖాద్వయాన్వితాః స న్తః తృతీయాః స్యుః, రేఖాద్వయాధఃప్రదేశే దణ్డ రేఖాః(రేఖాయుతాః)తృతీయా శ్చతుర్థా భవన్తి. మిళద్దణ్డ రేఖాయుగాన్వితాః ప్రథమాః పఞ్చమవర్ణా భవన్తీత్యర్థః ... ... (అహో. ౧౮౧ పుట.)

స్థలాంతరమందును నిట్లే వ్యాఖ్యానము చేసెను. "ఏతేషా (పరుషా ణామ్) మధఃప్రదేశే ఏకలఘు లేఖనే ద్వితీయవర్ణా భవన్తి ... ... ఆద్యక్ష రాణా (కాదీనామ్) ముపరి తిర్యగ్రేఖాద్వయస్య లేఖనే గాదివర్ణా భవన్తి ... ఏతేషాం (వర్గతృతీయాణామ్) వర్ణానా ముపరిగత రేఖాద్వయస్యాధః ఏక లఘు రేఖా లేఖనే చతుర్థాక్షరా భవన్తి ... ... ప్రథమాక్షరాణామధః ఉపరిగత తిర్యగ్రేఖాస్పర్శ పర్యన్తం లఘుద్వయలేఖనే అనునాసికా భవన్తి ... ... (అహో. ౧౮౨ పుట)

ఇ ట్లహోబల పత్యప్పకవు లేకరీతిని వ్రాసినను బయిని వ్రాసినరీతిని వర్గప్రథమమున కధోదండరేఖ నిచ్చిన సోష్మమగు వర్గద్వితీయ మేర్పడు నని చెప్పినట్లె వర్గతృతీయమున కధోదండరేఖ నిడినచో సోష్మమగు వర్గచతుర్థ మేర్పడు నని గ్రంథకర్త చెప్పియుండు ననుట యెంతేయు విశ్వాసనీయమై యుండుననుటకు సందేహములేదు గదా. కావున వర్గతృతీయము మీఁద నియ్యఁదగిన రేఖాద్వయమెకాక యధోదండరేఖనుసైత మిడినచో వర్గతృతీ యమె వర్గచతుర్థముగ నేర్పడునని యర్థముచేయుటయె యుక్తము. కాఁగా '[symbol]' అనునదే ఘకారపు గుఱుతనియు '[symbol]'అనునది కాదనియుఁ జింతామణి హృదయమును గ్రహింపవలసి యున్నది.

పయిరీతినే యప్పకవ్యహోబలపండితులు వర్గప్రథమాక్షరములక్రింద 'మిళద్దండద్వయోపేత'రేఖను నిల్పినచో వర్గపంచమము లేర్పడుననిరి.( [symbol]=ఙ). కాని యట్టి రేఖ రావడి, దీర్ఘాకారము మున్నగువాని కభిన్నమై సందేహాస్పద

మగుననియు, నాదబిందుయుగు తిర్యగ్రేఖను నక్షరముమీఁద వ్రాయునపుడు నాదానునాసిక్య మేళనమును సూచించు నీ మిళద్దండద్వయరేఖను సైతము చుట్టనే యనఁగా వర్ణముమీఁదనే (క్రృ) వ్రాయుట యుక్తమనియు నా యభిప్రాయము.

(౨౯౩)—పయిరీతి నీ విషయమున నప్పకవ్యాఖ్యాతల పండితులు చేసిన వ్యాఖ్యను సయితము విజ్ఞానసర్వస్వకారులు పరిశీలింపక 'పంచవర్గాదయ' ఇత్యాది కారికల కిట్టిరీతి నర్థము వ్రాయుట మిక్కిలి వింతగనున్నది. "ఈయైదు వర్గముల ప్రథమాక్షరములు (కచటతప) శంఖశార్ఙ్గాదికములవలె నుండును. ఆ యక్షరములకు మీఁదిభాగమందు తిర్యగ్రేఖలు (వంకరగీతలు అనఁగా తలకట్లు) ఉండును. ఈయక్షరముల కే నెత్తిమీఁద రెండు రేఖలుండెనేని యవి వర్గద్వితీయాక్షరము (ఖ ఛ ఠ థ ఫ) లగును. ప్రథమాక్షరముల వలెనే వర్గతృతీయాక్షరములు (గజడదబ), వానితరువాత చతుర్థాక్షరములు (ఘ ఝ ఢ ధ భ) వచ్చును. క్రింద రెండు రేఖలు ఒక నిలువురేఖతోఁ గలిసియున్న యెడల వర్గముల చివరవియైన యను నాసికాక్షరము లగును ... ... ... అథర్వణ కారికలయొక్క పరిశుద్ధప్రతి లేనందున నీ శ్లోకముల తాత్పర్యమును గుఱించి పండితులు భిన్నాభిప్రాయులు కావచ్చును. ... ..." (ఆంధ్రవిజ్ఞా, ౧ వాల్యము, ౩౭౩ పుట. 'అక్షరములు' అనుశబ్దము.)

(౨౯౪)—పయిరీతి నర్థము వ్రాయఁబడిన విజ్ఞానసర్వస్వమునందలి 'అప్పకవి, అను పటములోని యుదాహరణము లయినను నట్టి యర్థమున కనుకూలముగ లేవు. అందలి 'కచట' లు నేఁటివే. తవర్ణము నేఁటితావడి (౨) యైయున్నది. పవర్ణము మాత్రము నేఁటిదికాదు. కొంతవఱకుఁ బ్రాచీనమగు పవర్ణమును బోలియున్నది. అంతస్థోష్మములలో సైతము యరలు మాత్రము నేఁటి గుణితాక్షరములు. తక్కినవి యాదృచ్ఛికములగు గీఁతలె. ఇంక వర్గద్వితీయాదుల కిడిన రేఖలు సైతము "పంచవర్గాదయ" ఇత్యాదికారికకుఁ దాము చేసిన వాఖ్యకే కాక యే వాఖ్యకును సరిపడి యుండలేదు. ఉ. = క్; = ఖ్; = గ్; = ఘ్; = జ్; ఇట్లు, = చ్; ట=ట్; = త్. ఇట్లే ప్. = య్; = ర్; = ల్; = వ్; = శ్, = ష్; = స్; = హ్; ల = ఱ; = ళ్. = ప్ర, ద్య, మ్న, ం, డు.

పయిని వ్రాసిన వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారు & సన్సువారి యప్పకవీయమునందును నరసభూపాలీయమును నందును నుండినను ప్రమాద భూయిష్ఠములగు నుదాహృతులు గలవు. అవి బొత్తిగా విమర్శసహములు కామింజేసి యిట నుదాహరింపలేదు. కాని మచ్చునకయి కొంకటి నప్పకవీ యమునుండి చూపుచున్నాను. ఉదా, 'క =ఇది క్ కారము. ఖ ఇది ఖ్ కారము, గ్ ఇది గ్ కారము, ఘ్య ఇది ఘ్ కారము.' ఞ ఇది ఞ్ కారము.' కారప్రత్య యము చేర్చునపుడు వ్యంజనముపై 'అ' కారమును నిలుపకుండుట మఱియు వింతగ నున్నది. క కారమనుట యుక్తముగాని 'క్ కారము' అనుట సరికాదు. ఇంక లిపిలోనిప్రమాదము బొత్తిగా విమర్శ సహమై యుండలేదు గదా.

(౨౯౭)—గీ. "ఎన్ని హల్లులు జడ్డలై యున్న నేమి........." (౨౮౭ వి) అను నప్పకవీయ పద్యము సైత మీనాఁటి యాంధ్రలిపికిని సరి పడి యుండలేదు. ఇది దేవనాగరలిపి సంప్రదాయము. సాధారణముగాఁ బ్రాచీన శాసనలిపిలోను నేఁటి లిపిలోను దెల్గున హల్లుల సంయోగములోని మొదటి యక్షరము మీఁదనే తలకట్టు మున్నగునవి నిల్చుట సంప్రదాయమై యున్నది. ఇట్టిస్థితిలో నప్పకవి"కడపటను వ్రాయు ద్విత్వమొక్కటియె తాల్చు" అని చెప్పియున్నాఁడు. అనఁగా సంయోగములోని తుదిహల్లు మీఁద మాత్రము తలకట్టు మున్నగునవి నిల్చునని చెప్పెను. అట్లు చెప్పుటయె కాక యాతఁ డుదాహరించిన 'ప్రద్యుమ్నుఁడు' అనుదాని లేఖనము (వి. ౨౯౪) నందు సైఁతము 'ప్ర' అను చోటు తప్పఁ దక్కిన రెండుచోటులందును నట్లే వ్రాసియున్నాఁడు. ఉదా. క్ర్యు = ద్యు; బ్రుక్ను = మ్న.

(౨౯౮)—వెనుక నుదాహరించిన (వి. ౨౮౭) "గీ. మొదల రేఫాక్షరంబు నా పిదప దాని, జడ్డయును ......" అనెడి పద్యముతో నప్పకవి నిరసించిన వలపలిగిలుక చరిత్ర మిట దిఙ్మాత్రముగఁ జూపెదను. ప్రకృత మున నప్పకవి చెప్పినట్లే "కర = ర్క" అను వ్రాఁత గలదనుట నిశ్చయము. అప్పకవికాలపు దనఁదగు (క్రీ. ౧౬౭౦) సౌదిండియను పేలియాగ్రఫీలోని XXXI. పటములో 'ర్వ' అనుచో గిలుక లేకున్నను 'దుర్గా' అనుచోట 'దుగార' (౧ పంక్తి) అని గిలుకయే యున్నది.

ప్రాచీన లేఖనమున బ్రాహ్మీలిపిలో 'J' అను రీతిగను నంతకంతకు 'J' అను రీతిగను రేఫ ముండెడిది (వి. ౨౬౧). అయ్యది సంయోగాది నుండు నపుడు వర్ణములమీఁద నిల్చుటలోఁ గాలక్రమమున 'J, ౧, ౮' అను రీతిని

బరిణమించుట వింతకాదు గదా. శేషమునిమీంది తలకట్టు పోయిన "ి" అను నాకారమునకు గిలుక యనుపేరు వచ్చియుండును. ఉ. ర్మ = ము. నాగరి లిపిలో ర్మ=(ర్మ)నేంటికిని నిట్లె గిలుక యున్నది. 'ఈ' వ్రాయు తలమీంది గిలుక, తలమీంది యనునాసిక లిపి యనుస్వారరూపమున వలపలికి దిగినట్లె కాల క్రమమున వర్ణము వలపలికి దిగి 'ః' అను రూపములోనికిం బరిణమించినదని గ్రహింప నగును. ఈ విషయమున నొక్క వింతమాత్రము గలదు. అను స్వారము ప్రాచీనకాలమున ద్వివిధముగా వ్రాయంబడెడిది గాన నది ద్వివిధ ముగా వలపలికిని దాంపలికిని దిగుట సంభవించెను. గిలుకయన్ననో వలపలికే దిగినది. అర్క = అర్క. అనునాసికాక్షరములకు బదులుగాం బరాక్షరము తలపై వ్రాయంబడెడి యనుస్వారము దాంపలికి దిగుచువచ్చెను. (రాముణ్డు= రాముండు=రాముండు.) తక్కిన చోట్లులందలి తలమీంది యనుస్వారము వల పలికి దిగుచువచ్చెను. ఉ. వంశము= వంశము. శేషము వలపలికి దిగుటచేతనే దానికి 'వలపలి గిలుక' అనుపేరు వెలసినది. (ప్ర) ర్క = అర్క.

(౨౯౭)—ఇంకను నప్పకవి తనకాలమునకు నాడుకలోనున్న శాసన తాళపత్రమాతృకా లేఖనపద్ధతులను సిద్ధాంతీకరించి నిరసించి యున్నాండు.

కం. పద్యాది ప్రాణంబుల, నాద్యంతాంతస్థలములుగ సజ్జులు కృతులన్ ।
జైద్యహార వ్రాయుదురు తము, విద్యాధికులెల్లం జూచి ఏకవిక నవ్వన్.
(అప్ప. ౨. ఆ. ౮౩ ప.)

కం. ఇరు లీంక లుఱుత లూళ్ళై,
వ్వరు నేమిటి కొక్కం డోపు వానికి ననునీ।
కరణేం బదంబుల మొదలివి,
స్వరములనుచుం దెలిసి వ్రాయంజనుం బద్యాదిన్.
(అప్ప. ౨ ఆ. ౮౮ ప.)

నన్నయ భట్టారకుండు పదాది యకారమును గొన్ని యచ్చులతో నుండునపు డంగీకరించి యుండుటచేత నట్టియెడలం బద్యాది ప్రాణం బుల నాద్యంతస్థములతో వ్రాయుట యాకాలమున దుష్టమనుట సరికాదు. కాని యప్పకవి, యట్టి పదాది యకారాంగీకార పాఠమును ద్రోసిపుచ్చి, పదాది యకారస్థితిని నిరసించు ప్రక్షిప్త పాఠము నంగీకరించినవాం డగుట చేత నాతండు పదాది యకారలేఖనము దుష్టమనుట విరుద్ధము కానేరదు. ఇంక 'ఊరు' 'ఓడ,' మున్నగుచోట్ల 'వూరు, వోడ' మున్నగురీతిని వ్రాయుట దుష్ట

మనుటలో విప్రతిపత్తియే లేదు. ఇట్లు మఱికొన్ని యీ కాలపు లేఖన పద్ధతు ళను నయిత మాతఁడు నిరసించి యున్నాఁడు.

(౫౯౮)—కం. కిబలుబొట్టులపై వర్ణం,
బుల క్రిందట నవియె మరల మూఢమతులు జ।
డ్డలు చేసి వ్రాయుచుందురు,
విలిఖింపరు వాని నెందు ద్విత్వము లార్యుల్.
(అప్ప. ౨ ఆ. ౭౫ ప.)

ఆ. వె. హల్లుమీఁద నున్న హల్లు దానికిఁ ద్విత్వ,
మొందుఁగాని వేఱె యొకటి గాదు।
సంధివేళ నది విచారించి వ్రాయుచోఁ,
బాప రెండు దానిఁ బ్రాఁజ్ఞు లెల్ల. (అప్ప. ౨ ఆ. ౭౬ ప)

శాసనము లందును (12 శతాబ్దము మొదలుగ ననవచ్చును), దాళపత్ర మాతృక లందును, నూఁది పలుకఁబడు బిందువునకుఁ బరముగానున్న హల్లు నూరకయె ద్విరుక్తముం జేసి (కట్టించ్చి) వ్రాసెడి యలవాటుండెడిది. ఆ పద్ధతి నియతముగా నుండెడిదని చెప్పరాదు గాని మిక్కిలి విపులముగా నుండెడి దనుటకు సందేహము లేదు. అట్లె 'చెట్లు, గ్రుడ్లు' మున్నగు చోటులందలి ద్విత్వములలో రెండవ హల్లును వ్రాయకుండుట విస్తరించిన యలవాటుగా నేఁటికిని వెలయుచున్నది. నేఁటి బాలవ్యాకరణాదులలో సైత మట్లె యుదాహృతులు వెలయుచున్నవి. ఇట్టివెల్లఁ దనకాలమునను నుండుటచే నప్పకవి వాని వైరీతిని నిరసించి యుండెను.

(౫౯౯)—అప్పకవి చెప్పినవే కాక యింకను ననేక విధములగు తప్పులు శాసనములందును దాళపత్రమాతృకా లేఖనములందును వెలయు చున్నవి. అట్టివెల్ల నిరాకరింపఁ దగినవే కాని సంప్రదాయ విశేషములుగఁ బరిగణింపఁ దగినవి కావు. కావుననే భాషాపారిశుద్ధ్య విషయమున శాసనము లును దాళపత్రమాతృకా లేఖనములును సాకల్యముగాఁ బ్రమాణములు కానేరవు. అయ్యవి ప్రాచీనస్థితిని నప్పటి పద్ధతులను మాత్రము చూపుటలోఁ గొంత యుపచరించును. శాసనాదులలో వట్రుసుడి వ్రాయవలసిన తావులందు క్రారయు, గుడియు లిఖింతురు (వృక్షము=వ్రిక్షము). క్రారయుఁ గొమ్మును వ్రాయఁదగు చోటులందు వట్రుసుడిని వ్రాసెదరు (శతృవులు=శత్రువులు).

ఇంకను 'శైత్రృవులు' అని యిట్లూరకయ శవర్ణము నెత్వసహితముగా వ్రాయుదురు. పద్యాంతములందలి పొల్లు నకారము నుత్వసహితముగను నూత్వసహితముగను నసంగతముగ వ్రాసెదరు. (వచ్చెను,వచ్చెనూ;కం. 'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధశేవను, శేవనూ') రేఫపూర్వకి సంయోగమునందలి పరహల్లును ద్విరుక్తముగ వ్రాసెదరు (ఓచ్చ్చెను). ఇట్టి ద్విత్వము కన్నడమునఁ గొన్ని యెడల సాధువైనను దెనుఁగున సాధువు కాదు. నేఁడు "చిన=చ్ని; గాన = గ్నా" అని యీరీతిని గొందఱు దప్పుగ వ్రాయుచున్నట్లె "ఇష్టులకు = ఇష్ట్లకు, దృష్టులు = దృష్ట్లు" అని యీరీతిని దప్పులు వ్రాయుటయుఁ గలదు. విస్తరభీతిని విరమించితిని గాని యిట్టి వింకను ననేక విధములు గలవు. ఇట్టి తప్పుల కుప్పలగు శాసనములును దాళపత్రమాతృకలలోని లేఖనములును సాకల్యముగఁ బ్రమాణము లనుటకంటె బరిహాసనీయమగు విషయము వేఱొకటి యుండదుగదా.

(౩౦౦)—లిపిచరిత్రము విషయమున నాంధ్రవిజ్ఞానసర్వస్వము మొదటి వాల్యములోని 'అక్షరము' అను శబ్దమునొద్ద మిక్కిలి విపులమగు వ్యాసము వ్రాయఁబడియున్నది. ఇం దట్టి విషయములు సంక్షేపముగ వ్రాయఁబడుచున్నవి.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వపు వ్యాసములోఁ బాశ్చాత్యపండితులగు మోక్షమూలరు (Maxmuller) బర్నెలు (Burnell) మున్నగు వారందఱును వ్రాసిన వ్రాఁతలు విపులముగ విమర్శింపఁబడినవి. మొత్తముమీఁద నిప్పటి లిపుల కన్నిటికిని మూలము చిత్రలిపియనియే నిశ్చయింపఁబడెను.

(౩౦౧)—పాశ్చాత్యపండితులు చాలమంది చిత్రలిపినుండి క్రమక్రమముగా 'సెమిటికు'లిపి యేర్పడెననియు, దానినుండియే లిపులన్నియు నేర్పడినవనియు దాని భేదములలో నొకటగు ఫొనీషియా లిపినుండియే కుడిప్రక్కనుండి యెడమకు వ్రాయఁబడెడి యపసవ్యమగు ఖరోష్ఠీలిపియు నెడమనుండి కుడికి వ్రాయఁబడెడి సవ్యమగు బ్రాహ్మీలిపియు నేర్పడినవనియు నందలి బ్రాహ్మీలిపినుండియే హిందూదేశములోని లిపులన్నియు నేర్పడెననియు హిందూదేశములో బుద్ధునికాలమున లిపివచ్చినదనియు నట్టిబ్రాహ్మీ ఖరోష్ఠీ లిపులు హిందువులకుఁ బాశ్చాత్యులవల్ల లభించినవనియు వ్రాసియున్నారు. లాసను మున్నగు కొందఱు పాశ్చాత్యపండితులు హిందూదేశములోని

బ్రాహ్మీ ఖరోష్ఠీ లిపులు సైతము స్వతంత్రములేకాని ఫొనీషియాలిపి పరిణామములు కావనియు నవి వేఱొక చిత్రలిపినుండి పుట్టినవనియు, వ్రాసియున్నారు. ఇందులకు సెమిటిగ్వర్ణములయొక్క యాకారముగాని యుచ్చారణముగాని భారతీయవర్ణములను బోలి యుండకుండుటయే నిదర్శనమని వీరు చెప్పియున్నారు. బ్రాహ్మణు లితరులకుఁ దమ రహస్యములు దెలియకుండుటకయి బుద్ధిపూర్వకముగా నట్లు తార్మారుచేసిరని పూర్వపక్షమువారి సమాధానమై యున్నది. మఱియు వీరు, వేదములకు శ్రుతు లనుపేరుండుటచే నప్పటివారు లిపి నెఱుగరనియు నొకరివల్ల నొకరు విని వల్లించుకొనుచుండెడివా రనియు నూహింపసాగిరి.

(౩౦౨)—మిక్కిలి యాదికాలమున వేదముల సంహితలు విడివిడిగా నున్నప్పు డవి కేవల ధ్వనిరూపమున నున్నను నాయా ఋక్కులు సంహితలుగా నేర్పడిన నాఁటికి లిపి పుట్టియుండు ననుట యుక్తమనియు నందును నతివిపులములగు బ్రాహ్మణములు లేఖ్యములు కానిచో ధారణాయోగ్యము లగుట యసంభావ్యమనియు, లిఖితపాఠకత్వము స్వరసంపాదకము కానేరమింజేసి గురుపరంపరనుండి వేదములు విని వల్లించు సంప్రదాయ మేర్పడియుండు ననియు, విజ్ఞానసర్వస్వకారు లభిప్రాయపడిరి. మఱియుఁ గ్రీస్తునకుఁ బూర్వ మయిదువందల సంవత్సరములనాఁటివాఁడగు బుద్ధుని మరణానంతరమునందలి, 'పిప్రవా', శాసన ముండుటంజేసియు, క్రీ. పూ. ౩౨౨ మొదలు ౨౯౮ వఱకు నున్న చంద్రగుప్తునికాలమందు గుడ్డలపై లేఖలను వ్రాసెడివా రని యలెగ్జాండర్ ది గ్రేటుతో వచ్చిన, 'ఇయార్కు' అను నాతఁడు వ్రాసియుండుటం జేసియు, క్రీ. పూ. ౨౭౨ మొదలు ౨౩౧ వఱకునుండిన యశోకునికాలపు శాసనము లనేకము లిపుడు దొరకి యుండుటంజేసియు, హిందూదేశములోఁ జిరకాలమునుండియు లిపి యుండెడి దనకతీరదని విజ్ఞానసర్వస్వకారులు నిశ్చయించిరి.

(౩౦౩)—వర్ణ మనఁగా రంగుగాన రంగులతో లేపనముచేసి వ్రాయఁబడునది వర్ణమనియు, నట్టిలేపనము గలది లిపి యనియు, నట్టిలిపి పురాతనకాలమున భూర్జపత్రములపైని గుండపెంకులపైని బట్టలపైని చెట్టుపట్టపైని రంగువేసిన వ్రానిబల్లలపైని వ్రాయఁబడుచుండుటచే నట్టిలిపియు దాని ధ్వనియు నశ్యములగుటంజేసి క్షరము లనిపించుకొనుననియు, నట్లు క్షరములు కాకుండఁ దాటియాకులమీఁద గంటములతో లిఖింపఁబడునవియు, రాగి

రేకులమీఁదను తాలమీఁదను జెక్కఁబడునవియు ననశ్వరము లగుటంజేసి
యక్షరముల నిలిపించుకొనునవియు నక్కారణమున వర్ణము లిపియనునవి పూర్వా
వస్థలోనివనియు, లేఖనము నక్షరము ననునవి తదనంతరావస్థలోని వనియుఁ,
గ్రీస్తుశకమునకుఁ బూర్వ మయిదువేల సంవత్సరముల క్రిందటి దనఁబడు
చున్న ఋగ్వేదమునందును, క్రీ. పూ. రెండువేలసంవత్సరముల క్రిందటి వనఁ
బడుచున్న బ్రాహ్మణాదులందును, క్రీ. పూ. ఏడెనిమిదివందల సంవత్సరముల
క్రిందటి దనఁబడుచున్న పాణిని వ్యాకరణమునందును, క్రీ. పూ. నాలుగువందల
యేండ్లక్రిందటి యాజ్ఞవల్క్యాది స్మృతులయందును వర్ణలిపి సంఖ్యాలేఖనా
క్షరాదుల ప్రశంస యుండుటచేత హిందూదేశమున లిపి చిరకాలము క్రిందటి
నుండియు నుండెడిదని యంగీకరింపక తీరదనియు, విజ్ఞాన సర్వస్వకారులు
చర్చించి సిద్ధాంతము చేసిరి. దేవనాగరలిపికే కాక ద్రావిడభాషా లిపులకును
నశోకశాసనలిపియే మూలము కానచ్చునని కాల్డువెల్లుగారు వ్రాసియున్నారు.
(కాల్డువెల్-కంపారిటివ్‌గ్రామరు, రివైజ్డ్ ఎడిషను, ౧౨౪ పుట మొదలు
౧౨౭ పుటవఱకు).

(౩౦౮)—"ఎ, ఒ, ఱ, ఴ, ఩ (ఇది తమిళ వర్ణము. ன) ళ," అను
నక్షరములు సంస్కృత ప్రాకృతములలో లేకుండుటంజేసి యట్టివాని లిపులతోఁ
గూడిన ద్రావిడలిపియే స్వతంత్రమని కొందఱు చెప్పుచున్నారు. ఇండో
యూరపియను భాషాకుటుంబములో నెచ్చటను దుది కవెస్థాభాషలోను
మూర్ధన్యములు లేవనియు, నట్టి మూర్ధన్యముల లిపులతోనున్న యశోకశాసన
లిపి ద్రావిడలిపియే యనఁదగుననియుఁ గొందఱు చెప్పుచున్నారు. కాని
యిండో యూరపియను భాషలలోనిదే యగు సంస్కృతమున మూర్ధన్య
ములు వెలయుచుండుటచేఁ బయివారి వాదము పరాస్త మగుచున్నది. కొంద
ఱిండోయూరపియను భాషలయం దెచ్చటను లేని మూర్ధన్యములు సంస్కృ
తమునం దుండుట ద్రావిడభాషా సంబంధమూలకమని చెప్పుదురు. ఇండో
యూరపియను భాషల వాఙ్మయములోనికెల్ల ఋగ్వేదమె ప్రాచీనతమ
మని సర్వసమ్మత మగుటచేతను ఋగ్వేదమునందు ధారాళముగా మూర్ధన్య
ములు వెలయుచుండుటచేతను ఋగ్వేదకాలమున నార్య ద్రావిడ సంబం
ధము గలదనుటకుఁ బ్రబలమగు నాధారము లేకుండుటచేతను దక్షిణ
యిండో యూరపియను భాషల ప్రాచీనస్థితిలో మూర్ధన్యములు లేవనుటకు

సైతము తగిన కేవల ప్రాచీన లిఖితనిదర్శనము లెవ్వియు లేకుండుటచేతను నీ పాశ్చాత్య పండితుల వాద మంతబలముగా నున్న ట్లగపడదు.

"ఖ, ఘ" మున్నగు వర్గయుక్కులు ప్రాచీన ద్రావిడభాషలలో లేవు. సంస్కృత ప్రాకృతములందు విపులములయి యున్నవి. అట్టివాని లిపు లశోకశాసనలిపిలో నగపడుచున్నవి. కాఁగా నశోకశాసనలిపి సంస్కృత ప్రాకృతములదే యనియు నద్దానిని ద్రావిడులు సంపాదించుకొనిరనియుఁ జెప్పుటయే యుక్తతమమై యున్నయది.

సర్వస్వకారులు నందినాగరలిపికి మూలమగు దేవనాగరలిపికి సైత మశోకునికాలపు బ్రాహ్మీలిపియే మూలమనియు నట్టిలిపి చిత్రలిపి మూలకమై యుండనోపుననియు వ్రాయుచు మైసూరు కాలేజీ ముఖ్యాధ్యాపకులగు శ్యామశాస్త్రిగారి తాంత్రిక చిత్రలేఖన పద్ధతి నుదాహరించియున్నారు. (ఆంధ్రవిజ్ఞా-౧ వాల్యము, ౩౬౭ పుట.)

అట్టి చిత్రలిపి పద్ధతి యిట దిఙ్మాత్రము చూపఁబడుచున్నది. గ్రీకుభాష లోనుండి 'అల్ఫా', నుండియు, హీబ్రూ 'అలీఫ్' నుండియు నింగ్లీషు భాషలోని 'ఎ' (A) అనునక్షరము పుట్టినది. అట్టి 'అల్ఫా, అలీఫ్' అనునవి యంతకు ముందటి, ఫోనిషియన్ వర్ణమునుండి పుట్టెను; 'అలీఫ్' అనఁగా నెద్దుకొమ్ముగాన దానికి గుఱుతుగా నెద్దుతలమీఁది రెండుకొమ్ములును వ్రాయుచుండువారు. కాలక్రమమున నట్టిరేఖ దాని మొదటివర్ణమైన యింగ్లీషులోని 'A' అను నక్షరముగఁ బరిణమించెను . . ఇట్లే తక్కినవియు జనించినవి.

(౩౦౫)—పయిరీతినె కామునకుఁ (శివునకు) దంత్రశాస్త్రమునందు మొదట '⊹' అనెడి గుఱుతుండెడిది. ఈ గుర్తువచ్చినచోటనెల్లఁ గాముఁడను నర్థము వచ్చుచుండెడిది. పిదప నది కామశబ్దమునందలి ప్రథమవర్ణమైన కకారమునకు గుఱుతయ్యెను. ఈ గుఱుతు దేవనాగరికి మూలమగు ప్రాచీన దేవనాగరిలో ననఁగా బ్రాహ్మీలిపిలో '+' అను గుఱుతుగా నేర్పడెను. దీని నుండి దేవనాగరిలోని 'क' అను గుఱుతేర్పడెను. ఇట్లే తక్కిన వర్ణముల యుత్పత్తి పద్ధతియు విజ్ఞాన సర్వస్వమునఁ జూపఁబడెను.

(౩౦౬)—కీర్తిశేషులగు వంగూరి సుబ్బారావుగారాంధ్రలిపియే దేవనాగరిలిపికి మూలమనియు, నాంధ్రము ప్రాకృత భేదములలో నొకటనియు నట్టి ప్రాకృతమె సంస్కృతమునకును మూలమనియు నార్య నాగరకతయె

యుత్తరమునుండి క్రమక్రమముగా నైరోపాఖండమున వ్యాపించె ననియు నాంధ్ర వాఙ్మయ చరిత్రమున వ్రాయ సాహసించిరి.

(302)—ఎవరెట్లు వ్రాసినను జిత్రలిపి మొదట నెట్లుగ నేర్పడెనో యట్టి చిత్రలిపియే లిపిగా నెట్లుమాఱినదో చెప్పుట కెవ్వరికిని నాధారము లెవ్వియు లేవు. తద్విషయమునఁ జెప్పెడివెల్ల వట్టి నిర్మూలములగు నూహలె. వేదాదుల కాలనిర్ణయమును నిట్టిదే. కావుననే పైవిషయము లందొకొక్కరొక్కొ విధముగాఁ దోఁచినరీతిని వ్రాయుచున్నారు. ఇంతయేల! బుద్ధునికిఁ బూర్వపు హిందూదేశ స్థితిగతులు చరిత్రకారులకు గాఢాంధకారమగ్నములయి యుండఁగా నిట్టి యూహ లెంతవఱకు సమూలము లగునో విమర్శకులె పరిశీలింతురుగాక!

ఇది III యక్షర ప్రకరణము

# నన్నయాథర్వణీయము

## IV అనుస్వార ప్రకరణము

చి॥ సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః । పూర్ణార్ధభేదతో ద్వివిధః ।
హ్రస్వా త్పూర్ణోపి భవే । ద్దీర్ఘాచ్చే త్ఖణ్డ ఏవ స జ్ఞేయః ॥

---

# వైయాకరణపారిజాతము

## IV అనుస్వార ప్రకరణము

(౩౦౮)—నన్నయభట్టుకాలమునకు హ్రస్వదీర్ఘములు రెండిటి మీఁదనుగల పూర్ణములు సాధారణముగఁ దేల్చిపలుకఁబడసాగెను. అందు హ్రస్వముమీఁది బిందువు తేల్చిపలుకఁబడెడి రూపమేకాక కతిపయ వ్యవహారస్థమగు నూఁది పలుకఁబడెడి ప్రాచీనరూపము సైతము పండితులచే నంగీకరింపఁబడుచు వచ్చెడిది. దీర్ఘము మీఁదనున్నదో బిందువు తేల్చిపలుకఁబడినరూపము ప్రచురముగా నుండెడిదనియు నూఁదిపలుకఁబడెడి ప్రాచీనరూపము మృగ్యమయ్యెననియు నెన్ననగును. ఆ విషయమె యిట్లు సూత్రింపబడెను.

వ్యాఖ్య. సిద్ధఇత్యాది:—సిద్ధః = ప్రకృతిసిద్ధమయినట్టియు, సాధ్యశ్చ= వ్యాకరణముచే సాధింపఁదగినట్టియు, అనుస్వారః=అనుస్వారము, పూర్ణార్ధభేదతః=నిండుసున్న యరసున్నయనెడు భేదములవలన, ద్వివిధః=రెండువిధములు గలదగుచున్నది. సః=ఆ బిందువు, హ్రస్వాత్ =హ్రస్వాచ్చునకుఁ దర్వాత, పూర్ణోపి= పూర్ణముగా సైతము, భవేత్ =అగును; అపి శబ్దముచే ఖండబిందు వెట్లును నుండునని భావము. దీర్ఘాచ్చేత్ = దీర్ఘాచ్చునకుఁ దర్వాత నన్ననో, ఖణ్డఏవ = ఖండముమాత్రమే గ్రాహ్యమగునని, జ్ఞేయః = తెలియనగును.

౧. సిద్ధపూర్ణము—కలంగు, చెలంగు; ౨. సిద్ధఖండము - కలఁగు చెలఁగు, తోఁచు, సైఁచు; ౩. సాధ్యపూర్ణము—అలంత, మగండు, కెందమ్మి ననుంగని; ౪ సాధ్యఖండము—అలఁత, మగఁడు ననుఁగని ప్రాఁజదువు, మొదలయినవి.

(౩౦౯)—పయి నియమము సిద్ధానుస్వార విషయమున మాత్రమె సార్వత్రికముగఁ జెల్లుననియు సాధ్యానుస్వారవిషయమున వైలక్షణ్యము

సయితము గలదనియు గ్రహింపనగును. వ్యాకరణకర్త ప్రత్యేకముగ దీర్ఘము మీఁద సయితము పూర్ణానుస్వారమును విధించినప్పుడట్టి విధానమును బైసామాన్యనియమము ప్రతిరోధింపఁజాలదుగదా. కావుననే "నిత్యం దారాదేశ్చ స్యా" దిత్యాదికముచే "ఆంధ్రము" మున్నగు దీర్ఘపూర్వక సాధ్యపూర్ణములు నిర్బాధము లగుచున్నవి.

పయి సందర్భమునుబట్టి సాధ్యానుస్వారవిషయమున సూత్రకర్త కంఠోక్తముగా "తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి" "బిన్దుశ్చ మహాన్ పతిక్రియార్థేషు" అనురీతిని జెప్పినస్థలములును బూర్ణమే యుద్దిష్టమయియున్నట్లు వ్యాఖ్యానము చేయఁదగిన "మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ" "టి ంట్యాదయో భవన్తీహ" "నిత్యం దారాదేశ్చ స్యాత్" "సలలో ర్బిన్దుయుతో డు ర్వా" మున్నగుస్థలములును దక్కఁ దక్కిన పూర్ణార్ధనిర్దేశములేని బిందుమాత్రవిధాన స్థలములలో మాత్రమె పై నియమము చెల్లునని సిద్ధాంతిత మగుచున్నది. కావున "పరుషా ద్రుతప్రకృతికా త్సరళాః స్యు స్తద్ద్రుతంచ బిన్దుః స్యాత్" అను స్థలమునందును "మహత స్సో ర్డు జనితో భవే త్పుంసి" "న్వన్తా న్నామః కు జ్నౌ ర్బహువచనే" మున్నగు చోటులలోని జిత్త్వముచే నుద్దేశింపఁబడిన బిందువుల స్థలములందును నిట్లె మఱికొన్ని చోటులందును మాత్రమె పయి నియమము చెల్లనగునని గ్రహింపవలయును. ఉదా. రాముండు, రాముఁడు, ఱేఁడు, కొలంకులు, కొలఁకులు, మ్రాఁకులు, వచ్చుచున్నాఁడు మొదలయినవి.

(౩౧౦)—ప్రకృత సూత్రమునకు బాలసరస్వతీ ప్రభృతులు వేఱు విధముగ నర్థము వ్రాసియున్నారు.

"హ్రస్వాత్ = లఘ్వక్షరముకంటెఁ బరమైన; సః = అర్ధబిందువు; పూర్ణోఽపి = నెఱసున్నయు; భవేత్ = అగును" (బాలసరస్వతీయము, సంజ్ఞా. ౧౫ సూత్రపు వాఖ్య).

తే—గీ॥ జగతిపై సిద్ధసాధ్య సంజ్ఞలఁ బొసంగు
ఖండములు హ్రస్వలిపులపై నుండెనేని
వానిఁ బూర్ణములను జేయవచ్చుఁ గృతులఁ
బూర్ణములు ఖండములు సేయఁ బొసఁగ వెందు. ౨౬

క॥ కొలఁకులకుఁ గొలంకులు నా ... (అప్పకవీయము. ౨. ఆ.)

"సః = సిద్ధ స్సాధ్యశ్చ ఖణ్డానుస్వారః, హ్రస్వాత్ = లఘ్వక్షరా త్పరశ్చేత్, పూర్ణోపి భవేత్, అపిశబ్దాత్ స్వరూపేణాపి స్థితో భవేత్ ..." (అహోబలపండితీయము. ౧౪౩ పుట).

పయిరీతిని బాలసరస్వ త్యప్పక వ్యహోబలపండితులు ముప్పురును సూత్రములోని "సః" అనుదానికి ఖండానుస్వారమనియే యర్థముచేసి యున్నారు. మఱియు నితర సూత్రములలోని బిందుశబ్దమునకును ఖండబిందు వనియే యర్థముచేయుచు నచటఁ బ్రకృత సూత్రముచేతనే పూర్ణమును సాధించుచువచ్చిరి.

"వ్యతిరేకార్థే లృటి లటి డుఙ్ స్యాత్" (చింతా. క్రియా. ౧౭ సూ.)

"......డువర్ణక మిట్లు జిత్తు గాన 'సానునాసికోచ్చారణం జిత్' అను ప్రాకృతవ్యాకరణముచొప్పున నర్ధబిందు పూర్వక మగును" బాలసరస్వతీ యము).

"పరుషా ద్రుత ప్రకృతికా। త్సరళా స్స్యు స్తద్రుతం చ బిన్దు స్స్యాత్" (చింతా. 3౭ సూ).

"సీ॥ ధర ద్రుతప్రకృతి శబ్దంబులపైఁ బరు
షంబులు సెడి సరళంబు లగును।
ద్రుతములు ఖండబిందువులగు నాపట్ల
గాధేయ మునివెంటఁ గదలి నడచె।
... ... ... ... ... ... ... ... ...

ఆ॥ వె॥ ... ... ... ... ... ... ...
ఇట్టిచిన్న సున్న లెల్లఁ గుఱుచ
లిపులమీఁద నుండు నపుడు గొప్పలు నగుఁ
గడమ వ్రాలమీఁదఁ గావుగాని" (అప్పకవీయము. ౫ ఆ. ౧౪౦ ప.)

"మహతః సో ర్ధు జనితో భవే త్పుంసి" (చింతామణి.)

"......... అనుక్త మన్య శబ్దానుశాసనవదితి న్యాయేన సానునాసికోచ్చారణం జిదితి సూత్రేణ సానునాసికత్వే - రాముఁడు; హ్రస్వాత్ పరత్వాత్ - రాముండు; ఇతిరూపద్వయమ్."

(అహోబలపండితీయము. ౨౪౪ పుట).

(౩౧౧)—బాలసరస్వత్యాదు లిట్లు ప్రామాదికార్థమును జేయుట కిట్టి జిత్త్వస్థలములె మూలములయ్యెనని తోఁచుచున్నది. చింతామణిలో ననేకస్థలములందు "డుజ్, కుజ్" అని యిట్లు జిత్త్వము మాత్రమె యుపదేశింపఁబడెనుగాని యెచ్చటను జిత్త్వఫలము చెప్పఁబడలేదు. కాఁగా నట్టి జిత్త్వమునకు ఫలముగా "అనుక్త మన్య శబ్దానుశాసనవత్" అను న్యాయము చొప్పునఁ బ్రాకృతవ్యాకరణములోని "సానునాసికోచ్చారణం జిత్" అను సూత్రముచే సిద్ధించు సానునాసికత్వము నంగీకరించి దానికి సరిగ నర్ధబిందుపూర్వకత్వమును జెప్పుటయుక్తమని తలఁచి బాలసరస్వత్యాదు లీమార్గమును ద్రొక్కిరని యాలోచింపవలసి యున్నది.

కాని యీసందర్భమునందలి బాలసరస్వత్యప్పకవ్యహోబలపండితుల వ్యాఖ్యలు కేవలము ప్రామాదికము లయి యున్నవని చెప్పక తీరకున్నది. చింతామణిలోని బిందువిధాన సందర్భములందలి బిందుశబ్దములు కేవల ఖండబిందు పరములే యని చెప్పుటకుఁ దగిన యధారాము లగపడవు. మీఁదు మిక్కిలిగ నీ పక్షమున "బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్ కేచిత్" "నిత్యం, దారాదేశ్చ స్యాత్" అనునవి మొదలగుచోటులందును 'నారింజ, చేమంతి అపరంజి' మున్నగు శబ్దములందును నర్ధ బిందుస్థితియే ప్రసంగకుండుటంజేసి యచట సర్వసమ్మతమగు పూర్ణబిందుస్థితి దుర్లభము కావలసి వచ్చును. పాక్షికమగు నర్ధబిందుస్థితి నచట నంగీకరించినచో 'వచ్చెఁధాత్రీపతి, అఁడ్రు' మున్నగు ననిష్టరూపములను సాధువులుగ నంగీకరింప వలసివచ్చును. ఇంతియకాక 'సః= సిద్ధ స్సాధ్యశ్చ ఖణ్డానుస్వారః ......' అను నహోబలపతి వ్యాఖ్యచొప్పున సిద్ధానుస్వారస్థలములలో సయిత మర్ధానుస్వారమునుండియే ప్రకృతసూత్రముచేఁ బూర్ణమును బాక్షికముగా సాధింప దొరకొన్నపు డట్టి పూర్ణబిందువును సిద్ధపూర్ణమని వ్యవహరించుట కేవలము నసంగతె మనక తీరదు. ఈ పక్షమున సిద్ధపూర్ణము శశవిషాణప్రాయమె యగును. ఇంతియకాక యుచ్చారణభ్రష్టమగుటంజేసి దుర్జ్ఞేయమనఁదగు నర్ధబిందువును మూలముగాఁ గొని యుచ్చారణస్థ మగుటంజేసి సుజ్ఞేయమగు పూర్ణమును సాధించుట కేవలము నసంగతము. మఱియుఁ బూర్ణమునుండి ఖండబిందువు జనించుట బిందు చరిత్రానుకూలము. ఖండమునుండి పూర్ణము జనించుట బిందు చరిత్రానుకూలము కానేరదు.

చింతామణిలో 'డుజ్' మొదలగుచోటులందలి జిత్త్వమునకు ఫలము చెప్పఁబడ నంతమాత్రమున బాలసరస్వత్యాదు లిట్టి యపమార్గమును ద్రొక్కుట యుక్తముకాదు. ప్రయోగానుసారముగాఁ బూర్ణార్ధబిందు పూర్వకత్వము జిత్త్వఫలముగాఁ జెప్పుటలో విప్రతిపత్తి యేమున్నది? బాలసరస్వతియే యొక చోట నట్లు సయితము వ్రాసి యుండలేదా?

'అనుక్త మన్యతో గ్రాహ్య' మ్మను న్యాయముచే 'హలన్త్యమ్'='ఉపదేశేఽన్త్యం హలిత్ స్యాత్' అను సూత్రముచొప్పున డుజ్ఞులోని జకారము పోవును; దాఁపల నర్ధబిందువు వచ్చును. ఇట్లుకారమును నర్ధబిందువును రాఁగా 'రాముఁడు' అనియగును. అంతటను మహచ్ఛబ్దనిష్పత్తియందు నిటువలెనే దెలియునది. డుజ్ఞు పూర్వమునం దనుస్వారముతోఁ గూడియుండును. ఆ యనుస్వారము హ్రస్వాక్షరముమీఁద నుండునది కనుక 'హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్' అనుచొప్పునఁ బూర్ణమును ఖండమునుగా రెండువిధములఁ గనుపించును. అనుస్వారమునకు డుజ్ పూర్వస్థానప్రయోగము మహాకవి ప్రయోగశరణమని తెలియునది ........" (బాలసర. - అజంత. ౧౧ సూత్రపు వ్యాఖ్య).

పయివ్రాఁత చాలవింతగా నున్నది. మహాకవి ప్రయోగములనుబట్టి జిత్త్వఫలము బిందుపూర్వకత్వ రూపముగా నంగీకరింపఁబడునపు డట్టి బిందువు పూర్ణఖండ సాధారణమె యనుటలో విప్రతిపత్తి యేమున్నదో తెలియకున్నది. అచట ననుక్త న్యాయమున నట్టియనుస్వారము 'సానునాసికోచ్చారణం జిత్' అనుప్రాకృత సూత్రముచొప్పున నర్ధానునాసిక మనఁదగు ఖండానుస్వార రూపమున వచ్చునని కల్పింపనేల? మఱియు నట్టి ప్రాకృత వ్యాకరణోక్త జిత్త్వఫలమును బ్రకృతమునందలి బిందుపూర్వకత్వమును విభిన్నవిషయములై యుండుటంజేసి యట్టికల్పనము కేవలము నసంగతమై యున్నది.

(౩౧౨)—"సానునాసికోచ్చారణం జిత్" అనుచొప్పునఁ బ్రాకృతమున జిత్తునకే సానునాసికత్వము విధింపబడినది. "హిం, హిజ్, హి, భిసః" అను సూత్రముచొప్పున వచ్చు 'హిజ్' అనుదాని జిత్త్వము 'హి' అనుదానిలోని 'ఇ' అనుదానికే యానునాసిక్యమును గలిగించుచున్నది. ఉ. రామేహి̐. (షడ్భాషాచంద్రిక) ఇట్టి ప్రాకృత వ్యాకరణ సంప్రదాయము

తెలుఁగున కెంతమాత్రము నుపచరింపఁ జాలదు. తెనుఁగున 'డుజ్' 'కుజ్' మున్నగువానిలోని జిత్త్వము ప్రాకృత సంప్రదాయము చొప్పున 'డు' 'కు' అను వానిలోని 'ఉ' కారమున కానునాసిక్యమును గలిగించుట యనఁగా నట్టి 'ఉకార' మునకుఁ దర్వాత నర్ధబిందువు నొదవించుట సమ్మతముకాదు. అట్టి 'డు' 'కు' అనువాని కవ్యవహిత పూర్వస్థితస్వరమున కానునాసిక్యము నొదవించుట యనఁగా నట్టి 'డు' 'కు' అనువానికి దాఁపల నర్ధబిందువు నొద వించుటయె యచటి జిత్త్వమున కాంధ్రవైయాకరణాభిప్రేతమగు ఫలమై యున్నది. కాఁగా 'సానునాసికోచ్చారణం జిత్' అనెడి ప్రాకృత వ్యాకరణ సంప్రదాయము డుజాదులలోని జిత్త్వవిషయమున నుపచరింపఁజేయుట కేవలము నసంగతమనుటకు సందేహము లేదు.

కావుననె బాలవ్యాకరణకర్త 'జిత్తుబిందు పూర్వకంబగు' (తత్స. ౧౯ సూ.) అని యిట్లు ఖండపూర్ణాన్యతరబిందు పూర్వకత్వమును జిత్త్వఫలముగా సూత్రించెను.

పయి సందర్భమునుబట్టి చింతామణిలోని "స జ్ఞేయః" అను చోటిలోని 'సః' అనెడి తచ్ఛబ్దము బిందుమాత్రపరమని నా చెప్పినట్లు గ్రహించుటయె యుక్తమని యెన్నవలయును.

(౩౧౩)—ఈపక్షమునఁ జింతామణి సూత్రములోని 'పూర్ణోపి భవేత్' అను వచనముయొక్క స్వారస్యముచేతఁ బూర్ణము తేలిపోయిన ఖండ బిందు యుతరూపము ప్రసిద్ధమై యున్నపుడే యీ సూత్రమునకుఁ బ్రసక్తి యని విశద మగుచుండుటంజేసి, 'నారింజ, చేమంతి, అపరంజి' మున్నగు పూర్ణము పాక్షికముగా నైనఁ దేలిపోని స్థలములందు ఖండానుస్వారశంక యంకురింప నేరదు. ఇట్టిశబ్దముల పట్టిక ముందుదాహరింపఁబడును. (చూ. ౩౨౦ వి.)

(౩౧౪)—బాలవ్యాకరణ కర్తయుఁ జింతామణిలోని యిట్టి స్వారస్య మును గ్రహింపఁ జాలక బాలసరస్వత్యాదుల వ్యాఖ్యలను జూచిన వాసన చేతఁ జింతామణిలోని 'స జ్ఞేయః' అనుచోటి 'సః' అను తచ్ఛబ్దమును ఖం డానుస్వార పరముగనే యర్థముచేసి యీ క్రిందిరీతిని సూత్రించినను నాతఁడు జిత్త్వ (డుజ్ మున్నగు చోటులందలిది) ఫలమును ఖండమాత్రముగా నంగీక రింపమింజేసియు, నట్టి ఖండమునుండి పూర్ణము నెచ్చటను సాధించియుండమిం జేసియు, నీ క్రింది యాతని సూత్రములు సైతము హ్రస్వాదిత్వాది చింతా

మణి సూత్రార్థపరములై యగుచుఁ బయినివ్రాసిన బాలసరస్వత్యాది వ్యాఖ్య లకుఁ దగిలిన దోషముల బారినుండి తప్పి సుసంగతములై యగుచున్నవి.

"హ్రస్వముమీఁది ఖండబిందునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును. అడఁకువ, అడంకువ; అరఁటి, అరంటి ఎఱుఁగుట, ఎఱుంగుట; బలఁ గము, బలంగము; మగఁటిమి, మగంటిమి" (బాల. సంజ్ఞా. ౧౮ సూ.)

"దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

వాఁడు, వీఁడు, నాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు రేఁ గులు. (బాల. సంజ్ఞా. ౧౯. సూ.)"

వీనిలో మొదటిదగు 'హ్రస్వముమీఁద' ఇత్యాది సూత్రము కేవల సిద్ధబిందు మాత్రవిషయకమె యను గ్రంథ కృదాశయ మందలి లక్ష్యములచే విశదీకరింపఁబడుచున్నది. ఢుజాదులలోని జిత్త్వమునకు ఫలము "జిత్తుబిందు పూర్వకంబగు" (బాల. తత్స. ౧౯ సూ.) అనుదానిచేత ఖండపూర్ణ సాధారణ ముగఁ బ్రత్యేకము విధింపబడి యుండుటచే బాలవ్యాకరణమునందలి 'హ్రస్వ ముమీఁద' అను సూత్రమునకు సాధ్యవిషయమునఁ బ్రక్రియలో నెచ్చటను బ్రసక్తియే లేదు. కాఁగా ద్వివిధబిందువులును సిద్ధవిషయమున హ్రస్వము మీఁదనుండునని మాత్రమె యా సూత్రమునకుఁ దాత్పర్యము నెన్నవలసి యున్నది. మఱియు నేతత్సూత్రరచనాస్వారస్యముచేత సిద్ధవిషయమున దీర్ఘముమీఁద నిండుసున్న రూప ముండనేరదనియు ధ్వనితమగుచున్నది. మఱియు 'నారింజ, చేమంతి, అపరంజి' మున్నగుచోటులం దర్ధబిందు శంక యంకురింపకయే యుండుటకై కావలయు నిట్లనుస్వారచరిత్రకు విలక్షణ ముగ ఖండము పూర్ణమగుననెడి ప్రక్రియ యంగీకరింపఁబడెనని తోఁచు చున్నది.

పయి బాలవ్యాకరణ సూత్రములలో రెండవదగు "దీర్ఘముమీఁద" ఇత్యాది సూత్రము కేవలసాధ్యబిందు మాత్ర విషయకమె యని యందలి లక్ష్యములచే విశదమగుచున్నది. కాని యా సూత్రములోని సాధ్యశబ్దము మాత్రము ప్రసిద్ధమగు చింతామణిలోని సాధ్యశబ్దమువలె వ్యాకరణసాధ్య సామాన్యపరముకాదు. 'తేండ్లు' మున్నగు పెక్కుచోటులందు బాలవ్యాకర ణము సాధ్యపూర్ణములను విధించుచున్నదిగదా. కాఁగా నీ సూత్రము జిత్త్వా దులచే ఖండపూర్ణ సాధారణమగు ననిర్దిష్టబిందువు విధింపఁబడు ప్రక్రియలో

దీర్ఘముమీఁదఁ బూర్ణము రానేరదని బోధించుటకు మాత్రమె సూత్రింపఁ బడెనని యెన్నఁ దగును. ఇట్టి తాత్పర్యము స్వారస్యముచేతనే యట్టి యనిర్దిష్ట బిందు విధాన స్థలములలో హ్రస్వముమీఁద ద్వివిధ (సాధ్య) బిందువులును నిల్చుననెడి గ్రంథకృదాశయము వ్యక్తమగుచున్నది.

(౩౧౫)—పయిరీతినున్న బాలవ్యాకరణ తాత్పర్యమును గ్రహింపఁ జాలక గుప్తార్థ ప్రకాశికకర్త యపమార్గమున నీక్రిందిరీతిని వ్యాఖ్యచే యుచు వచ్చెను.

"ఇచ్చట 'డుజ్' అనుదానియందలి జకార మిత్తు గనుక 'జిత్తుబిందు పూర్వకంబగు' అను పందొమ్మిదవ సూత్రముచే డుజ్జునకు ముందు బిందువు వచ్చి ... 'డిద్ధుఁడు' అనిద్దైనది. తరువాత 'హ్రస్వము మీఁదనున్న యరసున్న నిండుసున్నయగును' అనునర్థమునిచ్చు సంజ్ఞాపరిచ్ఛేదమునందలి పదునాల్గవ సూత్రంబున 'డిద్ధుండు' అని యగును." (బా. గు. ప్ర. తత్స. ౨౨ సూత్ర వ్యాఖ్య)

ఇట 'జిత్తు బిందుపూర్వకం బగు' అనుసూత్రములోని యనిర్దిష్టమగు బిందు శబ్దమునకుఁ గేవల ఖండ బిందుపరముగా వ్యాఖ్య చేయుటలో నాధార మేమో తెలియకున్నది. మఱియు 'ఆదేశ సరళములకు ముందున్న ద్రుత మునకు బిందుసంశ్లేషములు విభాషనగు' (బాల. సంధి-౧౭ సూ.) అనునది మొదలగు సూత్రములలోని బిందుశబ్దమునకు 'అరసున్నయు నెఱసున్నయు' అని యిట్లు పూర్ణార్ధ సాధారణముగ వ్యాఖ్యచేసియు నిచటఁ దద్విలక్షణముగ వ్యాఖ్యానము చేయుటలో నాధారమేమో తెలియ రాకున్నది.

మఱియు గుప్తార్థ ప్రకాశికాకర్త బాలవ్యాకరణములోని "దీర్ఘము మీఁద" ఇత్యాది సూత్రములోని సాధ్యశబ్దము వెనుకవ్రాసిన రీతిని వ్యాకరణసాధ్య సామాన్యపరము కాదని సయితము గ్రహించియున్నచో "దీర్ఘాక్షరము తర్వాతను నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయునుగాని వ్యాకరణముచేత నిండుసున్న రానేరదు. అరసున్న శాస్త్రముచేత రావచ్చును. ఉ. తాఁజెప్పె, వాఁడు" (బాల. సంజ్ఞా. ౧౫ సూత్రపు వ్యాఖ్య). అని యిట్లు వ్రాసియుండఁడు గదా.

"వేఁటకాండ్రు, తేండ్లు, తేంట్లు, వాండ్రు, పీండ్రు" మున్నగు ననేక స్థలములలో సాధ్యపూర్ణమును విధించిన (బాల-అచ్ఛి-౭-౮-౧౧-౧౫-౨౪,

మొ.) బాలవ్యాకరణకర్త కిట్టి యభిప్రాయము గలదనుట కేవలము నసంగత మనుటకు సందేహములేదుగదా. మఱియు "దీర్ఘముమీఁద" ఇత్యాది ప్రకృతసూత్రపు స్వారస్యముచే దీర్ఘముమీఁద సిద్ధపూర్ణము వైయాకరణ సమ్మతమని తలఁచుచు "దీర్ఘాక్షరమునకుఁ దరువాతను నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనె యుండవలయు" నని వ్రాసిన వ్రాఁతయు బాలవ్యాకరణ సమ్మతము కానేరదు గదా. 'తోఁచు, సైఁచు' ప్రాఁత' మున్నగు సిద్ధఖండముల చోట 'తోంచు,' సైంచు, ప్రాంత' మున్నగురీతిని సిద్ధపూర్ణములను సాధువులుగ నంగీకరించుట సకలాంధ్రవ్యాకరణవిరుద్ధ విషయమనుటకు సందేహము లేదుగదా. ఈ పట్టున నిక్లె మఱికొంద ఱాధునికవ్యాకరణ కర్తలును వివిధములగు నపమార్గములఁబడి యున్నారు.

(3౧౬)—ప్రాచీనులగు మూలఘటిక కేతనామాత్యుఁడు, విన్నకోట పెద్దనామాత్యుఁడును ·జింతామణి కర్తవలెనె మిక్కిలి జాగ్రత్తగా సూత్రించిరేకాని వెనుకవ్రాసినవారిరీతిని బ్రమాదముగ సూత్రింపలేదు.

క॥ కుఱుచలతుది హల్లులకున్ ।
బిఱుఁద న్నెలకొన్నయట్టి బిందువులెల్లన్ ।
నెఱయఁగ నూఁదుచుఁ దేలుచు ।
నొఱపై యిరుదెఱఁగు చెల్లుచుండుం గృతులన్ ॥

కం॥ ననుఁగను నన్నుంగనుఁ దా ।
ఘనుఁడు ఘనుండనఁగ జెల్లుఁ గవ్యనుమతిచేఁ ।
దనబోఁటి లోభివాఁడితఁ ।
డన, నిడుపులమీఁది బిందు లర బిందులగున్ ॥

కం॥ కుఱుచలపై యరబిందులు ।
నెఱయఁగ నూఁదినను జెల్లు నిడుపులమీఁదన్ ।
నెఱయవు; పద్యంబులనౌ ।
నెఱబిందువు; లేదు గద్యనికరములోనన్ ॥

(ఆంధ్రభాషాభూ. 55-56-57 ప)

కం॥ అలఁతుల (హ్రస్వముల) తుద, హల్లులకును ।
వలవఢ వామమున నుండు నచ్చోట్టులనే ।

పలుమఱుఁ దేలుచు నూఁదుచు ।
విలసిల్లుట గలుగు లక్ష్మీవిధి నెఱుఁగఁ దగున్ ॥

క౦॥ తనుఁ బొగడుఁ దనుం బొగడును
జనుఁడు జనుండనఁగఁ దెనుఁగు జాడలు గలుగున్
మనవాఁడు వీఁడు నాఁగాఁ ।
జను; నిడుపుల వలవ దూఁద సరళతకొఱకున్ ॥

(కావ్యాలం. ౯ ఉల్లాసము. 62-63 ప.)

(౩౧౭)—దీర్ఘమునకుఁ దర్వాత సిద్ధమగు నిండుసున్న నిలువదను నది చింతామణ్యభిప్రాయమని యీక్రింది శబ్దరత్నాకరాది కోశస్థ శబ్దము లనుబట్టి చెప్పవలసియున్నది.

| | |
|---|---|
| ఈఁడ్రించు = పీడించు | తాండ్ర = విభీతకవృక్షము |
| గాండ్రించు = (ముఖము) ఉబ్బ | తీండ్రము = దురద |
| గాండ్ల=నూనెయమ్మి జీవించు జాతి | తీండ్ర = తేజము |
| గౌండ్లవాఁడు=సారాయమ్మువాఁడు | మేండ్రించు = భేదించు |
| జీండ్రము = దురవస్థ | వేండ్రము = తాపము |

సాంబ్రాణి = ఉత్తమాశ్వము, సుగంధద్రవ్య విశేషము.

ఇట్టి సంయోగపరక దీర్ఘపూర్వక పూర్ణములు స్వాభావికములై యున్న వనవచ్చును. సంయోగము పరమగునపుడు పూర్ణబిందూచ్చారణమునఁ బ్రత్యేక శ్రమ ముండనేరదుగాన నయ్యది ఖండబిందువుగాఁ దేలిపోవ నేరదు. సంయోగపరకములు కానివిసైతము దీర్ఘపూర్వక పూర్ణములు కొన్ని శబ్దరత్నాకరాది కోశములలోఁ జూపబడియున్నవి.

| | |
|---|---|
| అమాంతము=అకస్మాత్తుగ, చిల్లరబేరము | ఏకాండము = అఖండమైనది |
| కాంచనము = కోవిదారము | పూంచు - పూనఁజేయు |
| కళాంజి, కాళాంజి = తమ్మపడిగము | ప్రేంకణము = ప్రియాళువృక్షము |
| కాంచు = కనఁజేయు | చాంగు ఒళా = ప్రశంసార్థకము |
| చాంగణ = మల్లబంధవిశేషము | మాందాళి=కృత్రిమరత్నము,పట్టుచీర |
| తాంబాళము = పళ్ళెరము | వాంచు = (వంచు) వంగఁజేయు |
| వేంచేయు = వచ్చు | |

పయివానిలోఁ గొన్నిటికి మాత్రమె ప్రయోగములు చూపట్టు చున్నవి.

గీ. "మలిచి యేకాండముగ నొక్క మానికమున" (నైష. ౬ ఆ.)

"రగడ. పుడుకు మల్లన గందవొడిని బ్రేంకణము
తడయకిట నిత్తుఁ దగ రత్నకంకణము" (స్వారో. 3 ఆ.)

"సీ. జిలుఁగు పావడమీఁదఁ జికుర ధిక్కృత మిళిం,
దాళి యొక్కటివ మాఁందాళిఁ గట్టి" (పంచ. వేం ౪ ఆ)

క॥ కాంచనమాలాలంకృత, చంచత్తను లీల మెఱయ జవనాశ్వములన్ ।
బూంచి రథంబున మణిమయ, పంచానన కేతు వెత్తె బంధురభంగిన్.
(భార. విరా. ౪ ఆ.)

క॥ కులపతియు వేత్రధరు లా । త్తిలి చాంగు బళా యనంగఁ దేరు డిగి...
(వసుచరిత్రము, ౧ ఆ. ౧౫౫.)

పయిశబ్దములలో "పూంచు వాంచు" శబ్దములు ప్రేరణార్థకము లగుటంజేసి యందలి పూర్ణములు సాధ్యము లనిపించుకొనునుగాన వానివిషయమున నంతగా వివాదము లేదు. 'కాంచు, అనునది శబ్దారత్నాకరమునఁ బ్రేరణార్థకముగా వ్రాయఁబడలేదు. సకర్మక క్రియగాఁ వ్రాయఁబడియున్నది. ఆపక్షమునందును దానిని స్వార్థేంచు గాగమాంత మనఁదగును గాన నందలి బిందువు సిద్ధమె యనవచ్చును. లేదా 'కను' ధాతుప్రేరణ రూప మననగును.

తక్కినవి వ్యవహార మాత్రగతము లగుటచేత "దీర్ఘాచ్చే త్ఖణ్డ ఏవ సజ్ఞేయః" అను చింతామణి సూత్రము నిర్బాధ మనఁ దగును. మఱియు నట్టి బిందువులెల్ల హ్రస్వపూర్వకములె యన్నను క్షతి యగపడదు కాని యట్టి యలంతిస్థలములలో దీర్ఘముమీఁది బిందువు సయితము దేలక నిల్చినదనుట లెస్సయని తోఁచెడిని.

(౩౧౮)—శబ్దరత్నాకరాది కోశము లంగీకరింపని 'మూండు = మూఁడు, పోండి = పోఁడి' మున్నగు శబ్దములు కొన్ని గలవనుచు నీ క్రింది ప్రయోగములను గొందఱు చూపుచున్నారు.

కం॥ పోండిగ నగజ తపశ్శిఖి । మూండుజగంబులను దీవ్రముగఁ బర్విన బ్ర ।
హ్మాండము కాఁచిన కాంచన । భాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై.
(నన్నిచోడుని కుమారసంభవము)

ద్విపద. పాండురాంగంబైన పడఁతి గర్భమునఁ ।
భోండిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁ డీక్రియను । (బసవపురాణము)

ప్రగీతి. మూఁడు సేసినగణములు రెండు నలములు ।
మూఁడ దీనగణములును మొగి సహంబు ।
పోండిగాఁగ నర్ధమునకగు మీఁద ని ।
త్తుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి.

(కవిజనాశ్రయము, జాత్యధికారము.)

ఇట్టి చోటులందెల్ల 'బూర్ణములు లేవనియు నచట నర్ధబిందువులె నిల్పనగుననియు నట్టియెడల ఖండ పూర్ణ ప్రాస మనఁబడెడి పూర్ణార్థబిందు ప్రాస మంగీకార్యమనియుఁ గొంద అభిప్రాయపడుచున్నారు. కాని యిట్టి ప్రాసము భారతాది మహా గ్రంథములలో నగపడదు. అప్పకవ్యాది లాక్షణికులును నంగీకరించి యుండలేదు. కాఁగానె యిట్టి శబ్దములలోని బిందు వసాధువని శబ్దరత్నాకరకారాదులు తలంచి యుపేక్షించిరి. ఇట్లె "పరుషే సరళేచైవ । పరవవహో దృశ్యతే" అను నాథర్వణిక నియమమునకు విలక్షణముగా 'కంసాలి' మున్నగుపదములు వాడుకలో నగపడుచుండఁగా శబ్దరత్నాకర కారాదులు వానిని "కమసాలి" మున్నగురీతి నుదాహరించి "కంసాలి" మున్నగు చోటులలోని పూర్ణమునం దసాధుత్వమును వ్యక్త పఱచియున్నారు.

అట్లయినను పాల్కురికి సోమనాథుఁడు మున్నగు కవుల గ్రంథములలోఁ బ్రయుక్తములై యుండుటంజేసి "మూఁడు, పోండి" మున్నగు దీర్ఘపూర్వక పూర్ణబిందువులను బాక్షికముగా నంగీకరించుటయె యుచితమని గ్రహింపవలెను.

(౩౧౯)—ఇంక హ్రస్వము మీఁది పూర్ణములు పాక్షికముగా నయినను ఖండములుగాఁ దేలిపోక పెక్కు నిలిచియున్నవి. కావునఁ జింతామణి కర్తచెప్పిన "హ్రస్వాత్పూర్ణోపి భవేత్" అను నియమముచేత హ్రస్వముమీఁద ఖండము సార్వత్రికమని యెంచరాదు. "ప్రథమాన్తై భక్తిక మో, ర్బిన్దుశ్చ మహాన్ పతిక్రియార్థేషు" అనియు "మోస్తు విభక్త్యైక వచనకే పుంపూ" అనియు "ఔపవిభక్తిక సంజ్ఞా, వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ" అనియు నిట్లుచింతామణియే "భయపడు, భయంపడు, నిద్దంపు = నిద్దపు, మూఁడింటి= మూఁడిటి" మున్నగు చోటులందు ఖండబిందువు లేదని విశదీకరించుచున్నది. అచట నర్ధబిందువులే సమ్మతములయిన యెడల 'మహన్ బిన్దుశ్చ, అనియు, "టింటు" లనియు, 'పుంపు' లనియు వేర్వేఱ నుపదేశింపఁబడియుండవు గదా.

'పదంపడి' 'పదపడి' యున్నగుచోటులందు రూపాంతరములో నిండుసున్న చోట నరసున్నను సల్పు వాడుకలేదు. (పదము+పడి=పదంపడి కానోపును.)

(3-౨౦)—కొన్నియెడల నున్న పూర్ణములు తేలిపోకయె వాడుకలో నిల్చిపోవుటచేత నర్ధబిందుఘటిత రూపాంతరములే లేకుండుటయుఁ గలదు. అట్టివానిని శబ్దరత్నాకరాది కోశములనుండి యేర్చి యిటఁ జూపుచున్నాను.

అడ్డంకి = నిరోధము
అపరంజి = బంగారము
అబ్బెంద = ఒకచెట్టు
ఆటంకము = నిరోధము
ఆఁడంగి = స్త్రీస్వభావముగల పురుషుఁడు
ఆడంగులు = స్త్రీలు
ఆరంగపువక్క = మంచిజాతి పోఁక చెక్క
ఆరంజోతి = అరుంధతి
ఆలంకి = పల్లకి
ఆలంకులు = బాలక్రీడా విశేషములు
ఇల్లింద = ఇంద్రవల్లి
ఉటంకము = సంగ్రహము
ఉటంకించు = సంగ్రహించు, సంక్షేపించు
ఉత్తండములు=భూషణవిశేషములు
ఉల్లింద = ఒక జాతిచెట్టు
ఉల్లంకి = పక్షివిశేషము
ఒప్పందము=బేరములోని యేర్పాటు
ఒల్లెంక = ఒకచేప
కలగుండు = కలఁత
కలబంద = ఒకదినుసు మందుచెట్టు
కలంకారి = వ్రాఁత పనిగల బట్ట
కసింద = ఒకజాతిచెట్టు
కాపంతము = కుక్కనుగట్టు కొయ్య
కామంచి = కత్తృణము (వృక్ష)
కొండెంగ = కొండముచ్చు
కొఱవంజి = ఎఱుకవాఁడు
కోదండము = బాలశిక్షావిశేషము
కోరింద = ఒకతీఁగె
గంటుబారంగి = ఒక మందుదినుసు
గరుటామంతుఁడు = గరుత్మంతుఁడు
గిడ్డంగి = చెఱసాల
గున్నంగి = ఒకపక్షి
గురివెంద = గురిజపూస
గోరంక = గోరువంకపక్షి
గోరింపు = ఎగపు
గోరువంక = గోరువంక పిట్ట
చిగిరింత = తృణవిశేషము
చేమంతి = పుష్పవిశేషము [దూల
తీఁటకసివెంద, తీఁటకసింద = రేగటి
దావంతము = దుఃఖము
దిసంతు = నింద
నారింజ = నారంగవృక్షము
నిస్సంతు = వంశహీనము
నెరవంజి = వృక్షవిశేషము
నెరవెంద = తీక్ష్ణగంధమను చెట్టు
పటాపంచ = అగోచరము
రపంగి = శ్వేతముఖుఁడు

పరంగీలాగి = కెంపుజాతి దినుసు
పరవంజు = వేష్టించు
పరియంకము = మంచము
పావంచ = సోపానము
పిరంగి (ఫిరంగీ) = తుపాకి
పూసకామంజి = తృణవిశేషము
పొన్నంగి = పక్షివిశేషము
బండిగురివెంద = లతావిశేషము
బగ్గుండి = రక్తవర్ణచూర్ణము
బయ్యంకలు = వేవిళ్ళు
బరివెంక = పక్కెచెట్టు
బలవంతము, బవంతము = బలాత్కారము
బవంతి = చిత్రవస్త్రము, గృహవిశేషము
బాలెంత = పురుటాలు
బావంజి = వృక్షవిశేషము
బెలంచి = పక్షివిశేషము
మడిమంచ, మడిమంచము = బలహీనము
మిసిమింతుఁడు = శ్రాంతుఁడు
ముచ్చంగి = మత్స్యవిశేషము
మొగరంబము = తుమ్మెద
మోళంగి = ములక
లోహాఁడి = పచనపాత్రము
లేమబంతి = బొంకు
లోలాంక = మల్లబంధవిశేషము
వందొందు = మత్స్యవిశేషము
వ్రడంగము = వర్ధకికర్మము
వ్రడంగి, వ్రడంకి = వర్ధకి
వయ్యంది = ఇనుపగోలెము
వసంతము=పసుపుసున్నము కల్పినసీరు
వాయివిళంగము = ఒకమందు దినుసు
నాయింట, వావింట = ఒక దినుసు కూరాకు
వియ్యంకుఁడు = వీరకాఁడు
విళంగీలు = తిట్టులు
సరంగు = నావికుఁడు
సలించు = చలించు
సిరంగుఁడు = శ్రీరంగుఁడు
సిరంగము = శ్రీరంగము
సిరిమంతుఁడు = శ్రీమంతుఁడు
సొరంగము = గుహవంటి రంధ్రము
సోరంగి = మత్స్యవిశేషము
హురుమంజి = మాక్తికవిశేషము
హురుముంజి = దేశవిశేషము
హొరంగు = విలాసము

వికృ. శ్లో. నఖణ్డః ప్రథమా ద్ధ్రస్వా । న్నస్య లోపశ్చ నేష్యతే
తృతీయే ప్రథమే వర్ణే । పర ఏవ హి దృశ్యతే ।
బిన్దు ర్వైకృతమధ్యేచ । నాన్యవర్ణే పరేతు సః ॥

(౩_౨౧)-వ్యాఖ్య-నఖండ ఇత్యాది :- హ్రస్వాచ్చునకుఁ దర్వాతి పూర్ణము వికల్పముగాఁ దేలిపోవునని చింతామణి సూత్రము పదాది హ్రస్వమునకుఁ దర్వాత నుపచరింపమింజేసి యద్దాని నథర్వణుఁడు సవరించుచున్నాఁడు. మఱియుఁ దెల్గునఁ బదాది హ్రస్వమునకుఁ దర్వాత ద్రుతము లోపింపదనియు స్థిరపరకబిందువు నిలువ నేరదనియు విశేషములను విశదపఱచుచున్నాఁడు.

ప్రథమాత్ = శబ్దాదినున్న, హ్రస్వాత్ = హ్రస్వమునకుఁ బర మున, ఖణ్డః = ఖండబిందువు, న = లేదు ; నస్య = అట్టిచోటనుండెడి ద్రుతమునకు, లోపశ్చ = లోపము సైతము, నేష్యతే = అంగీకరింపఁబడదు. అచ్చ తెలుఁగు శబ్దమునడుమ, తృతీయే = వర్గతృతీయమగు సరళ వర్ణముగాని, ప్రథమే = వర్గప్రథమమగు పరుషవర్ణముగాని, పరేఏవ = పరమైనదై యుండఁగా మాత్రమే, బిన్దుః = ఖండపూర్ణాన్యతరమగు సున్న, దృశ్యతే = అగపడుచున్నది. అన్యవర్ణే = అట్టి పరుషసరళములకు భిన్నమగు స్థిరవర్ణము, పరేతు = పరమైనదై యుండఁగా, సః = అట్టి బిందువు, నహి = అగపడదు గదా. హిశబ్దము ప్రసిద్ధార్థకము.

(౩_౨౨)—పయిసూత్రముల యర్థము బాలవ్యాకరణమున నీక్రింది రీతిని వివరింపఁబడెను.

'అఁట యిఁక చుఁడు' శబ్దములందప్పు నుడి తొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. " (సంధి - ౨౨ సూ.)

"సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది. (సంజ్ఞా. ౧౬ సూ.)

(౩_౨౩)—ఈ విధానములు సయిత మనిర్దిష్టబిందు విధానముల సందర్భములలోఁ బదాది హ్రస్వమునకుఁ దర్వాతి ద్రుతమునకు లోపమును గాని, ఖండబిందువునుగాని చేయరాదనియు, స్థిరపరకత్వమున ఖండమును గాని, పూర్ణమునుగాని నిలుపరాదనియుఁ బ్రక్రియావిషయమున నుపదేశించుచున్నవి. ఉ. 'క్రొత్త + పసిఁడి = క్రొంబసిఁడి' ఇట్టిచోటులందు 'క్రొఁబసిఁడి' అనురీతిని ఖండము రానేరదు. 'కన్దోయి' ఇట్టిచోటులందు 'కదోయి'

అనురీతిని ద్రుతలోపమును జేయరాదు. "ఏఁగు—ఏంక్లు: వేసఁగి = వేసంగి = వేసవి" మున్నగుచోటులందు, "ఏంళ్ళు; ఏఁళ్ళు, వేసంవి; వేసఁవి" మున్నగురీతిని రూపసాధనమును జేయరాదు.

(3_౨౮)—వెనుక వివరింపఁబడిన (3౦౮) విషయము హ్రస్వాత్పూర్ణో పీత్యాది సూత్రములును, ప్రకృతములగు 'నఖండ' ఇత్యాది సూత్రములును బై రీతిని ప్రక్రియలో నుపయోగించుటయే కాక యుచ్చారణ భ్రష్టమగు నరసున్నయొక్క స్థితిని సూచించుటలో సైత ముపయోగపడుచున్నవి.

పరుషసరళములకు ముందే బిందువుండు నను నియమముచేత స్థిర పరకత్వమున నరసున్న యుండునేమో యని సందేహించి కోశాదులను జూచి కొన నక్కఱలేదు. అట్లే పదాది హ్రస్వమునకుఁ దర్వాత ఖండము నిలువనేర దను నియమముచే నట్టిచోటులు పరుష సరళ పరకములయి పూర్ణబిందు ఘటిత రూపములుకలనై ఖండస్థితి యోగ్యము లగుచున్నను నట్టియెడల ఖండానుస్వారఘటిత రూపాంతరమున్నదేమో యను సందేహము నంద నక్కఱలేదు. ఉచ్చారణస్థమగుటంజేసి సుజ్ఞేయమగు హ్రస్వపూర్వక సిద్ధ పూర్ణముతో నున్న రూపమును నదిలేని రూపమును గోచరము లగునపు డానిండుసున్న చోట నరసున్న యున్నదని గ్రహింపనగును. (ఉ. కలంగు = కలఁగు మొ.) సాధ్యబిందువుయొక్క కలిమిలేములు వ్యాకరణము వలననే సుజ్ఞేయములు కాఁగలవు. ఇంకఁ 'బరుషసరళ పరకత్వమును దీర్ఘపూర్వకత్వ మును గల తావులందలి సిద్ధ ఖండముయొక్క కలిమిలేములను మాత్రము సందేహించి కోశాదుల సాహ్యమున గ్రహింపవలసియుండును.

(3_౨౯)—ఇంక నిండుసున్న తేలిపోవుటలోని స్వాభావికత యిట పరి శీలింపఁబడుచున్నది.

అనుస్వారోచ్చారణమునకయి నిశ్వాసమును నాసామార్గమునుండి విడిచి యనుపదముననె యనంతర పరుషసరళాన్యతర వ్యంజనోచ్చారణమున కయి యట్టి నిశ్వాసమును ముఖమార్గమునుండి విడుచుట యనెడి ద్వివిధ ప్రయత్నములను గొంత యవ్యవహితముగ జరపుట శ్రమాపాదక మగుటం జేసి యుచ్చారణ సౌకర్యాపేక్షచే నిశ్వాస నాసామార్గ నిస్సరణ యత్నము సడలిపోవునుగాన బిందువు తేలిపోయి యర్ధానునాసికస్థితి నందుట స్వాభావిక మగుచున్నది. ఇట్టి యర్ధానునాసిక్యము సైతము నేఁటికి నిశ్శేషముగా నుచ్చా

రణ భ్రష్టమాయినదనుట యెల్లరకును విదితమె. అట్లయినను నుచ్చారణ
ములో నలవాటుపడియున్న యాయా శబ్దములలోని తత్తద్వర్ణముల గౌరవ
మునకు భంగము కలుగుట సుసంభవముకాదుగాన నట్టి లోపమునకు గొంత
ప్రతిబంధమును గలుగుచుండును. దీర్ఘములకుఁ దర్వాతి సున్నలు లోపించినను
బలుకుబడిలో నలవాటయియున్న పూర్వాక్షర గౌరవము చెడనేరకుండుటం
జేసియు దీర్ఘమునకుఁ దర్వాత నిండుసున్నను బలుకుట కేవలము శ్రమాపాదక
మగుటంజేసియు దీర్ఘపూర్వక పూర్ణము తేలిపోవుట ప్రచురమగుచు వచ్చెను.
పరస్థిత సంయోగోచ్చారణమునకయి యూఁదుటకు యత్నించినపుడు
పూర్వాచ్చును పూర్ణానునాసిక్యముతో నుచ్చరించుట యనఁగాఁ బూర్ణ
బిందువుతోఁ గూడిన దానిగాఁ బలుకుట సుకరమె కాన సంయోగ
పరకత్వమునం దర్ధము సైతము పూర్ణముగా మాఱిపోవును. శబ్దముల నుచ్చ
రించుటలో నుచ్చారయితలకుఁ బ్రథమాక్షరమున నున్నంతటిశ్రద్ధ యుత్త
రోత్తరవర్ణములపై నుండనేరదు. కానఁ బదాదిస్థలేతర హ్రస్వమునకు దర్వాత
నున్న సున్న కాలక్రమమున సంభవింపఁదగు తత్తద్వర్ణ గౌరవ విస్మృతిమూల
మునఁ దేలిపోవుట కొందఱ యుచ్చారణములో సంభవింపవచ్చును.

(3_౨౮.)—అక్కాఱణముననే దీర్ఘము మీఁద నిత్యముగాను బదాదీ
తర హ్రస్వము మీఁదఁ బాక్షికముగాను సాధారణముగాను బూర్ణము ఖండ
ముగా మాఱుచుండుటను మహాకవులును వైయాకరణలును నంగీకరించిరని
గ్రహింపనగును. పూర్ణబిందువు తేలిపోవుటనఁగా బూర్వాచ్చునందార్ధాను
నాసిక్య మావేశించుటయె. వ్యవహారమున నుచ్చారణ సౌలభ్యాపేక్షచే నట్టి
యర్ధానునాసిక్యము సైతము పెక్కుర యుచ్చారణమున నానాఁటికి నశించినను
నాంధ్రభాషకు వ్యాకరణ వాఙ్మయములచే స్థైర్యము నొదవించిన యాంధ్ర
కవి పండితుల కాలమున కంతగా నశించి యుండమింజేసి యాంధ్రవాఙ్మయ
మున నర్ధానుస్వారము నెలకొల్పఁబడిన దయ్యెను. వేయేల! నేఁటికిని గొన్ని
మండలములలోఁ గొందఱ యుచ్చారణమున దీర్ఘ పూర్వకస్థలములందు
సైతము పూర్ణానుస్వారము వినఁబడుచునే యున్నది. ఇంక హ్రస్వపూర్వక
స్థలములందు గలదని వేఱ చెప్పనేల! ప్రాచీనాంధ్ర మహాకవులనాఁటి కర్ధ
బిందుశకటోచ్చారణములు నశించియె యున్నయెడల వ్యవహారమున లోపిం
చిన మఱికొన్ని యక్షరములనువలెనె వీనిని సయితము వారుపేక్షించియే
యుందురు గదా. ఆంధ్ర మహాకవు లట్లు విడువక వాని నీక్రిందిరీతిని బాటిం

చుచు వచ్చుటంజేసియే యాంధ్రవైయాకరణులు వానిని సంగ్రహింపవలసిన వారయిరి.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
వోఁడిగ వేల్వఁగాఁబడియెఁ బ్రొద్దును బోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగ బాధ నొందెనో ॥
(భార. ఆది. 3 ఆ.)

(3_౨౭)—ఇట్టి నియమ మనఁగా ఖండబిందువులను ప్రాసములలో నవ్యభిచరితముగ బాటించుట, యొక్క నన్నయ భట్టారకుని భారత భాగమున మాత్ర మగపడుచున్నది. కాలక్రమమున నట్టి యర్ధానునాసిక్యము సైతము నశించుచు వచ్చుటంజేసి యుత్తరోత్తర మహాకవు లట్టివానికి సఖండ నిర్బిందు రూపములను రెండిటిని నంగీకరించి ప్రాసాదులలోఁ బ్రయోగించుచు వచ్చిరి. కాని సఖండాఖండ రూపముల వినికిలో వైరూప్య మంతగా భాసిల్లమింజేసి కావలయు నాంధ్రలాక్షణికులు రేఫ అకారముల విషయమునందువలె నీవిషయమున నుభయరూపాంగీకారము చేయక ఖండాఖండ ప్రాసము నంగీకరించిరి. రేఫఱకార మైత్రిని నిరసించినట్లు ఖండాఖండ ప్రాసమైత్రిని వైయాకరణులు నిరసింపకుండుటయు నిందులకుఁ గారణము కానోపును. కాని యొకప్పుడు సబిందుక మయియుండు శబ్దము కాలక్రమమున వాడుకలో నిర్బిందుకముగా మాఱినపుడు దానికుభయ రూపముల నంగీకరించుటయె యుక్తమును శబ్దచరిత్రానుకూలమును నైయుండు ననుటకు సందేహములేదు. అట్లు కానియెడల నేఁటివాడుకలో ఖండబిందు శ్రుతి యెందును లేమింజేసి యింక నర్ధానుస్వారఘటిత రూపముల నంగీకరింపవలసిన ప్రసక్తియే లేకపోవలసి వచ్చునుగదా.

ఒక్కశబ్దమునకు ద్వివిధోచ్చారణము లుండనేరవు గావున నొక్కదానికిట్లు రూపద్వయము నంగీకరించుట సరికాదని శంకింపఁజనదు. అట్లయిన శబ్దముల కింక రూపాంతరోత్పత్తియె యసంభావ్యము కావలసి వచ్చును. దేశకాలాది భేదములనుబట్టి యట్టి రూపద్వయమునకును వ్యవహారస్థితి విరోధింప నేరదు. ఇట్లె కన్నడమునఁ బూర్ణబిందు ఘటితరూపమును నిర్బిందుక రూపమును నొక్కదానికే యంగీకరించి శబ్దమణిదర్పణమున 'కేశిరాజు'

సూత్రించి యుండలేదా ? (కన్నడమున నర్ధబిందు ఘటితావస్థ గ్రహింపఁ బడలేదు. ఉండినచోఁ బూర్ణబిందువుండును. లేదా దానిని నిర్బిందుక మందురు.) "క॥ కెలవు నిజబిందుగళ్ కెల। కెలవు వికల్పార్ధబిందుగళ్ ......(శబ్దమణి - 47 పుట) (కొన్ని సానుస్వారములును గొన్ని వికల్పానుస్వారములును గలవు)......నిత్యబిందుగె - బెడంగు - కడంగు - అండగు......ఇవు మొదలావు. వికల్పబిందుగె కదంపు=కదపు = (దవుడ, బుగ్గ) కొడంకె = కొడకె= (చెవి-) జినుంగు = జినుగు = (ఝాంకారము, ఝాంకరించు)" (శబ్దమణి. ౪౭ పుట.) (ఇక్లె తమిళ పండితులును నర్ధానుస్వారస్థితిని గ్రహింపఁజాలరైరి.) ఇంతయేల యాంధ్రలాక్షణికులు నయితము హ్రస్వోపరిపూర్ణబిందుయుతముల విషయమునఁ బూర్ణఖండయుత రూపద్వయము నంగీకరించియుండలేదా ?

(౩౨౮)—మఱియు నాంధ్రలాక్షణికులు రేఫ ఱకారముల విషయమునఁ జేసినంతటి పరిశ్రమము సఖండాఖండ శబ్దముల విషయమునఁ జేసినట్లగపడదు. ముద్దరాజు రామనయు ననంతుఁడును మొట్టమొదట నీవిషయమునఁ గొంతపరిశ్రమము చేసినట్లగపడుచున్నది — ముద్దరాజురామన దీర్ఘములమీఁద మాత్రమె ఖండాఖండ ప్రాసము గలదని చెప్పియున్నాఁడు. హ్రస్వముల మీఁదను సైతము చెల్లుననుచుఁ దిమ్మకవి యీ క్రిందిరీతిని విమర్శించెను. అనంతుఁడు పకార టకారముల విషయమున మాత్రమే సఖండాఖండ ప్రాసము నీ క్రిందిరీతి నంగీకరించెను.

గీ. సార్ధబిందువులై తేలినట్టి పటల, కరయఁ బ్రాసంబు నిర్బిందువైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱితలమోపులయ్యె,మాటలేటికి మేటితాఁబేటి కనఁగ.
(ఛందోదర్పణము ౧ ఆ. ౫౨)

ఈతఁ డీ క్రింద నుదాహరించు నన్నయభట్ట ప్రయోగములోని 'వీఁపు' శబ్దము సార్ధ బిందుకముగా నెంచియు 'తాఁబేటికి' అను దానిలోని టి వర్ణము సైతము ఖండపూర్వకమెయని తలంచియు నిట్లు చెప్పి యుండునని తోఁచుచున్నది. కాని వీపుశబ్దము నిర్‌బిందుకమె యగుటంజేసియు 'తాఁబేటికి' అనుస్థలములోని యాపవిభక్తిక 'టి' వర్ణము ఖండపూర్వకము కామిం జేసియు నీతని యభిప్రాయము సరికాదని చెప్పకతీరదు. ఔపవిభక్తిక 'టి' వర్ణము హ్రస్వపూర్వకమగునపుడు పూర్ణబిందు పూర్వకమయి యుండుటం

బట్టి దీర్ఘపూర్వకత్వమునందును నిది ఖండపూర్వకమై యుండునని యీతఁడు తలంచెనాయని యాలోచింపవలసి యున్నది. పరిశీలింపఁగా నీ యభిప్రాయము యుక్తియుక్తమె యనఁ దగి యున్నను నాంధ్రశబ్ద చింతామణికర్త యాప విభక్తికముల నుపదేశించుటలో "ఔపవిభక్తిక సంజ్ఞా వర్ణాష్టి ంట్యాదయో భవన్తీహ" అని యిట్లు పూర్ణబిందు పూర్వక టి వర్ణమును వేఱుగా నుపదేశించి యుండుటంజేసి 'టి' వర్ణము ఖండపూర్వకమనుట కాతఁడు సమ్మతింప లేదనుట (ప్రాచీనకాలమున లేమింజేసి) నిశ్చిత మగుచున్నది. ఇట్లె "మోస్తు విభవక్త్ర్యకే వచనకే ంపు ంపూ" అని యిట్లు చింతామణికర్త పూర్ణపూర్వక 'పు' వర్ణకము నుపదేశించుటంబట్టి 'పు' వర్ణకము నయితము ఖండపూర్వకము కాదని విశద మగుచున్నది.

(౩_౯౯)—కూచిమంచి తిమ్మకవి పై యనంతుని పద్యమును ముద్దరాజు రామన మతమును నుదాహరించి యీ క్రిందిరీతిని విమర్శించెనే కాని 'తాఁబేటికి, అను ననంతుని లక్ష్యమును మాత్రము నిరాకరించి యుండలేదు.

గీ. అర్ధబిందువు నిర్బిందువగు పదముల
ప్రాసములు దీర్ఘముల మీఁదఁ బలుకఁ జెల్లు
ననుచుఁ దగ ముద్దరాజు రామన వచించె
హ్రస్వముల మీఁద నటువలె నలరు ముద్ర.

గీ. అర్ధబిందువై తేలినయట్టి టపల, కరయఁ బ్రాసంబు నిర్బిందువైన నమరు
వీఁపు మూఁపును నుతి తలమోపు నయ్యె, మాట లేటికి ధాత్రిఁ దాఁ
బేఁటి కనఁగ.

అని యనంతుఁడు టప లకు మాత్రమె చెప్పినాఁడుగాని అన్నింటికిఁ గద్దు.

(1) క. నాకొఱఁతఁ దీర్చి వచ్చితి, నీ కొఱఁతయ యింక సూతునిం దెగఁ జూడన్
లోకము వంచింపందగు, చీఁకటి యొదవె నిఁక నేమి సేయుదుఁ జెపుమా.
(భార. విరాట. ౨ ఆ. ౨౭౧)

(చీకటిశబ్ద నిర్బిందుకత సాధింపఁబడును 'చీఁకటిరే యొదవెనేమి' అని పాఠా).

(2) క. పీఁకఁ బఱతెంచి నలుగడఁ
దాఁకి నకులుఁడరిగె ఘోరతర శరహతి నా
మూఁకలు విఱియఁగ నర్జునుఁ
డాకరముగ దాఁకె నుగ్రుఁడై రణభూమిన్. (భార. ఆది ౭ఆ. ౨౦౦)

(3) ద్విపద. మూఁగి చరించు నమ్మొకరి తుమ్మెదల
బాగొప్పు కొప్పునఁ బ్రబలినదాని (రంగనాథరామా.)

(4) క. ఆచింతామణి ముని దన, పేఁచ మణఁచుదాఁక నీక పృథులోభముచే
దాఁచుకొనుఁగాక నాచే, నీచే నింక మోసపోవునే నరనాథా.
(వరాహపు)

(5) క. మీటుగల రథికులను నొక, నాఁటను వేవుర వధింతు నరుశరములు నో
నాటి పడవైచు సంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరుల నెల్లన్.
(భార. ఉద్యో. ౪. ఆ. ౪౦౭)

(6) క. ఓడితిమె యేము రణమునఁ, గ్రీడికిఁ గేడించి రాక గెలుపే యతఁడున్
వేఁడీ డాఁగెనొకో * మా, తోడిబవర మట్లు దాను దొలఁగంజనునే.
(భార. ద్రోణ. ౩౭౪)

(7) క. ఆతఁడును బుష్కరిణియను, నాతికి వైరిణి సమాఖ్య నందనఁ గనియెన్
బ్రీతియొసఁగ నుత్పలయను, గోఁతి యతనివలనఁ గాంచెఁ గొడుకుల
వరుసన్.
(ఎఱ్ఱా. హరివంశము)

(8) క. ఆపన్నగ ముఖ్యులఁ దన, వీఁపునఁ బెట్టికొని పఱచి విపినములు మహా
ద్వీపములు నదులు నిఖిలది, శాపాల పురములు చూపి చని వారలకున్.
(భార. ఆది. ౨ ఆ. ౪౫)

(9) క. ఆపార్థుఁడు కోపానల, దీపితుఁడై విశిఖశిఖలఁ దీవ్రనిహతి న
త్తూఁపుల గమియేర్చి జముని, కోపుఁ గుడువఁబనిచె వారిఁ గురువంశనిధీ
(భార. ద్రోణ. ౧ ఆ. ౨౫౩)

(తునుము ధాతు మూలకమగుటచే 'తూఁపు' సబిందుకమని తిమ్మకవి తలఁచియుండును. 'తూపు' శబ్దరత్నాకరమున నిర్బిందుకము. "ప్రోపుఁ గుడువఁబుచ్చె వారి పురువంశనిధీ." (తాళపత్ర మాతృకాపాఠము)

కుఱుచలమీఁది యర్ధబిందువునకు.

(10) చ. తగవులఁ బోక రాజు బెడిదమ్ములు పల్కినయేని సైఁచి యొ
ప్పఁగ నిలుమీ గురుత్వ ముడుపంగల వారికిఁ బెద్దవారి మా

* వావిళ్ళవారి ముద్రణమున 'అతఁడేఁ। డీడాఁగి పోయెనొకొ...' అని సవరింపఁబడి నను నీపాఠము పైతము చూపఁబడెను. నావద్దనున్న తాళపత్ర మాతృకలో 'ఏఁడీ డాఁగె నొకో' అనియేయున్నది. (౧౩౦ తాళపత్రము) కాన — 'పోయె' అనుపదముగల పాఠము ప్రక్షిప్తమనుటలో సందేహములేదు.

టఁ గొనమి యా సుయోధనుకడ న్నిలుచున్ మనమెల్ల గౌరవం
బుగఁ గులవృద్ధు పల్కుఁ దలఁపుం జననిచ్చిన మెచ్చరే జనుల్.
(భార. ఉద్యో. ౩ ఆ. ౨౪)

("యొ! ప్పుగ నిలుమీ గురుత్వము బ్రభుత్వమునుం గల పెద్దవారి మా! టగొనమి." అని యిట్లు ముద్రణములందుఁ గలదు. ఈపాఠము పక్షమున నిది లక్ష్యము కానేరదు.)

(11) క. తగ నక్కురు వృద్ధునకు నొ, సఁగె నాఁటికి నెల్లదృష్టి సాత్యవతేయుం
డగణిత తపః ప్రభావం, బుగని యధిక విస్మయంబుఁ బొందజనంబుల్.
(భార. ఆశ్రవాస. ౨ ఆ. ౧౨౧) (సర్వలక్షణ. ౨ ఆ. ౨౯. ౪౧౫)
("ఉ...అంటె నలుంగుతో జలకమార్చి యొసంగిరి ధౌత వస్త్రముల్"
హారవిలా.)

(౩౩౦)—అప్పకవి తిమ్మకవివలెఁ బయిరీతి నంత విశాలముగ విమర్శింపకున్నను ఖండాఖండ ప్రాసము నంగీకరించి కొన్ని లక్ష్యములను జూపి యున్నాఁడు. మఱియు నీతఁడు సయిత మనంతు ననుసరించి దీర్ఘ పూర్వాక ఖండాఖండములకె ప్రాసమైత్రి నుపదేశించియున్నాఁడు.

క॥ నిడుపులు నరసున్నలు దమ, కెడమను గల క చ ట త పల కిలఁ బ్రాసములై
దొడరును నిర్బిందువులొ, క్కెడ ఖండాఖండ సంజ్ఞ నినశశినయనా.
(అప్పకవీయము. ౩ ఆ. ౩౦౨ ప.)

ఈ యప్పకవి గ్రంథము సైతము వెనుక నుదాహరించిన సర్వలక్షణ సారసంగ్రహోదాహృత తిక్కయజ్వ ప్రయోగముచే నిరాకృతమగుచున్నది.

(౩౩౧)—తిమ్మకవి యిచ్చిన లక్ష్యములలో 1-2-3-4-5-8-లక్ష్యము లప్పకవి యిచ్చినవే. ఇంక నప్పకవి యిచ్చిన లక్ష్యములలోఁ గొన్నిటిని దిమ్మకవి, విడిచి కొన్నిటిని గ్రొత్తగాఁ జేర్చియున్నాఁడు. అట్లప్పకవి లక్ష్యములను విడుచుటలో నీక్రిందివి కారణములు కానోపును.

సీ. "మూఁకలు విరియించి వీఁక నాచార్యాది, యోధులకెల్లను నొక్కఁ డేసను"
(భార. ద్రోణ. ౨ ఆ. ౧౩౬) (అప్ప. ౩ అ. ౩౦౫)

ఈలక్ష్యము కేవలము నసంభవ దోషదూషితమై యున్నది. "మూఁక వీఁక" శబ్దములు రెండును సార్ధబిందుకములె యైయున్నవి. "మూకశబ్దమును శబ్దరత్నాకరకర్త సార్ధాను స్వారముగఁ జేర్చి యీసీస పాదమునే యుదాహ

రించినాఁడు. కాని "యప్పకవి మతమున సార్ధానుస్వారముగాదు" అని మ॥ రా॥ శ్రీ రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగా రతమ సంస్కరణములో లఘుటీకగా వ్రాసియున్నారు. అట్లైయైనచో నప్పకవి యిచ్చిన "మూఁగిచరించు నమ్మొకరితుమ్మెదల । జొగొప్ప......" అను రామాయణములోని లక్ష్యమసంగతము కావలసి వచ్చును. కాఁగా నప్ప కవి కెట్లును నసంగతి దుర్వారమగుచున్నది. కావున నట్టి యసంగతిఁ దొలఁ గించి "మూఁకలు విరియించి పీఁక" నిత్యాది (అప్పకవీయములోని) ద్రోణ పర్వ లక్ష్యమునందలి 'పీఁక' శబ్దముచోట శబ్దరత్నాకరాదికోశ ప్రసిద్ధ నిర్బిం దుక పీకుశబ్దము నంగీకరింపనగును. ఆచార్యాది యోధుల వీకు ననఁగా నుద్ధతిని వెలిచెనని తాత్పర్యము.)

పయి సందర్భమునుబట్టి యప్పకవి మతమున 'మూఁగు, మూఁక' శబ్దములు సార్ధబిందుకములె యని నిశ్చయింపఁ దగియుండుటం జేసి యప్పకవి ఖండాఖండ ప్రాసలక్ష్యముగా నిచ్చిన "క. పీఁకఁ బరతెంచు" అనెడి యాదిపర్వ లక్ష్యములో నయితము నాల్గవచరణమున "ఆకరమున" అను పాఠమె యప్పక వ్యభిప్రేతమనియు నయ్యది యాగ్రహ శబ్దభవమనియు నక్కారణమున నిర్బిందుకమెయనియు నప్పకవి తలంచెనని గ్రహింప వలసియున్నది. ఈపట్టున రావుసాహేబు గిడుగు వేంకటరామమూర్తి పంతులు గారి సంస్కరణమునఁ దప్పుపడియుండుటచేత వారియభిప్రాయమేమో తెలి యకున్నది. అందు రెండు పాఠములు చూపఁబడినవి. రెండిటియందును 'ఆఁకత మున' అనియే పడియున్నది. 'ఆఁకతము' శబ్దము కోశములలో నగపడదు. 'ఆ+ కతము=ఆకారణము' అని గ్రహింతమన్న నం దరసున్న యుండనేరదు గదా. తప్పొప్పుల పట్టికలో నియ్యది చేర్పఁబడలేదు. మఱియు వీరు తమ యభిప్రా యము చొప్పున 'మూకలు' అను దానిని నిర్బిందుకముగనె తృతీయ చరణమున నిలిపిరి. కాని పయి నుదాహరించిన రీతిని 'మూఁగు' శబ్దము సార్ధబిందుక మగుటచేత (అప్పకవిమతమున) నచటఁ దక్కిన రెండుచరణము లందువలెనె సార్ధబిందుక రూపమె గలదని యప్పకవి తలంచెననియు నక్కారణమున నాల్గవచరణమందు నిర్బిందుక శబ్దముండుటయె యప్పకవ్యభిప్రాయమనియు గ్రహింపక తీరదు.

నన్నయ భట్టారకుఁడు నయితము ఖండాఖండ ప్రాసమును బ్రయో గించెనని తలంచినవాఁడగుటంజేసి యప్పకవి యట్లుదాహరించినను బయి'పీఁకఁ

బఱతెంచి' అనెడి యాదిపర్వపద్యమునఁ దక్కిన మూఁడుచరణములందువలెనె నాల్గవ చరణములోని ప్రాసమునందును సార్ధబిందుకశబ్దమె నన్నయభట్టార కునిచేఁ బ్రయోగింపఁబడెనని నిశ్చయించుటయె యుక్తమని నా యభిప్రా యము. నన్నయభట్టారకుఁ డెచటను ఖండాఖండ ప్రాసప్రయోగమును జేయ లేదనియే నానమ్మకము. అట్లయిన శబ్దరత్నాకరముచొప్పున నాగ్రహశబ్దము నుండి పుట్టిన దనఁబడుచున్న "అఁకరము" అనుదానిలో నర్ధబిందు వెట్లు పొసఁ గునని శంకింపరాదు. నిర్బిందుక కేతకీశబ్దభవమగు 'గేదఁగి' శబ్దము సబిందుకమై యున్నదనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరుగదా! (చూ. ౯౭ వి.) మఱియు 'అహంకార'శబ్దభవ మాఁకరశబ్దముగాన నది సార్ధబిందుక మనఁదగును. (చూ. సూ. రా. ని)

ఇట్లె యప్పకవి యిచ్చిన—

"ఉ. ఓకరుణాకలాప.........| కాకులు చంపకుండ.........కృపాగుణం
బేకలిగెన్..... ...భర్తపైఁ | గాఁకలు సేసినట్టి ........".

అను రుక్మాంగదచరిత్ర పద్యములోని 'కాఁకలు' అనుచోట 'కాకులు' అని సవరించినచో నయ్యది ఖండాఖండ ప్రాసోదాహృతి కానేరదని యద్దా నిని దిమ్మకవి గ్రహింపఁడయ్యెనని తోఁచుచున్నది. ('కాకు' దే. వి. 1 గాసి ...... 2. తిరస్కారము.' శబ్దరత్నాకరము)

ఆ. వె. "బోఁటియొకతె పెండ్లిపాట పాడఁగఁజొచ్చె......"

అను నప్పకవీయములోని లక్ష్య మేగ్రంథమునుండి యప్పకవి గ్రహిం చెనో విశదపఱుపనందున నద్దానిని సైతము తిమ్మకవి యుపేక్షించెనని తోఁచెడిని.

మత్తకోకిలము. తీఁగయుయ్యెల నూఁగుఁ, జల్లని తియ్యమామిడి మోకలం
డాఁగుఁ బువ్వుల తేనె సోనలఁ దారుఁ గేతకిఁ జేరుఁ బు
న్నాగ పూగ మహాగ వీథుల నాట్యముల్ పచరించు నా
భోగనాగ లతాగృహంబుల భోగముల్ గనువేడుకన్.

అను నప్పకవీయములోని ఖండాఖండ ప్రాసలక్ష్య మాదిపర్వములోని దని వ్రాయఁబడియున్నది. కాని యిది యాదిపర్వములోనె కాక నన్నయ భారతభాగమున నెచ్చటను లేదు. కనుక నప్పకవీయములో వ్రాయఁబడిన 'ఆదిపర్వము' అనునది దేనికో బదులుగఁ దప్పుపడి యుండునని తోఁచుచున్నది. కావుననే దీనిని సైతము తిమ్మకవి యుపేక్షించెనని చెప్పవచ్చును.

(33౨)—ఇఁక నప్పకవియుఁ దిమ్మకవియు ఖండాఖండ ప్రాసలక్ష్యముగ నుదాహరించిన “ఆపన్నగముఖ్యుల...” అనెడి యాదిపర్వపద్యములోని వీపు శబ్దము నిర్బిందుకమే యని యంగీకరింపనగును. ఇయ్యది సార్ధబిందుకముగ శబ్దరత్నాకరాదికోశములలో నుదాహరింపఁబడినను నట్టి సార్ధబిందుకతను సాధించు ప్రమాణ మగపడదు. వెన్ను శబ్దములోని నకారమునుబట్టి శబ్ద రత్నాకర కోశకర్త దీనిని సార్ధబిందుకముగా నుదాహరించెనా యని యాలోచింపవలసి యున్నది. కాని ‘వెన్ను, వీపు’ శబ్దములకు సంబంధమున్నట్లగ పడదు. కన్నడమున “బీవు = వెన్నుమీఁది నరము” అను నొకశబ్దము గలదు. తెనుఁగున నట్టి యర్థవిశేషము పోయినదనియు నది వెన్నునకుఁబర్యాయముగ వాడఁబడెననియు బీవు, వీపుశబ్దము లభిన్నములే యనియు గ్రహింపనగును. తమిళమున వీనికి సరియగు శబ్ద మగపడదు. ఇంకఁ దెనుఁగులోని వెన్, వెనుక, వెంట, శబ్దముల కభిన్నమగు వెన్నుశబ్దమును సంబంధించిన శబ్దములు వేర్వేఱుగఁ దమిళకర్ణాటములు రెంటను గలవు. తమి. వెరిన్(వెన్ను) కర్ణా - బెన్ను (వెన్ను) పయి సందర్భమునుబట్టి వీపు వెన్ను శబ్దములు పరస్పరభిన్నములనియు వెన్నుశబ్దములోని నకారమునుబట్టి వీపు శబ్దమున నరసున్న గలదని యూహింపరాదనియు నక్కారణమునఁ బై పద్యమునుబట్టి నన్నయభట్టు ఖండాఖండ ప్రాసమును బ్రయోగించెనని నిర్ణయింపరాదనియు గ్రహింపవలెను.

(333)—సార్ధబిందుకత నిర్ణయించుటలో శబ్దరత్నాకర కోశకర్త కొంత యపమార్గమునఁ బోయెననక తీరకున్నది. ఆతఁడు సార్ధబిందుకతను నిర్ణయించుటకుఁ దిక్కనాదుల యర్ధబిందు ప్రాసస్థలములను జూపుచువచ్చెను.

పై నుదాహరించిన తిక్కయజ్వప్రయోగములనుబట్టి యాతఁడు ధారాళముగా ఖండాఖండప్రాసము నంగీకరించెనని చెప్పక తీరదుగదా. ఇట్టిస్థితిలో నిట్టి వారి ప్రాసప్రయోగము లెట్లు పదములలోని సార్ధబిందుకత్వమును నిర్ణయింపఁగల్గును? నియతముగ నర్ధబిందు ప్రాసమును బాటించిన కవి యొక్క ప్రాసప్రయోగము మాత్రమే యట్టి నిర్ణయమున, బ్రమాణీకరింపఁ దగినదని గ్రహించుట యుక్తముగదా.

(33౪)—నన్నయభట్టారకుని భారతభాగమునం దెచ్చటను బై రీతిని ఖండాఖండ ప్రాసాంగీకార నిర్ణాయక ప్రయోగ మొక్కటియు నగపడ

నందున నొక్క నన్నయభట్టారకుఁడు మాత్రమే యర్ధబిందు ప్రాస నియమ
మును సరిగఁ బాటించెనని యంగీకరింప నగును.

సీ. గీ. వీఁగి తనతల్లిదాస్యంబు నీఁగఁబూని (ఆది. ౨ ఆ. ౮౪ ప.)

ఉ. వాఁడి మయూఖముల్ ........, నేఁడిటవచ్చె... ... ... ...
పోఁడిగ...................., రాఁడు ...................
(ఆది. 3 ఆ. ౧౧౨ ప.)

ఆ. వె. ఆఁగఁబడినవాని లోఁగక చేయుట (ఆది. 3 ఆ. ప.)౦౨౨

సీ. ..., వ్రాఁకుల మొదళులు వీఁకఁబట్టి (ఆది. ౫ ఆ. ౧౬౬ ప.)

మత్తకోకిలము. వేఁడుట........., వేఁడికోలు.................
వేఁడినన్........., పాఁడికుఱ్ఱల..............
(ఆది. ౫ ఆ. ౨౧౮ ప.)

తే. గీ. వీఁడు పుట్టిన పదియగు నాఁడు పెలుచ...” (ఆది ౬ ఆ. ౨౮౪)

ఉ. వీఁడొక ............., నేఁడు . ..... .............
పోఁడిగ ..............,వాఁడి..............
. (భార. ఆది. ౬ ఆ. 3౦౯)

క. వీఁక..............., తాఁకిన............
మ్రాఁకలు.............., ఆఁకరమున..............
(ఆది. ౭ ఆ. ౨౦౦ ప)

(ఇందలి ‘ఆఁకరము’ శబ్దమున నర్ధబిందు వుండుట విరుద్ధము కాదని
యీావఱకు నిర్ణయించి యున్నాను.)

సీ. వీఁకతోఁ గడుఁ బూచు వ్రాఁకుల విఱుపును...(సభా. ౨ ఆ.౪౧)

గీ. పోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను..........(సభా. ౨ ఆ. ౧౭౪)

ఆ. వె. వేఁడిరక్తమానువాఁడ నేను...........(సభా. ౨ ఆ. ౨౯౬ ప.)

తే. గీ. వీఁడు నీచేత వధ్యుండు గాఁడు.............. (అర. ౧ ఆ ౧౭౮)

సీ. వ్రాఁకుల విఱుచుచు వీఁకతోఁ దీవల......... (అర. 3 ఆ. 3౧౨)

సీ. తాఁకె జటాసురు వీఁకతోడ................. (అర.3 ఆ. 3౯౪)

నన్నయభట్టారకుని పై యర్ధబిందు ప్రాసప్రయోగములలో నొక్క
చోటనైన నిర్బిందుకతను నిర్ణయింపఁజాలెడి శబ్దము లేదనుటలో విప్రతిపత్తి

లేదు. ఇంకను వానిలో రాఁడు, ప్రాఁకులు, వీఁడు, వాఁడు, కాఁడు మున్న గునవి సాధ్యఖండములును నై యున్నవి. మఱియు నాఁడు, నేఁడు, పోఁడిగ మున్నగువానిలోని యరసున్నలకు నన్నిచోడదేవాదికవి ప్రాసములలోను శాసనాదులలోను గల పూర్ణబిందువులు సాధకము లయియున్నవి.

క. పోండిగ నగజ తపశ్శిఖి। మూండు జగమ్ములను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండము కాఁచిన కాంచన।భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రభాభాసితమై.
(నన్నిచోడదేవుని కుమారసంభవము)

ఇంతియకాక నన్నయభట్టారకుఁడు ప్రయోగించిన నిర్బిందుకతానిశ్చ యము గల శబ్దములతో నుండెడి ప్రాసములలో నొక్కటనైనను సార్ధబిందు కతను నిర్ణయింపఁదగిన శబ్ద మగపడదు.

క. వేడుక............... పో, రాడి...............
కూడి...............మే, యాడక............(ఆది. ౫ ఆ.౧౭౦ ప.)

క. నీకూర్మి..............., నాకవి...............
నాకిచ్చి..............., చేకొని...............(సభా. ౨ ఆ. ౬౭)

(33౫)—ఇంక నన్నయ భట్టారకుని ప్రాసప్రయోగములలో నీవిష యమున నొకటి రెండుచోటులు శంకాస్పదములై యున్నవి.

సీ. ఆ-వె. "వీఁక దఱిఁగి కాందిశీకు లయిరి" (ఆది. ౨ ఆ. ౧౦౦)

నన్నయభట్టారకుఁడు 'వీఁక' శబ్దమును సార్ధబిందుకముగా ధారాళ ముగఁ బ్రయోగించి యున్నాఁడని యంగీకరింపక తీరమింజేసి యీ ప్రయో గము ఖండాఖండప్రాసలక్ష్యమనుట కవకాశము కలుగుచున్నది. కాని యిచట వీఁకదఱిఁగి, అనుచో "వీకు దఱిఁగి" అను పాఠాంతర మగపడుచున్నది. శబ్ద రత్నాకరకోశములో నిర్బిందుక 'వీకు' శబ్ద ముద్ధత్యర్థకముగ నగపడుచున్నది. "వీకు. దే. వి. 1. ఉన్నతి... 2 ఉద్ధతి 3 పరాక్రమము" (శబ్దారత్నా)

నన్నయభట్టారకుఁ డిచటనేకాక మఱిరెండు చోటులందు సైత మీ 'వీకు' శబ్దమును నిర్బిందుకతా నిశ్చయముగల సంస్కృత శబ్దములతోఁ బ్రాసములందుఁ బ్రయోగించియున్నాఁడు.

ఉ. మీకులగోత్ర నామములు మిమ్ముము నెమ్మి నెఱుంగ వేఁడి చిం
తాకులుఁ డైనవాఁడు ద్రుపదాధిపుఁ డాతనికిం బ్రియంబుగా

నాకెఱిఁగింపుఁ డింతయు ఘనంబుగ నాతతమత్స్యయంత్రమున్
వీకున నట్టు లేసిన సువిప్రు మ నాతఁడు నోపుఁ జూడఁగన్.

(ఆది. 2 ఆ. ౨౫౦ ప.)

ఉ. వీకున నశ్వమేధములు వే యొనరించిన ధర్మశీలుఁ డి
క్ష్వాకు కులోద్భవుండు..................(అరణ్య. 5 ఆ. ౨౦౦ ప.)

పయిరెండుస్థలములందును 'వీకున' అనుచోట 'వీఁకను' అని నన్నయ భట్టారకుఁడు ప్రయోగించె నేమోయని శంకించుటకు వీలుపడదు. నన్నయ భట్టారకుని మతమున ద్రుతమునకు 'ను' స్వరూప మెంత మాత్రమును లేకుం డుటను సముచ్చయాద్యర్థ విశేషబోధము లేకయె యూరక 'నున్' అను నవ్య యము నాతఁ డెచ్చటను బ్రయోగించి యుండకుండుటను, బయిరెండు పద్యములందును 'వీకునన్' అనియే యాతఁడు ప్రయోగించె ననుటలో సంది యములేదు. ద్రుతమునకు"ను"స్వరూపము నన్నయభట్టారక సమ్మతముకాదని యీవఱకు నేను రచించి ప్రచురించిన "చింతామణీ విషయ పరిశోధన" మను గ్రంథములోని మూఁడవ భాగమునందు మిక్కిలి విపులముగాఁ జర్చించి సిద్ధాంతీకరించి యున్నాను. ఈగ్రంథమునందును మున్ముందట్టి విషయము విశదీకరింపఁబడును.

పయి సందర్భమునుబట్టి నిర్బిందుక 'వీకు' శబ్దము నన్నయభట్టసమ్మత మనుటలో విప్రతిపత్తి లేకుండుటచేతను నాతఁడు మఱెచ్చటను ఖండా ఖండ ప్రాసమును బ్రయోగించెనని నిర్ణయించుట కవకాశము లేకుండుట చేతను బయి నుదాహరించిన చోటను సైతము "వీఁక దఱిఁగి కాందిశీకులైరి" అనుపాఠము నన్నయభట్ట ప్రయుక్తము కాదనియు "వీకు దఱిఁగి కాంది శీకులైరి" అను పాఠమే నన్నయభట్టప్రయుక్తము కానోపుననియు నిశ్చ యింపవలసి యున్నది.

(33౬)—మత్త. మీకు నెగ్గొనరించియున్న యమిత్రులన్ హతబుద్ధులం
జీకురాజు తనూజులన్ గురుసింహ నీకుఁ బ్రియంబుగా
నేకమాత్రన పోరిలో వధియించి నాగపురంబు నా
నా కులాద్రిశిలావళీ గహనంబు సేయుదు నావుడున్.

(అరణ్య. 3 ఆ. 5౯౨ ప.)

ఇట్టి నన్నయభట్ట ప్రయోగమును జూచికొనక "చీకు" శబ్దము సార్థ బిందుకమని యిూక్రిందిరీతిని శబ్దరత్నాకర కోశకర్త వ్రాసియున్నాఁడు.

"చీఁకు. దే. వి. గ్రుడ్డితనము - అంధత్వము. ఈ యర్థమునం దిట్లు దీనిని సబిందుకముగాఁ జెప్పుట చీఁకటి శబ్దమునకు వ్యుత్పత్తి కల్పించుట కనుకూలముగా నున్నది. ఇట్లు చెప్పుటచేఁ బ్రయోగములకు విరోధము కనఁబడదు. విణ - అంధుఁడు (ఇట్లు 'చీఁకు కొక్కెర. చీఁకురించు, చీఁకువాలు' అను నీ పదములను సబిందువులుగా గ్రహింపవలెను)." (శబ్దరత్నా).

చీకుశబ్దమును బయిరీతిని నన్నయభట్టారకుఁడు నిర్బిందుకముగాఁ బ్రాస స్థలమునఁ బ్రయోగించి యుండఁగా శబ్దరత్నాకర కర్త "ప్రయోగములకు విరోధము కనఁబడదు" అని యెట్లు వ్రాయ సాహసించెనో తెలియకున్నది. మఱియు నట్లు 'చీకుకొక్కెర' మున్నగు వానిని సబిందుకములుగా సిద్ధాంతము చేసియు నాతఁ డాశబ్దములనెల్ల నిర్బిందుకములనుగానె యుదాహరించుటకుఁ గారణమేమో తెలియకున్నది. "చీకుకొక్కెర. దే. వి. కోయష్టికము. చీకురించు - అ. క్రి - అంధమగు" మొ. (శబ్దరత్నా.)

పయిరీతిని 'చీకు' శబ్దమును దానిని సంబంధించిన దనఁదగు 'చీకటి' శబ్దమును నిర్బిందుకములె యనియు నట్టి చీకుశబ్దము, 'చివుకు' (నిస్సారము, నిస్సారమగు, తడిసి సారహీనమగు) శబ్దముయొక్క పరిణామమనియు నంగీకరింప నగును. ఈసిద్ధాంతమునుబట్టి యప్పకవి తిమ్మకవు లుదాహరించిన యీ క్రింది విరాటపర్వపద్యము సైతము ఖండాఖండ ప్రాస లక్ష్యము కానేరదని విశదమగుచున్నది.

క. "నాకొఱఁత దీర్చివచ్చితి, నీకొఱఁతయ............
లోకము............, చీఁకటి..............."

(విరాట. ౨ ఆ. ౨౭౧ ప.)

పయి సందర్భమునుబట్టి యాంధ్ర వాఙ్మయమున నొక్క నన్నయభట్ట భారత భాగము మాత్రమె యర్ధబిందు ప్రాస నియమమును సరిగఁ బాటించుచున్నదని సిద్ధాంతిత మగుచున్నది. ఆంధ్రమహాకవులలో నొక్క నన్నయభట్టారకుఁడైనను ఖండాఖండ ప్రాసము నంగీకరింప లేదని సమ్మతింపని పక్షమున నర్ధానుస్వారస్థితియే యజాగళస్తన న్యాయమున వ్యర్థమై యనుపపన్నము కావలసివచ్చును గదా.

(332)—కొందఱు ఖండ పూర్ణప్రాసమును సయిత మీ క్రిందిరీతి నంగీకరించు చున్నారు.

"మఱియు నన్నిచోడఁడు సోమనాథుఁడును బూర్ణ బిందువునకు నర్ధ బిందువునకుఁ బ్రాసముఁ గూర్చిరి.

క. పోఁడిగ నిగడ తపశ్శిఖి
మూఁడు జగమ్ములను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండముఁ గాఁచిన కాంచన
భాండము క్రియఁ దాల్చెఁ దత్ప్రభా భాసితమై.

(నన్నిచోడుని కుమారసం.)

ద్విపద. పాండురాంగంబైన పడఁతి గర్భమునఁ
బోఁడిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁడీక్రియను (బసవపు)

వర్గ ప్రాసమును సమీప ప్రాసమును నంగీకరించునపుడు పూర్ణార్ధ బిందు ప్రాసమునుగూడ నంగీకరించుట సంగతమే యగును."

(బసవ పురాణ పీఠిక, ౯౧ పు.)

ఇట్టియెడల ఖండపూర్ణ ప్రాసము నంగీకరించుటకంటె గవి ప్రయోగ ప్రామాణ్యముచే నిట్టిచోటులందలి 'పోఁడి, మూఁడు' మున్నగు శబ్దములలో దీర్ఘపూర్వక పూర్ణబిందు స్థితి నంగీకరించుటయె యుక్తమని నా యభిప్రాయము. కవుల కావ్యములలో నిట్టి ప్రయోగము లరుదుగ నున్నను నన్నయాది మహాకవులెవ్వరును నిట్లు దీర్ఘపూర్వక పూర్ణములను సంస్కృత దీర్ఘపూర్వక పూర్ణములతోడఁ బ్రాసములందుఁ బ్రయోగించి యుండ లేదు. నన్నయాది మహాకవులు వర్గప్రాసమును సైతము ప్రయోగించి యుండ లేదు. అట్టిప్రయోగము లపపాఠములు. మఱియు నాంధ్రలాక్షణికులెల్ల ఖండాఖండ ప్రాసము నంగీకరించిరేకాని ఖండపూర్ణ ప్రాసము నంగీకరించి యుండ లేదు. శబ్దాలంకారాపరావతార మనఁదగు ప్రాసమున ఖండపూర్ణప్రాసరూప నియమభంగ మంగీకరింపఁ దగినదియుఁ గాదు. కావుననే లాక్షణికులు శబ్దాలంకార భంగములేని ఖండాఖండ ప్రాసమును మాత్రమె యంగీకరించి ఖండ పూర్ణప్రాసము నెవ్వరును నంగీకరింపరైరి.

ఆంధ్ర వైయాకరణులు దీర్ఘపూర్వక పూర్ణబిందు వుండనేరదని చెప్పి యున్నను బైప్రయోగముల ప్రామాణ్యమునంజేసి, 'పోండి, మూండు' మున్నగు నలంతి శబ్దములలో మాత్రము నిండుసున్న, తక్కిన చోటులలో

వలె నిత్యముగాఁ దేలిపోక హ్రస్వముమీఁదవలెనె ప్రాచీన కాలమునఁ బాక్షికముగ నిల్చియుండెనని యంగీకరించుటలో విరోధమేమియు నగపడదు.

ఈక్రింది ప్రాచీనశాసన లేఖనములలో దీర్ఘపూర్వక పూర్ణబిందువుల మీఁది హల్లులు ద్విరుక్తములుగా వ్రాయఁబడి యుండుటయుఁ బయి యభిప్రాయమునకు హస్తావలంబ మొసఁగుచున్నది.

చ. ఇలవెలనాంట్టిచోడ నృపు...(శాసన పద్యమంజరి, ౭౩శాసన, ౧ ప.)

గ. స్వస్తిశకవర్షఀంబులు ౧౧౬౭ గునేంట్టి చైత్రబహుళ......

(శాసనప. ౧౪ శాస. తుదిగద్యము.)

పయిని వ్రాసిన రీతిని ఖండపూర్ణప్రాసము నంగీకరించువారు వీనిని దీర్ఘపూర్వక పూర్ణములుగ నంగీకరింప వలనుపడదని సైత మీక్రిందిరీతిని వింతగ వ్రాసియున్నారు.

"పోఁడి, మూఁడు, మొదలగునవి యానాఁడు పూర్ణబిందువులుగనే యెన్నఁబడుచుండ వచ్చుననియు నిది పూర్ణబిందు ప్రాసమే కావచ్చుననియుఁ గొందఱందురు. అది యట్లు గాదు. పోఁడి, మూఁడు పదములను మరల నీకవులే యర్ధబిందు ప్రాసమునఁ గూడఁ గూర్చిరి గావునను నాకాలపుఁ గవులెల్లరు నాపదముల నర్ధబిందు విశిష్టములఁగనే ప్రయోగించిరి గావునను నది పూర్ణార్ధబిందు ప్రాసమనియె తలఁపవలెను." (బసవపురాణ పీఠిక, ౯౨పు.)

ఈ వ్రాఁత యెంత మాత్రమును సరియై యుండలేదు. హ్రస్వపూర్వక స్థలములందువలెనే యీ యలంతి దీర్ఘపూర్వక స్థలములందును బూర్ణార్ధములు రెండును నిల్చియుండుట యెట్లు విరుద్ధమగునో తెలియకున్నది. వీనిలోఁ బూర్ణములున్న వనుటకు నన్నయాది ప్రాచీనకవి ప్రయోగములు లేవందు రేని ఖండపూర్ణ ప్రాసములకు మాత్రము వారి గ్రంథములలోఁ బ్రయోగములు కలవా? ఇఁక నీపక్షమున వినిగమనాభావముచేత ఖండ పూర్ణప్రాసమును నంగీకరించుటలో మాత్రము విరోధమేమి యనుటకును వలను పడదు. ఖండపూర్ణప్రాసము శ్రుతివిరుద్ధమగుటచేతను వెనుక నుదాహరించినరీతి ననేకస్థలములలో (3౧౭ - 3౧౪ - వి) దీర్ఘపూర్వక పూర్ణములు నేఁటికిని నిల్చియుండుటచేతను "పోండి, మూండు" మున్నగు నీ యలంతి ప్రాచీనకవి ప్రయుక్తశబ్దములలో సైతము పూర్ణార్ధముల పర్యాయస్థితి నంగీకరించుట కేవలము యుక్తమయి యుండునుగదా.

(౩౩౮)—— కాలక్రమమున నుచ్చారణభ్రష్టమగు శకటరేఫవిష యమునందువలెనే నానాఁటికి నుచ్చారణభ్రష్టమగు నీఖండానుస్వారము విష యమున నాంధ్ర లాక్షణికు లంతగాఁ బరిశీలనము చేసియుండలేదు. వెనుక నుదాహరించిన రీతిని నన్నయేతరకవులెల్ల ఖండాఖండ ప్రాసమును బ్రయోగిం చినవారె యగుటచేతను నన్నయ భారతభాగములోని ప్రాసస్థలస్థగిత ఖండాను స్వార ఘటిత శబ్దము లలంతులయి యుండుటచేతను నట్టి పరిశీలనము చేయుట నిరాధారమని వా రుపేక్షించిన ట్లగపడుచున్నది.

(౩౩౯)——శబ్దరత్నాకర కోశకర్త యొక్క నన్నయ ప్రయోగములనే కాక తిక్కన తిక్కనాది మహాకవుల ప్రాసప్రయోగములను సయితము ప్రమా ణముగాఁ గొంతవఱకుఁ జూపుచు దీర్ఘపూర్వక సిద్ధఖండములను నిర్ణయించి తన కోశమున నుదాహరించెను. తిక్కనాదులు సయితము ఖండానుస్వార ప్రాస నియమమును జాలవఱకుఁ బాటించినవారె యగుటచేతఁ దఱుచుగఁ బయినిర్ణ యము సరిపడుచుండును గాని, వారు నన్నయభట్టువలె సాకల్యముగ నట్టినియ మమును బాటింపక ఖండాఖండ ప్రాసమునుసైతము క్వాచిత్కముగ నంగీక రించి ప్రయోగించిన వారగుటచేతఁ దత్ప్రయోగ ప్రామాణ్యమునఁ జేసిన శబ్దరత్నాకర నిర్ణయము సయితము సాకల్యముగఁ బ్రమాణీకరింపఁ దగినది కాదనక తీరకున్నది.

ఇట్లె యీఖండబిందువును నిర్ణయించుటకుఁగల మఱికొన్ని మార్గములు సయిత మీాక్రింది కారణములచేత సాకల్యముగఁ బ్రమాణీకరించుట కవకా శము లేదనకతీరదు.

సాధ్య ఖండములు వ్యాకరణములవలన సుజ్ఞేయములగుటచేత వానిని గ్రహించుట సుకరమె యనవచ్చును. ఇఁక సిద్ధఖండములలో హ్రస్వపూర్వక ఖండములను నచటఁ బ్రాక్షికముగ వినఁబడెడి పూర్ణములనుబట్టి నిర్ణయింప వచ్చును. కాని, శబ్దరత్నాకర కోశకర్త యట్లు హ్రస్వపూర్వక సిద్ధఖండముల కెల్లఁ బూర్ణబిందు ప్రయోగములను జూపియుండలేదు. కొన్ని కొన్ని స్థలము లందు మాత్రము చూపుచువచ్చెను. మఱియు నెల్లయెడలను బూర్ణప్రయో గములు దొరకుట సయితము సులభమని చెప్పఁజాలము.

ఇంకఁ బరిశిష్టములగు దీర్ఘపూర్వక సిద్ధఖండములను దెలిసికొనుటకుఁ బయిని వ్రాసిన రీతినున్న యర్ధబిందు ప్రాసనియమ స్థలములె కాక మఱికొన్ని

యాధారములును నగపడుచున్నవి. ప్రాచీనతాళపత్రమాతృకలలోను బ్రాచీన శాసనములలోను ఖండబిందువు లున్నచోటులందుఁ బూర్ణములు వ్రాయఁబడుచుండెడి సంప్రదాయము గలదు. ప్రాచీనకాలమున నర్ధచంద్రాకారముగ ఖండమును వ్రాసెడి యలవాటు లేమింజేసి బిందువును దేల్చిపలుకునపుడు పూర్ణమునె వ్రాయుటయు, నూఁదిపలుకునపుడు వ్యావర్తకముగఁ బరస్థిత హల్లును ద్విరుక్తముగ వ్రాయుటయు సంప్రదాయ సిద్ధమయి యుండెడిది. ఈ సంప్రదాయ మొకటి యర్ధానుస్వార స్థితిని దెలిసికొనుటకుఁ గొంతవఱకు మంచి యాధారమె యనఁదగును. శబ్దరత్నాకరకర్త యీసంప్రదాయము నాధారముగఁ గొని నిర్ణయించిన నిర్ణయించి యుండునేమో కాని, యట్టివిషయము నెచ్చటను విశదపఱిచి యుండలేదు.

ఖండానుస్వారస్థితి నూహించుట కింకను మార్గాంతరములు గలవు. వైకృత శబ్దములకు మూలములగు సంస్కృత శబ్దములందును, దేశ్యశబ్దములను సంబంధించియున్న తమిళ కర్ణాటాది ద్రావిడశబ్దములందును ననునాసికములుగాని బిందువులుగాని యుండునపు డట్టి యచ్చాంధ్ర శబ్దములలోని బిందువు తేలిపోయినను నచట ఖండస్థితిని నిర్ణయింపనగును. ఉ. సహించు= సైఁచు, లాంగలము = నాఁగలి, - (తెల్గు) - తోఁట = (కన్న) - తోంట. (తెల్గు) - కోఁట = (కన్న) - కోంటె. (తెల్గు) - మూఁడు = (తమి) - మూన్రు. (తెల్గు) - వీఁగు (అతిశయించు) = (తమి) - వీఙ్గు (అధికమగు) మొ.

శాసనలేఖనమును దాళపత్రమాతృకాలేఖనమును బ్రసంగవశమున నిట దిఙ్మాత్రముగ నుదాహరించుచున్నాను. నాయొద్దనున్న తాళపత్ర మాతృకలలో నీ విషయమున మిక్కిలి బాగుగనున్న కేయూర బాహు చరిత్రమునుండి యథామాతృకముగ నొక పద్యము నిటఁ జూపెదను. అట్లె శాసన పద్య మంజరినుండియు నుదాహరించెదను.

మ. తనమేనల్లుని సోమదత్తు బహుతంత్ర ప్రౌఢి ధీమంత్త్రుం జ
య్యన నచ్చోటికిం బిల్చి తేం బనిచి యేకాంత్తంబ్బునన్ రాజవ
త్తనమున్ జారులచేత విన్నదియు మీందన్ దారు శాయంద్దలం
చినకార్య్యంబ్బునుం జెప్పి సస్మితరుచిన్ సద్వక్త్ర్యుండై వానికిన్. (కేయూ)

క॥ శ్రీకమనియ్యుండు పుణ్యా, శ్లోకుం (డ) ధఃక్రితవిలాససురవిభుండు జితామిత్రానీకుండుయశ, శ్రీకరుణ్డు వెలనాంటి గొంక్క నృపసింహుండిలను॥

పాఠకుల సౌకర్యమునకయి యీ పద్యములోని వ్రాఁత తప్పులను దొలఁగించి చూపుచున్నాను.

క॥ శ్రీకమనీయుండు పుణ్య, శ్లోకుం డధఃకృత విలాసపురవిభుండు జితా
నేకామిత్రుం డురుయశ, శ్శ్రీకుణ్డుడు వెలనాంటి గొంకక్ష్మాపసింహుండిలన్॥

{ శాసనపద్యమంజరి. 32 శాసనము, అవనిగడ్డ గ్రామములోనిది, శ. స. ౧౦౭౬. }

(3౮౦)—తాళపత్ర మాతృకలందును శాసనములందును నిట్టి నియమము సార్వత్రికముగఁ బరిశుద్ధమయి నియతమై యుండి యున్నచో నర్ధానుస్వారస్థితి సులభముగా నిర్ణయింపనయ్యెడిది. కాని పయిరీతిని నియతముగాను శుద్ధముగాను నుండుట మృగ్యమై యున్నది. ఆయాలేఖకులు ప్రామాణిక పండితులు కారుగదా. కావుననే 'యిట్టితప్పులకుప్పల నాధారముగఁ గొని ఖండానుస్వారనిర్ణయము చేయనేల' యని ప్రాచీనలాక్షణికు లుపేక్షించి యుందురు. తాళపత్రమాతృకలును శాసనములును దప్పులకుప్పలనుటలో నెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు. అట్లయినను నొకటి రెండు తావు లుదాహరించెదను.

మ॥ పదుమూణ్డేణ్డ నా ణ్డమాత్యపదవిం బ్రాపించ్చి తత్సంప్పదా
స్పదుణ్డై సత్కవిబంద్ధు మిత్రజన సంపత్కారియై సాధుస
మ్మదశుద్ధప్రతిభా ప్రపంచ్చిత లసన్మార్గస్థితిని సంతతా
భ్యుదయుణ్డై విలసిల్లె నెల్లణ్డు జగత్పూర్ణాచ్ఛ కీర్త్తిచ్ఛవిన్॥ ౮॥

పాఠకుల సౌకర్యమునకయి వ్రాఁతతప్పులు తొలఁగించి చూపెదను.

మ॥ పదుమూణ్డేణ్డుల నా ణ్డమాత్యపదవిం బ్రాపించ్చి తత్సంప్పదా
స్పదుణ్డై సత్కవి బంద్ధుమిత్రజన సంపత్కారియై సాధుస
మ్మతశుద్ధ ప్రతిభా ప్రపంచ్చిత లసన్మార్గస్థితిన్ సంతతా
భ్యుదయుణ్డై విలసిల్లె నెల్లణ్డు జగత్పూర్ణాచ్ఛ కీర్త్తిచ్ఛవిన్॥ ౮॥

{ శాసనపద్యమంజరి, ౪౧ శాసనము, శ. స. ౧౧౮౦, అమరావతీ గ్రామములోనిది. }

ఇందు 'సంపత్కారి' అనుచోటి పకారము 'సంతతాభ్యుదయుణ్డై', అనుచోటి తకారము మున్నగువానికి ద్విత్వము లిఖింపఁబడలేదు. 'బంద్ధు'

అనుచోటి ధకారమును ద్విరుక్తముగా వ్రాయుటకును బయిచోటులలోని పకార తకారముల నట్లు ద్విరుక్తముగా వ్రాయకుండుటకును వినిగమక మేమియు లేదుగదా. వేయేల! సంపచ్ఛబ్దములోనె "తత్సంప్పదాస్పదుణ్డై" అనుచోటి పకారము ద్విరుక్తముగాను "సంపత్కారి" అనుచోటి పకార మద్విరుక్తము గాను వ్రాయఁబడుట కేమియు నుపపత్తి యుండఁబోదుగదా.

(౩౪౧)—పయిరీతిని శాసనలేఖన నియమములకు నియతత్వము లేకుండుట మున్నగు ప్రమాదశతము లుండుటయేకాక లేఖన సంప్రదాయము నందును గాలక్రమమున నీ విషయమునందు వివిధపద్ధతు లేర్పడుచు వచ్చినట్లు శాసన పరిశోధనమువలన విశదమగుచున్నది.

తొలుదొల్తటి శాసనములు సంస్కృతభాషామయములె యైయుండుట చేత వాని నాంధ్రకర్ణాట సాధారణలిపితో వ్రాయునపుడును ననుస్వారముల చోటఁ బరసవర్ణ వర్గపంచమములె సంస్కృతరీతిని వ్రాయఁబడుచు వచ్చెడివి. కొంతకాలము నాఁటికందు 'జమ' ల చోట బిందువు వ్రాయఁబడు సంప్రదాయ మేర్పడెను.

(౩౪౨)—"(శ. స. ౭౭౦ ప్రాంతము)... ... ...

తరువోజ—పట్టంబుగట్టిన ప్రథమంబునేణ్డు
బలగర్వ్వం బొప్పంగ బైలేచిసేన।
పట్టంబు గట్టిఇచ్చి ప్రభు బణ్డారంగు
బఇచ్చిన సమత్తపడువతో బోయ।
కొట్టంబు లణ్డెణ్డు గొణి వేంగినాణ్డిం
గొఱల్చి యాత్రిభువనాంకుశబణ నిల్పి।
కట్టెపుదుర్గ్గంబు గడుబయల్సేసి
కణ్డుకూర్ బెజవాడ గావిఞ్చె మెచ్చి॥

(శాసనపద్యమంజరి - ౧ శాసనము, పండరంగుని యద్దంకి శాసనము.)

క్రీ. శ. ౮౫౦ సంవత్సరపు దనఁబడుచున్న యీ పండరంగుని యద్దంకి శాసనములో 'కప' వర్గపరకస్థలములలో బిందువులును దక్కిన 'చట' వర్గ పరకస్థలములలో వర్గ పంచమములును లిఖింపఁబడియున్నవి.

(౩౪౩)—అరసున్నలుగాని వానిచోట నిండుసున్నలుగాని యిందు లిఖింపఁబడనేలేదు. "ఒప్పంగబైలేచి, ప్రభుబణ్డారంగుబఇచ్చిన" అను మూఁడు

చోటులందును నరసున్న లుండవలయును గదా. శాసన సంస్కర్త లిట్టి చోట నిండుసున్న వ్రాయఁబడుచుండెడి దను తమ వాదమును నిల్పుకొనుట కయి "బొప్పంగం బై లేచి, ప్రభుంబణ్డరంగుం, అని చదువునది" అని వ్రాసిన వ్రాఁత కేవలము నిరాధారమును, సత్యవిదూరమును, నయియున్నది. ఆచోటు లందు సున్నలు వ్రాయుటయే లేఖకునకు సమ్మతమయినచోఁ దక్కినచోటు లందువలెనె "గబై, భుబ, గుబజ్చి," అను చోటులలోని బకారముపైని బొట్టులు చెక్కఁబడియుండును గదా. బిందువును బరాక్షరముమీఁద బొట్టుగాఁ జెక్కుట శాసనములోని తక్కినచోటులం దగపడుచున్నది గదా. అట్టిబొట్టులు లేకుండుటచేత నానాఁటికింకను దేలిన బిందువున కనుమాపక ముగా బిందువునుగాని వర్గపంచమమునుగాని వ్రాయునాచారము రాలే దనియు, నట్లే యూఁదిన బిందువున కనుమాపకముగా బిందువునుగాని యను నాసికమునుగాని వ్రాసి పరహల్లునకు లేని ద్విత్వమును వ్రాయుట యనెడి సంప్రదాయము సైతము రాలేదనియు, విశదమగుచున్నది. కావుననె శాసన ములోని యూఁది పల్కవలసిన బిందులకుఁ బరముగనున్న హల్లెచ్చటను ద్విరుక్తముగ వ్రాయఁబడియుండలేదు. అరయనరయఁ బ్రాచీనకాలమున నాంధ్రకర్ణాటములకు లిపిలో వలెనే కొన్ని భాషా సంప్రదాయములలోను నైక్య ముండెడిదని తోఁచుచున్నది. కర్ణాటభాషలోఁ దేలిపోయిన బిందువు చోట వినఁబడు నర్ధానునాసిక్యమున కనుమాపకముగ లిపిని వ్రాయు సంప్ర దాయము లేదు. అక్కారణముననే కర్ణాట వైయాకరణుల కర్ధబిందుస్థితి స్ఫురింపదయ్యె. ఆంధ్రవైయాకరణు లన్ననో యట్లుగాక సూక్ష్మబుద్ధిని బరిశీలించి యర్ధానునాసిక్యమున కనుమాపకముగ ఖండ బిందువును లిఖింప వలెనని సూత్రించిరి. అట్టిసూత్రములు బయలు వెడలు వఱకును బ్రాచీనాం ధ్రశాసనములలో నట్టి ఖండానుస్వారమున కనుమాపక చిహ్నమును వ్రాసెడి యలవాటు తెల్గున (కర్ణాటములో వలెనే) రాలేదయ్యెనని గ్రహింపనగును.

(3౮౮)—పయిశాసనములో "వేంగి నాణ్డిం గొళల్చి" అనుచోటి యనుస్వారము తేలినదేయనియు నచట నర్ధాని కనుమాపకముగాఁ బూర్ణము వ్రాయఁబడినదనియు, నచటిబిందువు తేలినదని యంగీకరింపనిచో 'నాణ్డిం' అనునది గగమై ఛందోభంగము నొదవించుననియు శంకింపరాదు. కర్ణాట చ్ఛందమునందువలెనే యాంధ్రచ్ఛందమునందును నాకాలమున గగము

సైతమినగణముగా నెన్నఁబడెడిదిగాన నచట ఛందోభంగము లేదనియు 'నాణ్డిం' అనుచోటిది యూఁదిన బిందువేయనియు గ్రహింపనగును. ద్వితీయ తృతీయ చతుర్థ చ్ఛందములను బ్రస్తరించి వానిలోని లఘ్వాదిగణము మొదల మఱొక లఘువు నిల్పుటయు నట్లేర్పడినవానిని వరుసగా నినేంద్ర చంద్రగణములని యాంధ్రులు గ్రహించుటయుఁ గర్ణాటులు వానిని వరుసగా బ్రహ్మ విష్ణు రుద్రగణములనుగా గ్రహించుటయు సంప్రదాయమై యుండెను. అట్టి సంప్రదాయమె నేఁటికిని గర్ణాటమున వెలసియున్నది. నానాఁటి కాంధ్రమున నక్కఱాదులు దప్పఁ దక్కిన సీసగీతాది జాతులలో శ్రుతిసుఖము నపేక్షించి కవులు ద్వితీయ తృతీయ చ్ఛందములలోని మొదటి రెండేసి గణము లను వాడనందునఁ గావలయును చూడామణికర్త యా రెండేసి గణములును బోఁగా మిగిలిన గణముల ననఁగా ద్వితీయచ్ఛందములోని నగణ హగణము లను, దృతీయ చ్ఛందములోని నల, నగ, సల, భ, ర, త, గణములను విజా తీయములనుగనెంచి వానికి "సీసగణములు=నలనామక గణములు" అను ప్రత్యేకనామము లిడెను. వాని నాతఁడెచ్చటను నినేంద్రగణములని వ్యవహ రింపలేదు. అనంతాప్పకవ్యాదులగు నర్వాచీనులు సీసగణములు వేఱనియు నక్కఱగణములు వేఱనియు గ్రహింపఁజాలక యాసీసగణములరీతి నేర్పడిన వానినె యేకముగ నినేంద్ర చంద్రగణములనుగా వ్యవహరించిరి.

క॥ ...సీసగ। ణావళిలక్షణము లెఱుఁగనగుఁ జతురులకున్॥ ౨౮

క॥ నలనగసలభరతగణం।
బులును నహంబులును ననఁగఁ బొలుపగు సీసం।
బులు గీతులు వానఁగదా।
యలవఱుపఁగవలయుఁ గృతుల కందంబరయన్॥ ౨౯

(కావ్యాలం. ౮. ఉల్లా.)

క॥ ద్విత్రి చతుర్గురుభవముల।
ధాత్రీధర రెండు మడుపఁ దక్కిన గణముల్।
మిత్రేంద్ర చంద్రులనఁజను।
మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగన్।

(ఛందోదర్పణ. ౧ ఆ. ౧౮. ప.)

కావ్యాలంకార చూడామణి కర్త్రయన్ననో కర్ణాటలక్షణ కర్తలవలెనె మొదటి రెండేసి గణములను విడువనివే యేకముగ నక్కుఉగణములనియు నినేంద్ర చంద్రగణములనియుఁ జెప్పియున్నాఁడు.

క॥ ఎరడుం మూఱుం నాల్కుం, గురువిం ప్రస్తరిస లంబునిధిగజధరణీ
శ్వరగణ మొగెగు మవర్కెఁ, సరసిజభవ విష్ణు రుద్ర సంజ్ఞెగ శక్కుం॥
(కర్ణాటచ్ఛందోంబుధి)

ఆ-వె॥ ఓలి రెండు మూఁడు నాలుగు గురువుల
నై నగణము లిన సురాధిపేందు
గణము లక్షణోపకరణంబు లవి యాది
లఘుగణంబు మొదల లఘువు నిలుప॥ (కావ్యాలం. ౭. ఉల్లా.)

పయి సందర్భమును బట్టి ప్రాచీనమగు నై యద్దంకిశాసనములోని 'నాణ్డెం' అను గగ మిసగణ మనిపించుకొనుటలో వివాదము లేదు. కాన నచటి బిందుపూర్వాది పలుకఁబడు పూర్ణమే యనుటకు సందేహములేదు. ప్రాచీనకాలమున నినేంద్రగణము లీరీతి నుండెడివని యంగీకరించునపుడే 'బలగవ్వఱం' 'కొట్టంబుల్' అను రెండు స్థలములందును ఛందోభంగము నివారిత మగును.

(3౮౫)——శాసనపరిష్కర్తలు పయిరీతిని నేఁటి యినేంద్రగణములకును ప్రాచీనకాలము నాఁటి యినేంద్రగణములకును భేదముగలదని గ్రహింపఁజాలని వారగుటంజేసియు నర్వాచీన శాసనములందువలెనె ప్రాచీన శాసనములందును బయిని వ్రాసినరీతిని బూర్ణఖండానుస్వార లేఖనము నైత ముండెడిదని భ్రమించువా రగుటంజేసియు 'నాణ్డెం' అనుదానిని గగముగ నంగీకరింపక హగణముగ నంగీకరించి యచటి తుదిబిందువు నరసున్నగఁ దలంచి కావలయును దక్కిన చోటులయం దరసున్నలకు బదులుగ వ్రాయవలసిన నిండుసున్నలు లేఖన ప్రమాదమునఁ బోయినవనియు వాని నున్నవానిగ నెంచి చదువవలె ననియు వ్రాసియున్నారు.

"బొప్పంగంబై లేచి" "ప్రభుంబండరంగుం" "అని చదువునది" అని యిట్లు టిప్పణముగ శాసనముక్రింద వ్రాసిరి. కాని స్వవాదానుకూలముగఁ బూర్ణార్థ బిందులకు వ్యావర్తకముగఁ దాము చెప్పుచున్నరీతి నీశాసనమున నాఁదిపల్కు బిందువునకుఁ బరమగు హల్లునకు ద్విత్వము వ్రాయుట యొక్కచోటనైనను లేకుండుటంజేసి తామను కొనుచున్న ఖండపూర్ణ లేఖన

పద్ధతి యీశాసనమునాఁటికి రాలేదని గ్రహింపరైరి. ఇట్లు లేని సున్నల నున్న వానినిగ భావించి చదువవలెనని వ్రాసినట్లె ఛందోభంగనివారణ మునకయి కొన్ని యెడల నున్న సున్నలను లేనివానినిగా భావింపవలెననియు నీక్రిందిరీతిని వ్రాసియున్నారు.

"కొట్టముల్వ...అని చదువునది" అని వ్రాసిరి. ఇంకను 'బలవ్వర్గం బొప్పంగ' అనుచోటి ఛందోభంగమును వారించుకొనుటకయి 'బలగవర్గ మొప్పంగ' అని చదువుమని వ్రాయ మఱచియుందురు.

(౩౮౯)—శాసన పరిష్కర్తలనుకొన్న ఖండ పూర్ణలేఖనపద్ధతి యీ శాసనమునాఁటికేకాక యింకను గొంతకాలమువఱకును రాలేదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము (శకసం. ౮౨౦ = క్రీ. శ. ౮౯౮ ప్రాంతము) లో సైత మట్టి పద్ధతిలేదు. ఇందద్దంకిశాసన మందువలె 'కప' వర్గపరకస్థలములందే కాక 'చ'వర్గపరకస్థలములందును వర్గపంచమ లేఖనపద్ధతి నశించినది. 'టత' వర్గపరక స్థలములందు మాత్రమె యిందు బిందుస్థానమున వర్గపంచమములు లిఖింపఁ బడియున్నవి. ఇందును సర్ధానుస్వారలేఖన ముపేక్షితమె యయ్యెను.

మధ్యాక్కఱ. "స్వస్తి నృపాకుశాత్మ న్తవత్సల సత్యత్రిణేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లు ణ్డనవద్యపిఖ్యాత కీర్త్తి
ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరనుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజసల్కిభూ వల్లభుణ్డొర్త్తిన్.
పరగగ బెజవాడ గొమరస్వామికి భక్తుణ్డై గుడియు
నిరుపమమతి నృపధాము ణ్డెత్తిచ్చె నెగిదీచ్చెర్ మఠంబు
గొరగల్గా కొరులిన్దు విడిసి బృన్దబు గొనియుణ్డువారు
...రిగాక యబ్బారణాసి వచ్చిన పాపబు గొణ్డు
వెలయంగ నియ్యోట్టు ఱస్సి మలినురై విడిసిన బ్రోల
గలతాన పతులును రాజు పట్టబు గట్టిన పతియు
నలియం బయ్యారల వెల్వఱించిన నశ్వమేధంబు
ఫలబుపేక్షించిన లింగ బఱిసిన పాపంబు దమకు
జననుత చేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకు వచ్చి
త్రిణయను సుతుణ్డొణ్డుసోటు మెచ్చక తివిరి యిన్నెలవ
యనఘుణ్డు సేకొని యిన్దు ప్రత్యక్షబయన్న నిచ్చు

గని మల్లకొత్తించె గుడియు మఠంబును గార్తికేయునకు.
దీనిజేబ్రోలు... ... ... అస్పష్టము... ... ... ...
... ... ... ... ...అస్పష్టము ... ... ... ... ...
రమనతో బెజవాడ కెల్ల బెడంగును రక్షయుంగాను
ద్దమ తాత మల్లపరాజు వేరెఱు దానుంగట్టించెం
గ్రమబునం దానిక కలశబిడ్డట్లుగా మొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లుడొత్తించె నమిత తేజుణ్డు
తన ధమ్మ్ముర్ణ వాడబడి కాచునృపులకున్ద... ...

(శాసన పద్యమంజరి, ౨ శాసనము.)

ఈశాసనమునందు " బెజవాడ గొమరస్వామికి, పరగగ, విడిసిన బ్రోలగల, నెగిదీచ్చెర్ణ, చేబ్రోలనుండి, నిచ్చగని, చేబ్రోలు, ఒడబడి" అనెడి ఖండబిందువుండవలసిన స్థలములు తొమ్మిదిటియందును ఖండములుగాని వానికి బదులుగాఁ బూర్ణములుగాని లిఖింపఁబడ లేదు. వీనిలోఁ ' విడిసిన బ్రోలగల ' అనుచో ' విడిసినం బ్రోలంగల ' అనియు ' యిందు వ్రత్యక్షబయన్న నిచ్చగని ' అనుచో ' యిందుం బ్రత్యక్షమైయున్న నిచ్చంగని ' అనియుఁ జదువ వలెనని శాసనపరిష్కర్తలు వ్రాసిరి. " ఇందున్ " అనుశబ్దము నుపేక్షించి ' ఇందు ' అను శబ్దమును వాడి యద్దానిని బ్రథమగా భావించి వకారాదేశమును శాసన కర్తచేసియుండునుగాన ' బ ' అని సవరించుట యుక్తముకాదు. ఇంక నిచట సున్నల నూఁదిచదివినచో వీరిపక్షములోని యినేంద్రగణముల చొప్పున ఛందో భంగ మగును. కావున నాచోటులందు సున్నలను దేల్చి చదువవలెనని వీరి యభిప్రాయమై యుండును. ఇట్లు తక్కిన యేడుచోటులందును నేల వ్రాయరైరో తెలియ కున్నది. అందుఁగొన్నియెడల సున్నలున్నవని తోఁపఁజేయుచు నేఁటి తెనుఁగు లిపితో వ్రాసిచూపిన సందర్భమున నిండుసున్నలను వ్రాయుట వింతగ నున్నది.

" పరగంగ, దీనింజేబ్రోలు, ఒడంబడి, " అని యిట్లు లేని సున్నలు వ్రాయఁబడియున్నవి : *

* ఇట్లె వీరు నేఁటి తెనుఁగున వ్రాసిచూపుటలో నింకను ననేకములగు ప్రమాదములు పడినవి. లేని సున్నలను మఱికొన్నిచోటులందును లిఖించిరి. ఉదా. వ్రచ్చినపాపంబు, రాజుపట్టంబు, ఫలంబుపే, లింగంబఱెసిన, తిరంబేలు, మొ. 'క్రమబున' మున్నగు చోటులనున్న నిండుసున్నలు వ్రాయఁబడలేదు. 'తేజుణ్డు' అని ప్రతిబింబములో నుండఁగా నట్లుండుటయే యుక్తమైయుండఁగా 'తేజుండు', అని వ్రాయించిరి.

పయిరీతిని ఖండబిందువులుండవలసినచోటులు తొమ్మిదిటియందును నియతముగా ఖండమునుగాని దానికి బదులుగాఁ బూర్ణమునుగాని శాసనములో వ్రాయకుండుట నరయఁగా నాకాలము నాఁటికి ఖండబిందువును లిఖించు సంప్రదాయమె లేదని తోఁచక మానదుగదా.

(౩౮౭)—నన్నయ భట్టారకుఁడు, గ స డ ద వాదేశము ప్రథమాంత శబ్దపూర్వకమనియు గ జ డ ద బాదేశము ద్రుత ప్రకృతిక శబ్దపూర్వక మనియు సూక్ష్మవిచారణము చేసియు, నట్టి యాదేశ సరళ పరకస్వరము మాత్రమె సార్ధానునాసికమై వాడుకలో వెలయుచుండుట నరసియు, నడఁగి యున్న యర్ధానుస్వారస్థితిని బ్రతిష్ఠించువఱకును నర్ధానుస్వార లేఖన మాంధ్ర కర్ణాట సాధారణ లిపిలో లేదనియుఁ బ్రాచీనాంధ్రులును గర్ణాటులవలెనె యూఁది పలికెడి బిందువును మాత్రమె వ్రాయుచువచ్చిరనియు గ్రహించుట మిక్కిలి యుక్తమైయుండును.

ఖండబిందువునకు బదులుగాఁ బూర్ణమునె వ్రాయుటయు నట్టియెడలఁ బూర్ణార్ధములకు వ్యావర్తకముగాఁ బూర్ణబిందుపూర్వక హల్లును ద్విత్వ యుక్తముగ వ్రాయుటయు ననెడు పద్ధతి శాసనపద్యమంజరిలోని మొదవదగు (క్రీ. శ. ౧౧౦౮) నమరావతీశాసనమువఱకు నగపడదు. అది మొదలొక్కన్న శాసనములలో నట్టి పద్ధతి విపులముగా వెలయుచున్నది. దీనినిబట్టి యాంధ్రకర్ణాట సాధారణలిపిలో ఖండానుస్వార లిపి లేమింజేసి యర్ధాని స్థితియు దాని లిఖించు పద్ధతియు నన్నయభట్టారకునిచేఁ బ్రతిష్ఠితమైన తర్వాతఁ గొంతకాలమునాఁటికిఁ బైని వ్రాసిన ద్విత్వలేఖనపద్ధతి యేర్పడెననియు నన్నయభట్టారకుఁడు తలంచిన యర్ధచంద్రాకార ఖండానుస్వార లేఖనపద్ధతి యప్పుడు వెలయఁజాలదయ్యెననియు విశదమగుచున్నది.

(౩౮౮)—పయి సందర్భమునుబట్టి "మల్లుణ్డనవద్య - రక్షయుంగా నున్దమతాత - కని మల్లణ్డు - సుతుణ్డోణ్డు - తానుంగట్టించెం - మఠంబును - భక్తుణ్డై - బెడంగును - నృపధాముణ్డు - మల్లుణ్డెత్తించె" అను స్థలములందలి పూర్ణబిందువులు ఖండానుస్వారములకు మాఱుగా వ్రాయఁబడినవి కావనియు నట్టియెడల బిందువునూఁది పలుకుటయె శాసనకర్త్రభిప్రాయమనియు గ్రహించుటయుక్తమని విశదమగుచున్నది. అట్లూఁది పలికినచోఁ ఛందోభంగమగునని

భ్రమింపరాదు. కనుక నద్దానికి శాసనవిషయమునఁ బుదాహరించిన (౩౪౪ విష) ప్రాచీన లాక్షణికుల యినేంద్ర గణములను గ్రహించినచో నీ యక్కఱ పద్యములందలి గగ, సగణములు సైతమినగణము లగుటకును మగణ సగురువులు సైతమింద్రగణములగుటకును విప్రతిపత్తి యుండనేరదు. ఇంతయేల ! శాసనాక్కఱలలోని నిర్వివాదస్థలములగు, " అత్రిఁగన్, గొరగల్గా, కొమర (స్వా,) నలియంబ (య్యా) " అనుచోటులం దట్టిగణముల నంగీకరింపక తీరదు గదా. ఇంక "(నెగిడీచ్చెఁ) మఠంబు, (త్రిణయను) సుతుణ్డు, మఠంబును (గార్తికేయునకు), ఔడంగును" అను స్థలములందు మాత్రము "మఠబు, సుతుడు, మఠబును, ఔడగును" అని లిఖింపఁబడవలసియుండఁగా నచటి శిలాఖండము లేదేని కారణమునఁ దునిసిపోవుటచేతనో, లేఖకాది ప్రమాదముననో యట్టి బిందుస్థితి సంభవించియుండునని యెన్నఁదగును. అందు 'సుతుణ్డు' అను చోటి ణకారము లేఖకాది ప్రమాదజనితమె యనకతీరదు. 'నృపాంకుశా' అనుచోటి బిందులేఖనము లేఖకాది ప్రమాదమున లోపించినదికాదా ? 'ంబు, బు' అను రెండు విధములగు రూపములును శాసనమున ననేక స్థలములందు నిర్వివాదముగా వెలయుచుండుటంజేసి, 'మఠబు' అని చదువవలసిన చోట 'మఠంబు' అని వ్రాయుట సంప్రదాయమనుచు వాదించుట కవకాశమెంతమాత్రమును లేదుగదా. పరిశీలింపఁగా నానాల్గు చోటులును బ్రమాదపతితములు కావనియు ద్వితీయ తృతీయ చ్ఛందంబుల గణములలో లఘ్వాదిగణములకేకాక గుర్వాది గణములకు సైతము మొదట నొక లఘువును జేర్పఁగా నేర్పడెడి వాని నక్కఱల యినేంద్ర గణములనుగా గ్రహించు సంప్రదాయమాకాలమున నుండెడిదేమో యనియు గ్రహించినను గ్రహింప వచ్చును. (చూ. పుట ౨౫౨)

(౩౪౯)—పయి సందర్భమునుబట్టి పయిశాసనము కాలమునాఁటికిఁ బ్రథమావిభక్తిలో 'ంబు' 'బు' అను రూపములను ధారాళముగాఁ బ్రయోగించు సంప్రదాయము కలదని విశదపడుచుండుటంజేసి, "పాపబు (౨పద్య) ఫలబు, లింగబు (౩పద్య) ప్రత్యక్షబు (౪పద్య) క్రమబు, కలశబు (౫ పద్య)" అను స్థలములందు "ఫలము, లింగము, ప్రత్యక్షము, క్రమము, కలశము" అని యిట్లు ముపర్ణకపాఠము నంగీకరింపవలెనని శాసనపరిష్కర్తలు వ్రాయుట యెంతమాత్రము సరికాదనియు (ఆకాలమున 'ము' లేదు) నది శాసనకర్త్రభిప్రేతమును గాదనియుఁ జెప్పుటకు సందేహము లేదు. ఇంకొకవిశేషము.—ఈ

బెజవాడశాసనమునందును నంతకుముందటి యద్దంకి శాసనమునందును నహా దనకరగ్రామ శాసనమునందును నిట్లు 'ంబు, బు' వర్ణకములు మాత్రమె ప్రయోగింపఁ బడియున్నవిగాని ముఁవర్ణక మొక్కచోటనయినను బ్రయోగింపఁబడి యుండ లేదు. కాఁగా నట్లు ముఁవర్ణకముగా సవరించుట శాసకవ్యభిప్రాయమునకును, నాకాలపు బ్రథమావిభక్తిచరిత్రమునకును విరుద్ధమని యెన్నఁదగును.

(3౫౦)—సంయోగములోని హల్లును ద్విరుక్తముగా వ్రాసినపుడె యద్దానికిఁ బూర్వముననుండు వర్ణమును గురువుగా నూఁది పలుకుటయు నట్లు ద్విత్వము వ్రాయనపుడు సంయోగపూర్వమును నయితము తేల్చి లఘువుగానే పలుకుటయుఁ (దీనికె శిథిలద్విత్వ మనిపేరు) బ్రాచీన కర్ణాట సంప్రదాయమైయున్నది. అట్టిసంప్రదాయము ప్రాచీనాంధ్రశాసనములలో లేదుగాని రేఫపూర్వక సంయోగములోని హల్లును ద్విత్వముగా వ్రాయు సంప్రదాయముమాత్ర మగపడుచున్నది. (చూడు యుద్ధమల్లుని బెజవాడశాసనము కీర్త్తి, అర్త్తిన్, కార్త్తికేయునకు, ధర్మ్మువు, తీర్చ్చె) ఇట్టివాసనచేతనే కావలయుఁ బ్రాచీనాంధ్రశాసన లేఖనపద్ధతిలో నన్నయభట్టారకాదులు చెప్పిన యర్థచంద్రాకార ఖండానుస్వారము వ్రాయకుండుటయు, నూఁది పలుకవలసిన బిందువునకుఁ బరమందలి హల్లునకు ద్విత్వము నిచ్చుటయు ననెడి యలవాటు కాలక్రమమున నాంధ్రలిపిలో వెలయసాగెనని తోఁచుచున్నది.

(3౫౧)—'నలియంబయ్వారల' అనుచో శాసనపరిష్కర్తలు 'నలియంబై వారల' అని సవరించుటయు సరికాదు. తెనుఁగుభాషలో 'ఐ'అనునది 'అయి' అనుదాని కభిన్నముగా నుండుటయే సార్వత్రికమై యున్నను "ఐ = అయ్" అను తమిళభాషాప్రసిద్ధమగు మార్పును నరుదుగ నుండెడిదని గ్రహింపక తీరదు.

" అకర త్తిమ్బర్ . . ."(తొల్కాప్పియము ౫౬సూ) 'అకారపూర్వకమగు హల్లు యకారము ఐకారమగును' అని పైసూత్రము నర్థము. ఇట్టిపద్ధతి తెల్గునను నరుదుగ నుండెడిదని యంగీకరింపనిచో "అయియు = ఐయు = అయ్యు = అయ్యు" అను వానిలోని "అయ్యు" అను ప్రసిద్ధరూపము సాధ్యము కానేరదు. ఇట్టి ప్రయోగము బెజవాడశాసనములోనే స్థలాంతరమందును "ప్రత్యక్షబయన్న" అనుచోనగపడుచున్నది. కాన నచట నైతము

శాసనపరిష్కర్తలు వ్రాసినట్లు "ప్రత్యక్షమైయున్న" అని సవరింపరాదనియు "ప్రత్యక్షుఁడయున్న" అని సవరింప నగుననియు గ్రహింపనగును.

(౩౫౭)— ప్రకృత మనుసరింతము:— వెనుక నుదాహరించినరీతిని ఖండానుస్వారముచోటఁ బూర్ణానుస్వారమును వ్రాయుటయు నక్కారణమున ఖండపూర్ణవ్యావృత్తికముగా నూఁది పలుకవలసిన బిందువులకుఁ బరమందున్న హల్లును ద్విత్వముగా వ్రాయుటయు ననెడి సంప్రదాయము ప్రాచీనశాసనములలో లేకుండుటయే కాక వెనుక వ్రాసినచొప్పున శాసనపద్యమంజరిలోని క్రీస్తుశకము ౧౧౦౮ సంవత్సరము మొదలుకొనిన యమరావతీశాసనము మొదలుగాఁగల శాసనములందు సైతము మట్టినియమము సరిగఁ బాటింపఁబడి యుండలేదు. ట త వర్గ పరకత్వమున బిందువుచోట ణనలను వ్రాయునపుడు పరస్థహల్లునకు ద్విత్వము వ్రాయు సంప్రదాయ మెచ్చటను లేదు. అట్టిచోటులందును ఖండపూర్ణవ్యావృత్తికి లిపిని వెలయించుటకే కావలయును గాలక్రమమున శాసనములలో 'ట త' వర్గపరకత్వమునందును ణనలను వ్రాయువలవాటు నుపేక్షించుచు నట్టిచోటులందు సైతము నిండుసున్నలనే నిల్పి పరస్థహల్లులకు ద్విత్వము నిచ్చెడి సంప్రదాయము వెలయసాగెను. ఖండపూర్ణభేదమును దెల్పుచుండెడి పయిపద్ధతులు సైతము శాసనములం దెచ్చటను నవ్యభిచరితముగఁ బాటింపఁబడి యుండలేదు. ఈ విషయమును విశదపఱుచుటకయి శాసనపద్యమంజరినుండి కొన్ని స్థలములను దిఙ్మాత్రముగ నుదాహరించుచున్నాను.

ఉ. అంబరమూర్తిఁ ఖేందుమితమై శకవత్సరములు సనంగ్గభూ
మ్యంబు దివాకరాత్మ్ర కలయంత్తకు భక్తినఖణ్డమైన దీ
పం బమరేశ్వరార్ధ్యముగ బాలకి లోలవిశాలనేత్రి గొ
మ్మాంబిక నిల్పె భక్తిమతియై యెఱియాంబతనూజ ప్రీతితోను.

(శాసన పద్యమంజరి. ౫ శాసనము శ. సం. ౧౦౩౦. క్రీ. శ. ౧౧౦౮ అమరావతీ గ్రామశాసనము. ౫ పద్యము.)

ఉ. రాజవిభూషణుణ్డు సురరాజవిలాసు డ్డనన్తకీర్తిఁ వి
భ్రాజితుం డెఱ్ఱ మణ్డజనపాలకు నచ్చిన వజ్రదండ గ
న్నోజుసుతుణ్డు సూరని మహోర్వీజనసన్నిధిం బెక్కరాజన
త్వోజితు విశ్వకర్మకులభూషణు వైరినరేంద్రభీషణున్.

శాసన పద్యమంజరి. ౭ శాసనము. శ. సం. ౧౦౪౦. క్రీ. శ. ౧౧౧౮-౯.పద్యము)

చ. ప్ర । స్తుత (మ) గుచుణ్ణంగండం డనిసూర (ణ్డు) పౌరుషధర్మ్మ సారుణ్డై.

(౭ శాసనము, చేబ్రోలు. శ. స. ౧౦౪౦ క్రీ. శ. ౧౧౧౮, ౨ పద్య.)

శా. శ్రీ నారీపతి నాభిపంకజభవ శ్రీపాదజాతోత్తమ
క్ష్మానాథాంబుజ భాస్కరుండు నిజవంశంబెల్ల దీపింపంగా
దీనానాథకవీంద్ర గాయకులు గీర్త్తింపంగం గీర్త్తిం శుండై
భూనాథాగ్రణి బుద్ధవర్మ్మ ప్రభతోం బుట్టెన్మహాశౌర్యుణ్డై.

(౧౯ శాససము, చేబ్రోలు గ్రామము, శ. స. ౧౦౬౭, క్రీ. శ. ౧౧౫౪, ౧ పద్య.)

స్రగ్ధర. శ్రీరమ్యక్ష్మావధూ కాంచ్చికి నెనయగు కాంచ్చీపురీనాథు నుగ్రా
కారును లాలాటనేత్రుం గ్గవిజనహితు ముక్కంటి కాడ్వెట్టిం బుణ్యా
చారుం ద్దద్బుద్ధవర్మ్మేశ్వరుండు గొలిచి ముని శాసనంబ్బొంద్దం గన్నె
దారుం డ్డొంగేఱు మార్గత్రయము వడసె నాతారచంద్దార్కకీర్ణ లీలను.

(౧౯ శాస) చేబ్రోలు గ్రామము, శ స. ౧౦౬౭, క్రీ. శ. ౧౧౪౫. ౨ పద్య.)

ప్రాచీనకాల లేఖనపద్ధతి పై రీతిని నియమశూన్యముగను దోషభూయిష్ఠముగను దప్పులతిప్పగను నుండుటంజేసియే ప్రాచీనాంధ్రలాక్షణికులు తమకు లభించిన తాళపత్ర మాతృకలనుబట్టియు శాసనాదులబట్టియు ఖండానుస్వార నిర్ణయము చేయుపనికి దొరకొనరైరని గ్రహింపనగును. మఱియు ఖండపూర్ణ వివేచన సాధకమగు నీ ద్విత్వలేఖనపద్ధతి యర్వాచీన మగుటచేతను నీకాలమున నర్ధానుస్వార ముచ్చారణభ్రష్టత నందియుండునని తోఁచుచుండుటచేతను నిట్టి శాసనాదుల లేఖనపద్ధతి నియమశూన్య మగుటచేతను నియ్యవి ఖండపూర్ణ నిర్ణయమునకుఁ బ్రమాణములు కానేరవని వారు నిశ్చయించుకొని యిట్టిపని నుపేక్షించి యుందురనుటకు సందియము లేదు.

(౩౫౩)—తుదికి శబ్దరత్నాకర కోశకర్త కొంత పరిశ్రమముచేసి యేదో యొకతీరున ఖండానుస్వారనిర్ణయము చేసికొని తన శబ్దరత్నాకర కోశమున నాయా శబ్దములను నర్ధానుస్వారములతో నుదాహరించియున్నాఁడు.

అట్టిసిద్ధఖండయుతశబ్దములనెల్ల వేఱుగ నేర్చికూర్చి బాలచంద్రోదయమను పేర నొక చిన్నపుస్తకమును శబ్దరత్నాకరముద్రణమునకుముందే ప్రచురించెను.

బాలచంద్రోదయమునందలి కొన్నిస్థలములను సవరించియుఁ బ్రామాణిక ప్రయోగములను, జూపియు శబ్దరత్నాకరమున నట్టివిషయమును గొంత విపులపఱిచెను. కాని యున్నంత వఱకయిన సాకల్యముగ నేతద్విషయమునఁ బ్రయోగములను జూపు నియమమును జేసికొనియుండలేదు. హ్రస్వము మీఁది పూర్ణములకుఁ బ్రయోగములను జూపినచో నచటిఖండములు సప్రమాణములు కానోపును. కాని యావిషయమునందును గొన్ని స్థలములందు మాత్రమె ప్రమాణములు చూపఁబడెను. ఒసఁగు, (వి. ౩౭౯.), నెలఁత, పడఁతి, పొలఁతియున్నగు ననేక శబ్దముల పూర్ణబిందు ప్రయోగములుచూపఁ బడియుండ లేదు. ఇట్లె దీర్ఘముమీఁది ఖండములలోఁ గొన్నిటికి మాత్రము ప్రాచీనార్వాచీనకవుల ప్రాసస్థలములు ప్రమాణములుగాఁ జూపఁబడినవి. పరిశీలింపఁగా నట్లు చూపఁబడిన కతిచిత్ స్థలములు సైతము ప్రామాణికములు కానేరవు. నన్నయేతరాంధ్రకవులెల్ల ఖండాఖండ ప్రాసము నంగీకరించిన వారేయని యీవఱకువిపులముగాఁ జర్చించి చూపియెయున్నాను. అట్టిస్థితిలో నట్టి ప్రాసప్రయోగము లాయాచోటులందలి ఖండానుస్వారస్థితిని నిర్ణయింపఁ జాలవు గదా.

"నాఁడు. దే. వి. । ఆకాలము. ఉ. వేఁడిన... । చూఁడిన... ।నాఁడు ...।నేఁడు...(రా. అ. కాం)............ప్రామాణిక కవిప్రయోగములందిది నిర్బిందువుగాను గానంబడియెడి క. మీటుగల...నొక।నాటికి...నో । నాటి... । వేఁటాడెద..." (భార-ఉద్యో-౨ఆ.) ఉ. నాటికి... । గాటపు... పూఁ । దోఁటకు...విభుం।డేటికి......(కళా. ౨ఆ.) మఱియు చూ. రెన్నాళ్లు మూన్నాళ్లు. మొ." (శబ్దరత్నా. నాఁడుశబ్దము)

ఇట్టి విమర్శనము ప్రామాణికము కానేరదుగదా. నాఁడుశబ్దము నిర్బిందుకమని నిర్ణయించుటలోఁ జూపిన పద్యములలో "మీటుగల......" అను భారతోద్యోగపర్వ పద్యమె యప్పకవీయమందును సర్వలక్షణసారసంగ్రహమునందును ఖండాఖండ ప్రాస లక్ష్యముగాఁ జూపఁబడినది. (చూ. ౩౭౯ వి.) మఱియు 'వేఁటాడెద' అను సఖండ శబ్దమొకపాదమున నున్నప్పుడట్లె "నాఁటికి" అనుచోట నయితేము ఖండముకలదనుటలో విప్రతిపత్తి యుండదు గదా. తిక్కయజ్వయు ధారాళముగా ఖండాఖండప్రాసము నంగీకరించి

ప్రయోగించినవాఁడే కదా (వి. ౩౨౯). అట్టి స్థితిలోఁ బయి ప్రయోగము 'నాఁడు' శబ్దము నిర్బిందుకమని యెట్లు నిర్ణయింపఁ జాలును ?

దీర్ఘముమీఁది పూర్ణమును బాక్షికముగా నంగీకరించిన ప్రయోగములుగల నన్నిచోడుని కుమారసంభవము మున్నగు కొన్ని గ్రంథములు శబ్దరత్నాకర రచనాకాలమునకు లభింపమిఁ జేసి 'మూఁడు,' మున్నగుకొన్ని శబ్దములు నిర్బిందుకములనియు శబ్దరత్నాకరకర్త చర్చించి వ్రాసియున్నాఁడు.

"మూడు. దే. స. రెండు నొకటి. (ఇది సార్ధబిందుకమనుటకుఁ గవి త్రయమువారి ప్రయోగములయందుఁ దగిన యుదాహరణములు దొరకమిగాక యిది బహువచనమున మూళ్ళని వాడఁబడుచున్నది)" (శబ్దరత్నా. మూడు శబ్దము.)

వెనుక నుదాహరించిన (౩౩౨. వి.) ప్రయోగములచొప్పున 'మూఁడు' శబ్దము సబిందుకమనక తీరదుగదా. తమిళములో నిది 'మూన్రు' అనురూప' ముతో వెలయుచున్నది.

(౩౫౮)— ఇంక వైకృత శబ్దములకుఁ బ్రకృతులగు సంస్కృత శబ్దములందును దేశ్యశబ్దములను సంబంధించియున్న తమిళ కన్నడ శబ్దములందును గలయనునాసికములనుబట్టి కొన్ని యెడల ఖండానుస్వార నిర్ణయము చేయవచ్చు నను విషయము సయితము సాకల్యముగాఁ బ్రామాణికము కానేరదు.

| సం. | వై. | సం. | వై. |
|---|---|---|---|
| కేతకి | = గేదంగి | ఆమంత్రణము | = ఆమెత |
| వ్యాఘ్రము | = వేఁగి | స్కందనము | = కదము |
| వైశాఖము | = వేసంగి | మూక | = మూఁగ |
| చంపకము | = సంపంగి | స్త్రీ | = ఇంతి |
| ఇక్షువు | = ఇంచు | | |

ఇట్లనేకస్థలములం దట్టి నియమము భగ్నమగుచునే యున్నది.

(౩౫౯)—ఇట్లె ద్రావిడభాషా కుటుంబములోఁ జేరిన తమిళ కర్ణాటాంధ్రాదులలో నొకదానియందు నిండుసున్నతో నున్న పదము మఱొకభాషలో నిర్బిందుకముగా నుండుట యీ క్రింద నుదాహరించిన రీతి ననేక స్థలములం దగపడుచుండుటం జేసి యట్టి నియమము సైతము సార్వత్రికముగఁ బ్రమాణీకరించుటకు వలనుపడదు.

సబిందుక శబ్దము నిర్బిందుకముగాఁ బరిణమించునపుడు వాని మధ్యమావస్థ యర్ధానునాసిక్య శ్రుతి కలదై యొకటి యుండి తీరుననుట కేవలము స్వాభావికమును ననుభవసిద్ధమును ననుటకు సందేహము లేదు. అట్టి మధ్యమావస్థను గ్రహింపని తమిళ కర్ణాట పండితుల నిర్బిందుక ప్రయోగములలో స్థలాంతరములందును బిందువుండెడిదేమో యను నూహ సావకాశ మనఁదగును గదా. కర్ణాట పండితులలో నొకఁడగు కేశిరాజు కర్ణాటశబ్దములలో బిందువుండిన నుండుట లేకుండిన లేకుండుట యనెడి యవస్థాద్వయమునె యంగీకరించి యున్న విషయ మీవఱ కుదాహరించియె యున్నాను. ౩౨౭. వి)

## 355 ద్రావిడభాషలలోని సబిందు నిర్బిందుకతా వ్యత్యాసము.

| తెలుఁగు. | తమిళము. | కన్నడము. | సంస్కృతము | వివరణము. |
|---|---|---|---|---|
| అనుఁగు | అణఙ్కు | అణుగు | | తె. క - ప్రియమైనది. త — దేవతాస్త్రీ. |
| అలఁగు | అలఙ్కు | అలుగు | | తె. శోకించు. వెనుదీయు త. క. చలించు |
| అలుఁగు | అలకు | అలగు | | కత్తి. బాణాగ్రము - |
| ఎఱఁగు | ఇఱఙ్కు | ఎఱగు | | నమస్కరించు |
| ఏఁబది | ఐమ్బదు | ఐవత్తు | | |
| ఒడఁగూడు | ఉడన్‌కూడు | ఒడకూడు | | |
| కరఁగు | కరై | కరగు | | |
| కీఁచు | కీచ్చు | కీచు | | బిందువు = ద్విత్వము |
| కుండ | కుడమ్ | | కుణ్డః | |
| కుఱఁగలి | కుఱుకల్ | | | |
| కొఱఁత | | కొఱతె | | |
| గూఁడు | కూడు | గూడు | | కులాయము |
| గొజ్జెఁగ | | గొజ్జిగె | | |
| చూఁడు | చుడు | సూడు | | కాల్చు |
| చేఁదు | చేర్తు | సేదు | | నీరుతోఁడు |
| తాఁకు | తాక్కు | తాగు | | స్పృశించు, బిం = ద్వి, |
| తూఁగు | తూఙ్కు | తూగు | | |
| తొడఁగు | తొడఙ్కు | తొడగు | | ఆరంభించు |
| తొలఁకు | తులఙ్కు | తొళగు | | ప్రకాశించు |
| తోఁక | తోకై | సోగె | | తె.క.పుచ్ఛము.త. నెమిలిపురి |

## ద్రావిడభాషలలోని సబిందు నిర్బిందుకతా వ్యత్యాసము.

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | వివరణము |
|---|---|---|---|---|
| తోఁడు | తోణ్డు | తోడు | | పెల్లగించు |
| తోఁపు | తోప్పు | తోపు | | తోఁట, బిందువు = ద్విత్వము |
| త్రేఁచు | తేర్కు | తేగు | | ఉద్ధరించు. బిం. = ద్వి. |
| దోఁటి | తోట్టి | దోంటి | | అందనిపండు కోయుపనిముట్టు బిందువు = ద్విత్వము |
| నలఁగు | నలఙ్కు | నలుగు | | (కృశించు.) |
| నాఁగలి | నాఞ్జిల్ | నేగిల్ | లాంగలమ్ | |
| నీఁగు | నీన్కు, నీఙ్కు | నీగు | | తె. నివర్తిల్లు-(త.గ. విడుచు. ౨ పోవు, క. పోవు) |
| పలుఁగు | పళిఙ్కు | పళికు | స్ఫటికః | స్ఫటికము |
| పాఁచి | పాచి | | | శైవలము |
| పాఁడి | పాడి | పాడి | | తె. పాలు. త-క-వ్రజము |
| పెనఁగు | పిణఙ్కు | పెణగు | | |
| బలఁగము | | బళగ | | |
| బీఁట | విడర్ | బీ[illegible] | | |
| పునుఁగు | పునుగు | పుణుగు | | గంధద్రవ్యము |
| బోఁదె | పోత్తిగై | బోదిగె | | |
| మడఁత | మడిప్పు | మడితె | | |
| మఱుఁగు | మఱైక్కు | మఱుగు | | బిందు = ద్విత్వ |
| మాఁగు | మాఙ్కు | మాగు | | |
| మాఁడు | మాణ్డు (చచ్చు) | బాడు | | |
| మీఁదు | మీదు | | | |
| మునుఁగు | మఱుగు | ముఱుంగు | | |
| ముసుఁగు | ముసుక్కు | ముసుంకు | | |
| మూఁగ | మూఙ్గై | మూగ | మూకః | |
| మెఱుఁగు | | మిఱుగు | | |

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | వివరణము |
|---|---|---|---|---|
| మోఁకాలు | ముటజ్ఞాల్ | మోకాళ్ | | |
| మోఁదు | మోదు | మోదు | | |
| లాఁగు | | లాగు | లంఘనమ్ | [మగు |
| వీఁగు | వీఙ్కు | బీగు | | తె. గర్వించు- త. క - అధిక |
| వెఱఁగు | | వెఱగు | | |
| వెలుఁగు | విళఙ్కు | బెళగు | | |
| వేఁగి | వేఙ్కై | బగ్గ | వ్యాఘ్రః | బిందువు = ద్విత్వము |
| వేసఁగి } | | | | |
| వేసవి } | | బేసగె | వైశాఖః | |
| సంపఁగె | | సంపగె | చంపకః | |
| సరిఁబడు | సరిప్పడు | సరిపడు | | బిందువు = ద్విత్వము |
| సాఁకు | తాఙ్కు | సాకు | | [క్షించు |
| సురుఁగు | సురఙ్కు | సొరగు | | తె - లీనమగు - త - క - శు |

పయిరీతిని వ్యత్యాసము విపులముగా నుండుటచేతఁ దమిళ కర్ణాటములలోని యనునాసికములను నిండుసున్నలను బట్టి తెల్గునందలి ఖండమును నిర్ణయించుట సార్వత్రికముగాఁ బ్రామాణికము కానేరదు. తెల్గున హ్రస్వము మీఁద ధారాళముగా ననుస్వారము వినఁబడుచున్న పదములు కొన్ని తమిళ, కర్ణాటములలో నిర్బిందువులయి యగపడుచుండుటంజేసియుఁ దెల్గులోని బిందుస్థితికిఁ దమిళకర్ణాటములలో నొకభాషయందు సంవాద మగపడుచుండఁగా వేఱొకచోట నిర్బిందుస్థితి వెలయుచుండుటంజేసియు సబిందుకతా నిర్ణయము విషయమునఁ దమిళ కర్ణాటములు ప్రామాణికములని చెప్పుట యెంతమాత్రమును బొసఁగదుగదా. స్పష్ట ప్రతిపత్తికై పైపట్టికనుండియే యట్టివానిని గొన్నిటి నిటఁ జూపుచున్నాను.

## ద్రావిడభాషలలోని సబిందు నిర్బిందుకతా వ్యత్యాసము.

| తెలుఁగు | తమిళము | కన్నడము | సంస్కృతము | వివరణము |
|---|---|---|---|---|
| ఎఱుఁగు | ఇఱుఙ్కు | ఎఱగు | | నమస్కరించు |
| తాఁకు | తాక్కు | తాగు | | స్పృశించు, తమిళములోని ద్విత్వముబిందుస్థానీయ మనఁదగును. |
| తూఁగు | తూఙ్కు | తూగు | | |
| తొడంగు | తొడఙ్కు | తొడగు | | ఆరంభించు |
| తొలంకు | తులఙ్కు | తొళగు | | ప్రకాశించు |
| తోఁడు | తోణ్డు | తోడు | | పెల్లగించు |
| తోఁపు | తోప్పు | తోపు | | తమిళ ద్విత్వము బిందుస్థానీయ మనఁదగును. |
| త్రేఁచు | తేక్కు | తేగు | | |
| నాఁగలి | నాఞ్జిల్ | నేగిల్ | లాంగలమ్ | |
| నీఁగు | నీక్కు | నీగు | | తె. నివర్తిల్లు. త. విడుచు - పోవు. క. పోవు. తమిళ ద్విత్వము బిందుస్థానీయ మనఁదగును. |
| పెనంగు | పిణఙ్కు | పెణగు | | |
| మఱుంగు | మఱైక్కు | మఱుగు | | తమిళ ద్విత్వము బిందుస్థానీయ మనఁదగును. |
| మాఁగు | మాఙ్కు | మాగు | | |
| మాఁడు | మాణ్డు | బాడు | | |
| మునుంగు | మఱుగు | ముఱుంగు | | |
| ముసుంగు | ముసుక్కు | ముసుంకు | | |
| మూఁగ | మూఙ్కై | మూగ | | |
| వీఁగు | వీఙ్కు | బీగు | | తె. గర్వించు. త-క. అధికమగు. |
| వెలుంగు | విళఙ్కు | బెళగు | | |
| సాఁకు | తాఙ్కు | సాకు | | |
| సురుంగు | సురుఙ్కు | సొరగు | | తె. లీనమగు త-క. శుష్కించు. |

(౩౫౬)—పయిరీతిని వెనుక నుదాహరించిన (౩౩౯.వి) ఖండానుస్వారస్థితిని దెల్పుపద్ధతులం దవ్యభిచరితమగు పద్ధతి యొక్క టేనియు లేదనుటకు సందియములేదు. అట్లయ్యును నట్టిపద్ధతుల ననుసరించి ఖాండానుస్వారస్థితిని స్థూలదృష్టిని దెలియఁజేయుట యుక్తమె యనవచ్చును. నన్నయేతరప్రాచీన మహాకవులు సైతము క్వాచిత్కముగా ఖండాఖండ ప్రాసము నంగీకరించినను వారిప్రయోగప్రణాళినిబట్టి చూచునపుడు వారు ప్రచురముగా ఖండబిందు ప్రాసనియమమును బాటించు కోర్కిగలవారని తోఁచకపోదు. కాఁగా నట్టి ప్రాచీనమహాకవుల ప్రాసప్రయోగముల నుదాహరించుచు దీర్ఘ పూర్వక సిద్ధఖండములను జూపుటయు నాంధ్రమహాకవి పద్యములలోని నిండుసున్నల తోడి ప్రయోగముల నుదాహరించుచు హ్రస్వముమీఁది ఖండములను జూపుటయు నావశ్యమే యై యున్నది. అట్టిపని కోశకారులదె యైనను శబ్దరత్నాకరకోశము సైతమ మట్టిపనిని సాకల్యముగఁ జేసి యుండలేదు. అట్లయినను గ్రంథవిస్తరభీతిచే నట్టిపనిని భావికోశకారులకు విడిచి యిచట ఖండానుస్వారయుతాంధ్రశబ్దములను సంబంధించిన తమిళ కర్ణాటశబ్దములను మాత్ర మొక పట్టికగాఁ జూపుచున్నాను.

| తెలుగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| అడంగు } | నమ్రముమగు | అడఙ్కు- అఙ్గె = ఉపశమిల్లు | అడంగు = విలీనమగు |
| అణంగు } | | | |
| అరంగు | వేదిక | అరఙ్కు = చిన్నగది | |
| ఆందోళ | గోపుచ్ఛాకారము | ఆన్ = ఆవు | |
| ముక్కిండి | ముక్కు-లేని వాండు | నాణిలి = లజ్జలేనివాండు | మూగిలి = ముక్కు-లేనివాండు |
| ఈటె | కుంతము | ఈట్టి = కుంతము | ఈంటి= త్రాగు (రక్తము త్రాగునది) |
| ఈత | ఈదుట - తిర్యక్కు ప్రసవిం [చుట | నీన్దు = ఈదుట, } | |
| | | నీన్దల్ = ఈత } | ఈసు = (జలో త్తరణముచేయు) |
| ఈదాడు | హింతాలవృక్షము | ఈన్దు = హింతాలము | |
| ఈదు | తరించు - ఈతచెట్టు | ఈన్దు = ఈతచెట్టు } | |
| | | నీన్దు = ఈదు } | |
| ఊత | అవలంబము | ఊన్ఱు = అవలంబము | ఊఱు = అవలంబము |
| ఊదు | ఊదు - ఆఘ్రానించు | ఊత్తు = నోటితో నూదు | ఊదు = ఆఘ్రానించు |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| ఎన్నఁడు | ఏనాఁడును | ఎఞ్ఞాన్రు = ఎప్పుడు | ఎన్నాళ్ |
| ఎఱఁగు } ఎరఁగు } | దిగు - మ్రొక్కు | ఇఱఙ్కు = దిగు }<br>ఇఱైఞ్జు = మ్రొక్కు } | ఎఱగు = పడు - మ్రొక్కు |
| ఎసఁగు | అతిశయించు | { ఇయఙ్గు = చలించు<br>{ ఇశై = సమ్మతించు ఒప్పిదమగు | ఎసగు = గాలివీచు |
| ఏఁకట | మిక్కిలికాంక్ష. ఉత్కంఠ | ఏఙ్కుదల్ = ఉత్కంఠ }<br>ఏఙ్కు = ఉత్కంఠించు } | |
| ఏఁడు | సంవత్సరము - ఎవఁడు | యాణ్డు = సంవత్సరము - ఎక్కడ | |
| (ఏడు) | ఆఱునొకటి | ఏఱు = ఆఱునొకటి | ఏఱు = ఆఱునొకటి |
| ఏఁబది | ఐదు పదులు | ఐమ్పదు = ఏఁబది | ఐవత్తు = ఏఁబది |
| ఒడఁగూడు | సిద్ధించు | ఉడన్ కూడు = సిద్ధించు, చేరు | ఒడకూడు=(ఒడనె+కూడు) కలిసియుండు |
| ఒడఁబడు | సమ్మతించు | ఉడన్ పడు = సమ్మతించు | |
| ఒదుఁగు | తొలఁగు | ఒదుఙ్కు = తొలఁగు, ఇచ్చు = సహా [ యము చేయు | |
| కడఁగు | పూను | | కడంగు = ఉత్సాహము |
| కడుందురు | కందురీఁగ | కడు నైఱు = కందురీఁగ | కడుందుఱు = కందురీఁగ |
| కణఁజము | గరిసె | కళఞ్చియమ్ = గరిసె | కణజము = గరిసె(హళగన్నడము) |

| | | | |
|---|---|---|---|
| కముఁజు<br>కవుఁజు<br>కౌఁజు | కపింజలము | | కవింజు = కౌఁజుపిట్ట |
| కరఁగు | ద్రవించు | కరై = (కరఁగు, కరఁచు.) కరఙ్జి = (కరఁగి.) కరైన్దదు = (కరఁగినది,) కరైత్తాన్ = (కరఁగినాఁడు.) | కరగు = ద్రవించు |
| కలఁగు | కలఁతపడు | కలక్కు =(కలఁతపడఁజేయు,) కలఙ్గు=(కలఁతపొందు) | కలంకు = కలఁతపెట్టు, కలఁతపడు |
| కలఁకులు | రణరంగములు | | |
| | కళ్లములు | కళఙ్కళ్ =యుద్ధరంగములు, కళ్లములు | కళంగళ్ = యుద్ధరంగములు, కళ్లములు. |
| కలుఁజు | వాలుగొమ్ము - ఆలికట్టడము | కలుఙ్కు = వాలుగొమ్ము | |
| కాఁక | కోపము, తాపము | కాఙ్గై = తాపము | కాయ్ = కోపించు, తపించు, ఫలించు. |
| కాఁగు | తపించు, పెద్దకుండ | కాయ్ = ఫలించు, కోపించు, తపించు, | కాయసు = కోపింపఁజేయు ( కా - రక్షించు ) |
| కాఁచి | ఒక చెట్టు | కాఞ్చి = ఒక గొప్పచెట్టు | |
| కాఁచు | కాఁగఁజేయు | కాయ్చ్చు = కాఁగఁజేయు | కాయుసు = కాఁగఁజేయు |
| కీఁచు | ధ్వని విశేషము | కీచ్చు = ఒకధ్వని | కీచు = ఒకధ్వని |
| కూఁక<br>కూఁత | అఱపు | (కూ - ధాతువు) కుచ్చల్ = కూఁత. కూవు = శబ్దించు | కూగు = శబ్దించు |

| తెలుగు | అర్థము | తమిళము | కన్నడము |
| --- | --- | --- | --- |
| కెలఁకు | కెల్లగించు - పార్శ్వము | కలక్కు = కెల్లగించు | కెల = పార్శ్వము |
| కొఱఁత | తక్కువ | కుఱైచ్చల్ = కొఱఁత | కొఱతె = న్యూనత |
| కొలఁకులు | సరస్సులు | కుళఙ్కళ్ = పరస్సులు | కొళంగళ్ = కొళగళ్ = సరస్సులు |
| కోఁట | ప్రాకారము | కోట్టై = కోఁట | కోంటె = కోఁట |
| కోఁడు | బియ్యము చెఱుగు | కొఱి = బియ్యము చెఱుగు | |
| కోఁత | కోయుట | కోయ్దల్ = కోఁత | |
| క్రోఁతి | కోఁతి | కురఙ్గు = క్రోఁతి | |
| గానుఁగ | నూనెయాడు యంత్రము | కాణమ్ = గానుఁగ | |
| గీఁచు | గీటుగీయు | కీచ్చు = గీయించు. కీఱు = గీఁత | |
| గీఁత (గీటు) | గీటు | కీట్టు (ఱ్ఱు) | |
| గోఁగు | కొండగోఁగు | కోఙ్గు- ఒకవ్రమాను | |
| గోరఁట | గోరంట, కురంటకము | | గోరంటె |
| చాఁదు | మర్దించు - ద్రవద్రవ్యము | చాన్దు=చందనవృక్షము, కలపము. | సాందు = కృష్ణద్రవ ద్రవ్యము |
| చాఁచు, చాఁపు | చాఁగఁజేయు | చామ్పు=మనుష్యుఁడు ఒరగి పడుట<br>చాయ్చ్చు = ఒరగఁజేయు | |
| చినుఁగు | వస్త్రము చిరుఁగు | కిఱ్ = చినుఁగు-చించు<br>కిఱిత్తు = కిఱిత్తు = చినిఁగి, చించి | |

| తెలుగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| చివఁగి=చివ్వఁగి | తరక్షుమృగము | సివిఙ్గి = చివ్వంగి ( నవ్యము ) | |
| చీఁకు | చప్పరించు | చూప్పు = చప్పరించు (నవ్యము) | |
| చీఁదు | ముక్కు శోధించు | చీన్తు = చీఁదు | |
| చెనఁగి=చెన్నఁగి | నారికేళవృక్షము | తేఙ్కు = టెంకాయచెట్టు | తెంగు = కొబ్బెరచెట్టు |
| { చెఱఁగు | వస్త్రాంచలము | ... ... | సెఱంగు = వస్త్రాంచలము |
| { చెలఁది | సాలెపురుగు | చిలన్తి = సాలెపురుగు | |
| చేఁదు | ఆకర్షించు | చేన్తు = ఆకర్షించు (నవ్య) | సేదు = నూతినీరుచేఁదు |
| చోఁపు | త్రోలు | ఓప్పు = పక్షులనుఁద్రోలు | |
| జినుఁగు | అల్పము - సన్ననివస్త్రము | చిణుఙ్కు = గొణఁగు | జినుఁగు = (భ్రమరావ్యక్తశబ్దము |
| టేఁకు, తేఁకు | వృక్షవిశేషము | తేక్కు — టేఁకుచెట్టు | తేగు = టేఁకుచెట్టు |
| తడఁబడు | తొట్రుపడు | ... ... | తడంబడు = తొట్రువడు |
| తరఁగ | అల | తరఙ్గమ్ = అల (తత్సమము) | |
| తాఁకు | చెనకు | { తాక్కు = యుద్ధములోఁ గొట్టు<br>{ తాఙ్కు = అడ్డగించు, ఓర్చు | తాగు = తగులు |
| తాఁడి | తాండ్రచెట్టు | తాన్ఱి = తాండ్రచెట్టు | |
| తీఁట | గజ్జి | తినవు = దురద | తీంటె = దురద |
| తునుఁగు | త్రుంచు | తుణ్డు = ఖండము, తుణి = ఖండించు | తుండు = ఖండము (హళగన్న) |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| తూఁగు | ఆందోళించు | తూఙ్కు = తూఁగు | తూగు = (తూఁగు) |
| తూఁట | తుంట | తుణ్డు = ఖండము | తుండు = ఖండము (హలాస) |
| తూఁటరి [గు | దుర్జనుఁడు | ... .. | తుంట = దుష్టుఁడు |
| తెనుఁగు- తెలుఁ | తెల్గు | తెలుఙ్గమ్ = తెల్గు దేశము | తెనుంగ = ఆంధ్రుఁడు, తెనుగితి= ఆంధ్రి |
| తెఱఁగు | విధము | తిఱమ్ = తిఱన్ = విధము | తెఱం = ప్రకారము |
| తేఁజెట్టు | నారికేళవృక్షము | { తెన్నై = నారికేళవృక్షము<br>{ తేఙ్గాయ్ = కొబ్బరకాయ | { తెంగు = కొబ్బరచెట్టు<br>{ తెంగినమరం = కొబ్బరచెట్టు |
| తేఁకువ | భయము | తేఙ్కు = దుఃఖించు | |
| తేఁటి | తుమ్మెద | తేన్ = మధువు, తుమ్మెద | జేన్ = తేనె |
| తొడఁగు | ఆరంభించు | తొడఙ్కు = ఆరంభించు | తొడగు |
| తొలఁకు | ప్రకాశించు, చలించు | { తులక్కు = ప్రకాశింపఁజేయు, తుల<br>{ ఙ్కు=ప్రకాశించు,తుళఙ్కు=చలించు | తొళగు = ప్రకాశించు }<br>తొళల్ = చలించు } |
| తోఁచు | స్ఫురించు, ఉదయించు | తోన్ఱు=తోఁచు,తోట్ఱు(ట్టు)=తోఁపజేయు | |
| తోఁట | ఉపవనము | తోట్టమ్ = ఉపవనము | తోంట = తోఁట |
| తోఁడు | పెల్లగించు | తోణ్డు = త్రవ్వు | తోడు = త్రవ్వు |
| త్రేఁచు | ఉద్గారించు | తేక్కు = ఉద్గారించు | తేగు = ఉద్గారించు |
| దాఁటు | లంఘించు | తాణ్డు = దాఁటు | దాంటు = దాఁటు |

| తెలుఁగు. | అర్థము | తమిళము | కన్నడము |
| --- | --- | --- | --- |
| దూఁట | అరఁటిదూఁట | తణ్ణు = అరఁటిదూఁట | దంటు = అరఁటిదూఁట |
| దూఁటు | పోడుచు | తూణ్టు = ప్రేరించు, దీపమెగఁద్రోయు | దూంటు = అతిక్రమించు |
| దోఁటి | దోని, అందనిపండ్లకోయు సాధ[నము | తోట్టి = దోని-అంకుశము | దోంటి = దోని |
| నడుఁకు | కంపించు | నడుఙ్కు = కంపించు (నవ్య) | నడుంగు = నఁడుగు = కంపించు |
| నలఁగు | పీడితమగు, ఉద్వర్తనము | నలి=కృశించు, నలఙ్కు=ఉద్వర్తనము | నలుగు = కృశించు |
| నాఁగలి | లాంగలము | నాఞ్జిల్ = నాఁగలి | నేగిల్ = నాఁగలి |
| నాఁడు | దినము. కాలము | ఞాన్ఱు = దినము | నాళ్ = దినము |
| నీఁగు | నివర్తించు | నీఙ్కు = పోవు, నీక్కు = విడుచు | నీగు = విడుచు |
| నూఁక | ఒకచెట్టు | నూఙ్కు = ఒకచెట్టు | |
| నూకి | తండులకణము | నుఱుఙ్కు = తండులకణము | |
| నూఁకు | త్రోఁచు, త్రోలు | నూక్కు = మీఁదికెత్తు, త్రోయు | నూంకు = త్రోయు |
| నెలఁకు | జీవస్థానము | నిలమ్ = నెలఁకు | నెల = నెలఁకు |
| నేఁడు | ఈదినము | ఇన్ఱు = నేఁడు | |
| నేఁత | నేయుట | నెయ్ = నేయు, నెయ్దల్ = నేఁత | |
| నోఁచు | వ్రతమాచరించు | నూన్ = నోఁచు | నోన్ = నోఁచు |
| నోఁత | నోముట | నోన్ఱల్ = నోఱ్ఱు(ట్ఱి)ల్ = నోఁత | |
| నోము | వ్రతము | నోమ్బు = నోము | నోంపు = నోము |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
| --- | --- | --- | --- |
| పరఁగు | ప్రసిద్ధమగు | పిఱజ్కు = ప్రసిద్ధమగు | |
| పలుఁగు | స్ఫటికము | పళిజ్కు = స్ఫటికము | పళికు = స్ఫటికము |
| పాఁగెము | సంబంధము | పాజ్కన్=మిత్రుఁడు, పాజ్కు=పార్శ్వము | పాంగు = రీతి |
| పాఁడి | పాలు | పాడి = గొల్లపల్లె | పాడి = గొల్లపల్లె |
| (పాడి) | ధర్మము | ... ... | పాటి = ధర్మము |
| పిల్లఁగ్రోవి | మురళి | పుల్లాజ్కుఴల్ = వెదురుగ్రోవి | |
| పీఁకు | పెఱుకు | పిఁడుజ్కు = పెఱుకు | |
| పీనుఁగు | శవము | పిణమ్ = శవము | పెణమ్ = శవము |
| పెనఁగు | పెనఁగులాడు | పిణజ్కు = వివదించు | పెణగు=పోరు-జోడించు-మల్లయుద్ధము |
| పొరఁటు | పొరలించు | పురట్టు = పొరలించు | పొరంటు = ఉద్గమించు |
| పోఁక | పూగము | పాక్కు = పాకు = పూగము [ఒప్పుయి | |
| పోఁడి (పోలు) | ఒప్పిదము | పోల్=ఒప్పు, సాదృశ్యమొందు, పోన్ఱు= | పోల్ = సాదృశ్యమొందు |
| బాఁపన | బ్రాహ్మణుఁడు | పార్ప్పాన్-పార్ప్పన్= బ్రాహ్మణుఁడు | పార్వమ్ = బ్రాహ్మణుఁడు |
| బెడఁగు | ఒప్పిదము | విడజ్కు = విలాసము | బెడంగు = విలాసము |
| మండెఁగ | భక్ష్య విశేషము | ... ... | మండిగె = భక్ష్యము |
| మడఁగు | వంగు | మడజ్కు = వంగు | |
| మడఁత | వస్త్రపు మడఁత | మడిప్పు = మడఁత | మడితె = మడఁత |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| మలఁగు | తిరుగు. మరలు. వంకరయగు | మలఙ్కు = క్లేశపడు | మలంగు = శయించు |
| మలుఁగు | మత్స్యవిశేషము | మలఙ్కు = ఒకచేఁప | |
| మసఁగు | విజృంభించు | మయఙ్కు = కవియు | మసగు = విజృంభించు |
| మానులు (ప్రమాఁకులు) | వృక్షములు | మరఙ్కళ్ = చెట్లు | మరం గళ్ = చెట్లు |
| మాఁగు | కమియఁబండు, దేహమునందలి [నల్లని పొడ | మాఙ్కు = దేహమునందలి నల్లనిపొడ | మాగు = కమియఁబండు |
| మాఁడు | కమరు | మాళ్ = మాణ్ = చనిపోవు<br>మాణ్డు = చనిపోయి | బాడు = పోఁడిమిచెడు |
| మాఁవంతి | మావటివాఁడు | మావుత్తన్ = మావటివాఁడు (నవ్య)<br>మావ్ = మృగము | మావంతి = మావటివాఁడు |
| ముడుఁచు | ముడుఁగఁజేయు | మడి=ముడుఁగు, మడక్కు=ముడుఁచు | |
| మునుఁగు | క్రుంకు | ముழుగు = మునుఁగు | ముళుంగు = ముళుగు = క్రుంకు |
| ముసుఁగు | కప్పుడు | ముసుక్కు = కప్పుడు | ముసుంకు ఆచ్ఛాదించు |
| మూఁగ | మూకుఁడు (మూకః సం,) | మూఙ్గై=మూఁగ (కంబరుకవివాడెను) | మూగ = మూకుఁడు |
| మూఁడు | రెండునొకటి, సంభవించు | మూన్ఱు=రెండునొకటి | మూఱు = రెండునొకటి |
| మూఁత | ఆచ్ఛాదనము | మూడి = ఆచ్ఛాదనము | |
| మూఁపు | అంసము | మొయ్మ్బు = అంసము | ముయ్పు = ముయ్వు = అంసము |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| మేఁత | పశ్వాద్యాహారము | మేయ్‌తల్ = మేఁతి | మేపు = మేఁత |
| మోఁకాలు | జానువు | ముళజ్కాల్ = మోఁకాలు | మొణకాల్ = మోఁకాలు |
| మోఁచెయ్యి (ముంజేయి) | కూర్పరము | ముళజ్కై = మున్‌గై = ముంజేయి | ముంగై = మోఁచేయి |
| మ్రాఁకులు | మానులు | (మరజ్కళ్ = చెట్లు) మరమ్ = చెట్టు | మరగళ్ = చెట్లు |
| మ్రోఁగు | శబ్దించు | ముళజ్కు = ధ్వనించు | మొఱంగు = ధ్వనించు |
| లోఁబడు | అధీనమగు | ఉళ్ + పడు = ఉట్పడు = అధీనమగు | ఉళ్పడు = అధీనమగు |
| వీఁగు | గర్వించు-అతిశయించు | వీజ్కు = అధికమగు | బీగు = అధికమగు, పొంగు |
| వెలుఁగు | ప్రకాశించు, ప్రజ్వలించు | విళజ్కు = ప్రకాశించు | బెళగు = ప్రకాశించు |
| వేఁగి | వ్యాఘ్రము | వేజ్కై = పులి | బగ్గ = వ్యాఘ్రము |
| వేఁట | మృగయ | వేట్టై = వేఁట | బేంటె = వేఁట |
| వేఁడు | ప్రార్థించు | వేణ్డు = ప్రార్థించు | బేడు = వేఁడు |
| వేఁత | వేయుట | వైత్తల్ = వేయుట | |
| వేఁపచెట్టు | నింబవృక్షము | వేమ్బు = వేఁపచెట్టు, వేప్పమరమ్ = వేఁప [చెట్టు | బేవు = వేఁపచెట్టు, బేవినమరమ్ = వేఁప [చెట్టు |
| వేసఁగి | వేసవి | వేనిల్ = వేసవి | బేసగె = వేసవి |
| వ్రాఁత | లేఖనము | వరైత్తల్ = వ్రాఁత, వరై = వ్రాయు | బరె = వ్రాయు, బరెగ = వ్రాయుట. |

| తెలుఁగు | అర్థము | తమిళము | కన్నడము |
|---|---|---|---|
| సంపఁగె<br>సంపెఁగ | చంపకము | సమ్పకమ్ = చంపకము (తత్సమము) | సంపగె = చంపకము |
| సరిఁబడు<br>సరిపడు | సమమగు | సరిప్పడు = సరిఁబడు | సరిపడు = సరిఁబడు |
| సాఁకు | రక్షించు | తాఙ్కు = కాపాడు, వహించు | సాకు = రక్షించు |
| సురుఁగు | అదృశ్యమగు | సురుఙ్కు = శుష్కించు | సొరగు = శుష్కించు, సంకుచితమగు |
| సోఁకు | తాఁకు | ... ... ... | సోంకు = స్పృశించు, స్పర్శము |

(౩౫౭) - ప్రసంగ వశమున నిట ననుస్వార చరిత్రమును నద్దాని యితర ద్రావిడభాషలలోని ప్రవృత్తియు దిఙ్మాత్రముగా విశదీకరించుచున్నాను.

ఆంధ్రవైయాకరణులు పరుష సరళ పరకత్వమున బిందువునే యంగీకరించిరి గాని దానిచోఁ దత్తద్వర్గపంచమముల నంగీకరించి యుండలేదు. పదాంతసంధిలో మాత్ర మనుస్వార స్థలమున నట్టియెడ నకారస్థితిని వైభాషికముగ నంగీకరించియున్నారు. తమిళ వైయాకరణులు సున్ననే యంగీకరింపలేదు. ఎల్లయెడలను ననునాసికముచోట వర్గపంచమములనే నిల్పుదురు.

"క చ త ప ముదలియు......" (తొల్కా- ౧౪౪ సూ.)

అచ్చునకుఁగాని హల్లునకుఁగాని తరువాతఁ గ చ త ప లు నిల్చినపుడు వాని నడుమనున్న యనునాసికము తత్తద్వర్గీయముగ మాఱును. విళ+కోడు=విళఙ్కోడు = వెలగకొమ్మ. ఇట్టి చోట్ల ననునాసికాగమము వచ్చునని "మరప్పెయర్ క్కిళవి......" (తొల్కా- ౨౧౭ సూ.) (వృక్షవాచక శబ్దములగు 'అ' కారాంతములకుఁ బరమగునపుడు విభక్తి సమాసములో ననునాసికాగమ మగును) మున్నగు సూత్రములచే విధింపఁబడియున్నది. మరమ్-కుఱిదు =మరఙ్కుఱిదు = చెట్టుచిన్నది - మొ.

తమిళమునఁ బదావసానమున ననునాసికములు స్వస్వరూపముతో నిలుచును. మకారము క చ త ప లు పరమగునపుడు పయిరీతిని దత్తద్వర్గపంచమముగ మాఱును. తక్కిన యనునాసికము లేయక్షరము పరమైనను స్వస్వరూపముతోనె నిలుచును. ఉదా. మరమ్. - అవన్-ఉడన్కూడు (= ఒడఁగూడు) ఉడన్ పడు (= ఒడఁబడు)మొ.

కర్ణాటవైయాకరణు లవసానమున 'న మ' ల చోట నిత్యముగా బిందువునె యంగీకరించిరి. వర్గాక్షర పరకత్వమున వానికి బిందువును బరస్థిత వర్గీయ పంచమవర్ణాదేశమును బర్యాయముగా నగుట శబ్దానుశాసనకర్త యంగీకరించెను. ప్రాచీనుఁడగు నాగవర్మ యన్ననో వర్గాక్షర పరత్వమునఁ దమిళులవలెనె వర్గపంచమాదేశమునె నిత్యముగా నంగీకరించెను.

"మనయోర్బిన్దుః" (కర్ణా. భాష - ౧౧౨ సూ.)

అవసానమున మకార నకారములకు బిందువు నిత్యముగా నగును. ఉదా. అవం = (వాఁడు.) ఆతం = (ఆతఁడు) మొ.

"వర్గే తద్వర్గాన్త్యః" (కర్ణా. భాష. ౧౧౩ సూ.)

మకార నకారములకు వర్గాక్షరము పరమగునప్పుడు తత్తద్వర్గ పంచమాక్షర మాదేశమగును. తాన్ + చలచిత్తమ్ = తాఞ్చలచిత్తం = (తాను జలచిత్తుఁడు). తామ్ + చలచిత్తర్ = తాఞ్చలచిత్తర్ (= తాము చలచిత్తులు) మొ.

కాఁగా నవసానమునఁ గర్ణాటమున బిందువే నిలుచును. తమిళమున బిందువే లేనందున ననునాసికమే నిల్చును. తెలుఁగునందుసైత మవసానమున బిందువు నిలువదు. నకార వ్యంజనముగాని యుత్వేత్వవిశిష్ట నకారము గాని నిల్చును. ఉదా. తాను, హరిని, వచ్చెన్, మొదలయినవి.

అంతస్థోష్మములు పరమగునపుడు తమిళ కర్ణాటకములలో నకార మకారములు స్వస్వరూపముతోనె నిల్చును. తెలుఁగున శబ్దములు కళలు ద్రుత ప్రకృతికములు నని రెండు విధములుగ మాత్రమె యుండును గానఁ గళాభిన్న శబ్దములెల్ల సాధారణముగ నకారాంతములుగ మాత్రమె యుండును. తత్సను శబ్దములలో సైతము జ ఞ ణ లు పదాది నుండుట యసంభవముగాన నట్టి పదాంతస్థ, ద్రుతమునకు జ, ఞ, ణలు పరమగుట సంభవింప నేరదు. ఇంకఁ దక్కిన యే హల్లుపరమైనను నవసానమునందును ద్రుతము చోట 'న్, ని, ను' అనునవి నిల్చును. లేదా ద్రుతము లోపించును. ఆదేశ సరళ పరకత్వ మున మాత్రము ద్రుతముచో ఖండపూర్ణములు పాక్షికముగ నిల్చును.

(౩౫౮)—లయగ్రాహి. కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధు పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెన్ ... ... (భార. ఆది ౫ ఆ. ౧౩౮)

అనురీతిని బ్రయోగము లుండుటంజేసి తత్ప్రయోగమాత్ర ప్రామాణ్యమునకయి ప్రాసములందు మాత్రము మకార పరకత్వమున ద్రుతము మకార రూపమును బాక్షికముగా నందునని నవ్యులు తలంచుచున్నారు. "ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు." (ప్రౌఢవ్యా. సంధి. ౨౨సూ.) అప్పకవి నకార మకార పరకత్వమున వర్గయుక్ సరళ పరకత్వ మందువలెనే ద్రుతము నిండుసున్నగా మాఱుననియు నట్టి బిందుపూర్వక నకార మకారములకును ద్విత్వనకార మకారములకును బ్రాసము చెల్లుననియు నీక్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

తే. గీ. తమకుఁ దాము ద్విత్వంబులై తనరు నవియు
బిందువులు డాపలను వెలుఁగొందు నవియు

నొక్కరూపయి పూర్వప్రయోగ సరణి
న మలు ప్రాసంబులకు నిల్చుఁ దమకుఁ దాము.

క. మిన్నేఱు పాదమున ధాతం నాభిని గుసుమశరు నెదం గాంచిన నీ
సాన్నిధ్యము దొరకుటకయి। సన్నుతి సేయుదురు నిన్ను సనకాదు లజా

క. తమ్ములను మల్లికాకుసు। మమ్ముల మరువాది పత్రమాలికలను భ
క్తిం మురసంహారు పూజలు।సమ్మదమున సలుపఁగలుగు సకలార్థంబుల్.
(అప్పకవీయము, 3 ఆ. ౩౮౦ - ౩౮౨; ౫ ఆ. ౧౫౯ - ౧౬౧.)

( పై లక్ష్యములలో 'ధాతన్నాభిని, భక్తిమ్ముర' అని ముద్రణములం దెల్ల నుండుట ముద్రాపక ప్రమాదకృతము, ఆ పక్షమున నచట లక్షణ లక్ష్యము లసంగతములె యగునుగదా.)

పై విషయములకు "బిందుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్" అను చింతామణిసూత్రమును, "కేచి ద్వద న్త్యభిన్నత్వ మనుస్వార మకారయోః" అను నథర్వణకారికయు హస్తావలంబము నొసఁగుచున్నవి. అందు నకారపరక త్వమున ద్రుతమున కప్పకవి సున్న నంగీకరింపకున్నను బ్రయోగబాధ యగ పడదు.

(౩౭౯)—వెనుకఁ జెప్పిన చొప్పునఁ బదాంత సంధిలోఁ దెల్గున ద్రుతము బిందురూపముతోఁగాని స్వస్వరూపముతోఁగాని నిలువ వచ్చును. ఇఁక బదమధ్యమున నకారమేకాక యే యనునాసికమును బరుష సరళ పరక త్వమున స్వస్వరూపముతోఁ దెలుఁగున నిలువదు, అయ్యది బిందురూపమున నే వెలయుచుండును. (కిన్క. వెన్క. మున్నగుచోటులు తప్ప). మఱొకవింత? సంస్కృతశబ్దములు తెనుఁగులోనికిఁ దత్సమములై వచ్చినపుడు సయితము వానిలోఁ బరుషసరళ పరకత్వమున వర్గపంచమములు నిలువ నేరవనియు వానిలో బిందువే నిల్చుననియు నాంధ్రలాక్షణికుల సిద్ధాంతము. సంస్కృత మునఁ బదాంతమం దనుస్వారమునకు వర్గపంచమాదేశము వైకల్పికమె యైన ను (సంగమః = సఙ్గమః) బదమధ్యమున నిత్యమై యున్నది. [ఉ. శఙ్కా, సఞ్చ యః, కణ్ఠః, శాన్తః, కుమ్భః, "అనుస్వారస్య యయి పరసవర్ణః" "వాపదాన్తే" ౮ - ౪ - ౫౮ - ౫౯] అట్లయినను నవి తెనుఁగులోనికి వచ్చునపుడు పదాంతమం దును, బదమధ్య మందును వానిలో ననుస్వారమె నిల్చునని యాంధ్రపం డిత సిద్ధాంతమై యున్నది.

సబిందువర్గవళి.

తే. ట త ప వర్గాక్షరములకు డాపలించి
యొనర నూఁదిన బిందువు లుండెనేని
వరుస ణ న మలు వళులగు వానికెల్ల
నవనిఁ గొందఱు సుకవుల యనుమతమున.

(కావ్యాలంకార చూడామణి, - ౭ ఉల్లా ౧౭ ప.)

చ. కినుకఁ జళుక్యవిశ్వనృప కేసరి చేసినచోఁ గృపాణదం
డనమునఁ గల్గుఁబో సురగణత్వము తత్పదవారిజాత వం
దనమునఁ గల్గుఁబో మనుజనాథత తద్భటదర్శనావలం
బనమునఁ గల్గుఁబో గహనమధ్య నివాసము వైరి కోటికిన్.

(కావ్యాలం. ౭ ఉల్లా. ౧౮ పద్య.)

బిందుయతి.

క. పనిఁబూని నిలుచుఁ దమతమ
యనునాసికములకు బిందుయతులను వెనుకన్
గనుపట్టు నాల్గులిపులను
బెనుసున్నలు డాసి తమకుఁ బిఱుఁదఁ గదియుచోన్. ౧౨-

తే. జ్ఞానవేద్యాయ తప్తకాంచన విభూష
ణాయ మేచకవర్ణకంఠ ప్రియాయ
నగధరాయ నమోస్తు సౌందర్యవిజిత
మనసిజాతాయ గోపడింభాయ యనఁగ. (౧౩ అప్పక. 3 ఆ.)

పయిస్థలములందు బిందువులే నిల్చియున్నవని యంగీకరింపనపు డవి 'సబిందువర్గవళి' లేక 'బిందుయతి' అనుదానికి లక్ష్యములు కాఁజాలవుగదా. ఇంక నచట వర్గపంచమములె యున్న వన్నయెడలఁ బై లక్ష్యములు సంయుక్త యతి లక్ష్యములె యనిపించుకొనును గదా.

(౩౬౦)—ఆంధ్రమహాకవుల ప్రయోగములనుబట్టి పరిశీలించినను సంస్కృత శబ్దములందలి వర్గపంచమాదేశ ముపేక్ష్యమె యని విశదమగు చున్నది. (౯ ర. వి.)

శా. సింగం బాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయోధదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో

జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరక్షేమాభిరామాకృతిన్.
(భార - విరా - ౪ ఆ ౯౭ ప)

ఉ. ఇంచుకయేని పాపమున కెన్నఁడు రోయక యెల్లవారి బా
ధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి వాని నెల్లఁ గ
క్కించెద నీ మదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుఁ బోలి కే
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా ॥
(భార. ఆది. ౬ ఆ. ౨౯౪)

ఉ. నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా ।
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ ।
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపు నో ।
పం డతిశాంతుఁడయ్యు నరపాలుఁడు శాపముఁ గ్రమ్మఱింపఁగా ॥
(భార. ఆది. ౧ ఆ. ౧౦౦)

కం. అంబాలికకును గుణర ।
త్నాంబుధి పాండుర విరాజితాంగుఁడు ప్రభవిం ।
చెం బాండురాజు కురువం
శంబు ప్రతిష్ఠింప ధర్మసర్వజ్ఞుండై ॥ (భార. ఆది. ౪ ఆ. ౨౫౬)

పయి పద్యములోని మాతంగాఖండలాంబాలికాంబుధి శబ్దంబులలో బిందువే గలదని యంగీకరింపక తీరదు గదా.

తమిళ కర్ణాటభాషా సంప్రదాయముల ననుసరించి కొంద ఱాధునికుల వలెఁ దెలుఁగునందును వర్గాక్షర పరకత్వమున వర్గపంచమా దేశము నంగీకరించినచోఁ బయి పద్యములందలి మాతంగాది శబ్దములలోని సంస్కృత భాషా ప్రసిద్ధ పరసవర్ణ భూత వర్గపంచమా దేశమునకు భంగములేదని సమర్థింపరాదు. తెనుఁగులం దట్టి పర సవర్ణా దేశము నన్నయ తిక్కనాది ప్రామాణికులకు సమ్మతముగాదని పయి పద్యములె విశదీకరించుచున్నవి. "ప్రభవించెం బాండురాజు, ఓ జంగాంతార, వచ్చెం గుంతీసుత" అను చోటులందు మకార జకారములు లేవని (జఞలు తెల్గునలేవుగదా.) "పరుషాద్రుత ప్రకృతికా త్సరళాః స్యు స్తద్ద్రుతంచ బిన్దుః స్యాత్" అను చింతామణిసూత్రమువలన నిశ్చితమగుచున్నది గదా. అట్లె "బాధించి" మున్నగు

చోటులలోని "ఇంచు" గాగమమునందు సున్నయే గలదని "బిన్దు పరస్య తకారో దోః స్యాత్" అను చింతామణి సూత్రమువలన నిశ్చితమగుచున్నది గదా. మఱియు నీ పద్యపుం బ్రాసములలోని సున్నలకుం బర సవర్ణాదేశమును జేసినచో 'ఇంచుక' అనుచోటి 'చు' అనునది దంత్యమునగుటచేఁ బూర్వస్థబిందువునకుఁ బర సవర్ణాదేశము వచ్చినచో నకారాదేశమును రావలసి యుండును. తక్కిన మూఁడు చోటులందలి చకారములును దాలవ్యములగుట చేత వాని ముందటి బిందువునకు ననాంధ్రవర్ణ ఞకారాదేశము రావలసి యుండును. కాఁగా నచటఁ బ్రాసభంగము దుర్వార మగును. 'ఓపండు' అనుచో 'ఓపఁడు' అనుచోటి యర్ధబిందువునుబట్టి యచట "హ్రస్వాత్పూర్ణోపి భవేత్" అను చొప్పునఁ బూర్ణ బిందువే కాని ణకారము లేదని చింతామణివలన నిర్ణీతమగుచున్నది. "శాపరే మస్య బిన్దుః స్యా। న్మో పరే మేళనం భవేత్" అను నథర్వణ వచనముచొప్పున 'వంశంబు' అనుచో 'శం' అను నది బిందుపరకమే కాని మకార పరకము కాదని స్పష్టపడుచున్నది. పయి సందర్భమునుబట్టి ప్రాచీనాంధ్ర శాసనములందు బిందువులచోట వర్గపంచమములను వ్రాయు నలవాటు వెనుక విశదీకరించిన రీతిని సంస్కృతభాషామయశాసన లేఖన వాసనచే నసంస్కారి లేఖకుల యలవాటున కెక్కినదే కాని యాంధ్రమహాకవిపండిత సమ్మతముకాదనియు నక్కారణముననే యట్టి యలవాటును గాలక్రమమున నశించినదనియు సిద్ధాంతిత మగుచున్నది.

ఇఁక సంస్కృత తమిళ కర్ణాట సంప్రదాయముల నుపేక్షించి యాంధ్రమహాకవి పండితులు వర్గాక్షర పరకత్వమున బిందువునకు వచ్చు వర్గపంచమాదేశమును నిరసించి బిందువునే యంగీకరించుట యెంతవఱకు యుక్తమో పరిశీలింపవలసియున్నది.

(౩౬౧)—"నకారజా వనుస్వార । పఞ్చమా ఝలి ధాతుషు । సకారజ శ్శకారశ్చ । షాట్టవర్గ స్తవర్గజః" అను (కవి కల్పద్రుమము) సంస్కృత వైయాకరణ సిద్ధాంతము చొప్పున వర్గాక్షర పరక బిందువునకును వర్గపంచమములకును నకారమె మూలమని చెప్పవచ్చును. ఇట్టి నకారము పరస్థ వర్గాక్షరములతో సంయోగించు నపుడట్టి సంయోగములోని పూర్వవర్ణమును హల్లును నగు నా నకారము "సంయోగాది ర్వా" (ఋగ్వేద ప్రాతిశాఖ్యము, ౧ పట.) (౨౧-౨ వి.) అను చొప్పునఁ బూర్వ స్వరమునకుఁ గాని పరస్వరమునకుఁ గాని యంగము కావచ్చును. కాఁగా నట్టి నకారమును బరస్వరాంగ

ముగఁ బలుకునపుడు పరస్థిత వర్గాక్షరములతోడ నవ్యవహిత సంబంధము గల్గు టంజేసి యా నకారము తత్తద్వర్గ పంచమముగా మాఱుట స్వాభావికమె యనుటకు సందేహము లేదు. మఱియు నట్టి నాదభూత నకార సంయోగము గల యవ్యవహిత పరుషమగు శ్వాసవర్ణము నాదమగు సరళముగా మాఱుటయు సహజమె యనుటకును సందియములేదు. ఈ రెండు మార్పులును నేక కాలముననే గల్గుట కేవలము స్వభావసిద్ధమైయుండు ననుటలోను విప్రతిపత్తి లేదు.

(౩౬౨)—కాని యిట్టిసహజములగు పరిణామములకు సైతము కొంత కాల వ్యవధానము కలుగుచుండుట యనుభవసిద్ధమై యున్నది. వ్యాకరణాది జ్ఞానము విస్తరిల్లుటచేఁ గల్గు పదస్వరూపజ్ఞానము, తన్మూలకమును భాషాభిమానమూలకమును నగు స్థితస్థాపనపరత్వము, పరిణామాపర పర్యాయ భాషాపభ్రంశాసహిష్ణుత, మున్నగు కారణము లుచ్చారణ సౌలభ్యాపేక్షాదికృతములగు ముఖయంత్రసహజములైన పరిణామములను గొంతకాలమువఱకు విస్తరిల్లనీయక యాఁపుచుండుట యనుభవసిద్ధమనుటలో భాషాతత్త్వశాస్త్రజ్ఞులెవ్వరును విప్రతిపన్నులు కాఁజాలరు. భాషాభిమానులగు వ్యవహర్తల యట్టి పట్టుదలను మఱపించి పరిణామస్వభావము విస్తరిల్లుట కత్యధికమగు కాలము పట్టుచుండుననుటకు సందేహము లేదు. యౌవనమున రావలసిన మీసలు బాల్యముననే యంకురింపఁ జాలవుగదా. వార్ధకమున రావలసిన స్వాభావికములగు పలితత్వాదులు బాల్య యౌవనాదులలోఁ బొడచూపనేరవు గదా.

(౩౬౩)—కాఁగా వర్గపంచమాదేశ సరళాదేశములును స్వాభావికములే యయ్యును నవి కాలక్రమమునం గాని రాఁజాలకుండుటయు నట్లు వచ్చుటలో సైత మొక్కొక్కటిగ రాఁజొచ్చుటయుఁ గేవలము సహజములయి యుండును. అట్లగుటంజేసియే ప్రాచీనావస్థలోఁ దమిళమునందు సంస్కృతమునందువలెనే మూలద్రావిడభాషలో లేదనఁదగు వర్గపంచమాదేశము మొదటఁబ్రవేశించి యుండునని యెన్ననగును. అట్లు నకారము వర్గపంచమముగా మాఱినను దత్సహకృతముగా రానలసిన సరళాదేశమును బయి నుదాహరించిన స్థితస్థాపన పరత్వాది కారణములచే నాఁపుచు వ్యవహర్త లట్టి సంయోగాదిస్థ నాదమగు వర్గపంచమమును బూర్వాక్షరాంగముగఁ బల్క యత్నించుటచేత నట్టి సరళోచ్చారణము ప్రాచీన కర్ణాట (పఱగన్నడ) తమిళ సంస్కృతముల వ్యవహార కాలములలో సంభవింపకుండుట విరుద్ధము కాదయ్యెను.

పటిగన్నడము—నూఙ్కు = త్రోయు; కోణ్ట = కోట; నోమ్పి = నోము; మొ. (ఇట్టి యెడల 'నూంకు, కోంట, నోంపి' అను బిందుఘటితరూపములును బాహ్లికముగఁ గలవని శబ్దానుశాసనకర్త చెప్పియున్నాఁడు). తమిళము—అన్తు = అట్లు; అణ్ణు = సమీపించు; అఞ్చు = భీతినందు; మొ. సంస్కృతము—శఙ్కా; సఞ్చయః; కణ్టకః, సన్తతిః, సమ్పద్. మొ.

లేదా యాంధ్రులును వారి ప్రాంతములందలి కర్ణాటులును గొన్ని యెడల మొదటినుండియు నట్టి నకారమును బూర్వాక్షరాంగముగఁ బల్కుచుండుటయు నుచ్చారణ సౌలభ్యాపేక్షావశమున నందలి వర్గీయతాధర్మ మంతరించుటచే నది సున్నగాఁ బరిణమించుటయు సంభవించి యుండనగును. అట్టి సున్న "పూర్వ స్యానుస్వార విసర్జనీయా" (౬౮ వి.) అను చొప్పునఁ బూర్వస్వరము నకే యంగమగుటచేతను, "అనుస్వారశ్చ" (తైత్తి. ౧ అధ్యా. ౩౮ సూ.) (౧౮౭ వి.) అనుచొప్పున సున్న మాత్రాకాలికమగుటంజేసి యుచ్చారణమున దానికిని బర హల్లునకును నీషద్వ్యవధానము సమ్మతమును సహజమును నగుటచేతను, నద్దాని సోకుఁడు పరస్థిత పరుషమునకుఁ దగులమింజేసి యచట సరళాదేశము రానేరదయ్యె ననఁదగును. తెల్గు—చంక, పంచ, పంట, పంతము, కంప, కన్నడము—నూంకు = త్రోయు, కోంట = కోఁట, నోంపి = నోము (ఇట్టి బిందుస్థితిని నాగవర్మచెప్పకున్నను శబ్దానుశాసనకర్తయే కాక కేశిరాజును నంగీకరించియె యున్నాఁడు.)

ఆంధ్రులును గర్ణాటులును గొన్ని శబ్దములలో నట్టి సంయోగాది గత నకారమును బరాక్షరాంగముగనే పల్కుచుండుటయు, నట్టియెడల నట్టినాదభూత నకారము తాఁకునఁ బరస్థపరుషములు సరళములుగ మాఱుటయు, నట్టి స్థితిలో నచట వచ్చెడి పర సవర్ణాదేశరూపానునాసికమునుగాని యాదేశము రాకుండినయవస్థలోని నకారమునెకాని సంయుక్తవర్ణోచ్చారణ శ్రమాసహిష్ణుతారూప సుఖతరోచ్చారణాపేక్షచేవక్తలు పూర్వాక్షరాంగముగఁ బల్కుటయు సంభవింపఁగా నుచ్చారణసౌలభ్యాపేక్షావశమున నందలి వర్గీయధర్మ మంతరింపఁగా నది యనుస్వారముగఁ బరిణమించుటయు ననేకస్థలములందు సంభవించెనని చెప్పనగును. ఉ. తెలుఁగు—వంగు, గంజి, పండు, అందు(ఆచోటు) ఇంబు, మొ. కన్నడము — అడంగు = లీనమగు, తాంగు = యుద్ధమున నెదిరించు, అందు=ఆ దినము, ఇంబు=విశ్రాంతిస్థలము (వీనిలోఁ బాహ్లికముగఁ దత్తద్వర్గపంచమములును నుండనగునని కతిచిత్ కర్ణాటపండిత సిద్ధాంతము.)

(౩౬౮)—వెనుక వ్రాసినరీతి నేర్పడిన వర్గపంచమ పరుషవర్గసంయోగములోని (౩౬౩.వి.) యుచ్చారణ క్రమము నోర్వక దమిళులు లా యనునాసికములలోని యానునాసిక్యము నంతరింపఁజేయఁగా నచట ద్విరుక్త పరుష సంయోగ మేర్పడుటయుఁ దమిళమునఁ గలదు.

| నేఁటి తెలుఁగు | ప్రాచీనాంధ్రము | పటగన్నడము | తమిళము | వివరణము |
|---|---|---|---|---|
| ఊఁదు | ఊందు | ఊదు | ఊత్తు | ప్రాచీన తమిళమున సరళోచ్చారణమె లేదు. |
| ఈఁటె | ఈంటె | ఈంటి (ఈంటి= రక్తముత్రాగు) | ఈట్టి | |
| కోఁట | కోంట | కోంటె | కోట్టై | |
| తోఁట | తోంట | తోంట | తోట్టమ్ | |
| తోఁపు | తోంపు | తోపు | తోప్పు | |
| నూఁకు | నూంకు | నూంకు | నూక్కు | |
| పొరంటు<br>పొరఁటు | పొరంటు | పొరట్టు | పురట్టు | |
| వేఁట | వేంట | బేంటె | వేట్టై | |
| వేఁపచెట్టు | వేంపచెట్టు | బేవినమరం | వేప్పమరమ్ | |
| దోఁటి | దోంటి | దోంటి | తోట్టి | |
| చేయఁబడు<br>చేయంబడు | చేయంబడు | మాడల్పడు | చెయప్పట్టాన్ | ప్రాచీనతమిళమునసరళోచ్చారణమే లేదు. |

వక్తలు స్థితస్థాపనపరత్వాద్యభినివేశము నుపేక్షించి కేవలమగు నుచ్చారణసౌలభ్యమాత్రము నపేక్షించి బద్ధకముగాఁ బలుకునపుడె యిట్టి పరిణామము సంభవించును. తెనుఁగులో సైతము పడిసెము పట్టినవారలయుఁ గొందఱు బద్ధకముగలవారలయు నుచ్చారణమున 'చేయగ్గా, చెప్పగ్గా' మున్నగు పరిణామములు వినఁబడుట గలదు.

సానునాసికోచ్చారణమున నిశ్వాసవాయువు ద్విధాశాఖీభూతమయి వక్త్ర మార్గమునను నాసామార్గమునను బ్రసరించునట్లు వక్త ప్రయత్నింపవల యును. కాన నట్టి ద్వివిధప్రయత్నము నేకకాలమునఁ జేయుట కొంత శ్రమాపాదకమగుటచేత నుచ్చారణ సౌలభ్యము నపేక్షించు వక్త లాను నాసిక్యమును లోపింపఁజేసి యచ్చటి పూర్వాచ్చునం దభ్యస్తమయి యున్న గౌరవమునకు భంగములేకుండఁ బరహల్లును ద్విరుక్తముగాఁ బలుకుట స్వాభావికమె యనఁదగును.

అనునాసిక పరుషసంయోగమునఁ బరుషము సరళముగ మాఱిపోవుట గాని యనునాసిక లోపమూలకద్విత్వము వచ్చుటగాని తప్పక సంభవించు టయె సహజమైనను వెనుక వ్రాసినరీతిని స్థితస్థాపనపరత్వాదికారణముల చేతను (౨౬౨ వి.) ప్రాచీన ద్రావిడభాషలలో సరళోచ్చారణమె లేకుండుట చేతను బ్రాచీన తమిళమున ననేకస్థలములం దనునాసిక పరుషసంయోగమె నిల్చియుండెను. కొన్నిస్థలములందుమాత్రమె సమానపదములలో నీ ద్విత్వ పద్ధతి పై నుదాహరించిన రీతిని వెలసినది.

ఇంకఁ బదద్వయ సంధిలో నన్ననో యీ ద్విత్వపద్ధతి తమిళమున మిక్కిలి విపులముగా వ్యాపించి యున్నది. పదద్వయ సంధిలో నీ ద్విత్వపద్ధతి వర్తింపని కొన్నిస్థలములలోఁ బయిరీతిని సమానపదములందువలెనె యను నాసిక పరుషసంయోగమె ప్రాచీనతమిళమున నిల్చియున్నది.

(౩౬౫)—కాలక్రమమున నుచ్చారణ సౌలభ్యాపేక్షచేత స్థితస్థాపన పరత్వాద్యభినివేశములు క్షీణించుటంజేసి సరళోచ్చారణము విస్తరిల్లినది. ఆంధ్రకర్ణాటములందువలెఁ గతిచిత్ స్థలములలో వచ్చుటయేకాక సమానపద ములందుఁ బదాదీతరస్థలములలో సరళోచ్చారము నవీన తమిళమున నియత మె మైనది. పదాదినిసైతము ద్విత్వము రానపుడు చకారము సకారరూప సార శ్యమునందుట నియతమై యున్నది. పదద్వయ సంధిలోఁ బ్రాచీనతమిళములోని ద్విత్వ పద్ధతిచే రూఢమై నెలకొనియున్న పదాది పారుష్యముమాత్రము సారళ్య మందజాలఁదయ్యెను. అట్టిపదద్వయ సంధిలోఁ బయి ద్విత్వపద్ధతి వర్తింపని స్వవర్గీయానునాసికసంయోగమునఁ బదాది పరుష మనేకుల యుచ్చా రణములోఁ సరళముగనే వెలసియున్నది. వేయేల! కొందఱు నేఁటి తమిళ పండితులును దుదికిఁ గాల్డువెల్లుదొరగారు మున్నగు పాశ్చాత్యపండితులును నీ

సరళోచ్చారణము తమిళమున కనాదిగ సహజమై యున్నదని సిద్ధాంతీకరించు
కొనునంతటి నియతత్వము నేఁటి తమిళములో వ్యాపించి యున్నది. తమిళమున
సరళముల లిపి దొల్కాప్పియమున లేదు సరేకదా సరళస్థితిని సూచించు ప్రసంగ
ము సైతమేమాత్రమును నందులేమింజేసి తొల్కాప్పియము నాఁటికి సరళములు
తమిళమున లేవనుటకు సందేహములేదు. తర్వాత నేకాలమున నిట్టి సర్వ
వ్యాపకమగు సరళోచ్చారణ మందుఁ బ్రవేశించినదో తెలియరాకున్నది.

| ప్రాచీన తమిళము. | అర్వాచీన తమిళము. | తెలుఁగు. | సంస్కృతము. |
|---|---|---|---|
| ఆకు | ఆగు | అగు | |
| అఙ్కై | అఙ్గై | అంక | అఙ్కమ్ (పార్శ్వము. అంక.) |
| అఞ్చమ్ | అఞ్జమ్ | అంచ | హంసః |
| చిఱియ | సిఱియ | చిఱు | |
| అటఙ్కు | అడఙ్గు | అడంగు | |
| యాణ్టు | యాణ్డు | ఏఁడు | ము) |
| అన్తమ్ | అన్దమ్ | అందము | అన్తమ్ (సుందర |
| అమ్పు | అమ్బు | అంబు | అమ్బు (బాణము) |
| అపిని | అబిని | అభిని-(నల్లమందు) | |
| విళఙ్కోటు | విళఙ్గోడు | వెలగకొమ్మ(కోడు=మంచపుఁగోడు) | |
| అఙ్కై | అఙ్గై | (అఱ కై)=అఱచేయి | |

(౩౬౬)—కాలక్రమమున ద్రావిడభాషా కుటుంబములోని యాంధ్రకర్ణాటములందును సరళోచ్చారణము కొంతవిపులముగనె విస్తరిల్లినది. అట్లు విస్తరిల్లిన వెనుకనె యాభాషలకు సంస్కారము జరుగుటయు వాఙ్మయము వెలయుటయు సంభవించుటంజేసి వానియందు సరళవర్ణములును వాని లిపియు ధారాళముగ నంగీకరింపఁబడెను. అట్లువానిలో సరళోచ్చారణము రూఢమయినను వెనుక నుదాహరించిన స్థితస్థాపన పరత్వాది కారణములచేత వానియందు సమానపదములలో సైతమనునాసికసంయుక్త పరుషము లనేకస్థలములందు సరళములుగా మాఱఁజాలవయ్యెను. (వి. ౩౬౩)

| తెలుఁగు. | కన్నడము. | తమిళము ప్రాచీనము. | సంస్కృత సమము. | వివరణము. |
|---|---|---|---|---|
| అంకె | అంకి | | అంకము | |
| అంగడి | అంగడ్ | అఙ్గాటి | అంగణము | |
| అంచే | అంచె | అఞ్చమ్ | హంసము | |
| అంజు | అంజు | అఞ్చు | ... ... | భీతిచెందు |
| అంటు | అంటు | అణ్టు | ... ... | |
| అండ | అండు | అణ్టై | ... ... | సమీపము |
| అంతే | అంతే | అన్తే | ... ... | సం. త. అట్లు |
| అందము | అందం | అన్తమ్ | అంతము | రమ్యము |
| ఇంపు | ఇంపు | ఇమ్పు-మ్పు | ... ... | ఇష్టము |
| ఉంబళి | ఉంబళి | ఉమ్బళమ్ | ... ... | పన్ను వేసిన ఇనాము |

(3౾౭)—తెల్గువారు పదద్వయసంధిలో నకార సంయోగమునఁ బరస్థపరుషము నిత్యముగా సరళమగుట కంగీకరించియు నట్టియెడల నట్టివర్గీయ సంబంధమున నకారము వర్గపంచమముగా మాఱవలసియున్నను వెనుక నుదాహరించిన స్థితస్థాపనపరత్వా ద్యభినివేశముచే నట్టి పర సవర్ణానునాసికాదేశమును రానీయక యుచ్చారయితలట్టి నకారమును బూర్వాక్షరాంగముగనె పల్కుచు వచ్చుటంజేసి యట్టి నకారము పూర్వాచ్చు నంటియుండి వక్తల యుచ్చారణ సౌలభ్యాపేక్షచేత ననుస్వారముగఁ బరిణమించుచు వచ్చె నని గ్రహింపవలెను. ఉ. నాకున్‌గలదు = నాకుంగలదు = నాకుఁగలదు. ఆంధ్రభాషకు ఙకార ఞకారోచ్చారణము స్వాభావికము కాకుండుటయుఁ బయిసిద్ధాంతమునకు హస్తావలంబ మగుచున్నది. ఈ క్రింది మహాకవి ప్రయోగములు సయితము పై సిద్ధాంతమును దృఢమూలముఁ గావించుచున్నవి.

కం. త్వరితముగఁ జనుము సుఖుఁడున్ ।
గురుఁడు గదా నీకు నర్జునుం డుపకృతి త ।
త్పరుఁడై ......... (భార-ద్రోణ. సర్వలక్షణ ౧ ఆ. ౮౯ ప.)

శా॥ "... పుణ్యాచార భీమాంబకున్ ।
గారామైన తనూజు నన్న నఘు శ్రీనాథాఖ్యుఁ బిల్పించి ........."
(శృంగారనై. సర్వలక్ష. ౧ ఆ ౮౮ ప.)

(3౬౮)—ఉచ్చారణ సౌలభ్యాపేక్షచే నిట్టి పూర్వావయవాంగభూత నకారములోని వర్గీయతాధర్మ మంతరింపఁగా నది యనుస్వారముగఁ బరిణమించునని యీవఱకు విశదపఱిచియే యున్నాను. అట్టి యనుస్వార మట్టియర్ధమాత్రాక నకారజన్యమే యయినను నావఱకుఁ బరస్థిత తాదృశ నకార సంయోగమునఁ బూర్వస్వరమునకు గురుత్వము నసఁగా నూనికను గలిగించు నలవాటు దూఢమై యుండుటంజేసి కావలయు నట్టి యనుస్వార మర్ధమాత్రికముగా నేర్పడక మాత్రికమగుచుఁ బూర్వస్వరముయొక్క గౌరవమును గాపాడుచుండుట సంభవించుచు వచ్చెను.

"అనుస్వారశ్చ" (తైత్తిరీయప్రాతి-౧ అధ్యా 3౪ సూ.)

"భవత్యనుస్వారోఽపి హ్రస్వసంజ్ఞః...... హ్రస్వార్ధకాలం వ్యఞ్జనమ్" తైత్తి - ప్రాతి - ౧ అధ్యా - 3౭ సూ.)

"అర్ధమాత్రత్వే ప్రాప్తే తన్మాభూదితి హ్రస్వత్వం విధీయతే" (త్రిభాష్యరత్న వ్యాఖ్య.)

ఈ యనుస్వారము హ్రస్వపూర్వక మగునపు డట్టి హ్రస్వస్వరముయొక్క మాత్రాకాలములోని కొంతభాగమును నాకర్షించి సార్ధమాత్రికమయి యుచ్చారణ విశ్రాంతిస్థలమై నెలయుచుండుననియు దీర్ఘపూర్వకమగు నపుడట్టి దైర్ఘ్యమునకులోనై స్వీయభాగమును గొంత యాదీర్ఘములో విడిచి యర్ధ మాత్రికముగా వినఁబడుననియు శబ్దతత్త్వ శాస్త్రజ్ఞు లభిప్రాయపడి యున్నారు.

"అనుస్వారో హ్రస్వపూర్వోఽధ్యర్ధ మాత్రా, పూర్వాచార్ధమాత్రా చేతి" (శుక్ల-ప్రా. ౪ అ. ౧౪౮ సూ.)

(3౬౯)—పయిరీతి ననుస్వారము దీర్ఘపూర్వకత్వమున దుర్బలమగుటయు హ్రస్వపూర్వకత్వమున బలిష్ఠమగుటయు ననుభవసిద్ధములయి యుండుటచేతనే యుచ్చారణ సౌలభ్యాపేక్షచే ననుస్వారము కాలక్రమమున దేల్పఁబడుటయు నట్టి తేలిక (అర్ధానుస్వారమగుటయు) దీర్ఘపూర్వకత్వమున నియతమును హ్రస్వపూర్వకత్వమునఁ బాక్షికమును నగుటయు నాంధ్రభాషలోఁ బ్రసిద్ధమై యున్నది. తమిళ కన్నడములలోనైనత మర్ధానుస్వార మిట్లె యంగీకర్తవ్యమే యైనను నత్తత్పండితు లాంధ్రపండితులవలె సూక్ష్మముగ వివేకింపరైరని యెన్నఁదగును. అట్లు బిందువు తేలిన స్థలములు తమిళ కన్నడము

లలో నిర్బిందుకములుగనే పరిగణింపఁబడుచున్నవి. నేఁటికిని గొన్ని మండల
ములవారి యుచ్చారణములో నట్టిదీర్ఘముమీఁది తేలిన బిందువులచోట సయి
తము పూర్ణబిందువు వినఁబడుచుండుటయు హ్రస్వముమీఁద ధారాళముగాఁ
బూర్ణశ్రుతి వెలయుచుండుటయుఁ బ్రసిద్ధమై యుండుటంజేసి యవి నిర్బిందుక
ములేమోయని సందేహింప నక్కఱలేదు. ఇఁకఁ దమిళకన్నడములలో సైత
మట్లు బిందువు నశించుట దీర్ఘపూర్వకత్వమునఁ బ్రచురముగను హ్రస్వ
పూర్వకత్వమున నరుదుగను నైయున్నదనుటలో విప్రతిపత్తిలేదు.

దీర్ఘపూర్వకానుస్వారము తేలిపోయినను బూర్వస్వరమున కలవాటులో
నున్నయూనిక (గౌరవము) చెడదుగాన నట్టియెడల నుచ్చారణ సౌలభ్యాపేక్ష
చే ననుస్వారము తేల్చి పలుకఁబడుటయు నానాఁటికి లుప్తప్రాయమగుటయు
విరుద్ధములు కావు. ఇంక హ్రస్వపూర్వకానుస్వారము తేలిపోయినచో నట్టి
హ్రస్వమున కలవాటులో నున్న యూనికకు (గౌరవమునకు) భంగము
కల్గును గాన నట్టియెడల ననుస్వారము తేలిపోవుటకుఁ జాలకాలము పట్టును.
అనఁగా నట్టియూనిక యుచ్చారయితల యశ్రద్ధచేత, తరంగమాలికాన్యాయ
మునఁ (వీచీతరంగన్యాయ) దేలిపోవుట చిరకాలమునకుఁ గాని సంభవింపదు.
పదమునందలి యర్థబోధకతాశక్తి పదాద్యక్షరమునం దధికముగను, నుత్త
రోత్తరవర్ణములం దల్పాల్పతరాది విధములను నుండును గాన వక్తృశ్రోతల
శ్రద్ధ పదాద్యక్షరమున నధికముగను నుత్తరోత్తరాక్షరములపై నల్పాల్పతరాది
విధములను వ్యాపించియుండును గాన నుడి తొలివర్ణముమీఁది హ్రస్వ
పూర్వకానుస్వారము దేలిపోనేరదు (అర్ధబిందుతా పరిణతి నందనేరదు).
ఇంకఁ బదాద్యక్షరేతరస్థలములందలి హ్రస్వపూర్వకానుస్వార స్థలములలోని
యూనిక వక్తృశ్రోతల యశ్రద్ధచేత నానాఁటికి విస్మృతముకాఁగాఁ గాల
క్రమమున నట్లుచ్చారణ సౌలభ్యాపేక్షచేతఁ దేలిపోవుచుండును. అట్టి తేలి
పోయిన స్థలములం దనుస్వారస్థితి తమిళ కర్ణాటములలో విస్మృతమె యైనను
నాంధ్రమునఁ గొందఱ యుచ్చారణముల నందలి యర్ధానునాసిక్య శ్రుతిమూ
లమునఁ సైతమర్ధానుస్వార మంగీకరింపఁబడెనని యెఱుంగనగును.

(౩౨౦)—పదవాక్యావసానములందు నిల్చెడి వర్గపంచమములగు
నకార మకారములు సైతమనుస్వారరూప పరిణామమునందుట యంగీక
రింపఁ దగినదే యని తోఁచుచున్నది. అట్టివాని కనుస్వారవిధాన మొక్క
కర్ణాటభాషలో మాత్ర మగపడుచున్నది.

"మనయో ర్బిన్దుః" (కర్ణాటక భాషాభూషణము. ౧౧౨ సూ.)

మకార నకారముల కవసానమున బిందు వగును. ఉ. కులం = (కులము,) అవం = (వాఁడు,) తాం = (తాను, తాము) మొదలయినవి.

ఆంధ్రవైయాకరణు లట్టి యవసానానుస్వారము నపభ్రష్టముగాఁ దలఁచి కావలయును దాని సాధుత్వమును సూత్రింపలేదు. కాని యాంధ్ర భాషలో సైత మట్టి పరిణామముండెడి దనుటకు సందేహము లేదు. నేఁటి పండితుల వాఁడుకలో సైతము ముపర్ణ కాంతశబ్ద ముపర్ణకముచోట ననుస్వారమె తఱచుగాఁ బలుకఁబడుచున్నది. అనుస్వారము కాలక్రమమునఁ దేలిపోవుటయు (అర్ధానుస్వారముగాఁ బరిణమించుటయు) ననఁగాఁ బూర్వస్వరము సానునాసికముగఁ బలుకఁబడుటయు నానాఁటి కట్టి యానునాసిక్యము సైత మంతరించుటయు నుచ్చారణ సౌలభ్యాపేక్షచే జరుగుట స్వాభావిక మగుటచేత ముపర్ణకాంతనామముల ముపర్ణకము బిందువుగా మాఱి కాలక్రమమున నంతరించుట పెక్కునామములలో నగపడుచున్నది.

ఉ. శూన్యము = సున్న; అర్పణము = అప్పనము = అప్పన = ఒప్పన; హంసము = (హంసం) హంస; చరిత్రము = (చరిత్రం) చరిత్ర; చరిత్రాదిగణమెల్ల నిట్టిదియే యనఁదగును.

ఆంధ్రవైయాకరణులు ముపర్ణకాంతశబ్దములను లుప్తముపర్ణక శబ్దములను నిట్లు గ్రాంథికములనుగా నంగీకరించి "చరిత్రం" మున్నగు ననుస్వారాంతశబ్దములను సాధువులుగా నంగీకరింపరైరి. అట్టి యనుస్వారము త్వరగాఁ బలుకుటలో ముపర్ణకస్థానమున వినఁబడుచుండుననియు, నక్కారణమున నచట ముపర్ణకమునె యంగీకరింపనగుననియు 'చరిత్రం' అను ననుస్వారావస్థలోని రూపము నంగీకరింపరాదనియు నాంధ్రమహాకవులును వైయాకరణులును దలంచిరని తోఁచుచున్నది. ఎల్లయెడలను 'చరిత్రము, చరిత్ర' అను రీతిగల రూపములె ప్రయుక్తములై యున్నవిగాని 'చరిత్రం' (చరిత్ర) అను రీతిగలవి ప్రయుక్తములై యుండలేదు.

ఇంక నకారాంతముల విషయము వేఱు రీతిగ నున్నది. నువర్ణాంతములును నకారాంతములును లుప్తనకారాంతములును నగు ముత్తెఱంగుల రూపములును గవిప్రయోగములలో వెలయుచున్నవి. ఉ. చదివెదను = చదివెదన్ = చదివెద. కాని వానిపరిణామములో నడిమియవస్థయందలి బిందు

ఘటితములగు 'చదివెదం' – అను కీతిగల రూపము లెచ్చటను బ్రయోగింపఁ బడియుండలేదు.

అట్లయినను నచటి 'మన' లు విశ్లేతుకముగ లోపించిన వనుట యుక్తిసహము కామింజేసి పయిరీతి నవి యనుస్వార పరిణతినందిన వనుటయే యుక్తము. వైయాకరణులు మహాకవిప్రయోగస్థిత రూపములను సాధించుఁ బ్రక్రియను మాత్రము చూపువార లగుటంజేసి వారు శబ్దచరిత్రమును సూచింపక యట్లు 'చరిత్రము-చరిత్ర' మున్నగుచోట్లఁ బాక్షిక 'ము' వర్ణస్థితిని 'చదివెదన్, చదివెద' మున్నగుచోట్లఁ బాక్షిక 'న' కారస్థితిని మాత్రమె సూత్రించిరని గ్రహింపనగును.

"చరిత్రాదుల ముపర్ణకంబునకుఁ లోపంబు బహుళంబుగా నగు (బాల.తత్స. ౫౮ సూ)" "అవసానంబున ద్రుతంబునకేని ద్రుతస్వరంబునకేని లోపంబు బహుళంబుగా నగు (బాల. సంధి ౨౦ సూ.)"

ఆంధ్ర వ్యవహారస్థములగు "చరిత్రం" మున్నగు చోటులందలి బిందువు నపభ్రష్టముగా నుపేక్షించినను బ్రాకృత శబ్దముల తుదిని బిందుపరిణామము ననుకృతిలో నంగీకరించి యున్నారు. (చూ-వ్యా-సం-౧౧౪ విష)

"శబ్దానా మన్త్యభాగేషు । యోనుస్వారః ప్రదృశ్యతే । తస్యాచి పరతో మః స్యా । త్సర్వత్ర కవిసమ్మతేః॥" (అథర్వణకారికావళి)

ప్రాకృతభాషలో ధారాళముగాఁ దత్సమముల తుదిని బిందుస్థితి యంగీకరింపఁబడి యున్నది.

"బిందుల్" (౧-౧-౪౦) శబ్దానా మన్త్య మకారస్య నిత్యం బిన్దుస్స్యాత్ లోపాపవాదః-రామం (రామమ్). (షడ్భా. చం.)

కర్ణాటభాషలో నకార మకారములు రెండిటికిని బిందుస్థితి సూత్రింపఁబడి యున్నది.

"మనయో ర్బిన్దుః" (కర్ణాటభాషా భూషణము) అవసానమందలి మకార నకారములు బిందువుగ మాఱును. అవన్ = అవం. (వాఁడు) బింకమ్ = బింకం = (బింకము.)

(౩౭౧)—పయి నుదాహరించినరీతి నవసానమునందును బదాంతర సంధియందును మాత్రమెకాక పదమధ్యమందును వర్గపంచమ పూర్వక

వర్గాక్షర సంయోగములోని మొదటి వర్గపంచమరూప వ్యంజనమును వక్తలు దేశకాలాభ్యాస భేదములచేఁ బూర్వాక్షరాంగముగ నుచ్చరించుటయు నట్టి యనునాసికములు వెనుక నుదాహరించినరీతి నుచ్చారణ సౌలభ్యాపేక్షచేత ననుస్వార రూప పరిణామమునందుచు నతోధిక సౌలభ్యాపేక్షచేఁ దేలిపోవుచుఁ గాలక్రమమున లోపించుటయు సంభవించునని యెఱుంగనగును. కావుననే యేకకుటుంబములోని కొన్నిశబ్దము లొక భాషలో సానునాసికములుగ లేక పూర్ణానుస్వారయుతములుగ వాడఁబడుచు భాషాంతరములలో నిరనునాసికములుగ లేక నిర్బిందుకములుగను లేదా సార్ధబిందుకములుగను వాడఁబడుట సంభవించుచున్నది. మఱియు నొకటఁ బాక్షిక బిందుకత్వమును గలదు. అట్టి శబ్దములను వెనుక నుదాహరించిన ౩౯౬ విషయములోని పట్టికనుండి యేర్చి యిచ్చుట మరల స్పష్టతకై చూపుచున్నాను.

# నన్నయాథర్వణీయము

## V. అంతస్థ ప్రకరణము.

౭౦॥ లఘవో౽లఘవశ్చేతి, ద్వేధాన్తస్థా న్విదన్తి శాస్త్రారః ।
ఆన్యేన్యవ్యాకరణ, స్పష్టా ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః ॥

---

# వైయాకరణపారిజాతము

## V. అంతస్థ ప్రకరణము.

(౩౭౨)—వ్యాఖ్య - లఘవ ఇత్యాది:—శాస్త్రారః = లక్షణకర్తలు, అన్తస్థాన్ = యరలవలను, లఘవః = లఘువులనియు, అలఘవశ్చ = అలఘువులనియు, ద్వేధా = రెండువిధములుగా, విదన్తి = ఉచ్చారణమునుబట్టి తెలిసికొనుచున్నారు. అన్యే = రేఫేతరములగు నంతస్థములు, అన్యవ్యాకరణ స్పష్టాః = ఆంధ్రేతరములగు సంస్కృత ప్రాకృత వ్యాకరణములందు, విశదములై యున్నవి. రస్తు = రేఫముసైతము, అత్ర = ఈ యాంధ్రభాషయందు మాత్రము, ద్వివిధః = రెండువిధములై యున్నది. తు శబ్దమహిమచే య ల వ లును నాంధ్రమున ద్వివిధము లయి యున్నవని గ్రహింపనగును. 'నాన్యేషాం వైధర్మ్య' మిత్యాది సూత్రముచేత గ్రంథకర్త వాని ద్వైవిధ్యమును ముందు విశదీకరించుచున్నాఁడు.

(౩౭౩)—"య వ లకు హలి సర్వేషా మితి సూత్రమునందుఁ బాణినీయములో రెండువిధము లాయెను" (బాలసరస్వతీయము) "యవలు రెండు విధములైనందుకు "హలి సర్వేషామ్" "భో, భగో, అఘో, అ, పూర్వస్య లఘ్వ లఘూచ్చారణస్య యకారస్య లోప స్స్యద్ధలి సర్వేషాం మతేన భో దేవాః, భో లక్ష్మీశ్రః, భో విద్వద్బృన్ద, భగో నమస్తే, అఘో యాహి, దేవా నమ్యాః" (అప్పక. ౨ ఆ. ౧౭౩ ప) అని యిట్లు బాలసరస్వత్యప్పకవులు సంస్కృత వ్యాకరణమునందలి యవలద్వైవిధ్యము నుదాహరించిరి. కాని పైసూత్రములో వకార ప్రసక్తియే లేదు. ఈపాణిని సూత్రమునొద్దఁ దత్త్వబోధినిలో నీ క్రిందిరీతిని వ్రాయఁబడి యున్నది. "యకారస్యేతి వకారస్తు నానువర్తతే, భో, భగో, అఘో, అపూర్వస్య అసంభవాత్ ..." (తత్త్వబోధినీ వ్యాఖ్య) 'భో, భగో, అఘో, అ' అనువానికిఁ బరమగు లఘ్వలఘు యకార

ములకు హల్లు పరమగుచుండఁగా లోపము సర్వసమ్మతముగ నగునని పై సూత్రమున కర్థము. అట్టివానికిఁ బరమందు వకారస్థితికే ప్రసక్తి లేమింజేసి వకారమున కాసూత్రమున ననువృత్తియే లేదని పయి తత్త్వబోధినీవాక్యమున కభిప్రాయము. పయి సందర్భమునుబట్టి సంస్కృత వ్యాకరణమునందలి లఘు ప్రయత్నతర యకార వకారములను జూపుటలో బాలసరస్వత్యప్పకవులు "హలి సర్వేషా" మ్మనుసూత్రము నుదాహరించుట సరికాదని విశదమగు చున్నది. ఆసూత్రము కేవల యకారముయొక్క లఘ్వలఘుతలస్థితి కుదాహ రించిన నుదాహరింపనగును. ఇఁక "వ్యో ర్లఘు ప్రయత్నతర శ్శాకటా యనస్య. (౮-౩-౧౮) వృత్తి:—పదాన్తయో ర్వకార యకారయో ర్లఘూ చ్చారణౌ వయౌ, వాస్తోఽశిపరే" (దేవా యిహ, అసావాదిత్యః)" అనుచోటి యవలు రెండును లఘువులు నలఘువులును గావచ్చును గాన నీసూత్రము నుదాహరించుట యుక్తము. పై సూత్రమున లఘుప్రయత్నతర మనుటచేతఁ బ్రయత్నలాఘవాతిశయము వ్యక్తమగుచున్నది.

అహోబలపండితుఁడు పైసూత్రమునె యిఁక్రిందిరీతి నుదాహరించి యున్నాఁడు. "అన్తస్థాన్ = యరలవాన్, లఘవః అలఘవశ్చేతి ద్వేధా, విదన్తి = జానన్తి......నన్వేతేషాం వర్ణానాం లఘుత్వం గురుత్వంచ కుత్ర కుత్ర ప్రసిద్ధ మిత్యాశఙ్క్యాహ - అన్యేన్యఇతి......వ్యో ర్లఘు ప్రయత్నతర శ్శాకటాయన స్యేతిపాణినీయ సూత్రే యవయో ర్లఘ్వలఘు భేదేన ద్వైవిధ్యం స్పష్టమ్" (అహో ౧౪౭ పుట.) (అలఘు రలలను గురు రలలనియు నన్న యాథర్వణులు సైతము వాడియున్నారు) "దన్త్యచజౌ గురురతౌచ బిన్దు యుతౌ" (ఆంధ్రశబ్ద చింతామణి) "లఘు ర్భవే ద్గురుః కుత్రచి ద్గురుశ్చ లఘు ర్భవేత్ ......" (వికృతి వివేకము ౪౩౪ వి.)

(౩౭౪)—ఇఁక లకారద్వైవిధ్య విషయమున నీక్రిందిరీతిని బాలసరస్వ త్యప్పక వ్యహోబల పండితులు ప్రమాణమును జూపియున్నారు.

"లకారము 'లోళః' అను ప్రాకృత వ్యాకరణసూత్రమందు రెండు విధము లయ్యెను" (బాలసరస్వతీయము.) "లకారము రెండువిధము లైనందు నకు వాల్మీకిసూత్రము - "లోళః పైశాచ్యామ్" "లకారస్య ళః స్యాత్ - ముకులస్య ముకుళః - గలస్య గళః - ప్రలయస్య ప్రళయః" (అప్పక. 2 ఆ. ౧23) (మ. రా. శ్రీ. రావుసాహేబు గిడుగు వేంకట రామమూర్తి పంతులు గారు సవరించిన వావిళ్ళవారి ముద్రణము ౧౯౨౪ సం.)

"లస్య ద్వైవిధ్యం లోళఇతి వాల్మీకీయే సూత్రే స్ఫుటః" (అహో. ౧౪౮ పుట).

లౌకికసంస్కృతభాషలోని యలఘు లకారము (ఇది మహారాష్ట్రి మున్నగు వానిలో వ్యాపించినది) పైశాచీ ప్రాకృతమున లఘువుగా మాఱు నని పయి వ్యాఖ్యలకు విరుద్ధముగ 'లోళ' ఇత్యాది సూత్రమున కర్థముచేయుట మున్నగు విషయము లీవఱకు విపులముగా వ్రాయఁబడి యుండుటచే (౨౫౯-౨౬౦ వి.) నిట మరల వివరింపనైతిని.

"నాన్యేషాం వైధర్మ్యం, లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అను చింతామణికారిక రేఫేతర లఘ్వలఘువు లగు నంతస్థములకు యతిప్రాస మైత్రి నాంధ్రమున నుపదేశించుచుండుట నరయఁగా నాంధ్రభాషలో నంతస్థములు నాల్గిటికిని ద్వైవిధ్యముగల దనుట నన్నయభట్టాభిప్రేతమే యనుటకు సందేహములేదు. కాని యాతఁ డేయే స్థలములందలి యంతస్థములు లఘువులో యే యేచోటులలోని యంతస్థము లలఘువులో యను విషయమును సాకల్యముగా నుపదేశించి యుండలేదు. "యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" అను చింతామణి సూత్రముచేత నొక్క లఘు యకారస్థలమును మాత్ర ముపదేశించియున్నాఁడు. ఇందలి 'ప్రవదన్తి' అను దానిని బట్టి చూడఁగా సంస్కృత ప్రాకృతానుసారముగాఁ దెల్గునఁ బ్రాణసంధిలోని యకారమును లఘుయకార మనుచున్నారేకాని యట్టి యుచ్చారణభేద మగపడ లేదని యాతఁ డుద్దేశించినట్లు వ్యక్తమగుచున్నది. సంస్కృతవ్యాకరణములోఁ జెప్పఁబడిన (౫౦౫ - ౫౨౧ వి.) లఘుయవల యుచ్చారణభేదము సయితము చిరకాలము క్రిందటనే యంతరించె ననుటలో సందేహము లేదు. 'యశ్రుతిమ్' అనుచోటి శ్రుతిశబ్దమునకుఁ గీర్తిశేషు లగు వేదము వేంకటరాయశాస్త్రుల వారు వేఱువిధముగా స్వారస్యమును జెప్పియున్నారు. ఈవిషయము ముందు వివరింపఁబడును. (౫౧౩ వి.)

(౩౭౫)—"నాన్యేషాం వైధర్మ్య" మిత్యాది సూత్రముచే లఘ్వలఘు యవలకు యతిప్రాసమైత్రి వెలయుచుండుటచేత నేయే చోటులందలి యవలు లఘువులో యేయేచోటులందలి యవ లలఘువులో యనువిషయమును వివరింపవలసిన యావశ్యకత లేదు. (లఘ్వలఘు రలలను వాని యుచ్చారణమునుబట్టియే తెలిసికొనవచ్చును.) అట్లయినను నాంధ్రమున స్వరసంహితలో

సంధిప్రకరణమున లఘు యకారాగమము నెట్లును జెప్పవలసియే యుండుట చేత నద్దాని నిచటఁ బ్రసంగవశమున వివరించినవాఁ డయ్యెను.

'యశ్రుతి రః' (౧-౩-౧౦) "ప్రాయో లు గిత్యాదినా కాదీనాం లోపే సతి యోఽవశిష్యతే అవర్ణః సః అవర్ణా త్పరో లఘుప్రయత్నతర యకార శ్రుతి ర్భవతి" (షడ్భాషాచంద్రిక) అని యిట్లు ప్రాకృతమున 'అ' వర్ణద్వయ మధ్యమున మాత్రము లఘుతర యకారశ్రుతి గల దని చెప్పఁబడి యున్నది.

స్వరసంహితలో యకారాగమమె కాక వకారాగమము వచ్చుట సయితము తమిళ కర్ణాటములలో విపులముగఁ గలదు. కాని యట్టి యవలు లఘువులని వేఱుగా నందుఁ జెప్పఁబడ లేదు. ఆంధ్రమున నట్టి వకారము మిక్కిలి యరుదై యున్నది.

(౩౭౬)—ఇఁక "నాన్యేషా" మిత్యాది సూత్రముచొప్పునఁ దెల్గునఁ గల దని నన్నయభ ట్టుద్దేశించిన లఘు వకార మెద్దియై యుండు నని యాలోచింపవలసియున్నది. "వ్యో ర్లఘు ప్రయత్నతరః శాకటాయనస్య" అను సంస్కృత వ్యాకరణసూత్రమునఁ జెప్పఁబడిన లఘువకారమె తెలుఁగున ననుకరణాది రూపమున రావచ్చునని యాతఁడు తలంచి యుండిన నుండవచ్చును. లేదా "తిరువారాధనము (పాండురంగమా. 3 ఆ.) రవుతు, చేవితి (౭౯. IX. వి.) కోవెల (కోవిల? కో = రాజు; ఇల్) చిగురు = చివురు. (చూ. వ్యా - సం ౫౭౮ విష) మున్నగు చోటులందుఁ గ్వాచిత్కముగఁ దెలుఁగున నగపడుచున్న స్వరసంహితలో నుచ్చారణసౌకర్యార్థము వచ్చెడి వకారము నుద్దేశించి యుండునని యూహింప నగును.

'యశ్రుతి మార్యాలఘు యం ప్రవద స్త్ర ప్రాణతః పరం ప్రాణమ్' అను చింతామణి సూత్రముచొప్పునఁ బ్రత్యేకస్థితిలో స్వరముగ వినఁబడుచు సంధిలో యకారశ్రుతి గల 'హరి+అతఁడు=హరి యతఁడు' మున్నగు స్థలములలోని యకారమె లఘు యకార మనిపించుకొనును గానఁ దత్తుల్యన్యాయమున 'తిరు + ఆరాధనము = తిరువారాధనము' మున్నగు పదాంతస్థలములలోని వకారము మాత్రమె లఘువకార మనిపించుకొనుఁగాక. రవుతు - చేవితి - మున్నగు రూఢశబ్దములలోని పదమధ్యస్థలములందలి వకార మెట్లు లఘు వకార మనియు స్వరసంధిజాత మనియు నిర్ణయింప నగును? అట్లే నిర్ణయించినయెడలఁ బదమధ్యస్థములగు "గడియ, డిగ్గియ మున్నగుచోటులలోని యకా

రములు సయితము లఘుయకారములే యనవలసివచ్చునుగదా" అని శంకింపఁ జనదు. ఇది యిష్టాపత్తియె యగుటచేత నీశంక నిరస్త మగుచున్నది. 'ఘటిక = గడి+అ = గడియ, దీర్ఘిక = డిగ్గి + అ = డిగ్గియ' అని ఇట్టి వ్యుత్పత్తి గల గడియ మున్నగు శబ్దములలోని యకారము లఘువనుటలో విప్రతిపత్తి లేదు. అట్లె 'చతుర్థి = చ+ఉతి = చవుతి, రాహుత్తుఁడు = ర+ఉతు = రవుతు' మున్నగుచోటులందును స్వరసంహితలో నిల్చిన వకార రూప స్వర వ్యవధాయకవర్ణము లఘు వనుటలో విరోధ మేమియు నగపడదు. తత్సమేతరవిషయక మగుటచేఁ జింతామణి చెప్పలేదు గాని నన్నయభట్టు తఱచుగాఁ బ్రయోగించిన 'గెలువన్ పిలువన్' (గెలు+అన్, పిలు+అన్ వకారలోపమున) మున్నగుచోటుల వకారమును స్వరవ్యవధాయకమె యని చెప్పవచ్చును. కాఁగా నీక్రిందను విమర్శింపఁబడు వకారము ననఁగాఁ బ్రథమ మీఁది పకారమున కాదేశముగా వచ్చు వకారము నర్వాచీన వైయాకర ణులు లఘువకారముగాఁ జెప్పుటకన్న "క్వచి ద్గకారో వః" అను చింతామణి సూత్రముచొప్పున వచ్చెడి "చివురు" మున్నగు చోటులలోని యాదేశ వకారమును లఘు వకారముగాఁ జెప్పియుండినయెడల నంతకన్న యుక్తి యుక్తముగా నుండెడిది. "చిగురు" మున్నగు చోటులలోని గకారము లోపింపఁగా నచట నేర్పడెడి స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వకారము నిల్చుచున్నది గాన నద్దానిని లఘు వకార మనుట పయి నుదాహ రించిన యవల లఘుత్వోపదేశసంప్రదాయమునకు మిక్కిలి యనుకూల ముగా నుండును. పాశ్చాత్యపండితు లంతస్థముల నర్ధాచ్చులనుట యిట్టి యవల యందు సార్థకమై యున్నది. ఇరువురు, మూవురు మున్నగు చోటులలోని వకారము కేవలము స్వరసంహితలో వచ్చిన వ్యవధాయకవర్ణమె యనుటకుఁ దమిళ కర్ణాటములు ప్రబల సాక్షులై యున్నవి గదా.

బాలసరస్వత్యహోబలపండితులు పయిరీతిని జెప్పక "గసడదవాః స్యు" రిత్యాది సూత్రముచేఁ బ్రథమమీఁది పకారస్థానమున నాదేశముగ విధింపఁ బడిన వకారమును లఘువకారముగా నుదాహరించిరి. "ప్రథమాంతము మీఁద నున్న పకారమునకు వచ్చిన యాదేశ వకారము లఘు వకారము" (బాలసరస్వతీయము, లఘువోఽలఘువ ఇత్యాది సూత్రటీక).

"గసడదవాః స్యు రితి సూత్రేణ పస్య యో వకారః సోఽత్ర లఘు వ కారః.-సచ 'అతఁడు వలికె, నిత్యాదా' స్ఫుటః" (అహో ౧౪౮ పుట.)

( ఇట్లుచెప్పి 'గెలువన్ పిలువన్ చివురు' మున్నగు చోటులలోని యాదేశ వకారము నేల చెప్పరైరో తెలియకున్నది. )

అప్పకవియు నిట్టి ప్రథమమీఁది పకారస్థానమున వచ్చిన వకారమునె లఘువకారముగాఁ బయి చింతామణిసూత్రపు వివరణ సందర్భమున నుదాహరించెను.

తే. గీ. పొలుపడి నిల్చు లాఁతివా, ( ఇది కర్త ) ప్రాసమునకు
జాతివాకు సవర్ణమై శంక లేక
యతికిఁ బంచమ వర్గాద్య మగుటఁ జేసి
చెల్లును వకారమునకు లక్ష్మీశభుజంగ.

తే. గీ. అవని తనయునిచేతఁ బట్టువడి యున్న
పడుచుకొమ్మల హరి చెట్టవట్టి యేలెఁ
దవిలి పదియాఱువేవురు దమకుఁ దాము
మేలువాఁ డని తను నిచ్చ మెచ్చికొనఁగ.

తే. గీ. లాఁతి జాతికి వడికి నిల్వఁదగు ననుచు
సూత్రమునఁ జెప్పలే దని చూడ వలదు
నన్నయార్యుఁడు పంచమామ్నాయమునను
నిలుపు లక్ష్యంబులకు మాఱు వలుక వశమె.

(లాఁతివా = ఆదేశభూత లఘు వకారము. జాతివా = అలఘు వకారమనఁగా సహజ వకారము.)

"ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగ దోడనె పుట్టు నుత్తమ। జ్ఞానము...
(ఆది ౧ ఆ. ౧౫౭ ప.) (అప్పక. ౨ ఆ ౨౭౯–౨౫౨ ప.)

పయిపద్యములలో మొదటిపద్యము నాల్గవచరణములోని 'చెల్లును' అనుచో 'చెల్లదు' అనియు, మూఁడవపద్యము మొదటిచరణమునందలి 'తగు ననుచు' అనుచోట 'తగ దనుచు' అనియు నున్న ప్రామాదిక పాఠముల నాశ్రయించి యప్పకవీయ పీఠికా కర్త ( క్రీ. శ. ౧౯౨౭ వావిళ్ళ వారి ముద్రణము ) లచటి యప్పకవీయసందర్భము కేవలము నసంగతముగ నున్నదని వ్రాసియున్నారు. ( పీఠిక XII ) అట్టి పాఠములు లేఖకాది ప్రమాద కృతము లనుట కప్పకవి యిచ్చిన "పడుచుకొమ్మల హరి చెట్ట వట్టి యేలె" "భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టఁగ" అను నుదాహరణములె ప్రబల

నిదర్శనములై యున్నవి. అట్లే యప్పకవి యభేదవర్గయతి నంగీకరించి యుదాహరించిన తృతీయాశ్వాసమునందలి లక్ష్య లక్షణములును - [ అప్ప. 3. ఆ ౧౦౦-౨ ఆ. ౨౫౨ ప. ] ( క......పరమధ్యానో । పర తేంద్రియవృత్తి నున్నవాని శమీకున్. (ఆది. ౨ ఆ. ౧౭౨ ప.) క. కోరి యనేకయుగంబు లపారతపోయుక్తులై నవారికిఁ బడయన్.) [ అరణ్య. ౧ ఆ. ౩౭౧ ప.]- ప్రబల నిదర్శనములు కానోపును. పవర్గముతోడనే జాతివాకే మైత్రి యున్నపు డిఁక 'ప' కారజన్య మగు లాఁతివాకును జాతివాకును మైత్రియుండుట కైముత్య న్యాయసిద్ధము గదా. పీఠికాకర్త లప్పకవి యుదాహరించిన యభేద వర్గయతి యుదాహృతులలోఁ బాఠభేదములు గలవని పీఠికలో వ్రాసియుఁ దృతీయాశ్వాసమునందలి యీ సందర్భమున నట్టి పాఠ భేదములను జూపరైరి. మఱియుఁ బ్రాచీనకాలమున గ స డ ద వాదేశము నిత్యమై యుండుటంజేసి పీఠికాకర్తలు పవయతికై యుదాహరించిన "వేణి సరస్వతి పెన్నయైరావతి" అను సీసపద్యభాగమునందలి ( సభా. ౧ ఆ. ౭౧ ప. ) పెన్న యనుచోట "వెన్న" అనియే యుండఁదగి యుండుటచేత నది జాతివాకును లాఁతివాకును నన్నయచేసిన యతిమైత్రి కుదాహరణ మనఁదగును. కాఁగాఁ బీఠికాకర్తలు "ఉచ్చారణలో పవలకంటె లాఁతిజాతివాలకు మైత్రి యెక్కువగానే యున్నది. అయితే వీటిమైత్రి గల పద్యము నన్నయభారత మందు మాకు కనబడలేదు" అనుట సరికాదనక తీర కున్నది.

పై సందర్భముచొప్పునఁ బై నుదాహరించిన పాలుపడీత్యాది పద్యములలో నా చేసిన సవరణములు సంభావ్యములును, సుసంగతములును నగుటచే నవియే గ్రంథకృత్ప్రయుక్తములై యుండు ననుటకు సందేహము లేదు. ఇఁక నట్టిచో నపపాఠము లేల పడియుండునో యాలోచింపవలసి యున్నది.

లఘ్వలఘు వకారములకు యతిప్రాసములు రెంటను మైత్రి యున్న యెడలఁ బై పాలుపడీత్యాది పద్యమునందు వానిమైత్రిని వేర్వేఱ నుపదేశింపనేల యని యెవ్వరేని పాఠకులు శంకించుకొని యచటఁ బ్రాసమునకు మాత్రమె మైత్రి గల దనియు యతికి లే దనియు గ్రంథకర్తృహృదయమై యుండు నని సాహసించి దిద్ది పయి యపపాఠములను గల్పించి యుందు రని తోఁచుచున్నది. కాని యచట నట్లు యతిమైత్రిని వేఱుగను బ్రాసమైత్రిని వేఱుగను నప్పకవి "పాలుపడీ"త్యాది పద్యమునఁ జెప్పుటకుఁ గారణము లేక పోలేదు. పాలు పడీత్యాది పద్యసందర్భమునకు ముందటిభాగమున లఘ్వ

లఘు వకారముల వైరమునకు బ్రమాణములను జూపుచు నప్పకవి యీ క్రింది ప్రాచీన లక్షణగ్రంథపద్యముల నుదాహరించి యుండెను.

క. ... ... ...మరఱలవములను నేన
క్షరములు తమతమకె వళ్ళు కమలాధీశా. (కవిజనాశ్రయము.)

క. ధర నెక్కటి వళులై తగు
లరమఱవలు వానిలోఁ దొలంగక లాకున్
సరి ళా యని విశ్రమవే
ళ రమాధిప రెండునుం గలసి వర్తించున్. (అనంతుని ఛందము.)

క. లరమఱవ లేకతర వళు
లరయఁగఁ దమతమకె కవుల యనుమతి వళులై
పరఁగు... ... ... (కావ్యాలంకార చూడామణి.)
(అప్పక ౨ ఆ. ౨౩౬. ప. మొ ౨౩౯. ప. వ)

పై ప్రాచీనలక్షణ గ్రంథకర్త లవిమర్శితముగ వకారమునకు సైత మేకతరయతి నంగీకరించుట సరియై యుండలేదు. లాఁతివాకే కాక జాతి వాకు సయితము పవర్గముతోడి యతులు ధారాళముగా నన్నయ భారత భాగ మునసే వెలయుచున్నవి. అట్లగుటనే యప్పకవి యట్టి ప్రయోగములలోఁ గొన్ని యుదాహరించి యభేదవర్గయతి నంగీకరించినవాఁ డయ్యెను. (అప్పక 3 ఆ. ౯౮ ప. ౧౦౩ ప.) కావుననే "పొలుపడీ" త్యాది పద్యమున సంధి గతప్రాసమున కెవ్వరును బ్రతిఘటించియే యుండనందున "శంకయే లేక" జాతివాకును లాఁతివాకును మైత్రి ఘటిల్లు ననియు, నిఁక యతివిషయమున లఘు వకారముగా మాఱని పంచమ వర్గాద్య మగు పకారమునకే జాతివాతో యతి యుండుటంజేసి యట్టి పంచమ వర్గాద్యమూలక మగు లాఁతివాకు మైత్రి చెల్లుననుటయు విరుద్ధము కా దనియు వేఱ్వేఱఁ జెప్పియుండుట సుసంగతమై యున్నది. ఇఁక "నాన్యేషాం వైధర్మ్యే" మిత్యాది సూత్రము ప్రాసమైత్రిని మాత్రమె బోధించుచున్నదనియు జాతివాకును లాఁతివాకును యతి మైత్రియుఁ జెల్లు నని ప్రత్యేకముగఁ జింతామణిసూత్రము చెప్పమింజేసి వకారమున కేకతరయతి నంగీకరించెడి లక్షణకర్తల యనురోధమున యతి మైత్రి చెల్లఁదనియుఁ జెప్పరాదా యని శంకింపఁజన దనియు, యతిమైత్రిని నన్నయయే ప్రయోగించి యుండెననియు, "గీ॥ లాఁతిజాతికి" త్యాది

లక్షణ పద్యముతోడను, "ఉ. భూనుతకీర్తి" త్యాది లక్ష్యముతోడను నప్ప కవి వివరపఱిచి యున్నాఁడు. భూనుతకీర్తి త్యాదిపద్యమునందలి 'బ్రాహ్మణుఁడు వుట్టఁగ' అను చోటి లాఁతివాఁకును జాతివాఁకును నభిన్నమగు బవర్ణమును సంబంధించిన భవర్ణముతో యతిమైత్రి ప్రయుక్త మగుటంజేసి జాతివాతోడి యతిమైత్రి కైముత్యన్యాయసిద్ధమగుచున్నది గాన నీ లక్ష్యము సుప్రసక్తమై యున్నదనుటకు సందేహములేదు.

కాని యప్పకవిచెప్పిన చొప్పున నిట్టి వకారము లఘు వనుటలో యుక్తియేమియు నగపడదు. పకారము పరుషమేయైనను దజ్జన్య వకారమును బలుకుటలో సహజ వకారముకన్న లాఘవమేమియు నగపడదుగదా. స్వర సంహితలో నాగమముగ నిల్చు వకార మన్ననో యకార తుల్యన్యాయమునఁ బ్రాచీన కాలమందైనను లఘువుగా నుచ్చరింపఁబడెడి దనుకొనుటకుఁ గొంత యవకాశ మగపడుచున్నది. పకార వకారములు రెండును నోష్ఠ్యములే యగుటచేత, 'ప'కారముచోట వకారము వచ్చుచున్నదనియే చెప్పనగునుగాని యచట 'ప' కారలోపము కలుగఁగా నచటి స్వరసంహితలో వకారము నిల్చుచున్నదని చెప్పుట సరికాదు గదా. ఇఁక సంధ్యభావస్థితిలో 'ప' కారముగను సంధి వేళను వకారముగను నుండుటచేత నట్టి వకారమునకుఁ దక్కిన సహజ వకారములతో యతిప్రాసమైత్రి కుదురు పడుటకయి దీనిని లఘువుగా నంగీకరిచుట యావశ్యకమని చెప్పుటకును వీలులేదు. ఛందస్సంప్రదాయ సిద్ధ 'సంధి గతప్రాసాం' గీకారముచేతనే యాదేశసరళములతోపాటుగను నాదేశ సకారముతోపాటుగను దీనికి సహజవర్ణముతో యతిప్రాసమైత్రి సిద్ధించును గదా.

(౩౭౭)—లఘుత్వ ప్రతిపాదన చరిత్ర విషయమున యవలకును రలలకును జాల వైజాత్యము కలదు. స్వరసంహితలో నాగమములుగా వచ్చుట ద్రావిడభాషలలో లఘు యవలకు మాత్రమే కలదు గాని లఘు రలలకు లేదు. ఉచ్చారణమున లఘు యవలకువలెనె లఘు రలలకును స్థానకరణ స్పర్శశైథిల్యము తుల్యమయి యుండుటచేతను, యవలతోపాటు లరలును నంతస్థము లగుటచేతను నేకవిధమున వీనికి లఘుత్వము ప్రతిపాదింపఁబడినదేకాని వీని కీవిషయమున సాజాత్యము లేదు. స్వర సంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ నిలుచుటచే నప్రధానములై లఘుతరముగఁ బలుకఁబడునవి లఘుయవలు. అలఘు రలల యుచ్చారణమున

కన్నఁ దేలికయగు నుచ్చారణము గలిగిన కారణమున లఘువు లనఁబడుచున్నవి లఘు రలలు. అలఘు రలల యుచ్చారణమునందలి యలఘుత్వమునకుఁ గారణము లీ వఱకుఁ గొన్ని చూపఁబడినవి. ఇంకను ముస్ముందుఁ గొంతవఱకుఁ జూపఁబడును. అలఘు లకారోచ్చారణము ద్రావిడ మూర్ధన్య ళకార సంపర్కమున నేఁటికి లఘు లకారోచ్చారణముకన్న విజాతీయమై వెలయుచున్నది.

(3౭౮)—అట్లయినను నుచ్చారణ భేద మంతరించిన లఘ్వలఘు యకారములతోపాటుగ నుచ్చారణ భేదమగపడుచున్న లఘ్వలఘు లకారములకును సంస్కృత లాక్షణిక మతానురోధమునఁ గావలయును నన్నయ భట్టారకుఁడు యతిప్రాస సాధర్మ్యము నంగీకరించి యున్నాఁడు. సంస్కృతమున యతిప్రాస నియమము లేకున్నను, శ్లేషయమకాది శబ్దాలంకారములపట్ల లఘ్వలఘు లకారముల మైత్రి యంగీకరింపఁబడియున్నది.

"సకలకలం పుర మేత జ్జాతం సంప్రతి సుధాంశు బిమ్బమివ" (సాహిత్య దర్ప. ౧౦. పరి. ౭౭. కా.). పట్టనము కలకల ధ్వనులతోఁ గూడియున్నది. చంద్రబింబము సకలకళలతోఁ గూడియున్నది. కావునఁ బట్టనము చంద్రబింబమువలె నున్నదని యిందు నిర్వహింపఁబడెను. ఇచటఁ గలకల శబ్దములోని లఘు లకారమునకును (చంద్ర) కళాశబ్దములోని యలఘులకారమునకును నభేద మంగీకరింపఁబడినదనుటకు సందేహము లేదుగదా. ఇట్టి సంస్కృత మహాకవిప్రయోగముల నరసియే భోజరాజు కొన్ని వర్ణముల మైత్రి నీ క్రిందరీతిని వక్కాణించి యుండెను. 'తదుక్తం శ్రీభోజరాజేన' ('ఇచటఁ ద్రిభోజనే' యని శోంఠి భద్రాద్రి శాస్త్రిగారు ముద్రింపించుట సరికాదు. లిఖితమాతృకలలో 'శ్రీభోజరాజేన' అనియే యున్నది.)

రలయో ర్లడయో స్తద్వ। ల్లళయో శ్శసయో రపి।వబయో ర్నణయో శ్చాన్తే।
సవిస ర్గావిసర్గయోః। సబిన్దు కాబిన్దుకయోః। స్యా దభేదేన కల్పనమ్॥

(అహో. ౧3౭ పు.)

నన్నయభట్టు పై వర్ణముల జంటలకుఁ జాలవఱకు యతిమైత్రి నంగీకరించి యక్షరైక్యనియమముగల ప్రాసము విషయమునఁ బయివానిలో స్థానకరణ భేదములేని లఘ్వలఘు లకారములకు మాత్రమే మైత్రి నంగీకరించి యున్నాఁడు. మఱియు నలఘు లకారము చాలవఱకు ద్రావిడ మూర్ధన్య ళకారమువంటి యుచ్చారణము గలదియై యగుటచేత నుచ్చారణ సామ్య

ప్రయోజనకమగు ప్రాసవిషయమున లఘ్వలఘు లకారములతో ద్రావిడ మూర్ధన్య ళకారమునకును దంత్యతాలవ్య చజలకువలెనే మైత్రి నంగీకరించిన వాఁడయ్యెను. ఆ. వె. సెల్లుఁ డట్లు నేలఁ ద్రెళ్ళి చెచ్చెర లేచి...( భార. ఆది. ౨ ఆ. ౨౦౨ ప.)

ఇట్టి యభిప్రాయము గలవాఁడు కావుననే విభిన్నచరిత్రము గలదగుట చేతను స్థానకరణభేదము గలదగుటచేతను వర్ణాంతరముగఁ బేర్కొనఁబడినను ద్రావిడమూర్ధన్య ళకారమున కనఁగా వర్ణసమామ్నాయగత ళకారమునకు వేఱుగ లిపి నుపదేశింపక యలఘు లకార లిపితోనే గుఱుతింపఁబడుఁగాక యని తలంచిన వాఁడయ్యెను.

అప్పకవ్యాదులును బయిప్రయోగముల ననుసరించియే ల ళ లకు యతి ప్రాసమైత్రిని జెప్పియున్నారు.

తే॥ రేఫమునకు బైనుండు మాతృకకుఁ బెద్ద।
ళా యభేదాహ్వయ ప్రాసమై యెసంగు।
ఖలజనవిపక్ష జలరుహదళ నిభాక్ష।
కాళియోరగమద వనకేలి యనఁగ॥　　( అప్పక. 3 ఆ. 3౬3 ప. )

తే॥ పెద్దళాకును దనకు నభేదమగుట।
లళలకు నభేద మట్లను గల్గుకతన।
క్షితిని మూఁడవ సరళంబు యతులఁ బ్రాస।
ములను లఘ్వలఘు లకారములకు నిలుచు॥

( అప్పక. 3 ఆ. 3౬౫ ప. )

ఇట్లు చెప్పఁబడినను బ్రయోగములందు సాధారణముగా లకార విని మయార్థపదస్థ డకారమునకు మాత్రమె లళలతో యతిమైత్రి కవిప్రయోగ ములలో నగపడుచున్నది. కాని యీ క్రింది యనంతుని పద్యమునం దిట్టి నియమ మగపడదు.

క॥ కాకుస్వర యతియగు నితఁ। డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగఁ బ।
శ్నాకలిత దీర్ఘమున నితఁ।డే కవ్వడి రథము గడపె నిమ్ముల ననఁగన్॥
( అనంత - ఛందో॥ ౧ ఆ. ౭౫ ప. )

క॥ విరమణములక్కును బ్రాసా।
క్షరములకును ల ళ లు దొడ్డ సన్నము లను మ।

చ్చరము లెఱుంగక చెల్లును।
హరనుత ల ళ యో రభేద యను సూత్రమునన్॥

(అప్పక. ౨ ఆ. ౨౪౭ ప.)

పై రీతినున్న ప్రయోగముల చొప్పున యతిప్రాసమైత్రి యున్నంత మాత్రమున 'త్రెళ్ళు' మున్నగు శబ్దములలోని వర్ణసమామ్నాయ గత ద్రావిడ మూర్ధన్య ళకారమును సయితే మలఘు ళకారముగ నప్పక వ్యాదుల వలెఁ జెప్పుట నన్నయాభిప్రేతము కాదనియు, గోల గరలాది సంస్కృత శబ్దములలోని లకారమును 'ఊల్లు' 'కాల్లు' మున్నగు శబ్దములలోని లకారములను మాత్రమె యలఘు లకారము లనియు నీ వఱకు విశదీకరించి యున్నాను. (వి. ౧౮౭-౧౯౦-౧౯౩)

(౩౨౯)—కర్ణాటపండితు లీ విషయమున సంస్కృతము ననురోధించి యుండలేదు. వారు అటి కుళ ళుళములు మూఁడిటికిని ప్రాసమైత్రి నంగీకరింపలేదు.

"..(ఏవం) అటి కుళ ళుళ విభాగో విజ్ఞేయః ...కన్దవృత్తాది చ్ఛన్దో నిబద్ధప్రబన్ధేషు ప్రాసస్థానే యః ప్రథమం ప్రయుక్తః సఏవ సర్వత్ర ప్రయోక్తవ్య ఇత్యాగాతీయ మహాకవీనాం సంప్రదాయః" (కర్ణాటక శబ్దానుశాసన వ్యాఖ్య, మంజరీమకరందము, ౯౦ పుట) (అటి ళుళ కుళ స్వరూప మీవఱకు విశదీకరింపఁ బడియున్నది. (౧౯౩ వి.) వర్గాక్షరములకును బరస్పర ప్రాసమైత్రి నంగీకరించియుఁ గర్ణాట పండితులు వీని కిట్లంగీకరింపమి సరి కాదని తలంచి సంస్కృత లాక్షణిక మార్గమునె నన్నయభట్టు పాటించుట యుక్తమె యనఁదగి యున్నది.

కాఁగా ళుళము లనఁదగు గోల గరలాది శబ్దములలోని లఘు లకార మూలక సాంస్కృతికాలఘు లకారములును, ఊల్లు, (ఊళ్ళు) మున్నగు బహువచనరూపములందలి లఘులకార మూలకము లె యగు నాచ్ఛి కాలఘులకారములును అటిములనఁ దగు డకార టకారాది మూలకములగు నాచ్ఛికమూర్ధన్య ళకారములును 'కుళము' లనఁదగు నాచ్ఛికసహజ మూర్ధన్య ళకారములును, దెనుఁగున నించుమించుగా నిపు డేకవిధముననే పలుకఁబడుచున్నవి. అవి యేక విధమెయగు 'ళ్' అను లిపితోనే వ్రాయఁబడుచున్నవి. వాని కన్నింటికిని యతి ప్రాసమైత్రి నన్నయభట్టారకునిచేత నంగీకరింపఁబడెనని యీవఱకే వ్రాసి

యున్నాను. పైని వ్రాసిన నాల్గు విధములలోను దృతీయ చతుర్థ విధములగు నాచ్ఛిక మూర్ధన్య ద్రావిడ ళకారవిశిష్టాచ్ఛిక శబ్దములు శబ్దరత్నాకర కోశమున ననేకములు చూపఁబడియున్నవి. వాని నెల్ల గ్రంథవిస్తరశంకచే నుదాహరింప మాని యిచట భాషాంతర సంబంధముగల కొన్ని శబ్దములను మాత్రమే చూపుచున్నాను.

"పలువగ కొడున్దమిఴ్ గళ్ ఉణ్డాయిరున్నదిల్ ఒన్నాణం నమ్ముడె మల యాళ మాయిత్తీన్నఽదు" (ఏ. ఆర్. రాజరాజవర్మకృత కేరళపాణినీయము. పీఠిక, ౫ పుట.

తమిఴముయొక్క వివిధములగు నపభ్రష్టములలో (కొడున్దమిఴ్) నొక టియే మలయాళ భాషయని పయివాక్యమున కర్థము. దీని ననుసరించి తెల్గు నకుఁ గర్ణాటముతోను దమిఴముతోను సంబంధమును జూపినం జాలునని తలఁచి యీ గ్రంథమునందు సాధారణముగా నాంధ్రశబ్దములకుఁ దమిఴ కర్ణాటములతోడి సంబంధమును మాత్రము చూపుచు వచ్చితిని :—

| తెలుఁగు | అర్థము. | తమిళము. | కన్నడము. |
| --- | --- | --- | --- |
| వై. అప్పళించు | చఱచు ( ఆస్ఫాలించు. ప్ర ) | అప్పళి | అప్పళిసు |
| వై. అరిదళము | హరితాళము ( ప్ర ) | అరితార | అరిదళం |
| అవఘళము | అతిశయము | ... | అవగళియం (అతిక్రాంతము) |
| వై. అళఁది | హారిద్రావర్ణము ( హారిద్ర. ప్ర ) | .. | హాళది |
| అళము | ఉప్పుచోటు | అళమ్ | ... |
| అళుకు | భయము | ... | అఱ్కు = జీర్ణించు |
| ఆళువారు | హరిభక్తుఁడు | ఆళ్వార్ | ఆళ్వార్ = నిమగ్నుఁడు, (ఆళ్ = నిమజ్జించు) |
| ఉంబళి | పన్ను లేనిది ( దుంబాళా, వాడుక ) | ఉమ్బళమ్ | ఉంబళి = భూదానము |
| వై. ఉక్కళము | పురాభిముఖ రాజమార్గము ( ఉప నిష్కురమ్ ) | ఉల్కు | ఉక్కడం = శుల్కఘట్టము |
| ఉప్పళము | లవణ జన్మస్థానము | ఉప్పు+అళమ్ = ఉప్పళమ్ | ... |
| ఊళ | నక్కకూఁత | ఊళై (నవ్యశబ్దము) | ఊళ్ |
| ఎళ్ళు | ఎద్దులు | ఎట్తుగళ్ | ఎరుదుగళ్ |
| వై. ఏరాళము | విస్తారము ( ప్ర. హేరాళము ) | ... | ... |
| ఒళవరి | మర్మజ్ఞుఁడు | ఉళవటి (అటి = తెలియు) | ఉళవటి (అఱ్ = తెలియు) |
| వై. కంబళి | కంబళము ( ప్ర ) | ... | ... |

| తెలుఁగు. | అర్థము. | తమిళము. | కన్నడము. |
|---|---|---|---|
| కప్పతాళము | ముద్దబీగము | తాళ్ | తాళ్ |
| కళ | ఉపశాఖ | కిళై = చిన్నకొమ్మ, బందుగులు | ... |
| వై. కళంకు | (కళంకము. (ప) కాలుష్యము, మచ్చ (ఇది శబ్దరత్నాకరమున లేదు) | కళఙ్కమ్ (తత్సమ మనఁదగు) | .. |
| కళవళించు | తొట్రువడు. సంభ్రమించు. క్షోభపడు | కలవరమ్ = కలహము | కళవళిసు = దుఃఖించు |
| వై. కళ్ళియము | ఖలీనము (ప) | కళివాళమ్ | కడివాణం = కీఙ్ |
| కళ్లెము, కళ్యము | | | |
| వై. కళ్ళము | ఖలము (ప). | కళమ్ | కళ |
| వై. కాళంజి | కలాచి (ప). పతద్గ్రిహము. | కాళాఞ్జి | కాళంజి |
| వై. కాళియ | వాద్యవిశేషము (ప. కాహాళము) | ... | కాళె |
| వై. కుళాయి | తలపాగా (ప. ఖోలకము) | ... | ... |
| వై. కువాళము | కపటము (ప. కువాట(ద)ము | ... | ... |
| కూళ | కుచ్చితుఁడు | కూతె = పొట్టిది. కూళన్ = [కుచ్చితుఁడు] | ఖూళం |
| వై. కేళాకూళి | ఔత్ ఖానా (ప. ఖేలాకూలము) | ... | ... |
| గంగాళము | నీళ్ళకొప్పెర | గఙ్గళమ్ | కంగాళమ్ |
| వై. గళకత్తెర, | మల్లబంధ విశేషము (ప. గలకర్తరి) | ... | ... |

| తెలుఁగు. | అర్థము. | తమిళము. | కన్నడము. |
|---|---|---|---|
| గళ = కళ్ళ | కఫముముద్ద | సళి | ... |
| గుప్పళించు } | పుక్కిలించు, బట్టలు ఉసుము | కొప్పుళి - కొప్పళి | ముక్కుళిసు |
| గుబాళించు } | వాసనకొట్టు | | |
| వై. గుళిగ, (గుళిక) | ఘుటిక ( ప్ర ) | కుళిగై - కుళిగ్గై | గుళిగె |
| వై. గొంగళి | కంబళ ( ప్ర ) | ... | ... |
| చిలుకతాళి | చిల్కరూపు పదకము | తాలి | తాళి |
| వై. జమళిగ | చర్మవాద్య విశేషము ( ప్ర. యమలిక) | ... | ... |
| జళిపించు | జడియఁజేయు | ... | ఝళిపిసు |
| జాళించు | జాడించు | ... | ఝాడిసు |
| తంబళ | శివార్చకజాతి | తమిళ్ | తమ్మడి |
| తళిగ = తళియ | భోజనపాత్రము | తళిగై | తణిగె |
| తళుకు | కాంతి | తళుకు = కాంతి. చాతుర్యము | తళుకు = జాలారు |
| తావళము } | హారము | తాళ్వడమ్ (నవ్య) | ... |
| తావడము } | | | |
| తాళము | మల్లబంధవిశేషము | తాళ్ | తాళ్ (హరాస) |
| తాళిక | ఓర్పు | తాళ్ = వహించు | తాళ్ = ధరించు |
| తాళు | సహించు | తాళ్ = వహించు | తాళ్ = ధరించు |

| తెలుఁగు. | అర్థము. | తఱిమిము. | కన్నడము. |
|---|---|---|---|
| వై. తోళసి | తులశి ( ప్ర ) | తుటాయ్, తుళచి | తోఁణచి |
| త్రుళ్ళు | ఎగిరపడు | తుళ్ | ... |
| వై. దళవాయి | సేనాపతి ( ప్ర. దళవాహి ) | దళవాయ్ | దళవాయ్ |
| వై. దాళిమ్మ | దాడిమము ( ప్ర ) | ... | దాళింబం |
| దువాళము | అశ్వగతివిశేషము | ... | దువ్వాళిసు = అశ్వము ధారా [గతిని నడచు |
| వై. దేవళము | దేవాలయము ( ప్ర ) | ... | .. |
| వై. నిమ్మళము | నిశ్చింతము ( నిర్మలము. ప్ర. ) | ... | ... [ళించు |
| నివ్వాళి | ఆరతి | ... | నివాళిసు - నీవాళిసు = నివా |
| నేపాళము | వృక్షవిశేషము | నేర్వాళమ్ | జాపాళం |
| పవ్వళించు | పవ్వడించు | ... | పవడిసు. |
| వై. పళ్ళెరము - పళ్ళెము. పళ్యము. | భోజనపాత్రము | వళ్ళమ్ | బళ్ళం = మానవిశేషము |
| పాళ | పూగుత్తి, కుహాళి | పాళై = గెల. | పాళె |
| వై. పాళము | విధము. సమయము ( ప్ర. ఫారము ) | ... | ... [చోటు |
| పాళెము | రాజధాని. దండుకావలి | పాళైయమ్. | పాళెయం = దండువిడియు |
| పిళ్ళ | అఱవల బిరుదు నామము | పిళ్ళై = ప్రధానుఁడు | ... |

| తెలుఁగు | అర్థము. | తమిళము. | కన్నడము. |
|---|---|---|---|
| పిళ్ళారి. | వినాయకుఁడు | పిళ్ళైయార్ = (కుమారస్వామి) వినాయకుఁడు | ... |
| వై. పుత్తడి | పుత్తడి (ప్ర. పుత్తళిక) బంగారు. | ... | ... |
| వై. పోళీ | బొబ్బట్టు (ప్ర. పోళిక) | ... | పోళిగె |
| వై. బంగాళము | వంగదేశము (ప్ర. వంగము) | ... | బంగాళమ్ (వంగ+అళమ్) |
| బత్తళిక | అమ్ములపొది | ... | బత్తళికె |
| బెళకు | చలించు | ... | బళుకు=వంగు. నమస్కరించు |
| బెళగు / బెళుకు | ఒప్పిదము, బెడఁగు, ప్రకాశించు | విళఙ్గు = ప్రకాశించు | బెళగు = ప్రకాశించు |
| బోళము | గంధరసము (ప్ర. బోలము) | ... | ... |
| వై. మంగళారతి | మంగళహారతి (ప్ర. మంగళారాత్రిక[ము) | | ... |
| వై. మళిగ | చిల్లరదుకాణము (ప్ర. మఠిక) | మళిగై | మళిగె |
| మళ్ళు | మరలు | ... | మరళ్ |
| వై. మాళిగ | మాడుగు (ప్ర. మాలిక) | | ... |
| వై. మేళము | వాద్యములమొత్తము (మేళనము. ప్ర) | మేళమ్ | మేళం |
| వై. రవళి | రవము (ప్ర.) ధ్వని. | ... | రవళి |
| వై. రొదాళము | ధ్వని (ప్ర. రుతము) | | |

| తెలుఁగు. | అర్థము. | తమిళము. | కన్నడము. |
|---|---|---|---|
| లాళము. | లాడము. గుజ్జుపుగిట్టకుఁ గొట్టు నినుపరేకు | లాడమ్ (నవ్య) | లాళం (హళస) |
| వై. వక్కళించు | మాఱుమలయు (ప్ర. వక్రించు.) | ... | ... |
| వక్కరించు | | | |
| వై. వయ్యాళి (వాహ్యాళి) | విహారము | వైయాళి | వయ్యాళి |
| వాయివిళంగము | వాయివిడంగము, క్రిమిఘ్నము | వాయ్విళఙ్గమ్ | వాయువిళంగం |
| వై. సంబళము | దారిబత్తెము (ప్ర. శంబలము) | సమ్బళమ్ | సంబళం |
| సంబళిక | అడపము (ప్ర. సంపుటము) | సమ్బుడమ్ = కరాటము | సంబళిగె |
| వై. సంబెళ | | | |
| వై. సంబాళించు | ఆదరించు ప్ర. సంభావించు | ... | ... |
| వై. సన్నగాళె | వాద్యవిశేషము (ప్ర. సంజ్ఞాకాహళము) | ... | సన్నెగాళె |
| సబళము | ఆయుధవిశేషము | చవళమ్ | సబళం |
| సళించు | దుఃఖించు | సలి = శ్రమించు | ... |
| వై. సళ్ళు | సడలు (ప్ర. శిథిలము) వదులగు | ... | సడిలం = శిథిలము |

(౩౮౦)—లళ సమాన న్యాయమున ర ఱ లకును యతిప్రాసమైత్రి నంగీకరించుటయె న్యాయమై యున్నను "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అని యిట్లు వానికి యతిప్రాస వైరమును సూత్రించుట విరుద్ధముకాదు. లళలమైత్రి నంగీకరించుటకు సంస్కృత పండిత ప్రయుక్త లక్ష్యలక్షణములు మూలములై యుండెనని యీవఱకు విశదీకరించియె యున్నాను. ఇంక రేఫఱకారముల మైత్రి నంగీకరించుట కట్టి యాధారము లెవ్వియు లేవు. సరేకదా రేఫఱకార వైరము నన్నయభట్టు నాఁటికి గ్రాంథికతావస్థ నందియున్న తోడి ద్రావిడ భాషలగు తమిఱు కర్ణాట ములలోఁ బ్రసిద్ధమై యుండెను. శకటము కేవల ద్రావిడభాషా గతమగుటచే నద్దాని విషయమున నావఱకు వెలసియున్న తమిఱు కర్ణాటపండితుల ప్రయోగములను బ్రమాణీకరింపకుండుట యుక్తముకాదుగదా. మఱియుఁ బ్రాచీన చరిత్రము నరసినపుడు ర ఱ లవంటి వైజాత్యము తక్కిన యంతస్థ లఘ్వలఘువులకు లేదు.

(౩౮౧)—ర ఱ లకుఁ బ్రాచీనకాలమున నుచ్చారణమునం దత్యంత వైలక్షణ్య ముండెడిది. (ఱకారము టత మధ్యస్థోచ్చారణము గల్గియుండెడిది) కావుననె యితర ద్రావిడభాషలగు పఱగన్నడమునందును దమిఱమునందును బ్రాచీనవాఙ్మయమున (తమిఱమున యతిప్రాస నియమము నారంభించినది మొదలు) వీనికి యతిప్రాసమైత్రి లేకుండెడిది-కావుననె తెనుఁగున నన్నయ భట్టారకుఁడును నట్లె వానికి నిత్య వైధర్మ్యమును 'రయోస్తు నిత్యం స్యా' త్తను సూత్రముచే నుగ్గడించి యున్నాఁడు.

(౩౮౨)—తమిఱభాషలో శకటద్విత్వము ద్విరుక్త ట కారమువలెఁ నేఁటికిని బలుకఁబడుచున్నది. దీనినిబట్టి యద్విరుక్త శకటోచ్చారణమునందును బ్రాచీనకాలమున 'టకార' ధ్వన్యావేశ ముండెడిదనియు నది యితర ద్రావిడ భాషాభేదములలో నంతరించినను దమిఱమున ద్విత్వావస్థలో మాత్రము నిలిచి యున్నదనియు నూహింపఁదగి యున్నది. కావుననె శకటవిశిష్ట ధాతువులనుండి పుట్టిన కృదంతాది రూపములందును, శకట రేఫ సంధులలోను శకటాంత నామముల విభక్తి మేళనమందును, దెలుఁగునను దమిఱమునను 'టకారము' పుట్టుట తటస్థించుచున్నది. ఉదా. తెల్గున:—ఊఱు—ఊట; చిఱు + ఎలుక = చిట్టెలుక ; కుఱు + ఉసురు = కుట్టుసురు. ఏఱు—ఏటికి. తమిఱమున :—కూఱు (చెప్పు.) కూఱ్ఱు= ('కూట్టు' అని పలికెదరు) (మాట).

ఊఱు ( నీరూఱు, ) ఊట్ఱు = ( ఉచ్చారణము—ఊట్టు ) ( ఊట ). ఆఱు ( నది ) ఆట్ఱై=( 'ఆట్టై' అని యుచ్చరింపవలెను ) (నదిని). ఆట్ఱునీర్=( 'ఆట్టు నీర్' అనవలె ) ( ఏటినీరు ). పెఱు (ప్రసవించు) పెట్ఱ=( = 'పెట్ట' అనవలెను ) ( ప్రసవించిన ). కుట్ఱి=('కుట్టి' అనవలెను ) ( పొట్టి మొలక ). చిఱు+ఎలి= చిట్ఱెలి=( 'చిట్టెలి' అనవలెను ) ( చిట్టెలుక ). కుఱు+ఉయిర్=కుట్ఱుయిర్= ( కుట్టుయిర్' అనవలయును ) ( హ్రస్వాచ్చు.)

ప్రాచీన కర్ణాటభాషలో 'గిఱ్ఱనె, తిఱ్ఱనె' అను రెండు శబ్దములందు మాత్రమె ద్విరుక్తశకటము గలదు. మఱెచ్చటను ద్విరుక్తశకటమే లేకున్నను నది యుండఁదగినచోట ద్విరుక్త తకారరూపము వెలయుచుండును. ఉదా. గిఱు ( భావించు ). గిఱు+తమ్=గెత్తమ్ = ( భావించెను. ) కిఱు= ( వ్యవధానమగు ) - కిఱు + తమ్ = కిత్తమ్. కిఱు + ఒడి = కిత్తొడి ( వ్రతి ); కిఱిదు—కిఱు+ఎసళ్=కుత్తెసళ్=(చిన్నపూవు, దళము).

(3౮3) తమిళ వాఙ్మయమునఁ బ్రాచీన మహాకవులు త్తఱ్ఱలకును, క్క—చ్చలకును, ట్టత్తలకును బ్రాస మైత్రి నంగీకరించిరే కాని రేఫ ఱకారములకుఁ బ్రాసమైత్రి నంగీకరింపరైరి. అట్లె కర్ణాట లాక్షణికులును వర్గ ప్రాసము నంగీకరించిరేకాని ర ఱ ల ప్రాసము నంగీకరింపరైరి. ఆంధ్రమునందును, " థ ధలు, ఋ రలు, సంయుతా సంయుతములు, ళళలు,ంబ మ్ములు" మున్నగువానికిఁ బ్రాసమైత్రి యంగీకరింపఁబడెనే కాని గతానుగతికముగా రేఫఱకార మైత్రి యంగీకరింపఁబడదయ్యె. కోశకర్తలు శకటములతోనె, యఱ్ఱెయ్య శబ్దముల నుదాహరించుచున్నారు. లాక్షణికులు రేఫ ఱకారయుత శబ్దముల పట్టికలనే యేర్చి కూర్చి యున్నారు. ఇంతయేల ! సామాన్య గ్రంథకర్తలు సైత మనఁగా రేఫఱకారముల తత్త్వమును సరిగాఁ దెలియనివారు సైతము తప్పులుగనో యొప్పులుగనో తమ గ్రంథములందు శకటములను నిల్పుచునే యున్నారు. ఇంకఁ గొందఱాంధ్ర లాక్షణికులు, వీని భేదమును బాటింపని వారి నీక్రిందిరీతిని నిరాకరించియు నున్నారు.

తే. గీ. జ్ఞాతి వైరంబు నొంది ప్రాసంబులందు,
విశ్రమములందుఁ దమలోన వేఱుగలిగి,
దేవ దానవులట్లన తెనుఁగు లందు,
మించి రేఫ ఱకారముల్ మెలఁగుఁ గృష్ణ.

( అప్పకవీయము. ౨ ఆ. ౨౫ ప. )

క. బ్రమయక రేఫములకు గే,
ఫములను ఱాలకును ఱాలఁ బ్రాసములను వి,
శ్రమములను జెప్పఁదగు నీ,
క్రమ మెఱుఁగక రెంటనుం గుకవి గూర్చుఁ గృతిన్.
(అప్పక. ౨ ఆ. ౨౩౦ ప. )

తే. గీ. చెల్లునని ముందు భీమన చెప్పెననుచుఁ,
గలుపుదురు రేఫములును అకారములును,
దుష్టకవు లవి యొకటైనఁ దొంటిపెద్ద,
లందఱును నేల విభజింతు రని తెలియరు. (అప్ప. ౨. ఆ. ౨౩౨)

ఆ. వె. ఎన్నిలక్షణంబు లెఱిఁగిన రేఫలు, బండిఱాలు నెఱుఁగకుండి నట్టిఁ
కవి కవిత్వమెల్ల గవ్వకుఁ గొఱగాక, కొఱఁతఁ జెందు, రజత కుధర నిలయ.

గీ. దేవదానవులట్లు విద్వేష మెపుడుఁ,
గలిగియుండును రేఫ అకారములకు,
నట్లుగావున నవి గలియంగ నీక,
కావ్యములఁ గూర్పవలయు సత్కవు లెఱింగి.

క. నన్నయ భట్టాదులు కృతు, ల న్నిలిపిన లక్ష్యములును లక్షణము లెఱుం,
గ న్నేరక యిది కల్లని, యెన్నుదు రొక కొందఱందు కేమియనఁ జనున్.
(సర్వలక్షణ సారసంగ్రహము ౨ ఆ. - ౭౮ ప.)

ద్రావిడ భాషలలోని రేఫ అకారముల యుచ్చారణములు ప్రాచీన కాలమున వెనుక నుదాహరించిన రీతిని గేవలము విలక్షణములై యుండుటం జేసి ప్రాచీన ద్రావిడభాషా పండిత కవులు, కవితా వనితకు మట్టియలు మంగళసూత్రంబును బలె నిత్యముగ నుండఁదగిన శబ్దాలంకారములె యనఁ దగు యతి ప్రాసములలో వానికి మైత్రి నంగీకరింపరైరి. అంత కంత కట్టి యుచ్చారణ భేద మాంధ్రమున సడలిపోయినను గతానుగతికముగా రేఫ అ కార మైత్రి నింద్యముగనె లాక్షణికులచే నిరసింపఁబడుచు వచ్చెను. తమిళమునందును నద్విరుక్త శకటోచ్చారణమున 'ట' కారావేశము చిరకాలము క్రిందటనే మాసిపోయినది.

(౩౮౪)—పరిశీలింపఁగా నన్నయభట్టారకుని కాలమునాఁటికె రేఫద్వయోచ్చారణ భేదమునకుఁ బ్రబలనిదర్శన మనఁదగు శకటోచ్చారణమునందలి

'ట' కారావేశము పూర్తిగ మాసెనని తోఁచకపోదు. స్థానకరణములకు శకటోచ్చారణమున శైథిల్యాభావమును రేఫోచ్చారణమున శైథిల్యమును మాత్రమే యప్పటి కుండుటంజేసి యాతఁడు వానికి లఘ్వలఘుతా మాత్రభేదము నంగీకరించి వర్ణసమామ్నాయమున నేకాక్షరముగఁ బఠించెను. లఘ్వలఘువులను భిన్నాక్షరములుగాఁ బఠించుట సంస్కృత వ్యాకరణ సంప్రదాయము కామింజేసియుఁ దమిళ కర్ణాటములలో లఘ్వలఘుతాంగీకార పద్ధతియే లేమింజేసియు నీ విషమున వర్ణసమామ్నాయమున వేఱుగఁ బఠించెడి తమిళ కర్ణాట సంప్రదాయము నుపేక్షించినవాఁ డయ్యెను. "వ్యో ర్లఘు ప్రయత్నతర శ్శాకటాయనస్య" అను పాణిని సూత్రమునందలి "వ్యోః" అను దానిచేతనే లఘుయకార వకారములును నలఘుయకార వకారములును జెప్పఁబడియుండుటఁజేసి రేఫఱకారముల ద్వంద్వములో నేకశేషమును సైతము నంగీకరించి "రయో స్తు నిత్యం స్యాత్" అని సూత్రించినవాఁ డయ్యెను. అట్లయినఁ దక్కిన లఘ్వలఘువులకు వలెనే వీనికిని యతిప్రాసాదిమైత్రి నేల యంగీకరింపలేదని శంకింపఁ జనదు. సంస్కృతమున యవలకే కాక ల ళ లకును వెనుక నుదాహరించినరీతిని (వి. 3౭౮) నభేదము ప్రసిద్ధమై యుండుటంజేసి తదనుసారముగ వాని యతిప్రాసాదిమైత్రి యంగీకరింపఁబడెను. రేఫఱకార భేద మన్ననో సంస్కృతభాషాగతము కాక ద్రావిడ భాషామాత్ర ప్రసిద్ధమగుటంజేసి తమిళ కర్ణాట మహాకవి మార్గముననే తానును వాని వైరమును సూత్రించి తన భారత భాగమునం దవ్యభిచరితముగ దానిని బాటించినవాఁడయ్యెను. ఇదియే చింతామణి నన్నయ కర్తృకమనుటకుఁ బ్రబల నిదర్శనము.

(3౮౫)—అథర్వణాచార్యుని కాలమునాఁటికి రేఫ ఱకారముల లఘ్వలఘూచ్చారణ భేదమును సడలనారంభించి యుండుటచేతను, వానికి యతిప్రాసాదిమైత్రియే యనఁదగు కొన్ని శబ్దముల ద్వైరూప్య మవతరించుటచేతను నాతఁడు రేఫ ఱకారముల భేదము మున్ముందటివారు గ్రహించుట కాధారముగఁ (ఉచ్చారణ భేదమంతరించినదిగాన) గొన్ని విషయములను నన్నయానుయాయియై సూత్రింప సాగెను.

(3౮౬)—అప్పటికి వెలసియున్న యాంధ్రవాఙ్మయమున నొక్క నన్నయభట్టారకుని భారత భాగమందు మాత్రమె రేఫ ఱకారములకు యతిప్రాసమైత్రి లేకుండుట శుద్ధముగ నుండుటంబట్టి కావలయు నాతఁడు నన్నయ

భారత భాగమును మాత్రము ప్రమాణీకరించి వక్ష్యమాణములగు "క్రియాంత" ఇత్యాద్యనుగమములను రేఫ ఱకారముల విషయమున నుపదేశించెను. పరిశీలింపఁగా నన్నయభట్టు శకటములనెల్ల యతిప్రాసములలో బంధించు నియమమును జేసికొనియుండమింజేసి యాతని పద్యములందలి యతిప్రాసములలో నున్నవి మాత్రమె శకటయుత పదములని నిశ్చయించుట యుక్తము కాకున్నను గత్యంతరము లేమింజేసి దిక్ప్రదర్శనార్థముగఁ దావన్మాత్రమునే మూలముగఁగొని సూత్రించెనని గ్రహింపవలెను. ఇంతియకాక నన్నయేతర మహాకవుల పద్యములలోని యతిప్రాసస్థలములకుఁ బ్రామాణ్యము నంగీకరించి నన్నయ ప్రయోగములలో లేనివానిని గ్రహించుటయేకాక రఱల లాఘవ గౌరవముల వ్యత్యాసమును సైతమంగీకరింపవలయు ననుచు 'లఘుర్భవే ద్గురుః క్వచి' దిత్యాదికారికను సయితముపదేశించి యున్నాఁడు.

(౩౮౭)—కొందఱీవిషయమునఁ బ్రాచీనశాసన లేఖనమును బ్రమాణీకరింప నిచ్ఛగించుచున్నారు గాని యదిసరికాదు. శాసనభాషను సాకల్యముగ నన్నయభట్టాదులు కావ్యభాషగా నంగీకరించి యుండలేదు. ఆ విషయ మటుండఁగా రేఫఱకారముల విషయమునందుసైతము శాసనలేఖనమునకుఁ బ్రామాణ్య మంగీకరింపఁబడలేదు. నన్నయభట్టుకన్నఁ గేవలము ప్రాచీనమగు యుద్ధమల్లుని మధ్యాక్కరల బెజవాడశాసనములో "పాపంబుగొణ్ఱు" అనుచోఁ గ్రియాప్రత్యయము శకటముగా వ్రాయఁబడియున్నది. అట్లె 'చేబ్ఱోలు' అనుచోటి రావడి యొకచోట శకటముగాను మఱొకచోట రావడిగాను బైశాసనమునందే యున్నది. పండరంగుని యద్దంకి శాసనములోని తరువోజ పద్యములో 'కొట్టంబు ల్వణ్ఱెండు' అని యిట్లు రెండు శబ్దములోని రేఫము సంయోగమున శకటముగా వ్రాయఁబడి యున్నది. ఇట్టి ప్రయోగములు నన్నయ ప్రయోగ సమ్మతములు కావనియు వాని నెవ్వరును సంగీకరింపఁ జాలరనియుఁ జెప్పుటకు సందేహలేదుగదా.

(౩౮౮)— అధర్వణాచార్యునికిఁ దర్వాతి కొందఱు లాక్షణికులు సైతము ప్రాచీనాంధ్ర మహాకవులను మాత్రమె యీవిషయమునఁ బ్రమాణీకరించుచు వచ్చిరిగాని తమ తమ కాలములవఱకును గల యెల్లమహాకవులను బ్రమాణీకరించి యుండలేదు.

తే. గీ. ప్రకృతి శబ్దానుశాసనోభయకవిసఖ,
శంభుసేవక సోమ భాస్కరులచేత,
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లిఁ,
గరివరద రేఫములును అకారములును. (అప్పక. ౨ ఆ. ౧౯౫ ప.)

క. తెలిపితి నన్నయభట్టా,
దుల కావ్యములందు నాకు దొరకిన రేఫం,
బులు ఱాలు మఱియు నెందులఁ,
గలిగినఁ దగదనక యవియుఁ గైకొను టొప్పున్.
(అప్పక. ౨. ఆ. ౨౧౭ ప.)

పయి సందర్భమునుబట్టి పదునేడవ శతాబ్దములోని వాఁడయ్యు నప్ప కవి పదునాల్గవ శతాబ్దమువఱకుఁ గల కవులను మాత్రమె ప్రమాణీకరించి రేఫ అకార నిర్ణయ సీసములను జెప్పెనని విశదమగుచున్నది గదా. అప్పకవి తాను జూపిన రేఫ అకారముల పట్టికలకు దిఙ్మాత్రముగ నుదాహరణము లిచ్చుటలోఁ సైతము పదునాల్గవ శతాబ్దమువఱకుఁ గల కవుల గ్రంథముల నుండి మాత్రమె యుదాహరించి యున్నాఁడు. దీనినిబట్టి పదునాల్గవ శతా బ్దము తుదికే రేఫ అకారోచ్చారణ భేదము పూర్తిగా నశించెనని యప్పకవి తలంచినట్లు విశదమగుచున్నదిగదా. ఇంకఁ దర్వాతికవులు పూర్వ పూర్వ కవుల ప్రయోగములను జూచుకొని రేఫఅకారములను బ్రయోగించుచు వచ్చుటచేత వారి ప్రయోగములకుఁ బ్రామాణ్యము నంగీకరింప వలసి యున్నదని యీ క్రిందిరీతిని జెప్పియున్నాఁడు :—

క. తొలుతటి వారలు వాడని,
తెలుఁగుల పలుకులకుఁ గల ద్వితీయాంతస్థం,
బులు గూర్పరు తద్భేదం,
బులు దెలియమి బుధులు ప్రాసములకు యతులకున్.
(అప్పక. ౨ ఆ. ౨౧౮ ప.)

పయి యభిప్రాయమునుబట్టియే కావలయును నర్వాచీనులగు కూచిమంచి తిమ్మకవి ప్రభృతులచే శ్రీనాథాది సుప్రసిద్ధ మహాకవుల గ్రంథ ములనుండియు నుదాహరణము లీయఁబడియున్నవి. అట్లయినను దిమ్మకవి

కొన్నిచోట్ల వారు రేఫ అకార సాంకర్యమును జేసిరని యాక్షేపించి యుదాహ రించి యున్నాఁడు.

" క. అలసానిపెద్దకవి పిం,గళి సూరన రామభద్రకవి వర్యుఁడు పి,
ల్లలమఱ్ఱి వీరభద్రుఁడుఁ, గలిపిరి గద కృతుల ఱాలఁ గడురేఫములన్.
( సర్వలక్ష. 3 ఆ. ౨౪౫ ప. )

పెద్దన రేఫ అకారములం గలుపుటకు

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షులు ...
( మనుచరిత్రము, సర్వలక్ష. 3 ఆ. ౨౪౯ ప. )

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

వ. ఇటువలెనే మహాకవులకును రేఫ అకారములపట్ల పరిశీలనము లేకపోయినది. " ( సర్వలక్ష. 3 ఆ. ౨౬౧ )

(౩౮౯)—తిమ్మకవియును బెద్దనాదుల ప్రయోగములనుబట్టి కొన్ని శబ్దములకు రేఫ అకార ద్వైరూప్యము నంగీకరించియు నిట్లు చెప్పుట నర యఁగా నీతఁ డప్పకవి చెప్పిన నన్నయాది ప్రాచీనమహాకవి ప్రయోగములకు విరుద్ధములు కానంతవఱకే మధ్యయుగ కవుల ప్రయోగముల కీ విషయమునఁ బ్రామాణ్యము నంగీకరించెనని తోఁచుచున్నది. అట్లయినను మహాకవిగా నంగీకరించిన పిదప నాతని నొకవిషయమునఁ బ్రమాణీకరించుటయు వేఱొక విషయమునఁ బ్రమాణీకరింపకుండుటయు సరికాదింకఁజేసి యట్టి పెద్దనాది ప్రయోగముల ప్రామాణ్యమున 'పాఱు' ప్రభృతిశబ్దములందలి శకటస్థితికి నైతము తిక్కనాదులు ప్రయోగించిన కొన్ని స్థలములందలి శకటస్థితికివలెనే విమర్శకులు ప్రామాణ్యము నంగీకరించుచున్నారు. ప్రామాణ్య నిర్ణయవిష యమునం దేకవి ప్రయోగములలో నగాధపాండిత్యము భాసిల్లుచుండునో యట్టి వానిని మహాకవిగా నంగీకరించి యాతని ప్రయోగములలో నెందేని లక్షణ విరోధ మగపడినపు డాతని ప్రయోగమునకే ప్రామాణ్యము నొసంగుటయే కదా సంప్రదాయము. తుదికివ్యాకరణము చదువనివాఁడయ్యు బహుస్థల సాధు శబ్దప్రయోక్త ప్రామాణికుఁ డని కదా పతంజలి నిర్ణయించెను. "సూ. పృషోదరాదీని యథోపదిష్టమ్।" "వృ. పృషోదరాదీని శిష్టై ర్యథోచ్చారి తాని తథైవ సాధూని స్యుః" "...కై రుప దిష్టాః శిష్టైః.....యది తర్హి శిష్టా శ్శబ్దేషు ప్రమాణం కి మష్టాధ్యాయ్యా క్రియతే, శిష్టపరిజ్ఞానా

ర్థాష్టాధ్యాయీ, కథం పున రష్టాధ్యాయ్యా శిష్టా శ్శక్యా విజ్ఞాతుమ్, అష్టా ధ్యాయీ మధీయానోఽన్యం పశ్య త్యనధీయానమ్, యేఽత్ర విహితా శ్శబ్దాః తాన్ ప్రయుఞ్జానం స పశ్యతి. నూన మస్య దైవానుగ్రహః, స్వభావోవా, యోఽయం నచాష్టాధ్యాయీ మధీతే. యేచాస్యాం విహితా శ్శబ్దా స్తాంశ్చ ప్రయుఙ్క్తే, నూన మయ మన్యా నపి జానాతీతి, ఏవ మేషా శిష్టపరిజ్ఞానార్థా ష్టాధ్యాయీతిచ్.

(మహాభాష్యము. ౬ అధ్యా. ౩ పాద. ౩ అహ్ని)

(౩౯౦)—పై విషయమున శబ్దరత్నాకర కర్తచే నీ క్రిందిరీతి నలఘు కౌముది పీఠికలో వ్రాయఁబడెను. “అలఘు రేఫ విషయమై నన్నయభట్టు తిక్కన సోమయాజి ఎఱ్ఱాప్రెగడ నాచన సోమన భాస్కరుఁడు శ్రీనాథుఁడు అమరన సూరన లోనగు మహాకవుల ప్రయోగములనే తెలుచుగాఁ గొని దొరకి నన్ని యాపదముల నేర్చి కూర్చి యలఘు కౌముది యనుపేరిట నొక పుస్తకము వ్రాయఁబడెను. పై వారి ప్రయోగములు దొరకని కొన్నిటికిఁ (అనఁగా వానికి విరుద్ధములుగాని వానికి) దక్కటి కవిప్రయోగములు ప్రమాణములుగా నెత్తుకొనఁబడి యున్నవి. బహుతరముగఁ గవులు పెక్కండ్రు లఘ్వలఘు రేఫములకు మైత్రిఁ గలుగఁ జెప్పి యుండుటంజేసి వారిప్రయోగములను గొని రేఫములను నిర్ణయించునెడ నన్నియు నలఘు రేఫములుగాను లఘురేఫములుగాను నేర్పడునుగాన నట్టివారి ప్రయోగములను వీనికిఁ బ్రమాణములుగా నెత్తికొనఁగూడదు... ... ... ...ఆముక్తమాల్యదా కారుఁడు లఘురేఫములుగాఁ బ్రయోగించినవాని నితరకవు లట్లు ప్రయోగింపకుండుటచే నతఁడు లఘ్వలఘు రేఫములకు మైత్రి గలుగఁ జెప్పినవారిలోఁ జేరినవాఁడని యెంచుట యుక్తము.” ఈ విషయము విమర్శింపవలసియున్నది.

(౩౯౧)—లోకమునఁ దనకీర్తిశరీరమును జిరస్థాయిగ వెలయించుటకయి గ్రంథమును రచించు గ్రంథకర్త యెవ్వఁడును గోరి యపప్రయోగములను జేయఁడనుట నిశ్చయము. పూర్వాపూర్వ కవుల గ్రంథములలోని ప్రయోగములనుబట్టి సంకోచ వికాసాది న్యాయములచేత భాషాస్వరూపము నాయా లక్షణవేత్తలు సూత్రించుచుండుటయు, నుత్తరోత్తరు లాయా లక్షణముల ననుసరించి ప్రయోగించుచుండుటయుఁ, దన్మూలమునఁ గొన్ని విరోధములు సంభవించుచుండుటయుఁ, దటస్థించుచుండును. రేఫ ఱకారములవిషమున ముందు విశదీకరింపఁబోవు రీతిని (౪౨౫. వి.) యతిమైత్రి నంగీక

రింపవచ్చుననియు, దీర్ఘపూర్వకస్థలములలోను బదాదిస్థలములలోను రేఫముతే కాని ఱాలుండనేరవనియుఁ గొందఱు లాక్షణికులు చెప్పియుండుటచే ననేకులు కవు లట్టి లక్షణముల ననుసరించి ప్రయోగించుటయు నట్టి లక్షణముల నంగీకరిపని తర్వాతి వా రట్టి ప్రయోగములు నియమశూన్యములని పయిరీతిని జెప్పుటయు నట్టి ప్రయోగములను బ్రమాణీకరించెడి నవ్యులు రేఫ ఱకార భేదమును బాటింప నక్కఱలేదని తలంచుచు ధారాళముగా రేఫ ఱకార సాంకర్యమును జేయుటయు సంభవించె నని గ్రహింపవలయును. కాఁగా బుద్ధిపూర్వకముగా రేఫ ఱకారముల మైత్రి నంగీకరించినట్లు విశదపడు వఱకును నాయా మహాకవుల గ్రంథముల నప్రమాణములుగ నిరసింపరాదు. ఆయా కాలముల రేఫ ఱకార నిర్ణాయక లక్షణములనుబట్టి యాయా గ్రంథకర్తల యభిప్రాయములను బరిశీలించి ధారాళముగా రేఫ ఱకారభేదము నుపేక్షించినట్లు విశదపడిన గ్రంథముల విడిచి తక్కిన గ్రంథములనెల్ల నీ విషయమునఁ బ్రమాణీకరించుట యుక్తము.

ఇట్టి పద్ధతి ననుసరించియే కూచిమంచి తిమ్మకవి బమ్మెరపోతరాజు కవిత్వమునకుఁ బ్రామాణ్యమును నిర్ణయించి యున్నాఁడు.

ఆ-వె. కాకునూరి యప్పకవి యహోబలపతి । ముద్దరాజు రామముఖ్యులెల్లఁ
బోతరాజు కబ్బమున ఱాలు రేఫలు । గదిసె నంచుఁ బలికి రది హుళిక్కి

ఉ. బమ్మెరపోతరాజ కృత భాగవతమ్ము సలక్షణమ్ముగా
కిమ్మెయి నేమిటం గొదువ; యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసములైన కతమ్మునం గదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగా.

అని రామన్న చెప్పినాఁడు.

సీ. అఖిలవేదాంత విద్యా రహస్యవిదుండు, సహజపాండిత్య విశారదుండు,
పటుతర కవితా విభాసిత ప్రతిభుండు, సకలాంధ్ర లక్షణ చక్రవర్తి,
.... .... ... ... ... ... ... ... .........బమ్మెరపోత సుకవి,
ఎన్న రేఫ ఱకారంబు లెఱుఁగఁ డనుచు,
నజ్ఞు లొక కొంద ఱాడుదు రమ్మహాత్ము,
కవిత కెందును లోపమ్ము గలుగ దభవ.

వ. పోతరాజు చెప్పినవి ప్రథమస్కంధమును ద్వితీయస్కంధముఁ గొంతయు షష్ఠసప్తమాష్టమ నవమస్కంధంబులును దశమస్కంధము పూర్వభాగము కొంతయు నున్నవి. అందులో రేఫ అకార సాంకర్యము లేకుండుట కుదాహరించున్నాము.

ఉ. మాఱుపడంగలేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల నతిత్వరితమ్మునఁ ద్రుంచెఁ గ్రూరుఁడై
పాఱుఁడు గాని పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బాఱెడు వీనిఁ గావుము కృపామతి నర్జున పాపవర్జనా.

చ. వెఱచినవారి దైన్యమున వేదురు నొందిన వారి నిద్ర మై
మఱచినవారి సౌఖ్యమున మద్యము ద్రావినవారి భగ్నులై
పఱచినవారి సాధుజనభావము వారిని గావుమంచు వా
చఱచినవారిఁ గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా.

(సర్వల. 3. ఆ. ౨౬౨. మొ. ౨౬౮-వ)

ఇట్లు రేఫ అకారవైరమును బాటించిన యుద్దేశమును జూపు ప్రయోగములను బోతన భాగవతభాగమునుండి పెక్కు చూపియున్నాఁడు.

రేఫ అకారముల కుచ్చారణములో భేదము వెలసియున్న కాలమున వాని పట్టికలు వ్రాయఁబడియుండనందున నిపుడు సాకల్యముగ శకటములను జూపుట శక్యముకాదు. ప్రాచీనమహాకవి ప్రయోగములనుబట్టి సంకోచవికాసాది న్యాయముల ననుసరించి చేసిన లక్షణముల నుపేక్షించి (పదాదిని శకటముండదు. దీర్ఘపూర్వక శకటముండదు. మొ.) కేవల ప్రాచీనమహాకవుల యతిప్రాస స్థలములలోని రేఫ అకారములను నిపాతన్యాయమునఁ బ్రమాణీకరించుట యుక్తమని నిష్కర్ష చేసికొన నగును.

(వికృ) క్రియాన్తే చాన్యవర్ణేచ, లఘురేఫాః ప్రకీర్తితాః,
ద్వివిధా ది దుతశ్చ స్యు, రయవౌచ కగౌ తథా.
చసౌ పబౌ తదౌ వర్ణౌ, నమవా అససంయుతాః,
ఏతే ద్వితయ సంయుక్తా, రేఫోన్యత్రతు సమ్మతః,
లఘు, ర్నాస్తి బకారస్యా, లఘు స్సస్య కదాపి న.

(౩౯-౨) — వ్యాఖ్య : క్రియాన్త ఇత్యాది :— క్రియాన్తేచ = క్రియాపదముల తుదిని నిల్చెడి బహువచన ప్రత్యయములందును; అన్య

వర్ణేచ = (వర్ణ = వర్ణక) క్రియేతర ప్రత్యయములం దనఁగా—నృపాలురు, బాలురు, మున్నగు నామ బహువచన ప్రత్యయములందును; లఘురేఫాః = లఘురేఫములై, ప్రకీర్తితాః = (నన్నయ భారత భాగమునఁ బ్రయుక్తము లయి యున్నవి గాన) కీర్తింపఁబడినవి. ఉదా:— చొచ్చిరి, పుట్టిరి, పూజించిరి; వారు, వీరు, మీరు, తారు; నృపాలురు, వేల్పులార మొ.

ద్వివిధ=హ్రస్వదీర్ఘ రూపములయిన; అ ది దుత శ్చ=అవర్ణేవర్ణోవర్ణము లును; అయవౌచ=(ఎ+ఒ=అయొ; దీని ద్వివచనము అయవౌ) ఎ కారమును, ఒ కారమును; (ప్రత్యేకించి చెప్పుటచేత 'ద్వివిధ' అను సమాసగత విశేషణము దీనిని జెందదు.) తథా = ఆ ప్రకారముగనే; కగౌ = కకార గకారములును; చసౌ = చకార సకారములును; పబౌ = పకార బకారములును; తదౌ = తకార దకారములు సనెడి; వర్ణాః=వర్ణములును; నమవాః = నకార మకార వకారము లనెడి ఏతే=ఈ యక్షరములు; అసంయుతాః=హలంతరసంయుక్త రేఫములు పరమందుఁ గలవికానినై ద్వితయ సంయుక్తాః = రేఫ ఱ కారములు రెంటను ననఁగా వానిలో నేదేని పరమందుఁ గలవి; స్యుః=అగుచున్నవి; వీనికిఁ బర మందు రేఫముగల శబ్దములును ఱకారముగలశబ్దములును గలవని తాత్పర్యము. అన్యత్ర = పైని జెప్పిన స్థలములు తప్పఁ దక్కినచోటులందు; లఘుః రేఫస్తు = లఘురేఫమే ; సమ్మతమగును.

బకారస్య = బకారమునకుఁ దర్వాత, ఱ లఘుః = అలఘు రేఫము ; నాస్తి = నన్నయభట్టారక ప్రయోగములలో లేదు. ఆ ఱకారము, సస్య=సకా రమునకుఁ దర్వాత నన్ననో ; కదాపి = నన్నయ కాలమందే కాక, ఎన్నఁడును, న = లేదు.

(కా-3)—పయిని జెప్పఁబడిన స్థలములందే కాక మఱికొన్నిచోట్లను నయితము దర్వాతికవుల ప్రయోగములలో రేఫ ఱకారములు గలవు. కాన పై కారికలు నన్నయభట్ట భారతభాగ ప్రయోగములకు మాత్రము సరియైన యనుగమములుగఁ గల్పింపఁబడిన వనుటలో సందేహములేదు.

ఱ కారము నానాటికిఁ రేఫమువంటి యుచ్చారణమే కలదిగఁ బరిణ మించుటంజేసి యది యుండెడిచోటు లుచ్చారణమునుబట్టి తెలిసికొనుటకు వీలు లేదయ్యెను. కావున రేఫ ఱకారము లుండు చోటులను గొంతవఱకి యినఁ జూపుట యావశ్యకమని తలఁచి నన్నయభట్ట భారతభాగమందలి యతి ప్రాసస్థలములలోని రేఫ ఱకారములను బోధించు ననుగమము లుపదే

శించుటకు యత్నించి యథర్వణుఁ డావిషయమునఁ గొంతవఱకుఁ గృతార్థుఁ డయ్యెను. ఇట్లే యీతఁ డుచ్చారణ భ్రష్టమగు నరసున్న యుండు తావులను సైతము వీలు పడునంతవఱ కుపదేశించుటకు వెనుక యత్నించి యుండెను.

(౩౯౮)— పయిరీతి నథర్వణుఁడు చేసిన రేఫ అకార సూత్రములె తర్వాతి వారికెల్ల మార్గ దర్శకము లయ్యెను. అథర్వణ కారికలలోని 'క్రియాంత' ఇత్యాది ప్రకృత సూత్రముల ఛాయ తరువాతి లక్షణ గ్రంథములు పెక్కిటిలో నగపడుచున్నది. తాళ్ళపాకము పెదతిరుమలయ్యాయు నప్పకవియు నీ యథర్వణ సూత్రములను వివరింపకున్నను వారి రేఫ అకార ములపట్టిక లీ "క్రియాన్త" ఇత్యాది సూత్రములలోఁ బేర్కొ-నఁబడిన వరుసనే వెలయుచున్నవి. పాఠకులకు సుగ్రహముగ నుండుటకై రేఫ అకారయుత పదముల నకారాది వర్ణక్రమానుసారముగఁ బేర్కొ-నుటలో శబ్ద రత్నాకరాది కోశములందువలెఁగాక వీనియందు "ద్వివిధాదిదుత" ఇత్యాది ప్రకృత సూత్రపుఁ బద్ధతియే యవలంబింపఁబడి యున్నది. విస్తరభీతి నొకటి రెండు దాహ్మతులను మాత్రమే చూపుచున్నాను. 'అందఱు' అను శబ్దము శబ్ద రత్నాకరాదులలోవలె వీనియం దకారాది శబ్దములలోఁ జూపఁబడ లేదు. దకార పూర్వక శకట పదములలోఁ జూపఁబడెను. ఇట్లె 'ఏమఱు' అనునది 'ఏకారా' ది శబ్దములలోఁ జూపఁబడలేదు. ఇంక మకార పూర్వక శబ్దము లలోఁ జూపఁబడెను. ఇట్లె యంతటను గ్రహింపవలెను.

(౩౯౯)—"ద్వివిధాదిదుత" ఇత్యాది ప్రకృత సూత్రమును, నన్నయ భారతభాగ పద్యముల యతి ప్రాసస్థలములందలి శబ్దములను మూలముగాఁ గొని యథర్వణుఁడు రచించి యుండుటచేతను దిరుమలయ్యా మున్నగువారు నన్నయభట్టునకుఁ దర్వాతి మహాకవుల ప్రయోగములను నయితము మూలముగాఁ గొని రేఫ అకార నిర్ణయ పద్యములను జెప్పియుం డుటచేతను "ద్వివిధాది దుత" ఇత్యాది ప్రకృత సూత్రములకును దిరుమ లయ్యా మున్నగువారి లక్షణములకును గొన్ని సహజములగు భేదము లుండుట విరుద్ధముకాదు. కాఁగా నన్నయకుఁ దర్వాతి కవుల పద్యములలో నుండుటం జేసియే తిరుమ లాప్పకవుల పద్యములలో అకారాది శబ్దములును 'ఏ ఓ ఒ న' అను నక్షరముల తర్వాత శకటములు గల శబ్దములును జెప్పఁబడుటయు "ద్వివిధాదిదుత" ఇత్యాదికారికలలో నిట్టివి చెప్పఁబడకుండుటయు విరుద్ధము లనిపించుకొనవు.

(౩౯౬)— అప్పకవీయము ౧౬౫౬ క్రీస్తు సంవత్సరము నాఁటిది. ఈ విషయము నప్పకవియే చెప్పియున్నాఁడు. ఇఁకఁ దిరుమలయ్య కృష్ణదేవ రాయల కాలమునాఁటి వాఁడని (క్రీ. శ. 1509—1530.) యాంధ్ర విజ్ఞాన సర్వస్వమునందలి యష్టమహిషీకల్యాణ, మను శబ్దము నొద్ద వ్రాయఁ బడియున్నది. తాళ్లపాకము పెదతిరుమలయ్యగారి కయిదుగురు పుత్త్రులని యు నందుఁ దిరువెంగళనాథుఁ డనునాతఁ డష్టమహిషీకల్యాణ, పరమయోగి విలాసము లనెడి ద్విపద కావ్యములను రచించె ననియు “ చిన్నన్న ద్విపదకెఱుఁగును ” అను దానిచేఁ బేర్కొనఁబడు చిన్నన్న యీతిరువెంగళనాథుఁడే యనియు, నతఁడో యాతని తమ్ముఁడగు తిరువేంకటాఖ్యుఁడో గురుబాల ప్రబోధిక యను నమరటీకను రచించెననియు నీయష్టమహిషీ కల్యాణకర్తకు సదాశివదేవరాయలు శాలివాహన శకము ౧౪౬౭ విశ్వావసు సంవత్సర మున (క్రీ. శ. ౧౫౪౫) మల్లవరగ్రామము నగ్రహారము చేసె ననియు విజ్ఞానసర్వస్వమునఁ వ్రాయఁబడెను. మఱియు నీక్రింది తిరుమలయ్యగారి వర్ణన పద్యము లుదాహరింపఁబడి యున్నవి.

“ ... ... ఆ తిరుమలాచార్య వర్యుండు,<br>
వేదాంత విద్యా ప్రవీణుఁడై యాంధ్ర,<br>
వేదాంత మొనరించె ద్విపద రూపమున.<br>
హరివంశకావ్య మాయత రసస్ఫూర్తి,<br>
హరివంశ మిగురొత్త ననువొందఁజేసె.<br>
చక్రవాళములోన సరిలేదు నాఁగఁ<br>
జక్రవాళముగ మంజరి రచియించి<br>
శ్రుతుల చిక్కులు దీర్చు శుకుతాతవోలె,<br>
సతత రేఫ అకార సరణు లేర్పఱిచి,<br>
సంగీత సాహిత్య సార్వజ్ఞకత్వ,<br>
మంగళ సామ్రాజ్య మహితుఁడై యలరె ”.

(అష్టమహిషీకల్యాణ పీఠికలోనివి. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము ౩ సం పుటము. ౧౬౯౯ పుట.)

(౩౯౭)—శకటరేఫ నిర్ణయ మను గ్రంథములో “ ద్వివిధాదిసుత ” ఇత్యాది కారికకు సన్నిహితముగా నీక్రిందిరీతిని జెప్పఁబడెను.

"శ్లో. ఏకత్రి నవమాత్పూర్వ, మేకత్రి నవమాత్పరమ్,
అచ్ఛ్రిఞ్చక పరం చైవ, యలసాత్పూర్వ మేవవా,...... "
(శకటరేఫ నిర్ణయము, ౪౬-౧౨౭ పుటలు.)

"కకారాది వర్గములలోని ప్రథమ తృతీయ వర్ణములకు ముందటను, వెనుకను, నకార వకార మకారములకుఁ (నవమాత్) బూర్వమందును బరమందును, నచ్ఛంచక మనఁగా 'అ, ఇ, ఉ, ఎ, ఒ' అను హ్రస్వాచ్చులకుఁ బరమందును, యకార లకార సకారములకుఁ (యలసాత్) బూర్వమందును శకట ముండిన నుండవచ్చును." అని పై శ్లోకమునకుఁ దాత్పర్యము. 'ద్వివిధాది దుత, ఇత్యాది ప్రకృత కారిక యర్థమున కియ్యది మిక్కిలి సన్నిహితమై యుండుటంజేసి యీ యథర్వణకారిక యీతనికి లభించి యుండెనా యని యాలోచింపవలసి యున్నది. ఇందును నథర్వణకారికలో లేని కొన్ని స్వల్ప విషయము, లనంతరకవి ప్రయోగముల మూలమునఁ జేరి యున్నవి. జకార టకార డకారములకుఁ దర్వాత నన్నయేతర కవుల పద్యములలోని యతి ప్రాసస్థలములందు శకటములు వెలయుచుండుటంజేసి (అథర్వణ కారికలో లేని) యిందయ్యవియును జేర్పఁబడినవి. ముందు వివరింపఁబోవురీతి నా శకట రేఫ నిర్ణయ కర్త మతమునఁ బదాది శకటములును, దీర్ఘ పూర్వక శకటములును నంగీకరింపఁబడవు గాన నిందయ్యవి చెప్పఁబడలేదు.

'ణ ర ల ళ హ' అను వర్ణములు తప్పఁ దక్కిన వర్ణములకు మాత్రమె పూర్వమందు శకట ముండునని తన కాలమువఱకుఁ గల ప్రయోగముల ననుసరించి యీతఁ డథర్వణునికారికలలో లేని స్థలములను సయితముపదేశించెను. శకటస్థలములను మాత్రము చెప్పినచోఁ బరిశిష్టములెల్ల రేఫ స్థలములె యగునని తలఁచి యీతఁడు పై రీతిని జెప్పియున్నాఁడు. అథర్వణుఁ డీతనివలె రేఫ ఱకారములకెల్ల ననుగమమును గల్పింప నుద్యమింపక నన్నయభట్ట పద్య యతిప్రాసస్థలస్థ రేఫ ఱకార ఘటిత శబ్దములకు మాత్రమె యనుగమములు గల్పించిన వాఁడగుటంజేసి యచట రేఫములుండు తావులును శకటములుండు తావులును వేర్వేఱుగఁ జెప్పినవాఁ డయ్యెను.

(౩౯౨)—ఈ శకటరేఫ నిర్ణయ గ్రంథముయొక్క కాలము తెలియదని దాని పీఠికలో వ్రాయఁబడియున్నది. ఈశ్వరుఁడు తన స్వప్నమున సాక్షాత్కరించి ప్రేరింపఁగాఁ దానీ గ్రంథము నీశ్వరునితోనె చెప్పుచున్నట్లు గ్రంథాదిని గ్రంథ కర్త యీ క్రిందిరీతిని జెప్పియున్నాఁడు.

"వక్ష్యామి శకటాన్ రేఫాన్ । శ్రుణుత్వాన్ధ్రే ప్రవర్తితాన్,
గౌరీపతే యత స్స్వప్నే । ప్రవక్తుం మా మచూచుదః,
యస్మా న్మే ప్రేరకశ్చాసి । అధిదైవం యతో హి మే,
యదన్ధ్రభాషా స్రష్టా త్వం। తతో వాచయితా భవాన్
............................. (గ్రంథాది పీఠిక )
భారతమ్నాయావధాని, లక్ష్మీపత్యవధానినా,
సన్ధానితోయం శకట, రేఫ నిర్ణయ నామకః.
..........................(గ్రంథాంత శ్లోకము)

పయిరీతినుండుటచే గ్రంథకాలము దుర్ణిరూపమగుచున్నను సందర్భాంతరములో "ధాత్రీశ్వరులుగాని ధాత్రీశ్వరులుగారు పురుడు, వాగనుభూతిభూతిగతుల,..." అనెడి వసుచరిత్ర పద్యము (వసు-౧ ఆ-౪౧ ప.) మున్నగునవి యుదాహరింపఁబడి యుండుటచేత నీ గ్రంథము (క్రీ. శ.) 1580 సంవత్సరమునకుఁ దర్వాతిదే యనుట నిశ్చయము.

(౩౯౯)—కూచిమంచి తిమ్మకవి 'ద్వివిధాదిదుత' ఇత్యాది ప్రకృతకారికలను నహోబల పండితీయమునుండి సంగ్రహించి యీక్రిందిరీతి నాంధ్రీకరించెనని గ్రహింపనగును. కాని వీని యర్థము సుగ్రహము కామింజేసి ముద్రిత సర్వలక్షణ సార సంగ్రహములో నీ పద్యము ప్రమాదభూయిష్ఠముగఁ బడియున్నది.

క. కగచజతదనల ప బమలఁ, దగ వసలంద ఇ ఎఓల
దకట్టఁగ నెందున్, మిగిలిన వర్ణంబులపైఁ, దగులవుగద బండి
ఱాలు ధనపతి మిత్రా, (సర్వలక్ష-3 ఆ.-౧౨)

ఇయ్యది వక్తృతాత్పర్యము నరసి సవరించిన నీక్రిందరీతి నుండనోపును.

క. క గ చ జ త ద న లు ప బ మ లు, త గ వ ర లు ను అ ఇ ఉ ఎ ఒ లు
తకట్టఁగ నెందున్, మిగిలిన వర్ణంబులపైఁ, దగులవుగద బండిఱాలు
ధనపతి మిత్రా.

(౪౦౦)—తిరుమలయ్యగారి రేఫ అకార నిర్ణయపద్యముల మొదటనయితము 'క్రియాంత' ఇత్యాది ప్రకృతకారికల ఛాయ యగపడుచున్నది.

క. ఇచ్చిరి తెచ్చిరి యనియెడి, యచ్చతెనుంగులఁ గ్రియాపదాంతంబులపై,
వచ్చినవి యెల్ల రేఫలు, రచ్చలు...(గ్రంథపాతము)...రచనలు కృష్ణా.

క. ఇల ఘోషాక్షరములపైఁ, గలుగవు తెలుఁగునను ఱాలు కడఁగును రేఫల్,
తలపఁగ సంస్కృతపదములఁ, గలిగినవియు రేఫలగును గనుఁగొనఁ గృష్ణా.
(ఆంధ్రసాహిత్య పరిషన్ముద్రణము.)

ఈ పద్యముల వెంబడినిగల తిరుమలయ్యగారి రేఫ అకారపద్యములలో ఘోషాక్షరముల పయి ననఁగా నచ్చులపైని గజదబలపైని నమలపైని శకటములుగల శబ్దములు పెక్కు చెప్పఁబడియుండుటచేత నీరెండవ పద్యము ప్రమాద బహుళ మనక తీరదు. పరిశీలింపఁగా నిది యీ క్రిందిరీతి నుండ నోపు ననఁదగును.

క. ఇల భాషాక్షరములపైఁ, గలుగవు తెలుఁగునను ఱాలు కడఁగును రేఫల్,
తలఁపఁగ సంస్కృతభవములఁ,గలిగినవియు రేఫలగును గనుఁగొనఁ గృష్ణా.

(౪౦౧)—పయి పద్యములోని భాషాశబ్దము గీర్వాణపర్యాయమని గ్రహింపక లేఖకాదులు ఘోషాక్షరములని సవరించిన ట్లగపడుచున్నది. అప్పకవీయములోని యీక్రిందిపద్యము నరయఁగా నాతఁడు పయి తిరుమలయ్యగారి పద్యములో ‘భాషాక్షరము’ లను పాఠమునే చూచి యున్నట్లు తోఁచుచున్నది.

సీ. చనిరి కాంచిరి చేకొనియెద రనియెదు నవి మొదలైన క్రియాపదముల,
తుదలను సంస్కృతపదములందును దద్భవములయందును అకారములు లేవు
..................(అప్పకవీయము. ౨ ఆ.)

(౪౦౨)—పయి నుదాహృతములగు గ్రంథములను బరిశీలించి ప్రకృతకారికల కొకవిధముగ నర్థముచేసికొని యహోబలపండితీయోదాహృత పాఠమునె సరిపెట్టికొని ద్విరేఫ వర్ణదర్పణకర్తయగు రంగనాథకవి క్రియాంత ఇత్యాది ప్రకృతకారికల నొకవిధముగ వివరించెను. ఈతఁడు శకటరేఫ నిర్ణయకర్తను స్మరింపకున్నను నాతని గ్రంథములోని యనేకవిషయములను గ్రహించి యుండుటచే (ఆయా సందర్భములలోఁ జూపఁబడును) నద్దానిని జూచియె యుండెనని చెప్పవచ్చును.

ద్విరేఫవర్ణ దర్పణకర్త యంగీకరించిన యహోబలపండితీయోదాహృత ప్రకృత కారికల పాఠ మథర్వణ ప్రోక్తము కాదనియు నా సవరించిన యల్పమగు సవరణములు చేయక తీరదనియు విశదీకరించుటకయి యిట యథాస్థితముగ నహోబలపండితీయములోని ప్రకృత కారికల పాఠమును వ్రాసి రంగనాథ కవిగారి వ్యాఖ్యలోని లోపములను జూపుచున్నాను.

శ్లో. "క్రియాన్తే చాన్యవర్ణేచ । లఘు రేఫాః ప్రకీర్తితాః
ద్వివిధాదిదుతశ్చ స్యు । రయవౌచ కగౌ తథా,
చజౌ పబౌ తదౌ వర్ణ । సమరావన సంయుతాః,
ఏతే ద్వితీయ సంయుక్తా । రేఫో న్యత్రతు సమ్మతః,
లఘు ర్నాస్తి జకారస్యా । లఘు స్సస్య కదాపి నా.
.......................... .............
అన్యేంతరిక్ష ఖ దృశో, న్యేనయుక్తాః కదాపిచ,
.................................................

విశేషా స్తేనైవోక్తాః (తేనైవాథర్వణేనైవ). అన్యవర్ణ ఇత్యత్ర అద్రువ, చిద్రుప, వట్రువ ఇత్యాద్యుదాహరణం ద్రష్టవ్యమ్"
('హార్యంఘ్రిశబ్దః గగన పరత్వేన బిందువాచకః-' అని నా యొద్దనున్న వ్రాఁతపుస్తకమున నున్నది) (అహోబ. ౧౪౯. ౧౫౦. పుటలు.)

పై యహోబల పండితీయ పాఠములలో నీ క్రిందిరీతి సవరణములు ద్విరేఫవర్ణ దర్పణమునఁ జేయఁబడినవి. —

"చజౌ పబౌ తదౌ వర్ణౌ, నమరా వససంయుతాః,
ఏతే ద్వితయ సంయుక్తాః" (ద్విరేఫ. ౧. ఆ. ౫ పుట)
పయి వాని కీ క్రిందిరీతిని రంగనాథకవి వ్యాఖ్య చేసెను.

(౪౦౩)—"అథర్వణ కారిక :—క్రియాన్తే చాన్యవర్ణేచ, లఘురేఫాః ప్రకీర్తితాః॥ వ్యాఖ్య:— అన్యవర్ణేచ = రేఫేతర వర్ణములయందున్నవి యనఁగా నద్రువ, విద్రువ, వట్రువ మొదలైనవి: ద్రకారలనుట..."

(ఇది వెనుక నుదాహరించిన యహోబల పండితీయ వ్యాఖ్య ననుసరించి చేయఁబడిన టీక).

"గీ॥ తఱచు త్రిలఘు క్రియాపదాంత్యంబు ద్రకార...లఘువు"

"వ్యాఖ్య :—తఱచు త్రిలఘు క్రియాపదాంత్యంబు = మూఁడులఘ్వక్షరములు పరిమితిగల క్రియాపదములకు నంత్యమందుఁగల రేఫము తఱచుగా లఘువు అనఁగా—తనరె, పొనరె, అడరె, అలరె, గదిరె, అదరె, బెదరె మొదలగునవి. తఱచుగ నని చెప్పుటచేత గురురేఫంబును గ్వాచిత్కమై యుండు ననుట. "ఇద్దఱు పదఱుట పెద్దఱికంబును" అని. అప్పకవి పదఱుటను

గురు రేఫముగాఁ జెప్పె. డగ్గఱ క్రమ్మఱె, పగఱ, మెఱయుట, మొదలగువాని యందు గురువులుండుటవలనఁ "ద్రిలఘు—క్రియాపదము—అంత్యము" అను విశేషణములు మూలమున జేర్చఁబడియె" (ద్విరేఫవర్ణ. ౨ఆ.౫౨,౫౩పుట.)

పయి వ్యాఖ్య యీ క్రింది శకటరేఫ నిర్ణయగ్రంథస్థ విషయములను సంగ్రహించి చేయఁబడి యుండును.

"తృతీయో । లఘు త్ర్యక్షరకర్మసు । ...లఘువైన త్ర్యక్షర క్రియలయందు మూఁడవవర్ణమైన రవర్ణము రేఫమగుచున్నది. ఎట్లనిన:— అమరె, కమరె.................... ........(శకటరే. ౫౩ పుట). "

"క్రార = రేఫము—అద్రువ, విద్రువ, వట్రువ, క్రాలె, త్రావె, క్రుంకె, బ్రుంగె మొదలగువి యెప్పుడును లఘువులె. ఇట్టి నియతములగు క్రారలకెకాని పొల్లులతో సంబంధించిన రేఫముల కీవివక్షకాదు. అట్టియెడల నేరేఫము సంధించిన నా రేఫమే, కాని లఘువని చెప్ప వలనుగాదు. ఉదాహ దారణము... . ...కంటికిన్ । తెప్పయుఁబోలె మాటయి నెఱిం బను లారసి. ... ... ... ... ... ... ... ..." (ద్విరే. ౨ ఆ. ౫౩ పుట.).

ఈ రంగనాథకవి, మనుచరిత్రము, అప్పకవీయము, ఆంధ్రభాషార్ణము, మున్నగు నర్వాచీన కవుల గ్రంథములనుండి 'క్రియాంత' ఇత్యాది ప్రకృతకారికల కుదాహరణముల నిచ్చియుండుటంజేసి (ద్విరేఫ. ౨ ఆ. ౪౮) యాతఁడు 'క్రియాంత' ఇత్యాద్యథర్వణ కారికలు నన్నయపద్య యతిప్రాస స్థల మాత్రమూలకము లని తలంచి యుండలేదనుట నిశ్చయము. కాఁగా నట్లు పదునేడవ శతాబ్దము తుదివఱకుఁగల కవిప్రయోగములెల్లఁ బ్రకృతకారికల కుదాహరణములె యను నీపక్షమునుబట్టి రంగనాథకవి వ్యాఖ్యను విమర్శించుచున్నాను.

"క్రియాన్తే" అనుదానిచేత నా చెప్పినట్లు క్రియాప్రత్యయము లను గ్రహింపక రంగనాథకవ్యాదుల చొప్పున ధాత్వవయవాంత్యవర్ణము లను గ్రహించినయెడల "అఱు, ఆఱు, ఉఱు, ఏఱు, కాఱు, క్రమ్మఱు, గీఱు, చీఱు, చేకుఱు, జాఱు, డగ్గఱు, తాఱు, తీఱు, తూఱు, తెప్పిఱు, తేఱు, దూఱు, నూఱు, నెఱవేఱు, (పాడఱు) పాఱు, (పిలుకుమాఱు) పెలుకుఱు, పోకాఱు; మాఱు, మీఱు" అనునవి మొదలగు ననేకస్థలములు బాధకము లగును. ఇంక నచటి క్రియాంతశబ్దముచేతఁ ద్రిలఘు క్రియాపదాంత వర్ణములు గ్రహింత మన్నను నద్దానికి సైతమతిచారము గలదని

రంగనాథకవియే యుదాహరించెను గదా. ఇంతియకాక కారికాకర్తకే యట్టి యభిప్రాయ మున్నయెడల నట్లు "త్రిలఘు క్రియాంత్యాక్షరములని యేల చెప్పకుండును? మఱియు నచ్ఛాంధ్ర ప్రకృతులలోని రేఫ అకారములను "ద్వివిధా దిదుత" ఇత్యాది సూత్రముచే నుపదేశించుచు నిట్లు తదంతర్గత కతిపయప్రకృతులను సవ్యభిచారానుగమములతో వేఱుగ నేల చెప్పఁ గడం గును? ఆ పక్షమున నామముల యవయవములందును నీ క్రింది శకట రేఫ నిర్ణయగ్రంథమందువలె నేల చెప్పకుండును?

"అడ్వన్తా శ్శకటా స్సర్వే । ఉమ్వన్తాః ప్వన్తకా అపి... ...
ఉభా వియన్త స్సర్వేచ । కియన్తః కతిచాగ్రతః ।
జ్యేష్ఠత్వ కన్యా త్వాద్యాశ్చ । ............ (శకటాః)

ఉదా—కొఱడు, పొఱడు, పోఱడు, నఱడు, నఱుము, నుఱుము, ఉఱుము, అఱుము, మెఱుపు, ఒఱపు, చెఱపు, పఱుపు, ఎఱుపు, ఇద్దఱు, ఇందఱు, అందఱు, ఎందఱు, కొందఱు, ముందఱ, పెద్దఱికము, కన్నెఱికము"

పయి సందర్భమును బట్టి "సర్వక్రియాన్తా భూమాన్తాః ... ... ఇచ్చిరి, తెచ్చిరి, వెళ్ళిరి, నెయ్యురు, బలియురు, మార్తురు, పగతురు, కాల్వురు, బాలురు, మొ." అనుశకటరేఫనిర్ణయగ్రంథము చొప్పున క్రియాన్తే చాన్యవర్ణేచ" అను ప్రకృత సూత్రమునకుఁ గ్రియాప్రత్యయములును నామ (బహువచన) ప్రత్యయములును రేఫములయినచో యుండుననెడి నా చేసిన వ్యాఖ్యయే యుక్తమైయున్నదని గ్రహింపఁదగును.

కం. 'ఇచ్చిరి తెచ్చిరి యని యెడి । యచ్చతెనుంగుల క్రియా ప
దాంతంబులపై । వచ్చినవి యెల్ల రేఫలు... ... ...' అని యిట్లు
తిరుమలయ్యగారును గ్రియాపదాంత శబ్దమును నా చె
ప్పిన యర్థమందె వాడియున్నారు.

సీ. 'చనిరి కాంచితిరి చేకొని యెదరనియెడు, నవి మొదలైనక్రియా
పదముల । తుదలను............ అకారములులేవు' అనియి ట్లప్పకవియుఁ బై రీతినె చెప్పియున్నాఁడు.

ఇంతయేల! రంగనాథకవిగారు సైతము పైసందర్భమున నట్లు (శకట రేఫనిర్ణయ గ్రంథవిశేషములను జొనుపుటకై కావలయు) క్రియావయవా క్షర పరముగ నర్థము వ్రాసినను స్థలాంతరమందు నా చెప్పినరీతినె వ్రాసి యున్నారు. "క్రియాంతవర్ణములు... ... ...చేతురు; చేయుచున్నారు, చేయఁ

గలరు... ...మొదలగు బహువచన ప్రత్యయ రేఫము లఘువు. 'క్రియా స్తేచ' అను వాక్యమున కర్థమిదిమేయని యెఱుంగవలయును."

(ద్వి రేఫ. ౫౭ పుట.)

పయిరీతిని 'క్రియా స్తేచ' అనుదానిచేఁ గ్రియాప్రత్యయములు చెప్పఁబడినపుడు దానివెంటనేయున్న 'అన్యవర్ణేచ' అనుదానిచేతఁ గ్రియా ప్రత్యయేతరములగు నామ ప్రత్యయములు చెప్పఁబడు ననుటయు యుక్త మేకదా. మఱియు సుప్తిఙ్ ప్రత్యయములం దవ్యభిచరితముగ వర్తించు చున్న యీ యనుగమమును 'క్రియాంత' ఇత్యాదికముచే మొదట సూత్రించి వేసి తర్వాతఁ బ్రకృతులలోని రేఫ ఱకారముల విషయమున యథావకాశ ముగ ననుగమములను గారికావళీకర్త "ద్వివిధాదిమత" ఇత్యాదికముచే నుపదేశింప సాగెననుట యెంతయు యుక్తము కాదా?

(౪౦౪)—పయిరీతినె "ద్వివిధాదిమత" ఇత్యాది కారికకును రంగనాథ కవి వ్యాఖ్య వేఱువిధముగ నున్నది. అతఁడు "ద్వివిధ" అనుదానిని 'అ యవా' అనుదానితో సైత మన్వయించి "అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ" అను నచ్చులకును నట్టి యచ్చులతోఁ గూడిన "క్, గ్, చ్, జ్, త్, ద్, న్. ప్, బ్, మ్, వ్, స్," అను హల్లునకును దర్వాత రేఫ ఱకారములు రెండును నుండవచ్చుననియు జకారమునకుఁ దర్వాత లఘురేఫ ముండదనియు సకా రము తర్వాత నలఘు రేఫ ముండదనియు వ్యాఖ్యచేసెను. మఱియు 'నమరా' అనుచోటి రేఫము విషయమునఁ దక్కిన వాని విషయమునవలె వ్యాఖ్య చేయరాదనియు నచటఁ బదాదిని రేఫ ఱకారములు రెండును నుండవచ్చునని యర్థము చేయవలయు ననియు నీ క్రిందిరీతిని (నిర్మూలమని సంశయింపక) వ్రాసెను. "రేఫాది శబ్దములలో నాదివర్ణము ద్వివిధమనియుఁ (రేఫ ఱకార ములు రెండును బదాది నుండునని యర్థము) దాత్పర్యము. ఇంతియకాని యితర వర్ణమునకువలె రేఫమునకును బరంబున గురులఘువు లున్నవని చెప్ప రాదు. అట్టి శబ్దంబు లెచ్చట నేనియుఁ గానరావు." (ద్వి రేఫవ. ౧ ఆ. ౬, పుట) మఱియు నిట్లె రంగనాథకవి, ప్రకృతసూత్రమున జసలకుఁ దర్వాత రేఫఱకారములు రెండును నుండునని చెప్పి జకారమునకుఁ దర్వాత లఘు రేఫ ముండదనియు సకారమునకుఁ దర్వాత నలఘు రేఫ ముండదనియు నిషే ధించుటచేత జకారమునకుఁ దర్వాత రేఫమును సకారమునకుఁ దర్వాత ఱకారమును నరుదుగా నుండునని యీ క్రిందిరీతిని నిర్మూలముగ సమర్థించెను.

సీ. కంజాతనాభ జకారపరంబునఁ, గలుగదు లఘువు సకారపరము,
నందు లే దెపుడు శకటాంగ రేఫంబైన మొదల నా రెంటిని మూలకారుఁ,
డుభయ యుగ్వర్ణాళి నుచ్చరించుటఁ జేసి యత్యల్పముగ నుండు నంచుఁ దలఁచి,
చెప్పెద వాని పెంజెరయును జరగుట, సుఱసుఱ స్రుక్కె నసుఱసుఱనఁగ,

తే. గీ. నింకఁ బ్రాక్కువు లెచ్చుట నేనిఁ బ్రాస,
యతుల నిడ నవి తక్కంగ నా జకార,
పరమునను లేదు లఘువు సవర్ణపరము,
నందు గురువునులేదు దయాపయోధి.

మూలకారుఁడు = అధర్వణాచార్యులు - (ద్విరే. ౨ ఆ. ౮౫ పుట.)

(రంగ)—— 'ద్వివిధాదిదుత' ఇత్యాది కారికాకర్తకే 'ద్వివిధ' అను దళమును 'అయవా' అను దానికి సైతము తగిలింపవలయు నను నుద్దేశ మున్న యెడల 'ద్వివిధాదిదు దేదోత్రో। భవేయుశ్చకగా తథా।' అని యిట్లు సూత్రింపక 'ద్వివిధ' శబ్దమును అదిదుత్తు' లకు మాత్రము చెందునట్లు సమాస ఘటితముగ బంధించి యుండఁడుగదా. మఱియు రేఫశకట పరకాక్షర ములను వేర్వేఱను ప్రక్రమమున నసంగతముగను నిశ్శక్తికముగను బదాది శకటములను వివక్షించుచు 'నమరాః' అని చెప్పియుండుననుట యెంతమాత్ర మును సరికాదు గదా. ఇఁక రంగనాథకవి సమన్వయమును విడిచి 'నమరాః' అనుచోట నమలతోపాటు రేఫమును రేఫద్వయపరకమై యుండునని యర్థము చేయుద మన్న శకటపరక రేఫము గగనారవింద ప్రాయమగుటచే నచట 'నమ' అను దానికిఁ దర్వాత 'రాః' అనుదాని పాఠమె గ్రంథకృత్ప్ర యుక్తము కాదనకతీరదు. ఇఁక 'లఘుః' అను దానిని 'జకారస్య' అను దానితో నన్వయించి జకారమునకుఁ దర్వాత లఘురేఫమును సకారమునకుఁ దర్వాత నలఘువును నరుదుగ నున్నవని స్వారస్యముచెప్పిన రంగనాథకవిగారి వ్యాఖ్యానము సయితము సరియైయుండలేదు. రంగనాథకవిగారు, చూపినవాని యందే కాక శబ్దరత్నాకరకర్త చూపిన రేఫఱకారశబ్ద ప్రపంచమునందును రేఫ పరక జకార మరుదనుట పొసఁగనేరదు. అకారపరక జకార మంతకంటెను నరుదయి యున్నది. శబ్దరత్నాకరమున "జెర, జరగు, జెరత, జెరపు" అను నవి మొదలగు పదునేడు శబ్దములు హ్రస్వాకార విశిష్ట జకార సందర్భమునఁ గలవు. అట్లె యికారాది విశిష్ట జకారముల సందర్భమున 'జిరా, జీర, జీరా, జీరులాడు, జీరువాఱు' మున్నగు ననేక శబ్దములు చూపఁబడియున్నవి. శకట

పరక జకార ములను 'జెఱభి, జిఱగొను, మాజాఱము, తుజాఱము, జిఱాబా, జిఱజిఱ' (ద్వి రే. ౧౧౦ పుట) అను కతిచిత్సంఖ్యాకములనే రంగనాథకవి యుదాహరించెను. ఇంకను 'జాఱు' మున్నగునవి యనునుగ శబ్దరత్నాకర మున నున్నను లఘురేఫపరక జకారములకన్న నవి యల్పసంఖ్యాకములె యై యున్నవి. కాన రంగనాథకవిచేసిన సమన్వయము విపరీతమగుచుఁ బరాస్తమగుచున్నది. ఇంక శకటపరక సకారములకు రంగనాథకవి యిచ్చిన రెండు దాహరణములలోను 'అసుఱుసురను' అను దానిలో నప్పకవి శకటము నంగీకరించుటకుఁ బ్రమాణ మగపడదు. శబ్దరత్నాకరమున నది రేఫ ములతోఁ జూపఁబడియున్నది. ఇంతేకాక నది ప్రుక్కుటలోని యనుకరణమై యున్నది. ఇట్లె రంగనాథకవి చూపిన 'సుఱసుఱ' అనునదియు ననుకరణ శబ్దమె యై యున్నది. అనుకరణ శబ్దములలో నేరేఫముండునన్నను ననవచ్చును. మఱియు నట్టివి నన్నయభట్ట యతిప్రాస స్థలములలో నెచ్చటను లేవు. కాఁగా వాని నథర్వణుఁడు పాటింపలేదనుటయె యుక్తము. ఇంతియకాక జన విషయ మునఁ గ్వాచిత్కతను బోధించుటకయి యిట్లు చెప్పునప్పుడు రంగనాథకవిగారు చూపినవానిలో నయితము రెండు మూఁడు శబ్దములలో మాత్రమున్న శకట పరక దకారము విషయమునను నాలుగయిదు శబ్దములలో మాత్రమున్న శకటపరక బకారము విషయమునను నట్టి రచనమును గారికాకర్త చేసి యుండ కుండునా? పై సందర్భమునుబట్టి రంగనాథకవి చేసిన సమన్వయము సరికాదనియు, నచట నే నంగీకరించిన పాఠాంతరములె గ్రంథకృదభిప్రేతము లనియు (నన్నయభారత భాగ యతిప్రాస స్థలములకుఁ గుదిరి యుండుటచేత) నా చేసిన యట్టి రెండు సవరణములును మిక్కిలి సంభావ్యము లగుటచేత నవశ్యముగ నంగీకర్తవ్యములనియు విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురుగాక.

వెనుక నుదాహరించిన రీతిని బయికారికలలోని యనుగమములు నన్నయ భారతభాగ యతిప్రాసస్థలస్థిత రేఫఱకారముల విషయమున మాత్రమె కుదురుపడుచుండుటంజేసి వానిని సకల కవిప్రయోగ ప్రపంచపరముగా సమన్వయింపఁ బూనుటయు నట్లు కుదురుపడనప్పుడు విపరీతములగు వింత వింత వ్యాఖ్యలను జేయుటయు యుక్తముకాదని గ్రహింపనగును. పై విషయము పాఠక మహాశయులకు విదితమగుటకయి యీ సందర్భమున నన్నయభట్ట భారత భాగ యతిప్రాసస్థల ప్రయుక్త రేఫఱకారములనెల్లఁ జూపుట యావ శ్యక మనితోఁచి యట్టి వాని నుదాహరించుచున్నాను.

(౪౦౬) {నన్నయ భారత భాగ యతిప్రాసస్థలస్థిత సుప్రత్యయ రేఫము లనఁగా నామ ప్రత్యయ రేఫములు.}

నల్వురన్—ఆది. ౮ ఆ. ౩౧౪ ప.

మువ్వురు—అర. ౨ ఆ. ౩౪౭ ప.

ఏగురు—ఏవురు—ఆది. ౬ ఆ. ౨౪౦ ప. ౭. ఆ. ౨౧౬ ప.

కాల్వురు—ఆది. ౧ ఆ. ౮౧ ప.

వేల్పులార }
ఈశులార } 'ఆది. ౭ ఆ. ౨౦౯ ప.

తారు—(తమరు) సభా. ౧ ఆ. ౧౭౮ ప.

లోకపాలురన్—సభా. ౧. ఆ. ౨౨౫ ప.

పల్వురన్—అర. ౧ ఆ. ౧౨౮ ప.

ఎవ్వారు—ఆది. ౬ ఆ. ౨౭౧ ప. ౭ ఆ. ౭౯, ౨౦౭ ప. ౮ ఆ. ౨౮౪ ప. సభా. ౧ ఆ. ౧౭౩ ప. అరణ్య. ౨ ఆ. ౧౮౫-౨౧౪ ప.

వారు—ఆది. ౨ ఆ. ౧౪. ౬ ఆ. ౧౪౯, ౧౯౯, ౨౧౧ ప. ౭ ఆ. ౫౭-౨౪౯ ప. ౮ ఆ. ౧౮౭ ప. సభా. ౨ ఆ. ౧౭, ౨౮౨ ప. అర. ౧ ఆ. ౩౨, ౧౦౦, ౧౨౨, ౩౭౯ ప. ౨ ఆ. ౪౯ ప.

మీారు—ఆది. ౩ ఆ. ౫౩ ప. ౬ ఆ. ౧౩౬ ప. ౭ ఆ. ౨౪౯ ప. సభా. ౨ ఆ. ౧౩౯ ప. అర. ౨. ఆ. ౩౧౬ ప.

వీరు—ఆది. ౬ ఆ. ౩౮-౯౦-౧౯౯ ప. ౮. ఆ. ౨౯ ప. అర. ౩ ఆ. ౧౯౧ ప.

## క్రియాప్రత్యయ రేఫములు

చొచ్చిరి - ఆది. ౨ ఆ. ౧౦౦ ప.
పుట్టిరి - ఆది. ౩ ఆ. ౮౧ ప.
పూజించిరి - ఆది. ౩ ఆ ౧౫౭ ప.
చూపిరి - ఆది. ౩ ఆ. ౧౮౪ ప.
చనుదెంతురు - ఆది. ౪ ఆ. ౫౬ ప.
ఇచ్చిరి — ఆది. ౪ ఆ. ౫౬ ప.
ఏసిరి - ఆది. ౪ ఆ. ౨౦౧ ప.
కారు - ఆది. ౪ ఆ. ౨౩౬ ప. }
అర. ౩ ఆ. ౧౯౧ ప. }

దీవించిరి - సభా. ౧ ఆ. ౮౬ ప.
కాంచిరి - సభా. ౧ ఆ. ౧౭౩ ప.
ఏగుదెంచిరి—అర. ౧ ఆ. ౧౧ ప.
ఆలింపరు - అర. ౧ ఆ. ౧౩౭ ప.
వత్తురు — అర. ౨ ఆ. ౨౧౪ ప,
కాంతురు - అర. ౨ ఆ. ౨౩౫ ౨౭౩ ప.

చూచిరి - ఆది ౫ ఆ. ౧౫౦ ప. }
సభా ౧ ఆ. ౨౨౧ ప. }

జీవింతురు - ఆది. ౬ ఆ. ౧౮౩ ప.

నివేదింతురు ఆది. ౬ ఆ. ౨౪౦ ప.
(సమర్పించు)

ఓపరు — ఆది. ౭ ఆ. ౬౦ ప.
అర. ౪ ఆ. ౮౮ ప.

ప్రార్థించిరి - ఆది. ౭ ఆ. ౧౫౪ ప.

అందిరి. - ఆది. ౭ ఆ. ౧౯౭ ప.

(౪౦౭)—సంయుక్త రేఫములు; నన్నయ భారత భాగ యతిప్రాసస్థములు—

మ్రింగు - ఆది - ౨ ఆ. ౧౫ ప.

విగుర్వించు (విఱుచు+విఱుచు, శబ్దరత్నా) (తత్సమమెయని కొందఱు) ఆది. ౭ ఆ. ౨౭౫.

పేర్మి (ప్రేమ, గౌరవము) ఆది ౮ ఆ. ౭౦ ప. సభా. ౨ ఆ ౨౬౯, ౨౮౨ ప. అర. ౧ - ఆ. ౪౨. ౨౩౯ - ప. ౩ ఆ. ౨౭౯ ప.

{నన్నయ భారత భాగ యతిప్రాసస్థలస్థితములగు తద్భవములలోని రేఫములు.}

పరికించు (పరీక్షించు-ప్రకృతి) ఆది. ౩ ఆ. ౧౩౧ ప. సభా. ౧ ఆ. ౪౯ ప. అర. ౨ఆ. ౨౧౪ ప.

సిరి (ప్రకృతి. శ్రీ.) అరణ్య ౨ ఆ ౧౧౧.

రూఢి (రూఢి ప్రకృతి) ఆది. ౧ ఆ. ౭౦ ప.

అచ్చెరువు (ఆశ్చర్యము. ప్ర) ఆది. ౧ ఆ. ౧౫౬ ప. ౨ ఆ. ౧౧౪ ౩ ఆ. ౨౧౬. సభా. ౧ ఆ. ౨౬౩ ప. అర. ౨ ఆ ౨౭౩ ప. ౩ ఆ. ౮౩ ప.

రమణ (రమణము, ప్రకృతి) ఆది. ౪ ఆ. ౧౫. ౫౫ ప.

తిరము (స్థిరము-ప్రకృతి) ఆది. ౫ ఆ. ౧౪౫ ప. ౭ ఆ. ౨౧౬ ప. ౮ ఆ. ౫౬. ౬౭. ౧౬౭ ప. సభా:—౧ ఆ. ౨౬-౮౫ ప. అర. ౧ ఆ. ౩౮౬ ప. ౪ ఆ. ౮౪ ప.

గారవము (గౌరవము-ప్రకృ). ఆది. ౭ ఆ. ౮౭ ప.

పేర్మి-(ప్రేమ-ప్రకృతి) ఆది. ౮ ఆ. ౭౦ ప.

పరుసము (పరుషము - ప్రకృతి. కఠినము కఠినస్పర్శము) అర. ౩ ఆ. ౨౯౯. ౩౦౦ ప.

నీరు - (నీరము) ఆది. ౫ఆ. ౨౦౦ ప.

(౪౦౮)—నన్నయ భారత భాగ యతి ప్రాసస్థాచ్ఛిక ప్రకృతిగత రేఫములు.

అరిది—ఆది. ౧ ఆ. ౧౦౬ ప. ౩ ఆ. ౧౮ ప. సభా. ౨ ఆ. ౧౯ ప.

అరుదు—ఆది. ౨ ఆ. ౧౦ ప. ౪ ఆ. ౬౮ ప. ౬ ఆ. ౨౦౭ ప. ౮ ఆ. ౬౯ ప. అర. ౧ ఆ. ౩౨౧ ప. ౨ ఆ. ౩౧. ౨౭౩ ప. ౩ ఆ. ౨౪౧-౩౬౪-౩౭౩ ప. ౪ ఆ. ౬౧-౧౩౭ ప.

అరుగు—(వచ్చు-వెళ్ళు) ఆది. ౩ ఆ. ౧౪౦ ప. ౫ ఆ. ౧౪౫-౧౯౮ ప. ౬ ఆ. ౧౪౩-౧౬౧ ప. ౮ ఆ. ౧౧౯-౧౭౬-౧౯౬-౨౮౩-౩౧౪ ప. సభా. ౧ ఆ. ౨౨౭ ప. ౨ ఆ. ౨౯౧ ప. అర. ౧ ఆ. ౫ ప. ౨ ఆ. ౧౬౩-౩౩౯ ప. ౩ ఆ. ౧౭, ౮౩, ౧౫౯, ౩౭౩ ప.

అరి (పన్ను) ఆది. ౬ ఆ. ౨౭౧ ప. సభా. ౧ ఆ. ౨౩౩ ప.

ఆరయు—ఆది. ౧ ఆ. ౨౬ ప. ౬ ఆ. ౩౮, ౨౪౨ ప. సభా. ౧ ఆ. ౧౨౩. ప. ౨ ఆ. ౮౨ ప.

ఆరు (నిండు)<br>ఆరంగన్ } ఆది. ౨ ఆ. ౮౪ ప. ౩ ఆ. ౧౬ ప. ౬ ఆ. ౨౫ ప. ౮ ఆ. ౧౮౨ ప. సభా. ౧ ఆ. ౩౫ ప. అర. ౧ ఆ. ౨౨౯ ప. ౨ ఆ. ౨౨. ౯౭ ప.

ఇరువురు—ఆది. ౨ ఆ. ౧౦ ప. ౪ ఆ. ౧౨౧-౧౪౭-౧౯౪ ప. ౮. ఆ. ౧౯౩-౨౮౬ ప. సభా:— ౨ ఆ. ౧౧౨ ప. అర. ౧ ఆ. ౧౩౨-ప. ౨ ఆ. ౩౩౯ ప.

ఊరార్చు—అరణ్యా. ౩ ఆ. ౧౬౦ ప.

అయ్యోర—(ఆమోద) ఆది.౧ ఆ. ౧౫౩ ప.

ఎరఁగు—(నమస్కరించు) ఆది. ౭. ఆ. ౧౧౨ ప.

ఒరులు<br>ఒండొరు } ఆది. ౧ ఆ. ౧౬౦. ప. ౨. ఆ. ౨౧౨ ప. ౩ ఆ. ౧౬౮ ప. ౪ ఆ. ౧౯౪ ప. ౫ ఆ. ౭౬-౧౫౦-౨౧౦ ప. ౬ ఆ. ౮౬-౨౬౯ ప. ౭ ఆ. ౨౭. ౨౦౫ ప. సభా. ౨ ఆ. ౧౧౨ ప. అర. ౩ ఆ. ౩౯౪ ప.

ఒక్కరుఁడు. ఆది. ౧ ఆ. ౧౦౫ ప. ౨. ఆ. ౧౦౫ ప. ౮ ఆ. ౧౬౭ ప. అర. ౨ ఆ. ౬ ప.

కరము (అత్యంతము) ఆది. ౧ ఆ. ౧౨౦ ప. ౨ ఆ. ౭౭ ప. ౩ ఆ. ౧౮౪ ప. ౫ ఆ. ౧౪౫-౨౧౦ ప. ౬ ఆ. ౧౪౯ ప. ౮ ఆ. ౬౩.౬౯ ప.

సభా—౧ ఆ. ౪౩. ౧౫౭. ౨౨౧ ప. ౨ ఆ. ౨౦.

అర—౧ ఆ. ౧౩౨, ౨౯౨.౨౯౪ ప. ౨ ఆ. ౨౧౮. ౩౩౯. ౩౪౭ ప.

కారించు (పీడించు) ఆది. ౫ ఆ. ౧౬౬ ప.

కురియు (వర్షించు) ఆది. ౨ ఆ. ౮౨ ప. ౫ ఆ. ౧౨౪ ప. అర—౧ ఆ. ౧౮౮ ప. ౨ ఆ. ౨౧౮ ప. ౩ ఆ. ౨౯౭ ప. ౪ ఆ. ౬౧-౬౮ ప.

సమకూరు సభా. ౧ ఆ. ౧౫౧ ప.

కోరు (వాంఛించు) ఆది. ౩ ఆ. ౨౦౦ ప. ౫ ఆ. ౧౨౯-౧౬౬ ప. సభా. ౧ ఆ. ౮౮-౧౫౧ ప. అర. ౧ ఆ. ౪౦-౩౭౧ ప.

గారవము. ఆది. ౭ ఆ. ౮౭ ప. అర. ౨ ఆ. ౧౨౪. ప.

విగుర్వించు (విఱుచు + విఱుచు. శబ్దర) (తత్సమమె యని ప్రామాణికులు) ఆది. ౭ ఆ. ౨౭౫. ప.

అచ్చెరువు. ఆది. ౧. ఆ. ౧౫౬ ప. ౨. ఆ. ౧౧౪ ప. ౩ ఆ. ౨౧౬ ప. సభా—౧ ఆ. ౨౬౩ ప. అర—౨ ఆ. ౨౭౩ ప. ౩ ఆ. ౮౩ ప.

చెచ్చెర ఆది—౨ ఆ. ౧౨౯ ప. ౪ ఆ. ౨౪౯ ప. ౫ ఆ. ౨౫౦ ప. ౬ ఆ. ౧౨౬ ప. ౭ ఆ. ౨౭౬ ప. సభా—౧ ఆ. ౫. ౨౬౩ ప. ౨ ఆ. ౩౫ ప. అర—౨ ఆ. ౨౦౮. ౨౯౮ ప. ౩ ఆ. ౧౭ ప.

చేరు (సమీపించు) ఆది. ౨ ఆ. ౧౦౩ ప. ౫. ఆ. ౧౬౬ ప. అర ౨. ఆ. ౨౭౧ ప. (కలుగు. లభించు.)

తరము (పురుషాంతరము) ఆది. ౪ ఆ. ౨౨౨ ప.

తిరము (స్థిరము) ఆది. ౫ ఆ. ౧౪౫ ప. ౭ ఆ. ౨౧౬ ప. ౮ ఆ. ౫౬ ౬౭-౧౬౭ ప. సభా. ౧ ఆ. ౨౬. ౮౫ ప. అర—౧ ఆ. ౩౮౬ ప. ౪ ఆ. ౮౪ ప.

తిరుగు (సంచరించు) ఆది. ౧ ఆ. ౧౫౩ ప. ౬ ఆ. ౨౦౨ ప (కంటి గ్రుడ్లు తిరుగు). అర. ౪ ఆ. ౯౪ ప. (దిద్దిరం దిరుగు).

తెరలు (విసరు-సమృద్ధమగు) ఆది. ౮ ఆ. ౨౮౩ ప. సభా. ౧ ఆ. ౨౨౭ ప. అర:—౧ ఆ. ౧౮౮. ౧౯౫ ప. అర. ౪. ఆ. ౬౮ ప. (తెరలంగవైచు = తిరుగఁద్రోయు).

తెరువు (దారి) ఆది. ౭ ఆ. ౧౧౨ ప.

తేరన్ (తెచ్చుట నిమిత్తము = తేన్) అర. ౩ ఆ. ౭౬ ప.

చనుదేరక. ఆది. ౫ ఆ. ౬౮ ప. సభా. ౨ ఆ. ౧౩౯. ప.

తొరఁగు (పడు) ఆది. ౬ ఆ. ౨౧౦ ప.

ముందర (తొలుత) అర. ౩ ఆ. ౨౪౧ ప.

దరికొను (ప్రజ్వరిల్లు) సభా. ౧ ఆ. ౨౫౧ ప.

దొర (సాటి) ఆది. ౬ ఆ. ౪౫ ప.

నర (పలితము) ఆది. ౩ ఆ. ౧౯౪ ప.

ఒనరు. సభా. ౨ ఆ. ౮౧ ప.

నారలు (వల్కలము) అర. ౨ ఆ. ౩౨౯ ప.

నీరు (జలము) ఆది. ౫ ఆ. ౨౦౭ ప.

నెరయు (ఆచ్ఛాదించు, వ్యాపించు) ఆది. ౩ ఆ. ౧౫౭ ప. ౮ ఆ. ౧౯౬ ప.

రానేరరు. ఆది. ౫ ఆ. ౬౮ ప. ౭ ఆ. ౧౯౯ ప. ౮ ఆ. ౩౦౪ ప. అర. ౩ ఆ. ౧౬౨. ౩౦౨. ౩౨౭ ప.

పరఁగు (వర్తిల్లు, ప్రసిద్ధమగు) ఆది. ౧ ఆ. ౩౨ ప. ౨ ఆ. ౧౩౯ ప. ౩ ఆ. ౮౮ ప. ౪. ఆ. ౧౧౦ప. ౫ ఆ. ౭౬, ౨౨౬ ప. ౮ ఆ. ౧౦౦. ౧౮౭ ప. సభా—౧ ఆ. ౬౬-౨౬౪ ప. ౨ ఆ. ౧౨ ప. అర. ౧ ఆ. ౧౧౬. ౧౩౧ ప. ౨ ఆ. ౨౬౩.౩౧౦ ప. ౩ ఆ. ౨౯౯. ౩౩౧. ౩౬౪ ప.

దెప్పరము (అసహ్యావాక్యము) సభా. ౨ ఆ. ౨౫౫. ప.

పరికించు. ఆది. ౩ ఆ. ౧౩౧ ప. సభా. ౧ఆ. ౪౯. అర. ౨ ఆ. ౨౧౪ ప.

పరువడి (క్రమము) ఆది. ౩ ఆ. ౧౪౦ ప. ౬ ఆ. ౭౧. ౨౯౯ ప. సభా. ౧ ఆ. ౨౨౭ ప. ౨ ఆ. ౨౦౦ ప. అర. ౧ ఆ. ౧౧ ప.

పరుసము అర. ౩ ఆ. ౨౯౯. ౩౦౦ ప.

పురుడు (సాటి) ఆది. ౭ ఆ. ౨౭ ప
(ప్రసవము) అర. ౩ ఆ. ౨౪౧ ప.

పెరుఁగు (వర్ధిల్లు) ఆది. ౩ ఆ. ౧౨ ప. సభా. ౨ ఆ. ౨౫౫ ప. అర. ౩ ఆ. ౨౪౦ ప.

పొరయు (పొందు) ఆది. ౧ ఆ. ౧౬౦. ప. ౩ ఆ. ౧౨. ౧౪ ప. ౬ ఆ. ౨౬౯ ప. ౭ ఆ. ౧౦౪ ప. ౮ ఆ. ౮౩ ప. సభా. ౧ ఆ. ౪౭ ప. ౨ ఆ. ౩౫ అర. ౧ ఆ. ౨౪౨ ప.

పోరి (క్రమము మిక్కిలి) అర. ౧ ఆ. ౧౧౮ ప.

పోరచి (వ్యర్థము) ఆది. ౫ ఆ. ౧౨౯ ప.

పోరు (యుద్ధము) ఆది. ౩ ఆ. ౧౦౩ ప. సభా. ౧ ఆ. ౬౬ ప. అర. ౧ ఆ. ౧౦౨. ౨౭౪ ప. ౩ ఆ. ౩౯౪ ప. ౪ ఆ. ౨౧ ప.

బోరన (శీఘ్రముగ.) ఆది. ౨ ఆ. ౩౯. ౨౩౬ ప. ౪ ఆ. ౧౯౨ ప. ౭ ఆ. ౧౭౩ ప. అర. ౨ ఆ. ౨౯ ప.

బోరు (వర్షాది పాతమునందలి ధ్వన్యను కరణశబ్దము) ఆది. ౨.ఆ. ౧౦౦ ప. అర. ౧ ఆ. ౨౮౭. ప. (ఇది 'శీఘ్రమున' అనుటకు సరిపడును).

మీారలు. ఆది. ౨ ఆ. ౧౪౭ ప. (ఇది ప్రత్యయగతమె యనవగును).

రమణ. ఆది. ౪ ఆ. ౧౫. ౫౫ ప. ౬ ఆ. ౧౨ ప. ౭ ఆ. ౧౬౬ ప. ౮ ఆ. ౬౬ ప. సభా—౧ ఆ. ౨౧౫ ప.

రమ్మ, సభా. ౨ ఆ. ౨౪౭ ప. అర. ౧ ఆ. ౬౩ ప. ౨ ఆ. ౧౨౪ ప.

రాఁగన్ ఆది. ౩ ఆ. ౧౮౨ ప.

రాఁడు (రాలేదు) ఆది. ౩ ఆ. ౧౧౨ ప.

రావించు. సభా. ౨ ఆ. ౧౪౭ ప. అర. ౨ ఆ. ౨౮ ప.

రూఢి. ఆది. ౧ ఆ. ౭౦ ప. ౮ ఆ. ౧౫౬ ప.

రెండు. ఆది. ౧ ఆ. ౧౦౧ ప. ౨ ఆ. ౮౮ ప. సభా. ౨ ఆ. ౨౬ ప. అర. ౧ ఆ. ౨౧ ప.

రేఁగు (విజృంభించు) అర. ౩ ఆ. ౧౪ ప.

రేయి (రాత్రి) ఆది. ౨ ఆ. ౧౫౬ ప. అర. ౩ ఆ. ౧౪ ప.

వరవుడు (దాసి) సభా. ౨ ఆ. ౨౦౦ ప.

వరుస. ఆది. ౪ ఆ. ౨౨౨ ప. ౬ ఆ. ౧౦౨ ప. సభా. ౧ ఆ. ౨౫౧ ప. అర. ౪ ఆ. ౬౧ ప.

వారకములు. ఆది. ౩ ఆ. ౧౫౨ ప. (ఎరవిచ్చినసొమ్ము)

వారలు. ఆది. ౧ ఆ. ౩౪ ప. ౨ ఆ. ౯౦. ౧౯౯ ప. ౩ ఆ ౧౦౩ ప. ౪ ఆ. ౨౦౨ ప. ౫ ఆ. ౧౬౬ ప. ౬ ఆ. ౭౪ ప. ౮ ఆ ౪౩ ప. సభా .౧ ఆ ౪౨. ప. అర. ౧ ఆ. ౧౦౦.౨౭౨. ౨౭౯. ప. ౨ ఆ. ౧౩౯. ౩౦౮ ప. ౩ ఆ. ౫౯ ౨౯౪-౩౨౭ ౩౯౪. ప. (ఇది ప్రత్యయగతమె యనవగును).

విరియు (నశించు) ఆది. ౭ ఆ. ౪౪ప. అర. ౨ ఆ. ౧౧౧ ప.

వీరలు. ఆది. ౫ ఆ. ౬౮-౧౫౦ ప. ౬ ఆ. ౩ ప. ౮ ఆ. ౩౦౪ ప.

సభా. ౨ ఆ. ౨౭౬ ప. అర. ౧ ఆ. ౨౬౩ ప. (ఇది ప్రత్యయగతమె యననగును).

సరి. (సాటి) సభా. ౧ ఆ. ౬౦ ప. ౨ ఆ. ౧౧౭ ప. అర. ౧ ఆ. ౩౦౬ ప. ౩ ఆ. ౩౩౧ ప.

సిరి. అర. ౨ ఆ. ౧౧౧ ప.

సూరెలు. (పార్శ్వములు) ఆది. ౨ ఆ. ౧౯౯ ప.

సెరగు. (ఆపద) ఆది. ౭ ఆ. ౧౧౯ ప.

(౪౯) నన్నయభట్ట భారతభాగ యతిప్రాసస్థలములలో ద్విరుక్తఅకార మొక్కచోటను మాత్రమె గలదు.

క॥ ...కొ। ట్టులఁ బెట్టితి నీవు నీ చిఱుతకాలము... ...(ఆది. ౪ ఆ. ౨౭౧ప.)

ఇట 'కొట్టు' శబ్దములోనిది ద్విరుక్త అకారమనుటలో విప్రతిపత్తిలేదు.

(౫౦) {నన్నయభట్ట భారత భాగ యతిప్రాస స్థలస్థిత (శకట) అకారములు}

అఱ. (కీడు) ఆది. ౩ ఆ. ౧౨ ప.

అఱ. (సగము) అర. ౭ ఆ. ౧౩౫ ప.

అఱకడ. (స్కంధము) ఆది. ౬ ఆ. ౧౧౫. ౧౬౧ ప.

అఱచు. అర. ౨ ఆ. ౧౧౧ ప. ౩ ఆ. ౧౫౩ ప.

ఆఱు. (ఉపశమిల్లు) ఆది. ౪ ఆ. ౧౯ ప.

ఇఱుకు. (ఇఱికించు) ఆది. ౨ ఆ. ౭౦ ప.

ఉఱు. (లక్ష్యపెట్టు) ఆది. ౬ ఆ. ౧౬౦. ౧౯౫ ప. సభా. ౨ ఆ. ౩౦౬ ప. అర. ౪ ఆ. ౬౭ ప.

ఉఱుము. (గర్జించు) ఆది. ౭ ఆ. ౨౭౦ ప.

ఊఱడు- (ఉపశమిల్లు. విశ్రాంతినందు) ఆది. ౪ ఆ. ౧౯ ప.

ఎఱచి- (మాంసము) ఆది. ౫ ఆ. ౫౩ ప.

ఎఱుక - (జ్ఞానము) ఆది. ౩ ఆ. ౧౨. ౨౦౩ ప. సభా. ౨ ఆ. ౨౬౫ ప. అర. ౧ ఆ. ౨౨౨ ప. ౨ ఆ. ౯౧ ప.

ఎఱుకు. (బోయ) ఆది. ౫ ఆ. ౫౩ ప. అర. ౧ ఆ. ౩౨౬ ప. ౨ ఆ. ౯౧ ప.

ఎఱుఁగు. (తెలిసికొను) ఆది. ౩ ఆ. ౨౦౩ ప. ౪ ఆ. ౬౭. ౭౨ ప. ౫ ఆ. ౬౦. ౧౭౮-౧౭౫ ప. ౬ ఆ. ౧౦౩-౧౪౭-౧౫౫-౧౬౧-౧౯౫. ప.

౭ ఆ. ౭౪ ప. ౮ ఆ. ౧౧౫.౧౮౭.౩౧౫ ప. సభా——౨ ఆ. ౨౯. ౨౦౯ ౨౬౫ ప. అర. ౭ ఆ. ౧౫౮ ప. ౩ ఆ. ౪౬.౧౫౩.౧౭౯ ప.

ఒఱవ. ( వక్రము ) అర. ౨ ఆ. ౧౩౫ ప.

ఒఱపు ( తాపము ) అర. ౨ ఆ. ౧౩౫ ప.

కఱ. ( నలుపు. కఱకంటుఁడు ) అర. ౧ ఆ. ౩౨౬ ప.

కఱకు. ( కఠినము ) ఆది. ౭ ఆ. ౨౨౬ ప.

కఱచు. ( కాటువేయు ) ఆది. ౧ ఆ. ౧౪౭ ప.

కఱచు ( అభ్యసించు ) ఆది. ౩ ఆ. ౧౨. ౨౦౩ ప. ౮ ఆ. ౨౭౪ ప.

కఱటి. ( మూర్ఖుఁడు ) ఆది. ౪ ఆ. ౭౨ ప.

కఱపు. ( ప్రేరించు ) ఆది. ౩ ఆ. ౧౨ ప.

కఱపు. ( నేర్పు ) సభా. ౨ ఆ. ౨౬౫ ప.

కాఱడవి. ( సాంద్రారణ్యము ) ఆది. ౪ ఆ. ౧౯ ప.

ఒక్కఱ. ( ఉగ్రత ) ఆది. ౫ ఆ. ౨౫౬ ప.

కొఱ. ( ప్రయోజనము ) అర. ౨ ఆ. ౧౩౫ ప.

కొఱ్ఱు. ( మేకు ) ఆది. ౪ ఆ. ౨౭౧ ప.

కొఱుకు ( ఖాదించు ) ఆది. ౬ ఆ. ౨౦౨ ప.

గిఱుపు. ( త్రిప్పు ) ఆది. ౫ ఆ. ౧౬౪ ప.

గుఱుకొను. ( యత్నించు ) ఆది. ౫ ఆ. ౧౭౮ ప. ౬ ఆ. ౧౦౩ ప. ౮ ఆ. ౨౭౦. ౩౧౫ ప.

చఱచు. (అఱచేతితోనదుము) ఆది. ౨ ఆ. ౭౦ ప. సభా. ౧ ఆ. ౨౧౨ ప.

చిఱుత ( చిన్న ) ఆది. ౪ ఆ. ౨౭౧ ప. సభా. ౨ ఆ. ౨౨౮ ప.

చిఱు ( చిన్న ) ఆది-౫ ఆ. ౨౫౬ ప. (చిఱుతొండ = పిక్క).

చెఱుచు. ( చెడఁజేయు ) ఆది-౫ ఆ. ౧౮౫ ప. ౬ ఆ. ౧౧౫. ప. సభా. ౨ ఆ. ౩౦౬ ప.

తఱి. ( సమయము ) ఆది. ౬ ఆ. ౧౧౫ ప. అర. ౩ ఆ. ౧౫౩ ప.

తఱుచు ( సాంద్రము ) సభా. ౨ ఆ. ౩౦౬ ప.

తఱుసలి. ( ఉద్ధతుఁడు ) సభా. ౨ ఆ. ౨౨౮ ప.

తీఱు. ( నివర్తిల్లు ) ఆది. ౪ ఆ. ౧౯ ప.

తెఱఁగు. ( విధము ) అర. ౩ ఆ. ౪౬ ప.

వాతెఱ = ( అధరము ) } ఆది. ౭ ఆ. ౭౪ ప.
తెఱ = తెఱపి.

అందొఱు ( సర్వాత్మావదర్థక బహువచనము ) ఆది. ౫ ఆ. ౧౬౪ ప.

ఇందఱము. ( ఇయదర్థక బహువచనము ) ఆది. ౬ ఆ. ౧౫౫ ప.

నెఱయు ( నిండు ) ఆది. ౬ ఆ. ౧౬౧ ప.

నెఱఁకులు. ( మర్మస్థలములు ) ఆది. ౪ ఆ. ౨౦౩ ప.

నెఱి. ( పరాక్రమము. వ్యాప్తి - అందము) ఆది. ౪ ఆ. ౨౦౩ ప. ౬ ఆ. ౧౫౫ ప. ౭ ఆ. ౭౪ ప. అరణ్య ౧ ఆ. ౩౨౬ ప.

నుఱుము. ( చూర్ణము ). ఆది. ౬ ఆ. ౧౬౧ ప. అర. ౪. ఆ. ౬౮ ప.

{అంపఱ. ( బాణ సమూహము ). ఆది. ౪ ఆ. ౨౦౩ ప.
{పఱ ( సమూహము ).

పఱచు. ( పాఱిపోవు, పరుగిడు ) ఆది. ౨ ఆ. ౭౦ ప. ౫ ఆ. ౫౩.౧౬౪ ప. ౮ ఆ. ౨౭౪ ప. అరణ్య. ౨. ఆ. ౧౧౧ ప.

పఱతెంచు. ( పరుగున వచ్చు ) ఆది. ౫ ఆ. ౨౫౬ ప.

పఱపు. ( శయ్య. ) ఆది. ౭. ఆ. ౨౨౬ ప.

పెఱ. ( అన్యము ) ఆది. ౨ ఆ. ౭౦ ప. ౮ ఆ. ౧౧౫ ప.

మఱకువ. ( అజ్ఞానము. ప్రమాదము ) అర. ౧ ఆ. ౩౨౬ ప.

మఱచు. ( విస్మరించు ) ఆది. ౩ ఆ. ౨౦౩ ప. ౪ ఆ. ౬౮. ౭౨ ప. ౫ ఆ. ౫౩. ౬౦ ప. ౬ ఆ. ౧౦౩ ప. ౮. ఆ. ౩౧౫ ప. సభా. ౨ ఆ. ౨౬౫ ప.

మఱి } ( ఇంతేకాక.) ఆది. ౪ ఆ. ౭౧ ప. ౫ ఆ. ౧౭౮ ప.
మఱియు } ౮ ఆ. ౨౭౦ ప.

మఱువు. ( చాటు ) ఆది. ౬ ఆ. ౨౦౨ ప.

ఏ మఱు ( ఏమఱిల్లు ) ఆది. ౬ ఆ. ౧౫౫. ౧౯౫ ప. ౮ ఆ. ౩౧౫ ప.

మెఱపు. ( విద్యుత్తు ) ఆది. ౭ ఆ. ౧౬౦ ప.

మెఱయు. ( ప్రకాశించు - ప్రకాశింపఁజేయు ) ఆది. ౫ ఆ. ౧౬౪ ౧౭౮ ప. ౬ ఆ. ౧౬౧ ప.

మెఱుచు ( యు ? ) ( ప్రకాశించు. ) ఆది. ౬. ఆ. ౨౦౨ ప.

మెఱుఁగు ( కాంతి ) అర. ౩ ఆ. ౧౭౯ ప.

వఱలు. (ఒప్పు) ఆది. ౬ ఆ. ౧౧౫. ౧౬౦ ప. ౮ ఆ. ౨౭౦ ప. సభా—౧ ఆ. ౨౧౨ ప. అరణ్య. 3 ఆ. ౧౫3 ప.

విఱుచు. (భగ్నముచేయు). సభా. ౧ ఆ. ౨౧౨ ప.

వెఱ (భయము). ఆది. ౫ ఆ. ౨౫౬ ప. సభా. ౧ ఆ. ౨౧౨ ప. ౨ ఆ. 3౦౬ ప.

వెఱచు. (భీతిల్లు) ఆది. ౧ ఆ. ౧౪౭ ప. ౪ ఆ. ౨౦3 ప. ౬ ఆ.౧౯౫-౨౦౨ ప. ౮ ఆ. ౨౭౪ ప.

(౪౧౧)—నన్నయ భట్ట భారత భాగములోని పయి యతి ప్రాస స్థలములందు రేఫ ఱకారములు రెండును "అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఒ" అను నచ్చులకును వానితోఁ గూడిన, "క్, గ్, చ్, త్, ద్, ప్, న్, మ్, వ్" అను హల్లులకును దరువాత మాత్రమె యుండుటచేతను, నా యచ్చులతోఁ గూడిన 'స్, బ్' అనువానికిఁ బరమందుఁ రేఫము మాత్రముండుటచేతను, 'చేరు, తేరు, పోరు' మొదలగుచోట్ల నున్న 'ఏ, ఓ' అనువానికిఁ బరమున రేఫము మాత్రమె యుండుటచేతను బయి కారికలు నన్నయ భట్ట భారత భాగ యతిప్రాసస్థలస్థిత రేఫ ఱకారములను మాత్రము వర్ణించుటకయి యుపదేశింపఁబడిన యనుగమములె యనుటకు సందేహము లేదు. ఆ కారణము చేతనె యట్టి నన్నయ భారత భాగ యతిప్రాసస్థలస్థిత రేఫ ఱకారములకు సరిపడునట్లు చేసిన పయి కారికల సమన్వయమె యథర్వణాభిప్రేత మనుటకును సందియము లేదు.

వాగనుశాసనుఁడు తన భారత భాగములో దీర్ఘ పూర్వక శకటప్రాసము నీక్రిందియొక్క పద్యములో మాత్రము ప్రయోగించి యున్నాఁడు.

కం. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడక వధించి డస్సి యున్నతని శ్రమం,
బాఱఁగ నెడఁ బరితాపము, తీఱఁగఁ బై వీచె నన్నదీ పవనంబుల్.

(భార. ఆది. ౪ ఆ. ౧౯ ప) (శబ్దర).

ఈ పద్యములోని ప్రాసస్థలములందలి "కాఱడవి, ఊఱడక, ఆఱఁగ, తీఱఁగ" అను శబ్దములలోని ఱకారములు నన్నయ భారత భాగములోని యతి ప్రాసస్థల ప్రయుక్త రేఫములతో (సంస్కృత శబ్దగతములు మున్నగు నిశ్చిత రేఫములతో) సాక్షాత్సంబంధమునఁ గాని పరంపరా సంబంధమునఁ గాని యెచ్చటను మైత్రినంది యుండమిం జేసియుఁ, దర్వాతి మహాకవులు వానిని శకట ప్రాసములలోనె ప్రయోగించి యుండుటం జేసియు

నవి శకటములై యనియు, నక్కారణమున 'ఆ, ఈ, ఊ' అను దీర్ఘములకుఁ దర్వాత శకటములు నన్నయ ప్రయుక్తములై యున్నవనియు నిశ్చితమగు చున్నది. నన్నయేతర మహాకవుల ప్రయోగములలో 'ఏ, ఓ' అనువానికిఁ దర్వాత సయితము ఱకారముల ప్రయోగమున్నను వాగనుశాసనుఁ డెచ్చటను యతి ప్రాసస్థలములలోఁ బ్రయోగించి యుండమింజేసి పై కారికలలో నథర్వణుఁడు 'ద్వివిధ' శబ్దము 'ఎ, ఒ' లకుఁ జెందకుండ 'ద్వివిధా దిద్రుతశ్చస్యుః' అని సమాస ఘటితముగఁ బ్రయోగించి యుండెననియుఁ జెప్పుట యెంతయు యుక్తి యుక్తముగను విశ్వసనీయముగను నున్నది.

(౪౧౨)— పయి వాగనుశాసన పద్యములోని 'ఆఱు' ధాతువు 'ఉపశమిల్లు' అను నర్థమున వాడఁబడి యుండుటంజేసి 'నిండారు' అను నర్థమున 'ఆరు' అని రేఫయుతముగఁ బ్రయోగించిన యాతని ప్రయోగములు విరుద్ధములు కానేరవు.

కం. "ధీరమతి యుక్తిఁజేసి వి, చారింపఁగ నిక్కువంబు సర్వజన స్వ,
గ్గారోహణ సోపానం, బారఁగ ధర్మంబ చూవె యతి రమ్యంబై."
(అర. ౧ ఆ. ౨౭ ప.)

మధ్యాక్కర. "ఆ రాజు గుణములు........కరుణ నాయందుఁ గావింపు। మారంగ........." ( అర. ౨ ఆ. ౨౨ ప. )

ఇట్లు నన్నయ భట్టారకుఁ డర్థభేదము నాశ్రయించియే 'నెరయు, నెఱయు' అను ధాతు ద్వయమును విభిన్నములుగ నంగీకరించి స్థలాంతరములందుఁ బ్రయోగించి యున్నాఁడు. కాన నట్టివి చూచి రేఫ ద్వయ మైత్రిని నన్నయ భట్టు సైత మంగీకరించెనని భ్రమింపరాదు.

(౪౧౩)—పయిరీతినె నన్నయభట్టపద్య యతిప్రాసస్థలములలో నెచ్చటను రేఫమునకుఁ దర్వాతఁగాని రంగనాథకవిగారు సమన్వయించినట్లు (౪౦౪ వి) పదాదినిగాని ఱ కారము లేమింజేసియు, వెనుక నుదాహరించినరీతి రంగనాథకవిగారి సమన్వయము ప్రక్రమవిరుద్ధమై యసంగతమై యుండుటంజేసియు 'నమరా' అనుపాఠము ప్రమాదపతితమనియు నా వ్రాసిన 'నమవా' అనుపాఠమె యథర్వణాభిప్రేత మనియుఁ జెప్పుటకు సందేహము లేదు. ఈ క్రింది తిక్కయజ్వ ప్రయోగములనుబట్టి యథర్వణుని నాఁటికిఁ బదాది శకటములును మహాకవిసమ్మతములై యుండెనని యంగీకరింపక తీరదు

న్నను నట్టివి నన్నయ ప్రయుక్తములు కామింజేసి యథర్వణుఁడు పై కారిక లలో నట్టి పదాది శకటముల నుపదేశించి యుండె ననుట యెంతమాత్ర మును బొసఁగనేరదు.

(౨౧౪)—నన్నయభట్ట పద్య యతిప్రాసస్థలములలో నెచ్చటను జకారమునకుఁ దర్వాత రేఫముగాని అకారముగాని ప్రయోగింపఁబడి యుండమింజేసి పయికారికలలో జకార ప్రసంగ మప్రసక్తమై యున్నది. మఱియు నీకారికలు నన్నయ ప్రయోగమాత్ర విషయములు కావనియు సకల కవి ప్రయుక్త రేఫ అకార విషయకములనియు నంగీకరించు రంగనాథ కవిగారి పక్షమునకు విరుద్ధముగ జకారమునకుఁ దర్వాత ద్వివిధ రేఫములును గల శబ్దము లితర కవి ప్రయోగములలో ననేకములు గలవనియు నందును నలఘువు లున్న స్థలములకన్న లఘువు లుండెడిచోటులే యధిక సంఖ్యాక ములై యున్నవనియు నీవఱకు విశదీకరించి యున్నాను.

కావున 'చజౌ' అనుపాఠమును "నాస్తి జకారస్య" అనుపాఠమును లేఖక పాఠకాది ప్రమాదజనితము లనుటకు సందేహములేదు. ఇంక సకార మునకుఁ దరువాతవలెనె బకారమునకుఁ దర్వాత సయితము రేఫము మాత్రమె నన్నయ యతిప్రాసస్థలములలో నుండుటఁజేసి సకారమునకుఁ దర్వాత నలఘు వుండదని చెప్పినట్లె బకారమునకుఁ దర్వాత సయిత మలఘు వుండదని కారికాకర్త చెప్పెననుటయె యెంతయు విశ్వసనీయమై యుండుటంజేసి 'చసౌ' 'నాస్తి బకారస్య' అను నా వ్రాసిన పాఠములును నాచేసిన యచటి సమన్వయమును నెంతయు యుక్తియుక్తములై యున్నవనుటకు సందేహము లేదు.

(౨౧౫)—పయి నుదాహరించిన నన్నయ ప్రయుక్త యతిప్రాసస్థల ములలో నెల్లయెడలను నవ్యభిచరితముగ 'సుప్తిఙ్' ప్రత్యయములలోని రేఫములు లఘువులుగానే యుండుటంజేసి రేఫ అకారాన్యతరస్థితి దిఙ్మాత్ర ప్రదర్శనక్షమమగు "ద్వివిధాదిమత... ..." ఇత్యాద్యనుగమములలోఁ జేర్పక 'సుప్తిఙ్' ప్రత్యయరేఫములు లఘువులె యని ప్రత్యేకముగ "క్రియాన్తే చాన్యవర్ణేచ..." అనుదానిచే సుస్పష్టముగ నుపదేశించుట యత్యావశ్యకమై యున్నది. 'అందోఱు, ఇందఱును' అను వానిలోని 'ఱు' అనునది బహువచన ప్రత్యయముగఁ జింతామణిలో నెచ్చట నుపదేశింపఁ బడి యుండలేదు. 'లాన్తాత్తు రుఱౌ' 'సు జసో ర్నమూ వుహూ చ తత్ర స్తః'

'సర్వేషాం బహువచనే రు ఇతి స్యాత్' అని యిట్లు 'రు' అనునది మాత్రము 'సుప్తిఙ్' ప్రత్యయములలోఁ బేర్కొనఁబడినది. కాఁగా 'నందఱు' మున్నగు వానిలోని 'ఱు' అనుదానిని సుప్ప్రత్యయముగఁ గారికాకర్త పరిగణించి యుండఁడయ్యెను. "భవన్త్యజడ వాచిత్వే। ఽప్యన్తా శ్శబ్దా మనోహరాః, జడతా వాచకత్వే తు। స్న్యన్తతా తత్ర దృశ్యతే" అని చెప్పుచున్న వికృతివివేకప్రక్రియనుబట్టి సయితె మధర్వణుఁడు 'అన్ని' 'అందఱు' మున్నగునవి బహువచనాంత నిపాతములుగా మాత్రమే యంగీకరించెనని చెప్పుటకు సందేహము లేదు.

(౪౧౬)—నన్నయ భారతభాగమున హలంతరసయుక్తరేఫము లోకపద్యమునఁ బ్రయోగింపఁబడి యుండుటంజేసియు హలంతరపరక సంయోగమున శకటస్థితి కవిసమ్మతము కామింజేసియు రేఫ ఱకారములలో నేదే నొకటి యుండఁదగు తావుల నుపదేశించు పైకారికలలో "అససంయుతాః" అను దళముండుట యెంతయు నావశ్యకమై యున్నది.

(౪౧౭)—సంయుక్తస్థలములలో శకటమును నుండవచ్చునని రంగనాథ కవిగారు విపులముగాఁ జర్చించి యున్నారు. ఆవిషయమిట విమర్శింపఁబడు చున్నది. హలంతరసంయుక్త రేఫప్రాస మొక్కచోట మాత్రమె నన్నయ భారతభాగమునఁ గలదు.

ఉ. తూర్పరుణంబు గాఁదొడఁగె దుష్టనిశాచరవేళ యయ్యెడున్,
మార్పుము కాలయాపన మమర్పక, యప్పిశితాశిఁబట్టి పా,
లార్పఁగనేల ? నావుడు బలాఢ్యుఁడు భీముఁడు మల్లవిద్య నే,
ర్పేర్పడఁగా హిడింబు బలహీనపరాక్రముఁ జేసెఁ జెచ్చెరన్.
(భార. ఆది. ౬ ఆ. ౨౧౬ ప.)

ఈ పద్యములోని 'తూర్పు' మున్నగువానిలోని హలంతరసంయుక్త రేఫము లలఘువులను విషయమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములు నన్నయభట్ట పద్య యతిప్రాస ప్రయోగములలో లేవు. అథర్వణుఁడు "అని శ్చయో భవే ద్యత్ర, గ్రామ మానుషనామాసు। రేఫయో ర్నిశ్చయ స్తత్ర, రేఫమాత్రికగోచరః" అని యిట్లు స్థలాంతరములందు ఱకార నిశ్చయము లేనపుడు రేఫమునె నిలుపవలెనని చెప్పియుండుటచేతను, 'జిహ్వా మాన మ్యోచ్యతే త, చ్ఛాకటం గురుసంజ్ఞితమ్' అను శకటరేఫ నిర్ణయవచనము

చొప్పునఁ గలుగవలసిన యశిథిలమగు నుచ్చారణగౌరవ మవ్యవహిత హలంత రోచ్చారణ ప్రతిబంధమునఁ బరిక్షీణమగుట యనుభవసిద్ధమై యుండుటచే నసంయుక్తతలోని యలఘురేఫము సైతము సంయుక్తతావస్థలో లఘువగు ననఁదగి యుండుటచేతను పై పద్యములోని 'తూర్పు' మున్నగు ప్రాసస్థల గత హలంతర సంయుక్తరేఫములు లఘువులె యని యెన్ననగును.

(౪౧౭)— ఈ క్రింది తిక్కన సోమయాజి ప్రయోగమునుబట్టి పై నన్నయభట్ట ప్రయుక్తములగు 'తూర్పు' మున్నగువానిలోని రేఫములు లఘువులే యని నిశ్చయింపవచ్చును.

కం. నేర్పరి పెక్కువిధంబుల, నార్పఁగ బొమ్మలు కడంగి యాడెడు చందం,
బేర్పడఁ గాన్పుము కాలస, మర్పిత కార్యకరులైన మానవుల దెసన్.
(భార. శాంతి. ౧ ఆ. ౨౭౩ ప).

ఇందు 'సమర్పిత' అను సంస్కృత శబ్దములోని 'ర్పి' అనుదానికి బ్రాసములుగాఁ బ్రయోగింపఁబడిన వగుటంజేసి 'నేర్పరి' ఏర్పడ, ఆర్పఁగ, అను శబ్దములలోని సంయుక్త రేఫములు లఘువులె యనుటకు సందియము లేదు. వీనిలోని 'ఆర్పఁగ, ఏర్పడ' అను శబ్దములలోని 'ర్ప' అనునవె పై నన్నయభట్ట పద్యప్రాసగతములై యుండుటంజేసి యా పద్యములోని తూర్పు, మార్పుము' అను వానిలోని సంయోగములందలి రేఫములును లఘువులె యని సిద్ధాంతిత మగుచున్నది. మఱియు శబ్దరత్నాకరమునఁ 'పాలారుచు' అను ధాతువులోని రేఫము లఘువుగనే యుదాహరింపఁబడి యున్నది.

గీ. 'ఏఱుకొని వత్తు రాఁకలి తీఱకుండు' అను తిక్కయజ్వ ప్రయోగమునుబట్టి 'ఏర్పడు' శబ్దమునకు మూలమగు 'ఏఱుపడు' శబ్దములోని రేఫము 'అలఘు' రేఫమనక తీరదుగదా. ఇట్టి వానిలో స్వరలోపమున నేర్పడెడి సంయోగము రేఫప్రాసమునఁ బ్రయుక్త మగునపు డసంయుక్తతావస్థలోని శకటము స్వరలోపములో హలంతరసంయుక్త మగునపుడు లఘువగు నని యంగీకరింపక తీరదుగదా. కావుననే ప్రౌఢవ్యాకరణకర్త యీ క్రిందిరీతిని సూత్రించెను.

(౪౧౮)—' అలఘు రేఫంబు లుప్తాచ్క మగుచో లఘు రేఫంబగు'
"త్రిలింగ లక్షణ శేషము (ముక్తలక్షణ వివేచనము. ౨ సూ).

(౪౨౦)—పయి సందర్భమునుబట్టి యీ క్రింది తిమ్మకవి గంగనాథ కవుల యభిప్రాయములు సరికావని యంగీకరింపవలసి యున్నది.

లక్ష-గీ. అరయ గుగ రేఫ హల్లుతో బెరసినపుడు,
ప్రాసముల విశ్రమముల రేఫములతోడఁ,
గలసియుండును సుకవిపుంగవుల కృతులఁ
జగదవనసూత్ర గిరి తనూజా కళత్ర.

ఉదాహరణము :—

ఉ. నూఱ్ఱురు నొక్కచందము మనోగతి స్వైరణ చేసి నన్ను నా,
సర్వకులంబు నుత్తమ యశంబున నుంచితి రమ్మలార. .........
(ఎఱ్ఱాప్రెగడ రామాయణము)

కం. కాఱ్చిచ్చు గవసి మృగముల, నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేఁచినకడిమిన్,
బేర్చి మనభీముఁ బొదవె శ, రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే.

మఱియు (భార. భీష్మ. సర్వాల. 3 ఆ. ౨౮౫ ప)

సీ. హయమేధ పర్యంతమైన శ్రౌతము బహుస్మృతులుఁ బుత్త్రినకు
వేఱ్వేఱ దెలిపె. ... .. ... ... ... ... ...
(భీష్మ. సర్వాల. 3 ఆ. ౨౮౬ ప).

కం. ... ...మా! ఱ్ఱాలయుచుఁ దాఁకుచు నుదాత్త రభసోజ్జ్వలులై.
(భార. ద్రోణ. సర్వాల. 3. ౨౮౭ ప).

(ర-౨౧)—సంయోగస్థలములందు మాత్రము రేఫఅకారములకు యతి ప్రాసమైత్రి యంగీకరింపనగు ననెడి యీ తిమ్మకవి యభిప్రాయము మిక్కిలి యయుక్తికముగ నున్నదనుటకు సందేహము లేదు. మఱియు నిటఁ దిమ్మకవి పయి నుదాహరించిన మూఁడవస్థలమున అకార ఋకారములకును యతిమైత్రి నంగీకరింపవలసిన వాఁడయ్యెను. యథాదేశాది సంబంధములనుబట్టి ఋకార రేఫములకు సంబంధము గలదనుట యుక్తముగాని ఋకార అకారములకు సంబంధము గలదనుట యుక్తము కాదుగదా. అట్టి సంబంధ శూన్యవర్ణములకు సంయోగమున మాత్రము యతిమైత్రి గలదనుటకంటె సంయోగమున నలఘువు లఘువుగా మాఱు ననుట యెంతయు యుక్తముగదా. వర్ణాంతర సంయోగమున నక్షరములు మాఱుచుండు ననుటలో వింత యేమున్నది? ద్రుత సంశ్లిష్టములగు కచటతపలు గజడదబలుగా మాఱుచుండలేదా? వర్గ ద్వితీయ చతుర్థముల ద్విత్వములలోని మొదటి వర్ణమునందలి సోష్మత్వము మాసిపోవలేదా?

శా. అద్ధానాగ్వ్యుబుధ మ్మహానివచనక వ్యాహార మాహానచ,
స్సిద్ధ మ్మాః కృతతాం గతః కలికతి శ్రీ సూక్తినిద్యాధర,
మ్మిద్ధాద్ధత్య మగా ల్లయంహి కుధియా మిత్థంవదత్కిన్నర,
మ్మద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునం దయ్యె న్నభం బయ్యెడన్.
(ఆముక్త మాల్యద.)

(౪_౨_౨)—రంగనాథకవి యట్టి సంయోగములలో ద్వైరూప్యము నంగీకరించె ననఁగా రేఫ విశిష్టముగను అకార విశిష్టముగను శబ్దద్వయము నంగీకరింపవలెనని చెప్పెను.

"అన్య వర్ణములతో సంశ్లేషము వచ్చినను గురుత్వ లఘుత్వ వైపరీత్యము గలుగదని యెఱుంగఁదగును. ఇఁకఁ దిక్కనాదులు :—

'కం. సర్పముఖ శరము గలదని. దర్పంబునఁ గ్రీడిఁదొడరఁ దలఁపకు హరిపెం,
పేర్పడఁగ నదియ కాదటఁ, దీర్పవలయు వానినెల్లఁ దీర్చును మనకై.

ఇందులోని 'తీఱు' అను శబ్దము గురురేఫకముగ నీ క్రింది పద్యములోఁ బ్రయోగింపఁబడియె.

కం. వేఱొక తెఱఁగున నోరులకు,
మాఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడన్,
దీఱమిగల చోటులఁ దా,
మీఱి కడఁగి వచ్చి పంపు మేకొనవలయున్. (భా)

ఈ శబ్దములకు నీ ప్రయోగములె ప్రమాణమగుటంజేసి రూపాంతరములని చెప్పినఁ గొంత మేలు. సంశ్లేషాభావమున లఘురేఫములు గానరాలేదు గావునఁ బై వాక్యమునందుఁ గొంత యను విశేషణమును వ్రాసితిమి" (ద్విరేఫ. 3 ఆ. ౧౧౧-౧౧౨ పుటలు).

రంగనాథకవియొక్క యిక్కల్పన మాయన యనుకొన్నట్లు కొంత మేలును గాఁజాలదు. స్వరలోప పక్షమున "తీర్చు, తీఱ్చు" అను రెండు రూపములును నుండుననియు, స్వరలోపాభావ పక్షమున 'తీఱుచు' అను అకార రూపము మాత్రమె యుండుననియుఁ జెప్పుటచేత స్వరలోపమునఁ బాక్షికముగ నయిన శకటము రేఫ మగుచున్నదను విషయము ఘట్టకుటీప్రభాత న్యాయమున దుర్వార మగుచున్నదని యాతఁడెట్లు తలంపఁడయ్యెనో తెలియకున్నది. ఇఁక స్వరలోప పక్షమునందలి రేఫ వైశిష్ట్యమునకు సాం

స్కృతిక రేఫ సంయోగ ప్రాసము ప్రమాణ మగుచున్నట్లు అకార వైశిష్ట్యమునకుఁ దగిన ప్రమాణ మేమని తలంచెనో తెలియకున్నది.

అకార వైశిష్ట్యమున కీ క్రింది ప్రయోగములు ప్రమాణము లని యొకప్పు డెవ్వరేని చూపుదురేమో ? "... ...కంటికి న్। దెప్పయుఁబోలె మాటయి నెఱిఁబను లారసి..." (భార. ఉద్యోగ పర్వ. 3 ఆ. ౧౪౪ ప). ఉ॥ కన్। దెప్పలఁ గప్ప నీదొక తఱిన్..... (వసుచ). (సర్వ. 3 ఆ. ౧౪౧).

ఇట్లు హలంతర పూర్వక రేఫ సంయోగములందు శకటము నుచ్చరించుటలో బాధలేకుండుట యనుభవ సిద్ధమై యున్నది. ఇట్టి చోటులలోని శకటము రేఫముగా మాఱునని కల్పించుకొనవలసిన యావశ్యకతను జూపు ప్రయోగమును నగపడదు. కావుననె ప్రౌఢవ్యాకరణకారాదులు శకటము మీఁది స్వరము లోపించునపుడే యది లఘు రేఫ మగునని సూత్రించి యుండిరి. (౪౧౯ వి.) కర్ణాటభాషలో సైతమిట్లె శకటము లుప్తాచ్క మగునపుడు రేఫ మగునని నాగవర్మ సూత్రించి యున్నాఁడు. "అకారస్య రేఫః" అకారస్య స్థానే వ్యంజనేషు పరేషు రేఫో భవతి—ఉదా॥ మార్కెా, మార్కొరల్, మార్దని, మార్పడె, నూర్మడి." (కర్ణాటక భాషా భూషణము ౫ి పరిచ్ఛేదము. ౧_౨౧ సూ.) కర్ణాటక శబ్దానుశాసనమున నీ విషయము మిగుల విపులముగ సూత్రింపఁబడెను.

పయి సందర్భమునుబట్టి శకటము లుప్తాచ్క మగునపుడు మాత్రమె రేఫముగా మాఱుననియుఁ బదాది శకటము పూర్వ పదాంత్య హల్సంయుక్త మగునపుడు రేఫముగ మాఱు సంప్రదాయము లేదనియు విశద మగుచున్నది.

(౪_౨౩)—భారతము లక్ష్మీనృపత్యవధానిగారు హలంతర సంయుక్తములై కాక దీర్ఘ పూర్వకములు పదాది గతములు సైతము శకటములు కానేరవనియు నవి రేఫములై యగుననియు వ్రాసిరి. ఇతఁడు భారతమునందలి కవిత్రయమువారి ప్రయోగములనెల్లఁ బ్రమాణముగ నంగీకరించుచు వానిని మాత్రమె తన గ్రంథమునందు శకట రేఫ నిర్ణయవిషయమున లక్ష్యములుగఁ జూపియున్నాఁడు. మఱియు, 'కవిత్రయ సమీరితాః, ఆచక్షుర్మహాభారత పారగాః, జగుర్భారత పారగాః," అని యిట్లు తన గ్రంథమున స్వరసములగు ననేక స్థలములందుఁ బ్రశంసించుచుఁ దన గ్రంథముయొక్క భారత ప్రయోగ మాత్ర మూలకత్వమును విశదపఱుచుచు వచ్చెను.

"శ్లో॥ అనోభి ర్ద్విత్వ మనసాం। న రేఫై ర్నేతరై రపి।
తస్మా ద్ద్విత్వ యుతా స్సర్వే। శకటా ఏవ నేతరే॥ ౨౩

శ్లో॥ యేత్వన్య వర్ణసంయుక్తా। స్తే రేఫాః స్యు రసంశయః॥ ౨౪

శ్లో॥ రేఫోవా శకటోవాపి। హ్రస్వపూర్వే ప్రదృశ్యతే।
దీర్ఘపూర్వేతు రేఫః స్యా। న్న భవే చ్ఛకటః క్వచిత్॥ ౨౫

శ్లో॥ ప్రథమస్య న శాకట్యం। దీర్ఘ పూర్వస్య నోభవేత్।
లఘు పూర్వ ద్వితీయస్య। తృతీయస్య చ వా భవేత్॥ ౨౯

శ్లో॥ లఘు పూర్వం లఘుపరమ్... ...శకటం పరికీర్తితమ్॥" ౩౦

(శకట రేఫ నిర్ణయము).

మఱియు నీ శకట రేఫ నిర్ణయకర్త దీర్ఘ పూర్వక రేఫములు హ్రస్వ పూర్వకము లయ్యెనేని యవి శకటములుగా మాఱునని చెప్పియున్నాఁడు.

"శ్లో॥ యే దీర్ఘపూర్వాః స్యుః ప్రాగ్వై। యది తే హ్రస్వ పూర్వకాః।
భవన్తి శకటా స్తేతు। ప్రాసాద్యై ర్బాధితం వినా"

(శకట రేఫ నిర్ణయము ౨౮ ప.)

ఈ విషయము నప్పకవి యీ క్రిందిరీతిని బ్రతిఘటించుచున్నాఁడు.

"సీ॥ చేకూఱె ననుటకుఁ జేకుఱె నని యిట్లు,
పొడుగు లెల్లను హ్రస్వములుగఁ జేసి।
పలికెడివేళ రేఫములును ఱాలును,
మునుపటి యట్లన తనరుచుండు॥"

(అప్పకవీయము ౨ ఆ. రేఫాక్షర సీసమాలిక) (చూ. ౧౧౮ పుట).

(౪_౨౪)—ద్విత్వములోనివి శకటములె యనుటలో నెవ్వరికిని విప్రతిపత్తి లేదు. అట్టి ద్విత్వములో నొకటి లోపించినను బరిశిష్టము శకటమె యగు నని యీ క్రిందిరీతి నడిదము సూరకవి చెప్పియున్నాఁడు. దీనికిని నెవ్వరును భిన్నాభిప్రాయులై యుండలేదు.

"ఆ॥ వె॥ ఊఁది పలుకుచోట నొగిఁ దేల్చి పలికిన।
రేఫగాదు శకటరేఫ గాని॥" (కవిసంశ. ౨ తరంగము. ౨౯ ప).

ఇఁక గవిత్రయమువారి ప్రయోగము లెల్లరకును బ్రమాణములె యైయుండఁగాఁ బయిరీతి నభిప్రాయ భేదము లెట్లు గల్గెనో? లక్ష్మీపత్యవధాని తిక్కనామల ప్రయోగములలో ధారాళముగా నున్న పదాది శకటాది

ప్రయోగముల కెట్టి సమాధానములను గల్పించుకొని వానిని రేఫములుగ నంగీకరించి యుండెనో? యను విషయములను బరిశీలింప వలసియున్నది.

(ర-ఱల)—దీర్ఘ పూర్వాక్షరములకును హ్రస్వ పూర్వాక్షరముల కును ప్రాసము లేకుండుటచేతను దీర్ఘపూర్వకములలో సంస్కృత శబ్దము లందు అకారము లుండకుండుటచేతను నాచ్చికి దీర్ఘపూర్వక రేఫములెల్ల వివాదస్థములె యగుటచేతను దీర్ఘపూర్వక రేఫములలో శకటములు గలవని నిరూపించుట కాధారమె లేదయ్యెను. ఇఁక బదాదిగత అకారము లనఁబడు చున్న వానిలో నొక్కటికయిన నిర్వివాదములగు హ్రస్వ పూర్వక శకట ములతోడి ప్రాసము భారతమున లేదయ్యెను. ఇఁక నట్టి నిర్వివాద హ్రస్వ పూర్వక శకటములతోఁ దీర్ఘ పూర్వక శకటము లనఁబడుచున్న వానికిని బదాది శకటము లనఁబడుచున్నవానికిని నీ క్రిందిరీతిని నన్నయేతర కృత భారతభాగ పద్యములలో యతిమైత్రి మాత్ర మగపడుచున్నది. కేవ లము భిన్నములగు నక్షరములకు నయితము యతిమైత్రి సర్వసమ్మతమై యుండుటంజేసి యట్టి దీర్ఘపూర్వక స్థలములందును బదాది స్థలములందును అకారములు గలవని యంగీకరింపవలసిన యావశ్యకత లేదయ్యెను. కావున నట్టి చోటులందు రేఫములె యున్నవనియు, నట్టి ప్రయోగముల ప్రామా ణ్యమునం జేసి రేఫ అకారములకు యతిమైత్రి మాత్ర మంగీకరింపఁదగు ననియు శకటరేఫ నిర్ణయకర్త యీ క్రిందిరీతిని సిద్ధాంతీకరించినవాఁడయ్యెను.

శ్లో॥ అపరస్పర సంబన్ధాః । ప్రాస, ప్రాసయతిష్వమీ ।
తదన్యయతిషు త్వేషాం । సంబన్ధో దృశ్యతే మిథః ॥

'చ.......తీ, దునకాడఁ బాటు గల్గిన నెఱుంగమి వెట్టరె... .........'
'చ.......నూ, రును రథముల్ శతంబును మొఱుంగుల మొత్తము...'
'ఉ.......కంటికిన్, రెప్పయుఁబోలె మాటయి నెఱిం బనులారసి...'
'కం. ... ..., రిచ్చవడియె వార మొన దఱిమికొని వచ్చెన్'
'కం. ... ..., రాయో కాకిట్లు రూపఱక విననేర్చెన్ ............'
ఉ. ... ... వేదనన్, రోలుచు రోజఁగా బలుమఱుం బారలంబడ......'

(భారతము. శకట రేఫ నిర్ణయము, ౮౮ పుట)

సయి మార్గము ననుసరించి దీర్ఘపూర్వక శకటము లనఁబడుచున్న వానిని బదాది శకటము లనఁబడుచున్నవానిని రేఫములుగానే నిశ్చయించి గ్రథకర్త భారత ప్రయోగములనెల్లఁ జాలవఱకీక్రిందిరీతి నుదాహరించెను.

శ్లో॥ దీర్ఘాత్పరే రేఫ ఏవ । నభవే చ్ఛకటః క్వచిత్ ।
రేఫత్వ విశ్వాసార్థం హి । దీర్ఘప్రాసాః ప్రదర్శితాః ॥

... ... ... ... ... ... ... ... ... ...

—ఆరడి, మారట, కారులు, వీరిడి.—

ఉ. ఆరడిఁ బోకయున్ ఫలము నందుటయుం గని పల్కనేరమిన్,
మారట నోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్పకేఁ,
గారులు ప్రేలెదన్ వినుఁడు కర్జము నెగ్గును గాన్ప నల్కమై,
వీరిడియైన మానిసికి వెండి వివేకము గల్గనేర్చునే. (భార. ఉద్యో).

—కారడవి, ఊరటకున్, శ్రమంబారఁగ, తీరఁగ.—

కం. కారడవిఁ బఱచు మృగముల,
నూరటకుం దిగిచి డస్సి యున్నతని శ్రమం,
బారఁగ నెదఁ బరితాపము,
తీరఁగఁ బై వీచె నన్నదీపవనంబుల్. (భార. ఆదిపర్వము).

పయి రీతినె అకారాది శబ్దము లనఁబడుచున్నవానిని రేఫాదిశబ్దములు గనే సూత్రించి యుదాహరించి యున్నాఁడు.

శ్లో॥ సాదీ హూతి స్సభా రిక్తం । ద్వే గరు ద్రేఫ పూర్వకాః. ౫౧.

('సాదీ = రవుతు, హూతిః = రంపు, సభా = రచ్చ, రిక్తమ్ = రిత్త, రిచ్చ, ద్వే = రెంపు, గరుత్ = రెక్క' అనునవి, రేఫ పూర్వకాః = రేఫ పూర్వకములు).

ఉ. రెక్కలు సించి కంఠమున రేకులు వాపి శిరంబు వ్రచ్చి...(భార.)

క. కని యుత్తరుండు గరుపా,
రిన మేనును దలఁకు మనము రిచ్చవడిన చూపును ... ...

(భార. శకటరే. ౮౫ పుట.)

(౨౨౬)—అష్టభాషావతార బిరుదాంచితుఁడును నించుమించుగఁ గృష్ణదేవరాయల కాలములోని వాఁడును నగు వెల్లంకి తాతంభట్టు తన కవిచింతామణిలోఁ బై శకటరేఫనిర్ణయ గ్రంథమార్గమునే యవలంబించి యీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

ఆ. వె....దీర్ఘముమీఁద, బండిఱాను లేదు పద్మనాభ.

(వర్ణనియమాధికారము. ౧ ప. చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోని 11-14-6 నెంబరు మాతృక)

క. ఇలరేఫ అకారమ్ముల,
వళి చెల్లినఁ జెల్లుఁగాని వసుమతిఁ బ్రాసం, బులు చెల్లవు... ...
(కవిచింతామణి. వళిప్రాసాధికారము. ౨౦తాటాకు. పైమాతృకయె.)

(తాతంభట్టు కవిచింతామణిలో శ్రీనాథుని నైషధపద్యములును బిల్లల మఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలపద్యములు నుదాహరింపఁబడినవి. కాఁగా నతఁడు క్రీ. శ. ౧౫౦౦ సంవత్సరము ప్రాంతమువాఁడు కానోపును.)

(౪_౨౭)—శకటరేఫ నిర్ణయ గ్రంథమునందువలెనె దీనియందును బయిరీతియుక్తులనె యాశ్రయించి గ్రంథకర్త యిట్లు చెప్పె ననఁదగును. అట్టియుక్తులకు సమాధానము చెప్పకయె యప్పకవ్యాదు లీ క్రిందిరీతిని నిరసించుట యుక్తమై యుండలేదు.

సీ. "వెల్లంకి తాతన బొల్లెను బండితా, నిడుదపైఁ గలుగదు నిక్కమనుచుఁ,!
గావున నేను దీర్ఘములపైఁ గలపెద్ద, ఱాలొకకొన్ని యేర్పఱుతు నింక."
(అప్పకవీ. ౨ ఆ. రేఫాక్షరసీసమాలిక.)

కం. వెల్లంకి తాతయార్యుఁడు, దెల్లముగా శకటరేఫ దీర్ఘంబులపైఁ,
జెల్లదని పలికె నదియుం, గల్ల వితర్కింపఁ బ్రౌఢకవి సమ్మతులన్.
(సర్వలక్షణ సా. ౩ ఆ. ౭ ప.)

ఆ. వె. పదము మొదల నిడుదఁ దుదిఁ దద్భవంబుల,
రేఫగాని శకటరేఫ గాదు,
నిక్కమనుచు సుగుణనిధి దిట్టకవి వేంక,
నార్యవరుఁడు నుడివె నది వాఱిక్క. (సర్వలక్షణ సా. ౩ ఆ. ౧౦ ప.)

(౪_౨౮)—అప్పకవికిఁ దర్వాతివాఁడును దిమ్మకవికి సమకాలికుఁడును నగు నడిదముసూరకవి తన కవిసంశయవిచ్ఛేదమున శకటయుతశబ్దముల నెను బదియైదిటిని మాత్రమే పేర్కొని యుదాహరించి యున్నాఁడు. ఈతఁ డప్ప కవి తిమ్మకవుల ననుసరింపక శకటరేఫ నిర్ణయగ్రంథకర్తవలెనె పదాదిశకట ములను హలంతర సంయుక్తశకటములను దీర్ఘపూర్వక శకటములను నంగీక రించి యుండలేదు. ఇతఁ డీ సందర్భమున నన్నయభట్ట భారతభాగస్థిత యతి ప్రాసస్థలములందలి శకటముల నెల్ల నొకపట్టికగాఁ బేర్కొని వానికెల్ల నన్నయ భట్ట పద్యముల నుదాహరించి యున్నాఁడు. తక్కిన తిక్కన యెఱ్ఱాప్రెగడల ప్రయోగములనుండి తనకు సమ్మతములగు కొన్నిటిని మాత్రమె చూపి యున్నాఁడు. ఆ సందర్భమున నన్నయభట్టారకుని పద్యములలోని యతిప్రాస

స్థలస్థిత శకటయుత శబ్దములనెల్లఁ జూపియు నట్టియెడల దీర్ఘపూర్వకములగు 'కాఱడవి, ఊఱడక, ఆఱఁగ, తీఱఁగ' అనువానిని హలంతరసంయుక్తములగు 'తూఱ్పు, మాఱ్పుము, పాలాఱ్పుఁగ. ఏఱ్పడ' అనువానిని జూపి యుండలేదు. వానిపద్యములను సైతము దాహరించి యుండలేదు. దీనినిబట్టి పరిశీలించునప్పుడప్పుకవీయమును జూచినవాఁడయ్యు సూరకవి దీర్ఘపూర్వకశకటములను హలంతర సంయుక్తశకటములను నంగీకరింపలేదని విశదము కాకమానదు గదా.

(ర_౧౯)—శకటరేఫ నిర్ణయగ్రంథకర్త సూరకవి మున్నగువారు పయి నుదాహరించినరీతిని యుక్తిని గల్పించికొని సిద్ధాంతీకరించినను నీమార్గము గ్రాహ్యముకాదని చెప్పక తీరకున్నది. తెలుఁగుభాషలోనే కాక యితర ద్రావిడభాషలలో నయితము హ్రస్వపూర్వక శకటములతోపాటుగ దీర్ఘపూర్వకశకటములును బ్రసిద్ధములై వాడఁబడుచుండఁగా, నట్టివానికి సాక్షాత్సంబంధమునఁ గాని పరంపరా సంబంధమునఁ గాని భారతకవులు సంస్కృత శబ్దగతములు మున్నగు నిర్వివాద లఘురేఫములతో మైత్రిని కలిగింపని నియమముతోఁ బ్రయోగించి యుండఁగా, నట్టివి ఱకారములు కావని చెప్పుట సరికాదనక తీరదు. మఱియు 'ఆఱు'=(ఐదునొకటి) అను దానిలోనిది రేఫమనియు 'అఱువది' (ఆఱు + పది) అను దానిలోనిది శకటమనియు, జెప్పుట యయుక్తిక మనకతీరదుగదా. ("వికలం ఛిద్రితం షష్టిః...షష్టిః = అఱువది" శకటరేఫ నిర్ణయము ర పుట.) ఇంతియకాక 'ఆఱు' అనునది యైదునొకటి యను నర్థమునందును 'ఉపశమిల్లు' అను నర్థమునందును, శకటముతోనె తెనుఁగునందేకాక తమిళ కన్నడములందునుఁ బ్రసిద్ధమై వాడఁబడుచున్నది. ఇట్లె "ఈడేఱు (సిద్ధించు) నూఱు (శతము) మీఱు (అతిక్రమించు) మాఱు (ప్రతి)" అనునవి మొదలగు ననేకశబ్దములు తెనుఁగునందేకాక తమిళ కన్నడములందును మహాకవులచే శకటముగఁ బ్రయోగింపఁబడియున్నవి. ఇంతేకాక యట్టి శకటమునందావేశించి యుండెడి టకారము వాని ద్విరుక్తరూపముల ధాతువులలోను వానినుండి వెలసిన ప్రకృతులలోను నగపడుచున్నది. తమిళము:—"ఆఱు = (ఉపశమిల్లు) ఆఱ్ఱు = ఆట్టు = (ఉపశమిల్లఁజేయు) ఊఱు = (నీరూఱు) ఊఱ్ఱు = ఊట్టు (ఊట) (ఊట అని తెలుఁగునను గలదు.) కీఱు = (గోకు) కీఱ్ఱు = కీట్టు = (గీటు) (తెలుఁగునందును గీఱు ధాతువునుండి 'గీటు' అనునది పుట్టుచున్నది.) తేఱు = (తేటపడు) తేఱ్ఱమ్ = తేట్టమ్ = (తెలివి) (తెలుఁగునందును 'తేఱు' ధాతువునుండి 'తేట' అని

పుట్టుచున్నది.) తూఱు (సంగ) తూఱ్ఱు - తూట్టు (సిగదించు) సీఱు = భస్మము) సీఱ్ఱై = సీట్టై = (భస్మమును) నూఱు = (శతము) నూఱ్ఱై=నూట్టై = (నూటిని) మాఱు = (ప్రతి) మాఱ్ఱాన్ తాఙ్ = మాట్టాన్ తాయ్ = (మాఱుట తల్లి) వేఱు = (అన్యము) వేఱ్ఱుమై = వేట్టుమై=(వేఱుపడుట. విభక్తి.)

ఇట్లుచ్చారణమునఁ బ్రసిద్ధమగుచున్న దీర్ఘపూర్వశకటము లేదని చెప్పుట సరికాదుగదా.

పరిశీలింపంగాఁ బదాదిరేఫములు శకటములు కావని చెప్పుటయే యుక్తముగ నగపడుచున్నది. పదాదిశకటము లనఁబడుచున్నవి ప్రాచీనమహాకవుల ప్రాసములచే నెచ్చటను బ్రమాణీకరింపఁబడి యుండలేదనియు యతులలో నిర్వివాదశకటములతో వానికి మైత్రియున్నను నచట అకారకల్పనము చేసికొన నక్కఱలేదనియు వర్ణాంతరములకువలెనే యచటి పదాదిరేఫములకును శకటములతో మైత్రి చెల్లుట విరుద్ధము కాదనియు నీ వఱకు వ్రాసియే యున్నాను. తెల్గులోనేకాక యితర ద్రావిడభాషలలో సైతము పదాదిని శకటము లంగీకరింపఁబడి యుండలేదు. తమిళ భాషలోఁ బదాదిని అకారమే కాక రేఫమును నుండనేరదు. కన్నడభాషలోఁ బదాదిని శకటమంగీకరింపఁబడదు. "అంచె, ఱెంచె = (కుథము = ఏనుఁగుమీఁది ఆస్తరణము) ఱిక్కట= (శూన్యము) ఱెప్పు = (ప్రహరణము) ఱోదాడు = (వికృతాంగుని నవ్వుట)" అను నాల్గుశబ్దములకు మాత్రము పఱిగన్నడమున (ప్రాచీనకర్ణాట) శకట ప్రాసములు గలవనియుఁ దక్కిన కిట్టెలు కోశములోనివి ప్రాచీనకర్ణాట భాషలోనివి కావనియుఁ గర్ణాటపండితులు చెప్పుచున్నారు. అట్లు వ్యావహారిక భాషనుండి కిట్టెలుగారెత్తివ్రాసిన పదాదిశకటయుతపదములు సైతము "అక్కె, అట్టె, అప్పె, అవకె, ఱొప్ప, ఱొబ్బె" అనునవి మాత్రమె యై యున్నవి. కాఁగా నట్టి ప్రాచీనకర్ణాట ప్రయుక్తశబ్దములు నాల్గును రేఫ అకారమైత్రి నంగీకరించి ప్రయుక్తములైనవే యోమో యని యాలోచింప వలసి యున్నది.

(౮౩౦)— తమిళ కర్ణాటభాషలయందుఁ దద్భవములలో అకారస్థితి యంగీకరింపఁబడదు. నన్నయభట్టారకుని ప్రాసస్థలములం దెల్లఁ దద్భవశబ్దములలో రేఫములె ప్రయోగింపఁబడి యున్నవి. తిరముగ, అచ్చెరువు, పరికించు, రూఢి, రవణ, పేర్మి, పరుసము, గారవము." మున్నగు తద్భవపదములలోని రేఫము లెల్ల నిర్వివాదములగు రేఫముల ప్రాసములందే యున్నవి.

౩౬. గురువచన ... ... । తిరముగ ... ... (ఆది. ౭ ఆ. ౨౧౬. ప.)

౩౦. ఉరగకళేబర ... ...అ । చ్చెరు విడి ... ... (ఆది. ౧ ఆ. ౧౫౬. ప.)

ఇట్లె తక్కినవానిని బ్రయోగించెను (చూడుఁడు ౪౦౭ వి.)

పయిరీతిని నన్నయభట్ట ప్రయోగములందె కాక తక్కిన భారత కవుల ప్రయోగములందును దద్భవములలో శకటములు లేవనుచు భారతము లక్ష్మీశ పత్యవధానిగా రీ క్రింది రీతిని జెప్పియున్నారు.

"శ్లో. ... ... శకట మతద్భవ మతత్సమమ్" (శకట ౪౬ పుట ) అట్లయి నను శబ్దరత్నాకర ప్రౌఢవ్యాకరణకారుఁడును, రంగనాథకవియు నహోబల పతియుఁ దద్భవములందు శకటముల నంగీకరించి యుదాహరించి యున్నారు.

" అఱ... ...వై. సగము. 'అఱచందురుని క్రొత్త మెఱుఁగులు' (హరి. ఉ. ౭. ఆ.) " (శబ్దరత్నా)

"ననుపాఱు శబ్దస్య యది తద్భవత్వం తర్హి గురు రేఫః కథమితి చే న్నైష దోషః. ఉక్కఱ, కఱకు, మొఱకు ఇత్యాది తద్భవేష్వపి తచ్ఛ్రవణాత్. అత ఏవాథర్వణః లక్ష్యానురోధేన ఉచ్చారణస్య కల్ప్యత్వ మాహ" (అహో. ౕ౦౧ పుట)

"పెఱ. వై. స. అన్యము. 'కం. చఱచి యొకచేతఁ గూర్మము । పెఱ చేత గజంబుఁ బట్టి ... ... (భార. ఆది. ౨ ఆ.) ... ... ఇట్లు పెఱ, చెఱ, ఇత్యా ద్యనేక శబ్దములందు శకటరేఫము కనఁబడుచుండఁగా చిన్నయసూరి గారు 'శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు' అనిచెప్పుటకు అభిప్రాయ మేమో తెలిసినదికాదు." అని శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. "తద్భవ మునందును నలఘు రేఫము గలదు." (ప్రౌఢవ్యాకరణము సంజ్ఞా. ౯ సూ) "వృత్తి:—కఱకంఠుఁడు గరకంఠ శబ్దభవము ... ..." అని పెక్కు శకట యుత తద్భవములు చూపఁబడెను.

తే-గీ. అఱిసె పెఱవారు కఱడు వంకఱయు మొఱకు,
తత్తఱంబును బిఱికియుఁ దద్భవముల,
గురువులై కానఁబడు హ్రస్వపరమునను గ్ర,
పాణధారాహత కబంధ బాహుబంధ ॥ ... ... ... ...

తే-గీ. కాఱె జాఱుట చాఱలు చూఱలాడె,
తీఱు పాఱుడు జేఁడు సొన్నాఱి దీర్ఘ,

పరములై బండిఱాలు తద్భవములందుఁ,
గానఁబడుఁ బ్రాఁత రుత్ఫుల్లకమలనేత్ర. (ద్విరేఫ ౩ ఆ. ౧౦౭. ౧౦౮.)

(౪౩౧)—పయివానిలో 'అఱ, పెఱ, కఱకంఠుఁడు' అనునవి నన్న యభట్టారక ప్రయోగములలోఁ బ్రాసములం దగపడుచున్నవి. అందలి 'పెఱ' శబ్దప్రయోగ మీవలకుఁ జూపఁబడినది (౪౩౦ వి.)

"కం. అఱపొఱడు కుఱుచచేతులు, నొఱవ శరీరంబు...(అరణ్య. ౨ ఆ. ౧౩౫)
కం. ..., కఱకంఠా క్షమియింపుము, నెఱి.... (అరణ్య. ౧ ఆ. ౩౨౭ ప.)"

అని యిట్లు తక్కిన 'అఱ, కఱకంఠుఁడు' అనునవియును బ్రయుక్తములై యున్నవి. అట్లైనను నన్నయభట్టారకుఁడు తద్భవములందు శకటరేఫల నంగీకరించెనని యొప్ప నక్కఱలేదు. వీనిలోని 'అఱ' శబ్దము 'అఱ్ఱు' (పెట్టెలో నగు వానిలో నొకభాగము) అనుదానిలో నొక ఱకారము లోపింపఁగా మిగిలిన రూపము. కావున ఱకార ఘటితమగు 'అఱ' శబ్దము దేశ్యమనియు, రేఫవంతమగు 'అర' శబ్దము 'అర్ధ' శబ్దభవమనియు, గ్రహింపనగును. నన్నయభట్టు రేఫఘటితమగు 'అర' శబ్దమును బ్రయోగించియే యుండలేదు.

పెఱశబ్దము శబ్దరత్నాకరకర్త యుదాహరించిన

"కం. చఱచి యొకచేతఁ గూర్మము, పెఱచేతం గజముఁ బట్టి.....(ఆది. ౨ ఆ. ౭౦ ప.)" అనుచోటనేకాక "సీ. .. ... పెఱవారు సనకుండ నెఱుఁగక సనిరేని......(ఆది. ౮ ఆ. ౧౧౫ ప.)" అనుచోటను సయితము నన్నయభట్టుచే శకట ప్రాసస్థలమునఁ బ్రయుక్తమై యున్నది.

ఈ రెండు స్థలములందును 'పిఱుదు' శబ్దసంక్షేప రూపమగు 'పిఱు' శబ్దముగాని 'పిఱ్ఱు' శబ్దసంక్షేప రూపమగు 'పిఱ' శబ్దముగాని నన్నయ ప్రయుక్తమైయుండునని నా యభిప్రాయము. లేదా వానిని సంబంధించిన పెఱ శబ్దము కూడ దేశ్యమైయున్నదని యంగీకరించినను నంగీకరింపవచ్చును. తమిఱు దేశ్య భాషలో సయితము 'పిఱ' శబ్దము 'అన్యము, వెనుక' అనునర్థములు గల్గి యున్నది. కన్నడమునందు "పెఱగు'=పృష్ఠభాగము. పెఱతు = అన్యము" అనునవి గలవు. ఇంక నన్నయ యెచ్చటను రేఫప్రాసమున పరశబ్దభవమగు 'పెర' శబ్దపు రేఫమును బ్రయోగించియే యుండలేదు. కావునఁ దద్విషయము నిచట వ్రాయు ప్రసక్తియే లేదు.

ఇఁక 'కలికంఠుఁడు' అను దానిని విమర్శింపవలసి యున్నది. ఇయ్యది మిశ్రబహువ్రీహి కాదనియు 'గరకంఠ' శబ్దభవమనియు నం దనాంధ్రవర్ణమగు ఠకారముండుటచే గ్రామ్యమైనదనియు మహాకవిప్రయుక్తమగుటచే ననింద్యగ్రామ్యముగా నంగీకరింపఁబడినదనియుఁ ద్రిలింగలక్షణశేష కర్త యభిప్రాయపడి యున్నాఁడు.

"తద్భవములందును నలఘురేఫము గలదు" (ప్రౌఢ. సంజ్ఞా. ౯ సూ.).

"కలికంఠుఁడు......కలికంఠుఁడు గరకంఠ శబ్దభవము ........."

"కలికంఠుఁడు బహువ్రీహి" (ప్రౌఢ. సమాస. ౨౭ సూ.) (చూ. సంజ్ఞా ౯ సూ. ఉ.) "దీని నహోబలపండితుఁడు మిశ్రబహువ్రీహి యనెఁ గాని యది యట్లగుట దుర్ఘటము."

"కలికంఠుఁడు. వై. గ్రా. వి. శివుఁడు, గరళకంఠుఁడు" (శబ్దరత్నాకరము) (ఇందలి 'గ్రా' అను దానికి ననింద్యగ్రామ్యమని యర్థము. గ్రా=గ్రామ్యము (అనింద్యము) శబ్దరత్నాకర సంజ్ఞావివరణ పట్టిక).

గరకంఠ శబ్దభవమనియే దీని నంగీకరించినపుడు డీతండు 'కలికంటు' అనియే యంగీకరింపక యందు 'ఠ' కార మున్నదని యంగీకరింపవలసిన యావశ్యకత యేమో తెలియకున్నది. అచటి 'ఠ'కారము ప్రాసాది నిబద్ధమయి యుండలేదుగదా. అట్లయినను 'కంటు' అను కంఠ శబ్దభవ మాంధ్రవాఙ్మయమునఁ బ్రసిద్ధమై యుండమింజేసియుఁ (కంటసరి - మెడనుధరించెడి యొకానొక సొమ్ము-కణ్ఠసరః" "కంటియ = కంటె-మెడనంటియుండెడి యొకానొకసొమ్ము—కణ్ఠికా" అని యిట్లు వైకృతదీపికలోఁ బ్రాయఁబడెను. శబ్దరత్నాకరమునందును నీ రెండు శబ్దములును వైకృతములుగఁ జూపఁబడినవి. కాని వీనికి బ్రయోగములు చూపఁబడలేదు.) దాళపత్ర మాతృకలలో నెల్ల "ఠ" కార పాఠమె యగపడుచుండుటంజేసియు నీ క్రిందిరీతి నహోబల పండితీయమునఁ బడియున్న లేఖకపాఠకాది కృతమగు తప్పు పాఠమునుఁ జూచి యది సరియేయని భ్రమించి యుండుటంజేసియు నీతఁడట్టి స్వపక్షానుకూల పాఠము నంగీకరింపఁడయ్యె నని తోఁచుచున్నది. ఈ సందర్భమున నహోబల పండితీయమున నీ క్రిందరీతిని వ్రాయఁబడి యున్నది.

"కలికంఠుఁడు ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః, 'కలికంట ముఖాహితా' ఇత్యథర్వణే నోక్తమ్.

(అహో. ౪౩౬ పుట).

"చుట్టుకై దువు దాల్పు ఇత్యాదౌ పు వర్ణకః, సలువ ఇత్యాదౌ హ్రస్వః సమాసాన్తః, వేఁడివెలుఁగు ఉకార స్సమాసాన్తః." "క్వచిదన్తిమ వర్ణస్య, సమాసాన్తత్వ మిష్యతే" ఇత్యథర్వణః.

"కఱకంటుఁడు" ఇత్యత్ర టకారః, డువిభక్తిక వదితి దృష్టాన్తకథనేన తేషా మివైషామపి యథాప్రసిద్ధి విధాన మేవేతి విజ్ఞాయతే."

(అహో. ౨౨౮ పుట).

పయిరీతి నహోబలపండితీయమున రెండుచోట్ల నీ విషయము స్పృశింపఁబడియున్నది. లేఖకాది ప్రమాదవశమున నిట నంతటను 'ట' కారముచోట 'త' కారము పడియున్నది. సహజముగా నున్న తకారము చోట మరల సద్ధాననే సమాసాంతముగా విధించినట్లు వివరించి యుండుననుట కేవలము నసంభవమగుటంజేసి యచట 'ట' కారమె యహోబల పండిత ప్రయుక్త మనుటలో సందేహములేదు. టకారము సమాసాంతము వచ్చెనను పక్షములో నైతము 'కఱ+కంటము' అను విగ్రహముగల మిశ్రబహువ్రీహి యశాస్త్రీయ మగుటచేత నద్దాని సాధుత్వము నథర్వణుఁడు ప్రత్యేకించి సూత్రించుట యనావశ్యము కానేరదు.

పయిన వ్రాసిన ప్రౌఢవ్యాకరణ ఫక్కియు నహోబల పండిత ఫక్కియు నన్నయాథర్వణాభిప్రాయములని విశ్వసింపఁదగి యుండలేదు. మఱియు "కఱకంటుఁడు" అను గరకంఠ శబ్దభవము నంగీకరింత మన్నను నన్నయభట్టు 'హంసపదము = అంచపదము; హంసయాన = అంచయాన' అను రీతిగల యట్టి సిద్ధసమాస తద్భవములను ప్రయోగించెననుట విశ్వసనీయము కానేరదు. ఇఁక "కఱకంటా" అను పాఠమున సుప్రసిద్ధమగు మిశ్రబహువ్రీహి నంగీకరింపనేల? కఱకంటుశబ్దమునే నన్నయ ప్రయోగించెననుట యుక్తము. నల్లని కంటు = కంఠముగలవాఁడని యర్థము.

అథర్వణుఁడు "కఱకంట ముఖాంహితాః" అనియే పఠించెనో లేక "కఱకంటు ముఖాంహితాః" అనియే పఠించెనో నిర్ణయించుటకుఁ దగిన యాధారము లేదుగదా. 'మీనశబ్దభవము మీను — నీరశబ్దభవము నీరు. రూపశబ్దభవము రూపు' అనురీతిని 'కంఠ' శబ్దభవము—'కంటు' అనికానోపును. నన్నయ ప్రయోగస్థలములలో నెచ్చటను వైకృతములందు శకటరేఫము గలదని నిర్ణయించు నాధారము లేమింజేసి యిచట సయితము "కఱ" = (నల్లని) అను దేశ్యపదమే నన్నయ ప్రయుక్త మయ్యెననియు నయ్యది 'కంటు'

అను స్త్రీసమముతో శాస్త్రీయముగ బహువ్రీహిగా సమసించె ననియుఁ జెప్పుట యుక్తముగాని దీనిబట్టి తద్భవములలో అకారము నన్నయ సమ్మత మని సాధించుట యుక్తముకాదు. ( చూ- వ్యా-సం ౬౩౬ విష )

అప్పకవి " ........ పదముల, తుదలను సంస్కృత పదములందును దద్భవములయందును అకారములు లేవు " అని చెప్పియుఁ దదనుకూలముగ " అరి కప్పు మర సగ మరుదు వింత " అని రేఫాక్షర సీసమాలికలో నుడివియు " అఱచేత నఱకాల... అఱమఱ అఱపోఱసు గుజ్జు " అనియు, " పెఱ యిత రార్థంబు పిఱు సని పోవుట " అనియుఁ జెప్పియుండుట నరయఁగా నాతనికిని బైని వ్రాసిన నా యభిప్రాయమె గలదని తోఁచకపోదు గదా. అందును " అఱ పోఱసు గుజ్జు " అను నప్పకవి పద్యభాగమునుబట్టి యాతఁ డిచట నన్నయపద్య భాగమునె యనుకరించెననియు నచటి ' అఱ ' శబ్దమును దేశ్యముగా భావించె ననియు విశదముకాక పోదు గదా. గీ. ' ఎల్లవారు నెఱుఁగ నోల్లని ధర్మువు । చేలనీకు నెఱుఁగ నేల వలసెఁ । జిఱుతవాని కింత పఱుసఁ దనమ్ములు । నన్నె వృద్ధ జనము లున్నచోట. ' ( భార. సభా. ౨ ఆ. ౨౭౮. సర్వ. ౩ ఆ. ౯౯ ప. )

అను తిమ్మక వ్యుదాహృతినిబట్టి నన్నయ ' పఱుసఁదనము ' అనుతద్భవ శబ్దములో శకటమును ప్రయోగించెనని శంకింపరాదు. శబ్దరత్నాకరమున నిట్టి అకారఘటితె వ్యుత్పత్తి చూపఁబడలేదు. ద్విరేఫవర్ణ దర్పణమునఁ బై పద్య మీ క్రిందిరీతి నుదాహరింపఁబడి యున్నది.

" ఎల్లవారు నెఱుఁగ నోల్లని ధర్మువు ।
చేల నీకు నెఱుఁగ నేల వలసె ।
జిఱుతవాని కింత తుఱుసంటి తనములు ।
నన్నె వృద్ధజనము లున్నచోట. " ( ద్విరే. ౩ ఆ. ౮౬ పుట ).

శబ్దరత్నాకరమున ' తుఱుసలి ' శబ్దము చూపఁబడకున్నను ' తఱుసలి = దే. వి. ఉద్ధతుఁడు ' అను నొక శబ్ద ముదాహరింపఁబడి యున్నది. నేఁటి ముద్రణములలోఁ బై పద్యమున " తఱుసంటి పలుకులు " అనియున్నది. కావునఁ బయి సభాపర్వ పద్యమున " పఱుసఁ దనమ్ములు " అనునది నన్నయ ప్రయుక్తము కాదనియు " తుఱుసంటి తనములు " లేదా " తుఱుసంటి పలు కులు " అనునది నన్నయ ప్రయుక్తమనియు గ్రహింప నగును. ఇచటి వికర్ణుని పలుకు లుద్ధతము లనఁదగునుగాని పరుషము లనఁదగవు. పుజ్యము వృద్ధులున్న చోటఁ బారుష్యము తగదనుట కన్న నౌద్ధత్యము తగదనుట స్వారసికమై

యుండు ననుటకు సందేహములేదు. పారుష్యము చిఱుత వానికే కాక పెద్ద వానికిని దగనిదే. ఔద్ధత్యము పెద్దలయెదుటఁ జిఱుతవానికి మాత్రమె తగ దనుట యుక్తము.

పయిరీతిని సమాధానాంతరములు లేని తద్భవ పదస్థ శకటములు నన్నయ ప్రాసములలో దొరకనపు డతఁడు తద్భవములందు అకారమును సమ్మతించెనని నిశ్చయించుట కేవలము నన్యాయ్యము కదా.

(౮౩_౨)—పయిరీతిని నన్నయ ప్రయోగములలో నున్న 'అఱ, పెఱ, కఱ,' శబ్దములను బరిశీలింపక వానినిబట్టి యుత్తరోత్తర మహాకవులు నన్నయ భట్టారకుఁడును దద్భవములలో శకటములను బ్రయోగించెనని తలంచి తద్భవములందు అకారముల నంగీకరించి వానిని ధారాళముగా అకార ప్రాసములలోఁ బ్రయోగింప సాగిరని తోఁచుచున్నది.

కం. వేఱొక... ...; కాఱియ...... (హరి-ఉ. ౧ ఆ. శబ్దరత్నాకర)
కం. పాఱిన నాతని వెనుకన... ..., కాఱియఁ బెట్టితి...
(భార. అను. ౫ ఆ. శబ్దరత్నా)

కాఱియ—కారికా శబ్ద భవము, "కారికా = యాతనా",
(సర్వశబ్ద సంబోధిని). "కారికా యాతనాయామ్",
(శబ్దస్తోమ మహానిధి).

చం. ఎఱిఁగి మెఱింగి... ..., మొఱకుఁదనంబు......(రామా. ద్విరేఫవర్ణ దర్పణము. ౩ ఆ. ౧౦౮ పుట. ('మొఱకు' మూర్ఖ శబ్దభవము.)
కం. మఱి తెరలు సిక్కములు వం, కఱబోనులు..... (యయాతిచరిత్రము ద్విరేఫ. ౩ ఆ. ౧౧౭ పుట.) ('వంకఱ' వక్రశబ్ద భవము.)
గీ. "...గోఱజంబు జున్ను చాఱపప్పు" (స్వారోచిషమను సంభవము ౪ ఆ. శబ్దరత్నాకరము) 'గోఱజము' గోరోచనా శబ్దభవము.
మ. ...అ, త్తఱి నేసెన్ ..గఱిదోఁపన్... (ఉ. హరి. ౪. ఆ. శబ్దరత్నా.)
('గఱి'. గరుచ్ఛబ్ద భవము.)

"క. ఉఱవగు నారుగ పంటలు,
గొఱియల పాడియును .." (భార. అర. ౪ ఆ. ౨౯౫)

అను నెఱ్ఱాప్రెగడ పద్యములో శకట ప్రాసమున గొఱియ శబ్ద అకార మగపడుచున్నది. దీనిరూపాంతరములు, 'గొఱ్ఱియ, గొఱ్ఱె' అనునవి

గాన నిందలి అకార స్థితికి విప్రతిపత్తిలేదు. ఇయ్యది కురరీ శబ్దభవమని వైకృతదీపికలోను బురుషోత్తమకవీయములోను వ్రాయఁబడి యున్నది. "గొఱ్ఱియ" శబ్దము శబ్దరత్నాకరమునందు వైకృత మనియె వ్రాయఁబడి నది. "ఉత్క్రోశ, కురరౌ సమౌ" (అమర. ౨ కాండ. సింహాది. ౨౩ శ్లో) "కుర తీతి కురరః కురశబ్దే" (గురు బాలప్రబోధిక.) "కురర. పు. కవతే, కుజ శబ్దే. క్రరన్. ఉత్క్రోశపక్షిణి" "కురరీ. స్త్రీ. కురర జీష్. కురరపక్షి స్త్రీ యాం, మేష్యాంచ" (శబ్దస్తోమ మహానిధి) తద్భవములలో శకటము లేదను పక్షమున కిది బాధకమయి యున్నది.

అట్లయినను కురరీ శబ్దమునకు 'మేషీ' అను నర్థము నవ్యకోశములలోఁ గలదే కాని నామలింగానుశాసనాది ప్రాచీన కోశములలో లేదు. "కురరీ గణైః కృతరవ స్తరవః" (భారవి). అని పక్షిపరముగ మాత్రమె కవి ప్రయోగములును నగపడు చున్నవి. ప్రాచీన తమిళ మహాకవులును (శకటము తద్భవములలో సంగీకరింపని వారు) దీనిని సంబంధించిన 'కొఱి' శబ్దమును, 'పట' గన్నడ కవులు కుఱి శబ్దమును శకట ప్రాసములలో 'గొఱ్ఱె' అను నర్థముననే దేశ్యముగనే వాడియున్నారు. 'కుఱుంబ' అనునది కన్నడమునందును "కుఱమ్" అనునది తమిళమునను అజా జీవి జాతి వాచకములై యున్నవి. దీనిని బట్టి కురరీ శబ్దమునకు ద్రావిడ భాషల మూలముననె మేషీ పరార్థము లభించెనాయని యాలోచింప వలసియున్నది. గొఱ్ఱె మున్నగునవి ద్రావిడ దేశ్యములు.

(४33)—రేఫోచ్చారణమునందలి గౌరవలాఘవము లుచ్చరించు వారి యత్నమును బట్టి యుండు నను కారణమున దద్భవ శబ్దములందును గొందఱు కవులు శకటోచ్చారణము నంగీకరించుట సంభవించెననియు నెన్నఁ దగును. అట్లగుటంజేసియే ద్రావిడ భాషలలోఁ బరస్పరము నభిన్నములని యంగీకరింపఁ దగిన శబ్దములలో నొక భాషయందు శకటమును వేఱొక భాషయందు రేఫమును నుండుట పెక్కుచోటులం దగపడుచున్నది. ఇంత యేల! ఆంధ్రభాషయందే నన్నయేతర కవుల గ్రంథములలో నొకచోట గురువుగా వాడఁబడినదే వేఱొకచోట లఘువుగా వాడఁబడుటయుఁ గలదు. ఇఁక నొకరు గురువుగా వాడిన దానిని వేఱొకరు లఘువుగా వాడిరని వేఱుగఁ జెప్పనేల? ఇట్టి వాడుకలు సైతము మహాకవి సమ్మతము లగుటచేఁ బ్రమా

శ్లో. లఘు ర్భవే ద్గురుః కుత్ర । చి ద్గురుశ్చ లఘు ర్భవేత్,
ఉచ్చారణస్య కల్ప్యత్వా । న్నిదానం తత్ర సద్వచః.

---

ణీకరింపఁబడుచున్నవి. ఈ విషయమునే యథర్వణుఁ డీ క్రిందిరీతిని సూత్రించి యున్నాఁడు.

(౪౨౪)—వ్యాఖ్య:—లఘురిత్యాది:—కుత్రచిత్ = ఒకానొకప్పుడు, (నన్నయేతర ప్రయోగములలో) గురుః = అలఘు రేఫము, లఘుః = లఘు రేఫము, భవేత్ = అగును, లఘుశ్చ = లఘు రేఫము నైతము, గురుః=అలఘు రేఫము, భవేత్ = అగును, ఉచ్చారణస్య = ఉచ్చారణము, కల్ప్యత్వాత్ = కల్పించుకొనఁ దగినదగుటవలన, తత్ర = వాని గౌరవ లాఘవముల విషయమున, సద్వచః=మహాకవి ప్రయోగములు, నిదానమ్=మూలము లగుచున్నవి. ప్రమాణము లగునని భావము.

ఒకానొక యాధునిక పండితుఁడీ యథర్వణ కారికకుఁ బైరీతి నర్థము చేయక ఛందశ్శాస్త్ర ప్రసిద్ధములగు గురుత్వ లఘుత్వములు పాదాంతము లందుఁ గాదాచిత్కముగా మాఱుచుండునని యర్థము చేసెను. (బసవ పురాణ పీఠిక. ౯౬ పుట). పాదాంత లఘువు వికల్పముగ గురువగుట ఛందశ్శాస్త్రము నందును ప్రయోగములందును గలదు గాని యచటి గురువు లఘువగుట యెచ్చటను లేదు. కావున నట్టి యర్థము ప్రామాదిక మనుటకు సందేహములేదు.

"కుత్రచి దేకస్యైవ గురుత్వం లఘుత్వం చాప్యస్తి, 'లఘు ర్భవే ద్గురుః కుత్రచి ద్గురుశ్చ లఘు ర్భవేత్ . . . . . .' ఇత్యథర్వణ వచనాత్" (అహో. ౧౪౯ పుట) అని యిట్లహోబలపండితుఁడు నా వ్రాసినరీతినె దీని కర్థము చేసి 'తొఱఁగు, తొఱఁగు' అను ద్వైరూప్యము నుదాహరించెను.

ద్విరేఫవర్ణ దర్పణకర్తయగు నోగిరాల - రంగనాథకవియుఁ బైరీతినే యర్థముచేసి చతుర్థాశ్వాసమునందెల్ల నట్టి యుభయరేఫకపదములకె మహాకవిప్రయోగములను జూపి యున్నాఁడు. "శ్లో॥ లఘు ర్భవేదిత్యా ద్యథర్వణ కారిక నుదాహరించి యీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"అనఁగా నొక శబ్దమునందలి రేఫమునకె లఘుగురూచ్చారణములు కల్పించుకొని ప్రామాణికకవులు లఘువుగను గురువుగను బ్రయోగించుటచేత రూపద్వయము గలిగెఁ గావున నట్లు వానిని యథేచ్ఛముగఁ బ్రయోగించుకొనవచ్చుననుట." (ద్విరేఫవర్ణ. ౪ ఆశ్వా. ౧౧౩ పుట).

(౮౩౫)—ప్రౌఢవ్యాకరణ కర్తయుఁ బ్రకృత సూత్రమునకు రేఫ అకార పరముగనె యర్థము చేసెను గాని యొక్కొక్క శబ్దము ద్వైరూప్యము గల్గి యుండుసను నభిప్రాయమును గ్రహింపలేదు. "దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘు రేఫంబగు"

కం. వెఱవక కలలోఁ జేసిన, కొఱగామికి వగచుచోట గుణరత్నము చే। కుఱె
నీకు ......... (ఉ. హరి. ౫ ఆ. మొ. ...........................

"లఘు ర్భవే ద్గురుః కుత్ర । చి ద్గురుశ్చ లఘు ర్భవేత్ ........."

అని యథర్వణాచార్యులు......(చేకూరు-లఘు రేఫము.........)
(ప్రౌఢవ్యాకరణము. ముక్తలక్షణ వివేచనము).

ప్రౌఢవ్యాకరణ కర్తయే శబ్దరత్నాకరమున 'కూరు' అను ధాతువును మాత్ర ముదాహరించెను. కాని 'చేకూరు' అను ధాతువును జూపి యుండ లేదు.

కం. "వారొక యాగ్రహవృత్తిన్ । గూరియు......" అను భారతోద్యోగపర్వ ప్రయోగమునుబట్టి కూరుధాతువు రేఫయుక్తమనుటకు సందేహములేదు గాన 'చేకూరు' ధాతువు రేఫయుక్తముగ నాతఁడు తలంచె నందమన్న శబ్దరత్నాకరమునందె 'చేకూఱు' ధాతు వుదాహరింపఁబడి యున్నది. పయి సందర్భమునుబట్టి యేక కర్తృకములె యైనను శబ్దరత్నాకర ప్రౌఢవ్యాకరణములు పరస్పర విరుద్ధములై యున్నవనక తీరదు.

సీ. చేకుఱె ననుటకుఁ జేకూఱె నని యిట్లు, పొడుగులెల్లను హ్రస్వములుగఁజేసి,
పలికెడువేళ రేఫములును ఱాలును, మునుపటియట్లనే తనరుచుండు.
( అప్ప. ౨ ఆ. ౧౯౬ ప ).

పయి రీతి నప్పకవి 'చేకుఱు' అను ధాతువునకు మొదటిరూపము సయితము ఱకార ఘటితమగు 'చేకూఱు' అనునదియే యని చెప్పియున్నాఁడు. ఇఁకఁ బయి నుదాహరించిన రీతిని 'కూరు' ధాతువునుబట్టి 'చేకూరు' ధాతువు నంగీకరించినను బ్రౌఢవ్యాకరణకర్త చెప్పినట్టు 'చేకుఱు" అనాదే కాక 'చేకురు' అను రేఫఘటిత రూపమును నీ క్రిందిరీతిని బ్రయోగములం దగపడుచున్నది. అట్లె, "పలుమఱు, పలుమరు, వేమఱు, వేమరు" అను చోటులందును ద్వైరూప్య మగపడుచున్నది. మీఁదు మిక్కిలిగ 'వేమారు' అను రేఫఘటితరూపమె యగపడకున్నది. శబ్దరత్నాకరమునందు సైతము వారార్థమున 'మాఱు' శబ్దము మాత్రమె చూపఁబడి యున్నది. ఇంతియకాక

'ఆరయ' మున్నగు వాని రూపాంతరములగు 'అఱయ' మున్నగువానిలో నట్టి మార్పు గలదని యెవ్వరును జెప్పఁ జాలరు గదా.

పయి సందర్భమునుబట్టి పయి నుదాహరించిన ప్రౌఢవ్యాకరణసూత్రము నిరాధారమును నవ్యాప్తిదోష దూషితమును బ్రయోగ విరుద్ధమును నగుచున్న దనక తీరదు. కావున "లఘు ర్భవే ద్గురు" రిత్యాద్యథర్వణ కారికకుఁ బ్రౌఢ వ్యాకరణకర్త చేసికొన్న యర్థము సరికాదని గ్రహింపవలెను.

చ. "హరిపద సేవఁ జేయుచు... ... ...చే, కురుటది యబ్రమే........"

(ద్విరేఫవర్ణ. ౪ ఆ. ౧౧౫ పుట. రామా).

కం. 'మఱి యా రఘువీరు...........చే, కుఱు... . ..........."

(ద్విరేఫవర్ణ. ౩ ఆ. ౯౬ పు. రామా).

కం. 'వెఱవక కలలోఁ జేసిన, కొఱగామికి వగచుచోట గుణరత్నము చే, కుఱె...

(హరి. ౫ ఆ. శబ్దర).

చం. 'దురముల వారు వంపుగమి ద్రొక్కఁగ లేచిన దుమ్ము ..........వే, మరు...............(ద్విరేఫవర్ణ. ౨ ఆ. ౨౮ పుట. యయాతి).

మ. 'స్మర దంతావళరీతి బృంహితములై . ......ప, ల్మరు...........'

(ద్విరేఫవర్ణ. ౪. ఆ. ౧౨౨ పుట. రామాభ్యు).

కం. 'విఱుగుట నొచ్చుట.........పలు। మఱు నాడెదవు... ... ...'

(శబ్దరత్నాకరము. భార. భీష్మ ౩ ఆ.)

మ. గదతోడం గద చుట్టిరా.........మా, ఉద్దేశం గై కొనుచుం గడంగి పలుమాఱుం దాఁకుచున్. ............(శబ్దర. భార. శల్య. ౨. ఆ.)

కం. మీఱిన మానులు కినుకను, మా ఱలుగక.........వే, మాఱు......

(ద్విరేఫవర్ణ. ౪ ఆ. ౧౨౪ పుట. నృసింహపురా).

పయి ప్రయోగములనుబట్టి ప్రకృతమగు "లఘు ర్భవే దిత్యా ద్యథర్వణ కారికకు నా వ్రాసిన వ్యాఖ్యయె యుక్తమని విశదమగుచున్నది గదా.

(౪౩౬)—ఒక్క శబ్దములోని రేఫమే యొకచోట రేఫ ప్రాసము లోను మఱొకచోట ఱకార ప్రాసములోను నొక్క కవిచేతనే ప్రయుక్త మగునపుడు పైరీతి నథర్వణాచార్యుఁ డాశబ్దమునకు నిపాత న్యాయమున రేఫ ఱకార ఘటిత రూపద్వయము నంగీకరించెనే కాని రేఫ ఱకార మైత్రి నచటఁ బ్రమాదముననో యజ్ఞతనో కవి చేసెనని చెప్ప సాహసింపఁడయ్యె. మహా

కవులని యంగీకరించుచు నట్టి లోపములను గల్పించుట కేవలము నసంగతము కదా. మహాకవి యెక్కడ ? అజ్ఞత, (లేదా) యసమర్థత యెక్కడ ? ఛందో యతి ప్రాసాదుల నిర్బంధమున నపప్రయోగము చేయు టెక్కడ ? ఇట్టి ధర్మములు తేజస్తిమిరములవలెఁ గేవలము విరుద్ధములు గదా. అజ్ఞతను నసమర్థతను బ్రమాదమును గవియం దంగీకరించునపు డాతఁడు బ్రామాణికుఁ డెట్లగును ? వ్యాకరణము ప్రయోగమూలక మగుటంజేసి యొక మహాకవి ప్రయోగమునుబట్టి కల్పించికొన్న సూత్రముచే మఱొక మహాకవి ప్రయోగ మప్రమాణమని నిశ్చయించుటకన్న నసంగత ముండునా ? ఈ పక్షమున 'ప్రయోగమూలం వ్యాకరణమ్' అను సిద్ధాంత మున్మూలితమె యగును గదా. కావుననె యథర్వణుఁడు 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయో స్తు నిత్యం స్యాత్' అని వాగనుశాసనుఁడు చెప్పియుండుటచే నద్దానికి విరుద్ధముగ నట్టిచోటులందు రేఫద్వయమైత్రి యంగీకరింపఁ దగునని చెప్పఁ జాలఁడయ్యె.

శ్లో॥ "అనయో స్సంగతిం యస్తు । కరోతి కవితాకృతౌ ।
అస్యా అత్యన్త దుష్టత్వా। ద్దుష్కవి స్సహి కథ్యతే॥" (వికృతి)

అని యిట్లు రేఫ ఱకారమైత్రిని గాఢముగా నిరసించి యున్నాఁడు. రేఫ ఱకారమైత్రి యగ్రాహ్యమను సిద్ధాంతము నంగీకరించుటచేతనే కదా యథర్వణుఁడు "కం. ఎఱు కని యెఱుఁగక ..., కఱకంటా" అను నన్నయభట్టు పద్యములో గరకంఠ శబ్దప్రయోగము నంగీకరింపక 'కఱకంటు' శబ్దప్రయోగము నంగీకరించి యద్దానికి "కఱకంటు ముఖాహితాః" అని యిట్లు సాధుత్వమును నిరూపించిన వాఁడయ్యెను. (చూ ౨౩౧ విష. ౨౩౭ పుట)

కొందఱీ సందర్భమున మహాకవి ప్రయోగమె యైనను నొక్క దానిని బ్రమాణముగ నంగీకరింపరాదని చెప్పెదరు. మహాకవులు ప్రయోగ విశేషములను జూపుటకు గ్రంథముల రచించి యుండలేదుగదా. సందర్భవశమున మార్పరాని ప్రాసాదిస్థలములఁ బ్రయుక్తములై కవిప్రయోగించినవే యని నమ్మఁదగినవి పెక్కులెట్లు లభించును ? ఒక్కచోట మాత్ర మతఁ డపప్రయోగము చేసెననుట యెట్లు పొసఁగును ? కావుననె యట్టి యెక్కొక్క ప్రయోగమునే మూలముగఁ జేసికొని యుత్తరోత్తర కవు లద్దానిని బ్రయోగించుచుండుటయు సంప్రదాయమై యున్నది. 'కఱకంటా' అను నొక్క

నన్నయప్రయోగమునే గదా యాధారముగాఁ జేసికొని తిక్కయజ్వయు న
ద్దానిని దనభారత భాగమున నైతము ప్రయోగించి యుండెను.

కం. తెఱఁ గెట్టిదియో నామది,
నెఱుఁగ మదాత్మోపహార మిచ్చెద నీకుం,
గఱకంట వరము నాకుఁ బ,
గఱఁ బరిమార్పంగ శక్తి గలుగుటయ చుమీ.

(భార. సౌప్తిక. ౧ అ. ౧౨౧ ప.)

ఇంతయేల! రేఫఱకారముల కుచ్చారణ భేదమంతరించిన కాలములో వాని యతిప్రాసమైత్రి యంగీకరింపఁబడు నెడల నిఁక రేఫఱకారములకు లఘ్వలఘుభేదమును జెప్పుటయె వ్యర్థమును నిర్మూలమును నిరాధారమును నగును గదా.

(౮౩౭)—తమిఱ కర్ణాట భాషా పండితు లీ విషయమునఁ జెప్పెడి విషయములు సయుక్తికములై యున్నట్లగపడదు. ఆ భాషలలో నిట్టి వ్యత్యాసమెచటనేని మహాకవి గ్రంథములలో నగపడినపు డచ్చట నేదేని సమాధానాంతరమును జెప్పఁ జూతురు. అట్లు సమాధానము కుదుర నపు డాప్రయోగము ప్రామాదిక మనికాని యతిప్రాస నిర్బంధ కృతమని కాని చెప్పుదురు. తమిఱ భాషలో 'కంబరు' మహాకవి రామాయణమున ధరాశబ్దభవమగు 'తఱై' శబ్దములోని ఱకారము ప్రాసస్థలప్రయుక్తము కాఁగా నయ్యది తద్భవమే కాదనియు దేశ్య మనియుఁ జెప్ప సాహసించుచున్నారు. పఱ గన్నడమున (ప్రాచీన కర్ణాటమున) "పిఱి = పిసుకు, ముఱి = విఱుగు" అను రెండు శబ్దములలో మాత్రమె ద్వైరూప్యము నంగీకరించి తక్కిన చోటులం దెచ్చటనైన ద్వైరూప్యము ప్రయుక్తమైనచో నది యప్రమాణ మనియె చెప్పుదురు. హొస గన్నడమున రేఫఱకార భేదమే యంతరించి యంతటను రేఫమె వెలసి యుండుటచేఁ దద్విషయము నిచటఁ బ్రసంగింప వలసిన ప్రసక్తియే లేదు. షట్పదీ వృత్త కావ్యములు బయలుదేఱిన దాదిగా ననఁగా (క్రీ. శ.) బదుమూఁడవ శతాబ్దము మొదలుగ హొస గన్నడము ప్రత్యేక వ్యక్తి నందినది. తమిఱ భాషలో నేఁటికిని నాంధ్రమునందు వలెనె వ్యావహారికభాష కట్టి ప్రత్యేక వ్యక్తిమత్త్వ మంగీకరింపఁబడలేదు. కాఁగా నందును ఱకారము నేఁటి కవులచే నయితము పాటింపఁబడుటయే సంప్రదాయమైయున్నది. కాఁగాఁ దమిఱభాషలో నర్వాచీన కవుల గ్రంథము

లలోఁ గాని ప్రాచీనకాలపు గ్రంథములలోఁ గాని రేఫ ఱకార మైత్రిగాని వాని ద్వైరూప్యముగాని యంగీకరింపఁబడలేదు. అట్టి ప్రయోగ మెచట నేని పడినచో నది యప్రమాణముగనె నిరసింపఁబడును. తమిళు పలుగన్నడ ములలో నిట్టి గాఢతమ నియమము పాటింపఁబడుచున్నను దమిళు పండి తులుగాని కర్ణాటపండితులుగాని యీ విషయమునఁ దమ వాఙ్మయము నాంధ్ర పండితులవలెఁ బరిశోధించి యుండలేదు. కావున వారి యభిప్రాయ ములు స్థూల దృష్టిచేఁ గల్గినవే యనియుఁ బూర్తిగాఁ బ్రమాణీకరింపఁ దగి నవి కావనియుఁ జెప్పుట సాహసము కాదు.

(౭౩౮)—ఆంధ్రలాక్షణికు లన్ననో యట్లుగాక ప్రాచీనాంధ్ర వాఙ్మయమునందలి యతి ప్రాసాది స్థానగత రేఫఱకారముల నెల్లఁ బరి శోధించి మహాకవిప్రయోగముల కెల్లఁ బ్రామాణ్యము నంగీకరించి ద్విరేఫ పదముల నంగీకరించి వాని నిర్ణయమును జేసిరేకాని మహాకవి ప్రయోగ ములను నిరసింపలేదు.

(౭౩౯)—అథర్వణాచార్యుఁ డొక్క నన్నయభట్టారక భారత భాగ యతి ప్రాసస్థల ప్రయోగములను మాత్రమె బాగుగఁ బరిశోధించి దిక్ప్రదర్శనముగా వెనుక వ్రాసిన రీతిని "క్రియాన్తే చాన్యవర్ణే చే" త్యాద్యనుగమములను సూత్రించి యున్నాఁడు. తాళ్ళపాకము తిరుమల దేశి కుం డీవిషయమున మొట్టమొదట గొప్ప పరిశోధనము చేసి తనకు లభించి యున్న మహాకవిప్రయోగములలోని రేఫ ఱకారముల నెల్ల నిరూపించి యున్నాఁడు. తర్వాత నాతని గ్రంథము నాధారముగఁ జేసికొని మఱికొన్ని ప్రయోగ విశేషములను వెదకి యప్పకవి కొంత పెంచి రేఫ ఱకార నిర్ణ యమును జేసి యున్నాఁడు. వారి నిర్ణయపు ఫక్కి నిట దిఙ్మాత్రముగ నిరూ పించుచున్నాను.

(౭౪౦)—తాళ్లపాకము తిరుమలయ్యగారి రేఫఱకార నిర్ణయ పద్యము లాంధ్రసాహిత్య పరిషత్పత్రికా సంపుటములో నున్నవి (౩ వాల్యము ౭౩౦ పుట. చెన్నపురి విశ్వ విద్యాలయ పుస్తక భాండాగారము). ఇందు లేఖ కాదికృత స్ఖాలిత్యములు మెండుగఁ గలవు. ఇందు రేఫ ఘటిత శబ్దము లేఁ బది కందములతోను ఱకార శబ్దములేఁబది కందములతోను జెప్పఁబడినవి. ఱకార పదములను జెప్పి మఱొక యాటవెలఁదియుఁ గలదు. ఇవి చెప్పుటకు ముందుగ గ్రంథాదిని దిరుమలయ్యగా రీ క్రిందిరీతిని జెప్పియున్నారు.

కం. శ్రీ వేంకటేశ నీకుం,
గావించెద నంకితంబుగా ఱా రేఫల్,
వావిరి నేర్పఱిచిన కృతి,
శ్రీ వనితా నాథ రామ చేకొను కృష్ణా.

కం. అచ్చుల హల్లుల వరుసన,
వచ్చిన రేఫలును ఱాలు వర్ణించెద మున్,
మెచ్చఁగ నాది కవీశ్వరు,
లచ్చుపడం గృతులఁ జెప్పి నటువలెఁ గృష్ణా.

ఇట్లుపక్రమించి యీ క్రిందిరీతి నుపసంహరించెను—

కం. సుఱసుఱ యనియెడు చోటను,
సొఱఁజొచ్చుట యనుట ఱాలు చొప్పడె నిట్లపై,
మఱిఁ గలిగెనేని తెలియుఁడు,
తఱ చెందును లేవు కృతుల దలఁపఁగఁ గృష్ణా.

గీ. క్షీర నీర విభేదము చేసినట్లు,
ధరణి రేఫ ఱకారముల్ తాళ్ళపాక,
తిరుమలాఖ్యుండు వేర్వేఱఁ దేటపఱిచె,
నుచిత్తమిది గాదె పరమహంసోత్తమునకు.

పరమహంసోత్తముఁ డనుటచే నీతఁడు సన్న్యాసియై యుండి దీనిని రచించెనని విశదమగుచున్నది. ఇది మిక్కిలి వింతయైన విషయము. దీనిచే నాతని కాంధ్ర లక్షణ విషయమునఁ గల గౌరవము సువ్యక్తమగుచున్నది. తాను జేసిన రేఫ ఱకార విభాగము ప్రాయో విషయకమనియు నెందేని యుండి పోయినచోఁ బ్రయోగములనుబట్టి తెలియనగు ననియును నిరహంకారముగాఁ జెప్పికొనెను.

(౪౪౧)—అట్టికొఱంతఁ దీర్చుటకే యప్పకవి యత్నించి యీ క్రింది రీతి నుపక్రమించెను.

సీ. శ్రీకామెపల్లె పురీ గోపికాజార,
యసుర సంహార నీ కంకితముగ,
నాదికవీంద్ర కావ్యములెల్ల శోధించి,
క్రమత హ్రస్వములు దీర్ఘములునైన,

యచ్చులమీఁదను హల్లులమీఁదను,
గలుగు రేఫ అకారములు వచింతుఁ,
దాళ్ళపాకాన్వయోదధి పూర్ణ ధవళదీ,
ధితి పెద్ద తిరుమల దేశికుండు,
మొదలైన వారలు మునుపు రచించిన,
యవి యెల్లఁ జాలవా యనఁగ వలదు,
వెండియు నొక కొన్ని వెదకి కూర్చితిఁ గవి,
రాజులు మేలని ప్రస్తుతింప.

... ... ... ... ... ... ... ... (అప్పక. ౨ ఆ. ౧౯౬)

'తిరుమల దేశికుండు మొదలైనవారలు' అను నప్పకవి వాక్యముచే నింకను గొంద ఱిట్టి పరిశోధనము చేసిన ట్లగపడును గాని వారెవ్వరో తెలియకున్నది.

గీ. ప్రకృతి శబ్దానుశాస నోభయకవిసఖ,
శంభుసేవక సోమ భాస్కరులచేత,
భారతాదుల విభజింపఁబడియెఁ దొల్లి,
గరివరద రేఫములును అకారములును. (౧౯౭)

కం. తెలిపితి నన్నయ భట్టా,
దుల కావ్యములందు నాకు దొరకిన రేఫం,
బులు ఱాలు మఱియు నెందులఁ
గలిగినఁ దగదనక యవియుఁ గైకొను టొప్పున్.

(అప్ప. ౨ ఆ. ౨౧౮)

ఇట్లుగ నప్పకవియుఁ దుదికి సశేషముగనె యుపసంహరించి నట్లు చెప్పికొని యున్నాఁడు.

తిరుమలయ్యయు నప్పకవియు నాయా రేఫ అకార శబ్దములను జేర్కొనుటలో నాయా శబ్దముల వెనుక వాని వాని యర్థములను గొన్ని యెడలఁ జూపుచువచ్చిరి. మఱికొన్ని చోటులం దాయాగ్రంథములలోని ప్రాసాదిస్థలములందలి పదసందర్భమును జూపుచు వచ్చిరి. ఇట్టివానిని జూచునపుడు వారు బాగుగఁ బరిశోధించి మహాకవి ప్రయోగములనె యేర్చి కూర్చిరని యూహిఁగఁ దోఁచకమానదుగదా. ఆ ఫక్కికను దిఙ్మాత్రముగఁ జూపెద.

కం. పరిగొని, పరిచను దెంచుట........................ (తిరుమ. ౩౬ ప.)

కం. అఱపొఱడు గుజ్జు... ... ... ...ఒఱవశరీరము మన్మథు, నొఱపులు (తిరుమ. ౨ ప.)

సీ. పరిచనుదెంచుట పరిగొను పరిపరి......................( అప్పక. )

కం. అఱపొఱడు కుఱుచచేతులు। నొఱవ శరీరంబు.............మన్మథు।
నొఱపులఁ బడియెడు నితండు.................(భార. అర. ౨ ఆ).

చ. పరిచనుదెంచె గోగణము పట్టె నన న్విని. .........(భార.విరా. ౪ ఆ.)

పయిరీతి నున్న లక్ష్యలక్షణముల సంబంధమును బరిశీలించునపు డా ప్రాచీనాంధ్ర లాక్షణికులు చేసిన పరిశోధన పరిశ్రమ మెంతయు శ్లాఘాపాత్ర మని యెవ్వరికేని తోఁచకపోదు. పయిరీతి నున్న తిరుమలాప్పకవుల గ్రంథములను సరిగ సంస్కరింపక "ఒఱవ = శరీరము; కుఱు=కంటు" అని యిట్లు ప్రమాద భూయిష్ఠముగ సంస్కర్తలు ముద్రింపించుట యెంతయు శోచనీయము.

వీరివెనుకఁ గూచిమంచితిమ్మకవి సార్వభౌముఁడు తనసర్వలక్షణ సారసంగ్రహమునందలి మూఁడవయాశ్వాసలో రేఫ అకార విమర్శనమును మాత్రమె చేసియున్నాఁడు. ఈతఁడును గొప్పపరిశోధనముచేసి యనేకములగు ప్రయోగముల నేర్చికూర్చి యప్పకవి చెప్పిన రేఫ అకారముల నెల్ల నౌఁ గాదనుచు విపులముగఁ విమర్శించి యున్నాఁడు.

(౪౪౨)—ఇంకను బద్దెపూఁడి భద్రన్నగారు చేసిన రేఫ అకార శబ్దముల పద్యములు నల్వాదెన్మిదియు గణపవరపు వేంకటకవిగారి రేఫనిర్ణయ తారావళియు నాంధ్రసాహిత్య పరిషత్కార్యస్థానపు మేనేజరుగారగు బ్ర. శ్రీ క్రొత్తపల్లి సూర్యారావుగారు దయతో వ్రాసి పంపినందున నాకు లభించినవి. కాని వానియం దుదాహృతులుగాని విమర్శనములుగాని లేవు. అయ్యవి యసమగ్రములు. మఱియును పై గ్రంథములకన్న వీనిలో విశేషశబ్దములు లేవు.

సీ. శ్రీకరముగఁ బూర్వకృతుల రేఫ అకారములకు నిర్ణయరీతి తెలివిడిగను,
దెలిపెదఁ దద్భవముల దేశ్యముల గ్రియాపదముల కడపటి వర్ణములు బహుప్రిహు లివియెల్ల నొప్పును రేఫలై కడమ అకారముల్ గా దనర్చుఁ,
గావున రెంటికిఁ గలఫే ళ్ళకారాది తారావళి యొనర్చి దాని వరుస,

తే-గీ. నాచిమకవీశ్వరుల యుదాహరణ లెల్ల, వ్రాసి కవులకు నుపకృతి చేసినాఁడ,
పరమహంస పాల్ నీళ్ళు నేర్పఱచునటులఁ, బంకజాతాప్తనికాశ వేంకటేశ.

ఇట్లు వేంకటకవి వ్రాసిన రీతినుండెడి యుదాహరణ గ్రంథము లభింప దయ్యె. "తద్భవముల దేశ్యముల... కడపటి వర్ణములు బహువ్రీహు లివి యెల్ల నొప్పు రేఫలై" అనువాక్యము చింత్యమై యున్నది. ఆతఁ డీ వాక్యము నెట్లు సమర్థించి యుదాహరించెనో తెలియకున్నది.

(౪౪౩)—ఆధునికుఁడగు నోగిరాల రంగనాథకవి పూర్వలక్షణ గ్రంథములలోని ప్రయోగముల నెల్ల సంగ్రహించి ద్విరేఫ వర్ణదర్పణ మను నొక గ్రంథమును నాలుగాశ్వాసములుగా రచించి రేఫఱకార నిర్ణయవిషయమును విరివిగా వివరించెను. ఇంక బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరము రేఫ ఱకార విషయమునే కాక యాంధ్రభాషావిషయముల ననేకములను బూర్ణముగఁ జక్కఁజేయుచున్నదని వేఱుగ వ్రాయనక్కఱలేదు. సీతారామాచార్యులవారి శబ్దరత్నాకర కోశమును ముద్రింపకమునుపే యలఘుకౌముది యను నొక శకటరేఫ శబ్దముల కోశమును ముద్రించిరి.

శబ్దరత్నాకరము 1887 (క్రీ. శ.) సంవత్సరముననె ముద్రితమయ్యెను. ద్విరేఫ వర్ణ దర్పణ మన్ననో 1903 (క్రీ.శ.) సంవత్సరమున ముద్రితమయ్యెను.

పయిగ్రంథములె కాక భారతము లక్ష్మీపతిగారి శకటరేఫ నిర్ణయము నడిదము సూరకవిగారి కవిసంశయవిచ్ఛేదములోని రెండవభాగమును నీ శకట రేఫ నిర్ణయవిషయమున రచింపఁబడియున్నవి.

(౪౪౪)—పయి గ్రంథములనుబట్టి పరిశీలింపఁగా నన్నయభట్టారకుఁడు తప్పఁ దక్కిన వారెల్లఁ గొలఁదిగనో గొప్పగనో ద్విరేఫక శబ్దములను బ్రయోగించిన వారె యనవచ్చును. ఈక్రింది ప్రయోగములనుబట్టి నన్నయ భట్టారకుఁడును నొకద్విరేఫకశబ్దమును బ్రయోగించెననియు నట్టి ప్రయోగమునె మూలముగాఁ గొని యుత్తరోత్తరు లట్టివాని నధికముగఁ బ్రయోగింపసాగిరనియుఁ గొందఱు తలంచుచున్నారు.

కం. తరళనయనాబ్జదళములు, నెరయఁగఁ బైమున్ను సల్లి నృపసుతుఁ బూజిం,
చిరి నవకుసుమ మయాలం, కరణవిశేషముల నచటి కాంతలు ప్రీతిన్.
(ఆది. ౩ ఆ. ౧౫౭ ప.)

మాలిని. "నరునకు... ...విమానంబుల్ నభోభాగ మెల్లన్, నెరసి వెలుఁగుచుండన్ నిర్జరశ్రేణితోడన్" (ఆది. ౮ ఆ. ౧౯౬ ప.)

సీ. ...... పదఘట్టనంబునఁ జదిసి తాలు, ఆ. వె. నుఱుము గాఁగ నిట్లు నెఱ
యంగ సత్వంబు, మెరసి రాతి రెల్ల నుఱకపవన, తనయుఁ డరిగె
(భార. ఆది. ౬ ఆ. ౧౬౦ ప.)

పై రీతి నొక్క-శబ్దమె రేఫశకట ప్రాసములలోఁ బ్రయోగింపఁబడిన ట్లగ పడుచున్నను మొదటి రెండు పద్యములలోను గల రేఫ ప్రాసములోని నెరయు ధాతువు "ఆచ్ఛాదించు" అను నర్థముగల సకర్మకమును మూఁడవ పద్యము లోని ఱకారప్రాసమునందలి నెఱయుధాతువు 'నిండగు' అను నర్థముగల యక ర్మకమును నగుటచేత నచట రేఫఱకార సాంకర్యము లేదని గ్రహింపనగును. నన్నయభట్టారకుఁ డింక నెచ్చటను ద్విరేఫకశబ్దమును బ్రయోగించియుండమిం జేసి యిచట నా వ్రాసినరీతినె యాతఁడు తలంచియుండెననుట యెంతయు విశ్వ సనీయమై యున్నది. భారతము లక్ష్మీనృపత్యవధాని నావలెనే యీ నన్న యప్రయోగము లర్థభేదయుక్తముః లని వ్రాసెను గాని యీతఁ డట్టియర్థము లను జూపుటలోఁ బై చోట నించుక భిన్నాభిప్రాయుఁడై యున్నాఁడు.

పలితాని క్రియాస్నాయుః, ఫేనో యోగో నపూర్వకాః.........పలి తాని = నరలు,...క్రియా = ఒనరించు,...స్నాయుః = నరము... ... ఫేనః = నురువు.........యోగః = నెరయుట. ఈ శబ్దము సంయో గార్థమైనయెడల రేఫము. ప్రకాశార్థమైన శకటము.

(శకటరే. 23. పుట.)

ఖండనం ధూళనంచైవ, క్షోదనం చాస్తిచాలకాః, నిజం స్ఫటం ప్రకా శోవా, నపూర్వాః శకటాః స్మృతాః,... ...ప్రకాశోవా = నెఱయుట. ఈ శబ్దము ప్రకాశార్థకమైన శకటరేఫము. సంయోగార్థమైన శకటముకాదు, ..

(శకటరే. ౨౯ పుట.)

ఇట నా చెప్పిన యర్థభేద మింతకన్న యుక్తతరముగనున్నదని తోఁచెడిని.

పయిరీతి నర్థభేదమును వివక్షించి స్థలాంతరమునందును నన్నయభట్టు రేఫ ఱకారములతో మఱొక శబ్దమును బ్రయోగించి యున్నాఁడు.

మధ్యాక్కర! 'ఆరాజుగుణములు...... కరుణనాయందుఁ గావింపు, మారంగ'............... (అర. ౨ ఆ. ౨౨ ప.)

కం. కాఱడవిఁ బఱచు మృగముల, నూఱడక వధించి డస్సి యున్నతని శ్రమం,
బాఱఁగ నెదఁ బరితాపము, తీఱఁగఁ బై వీచె నన్నదీ పవనంబుల్.
( భార. ఆది. ౪ ఆ. ౧౯ ప. )

పయి పద్యములలో 'నిండారు' అనునర్థమున రేఫయుక్తమగు 'ఆరంగ' అనునదియు 'ఉపశమిల్లు' అనునర్థమున అకారఘటితమగు "ఆఱఁగ" అను శబ్దమును నన్నయభట్టుచేఁ బ్రయోగింపఁబడె ననుటలో సందేహము లేదుగదా.

నన్నయ భట్టారకునకుఁ దర్వాతివారు ప్రయోగించిన ప్రయోగములలోఁ బైరీతి గల యర్థభేద మగపడదు.

కం. నాయుల్ల మరయ నినుమో, తాయో కాకిట్లు రూపఱక వినవేర్చెన్.
( భార. భీష్మ. 3 ఆ. ౪౧ ప. )

కం. చేతఁగొని యుప్పు నమలుట, రాతిపయిని నినుముగొనుట
రాత్రి దధిమధూ, పేతంబుగఁ గుడుచుట. ...
( భార. అను. ౪ ఆ. ౧౦౦ ప. )

కం. భూరిశ్రవసుం డొక్కఁడ, వీర వినోదంబు సలుప వేడుకమై దు,
ర్వారతమై...వచ్చెద, మేరుకొనుము సంగరమున కిటు మాలోనన్.
( ద్విరేఫ. ౪ ఆ. ౧౨3 పు. భార. )

గీ. ...తృణధాన్యమల్ప, మేఱికొని వత్తు రాకలి తీఱకుండు.
( భార. అశ్వమే. ౪ ఆ. ౨౨౦ ప. )

క. కురుసేన గదా......, పెరిఁగిన... ( భార. ఉద్యో. )

సీ. తఱచుటమ్ముల నేదు పెఱిఁగిన చందంబు. ... ( భార. కర్ణ ౧ ఆ. )

చం. హరిపదసేవ... ... ...ఫలంబు లెల్లఁజే, కురుటది యబ్రమే. ...
( భాస్కర. ద్విరే. ౪ ఆ. ౧౧౫ పు. )

కం. మఱియూ రఘువీరులు నీ,
మఱు మొండెము వేగ దగ్ధముగఁ జేయఁగఁ జే,
కుఱునీకు. ... ... ( భాస్కర. ద్విరేఫ. 3 ఆ. ౯౬ పు.)

ఇంక నొక పదమునె యొకరు రేఫ ప్రాసమునఁ బ్రయోగించి యుండఁగా నింకొకరు అకార ప్రాసమున వేసియున్నారనుట యొకవింత కాదుగదా.

కం. ధరణిఁ గడుఁ బేదవారును, ... ..ము౦, దరసంగ్రహింతురు. ...
( భార. అరణ్య. 3 ఆ. ౨౪౧ ప. )

విశ్వ—లఘువ శ్శాఖి శైలాగ్న్యో రన్యే ఖగతి బర్హిషః ।
అన్యేన్తరిక్ష సదృశో । న్యే న యుక్తాః కదాపిచ ॥

---

చ. చిఱుత తనంబునన్ ......షుం, దఱి నటువోవ నిచ్చితి.

(భార. ఉద్యో. 3. ఆ.)

సీ. ... ... ,మఱి మ్రొక్కు-సది వీరి కెఱఁగుట తక్క-.

(భార. అను. ౪ ఆ. ౧౦౫ ప.)

ఆ. వె. ......అధికభక్తి, నెరఁగి ప్రియము పలికి తెరువిత్తు రిట్టిద. ......

(భార. ఆది. ౭ ఆ. ౧౧౨ ప.)

కం. అఱకట నిడి... ..., ఒఱగిన గాలవుని. ... ... (భార. ఉద్యో.)

చం. ధరణి నాత్మలోఁ దలఁచి......నిద్రలేక తా, నొరగుచు లేచుచున్....

(భాస్క-ర. కిష్కింధా.)

ఇట్టి ద్విరేఫక శబ్దములు పెక్కు-గలవు. వానినెల్ల నేతత్ ప్రకరణాంతమునఁ జూపుచున్నాను.

(౨౨౫)—వ్యాఖ్య:—లఘువ ఇత్యాది:—మహాకవి ప్రయోగముల లోని రేఫ ఱకారములను గొన్నిటిని దెలిసికొనుట కథర్వణుఁడు మార్గాంతరముల నలంతిగ నస్వరసముగఁ జూపుచున్నాఁడు.

అన్యే = కొందఱు, శాఖి శైలాగ్న్యయః = తరుపర్వతాగ్ని వాచకములు, లఘవః = లఘు రేఫ యుక్తము లగుచున్న వనెదరు. అన్యే = కొందఱు, ఖగతి బర్హిషః = పక్షితృణ వాచకములును, (ఖగతి శబ్దము తిర్యక్కులకును నుపలక్షణ మగుచున్నది. అట్లు తృణశబ్దమును లతాదికముల కుపలక్షణ మగుచున్నది.) లఘురేఫ యుక్తములె యనెదరు. అన్యే=మఱికొందఱు, అంతరిక్షసదృశః = వ్యోమసాదృశ్యవాచకములును, లఘురేఫ యుక్తములె యని చెప్పెదరు. యుక్తాః = ద్విత్వాక్షరములు, కదాపిచ = ఎచ్చటనైనను ననఁగా శాఖ్యాది వాచకములయందును, న = లఘురేఫములు కానేరవు.

ఉదా:—శాఖి:—ఉసిరక, రావి, నేరెడు మొ.

శైల:—తరిగొండ, బంగరు గట్టు మొ.

అగ్ని:—ఎరగలి, వైరవులు, ఎరియు, దరికొను మొ.

ఖగతి:—ఊసరవెల్లి, పూరేడు, తగరు, గౌరు మొ.

బర్హిః:—పూరి, పోరక, వరి, అగురు, పెసర, గలిజేరు, నల్లేరు మొ.

అంతరిక్ష:—ఉప్పరము మొ.

సదృశ:—సరి, దొర, కరణి, మాదిరి, పురుడు మొ.

ద్విరుక్త:—మఱ్ఱి, గుఱ్ఱము, జెఱ్ఱి, గొఱ్ఱియ, ఇఱ్ఱి మొ.

ఈవిషయములనె చాలవఱకు శకట రేఫ నిర్ణయకర్త యీక్రింది రీతి ననుసరించి యున్నాఁడు.

శ్లో. అథ రేఫ సమామ్నాయః, క్రియతే శ్రూయతాం విభో,
... ..., వాచకాస్తరు వీరుధామ్.  (౪౭ పుట.)

తిర్యగ్వాచీ రః (౫౩ పుట... ... గిరి వాచకాః  (౯౨ పు.)

ఉదా:—ఉసిరక ...నారికెడము, ఇవి వృక్షాది వాచక రేఫములు. ద్విత్వముతోఁ గూడి కొనినవి శకటములె మఱ్ఱి మొదలైనవి."
(శకట రేఫ నిర్ణయము.)

పైరీతి గల నియమము లవ్యాప్త్యాది దోష దూషితములు నేకదేశ మాత్ర నిరూపకములు నగుటచేఁ బ్రయోజనకారులు కావను తలంపున నథర్వణుఁడు "అన్యే, అన్యే" అని యిట్లస్వరసముగాఁ జూపి యున్నాడు. "న యుక్తాః కదాపిచ" అనునది స్వరసము గావున నావాక్యమున నట్లు 'అన్యే' అను దానిని బ్రయోగింప లేదు. ఒక్క శాఖ్యాది వాచకములలోనే కాక దేనియందును ద్విరుక్తము రేఫము కానేరదని తెలుపుటకయి 'కదాపిచ' అను దళమును నిల్పియున్నాఁడు. పయి సూత్రములు "ఆఱుగ, (అప్పకవి) గఱిక, గఱుగు, చిచ్చఱ, చెఱకు, జోఱీఁగ, మిడుగుఱు, తేఁగు (అప్పకవి) తెల్లు, తేఁచు, తేల, మున్నగు శబ్దములందుఁ బ్రవర్తింపఁ జాలవు గదా.

ఈసందర్భమున మిక్కిలి విపులముగ శకట రేఫ నిర్ణయ గ్రంథకర్త సూత్రములను జూపి యున్నాఁడు. అందుఁ గొన్నిటి నిటఁ జూపుచున్నాను:

"తత్సమాస్త ద్భవా స్సంఖ్యా, స్సర్వనామాన ఏవచ.
భవన్తిహి వినా రేఫా, విశేషవిధి బాధితైః  (శకటరే ౪౬ పుట.)
(దీనికి బాధకములగు విశేష విధులు ముందుఁ జూపఁబడును).
తద్వ దర్థేషు చార్యన్తా, రేఫా స్స్యు ర్జాతి వాచకాః,
... ...రస్తృతీయో, లఘుః త్ర్యక్షర కర్మసు... ...
రేఫాః కర వరాన్తాశ్చ, గరాన్తా గరిపూర్వకాః,

మరాన్తాః ఘురి పూర్వాశ్చ,
సిర్యన్తాశ్చ ఘురాన్తకాః, విర్యన్తాః కరి కిర్యన్తాః,
రుజ్వన్తాః ... ... ... ... ... ... ... ... ... ... ... ......

గుగ్వన్తాశ్చ పరాన్తాశ్చ, పాన్తా రేఫా హ్యబాధితాః,
తరాద్యన్తా రిసేన్తాశ్చా, సురాద్యాశ్చ సపూర్వకాః'
బాదయశ్చైవ రేఫాః స్యుః, సర్వ త్రాబాధితా ఇమే, ... ... ...
పై వానికి బాధకములగు విధులను నైతమిట్లు చెప్పెను.
షష్టి రర్ధనఖం తథా, (శకట రే. ౨ పుట)
ఉభా వియన్త స్సర్వేచ, కియన్తః కతి చాగ్రతః, ౨౫ పు)
జ్యేష్ఠత్వ కన్యా త్వాద్యాశ్చ, దపూర్వాః శకటాః స్మృతాః, (శకట

షష్టిః = అఱువది, ఉభౌ = ఇద్దఱు, ఇయన్తః = ఇందఱు, సర్వే = అందఱు, కియన్తః = ఎందఱు, కతి = కొందఱు, అగ్రతః = ముందఱ, జ్యేష్ఠత్వ = పెద్దఱికము, కన్యాత్వాద్యాః = కన్నెఱికము, లేఁతఱికము. ఇల్లఱికము, మొ. ఈతని మతమున దీర్ఘపూర్వక శకటము లేదు గాన 'ఆఱు, నూఱు' మున్నగు నవి శకటములని యీతఁడు చెప్పఁడు.

(౪౪౬)—పయివానిలో ననేక విషయములను రంగనాథకవి సంగ్రహించి యున్నాఁడు.

గీ. "తఱచు త్రిలఘు క్రియాపదాంత్యంబు గ్రార,
రేఫ మర్యంత జాతి ధర్మి పదగతము,
రాగమంబు నాగమి ణిజర్థాదికంబు,
లాంత జస్ రేఫమును **లఘు** వబ్జనాభ."

**త్రిలఘు** క్రియాపదాంత్యంబు—తనరె, పొనరె, అడరె మొ.
గ్రార:—అద్రువ, విద్రువ, మొ. అర్యంతజాతి ధర్మిపద
గతము :—జాలరి. పూజరి మొ. రాగమంబు—జవరాలు మొ.
ఆగమి ణిజర్థాదికంబు—రావించు, రప్పించు, రాదు, రమ్ము మొ.
లాంతజస్ రేఫము—బాలురు మొ.

ఎ. గీ. అంగ నాధమ సంబుద్ధి యారదాగ, షష్ఠు త దేత త్కిమాత్మ యుష్మ దభిధేయ। ములు.........జనగణ, నాపదోర్వంతములు నవియే పరాత్మా," అంగనా సంబుద్ధి—చెలియరో, అధమ సంబుద్ధి—ఓరి. ఆరదా

(వికృ) కేచి ద్వద న్తి చ లఘూన్ । బిన్దు బాణ శిలీముఖాన్
తథా వద న్తి కేచిత్తు । హర్య ఙ్ఘ్రి ఖ శరాన్ పరాన్
వేద్యా స్త్వేతే ప్రయోగేషు । స్యు రుచ్చారణ భేదతః
యథాయథం ప్రయోగాద్వా । రేఫా స్సర్వే ప్రయోగతః॥
అనిశ్చయో భవే ద్యత్ర । గ్రామ మానుష నామసు ।
రేఫయో ర్నిశ్చయ స్తత్ర । రేఫమాత్రై కగోచరః ॥

---

గమము—రాములార తదాదులు—వారు, వీరు, ఎవరు, తారు, మీరు. జనగణనా పదోర్ధ్వాంతములు—ఇరుగురు మొ.

గీ॥ సర్వ కతిచి ద్ద్వి కియ దియ చ్ఛబ్దవాచ్య, ముల ఱిక ప్రత్యయం బుల... .....గుఱువె...... (ద్విరేఫ. ౧౧౯. పుట.)

(౪౪౭) వ్యాఖ్య—కేచిదిత్యాది—వెనుకటి సూత్రములవంటి వానినె మఱికొన్నిటిని సస్వరములగనె యథర్వణుఁడు చూపి స్వమతోపన్యాసమున నుప సంహరించుచున్నాఁడు. కేచిత్=కొందఱు, బిన్దు బాణశిలీముఖాన్—బిన్దు=అను స్వారవాచకమును (అరసున్న) బాణ = శరవాచకములను (జిరా, లకోరి, బరిగోల, నారసము) శిలీముఖాన్ = భ్రమరవాచకములను (మొగరంబము మరునల్లె) లఘూన్ = లఘురేఫయుతములనుగా, వద న్తి = చెప్పుచున్నారు. తథా = అట్లే, కేచిత్తు=మఱికొందఱన్ననో, హర్యఙ్ఘ్రి......హరి = సింహ వాచకములను, (తెఱనోటిమొకము) అఙ్ఘ్రి= పాదవాచకములను (అఱకాలు) ఖ = అనుస్వారవాచకములను, (అఱసున్న నెఱసున్న) శరాన్ = కాశతృణ వాచకములను, (ఱెల్లు) పరాన్ = ఇతరములగు నలఘువులనుగా, వద న్తి = చెప్పుచున్నారు.

వెనుకటి కారికలలోఁ జెప్పఁబడిన వాని కపవాదముగ నిందు 'తిర్య గ్వాచులగు తెఱనోటి మెకము మున్నగునవి శకటయుక్తములై యున్నవనియు, నర్థశబ్దభవమగు నరశబ్దమున్నను దేశ్యమగు 'అఱ' శబ్దముతోనున్న "అఱ కాలు" మున్నగునవియుఁ గలవనియుఁ దృణవాచకము పదాది గతము నగు ఱెల్లుశబ్దము శకటయుతమై యున్నదనియుఁ, జెప్పఁబడెను.

ఏతేచ=ఇవియెల్ల, ఉచ్చారణ భేదతః = వారువా రుచ్చరించు నుచ్చా రణముల భేదమువలన, ప్రయోగేషు = ప్రయోగములందు, వేద్యాః = తెలిసికొనఁదగినవి. స్యుః = అగుచున్నవి. సర్వే రేఫాః = లఘ్వలఘురూపము లగు సమస్తరేఫములును, ప్రయోగతః = మహాకవి ప్రయోగములనుండి,

యథాయథమ్ = యథాస్వరూపముగా, మహాకవులచే నెట్లు ప్రయుక్తముల గునో యట్లె, ప్రయోగార్హాః = ప్రయోగింపఁదగిన వగుచున్నవి. అంతియ కాని "లఘువ శ్శ్యాఖి శ్శైలేత్యా ద్యనుగమములై సరియనుచుఁ దలంపరాదని భావము.

(౮౮౮) వ్యాఖ్య—అనిశ్చయఇత్యాది: —గ్రామమానుష నామసు = మహాకవుల పద్యములందలి యతిప్రాసాది స్థలములలోఁ బ్రయోగములు దొరకని గ్రామవాచకములలోను, మనుష్యవాచకములలోను, యత్ర = ఎచ్చట, రేఫయోః = రేఫఱకారములయొక్క, అనిశ్చయః = నిర్ణయము కలుగకుండుట, భవేత్ = సంభవించునో, తత్ర = అచ్చట, రేఫమాత్రైకగోచరో నిశ్చయః = రేఫమాత్రమునకె ముఖ్యముగా విషయమగుననెడి నిశ్చయము గ్రాహ్య మని యర్థము. గ్రామ మానుషశబ్దములు తక్కిన సంజ్ఞల కుపలక్షణములు. 'కాకరపఱ్ఱు, నిడమఱ్ఱు' మున్నగుచోట్ల ద్విరుక్తరేఫము లగుటంజేసి ఱకార ద్వయనిశ్చయమే కలుగుచున్నదనియు నట్టివి యీ సూత్రమునకు లక్ష్య ములు, కావనియు నెన్నవగును. అట్లె 'రాముఁడు, రమణమ్మ' మున్నగునవి సంస్కృతశబ్దములుగాన నచట రేఫనిశ్చయమె కలుగుచున్నదని గ్రహింప నగును. ఇఁక 'కారాడ, కోరాడ' మున్నగుగ్రామాదినామములలో నెట్టినిశ్చ యమును లేనందున వానిలో నీసూత్రముచొప్పున రేఫములనే నిశ్చయింప వలెనని గ్రహింపవలెను.

(౮౮౯)—ప్రకృతములగు 'లఘువశ్శ్యాఖీ' త్యాదికారికలను నహో బల పండితీయమున నించుక పాఠభేదములతో నున్న వానిని దీసికొని ద్విరేఫ దర్పణకర్త యిట్లు వేఱువిధమున సమన్వయించెను.

శ్లో॥ "లఘువ శ్శిఖి శ్శైలాగ్న యోన్యే ఖ గజ బర్హిణః ।
వేద్యాశ్శైత్రేతే ప్రయోగేషు । స్యు రుచ్చారణ భేదతః ।
కేచి ద్వదన్తి చ లఘూన్ । బిన్దు బాణ శిలీముఖాన్ ।
తథా వదన్తి కేచిత్తు । హార్యక్షి ఖ శరాన్ పరాన్ ।
హార్యక్షి శబ్ద ఆకాశ పరత్వేన బిన్దు వాచకః ।"

(అహో. ౧౮౯)

అహోబల పండితీయములోని పై గ్రంథము నీ క్రిందిరీతిని రంగనాథ కవి యాంధ్రీకరించెను.

గీ. శౌరి మున్నూట యెనుబది శకట రేఫ,
ములును మున్నూట డెబ్బదిమూఁడు రేఫ,
ములును దగు లక్ష్యముల వీనిఁ దెలియవలయుఁ,
దద్వి దుచ్చారణ ప్రభేదంబు వలన.

గీ. పరఁగ నేనూఱు శకట రేఫములు రేఫ,
ములును నేనూట యేఁబది వెలయు ననుచుఁ,
గొంద ఱార్యులు వలికిరి కొలఁది వెట్టి,
దాని నంగీకరించె నథర్వణుండు.

శ్లో॥ యథాయథం ప్రయోగార్థా । రేఫా స్సర్వే ప్రయోగతః ॥ ”

కం. గురు లఘు రేఫము లన్నియుఁ,
బురాతనకవి ప్రయోగములఁ గనుఁగొని సం,
కరభావ మందుఁ జేయక,
యురుమతులు యథేష్టముగఁ బ్రయోగింపుఁ డిలన్.

( ద్విరేఫవర్ణ దర్పణము. ౧ ఆ.౬ పుట ).

శ్లో॥ “ అన్యే న్తరిక్ష ఖదృశో । న్యే న యుక్తాః కదాపిచ ॥

( అథర్వణకారిక )

టీక. అన్యే = ఉక్తవ్యతిరిక్తములును, యుక్తాః = ద్విత్వవిశిష్టములును నగు గురు రేఫములు, అన్తరిక్ష ఖదృశః = ఇన్నూఱు, అవి, కదాపిచ=ఎప్పుడును, అన్యే = లఘురేఫములు, న = కావు...... ” ( ద్విరేఫ, ౧౧౦పుట ).

పయి రీతినె తరువాతి యాధునిక వైయాకరణులును నవిమర్శితముగ వ్రాయ సాగిరి.

(రగం)—పై యథర్వణాచార్య వచనములు సంఖ్యా కథనము చేయ లేదనియు వానియర్థము వేఱనియు నీవఱకు నేను వివరించియే యున్నాను. అప్పకవియుఁ బెదతిరుమలయ్యయు వారి గ్రంథములలోఁ బై సంఖ్యల నియ్యనేలేదు. వా రిచ్చిన శబ్దములను బైవారు లెక్కించి వ్రాసిరా యని యాలోచించుటకును వలనుపడకున్నది.

కం. ఆఱడి యన నడలాఱఁగ,
నాఱంచులు నాఱు చవులు నాఱని తేజం,
బాఱమ్ములఁ బాపము పో
టాఱె ననఁగ ఱాలు కృతుల నమరెను గృష్ణా.

కం. పెఱమూకలు పెఱచేతను,
బఱిపఱియలు సేయుటనఁగఁ బఱివోయె ననన్.... ..."

( తిరుమలయ్యగారి రేఫ ఱకార నిర్ణయము )

అను రీతి నా యా శబ్దములను బ్రయోగించిన కవుల ప్రయోగముల సందర్భాదులను జూపుచు వారొక్కొక్క శబ్దమునె పలు విధముల నుదాహరించుచు వచ్చుటచేత రేఫఱకార శబ్ద సంఖ్యా కథనమును వా రుద్దేశించియే యున్నట్లగపడదు.

పరిశీలింపఁగా 'కాకుల లెక్క'ను బోలు నిష్ప్రయోజనమగు నీసంఖ్యాగణనము పయి యథర్వణకారికల కర్థమనుట యెంతమాత్రమును విశ్వసనీయమై యుండ లేదు. వెనుకను వివరించిన రీతిని నన్నయభట్టారకుని పద్యములలోని యతిప్రాసస్థలములందలి రేఫ ఱకారములనే యథర్వణుఁడు "ద్వివిధాదిదుత" ఇత్యాది సూత్రములచేత నిరూపించి యుండుటంజేసి యనంతరోక్తకారికలలో సంఖ్యాకథనమును గావించినను నట్టి నన్నయ యతిప్రాసస్థల ప్రయుక్త రేఫఱకార ఘటితశబ్దముల సంఖ్యనే చెప్పియుండె ననఁదగును. అట్టివి రేఫము లెనుబదేడును శకటము లఱువదిమూఁడును మాత్రమె యై యున్నవి. ఇంక "లఘుర్భవే ద్గురుః క్వచి ద్గురుశ్చ లఘుర్భవేత్" అను చొప్పున "క్వచిత్" అని చెప్పిన మాత్రనం దింతటి వైషమ్యము నాతఁ డంగీకరించి యుండు ననుట యెంతమాత్రమును విశ్వాసపాత్రము కానేరదుగదా. ఇంతియకాక ద్విరుక్త శకటఘటితశబ్దములు రెండువందలని యర్థము చేసెనేకాని రంగనాథకవి రమారమి పదిశబ్దములకన్న హెచ్చుగ నుదాహరింపఁ డయ్యెను.

మఱియుఁ బయి యథర్వణ కారికల సందర్భమునుబట్టి చూచినను వాని సంఖ్యాపరమగు నర్థము గ్రంథకృదభిప్రేతము కాదని యంగీకరింపక తీరదు. "లఘువః శిఖి" త్యాది శ్లోకమునఁ బ్రయోగములనుబట్టి రేఫఱకారఘటిత శబ్దముల సంఖ్యలు తెలిసికొనఁదగునని చెప్పుటమాత్రమె ప్రసక్తమై యుండునుగాని 'యుచ్చారణ భేదమువలన' అను దళమును నందు నిలుపుట ప్రసక్తము కానేరదు. ప్రయోగములలోని శబ్దములను లెక్కించి చెప్పునపు డుచ్చారణభేదమును బ్రసంగింపవలసిన పనిలేదుగదా. నా వ్యాఖ్యాపక్షమునం దన్ననో యీయీజాతుల శబ్దములు లఘువులనియు నిట్టిజాతులలో సయితము కొన్ని యలఘువులు గలవని కొంద ఱుచ్చారణ భేదమునుబట్టి తలంచుచున్నారనియుఁ జెప్పుట యెంతయు సుప్రసక్త మయియుండును. ఇంతియకాక

"యథాయథం ప్రయోగార్హా । రేఫా స్సర్వే ప్రయోగతః" అను సర్థర్చ మునకు సంఖ్యాకథనపక్షమునఁ బ్రసక్తియే యగపడదు. మూఁడువందలని చెప్పినవారును నయిదువందలని చెప్పినవారును బ్రయోగముల ననుసరించియే చెప్పియుండుటంజేసి యట్టి సంఖ్యాభేద ముత్తరోత్తర పరిశోధనాతిశయ ప్రాప్త మని మాత్రమేకదా చెప్పవలసియుండును. ఇఁకఁ బ్రయోగములనుబట్టి యథాస్వరూపముగాఁ బ్రయోగింపవలెనని చెప్పవలసిన ప్రసక్తి యేమున్నది? నాచేసిన వ్యాఖ్య పక్షమునం దున్ననో యొకపక్షమువారు తిర్యగాది వాసిక ములు రేఫయుతములని సామాన్యవిధానము చేయఁగా నితరులు తద్విరుద్ధ ములగు విశేషప్రయోగములను జూపు సందర్భములోఁ బ్రయోగములకు నిర్ణాయకత్వమును బ్రసంగించుట మిక్కిలి యావశ్యకమై యుండును. మఱియు "అన్యేస్తరిక్షు ఖద్రుశో। న్యేన యుక్తాః కదాపిచ" అనుదానిమీఁది కారికలో "కేచిత్" "కేచిత్తు" అని చెప్పఁబడి యుండుటంజేసి యిందలి "అన్యే" అనుదానికి రేఫద్వయ పరముగా నర్థము లభించుట దుర్లభము. మఱియు నందు లఘ్వలఘు రేఫముల శబ్దములసంఖ్య చెప్పఁబడెనేకాని రేఫ ములు చెప్పఁబడలేదు. అది యట్లుండఁగా నట్లు మొదటి "అన్యే" అను వాక్యమునకు "ఉక్తవ్యతిరిక్తములైన యనఁగా నీవఱకుఁ జెప్పఁబడిన లఘ్వ లఘురేఫములకన్న వేఱైన ద్విత్వరేఫములు రెండువందలు" అని యర్థము చేసినపుడు తదనంతరవర్తియగు 'అన్యే' అనుదానికి లఘురేఫములను నర్థము వచ్చుట యెంతమాత్రమును సంభవింపనేరదుగదా.

పయిరీతి నికారికల యర్థము దుర్గ్రాహ్యమై యుండుటచేతనే లేఖక పాఠకాదులవలనఁ గల్గియుండనోపు ననుచు నాఁ జేసిన యలంతి సవరణములు (శిఖి—శాఖి; ఖగజ—ఖగతి; ఖద్రుశః—సద్రుశ) శంకాస్పదములు కానేర వనియు నవి కేవలము సంభావ్యములనియు, నా చేసిన వ్యాఖ్యయే పయి కారికలకు సరియై యున్నదనియు విమర్శకులగు విద్వాంసులు గ్రహింతురు గాక.

(౪౫౧)—'ద్విరేఫవర్ణదర్పణము, సర్వలక్షణసారసంగ్రహము' అను గ్రంథములందును శబ్దరత్నాకరకోశమునందును రేఫఱకారఘటిత శబ్దములుగ విపులముగఁ బ్రయోగములు చూపఁబడియున్నవి. అట్టివాని నెల్లఁ బునరుక్త ముగ మరలఁ జూపనేల యని యిచట వానిలోని విమర్శనీయ శబ్దములనే యొక పట్టికగఁ జూపుచున్నాను. ఇం దాయాశబ్దములను సంబంధించిన తెలుఁగు

కన్నడ భాషలలోని శబ్దములందలి రేఫ అకారస్థితులు విశదపడుటకయి యట్టి సంబంధముగల శబ్దములు మాత్రము చూపఁబడును. మఱియు లేఖక ముద్రాపకాదికృత ప్రమాదకలుషిత శబ్దములు వ్రాసి సాధురూపములఁ దెల్పుటకై యిటఁ జూపఁబడును. ఆయాశబ్దముల రేఫఅకార స్థితుల విషయమునఁ గిరుమలయ్య మున్నగువారి యభిప్రాయములు మున్నగునవి వివరణమున సూచింపఁబడును. ఈక్రింది పట్టికలోని మొదటి గడిలోని సంఖ్యలుగల శబ్దముల విషయమున నీ పట్టిక ముగిసిన పిదప పిమ్మట విమర్శనము చేయఁబడును. రెండవ గడిలో శబ్దరత్నాకర సమ్మతములగు రేఫ అకారములతోడి శబ్దములు చూపఁబడును. శబ్దరత్నాకర విరుద్ధముగఁ జూపఁబడినవి యట్టిశబ్దములు త్యాజ్య చిహ్నములలో( )నిల్పఁబడును. మూఁడవ గడిలో నాయా శబ్దముల యర్థములు చూపఁబడును. నాలుగయిదు గడులలో నాయాశబ్దములను సంబంధించిన తమిళ కన్నడశబ్దములు చూపఁబడును. ఆఱవగడిలో నాయా శబ్దముల విషయమున లఘుటీకగ వివరణము వ్రాయఁబడును. అద్దానియందు నిల్పెడి గుఱుతుల వివరము ముందుగ నిటఁ జూపఁబడుచున్నది.

(ప్ర. లే) = తత్వనిర్ణాయక ప్రయోగములు చూపఁబడలేదు.

—— = క్రింద గీఁత గలది రేఫ అకారములలో ప్రసిద్ధశబ్దము.

ప్ర = తత్వనిర్ణాయక ప్రయోగము.

తి = తిరుమలయ్యగారి రేఫ అకార నిర్ణయ సమ్మతి.

అ = అప్పకవీయ రేఫ అకార నీసముల సమ్మతి.

(తిరుమలయ్యగారి గ్రంథము దీనికి మూలము)

స = సర్వలక్షణ సారసంగ్రహ సమ్మతి.

(అప్పకవీయము దీనికి మూలము)

ద్వి = ద్విరేఫవర్ణ దర్పణ సమ్మతి.

ఎల్ల = పయినాల్గు గ్రంథముల సమ్మతి.

శబ్ద = శబ్దరత్నాకరము.

ల = లక్ష్మీనారాణీయకోశము, దాని సమ్మతి.

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | అసురుసురను | శ్రమమునం దగు ధ్వన్యను కరణము | ... | ... | (ప౧. లే) |
| ౧ | అసుఱుసురను. | ,, | ... | ... | అ. స. (ప్ర. లే) |
| | అక్కఱ | అపేక్ష | అక్కఱై | అఱ్కఱు అఱ్ కత్తు | ద్వి. (శబ్ద. భార. ప.) |
| | అద్దిర | ఔరా | ... | ... | శబ్ద. (ఉరా) |
| | (అద్దిఱ) | ,, | ... | ... | ఎల్ల. (ప్ర. లే) |
| | అఱ | సగము, కీడు | అఱై = గది | ... | ఎల్ల. (హరి. ఉ. శబ్ద. భార. ప్ర) |
| | అర | సగము | అరై | అర | ఎల్ల. |
| | అఱకము | అజీర్తి [ము | ... | అఱమె. అఱ్ కమె | |
| | అఱకడ | స్కంధప్రదేశ | ... | ... | ఎల్ల. నల్లురును 'అఱకట - అఱకటము' అనిరి (ప౧. లే). ద్విరేఫ వర్ణదర్పణకర్త 'అఱ్ఱు' శబ్దసంబంధి యనెను. |
| | (అఱక + కడ) | అఱక=స్కంధ | ... | ... | |
| | అఱకడము | [ము | ... | ... | |
| | అఱ్రకమ్ము | కవియు | ... | ... | ఎల్ల. అప్పకవీయములోని 'అఱకమ్ముట' తప్పు. (శబ్ద. ఇట్టి శబ్దపల్లవము లేదు) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము | కన్నడము. | విశేష విషయములు |
|---|---|---|---|---|---|
| | అఱగొడ్డెము | అకార్యము | ... | ... | ద్వి. ఇందు 'అఱగొట్టెము, అఱగొండెము' = సాహసకృత్యము. (ప్ర. లే.) |
| | అఱగొఱ | న్యూనత | అఱై కుఱై | | ద్వి. (శబ్ద. నై. ప్ర.) |
| | అఱచు | కూయు | అఱై = కొట్టు. వాద్యము | అఱుచు | ద్వి. |
| | అఱడు | జడకుచ్చు మీఁది పూస | ... | ... | అ. స. ద్వి. (అప్పులోని 'అరటు' తప్పు. ప్ర. లే.) |
| | అఱడా | ,, | ... | ... | (ప్ర. లే.) |
| ౧ | అఱమఱ (లు) | సందేహము. భేదము | ... | ... | అ. స. ద్వి = (శబ్ద. మర. నై. ప్ర. అఱ నిర్వ. ప్ర. మఱి 'ఱాకు' ప్ర. లే.) |
| | అరమర<br>అరమరము | ,, | ... | ... | ... |
| ౩ | అఱ్ఱవఱలు | సూక్ష్మఖండము | ... | ... | ఎల్ల |
| | | ఉ-శుష్కము | .... | | |
| | అరవరలు | ,, | ... | ... | ద్వి. |
| | అఱవము | తమిళభాష | అరువా, అరువర్ = తమిళదేశీయులు. | ... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | అఱు | క్షయించు - కంతము. | అఱుగు= క్షయించు=అఱ్ఱు=అఱు | అఱు = క్షయించు | |
| | అఱుఁగు } అఱువు } | క్షయించు - జీర్ణించు | అఱుగు=క్షయించు. అఱవు= నశించు | .... | తి. అ. స. |
| | (అఱుఁగు) | వేదిక | ... | .... | అ. ద్వి. (ప్ర. లే.) |
| ౪ | అర్రుఁగు | వేదిక | సమీపము | .... | .... |
| | అఱుపు | దక్కించు | కోయు, అఱు= కోయు | .... | .... |
| | అఱువది | ఆఱుపదులు | అఱుపదు | అఱు వత్తు | ద్వి. |
| | ఆఱడి | నింద | ... | ద్వేషము | ద్వి. |
| | ఆఱ్ఱు | ఉపశమిల్లు | ఆఱు; [ఆఱ్ఱు= (ట్టు) ఉపశమిల్లఁజేయు] | ఆఱు (శోషణే) | ఎల్ల |
| ౫ | (ఆరు) | ఉపశమిల్లు | ... | .... | ద్వి. |
| | ఆఱు | ఐదునొకటి | ఆఱు | ఆఱు | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | ఆర్రు | నూఁగారు | „ | .... | |
| | (ఆఱు) | „ | .... | .... | స. ద్వి. (స. ప్ర.) |
| | ఆర్రుగ | సస్యవిశేషము | .... | .... | శబ్ద. (భార. ప్ర.) ద్విరేఫ. లో, ఆరిక. |
| | ఆరుక | „ | | | |
| | ఆరికె | „ | .... | .... | అ. స. (ప్ర. లే.) |
| | ఆఱుచు | బొబ్బరించు | ఆర్ | ఆర్ | అ. (అఱపులు). ల. ద్వి. ఆఱాపులు (ప్ర. లే.) |
| | (ఇఱులు) | చీఁకటి | .... | .... | తి. అ. (ప్ర. లే.) |
| | ఇర్రులు | „ | ఇరుళ్ | .... | ద్వి. స. (నైష.) |
| | ఇఱుకటము | ఇరుకుచోటు | ఇఱుగు = ఘనీభవించు. ఇ | ఇడికిటి=నిబిడము | అ. స. ద్వి. (ఇఱకటము) తి. ఇఱికిటము. |
| | ఇఱుకాటము | „ | ఱుక్కు = బిగించు. | | |
| | ఇఱుకు | నొక్కుపడు | .... | .... | ద్వి. |
| | ఇర్రుసు | బండి యక్షము | .... | .... | |
| | (ఇఱుసు) | „ | .... | .... | అ. స. ద్వి. |
| | ఈడేఱు | సిద్ధించు | ఈడేఱు | ఈడేఱు | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | ఉక్కిరిబిక్కిరి | ఊపిరి తిరుగనిది | .... | .... | |
| | (ఉక్కిఱిపడు) | ఊపిరి తిరుగ కుండు | .... | .... | తి. ద్వి. (ద్వి. భార. (ప.) |
| | ఉఱవు | అధికము - ఉచితము | ఉఱవు - బాంధవము | .... | తి. అ. ద్వి. (శబ్ద. భార. (ప.) |
| | ఉరవు | అధికము. ఉచితము. | .... | .... | ద్వి. (శబ్ద. ఉ. హరి. (ప.) |
| | ఉఱు | తగు - లక్ష్యపెట్టు | ఉఱు=సిద్ధించు, వర్ధిల్లు | ఉఱు = వర్ధిల్లు | ఎల్ల |
| | ఉరు | తగు | .... | .... | ఉరవుధాతువే దీనికాధారము. |
| | ఉఱిది | దార్ఢ్యము - స్థైర్యము | ఉఱుది | .... | ద్వి. |
| | (ఉఱుకరి) | వేగిరకాఁడు | .... | .... | అ. స. (ప్ర. లే.) |
| | ఉఱియు | ఇల్లుకాఱు | ఉఱై = వర్షబిందువు. ఖడ్గకవచము | ఒఱె = వర్షబిందువు. ఖడ్గకవచము | ద్వి. |
| | ఉఱుము | గర్జించు | పంది అఱచు | .... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (ఉఱుము) | యుద్ధములో నఱచు. జగడమున గద్దించుట. | గర్జించు, పిడుగు. గర్జనము | ... | అ. |
| | ఉసుఱు. వై. | ప్రాణము | ఉయిర్ | ఉసిర్ | 'అసు' సంస్కృతము. |
| | (ఊఱు) | నీరూరు | ఊఱు - ఊఱ్ఱు (ట్టు)=ఊట | .... | ఎల్ల. |
| ౬ | ఊరు | ,, | ... | .... | ద్వి. ల. (ద్వి. అభిలషించు) |
| | ఊరుఁగాయ | ఉపదంశము | ... | .... | స. (ఊఱుంగాయ) |
| | ఎదురు | ఎదిరించు | ఎదిర్ | .... | తి. స. ద్వి. (శబ్ద. భార. ప్ర.) |
| | (ఎదుఱు) | ,, | ... | .... | తి. అ. ద్వి. |
| ౭ | ఎఱఁగు | దిగు - మ్రొక్కు | ఇఱఙ్కు=దిగు ఇఱఙ్ఞు = మ్రొక్కు | ఎఱగు | ఎల్ల. |
| | ఎరఁగు | ,, | ... | .... | |
| | ఎఱక | ఱెక్క | ఇఱకు | ఎఱంకె | |
| | ఎఱచి | మాంసము | ఇఱైచ్చి | .... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (ఎఱవు) | యాచితకము | .... | .... | తి. అ. |
| | ఎర్వు | ,, | ఇరవు - ఇరవల్ = యాచితకపు వస్తువు | .... | స. ద్వి. (స. భార. ప్ర.) |
| | ఎఱబటికము | రోఁత | .... | .... | ద్వి. |
| | (ఎఱపటికము) | ,, | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| | ఎఱుక | (తెలివి) సోదె | .... | .... | ద్వి. |
| | (ఎఱికె) | ,, | .... | .... | అ. |
| | ఎఱుకత | సోదె చెప్పునది | .... | .... | |
| | (ఎఱ్ఱుకత) | ,, | .... | .... | స. (ల. ఎఱికెత) |
| | ఎఱ్ఱుగు | తెలియు | అఱి | అఱి | ఎల్ల. |
| | (ఎరుఁగు) | ,, | .... | .... | భాగ. ప్ర. కలదు. దీనిని తిమ్మకవి నిరసించెను. |
| | ఏమఱు | ప్రమాదపడు | ఏమాఱు (ఏమరు = సౌఖ్యపడు.) | .... | ద్వి. |
| | ఏఱు | నది | యాఱు | .... | ద్వి. |

| వివర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | ఏఱుచు | ఏర్పఱుచు | ఏఱ్పడుత్తు | .... | అ. స. ద్వి. |
| | ఏఱు | ఎంచు | .... | .... | |
| | (ఏరు) | ఎంచు | .... | .... | ద్వి. (భార. ప్ర. ద్వి.) |
| | ఒఱగు | వంగు, వ్రాలు | ఉఱంగు = నిద్ర చేఁ దూఁగు | ఒఱంగు = వ్రాలు | ఎల్ల. (భార. ప్ర.) |
| | ఒరగు | .. | .... | .... | ద్వి. (భాస్క. ప్ర.) |
| | ఒఱటు | దుశ్శీలుఁడు | అరట్టన్. అరట్టు = దుశ్శీలము | ఒఱంట (ఒఱంటు= దుశ్శీలత) | |
| | ఒఱ | ఖడ్గకోశము | ఉఱై | ఒఱె | ద్వి. |
| | ఒఱపు | ఉపాయము - ఒప్పిదము - తాపము | ఉఱైప్పు=దృఢము | .... | ద్వి. |
| ౮ | ఒరయు | రాయు | ఉరై | .... | |
| | ఒఱలు | మ్రోఁగు - విలపించు | అరట్టు (ట్టు) = రోదనము చేయు | ఒఱలు = రోదనశబ్దము చేయు | ద్వి. |
| | కఱ | నలుపు | కఱై | కఱె | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | కఱకంఠుఁడు | ఈశ్వరుఁడు | కఱైక్కండన్ కఱై = మెడ | .... | ద్వి. |
| | కఱకఱి | బాధ | .... | .... | ద్వి. తి. |
| | కరకరి | క్రౌర్యము | .... | .... | ఎల్ల |
| | కరఁగు | ద్రవించు - కరఁగించు | కరై | .... | ఎల్ల |
| ౯ | (కఱఁగు) | ,, | .... | కఱగు=ద్రవించు | ద్వి. |
| | కఱటి | వంచకుఁడు | .... | .... | ఎల్ల |
| | కఱుదు | నేర్పు | కరుత్తు=తలంపు, కరుదు = ఆలోచించు | .... | ద్వి. |
| | కఱచు | నేర్చికొను-కొలుకు | కఱి | .... | ద్వి. |
| | కఱి, కఱియ | నలుపు | కరియ=నల్లని, కరిదు=నల్లది | కరిదు=నలుపు | |
| | హరాంతకారి | జెగజెట్టి | .... | .... | |
| | (హరాంతకాఱి) | ,, | .... | .... | అప్ప. స. (చింత్యము.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | కారుపోతు | అడవిదున్న - కాసరము | .... | .... | |
| | (కాఱుపోతు) | ,, | .... | .... | ఎల్ల |
| | కాఱులు | కల్లలు- పరుష వచనములు | .... | .... | స. ద్వి. |
| | (కారులు) | ,, | .... | .... | తి. అ. |
| | (పట్టు) కాఱు | పట్టుకాఱు- సందంశము | .... | .... | |
| | (కారు) | ,, | .... | .... | అ. స. |
| | కాఱు | స్రవించు- వర్షించు | కాల్ | కఱె | ద్వి. |
| | కారు | వర్షకాలము- నలుపు | మేఘము. వర్షకాలము | .... .... | |
| | కిఱుకు | చిక్కు | గొలుకుట | | |
| | క్రిక్కిఱియు | మిక్కిలి యిఱియు | .... | కిక్కిఱి=సంకటస్థితి | ద్వి, |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | కుఱు | కుఱుచది | కుఱుమై = పొట్టితనము; కుట్టు(ట్టు)యిర్ = కుట్టుసురు | కిఱుదు-అల్పము, సమాసమున 'కుఱు' | ఎల్ల. |
| | కుఱుఁగలి | సమీపము | కుఱుగల్ = పొట్టియగుట - సమీపించుట | .... | ద్వి. |
| | కుఱులు | ముంగురులు | కురల్ | .... | ద్వి. |
| ౧౦ | (కుఱులు) | ,, | .... | .... | అ. స. |
| | కుఱుకు | ప్రోవు | కుఱుక్కు = అడ్డముగ - నడుము | .... | |
| | (కుఱుకొను) | కుఱుచగు | .... | .... | తి.అ.స. |
| | కుఱువు | తొడ | కుఱంగు | .... | |
| | కూర | వ్యంజనము | .... | .... | అ. ద్వి. |
| | (కూఱ) | వ్యంజనము | .... | .... | స. (బహులాశ్వ. ప్ర) |
| ౧౧ | కెఱయుట | విజృంభించుట | .... | .... | అ. స. ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| ౧౨ | కొఱ్ఱు (ప్రాణము) | చిన్నప్రాణము | కుఱై=కొఱఁత | కొఱతె=కొఱఁత | ద్వి. |
| | (కొరప్రాణము) | ,, | .... | .... | తి. అ. స. (ప్ర. లే.) |
| | కొఱకు (కొఱ) | చతుర్థీవిభక్తి | కుఱై - కార్యము | .... | అ. స. ద్వి. |
| | కొరకు | ,, | .... | .... | ద్వి. (ఆము. ప్ర.) |
| ౧౩ | (కొరడా) | గుఱ్ఱపు చబుకు | .... | .... | హిందీపదము. |
| ౧౪ | కొరడు | వంకరగాక సరిగా నుండు నింద్రధనువు | .... | .... | |
| | కొఱడు | సాణువు-ఆయుధవిశేషము | కుఱ్ఱు (ట్టు) కుఱడు = పట్టుకాఱు | .... | తి. అ. స. |
| | కొఱవ | ఒక తక్కువజాతి | కుఱవన్ కుఱత్తి | కొఱవ=నీచతస్కరుఁడు | |
| | కొఱవి | కొంత కాలిన కట్టియ | .... | .... | |
| | కొరవి | కురవకము | కురా, | .... | ద్వి. |
| | కొఱుకు | కఱచు | కఱి | కుఱుకు | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | కోఱ | దంష్ట్ర | కోఱైప్పల్లు= వక్రదంతము | కోఱె = పల్లు | ద్వి. |
| ౧౫ | క్రమ్మఱు | మరలు | .... | .... | తి. అ. ద్వి. |
| | (క్రమ్మరు) | ,, | .... | .... | తి. అ. స. (ప్ర. లే.) |
| ౧౬ | గరగరిక | నైర్మల్యము | .... | .... | స. ద్వి. |
| | గఱగఱిక | ,, | .... | .... | తి. అ. (ప్ర. లే.) |
| | గరిఁటె | గంటె | .... | | |
| | గఱిఁటె | ,, | కరండి | .... | ద్వి. |
| | గరిసె | ధాన్యపుగరిసె-కొట్టు | .... | .... | |
| | (గఱిసె) | ,, | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) సర్వలోని 'గఱుని' తప్పుకావలెను. |
| | గఱి | ఱెక్క-ఆకు | .... | గఱి | ద్వి. |
| | గఱిక | పచ్చగడ్డి | అఱుకు | కుఱంకె | ద్వి. |
| | గఱువ | గర్వి | .... | పెత్తనము | |
| | గిఱుపుట | కన్నుత్రిప్పుట | .... | .... | తి. (ప్ర. లే.) |

N 62

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | కీఱుపుట | ,, | .... | .... | అ. ద్వి. (ద్వి. గకారము కేచిన్మతము) |
| | గీఱు | గోకు | కీఱు-కీఱ్ఱు(ట్టు)= గీఱ | .... | |
| | గుఱి | గుఱుతు- లక్ష్యము | కుఱి .... | .... | ఎల్ల. |
| | (గురి) | ,, | .... | .... | ద్వి. (భాస్క. ప్ర.) |
| | గుఱుతు | ,, | కుఱిప్పు | .... | ద్వి. (భార. ప్ర.) |
| | గుఱిచి | కూర్చి విభక్తి | కుఱిత్తు .... | కుఱితు | ద్వి. |
| | గుఱించి | ,, | .... | .... | ద్వి. |
| | గుఱు | గుఱుక | కుఱుక్కై .... | .... | |
| | గుఱుక | ,, | .... | .... | |
| | గోఱక | ఇనుపబాణము | .... | .... | ద్వి. (మనుచ. ప్ర.) |
| | గోరకకట్టె | అలుఁగు గల చేతికఱ్ఱ | .... | .... | |
| | (గోఱకట్టె) | ,, | .... | .... | అ. స. (స. 'గుఱుకట్టెలు' కాదు) |
| | గోరువంక | శారిక | .... | .... | స. (మనుచ. ప్ర). |
| | (గోఱువంక) | ,, | .... | .... | అ. (ఇది తిమ్మకవి చింత్యమనెను) |

| విమర్శ సంఖ్య. | శబ్ద రత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | గొఱియ-గొఱ్ఱె-గొఱె | గొఱ్ఱె | కొఱి | కుఱి | ద్వి. |
| | గొఱుగు | క్షౌరముచేయు | చిరై | .... | ద్వి. |
| ౧౭ | చరువు (తత్సమము) | హవ్యము | .... | .... | |
| | (చఱువు) | ,, | .... | .... | అ. స. |
| | చఱి | కొండచఱియ | చరివు | .... | ద్వి. |
| | (చిరుకొట్టు) | దుఃఖించు | .... | .... | |
| | (చిరిమి) | దుఃఖము. | .... | .... | |
| | (చిఱిమి) | వ్యసనము. | .... | .... | అ. స. (ప్ర. లే.) |
| | (చిఱికొట్టు) | వ్యసనపడు. | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| | చిఱు | చిఱుతశబ్ద సంక్షేపరూపము | చిఱు | కిఱిదు | ద్వి. |
| | చిఱుత | చిఱుతపులి | చిఱుత్తై (అధునికపద[ము) | .... | ద్వి. |
| | చీఱు | చీల్చు - పిల్చు | ... | .... | అ. స. ద్వి. (అప్పకవి చీల్చుట యను నర్థమున రేఫము లేదనెను.) |
| ౧౮ | చీఱు | చీల్చు | చీఱు=కోపించు<br>చీఱ్ఱమ్ (ట్టమ్)=కోపము | ....<br>.... | త్రి. అ. స. |

| విమర్శ సంఖ్య. | శబ్ద రత్నాకర శబ్దము | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | చూపఱు | చూచువారు | .... | .... | ఎల్ల. (భార. ప్ర. సర్వ.) |
| | (చూపరు) | ,, | .... | .... | స. (శృంగారషష్ఠ. (ప్ర.) |
| | చూఱ | కొల్ల | చూఱై | .... | అ. స. ద్వి. (భా. ప్ర.) |
| | (చూర) | కొల్ల | .... | .... | స. (రంగనా. కవిక. ప్ర.) |
| | చెఱ | బంధనాలయము-బంధనము. | చిఱై | సెఱెమనె=కారాలయము | |
| | చెఱమ | నాసాపుటము | .... | .... | ద్వి. (మనుచ. ప్ర.) |
| | చెరమ | ,, | .... | .... | ద్వి. (రంగనా. భాస్క. ప్ర.) |
| | చెఱకు | ఇక్షువు | .... | .... | |
| ౧౬ | చెఱఁగు | వస్త్రాంచలము | .... | సెఱంగు | ఎల్ల. |
| | (చెరఁగు) | ,, | .... | .... | ఎల్ల. |
| | చెఱుచు=చెఱచు | చెడఁజేయు | చెఱ=అడ్డగించు కోపించు | .... | అ. స. ద్వి. (భార. ప్ర.) |
| | చెరుచు } చెరచు } | ,, | .... | .... | అ. (ప్ర. లే.) |
| | చెరలాడు | విహరించు | .... | .... | (ప్ర. లే.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (చెఱలాడు) | ,, | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| | చెఱువు | తటాకము | చిఱై | కెఱె | ఎల్ల. (భార. ప్ర.) |
| | (చెరువు) | ,, | .... | .... | తి. అ. స. (ఆము. ప్ర.) |
| | చెఱువుట | గ్రుచ్చుట | చెరుకు | .... | ఎల్ల. (భార. ప్ర. శబ్ద.) |
| | (చెఱువుట) | గ్రుచ్చుట | .... | .... | అ. తి. (స. ఇందలి శకటము చింత్యము) |
| | (చేకూఱు) | సిద్ధించు | .... | .... | తి. స. ద్వి. |
| ౨౦ | చేకూఱు | ,, | .... | .... | అ. ల. |
| | చేకుఱు | ,, | .... | .... | తి. అ. ద్వి. |
| | (చేకురు) | ,, | .... | .... | ద్వి. |
| ౨౧ | చేఱ | ప్రసృతి=ఇంచుక వంచిన చేయి | చేఱంగై / చిఱాంగై | .... / .... | స. |
| | (చేఱ) | .... | .... | .... | అ. ద్వి. |
| | చేఱు | సమీపించు. త్రా | .... | .... | స. (కళా. ప్ర.) |
| | (చేఱు) | త్రాడు [డు | .... | .... | అ. ద్వి.(ప్ర. లే.) |
| | చేఱు | చింతపండు రసము కాచినది | .... | .... | (ప్ర. లే.) |
| | చేఱు | ,, | .... | .... | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (చేఱు) | .. | చాఱు=ఆకులరసము. చాత్తై(ట్టై) ప్పిఱించు=రసము పిండు | .... | అ. ద్వి. స. (హర. ప్ర.) ద్వి. |
| | చాఱ=చోఱ | మత్స్యము. బాలుడు | చుఱ - చుఱా | .... | ద్వి. (ఉ. హరి. ప్ర.) |
| | జరగు / ఒరుగు | ప్రాకు = ప్రవర్తిల్లు | .... | .... | తి. అ. స. |
| | (జఱగు) | ప్రాకు = ప్రవర్తిల్లు | .... | .... | |
| | (జఱుగోను) (జఱుపుచ్చు) | వడిగొను / వడిగొల్పు | .... | .... | తి. అ. స. శబ్ద రత్నాకరాదులలో నిది లేదు; కాని 'జఱ్ఱున' అను దానినిబట్టి యిది రావచ్చును. |
| | (జఱజఱ) | అనుకరణశబ్దము | .... | .... | అ. స. |
| | జాజఱ | ఎఱ్ఱనిది | .... | .... | తిరుమలయ్య పద్యములలో నిది 'జాజఱ' కాదు. 'జాజర' యుం గాదు. 'జాజఱి'యె. సర్వ లో రెండుసార్లు 'పూజఱి' గలదు. అందొకటి 'జాజఱి' కానోపును. |

| విమర్శ సంఖ్య. | శబ్ద రత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
| --- | --- | --- | --- | --- | --- |
| | జాజఱి | ఏఱుపుగలది | .... | .... | ద్వి. అత్యంతముగాన రేఫము వింతకాదు. |
| | జాజర | వంచన | .... | .... | |
| | జాఱు | జాఱు. పోవు=వదలు | .... | జాఱు=స్ఖలనమగు | |
| | (జారు) | ,, | .... | .... | అలఘుకౌముదిలో నొకకవి దీనిని ప్రయోగించినట్లున్నది. |
| | జీలకఱ్ఱ | జీరకము | సీరకమ్ | .... | .... |
| | జీలకఱ్ఱ | ,, | | .... | .... |
| | జుంజుఱు | గుబురు | .... | .... | .... |
| | జేవురు, జేగురు | ఎఱుపు | .... | .... | (ప్ర. లే.) |
| | జోఱజోఱ | అనుకరణశబ్దము | .... | .... | అ. స. |
| | జోఱు | వానకురియుటలోనిధ్వన్యనుకృతి | .... | సోఱు=జలపతనము | |
| | డగ్గఱు | సమీపించు | .... | .... | ఎల్ల (ద్వి. భార. ప్ర.) |
| | డగ్గఱు | ,, | .... | .... | ద్వి. |
| | తరలు | ప్రయాణమగు | .... | .... | ఎల్లరును దీనిని ద్విరేఫకమె యనిరి. శబ్ద |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | తఱలు | చలించు=విడుచు | | | రత్నాకర కర్తచేసిన యీ యర్థవిభాగమునకు మూల మగపడదు. |
| | (తరులు) | వళులు | .... | .... | స. (యయా. ప్ర.) |
| | తఱులు | వళులు | .... | .... | తి. అ. స. |
| | తఱి | త్రాడులోనగు వాని యొత్తుడు రేఖ. | ఏనుగు కట్టు స్తంభము | .... | |
| | తఱుగరి | తఱుగు బేరగాండు | .... | .... | తి. అ. స. |
| | తఱుగఱి | తఱుగు బేరగాండు | .... | .... | ద్వి. అర్యంతమైనను జాజఱియందువలె అకార ముండనోపును. |
| | తఱుగు | కొలగారము | తరగు | .... | |
| | తఱుగు | ఖండించు | తఱి | తఱిము | ద్వి. |
| | తఱుసలి | గర్వి | .... | తఱిసల్ = నిశ్చయ | (భార. ప్ర. శబ్ద.) |
| ౨౨ | తారు | తాము, సంచరించు | .... | .... | (శబ్ద. రాఘవపాం. ప్ర.) |
| | తాఱు | మఱుంగుపడు | .... | తాఱుంతట్టు=సంచరించు | ఎల్ల. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | తాఱుమాఱు | విపర్యాసము | తాఱుమాఱు | తాఱుం తట్టు=వికీర్ణ పతనము | |
| ౨౩ | తిరి | జట ; సుడి | తిరి=సంచరించు తిరుమ్బు = మరలు | ... | |
| | (తిఱి) | ,, | ... | ... | అ. స. ద్వి. |
| | తిర్రుగలి | ఘరట్టము=పిండి విసరు శిలా యంత్రము | తిరికల్ =ఘరట్టము, నవ్యశబ్దము | ... | |
| | (తిఱుగలి) | ఘరట్టము. | ... | ... | అ. |
| ౨౪ | తిర్రుగు | సంచరించు=మఅల్చు. పరివేష్టించు | తిరి=సంచరిచు. తిరుమ్బు=మరలు | ... | స. ద్వి. (తి. అ. సంచరించు) |
| | (తిఱుగు) | ,, | ... | ... | స. (తి. అ. చుట్టివచ్చు) |
| ౨౫ | తీఱు | నశించు, సంధి. | తీర్ =విడుచు, | ... | తి. అ. స. (ద్వి. విధము) |
| | తీరు | చక్కన, విధము, చక్కఁబడు | ముగియు, తిరుత్తు=దిద్దు, చక్కఁజేయు | ... | తి. అ. స. (ద్వి. విధము) ('చక్కనగు' అను నర్థమె లెస్స) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము | కన్నడము. | విశేష విషయములు |
|---|---|---|---|---|---|
| | (తుజాతి) | ధనికుఁడు | ... | ... | తి. అ. స. (ప్ర. లే.) |
| | తుఱుగు | క్రుక్కు | ... | దట్టముగా, మిశ్రితమగు | |
| | తుఱుము | కొప్పు | ... | తుఱుంబు | ద్వి. |
| | తూఱు | చొచ్చు | డొంక | ... | ఎల్ల. |
| | తూరు | ,, | ... | ... | (రేఫము కేచిన్మతమని శబ్దర. తూరుపు శబ్దము కలదు గదా. ఎట్లు?) |
| | తూఱుపు | ప్రాగ్దిశ | ... | ... | ద్వి. (జై. భార. ప్ర.) తిమ్మకవి నిరసించెను. |
| | తూరుపు | ,, | ... | ... | తి. అ. స. |
| | తెఱపి | అవకాశము | ... | తెఱపు | ద్వి. |
| | తెఱ్ఱ | తెఱపి | తిఱ=తెఱచు | తిఱ=తెఱచు | |
| | తెర | యవనిక, అల. | తిరై | తెఱె | |
| | (వా) తెఱ్ఱ | అధరోష్ఠము | ... | బాయితెఱె | ఎల్ల. |
| ౨౬ | (వా) తెర | ,, [సంధి. | ... | ... | స. ద్వి. |
| | తెఱఁగు | విధము, చక్కన. | తిఱమ్ | తెఱ | ఎల్ల. (భార. ప్ర.) |
| | (తెరఁగు) | ,, | ... | ... | తి. అ. స. |
| | తెఱవ | స్త్రీ | తెరివై=ఇరువదేండ్ల స్త్రీ | ... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | తేఱు | తేటపడు, కలుగు | తేఱు - తేట్ట మ్ = తెలివి | .... | అ. స. ద్వి. |
| ౨౭ | తేరు | కలుగు (తేటపడు,) రథము | తేర్ = రథము. విమర్శించు | .... | అ. స. ద్వి. |
| ౨౮ | తొ౦రలు | కలుగుట, మా | .... | .... | తి. అ. స. |
| | (తొ౦ఱలు) | ,, [ఱుట | .... | .... | తి. అ. స. (ప్ర. లే.) |
| ౨౯ | తొ౦రఁగు | స్రవించు, ప్రవ | .... | .... | తి. అ. స. } ద్విరేఫ వర్ణదర్పణమునందు |
| | | హించు, పడు. | .... | .... | శబ్దరత్నాకరమునందువలె |
| | తొ౦ఱఁగు | ,, [వ్రాలు | .... | .... | నర్థవిభాగము చేయఁబడె |
| | తొ౦ఱఁగు | విడుచు | తుఱ | .... | తి. అ. స. } ను. |
| | దూఱు | నిందించు, నింద | తూఱు = నింద, తూఱ్ఱు(ట్టు)=నిందించు - నీరుచల్లు, తూఱ్ఱ (ట్ట) ల్ =తుంపరవాన | దూఱు | ద్వి. (ఆముక్త. ప్ర.) ఈ ప్రయోగము తిమ్మకవిచే నిరసింపఁబడెను. |
| | (దూఱు) | ,, | .... | .... | ఎల్ల. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | దోఱయు | పొందు, కలుగు | .... | దోరె=ప్రాప్తించు | |
| | దోర్ఱయు | కల్గు, పోలు సమానమగు | .... | దోరె=సామ్యము | |
| | నఱకు | ఖండించు | .... | .... | |
| | నఱుకు | ,, | నఱుక్కు | .... | ద్వి. |
| | నఱుజు | అణువు | .. | నొరజు = అణువు, మశకము | ద్వి. |
| | నాఱు | మొలక | నాఱు, నాఱ్ఱె = (ఱ్ఱె) నాఱును. | .... | |
| | నిగుఱు | భస్మము | నీఱు, నెఱ్ఱె(ఱ్ఱె)= భస్మమును | .... | |
| | నివ్వఱు | ,, | .... | .... | |
| | నిఱుపేద | మిక్కిలి పేద | .... | నెఱె=సమగ్రత్వము | ద్వి. |
| | నీఱు | భస్మము | నీఱు | .... | ఎల్ల. |
| | (నీరు) | ,, | .... | .... | తి. అ. స. (ప్ర. లే.) |
| | నుఱుము | పొడిచేయు | నుఱుక్కు | .... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | నూఱు | శతము, మర్దిం | నూఱు, నూత్రై | నూఱు | ఎల్ల. |
| | | చు | (ట్రై)=నూటిని | | |
| | (నూరు) | శతము | .... | .... | ఇందలి రేఫమును దిమ్మకవి నిరసించెను. |
| | నెఱ | నిండు | నిత్రై | నెఱె=సమగ్రత | ద్వి. |
| ౩౦ | నెఱయు | నిండగు | నిత్రై | ,, | ఎల్ల } నన్నయభట్టు "నెఱయు = నిండగు, |
| | నెరయు | నిండగు | .... | .... | ఎల్ల } నెరయు = ఆచ్ఛాదించు" అని వాడెను. (౪౪౪. వి.) |
| | నెఱవు | పూర్తి | నిత్రైవు | .... | ద్వి. |
| | నెఱను | జీవస్థానము | నిఱమ్=వర్ణము. మర్మస్థానము. | నెఱం=జీవస్థానము. మర్మస్థానము. | |
| | నెఱవేఱు | సిద్ధించు | నిత్రైవేఱు | .... | |
| ౩౧ | నెఱి | క్రమము, న్యాయము, వక్రత | నెఱి=మార్గము, క్రమము, న్యాయము. | .... | ఎల్ల. |
| | నెరి | అందము=వక్రత | .... | .... | స. (శబ్ద. 'వక్రత' అనునపుడే ద్విరేఫకము) |
| | నెఱిక | వస్త్రపుఁ గుచ్చు | .... | నిఱి | |
| | నెఱులు | వెండ్రుకలు | .... | .... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | నేఱు | అవక్రము | నేర్=ఎదురుగా, తిన్నగా | నేఱితు= అవక్రముగ | |
| | పక్కెఱ | గుఱ్ఱములోనగు వాని యంగీ | .... | .... | స్వ. ద్వి. |
| | (పక్కెఱ) | ,, | పక్కౖఱై | .... | అ. దీని శకటమును దిమ్మకవి నిరసించెను. |
| | పదరు | చలించు, ఆక్షేపించు | .... | .... | (ప్ర. లే.) |
| | (పదఱు) | ,, | పదఱు=వణఁకు | .... | తి. అ. స. (ప్ర. లే.) తిరుమలయ్యగారి పద్యములలోని 'చెదఱు' తప్పు, 'పదఱుట' అని యుండవలెను. |
| | పడమఱ | పశ్చిమము | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| | పడమర | ,, | .... | .... | (ప్ర. లే.) |
| | పఱ | అన్యము, గొప్ప. | పిఱ=అన్యము | పెఱతు=అన్యుఁడు | |
| | పరఁగు | ప్రసరించు | పరవు = వ్యాపించు, పరప్పు=విప్పు | పరె=ప్రసరించు | ఎల్ల. (రేఫకు. శబ్ద. భార. ప్ర.) |
| | పఱఁగు | ,, | .... | .... | (ఱాకు శబ్ద. ఉ. హరి. ప్ర.) |
| | పఱతెంచు(పఱచు+తెంచు) | పాఱివచ్చు | .... | .... | ఎల్ల. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (పరతెంచు) | ,, | .... | .... | స. (ఉ త్త. రామా. ప్ర.) |
| | పఱి | సేన, ఆవృత్తి | పఱి=అశ్వవేగ గతి | .... | తి. అ. స. (ద్వి - రేఫ మాత్రమునె యంగీకరించెను గాని యప్పకవి తా నంగీకరించెననియు నది దుర్లంఘ మనియుం జెప్పెను. శబ్దర. లోని విభాగము నెవ్వరును జేయలేదు. |
| 32 | పఱి | వృత్తియందు "కొల్ల" అని యర్థము | పఱి=అపహరించు | పఱి=త్రెంచు | తి. అ. స. |
| | (పఱియశబ్దసంక్షేప రూపము) | | | | |
| | పఱియ | ఖండము | .... | పఱి=త్రెంచు | ద్వి. |
| | పఱిగొను | అపహరించు | పఱిగొండు=అపహృతమగు | .... | |
| 33 | పర్షుసందనము | పారుష్యము | .... | .... | అ. స. ద్వి. |
| | పఱుసందనము | ,, | .... | .... | అ. స. |
| | పర్షువు | పరిపాకము | .... | .... | తి. స. ద్వి. |
| | (పఱువు) | పరిపాకము | .... | .... | అ. దీని తాను దిమ్మకవి నిరసించెను. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
| --- | --- | --- | --- | --- | --- |
| ౨౦.౪౮ | పలుమాఱు=(పలు మారు) | మాటిమాటికి | .... | .... | ఎల్ల. |
| | పలుమఱు | ,, | .... | .... | |
| | పలుమరు | ,, | .... | .... | |
| | పల్మాఱు | ,, | .... | .... | |
| | పాఱ | ఖననసాధనము | పాఱై=గడ్డపాఱ<br>పాఱై=బండనేల | పాఱె | |
| | పాఱు | పరుగెత్తు<br>ప్రవహించు | గ్రద్ద | మీఁదికెగురు | ఎల్ల. |
| ౩౪ | పారు | పరుగెత్తు | .... | .... | ద్వి. (మనుచ. (ప.) (శబ్ద. ధావనార్థమందు మాత్రమె రేఫము.) |
| | పాఱుఁడు | బ్రాహ్మణుఁడు | పార్ప్పాన్=విప్రుఁడు.<br>పార్=చూచు | పార్వం=విప్రుఁడు.<br>పార్=చూచు | ద్వి. |
| | పిఱుదు | నితంబము; వెనుక | పెఱకు=తర్వాత.<br>పిఱ=అన్యము.<br>వెనుక. | పెఱగు=పృష్ఠభాగము. సమాసమున పెఱతు=అన్యము | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (పీఱ్ఱు) | చినుఁగు | .... | .... | అ. స. (ప్ర. లే.) |
| | పీరు | ,, | .... | .... | |
| | పెఱ్ఱు | అన్యుఁడు, తేనె పట్టు | పిఱ=అన్యము. పెఱకు=తర్వాత | పెఱగు=పృష్ఠభాగము. | తి. అ. ద్వి. (భార. ప్ర.) |
| | పెర | అన్యుఁడు | .... | .... | (మార్క-౦. ప్ర. శబ్ద.) |
| | పెఱిక | గోనెమోపు | .... | పేఱు=పసుల నడ్డి మీఁద వేసెడిది | |
| | పెఱుకు | పెల్లగించు, మోయు | పెఱుక్కు=ఏఱు. సంగ్రహించు | .... | |
| | పెర్గుఁగు | వర్ధిల్లు, దధి | పెరుగు=వర్ధిల్లు | పెఱు=ఘనీభావము | తి. అ. |
| 3౫ | పెఱుగు | విజృంభించు, యత్నించు | .... | .... | తి. అ. ఇందలి శకటమును దిమ్మకవి నిరసించెను. |
| | పెరుగు | తెగు | .... | .... | |
| | (పొఱిక) | గడ్డిపోచ | .... | .... | తి. (ప్ర. లే.) |
| | పొరక | ,, | .... | .... | అ. (ప్ర. లే.) |
| | పొఱడు | గూను | .... | పొఱంబెన్=గూను నడ్డి | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | పొఱి | పొలి, బలి | .... | .... | తి. అ. ద్వి. |
| | పొఱ్ఱిగొను | చంపు | .... | .... | |
| | పొఱివోవు | చచ్చు, కలఁగు | .... | .... | (నిర్వ. ప్ర. శబ్ద.) |
| | పొఱ్ఱివోవు | ,, | .... | .... | తి. అ. ద్వి (భార. ప్ర. శబ్ద.) |
| | బజాఱు | అంగడి | .... | .... | (ప్ర. లే.) హిందీపదము. హిందీలో శకటము లేదు. |
| | బఱటు | గీఱు | పిఱండు (వాడుకపదము) | బెఱంటు=నఖచ్ఛేదనము | |
| | (బలముఱి) | బలము గలవాఁడు | .... | .... | అ. ద్వి. ల. (ప్ర. లే.) |
| | బిరుసు | కాఠిన్యము | .... | .... | |
| ౩౬ | బిఱుసు | ,, | .... | .... | అ. స. ద్వి. |
| | బిఱబిఱ | త్వరగా | .... | .... | తి. అ. స. (చంద్ర. ప్ర. శబ్ద.) |
| | బిరబిర | ,, | .... | .... | (విష్ణుపు. ప్ర. శబ్ద.) |
| | బీఱ | ఒకానొకతీఁగ | పీర్, పీర్కు | .... | |
| ౩౭ | బీరువోవు | బలహీనమగు | .... | .... | స. |
| | బీఱువోవు | ,, | .... | బీఱువడు = పెంకెవాఁడు తాలు రువ్వు | ఎల్ల. (భార. ప్ర. శబ్ద.) |

| వివర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (బుఱుజు) | కోటగోడదిబ్బ | .... | .... | అ. స. (ప్ర. లే.) |
| | బురుజు | ,, | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే., హిందీ పదము. ఇందు శకటము లేదు.) |
| | మఱక | మచ్చ | మఱు = కళంకము, మచ్చ | | |
| | మఱక | మేకపడ్డ | మఱి = మేకపిల్ల | .... | |
| | మరగాలు | క్రుత్రిమ పాదము | .... | .... | (ప్ర. లే.) |
| | (మఱగాలు) | ,, | .... | .... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| 32 | (మఱుగు) | పరిచితమగు | .... | .... | ఎల్ల. |
| | మరుగు | ,, | .... | .... | తి. అ. ద్వి. |
| | మఱచు | విస్మృతిచెందు | మఱ | మఱె = మఱెదం = మఱచెను | |
| | మరలు | మళ్ళు | .... | .... | ఎల్ల. (ద్వి. లో. భార. ప్ర.) |
| | మఱలు | ,, | .... | మఱళ్ | అ. స. ద్వి. (రామా. ప్ర. ద్వి.) |
| | మఱు, మఱుఁగు, మఱువు | ప్రచ్ఛన్నమగు. ఉడుకు | మఱై = దాఁగు; మఱుకు = తపించు, దుఃఖించు | మఱె = దాఁగు | ద్వి. |

| వివర్య సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | మఱుస } మఱు } | మఱునాఁడు | మఱునాళ్ | మఱు=పరదినము. తర్వాతిది. | ద్వి. |
| | | | | | తి. అ. స. ల. |
| ౩౭ | మాఱిమసంగు | చంపు | .... | .... | తి. అ. (అ. చింత్యమని తిమ్మకవి నిరసించెను.) |
| | మాఱిమసంగు | ,, | .... | .... | |
| | మాఱాడు (మాఱు+ఆడు) | బదులుచెప్పు | ఒకదానికొకటి చెప్పుట, పగగొనుట | .... | |
| | మాఱు | ప్రతి, నశించు. తడవ. అన్యము [ము | పగ, ప్రతి, విడుచు. | ప్రతిఘటించు | ఎల్ల. |
| | {మాఱుమొగ్గ / మాఱుమాట} | | మాఱుకోళ్ =మార్కొను; మాఱ్ఱా (ట్టా) మ్తాయ్=మాఱట | | |
| ౩౮ | మారు | ప్రతి | .... [తల్లి | .... | దీనికి 'తడవ' అని యర్థము చెప్పుట లెస్స. (ప్ర. లే.) |
| | మాఱుతుఁడు | శత్రువు, మార్చువాఁడు | .... | .... | |
| | (మార్తుతుఁడు) | ,, | .... | .... | అ. స.ద్వి. (ప్ర. లే.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | మీఱు | అతిశయించు, అతిక్రమించు | మీఱు | మీఱు=అతిక్ర మించు | ఎల్ల. |
| | మీరు | ,, | .... | .... | (ప్ర. లే.) కొందఱు ప్రయోగించి రని శబ్ద రత్నాకరమున నున్నది. |
| ౮౦ | ముందఱ | మొదలు, మును పు. ఎదురు | ముందుఱ= (ముందు+ఉఱ) | .... | ఎల్ల. |
| | ముందర | ,, | .... | .... | |
| ౮౧ | (ముచ్చిఱు) | వ్యసనపడు | .... | .... | అ. స. ద్వి. |
| | (ముచ్చి■తనము) | వ్యసనము | .... | .... | |
| | ముచ్చిరు | వ్యసనపడు | .... | .... | |
| | ముచ్చిరి | దుఃఖి | ... [రోద | ... [రోద | |
| | మొఱయు | ధ్వనిచేయు | ముర్ =తుమ్మెద | మొరె = తుమ్మెద | ఎల్ల. |
| | (మొఱయు) | ,, | .... | .... | అ. స. (ప్ర లే.) అప్పకవీయ సీసములలో దీని ద్వైరూప్యము కలదు. పట్టికలో నుదాహృతిలేదు. |
| | మొఱ | మొఱ్ఱ | ముఱై = మొఱ్ఱ, న్యాయము, క్రమము | .... | ద్వి. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | మొఱటి | మొఱ్ఱి | మూఱి. మురి. | .... | ఎల్ల. |
| | ఱంకు | వ్యభిచారము | .... | .... | ల. (ప్ర. లే). |
| | (రంకు) | ,, | .... | .... | శ్లో॥ "రంకు ర్మృగే మహాదేవే । వ్యభిచారే ధురంధరే" అని విశ్వమేదినీ కోశము లలోఁ గలదనియు నది ఱాఁగ శబ్దమునకుఁ బ్రకృతి యనియు వ్రాసిన ద్విరేఫవర్ణదర్పణకర్త వీనిని తద్భవము లనకుండుటకుఁ గారణము దెలియకున్నది. |
| | ఱంకియ | వృషభధ్వని | .... | .... | ద్వి.—"అంకెలు గర్జలై యడర ఱాఁగ దనంబున" (హరి.పూ. ౮ ఆ) "ఱాపు దనంబున" అని శబ్దరత్నాకర పాఠము. |
| | ఱంకె | ,, | .... | .... | |
| | (రంకె) | ,, | .... | .... | అ. ల. (ప్ర. లే.) |
| | ఱంతు | కలకలధ్వని (కలకల ధ్వని) | .... | .... | అ. స. ద్వి. |
| ౪౨ | రంతా | రతిద్యూతాది క్రీడ. | .... | .... | స. |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | అట్టు | నింద=ఉపద్రవము | .... | ఓడాడు=పరిహాసించు | ఎల్ల. (ఉ. హరి. ప్ర. శబ్ద.) |
| | రట్టు | ,, | .... | .... | (రాఘవపాం. ప్ర. శబ్ద.) |
| | రట్టడి | ఉపద్రవకారి | .... | .... | ఎల్ల. (నీలా. ప్ర. శబ్ద.) |
| | (అవ) | ఖండము, వజ్రపుఁదునుక | .... | .... | అ. స. ద్వి. |
| | రవ | ,, | .... | .... | (నరసభూపాలీయాది ప్ర. శబ్ద.) |
| | రవరవ | స్పర్థ,కోపవికృతి | .... | .... | (విజయ. ప్ర.) |
| | అవఅవ | స్పర్థ,కోపవికృతి | .... | .... | అ. స. ద్వి. (అచ్చ. రా. ప్ర. శబ్ద.) |
| | (అవళి) | ధ్వని | .... | .... | అ. ('అ' చింత్యమని తిమ్మకవి వ్రాసెను.) |
| | రవళి | ,, | .... | .... | స. (యయాతి. ప్ర.) |
| ౪౩ | (రాగిల్లు) | రంజిల్లు | .... | .... | తి. అ. స. |
| ౪౪ | ఱాచు | రుద్దు, ఒరయు, | అరై—అరక్కు | అరె(=పేషణే) | తి. అ. |
| | ఱాపు | రాయిడి | .... | .... | తి. అ. |
| | రాచు | రుద్దు,ఒరసికొను | .... | .... | అ. స. ద్వి. |
| | రాపు | రాయిడి | .... | .... | అ. స. ద్వి. |
| | ఱాయి | శిల | .... | .... | ఎల్ల. (భార. ప్ర. సర్వ.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | రాయి | ,, | .... | .... | స. ద్వి. (భార. ప్ర. సర్వ.) |
| | ఱింగు | ఱెక్కలగాలి చప్పుడు | .... | .... | స. ద్వి. (పారిజా. ప్ర. సర్వ.) |
| | రింగు | ,, | .... | .... | (చమత్కారమంజరి. ప్ర. శబ్ద.) ఇది యనుకరణశబ్దము. |
| | ఱికము | భావార్థక తద్ధితము | .... | .... | ద్వి. (భార. ప్ర.) (విరా. ౫ ఆ౩౫౭) |
| | రికము | ,, | .... | .... | (ప్రభా. ప్ర. శబ్ద.) |
| | ఱిచ్చ | నిశ్చేష్టత | .... | .... | స. (భార. ప్ర.) |
| | (రిచ్చ) | ,, | .... | .... | తి. అ. |
| | రీతి (తత్సమ) | విధము | .... | .... | అ. స. |
| ౮౩ | (ఈ-రీతి) | ,, | .... | .... | అ. |
| | ఱువ్వు | విసరివైచు | .... | .... | అ. (ఆము. ప్ర. శబ్ద.) |
| | రువ్వు | ,, | .... | .... | (పాండురం. ప్ర. శబ్ద.) |
| ౮౩ | రూపించు (తత్సమ) | నిరూపించు | .... | .... | తి. అ. |
| | ఱెక్క | పక్షము | ఇఱకు(ఇఱక్కై, నవ్య.) | ఎఱంకె | ఎల్ల. (భార. ప్ర. శబ్ద.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | రెక్క | ,, | .... | .... | (ప్రభా. ప్ర.) (ఇందలి రేఫమును దిమ్మ కవి నిరసించెను.) |
| | ఱెప్ప | కనుఱెప్ప | .... | .... | ఎల్ల. (నైష. ప్ర.) |
| | రెప్ప | ,, | .... | .... | (కళా. ప్ర.) |
| | ఱేకు | పుష్పదళము ఈఁక, తగడు | .... | .... | తి. అ. స. (భార. ప్ర.) |
| | రేకు | ,, | .... | .... | (రామా. ప్ర.) |
| | (ఱేఁగు) | బదరి | .... | .... | తి. అ. స. (భార. ప్ర. సర్వ.) |
| | రేఁగు | ,, | .... | .... | ద్వి. |
| | ప్రేరేచు | ప్రేరించు | .... | .... | |
| | పెరరేచు | ,, | .... | .... | (ఉ. రా. ప్ర.) |
| | ప్రేఱేచు<br>పెరఱేచు | ప్రేరించు | .... | .... | ఆ. స. ద్వి. (ప్ర. లే.) |
| | రేపు | ప్రాతఃకాలము పర దినము | .... | .... | (భార. ప్ర.) |
| | ఱేపు | ,, | .... | .... | తి. అ. స. అప్పకవీయ పట్టికలోను సర్వ లక్షణసార సంగ్రహములోను నిది |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | | | | | యుండుటచేత నప్పకవీయ సీసములోని ఱేసు నేత్యాది స్థలములోని 'తెప్ప' అనుచో 'ఱేపు' అని యుండియుండు ననఁదగును. (భీమ. ఖం. ప్ర. శబ్ద.) |
| | ఱ్రేయు | విజృంభించు | .... | .... | ఎల్ల. (యయాతి. ప్ర. శబ్ద.) |
| | రేయు | ,, | .... | .... | (ప్ర. లే.) |
| ౪౫౯ | రేవు | నద్యాదులందు దిగుచోటు | .... | .... | ద్వి. |
| | (ఱేవు) | ,, | .... | .... | తి. అ. స. |
| | రేసు | చులకన, చులకనిది | .... | .... | (ప్ర. లే.) |
| | (ఱేసు) | ,, | .... | .... | అ. (ప్ర. లే.) |
| | ఱొమ్ము | వక్షము | .... | .... | అ. ద్వి (అచ్చ. రా. ప్ర.) ఇట్లు ప్రయోగించియుఁ దిమ్మకవి యుండలి 'ఱ' చింత్యమనుట వింతగ నున్నది. |
| | రొమ్ము | ,, | ఉరమ్ | ఉర | స. (రంగ. ప్ర.) ఈ ప్రయోగము ప్రక్షిప్తమేమో యని శబ్దరత్నాకర కర్త |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | | | | | సందేహించెను. కాని యిది తద్భవము గాన నిందలి రేఫము నిర్వివాద మనఁ దగును. |
| | రోయు | వెదకు, రోఁత పడు | .... | .... | తి. స. ద్వి. (ద్వి. అసూయపడు) (తిరు. రోఁతపడు) |
| ౪౬ | (ఱోయు) | ,, | .... | .... | అ. ద్వి. (ప్ర. లే.) (ద్వి. వెదకుట) |
| ౪౭ | ఱోలు | విలపించు, ఉలూఖలము | .... | .... | స. (స. విలపించు) |
| | (రోలు) | ,, | ఉరల్ | ఉరల్ | అ. స. (స. ఉలూఖలము) |
| ౪౮ | రోవెలఁది | వేశ్య | .... | .... | అ. ల. ఇది ṟai శబ్ద తత్సమరూపము కాద నియు, 'ṟai' శబ్దపు తద్భవరూప మనియు సప్పకవి తలంచి యుండును. |
| | వరుగు | ఎండఁబెట్టిన కాయ దినుసు | .... | .... | ద్వి. (ఆము. (ప. ద్వి.) (పాండురంగ. (ప్ర. శబ్ద) |
| | (వఱుగు) | ఎండఁబెట్టిన కా | .... | .... | అ. స. |
| | వఱ | మేర [య దినుసు | వరై | వరం=సీమ,వరెగం= వఱకు | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
| --- | --- | --- | --- | --- | --- |
| | వఱడు | నక్క | .... | బఱ్ఱ=నక్క | ద్వి. |
| | (వరపు) | అవగ్రహము | .... | ... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| | వఱపు | ,, | వఱప్పు | బఱం | (నారా. పంచ. ప్ర. శబ్ద.) |
| | వఱువట్లు (వట్టు + వట్టు) | మిక్కిలి శోషిల్లు | బఱ్ఱు (ట్టు) | బఱ్ఱు(బత్తె = శుష్కసతి) | ద్వి. |
| | వఱువాయి | ప్రాతఃకాలము | .... | బఱువాయి = శోషణారంభము | |
| ౨౬ | వాతెఱ | అధరోష్ఠము | ... | బాయ్దెఱె | ఎల్ల. |
| | వాతెర | ,, | ... | ... | స. ద్వి. |
| ౪౩ | వారించు | నివారించు | ... | ... | తి. అ. స. ('వారు') అను వైకృతధాతువు కలదు.) |
| | వాఱు | సన్ననితోలు | వార్ | వాఱు=చర్మపట్టిక | |
| | విఱివి | విస్తృతి | ... | ... | స. (మార్కం. ప్ర. శబ్ద) |
| | విరివి | విస్తృతి | విరివు | బిరి=(వికసనే) | స. ద్వి. (కవికర్ణ. ప్ర. ద్వి.) ఇది విరియు ధాతుజన్యము కానోపును. |
| | విరియు | వికసించు | ... | బిరి=వికసించు | (భార. ప్ర. శబ్ద.) |
| | (విఱివిడి) | విస్తృతి | ... | ... | అ. స. |
| | విరివిడి | ,, | ... | ... | |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| | (విఱిగాలి) | ఈదరగాలి | ... | ... | ఎల్ల. |
| | (విఱివోవు) | వికసించు | ... | | అ. స. ద్వి. |
| | (విఱివోటు) | ద్వేషము | ... | ... | ద్వి. |
| | వీఱిఁడి | మూర్ఖుఁడు | [ముఁడు వీఱు ... సర్వోత్త | ... | ద్వి. |
| | వెఱ | భయము | విరువు=భీతిల్లు | ... | ద్వి. |
| | వెఱఁగు | విస్మయము | ... | బెఱగు | ఎల్ల. ద్వి. భార. (ప్ర.) |
| | వెరఁగు | ,, | ... | ... | ద్వి. (ప్రభా. (ప్ర. శబ్ద. ద్వి.) |
| ౮౭ | వేమాఱు | పలుమారు | ... | ... | ఎల్ల. |
| | వేమార్లు | ,, | ... | ... | ఎల్ల. |
| | వేమఱ్లు | ,, | ... | ... | ఎల్ల. |
| | వేమరు | ,, | ... | ... | ఎల్ల. |
| | వేఱిమి | భేదము | వేఱ్ఱు(ట్టు)మై | బేఱ | |
| ౮౮ | వేఱు | అన్యము | వేఱు | బేఱ | ఎల్ల. |
| | వేరు | అన్యము, చెట్టు మూలము | ... | బేర్ = వృక్షమూలము | ద్వి. |
| | సుఱసుఱ | క్రుక్కుటలోని ధ్వన్యనుకరణము | ... | ... | అ. స. (ప్ర. లే.) |

| విమర్శ సంఖ్య. | శబ్దరత్నాకర శబ్దము. | అర్థము. | తమిళము. | కన్నడము. | విశేష విషయములు. |
|---|---|---|---|---|---|
| ౫౦ | (సురసుర) | ,, | ... | ... | |
| | సొన్నారి | అగసాలెవాఁడు | ... | ... | (ప్ర. లే.) స్వర్ణకారి శబ్దభవము. లేదా 'అరి' ప్రత్యయాంతము. (సొన్నము + అరి) |
| | (సొన్నాటి) | ,, | ... | ... | అ. స. ద్వి. (ప్ర. లే.) |
| ౪౩ | సౌరము (తత్సమ) | ఒకమతము | ... | ... | అ. |
| | (హజారము) | ఆస్థాన మండపము | ... | ... | అ. స. (ప్ర. లే.) |
| | హజారము | ,, | ... | ... | (ప్ర. లే.) |

పై నుదాహరింపఁబడిన అకార యుతశబ్దములలోఁ గొన్నిటి విషయమునఁ గొంత విశాలముగాఁ బ్రయోగములు చూపవలసియుండుటం జేసి విశేష విషయములనెడి గడిలోఁ జూపుట కవకాశము లేదయ్యెను. అట్టి శబ్దములను యథాసంఖ్యముగా నిచట విమర్శించుచున్నాను.

౧. అఱ. అర.

(౨౫౩)—'అఱ్ఱు=గది' అనుదాని సంక్షేపరూపము, అఱ. అర్ధ శబ్దభవము, అర. కావుననె రెండుశబ్దములకును బ్రయోగములు కలవు. తమిళమునందును " 'అఱై'=గది. 'అరై'=సగము " అను రూపములు గలవు. కన్నడమున 'అరె=సగము' అను రూపము గలదు. (౨౩౧. విష.)

అకారమునకు:—కం. " అఱపొఱదు కుఱుచ చేతులు।నొఱవ శరీరంబు ..................(భార. అరణ్య. ౨ ఆ.)

ద్విపద. 'అఱగాను లసియాడ నలసయాసముల ।
మెఱపులో...(రంగ. రా. సర్వ. ౩. ఆ ౧౩. ౨౪. పద్య.)
సీ. 'అఱవిరి తమ్ముల నుఱక తెగడి'
(భార. విరా. సర్వ. ౩ ఆ. ౧౩. ౨౪ ప.)
సీ. అఱ చందురుని క్రొత్త మెఱుఁగులు (హరి. ఉత్తర, భా. ౭ ఆ.)
కం. "పిఱుదం గురు ధరణీపతి । యఱ చేతన్......"
(భార. స్త్రీ. సర్వ. ౩ ఆ. ౨౧ ప)
రేఫమునకు:-కం. " అర పైకమ్మును జేయని । హరి వాసరమునకు..."
(రుక్మాంగ)
సీ. " అర విడు కొప్పుల విరుల వాసనకు " (కళాపూ.)

కం. " మరుఁడు వెడ వింటఁ దొడిగిన । యర విరి నును నల్ల గల్వ..." (కవికర్ణ.)

(౨౫౪)—౨-అఱమఱ—అరమర. అరమరము—

అకారమునకు:-కం. " అఱువది వేల... । అఱమఱ లేని మక్కువ..."
(రామా. ద్వి. ౪ ఆ. ౧౧౪ పు)

కం. " మఱియు నొకమాట... । అఱమఱ లేక దృఢంబుగ । నెఱుక..."
(నిర్వచ. శబ్ద.)

రేఫమునకు:—చ. సురవరులార... । అరమర లేక వింటి..."
(రామాభ్యు. ద్వి రే. ౧౧౪ పుట.)

ఉ. "తా మది నమ్మ కున్నది...సు । త్రాముఁడ వంచు నీ యరమరంబున..." (నైష. ౮ ఆ. శబ్ద.)

‘నుఱు’ శబ్దమునకు యతి ప్రాస స్థల స్థిత ప్రయోగము నెవ్వరును నియ్య లేదు.

(౪౫౫)— 3. అఱవఱలు. అరవరలు—అకారమునకు:—

కం. “అఱవఱలై స రథంబులు । నెఱి నప్పన్...” (భార. భీష్మ. ౨ ఆ. శబ్ద)

రేఫమునకు:—కం. “విరహాగ్నివలన దేహము । లరవరలై......

(విష్ణు. ౭ ఆ. శబ్ద.)

కం. “తరు లెల్ల... । అరవరలై...”

(హరి. ఎఱ్ఱా. ద్వాసే. ౪ ఆ. ౧౧౪ పుట.)

(౪౫౬)—౪. అఱుఁగు. అరుఁగు.—

అప్పకవీయ పట్టికలో ‘సెండ్లియఱుఁగు’ అని యున్నది. ద్విరేఫవర్ణ దర్పణమున “అఱుఁగు=వేదిక” అని వ్రాయఁబడియున్నది. ఇందులకు రంగనాథ కవి ప్రయోగము నియ్యలేక యప్పకవీయములోని “అఱలేక చను టఱుఁగఱపు కొనుట” అను నప్పకవి సీసభాగమును జూపెను. భావార్థక ట వర్ణాంతముగఁ దక్కిన చోటులందువలె నిచటఁ బ్రయోగింపఁబడమిచే నప్పకవి ‘అఱుఁగు’ శబ్దము వేదికార్థముననే పేర్కొనెనని తోఁచుచున్నది. సర్వలక్షణ సార సంగ్రహమున “అఱుగు లటిసె” (అఱుగు టటిసె పాఠా.) అని యున్నది. తత్త్వ నిర్ణాయకప్రయోగము నెవ్వరు నీయలేదు. శబ్దరత్నాకరమున వేదికార్థము ‘అరుఁగు’ అనునది రేఫముననే చూపఁబడినది. ఇందీయఁబడిన ‘అరుంగు మెఱుంగు మెట్టికల్’ అను ప్రయోగము యతిప్రాసస్థము కాదు. తిరుమ లయ్యయు నప్పకవియు ‘అఱుఁగు’ = ‘జీర్ణించు’ అను ధాతువును బేర్కొన లేదు. ‘అఱుఁగు=తక్కువయగు’ అను దానితోనె యది గతార్థమని తలంచి యుందురు.

(౪౫౭)—౫. అఱు = అరు = ఉపశమిల్లు.

ఎల్లరును దీనిలో ఱకారమె కల దనిరి. తమిళ కన్నడములందును దీనిలో ఱకారమె గలదు. ద్విరేఫవర్ణ దర్పణకర్త మాత్ర మిది ద్విరేఫక మనెను. ఇతఁడు రేఫస్థితికి “కం. కౌరవుల...శ్రమ । మారున్...” (భార. శాంతి. ద్వి. ౪ అ.) అనుదానిని బ్రమాణముగఁ జూపెను. ఈ పద్యముసే “ఆరు=నిండారు” అను ధాతువులోని రేఫమునకుఁ బ్రమాణముగాఁ దిమ్మ కవి “శమ । మారున్” అను పాఠముతోఁ జూపెను. ఇది కర్ణుని జంపినందులకుఁ బశ్చాత్తాపపడుచున్న ధర్మజుఁడు పల్కిన వాక్యము.

క. కౌరవులు సేయు నవమతి। కారణముగఁ గోపమెత్తుఁ గర్ణుని వదనాం।
భోరుహముం గనుఁగొన శ్ర (శ. పా) మ। మారున్ నావశముగాక యంతః
స బుద్ధిన్. (భార. శాం. ౧ ఆ ౧౩ ప.)

కౌరవులు చేయు నవమతికిఁ గోపము వచ్చెడిదనియుఁ, గర్ణునిఁ జూచిన తోడనె యట్టి కోపము నెట్టన శాంతించుచుండెడిదనియు రంగనాథకవిగా రర్థముచేసిరి. కౌరవులుచేయు నవమానమునకుఁ గోపమువచ్చెడి దనియుఁ గర్ణునిఁ జూచినంతనె యనివార్యముగా మనమున శాంతి నిండారు చుండెడి దనియుఁ దిమ్మకవిగారి పాఠమున కర్థము. కాని తాళపత్ర మాతృకలలో "శ్రమమారున్" అను పాఠమె కన్పట్టుచున్నది. ఇదియె గ్రంథకృత్ప్రియుక్త మనఁదగును. ఇది ద్విరేఫకమె యనఁదగును.

(రగిర)—౬. ఊటు=ఊరు=నీరూటు.

(ఊటుఁగాయ=ఊరుఁగాయ=ఆవ రస మూటు మామిడికాయ.) ఎల్ల రును దీనిలోని శకటము నంగీకరించిరి. తమిళభాషలోను నీశబ్దమున శకటమె కలదు. తెనుఁగులో సైతము, 'అకార'మును స్థిరపఱుపఁ జాలు 'ఊట' అను శబ్ద మగపడుచున్నది. అట్లయినను శబ్దరత్నాకర లక్ష్మీనారాయణీయ కోశ ములలో నిందు రేఫ మంగీకరింపఁబడి యున్నది.

శకటమునకు:—ఉ. "...ఊ।టించుచు నాడె మిన్న గమి ఱేని కుమా రకుఁ డింటిముంగలన్." (హరవి. సర్వ, 3 ఆ. ౧౬౦ ప.)

కం. "ఆఱేఁడు... । నూటువిధంబులు... । ఊటుంగాయ.........
(బహుళాశ్వ. సర్వ. 3 ఆ. ౧౬౧.)

కం. "కాటుమెటుఁగు... । ఊటుంగాయలు..."
(బహుళా. సర్వ. 3 ఆ. ౧౬౨.)

రేఫమునకు:—సీ. "తా సుధామయుఁడయ్యుఁ దరుణి కెమ్మోవి సు, ధారసంబునకు నోరూరుచుండు." (తారాశ. ద్విరే. ౨ ఆ. 3౬ పుట.)

(రంగనాథకవి యీ ప్రయోగమునిచ్చి 'ఊరు' శబ్దము 'అభిలషించు' అను నర్థమున రేఫవంత మనుట సరికాదు. దీనికిని జలోద్గమమె యర్థ మనఁ దగును.)

మ. "...జిగు। రొట్టెను పచ్చళ్ళును బాయసాన్నములు నూరుంగాయ లున్... (అముక్త.) (దీనిని దిమ్మకవి రేఫ అకార సాంకర్యమున కుదాహ రించుట సరికాదు. ఈ శబ్దము ద్విరేఫక మనుటయె లెస్స.)

(౪౫౯)—౭-ఎఱఁగు = ఎగఁగు = దిగు, మ్రొక్కు—

ఇందుఁ దమిళ కన్నడములలో శకటమే యుండుట నిజము. నన్నయ దీనిలో రేఫమును బ్రయోగించియుండఁగా నెల్లగురు దీనిలో శకటమే కల దనుటయు వింతయె.

రేఫమునకు:—ఆ. వె. ...అధికభక్తి । నెరఁగి బ్రిందుగు నలికి తెర విత్తు రిట్టిద । ..." (భార. ఆది. ౭ ఆ. ౧౧౨ ప.)

అకారమునకు:—సీ. మఱి మ్రొక్కునది వీని నెఱఁగుట తగ్గ" (భార. అను. ౪ ఆ. ౧౦౫ ప.)

కం. "ఎఱఁగిన నప్పను ద్రేఁగున । పిఱుఁగుటయును శాఖ." (భాగ. అను. ౧ ఆ. ౨౩౭ ప.)

(౪౬౦)—౮. ఒరయు=ఒరపెట్టు, రాచు—

తిరుమలయ్య, యప్పకవి, తిమ్మకవియు నిందు రేఫమాత్రమె కల దనిరి. శబ్దరత్నాకరమునందును నట్లేయున్నది. తమిళమునందును నిది 'ఉరై' అను రూపముతో నున్నది. కాని ద్విరేఫవర్ణ దర్పణకర్త దీనిని ద్విరేఫకముగ నంగీకరించి యీ క్రింది ప్రయోగము నిచ్చెను. పారిజాతమునఁ గలవనుచు లక్ష్మీనారాయణీయ కోశకర్త "ఒఱయిక, ఒఱేయిక = ఘర్షణము" అను రెండు శబ్దముల నుదాహరించెను.

ఆ. వె. "ఎలమిఁ గడచి పోవుఁ బిలుచుఁ గ్రమ్మఱ వచ్చి ।
ముక్కుముక్కు మీఁద మోముఁ జుట్టు ।
నేఁచి తిరుగు నీఁక నీఁకలతో రాయు ।
నొఱయుఁ జిత్రగతుల మెఱయు నవ్వు." (భార. ద్వి. ౪ ఆ. ౧౧౪ పుట.)

రంగనాథకవి యుదాహరించిన యీపద్యములో "రాయు" అని బ్రయోగింపఁబడియుండుటంజేసి మరలఁ బునరుక్తముగఁ దదర్థకమె యగు 'ఒఱయు' అనునది ప్రయుక్తమయ్యె ననుట సరికాదు. మఱియు నచట 'ఒఱయు' అనునది కేవలముగాఁ బ్రయోగింపఁబడెనేకాని దేనితో నొరయునో చెప్పఁ బడమింజేసి యచట 'ఔఱయు' అనుదానికి సంగతియే లేదు. కాఁగా నచట 'ఒఱలు' = (విలపించు) అనునది ప్రయుక్తమయియుండునని యూహింప వలసియున్నది. ఇట్లే సర్వలక్షణసార సంగ్రహమునందును నిప్పటి ముద్రణములలో 'ఒఱయు' ధాతువు పడియున్నది. ఇచటను 'ఒఱలు' అనునదే గ్రంథకర్త్రుప్రయుక్తమనఁదగును. దీనికిమూలమనఁదగు నప్పకవీయమున

'ఒఱలు' కలవుగాని 'ఒఱయు' లేదు - 'ఒరయు' అనుచోటి రేఫమునకు సందేహమే లేదు.

చ. ఉపగత వాల... ..మింటికిఁ జో | ......నొరయుచు (రామాయ. ద్వి. ౪ ఆ. ౧౧౪ పు.)

కం. ఒరసి కొనిపోవ సత్తుటి | సురసైన్యం భార్చుట...
(ఉ. రా. ద్వి. ౪ ఆ. ౧౧౪ పుట.)

చ. ఒరపు పహించి జానకి...... | పరిసరభూమి ..... (ఉ. రా. ౬ ఆ.)

(౪౬౧)—౯. కరఁగు = కఱఁగు = ద్రవించు—

ఎల్లప్పను దీనియందు రేఫమే కలదనిరి- ద్విరేఫవర్ణదర్పణకర్త మాత్ర మిది ద్విరేఫక మనెను. తమిళములో నిది 'కరై' అను రూపముతో నున్నది. కర్ణాటమున 'కఱగు' అను శకట రేఫ రూపమే కలదు.

రేఫమునకు:— ఎ. గీ. "కరఁగి నేరిమి వాటించి కనుపుగట్టి"
(భార. విరా. ౨ ఆ. శబ్ద.)

"సీ. కరఁచెనె సిరుగా సురప హేతి" (వసు. ద్విరే. ౪ ఆ. ౧౧౫ పు.)

అకారమునకు:—చ. "కొఱలెడి తేజుచేఁ బసిఁడి గుబ్బలియు న్మఱి వెండికొండయుం | గఱఁగు నటంచు .. ..." (యయాతి. ద్విరే. ౪ ఆ. ౧౧౫ పు.)

(౪౬౨)—౧౦. కురులు-కుఱులు—

అప్పకవీయమున 'సీ. కుఱుమాపు కుఱుగంటు కుఱుచకురుల' అను చోటను 'కుఱుచ' శబ్దార్థస్పష్టతకయి 'కురుల'ను పదము చేర్పఁబడెనే కాని 'కుఱులు' అను అకారఘటితశబ్దమును జూపుటకుఁగాదని తోఁచెడిని. తిరుమలయ్యగారు దీనిని జెప్పకుండుటయు నిట్టి యభిప్రాయమును బలపఱుచుచున్నది. కాని తిమ్మకవ్యాదులిచట నప్పకవి "కుఱులు" (వెంట్రుకలు) అను అకారఘటిత శబ్దమును జూపెనని తలంచి తాము నద్దానిని బేర్కొన సాగిరని తోఁచుచున్నది. తిమ్మకవి యీ క్రింది ప్రయోగమును జూపెను.

"ఇందుబింబముమీఁది కందు చందంబునఁ, గుఱులు నెమ్మొగమున నెఱసియాడ" (భార. విరా.) (సర్వ. ౩ ఆ. ౪౧ ప.)-నెరయు ధాతువు ద్విరేఫకమగుటచే నీప్రయోగము 'కుఱులు' అను శకటరూపమును నిర్ణయింపఁజాలదు. కావుననె శబ్దరత్నాకరకర్తయు రంగనాథకవియు దీనిలోఁ గేవల రేఫముమాత్రమె గలదని నిశ్చయించుకొనిరి.

గీ. 'ఇరులు గెలిచిన యంతఃపురోదనముఖులుతోగూడ' (నైష. సర్గ. ౫ఆ. ౪౦.ప.)

చం. "సురతసుఖంబు......నీ । కురులకు........"

(శ్రీ. భార. ద్వి. ౨ ఆ. ౧౪ పుట)

(౪౬౩)—౧౧. కలయుట ? ——

అప్పకవి తిమ్మకవి రంగనాథకవియు దీనిని జేర్చిరి. దీనికర్థము నెవ్వరును నీయలేదు. రంగనాథకవి తెలియుదనెను. తిరుమలయ్య దీనిని జెప్పలేదు. కాఁగా "కిలుపుట కలయును (తిప్పు పుటికలుచును)" అని యప్పకవి చెప్పఁగాఁ దిమ్మకవ్యాదుల నాఁటికి చటి 'కలయు' అనుదానిచో 'కఱయు' అని ప్రమాదపతితమై వెలసెనా యని యాలోచింపవలసియున్నది. కావుననే యిది శబ్దరత్నాకరకర్తచే నుపేక్షింపఁబడెనని యు నెన్నఁగనగును.

(౪౬౪)— ౧౨. కొఱప్రాణము - కొరప్రాణము—

తిరుమలయ్య, యప్పకవి, తిమ్మకవియు నిందు రేఫమునె చేర్చిరి. రంగనాథకవి శబ్దరత్నాకరకర్తయు దీనిలో శకటమే కలదనిరి. (రంగనాథకవి యప్పకవియుఁ వీనిని ద్రుతకార్యములతో వ్రాయుట సరికాదు.) తమిళ కన్నడములలో నల్పార్థక కొఱశబ్దము అకారఘటితమై యున్నది. ఇంగలి రేఫమునకుఁ బ్రయోగము నెవ్వరును నియ్యలేదు—కొఱతశబ్దము దీనిని సంబంధించినదే యననగును.

కం. "జాలుజాలున నెత్తురు వెలి । గాలుకుచు...... । కొఱప్రాణముతోడ

(ఆము. ౩ ఆ. శబ్ద.)

కం. "ముటిముటిచీఁకటి.... నం । దఱురాజులు......... ఎల్లిటికిన్ ।

గొఱగల........." (ఉ. హ. ౪ ఆ. శబ్ద.)

(౪౬౫)— ౧౩ కొరడా—

గుఱ్ఱమును ద్రోలు చబుకని దీని కర్థము. ఇదిహిందీపదము. రేఫయుతము. దీనినెవ్వరును జెప్పలేదు. అప్పకవీయపట్టికలో "గుఱ్ఱపుకొఱడ" అని సిద్ధాలముగఁ బడియున్నది. అప్పకవి రేఫ అకార నీసములలో నిది యగపడదు "కొఱ కొఱలాడుట కొఱతె తక్కువ పంక్తు కొఱుకుట కోపంబు కొఱడువడుట" (అప్ప క. ౨ ఆ.) అని మాత్రమే యప్పకవి చెప్పెను. ఇచటనేకాక పెక్కుచోటులలో నప్పకవీయ రేఫఱకార శబ్దముల పట్టికలు ప్రమాద భూయిష్ఠములై యున్నవి.

(౪౬౬ —౧౪. కొరదు—కొఱదు—

'కొరడు' అనఁగా ముష్టిపాంబయు నింద్రధనువును. 'కొఱడు' అనఁగా, స్థాణువు, ఆయుధవిశేషము. అప్పకవీయమునందలి "పంట్లు కొఱుకుట కోపంబు కొఱడువడుట" అనుదానిని బట్టి చూడఁగా 'కొఱడు' శబ్దమునకు 'స్థాణువు' అనునర్థ మాతనిచే వివక్షింపఁబడె నని తోఁచుచున్నది. కాని యప్పకవీయ శకటశబ్ద పట్టికలో "కొఱడు =ఆకాశమునఁ బొడముచునది" అని యసంగతముగా నున్నది. శబ్దరత్నాకరమునందును "కొఱడువాఱు = తిమురుపట్టు" అని యున్నది. తిరుమలయ్య పద్యములలో నర్థము చెప్పఁబడలేదు "కొఱడది కొఱడు కుఱుమా పనఁగా" అనుమాత్రము యున్నది. తిమ్మకవి పద్యములలో "కొఱ కు కొఱలుట కొఱగాము కొఱకు కొఱవి" అనినేఁటి ముద్రణములలోఁ బడుట ప్రామాదికము. అచట గణనార్హ్ము పడియున్న 'కొఱకు' శబ్దములలో నొకట 'కొఱడు' అను యప్పకవీయము మూలముగఁ గొను స్వభావముగల తిమ్మకవి ప్రయోగించి యుండు నని యెన్నఁదగును.

(౪౬౭)—౧౫. క్రమ్మఱు, క్రమ్మరు—

తిరుమలయ్యయు నప్పకవియు దీనిని ద్విరేఫకముగ నెంచిరి. రంగనాథకవి శబ్దరత్నాకరకర్తవలెనె యిందు శకటమునె చెప్పెను. తిమ్మకవి దీనిలో రేఫమును మాత్రమె యంగీకరించెను. కాని యిందలి రేఫమున కెవ్వరును బ్రయోగమును జూపలేదు.

మ. "పఱచుం దవ్వుగ......క్రమ్మఱఁ జూచున్......"

(భార. అర. ౬ ఆ. ౩౨ ప.) (అప్ప. ౨ ఆ. ౨౦౬. ప.)

కం. "।...మఱొకఁడు సేసినపాపము.. ...క్ర! మ్మఱఁ దనకె కుడువ
వలయును।..."
(రామా. ద్విరే. ౩ ఆ. ౯౫ పుట.)

(౪౬౮)—౧౬—గరగరిక-గఱగఱిక=నైర్మల్యము—

అప్పకవి యిందు శకటమునె యంగీకరించెను. తిరుమలయ్య పద్యములలో గఱిశబ్దమును గుఱ్ఱుశబ్ద సంక్షేపరూపమగు గుఱు శబ్దమును వేఱొకచోట నైన నుండుటచే మఱొకచోటఁ గల 'గఱి గుఱుకలు' అనునది 'గఱ గఱికలు' అనునదిగా నాతనిచేఁ బ్రయోగింపఁబడి యుండుననియు నదియె యప్పకవి వాక్యమునకు మూలము కానోపు ననియుఁ దోఁచుచున్నది. కాని, తిమ్మకవి యిందలి ఱకారము చింత్య మనెను. శబ్దరత్నాకరమున నిందు రేఫమె చూపఁబడెను. ఱకారమున కెవ్వరును బ్రయోగము నీయలేదు. రంగనాథకవియు నిందు రేఫ మాత్రమునె చూపెను.

కం. "సిరివంటిది... । గగగగికిలఁ బెసఁగిను (ఉమాయనాటి సర్వ. 3 ఆ. ౧౫౩ ప.)

కం. "పరమ సుమనో...... । గగగగికిల గదిను...

(కిష్కా. సర్వ. ౪ ఆ. ౪౬ ప.)

(౪౬౯)—౧౭—చఱువు - హ్రస్వము—

ఇది 'చఱువు' అను శబ్దముయొక్క రేఫ హ్రస్వమని యప్పకవి చెప్పినట్లు తిమ్మకవి తలంచెనని తోఁచుచున్నది.

"సీ. చఱువును భుజియించి చెఱఁగుఁ బట్టి" (అప్పక. ౨ ఆ.)

"ఎ. గీ. చఱువును (చెఱువుని - ముద్రిత పుస్తకము) భుజియించుట,
చెఱువుటయును। చెఱు వనఁ దటాకమును..." (సర్వ. 3 ఆ. ౪౯ ప.)

ఇట్లు చెప్పిరే కాని దీనికిఁ బ్రయోగము నియ్యలేదు. అప్పకవి తటాక వాచక చెఱువు శబ్దమును రేఫనిసములలోఁ జెప్పియుండుటచేతను, ద్విరేఫ పట్టికలోఁ జేర్చకుండుటచేతను బ్రహ్మ అకార నిరవద్యమును 'భుజియించి' అను దానితోఁ జెప్పుటచేతను నాతఁడు దానిని హ్రస్వవాచకముగనె ప్రయోగించెనని తిమ్మకవి తలంచియుండును. కాని, భారతప్రయోగ సిద్ధమైయున్న చెఱువుశబ్ద అకారము నప్పకవి చెప్పలేదనుట విశ్వాసవిదూరముగ నున్నది. అప్పకవి పద్యములోని 'భుజియించు' శబ్దము తటాకార్థమునకుఁ గేవల బాధకము కానేరదు కావున "చెఱువును భుజియించి చెఱఁగుఁ బట్టి" అని యప్పకవి చెప్పియుండునని యెన్నఁదగును.

(౪౭౦)—౧౮—చీరు—చీఱు—

తిరుమలయ్యగారు దీనిని అకార ఘటితముగఁ జేర్చిరి. అప్పకవి పిల్చుట యను నర్థమున నిందు రేఫమనియుఁ, జీల్చుట యను నర్థమున నకార మనియుఁ జెప్పెను. తిమ్మకవి యర్థద్వయమునను దీనిని ద్విరేఫముగ నంగీక రించి యప్పకవికి వైమత్యముగల పక్షములకుఁ బ్రయోగములు చూపెను.

"చీఱుట రెండుగా—" "చీరుట పిలుచుట" (అప్పకవీయము. ౨ ఆ.)

శా. పాఱఁడులేచి దిక్కులకు ..। చీఱఁడు మాత్స్యసంఘము...

(భాగ. ౭ స్కం. సర్వ. 3 అ. ౧౭౭.)

ఉ. సారథిఁ గూర్చి యశ్వముల......। చీరి శరాసనంబు పొడిచేసిన...

(భార. శల్య. సర్వ. 3 ఆ. ౧౭౮ ప.)

ఉ. ఘోరగదా విదారణ విఘూర్ణిత శాత్రవ కుంభి కుంభముల్ ।
చీరుచు...... (భార. అర. ౬. ఆ. శబ్దర.)

శా. ఈ రూపంబున సంస్కృతిం దొరఁగి మీఁ గే చింతలం జెంతలం ।
జీరం గోరక ...... (ఉ. హరి. ౪ ఆ. శబ్దర.)

ఎవ్వరును జీల్చుట యను నర్థమునందలి అకారమునకుఁ బ్రయోగము నియ్యలేదు. అట్టి ప్రయోగము దొరకలేదని శబ్దరత్నాకరమున వ్రాయఁబడెను. రంగనాథకవి దీని నర్థద్వయమునందును రేఫమునె యంగీకరించి యప్పకవిని బ్రమాణముగాఁ జూపుట యసంగతము.

(౮౭౧)—౧౯—చెఱఁగు=చెరఁగు—

ఎల్లరును దీనిని ద్విరేఫకముగా నంగీకరించిరి. అప్పకవీయము నందలి 'చెఱకబట్టు' అనుచో 'చెఱఁగుఁబట్టి' అని పఠింపనగును. శబ్దరత్నాకరమున మాత్ర మిందు రేఫము చూపఁబడలేదు.

రేఫమునకు—

చ. "రంగు మెఱుంగు బంగరు చెరంగుల రెంటెము నాల్గుకొంగులన్
(బహులాశ్వ. సర్వ. 3 ఆ ౫౧. ప.)

చ. "రవియను దివ్య కేతువు చెరంగున మూసి......" (ఆముక్త. సర్వ. ఆ. 3 ఆ ౫౦ ప.)

గీ. "అవని గంపింప లలిత పీతాంబరంబు ।
చెఱఁగు దూలఁ జక్రాంశులు తుఱఁగలింప"
(భార. భీష్మ. సర్వ. 3 ఆ. ౫3 ప.)

(౮౭౨)—౨౦—చేకూఱు, చేకుఱు, చేకూఱు, చేకుఱు—

ఈ విషయ మీవఱకు విపులముగఁ జర్చింపఁబడెను. (౮3౫ వి.)

ఇట్లె పలుమాఱు, పలుమారు, పలుమఱు, పలుమరు, పల్మరు మున్నగు వానిని గ్రహింపవలెను.

(౮౭3)—౨౧. చేర = చేఱ = ప్రభృతి—

అప్పకవి యిందు శకటమునే చూపెను. రంగనాథకవి యప్పకవినె ప్రమాణీకరించెను. తమిళమున నిది 'చేఱంగై' అని శకటయుతముగనె యున్నది. తిమ్మకవి యిందు ఱకారము చింత్య మనెనె కాని రేఫమునకుఁ బ్రయోగమును జూపలేదు. శబ్దరత్నాకరకర్తయు దీనియందు రేఫమే యంగీకరించి యీ క్రింది ప్రయోగము నిచ్చెను.

ఉ. "......కన్నులంటినగా। చేరలఁ గొల్లఁ గానలఁగు......।
ఊరులు ... ... క్రొమ్ముల్లోని సిం।
గారము.. " (విజయ. ౧ ఆ. ౭౫ ప.)

(౪౮౪)—౨౨—తారు. తాఱు—

'అడఁగు' అను నర్థమున దీనిలో ఱకారమనియు, 'సంచరించు' అను నర్థమున రేఫమనియు శబ్దరత్నాకర కర్త విభాగము చేసెను. కాని, తక్కిన వారెల్ల దీనిని ఱకార ఘటితముగనె చూపిరి. శబ్దరత్నాకర కర్త దీనిలో రేఫము గలదనుటకు "సీ. కానలోఁ దారు మృగంబులై పడిఁ గైకొని యస్త్రమాత్ర కర్శిలసఁ। దనరుచు.." (రాఘవ పాం. ౧ ఆ.) అనుదానిని ప్రమాణముగఁ జూపెను. "అడవిలో సంచరించు మృగంబులకై, నడితో నస్త్రములను గైకొని" యని రామానుజార్థమును 'అడవిలో తాము మృగముల యాకృతిని ధరించి రతిచేయుచు' అని భావార్థమును శబ్దరత్నాకరకర్తచే జేయఁబడెను. కావున నా తాత్పర్యమున సర్వనామ బహువచనమున రేఫమె యనుట నిశ్చయమగుటంజేసి రామానుజపక్షములోని 'సంచరించు' అను నర్థమునందును రేఫమె యనక తీరదని యాతని యభిప్రాయమై యుండె ననఁదగును. అట్లయినను దత్పద్యమున సర్వనామ శబ్ద మనావశ్యకమగుటంజేసి రెండుపక్షములలోను 'తాఱు' అను ఱకారఘటితమునె యంగీకరించి యుభయపక్షములందును గర్హ్యార్థమునె చెప్పినను క్షతిలేదు గాన నీప్రయోగ మందలి రేఫమును స్థిరపఱుపఁజాలదు. పయి మార్గము ననుసరించియే యప్పకవి "తాఱు మెకంబు లీ తీఱున" అని యిట్లు పయి రాఘవపాండవీయ పద్యమును దలంపించుచుఁ జెప్పె నని విమర్శకులకుఁ దోఁచక మానదు. ఇఁక శబ్దరత్నాకరమున నీయఁబడిన తక్కిన ప్రయోగములు యతి ప్రాసస్థలస్థములు కానింజేసి యకించిత్కరము లనఁదగును.

కర్ణాట భాషలోని "తాఱు=శోషణే" అను ధాతువు దీని 'అడఁగు' 'మఱుఁగుపడు' అను నర్థముల కనుకూలమై యున్నది. మఱియు కన్నడములో 'తాఱుంతట్టు = సంచరించు' అనియుఁ గలదు. కాన నిది యెల్ల యర్థములందును ఱకార ఘటితమె యనఁదగును.

ఉ. "వేఱొక చాపమెత్తి..... । తాఱు తెఱంగు నేసి—..."

(శబ్ద. ఉ. హరి. 3 ఆ.)

(౪౮౫)—౨౩—తిరి = తిఱి—తిరుగలి = తిఱుగలి

(౪౭౬)-౨౫'-తిరుగు = తిఱుగు-

"తిరుగు + కలు" అని తిరుగలి శబ్దమునకు వ్యుత్పత్తి నెన్నునది. కాఁగాఁ బయి మూఁడుశబ్దములును సభిన్న శబ్ద మూలకములె యనఁదగును. 'మఱలివచ్చు = చుట్టివచ్చు' అను నర్థమున నిందు శకటమును 'సంచరించు' అను నర్థమున రేఫమును దిరుమలయ్యాయు నప్పకవియుఁ జూపిరి. తిమ్మకవి యంతటను నిది ద్విరేఫకమె యనెను. రంగనాథకవి 'తిరుగు' ధాతువులోని ది రేఫమే యని చెప్పియు "తిఱి వెట్టుట=దురద గలుగుటచేతఁ జెవిలో వత్తి పెట్టి త్రిప్పుట" అనుచో శకటము నంగీకరించుట వింత.

మఱియు నప్పకవి 'తిఱుగలి' శబ్దములో శకటమును జెప్పఁగా నది తన పక్షమునకు విరోధించునని తలఁచి కావలయును నప్పకవీయములోని 'తిఱుగలి' శబ్దమును 'తుఱుగలి' శబ్దముగా మార్చి యట్టి నిర్బిందుక తుఱుగలి శబ్దమునకు విఱుగుడుపా టర్థమనియు, సబిందుక తుఱఁగలి శబ్దమునకుఁ బ్రకాశార్థ మనియు రంగనాథకవి యుదాహరించెను. నిర్బిందుక తుఱుగలి శబ్దమునకు "చ. వెఱవకుమో కుమార...।తుఱుగలి లేక సమ్మదముతో గమనింపుము—" (భీమ. ౨ ఆ) అను దానిని బ్రమాణముగఁ జూపెను. కాని యీ పద్యమును శబ్దరత్నాకర కర్త యుదాహరించుటలో "తుఱఁగలిఁగొన్న సమ్మదముతో" అనియిట్లు ప్రకాశార్థక సబిందుక తుఱఁగలి శబ్దమే కుదురుపడు పాఠముతోఁ జూపి యుండుటచే రంగనాథ కవిగారి నిర్బిందుక తుఱుగలి శబ్దము నిర్మూల మనఁదగి యున్నది. కావున నప్పకవి చెప్పినది నిర్బిందుక తుఱుగలి శబ్దము కాదనియు 'తిఱుగలి' శబ్దమే యనియుఁ గ్రహింపఁ దగును.

రేఫమునకు :— " చ. సుర విశిఖ ప్రయోగములు......

నేల దిద్దిరం । దిరిగె ... ... "

(భార. అరణ్యా. ౪ ఆ. ౯౪ నన్నయ పద్యము.)

క. "తిరిగిన పందల నేటికిఁ । బురికొల్పఁగ... । కురుపతి......"

(భార. ద్రో. ౨ ఆ. ౨౦ పుట.)

ఱకారమునకు :—ఎ. గీ. ఉడుకుఁ గన్నీరు... । తిఱిగి పొగులంగ వే

సరి నెఱయ మనల । యవులఁ దిరుగుచు నున్నది...

(భార. స్త్రీప. ౨ ఆ. ౪౫ ప. సర్వ. ౩ ఆ, ౯౮ ప.)

ఉ. "ఉఱుకుం గుంభ యుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ బాదంబులన్ । దిఱుగుం గండము వెన్నుఁ దన్ను......"

(భాగ. అష్ట. స్కం. సర్వ. ౩ ఆ. ౭౦ ప.)

" కం. తిఱిగిన కపులం గనుఁగొని । వెఱవకుఁడని విల్లుపూని ... ...

(రామాభ్యు. సర్గ. 3 ఆ. ౬౯ ప.)

రంగనాథకవి " తిరుగు " ధాతువులో శకటము సంగీకరింపమింజేసి పై ప్రయోగములలో రామభద్రకవి ప్రయోగము నుపేక్షించి బమ్మెర పోతనామాత్యుని ప్రయోగము ప్రమాణీకరింపఁ దగినది గానసియు స్త్రీ పర్వ పద్యమున 'తిరిగి పొగులంగ వేసలి విరియ మేన' అను పాఠ మున్న దనియుఁ జర్చించెను. అట్లయినను దిరుమలయ్యయు నప్పకవియు 'తిఱుగు' అనుచో శకటము సంగీకరించుటచేతను దిమ్మకవి పై స్త్రీ పర్వ పద్యములలో 'తిఱిగి పొగులంగ వేసరి నెఱియ' అని యుదాహరించుటచేతను నీ పాఠమె తిక్కయజ్వప్రయుక్త మనియు 'వేసలివిరియ మేన' అను రంగనాథకవి పాఠము కల్పితమనియు గ్రహింప నగును. ఇంతియ కాని 'వేసలి విరియ మేన' అను పాఠము పక్షమున 'తిరిగి పొగులంగ' అనునది యసంగతమును నగు చుండుటచేత నయితము రంగనాథకవి పాఠము నిరసింపఁ దగియున్నది.

సీ. చూడు మిమ్మద్దియ సుతుఁ జూచి వదన మల్లార్చుచుఁ బ్రాణేశు నాననంబు
పైఁ జూడ్కి యడరించి పాణితలంబున, నందంద నెమ్మొగ మడిచికొనుచు
మరలఁ బుత్త్రుని దెస కరిగిన మనసుపే, రడలున మునుఁగంగ నతని చెన్ను
మోమునఁ దన మోము మోపి మూర్ఛిల్లుచుఁ, దెలిసి వల్లభు నురస్థలము గ్రుమ్మ

గీ. నుదుకుఁగన్నీరఁ దడియంగ నొఱగుచును వి । చేష్టయై యూరకుండుచుఁ
జెలులతోడఁ । దిరిగి పొగులంగ వేసలి విరియ మేన । నవులఁ దిరు
గుచు నున్నది యక్కటకట. (భార. స్త్రీప. ౨ ఆ. ౪౫ ప.)

గాంధారి దుర్యోధన శవంబు కడకుఁ బోయి యేడ్చుచు నచట నున్న కృష్ణునితోఁ బ్రసంగించు సందర్భమున దుర్యోధనుని శవముపైని నాతని కుమారుఁడు లక్ష్మణుని శవముపైని బడి యావల కేడ్చి వేసరి యవులఁ దిరుగు చున్న కోడలిని శ్రీ కృష్ణునకుఁ జూపి యామె చేసిన ప్రసంగ మీ పద్యమున వర్ణింపఁబడెను.

" గాంధారి......... అప్పుత్త్ర శవంబుకడకుఁ బోయి, తరల విపుల వక్షము మీఁద నశ్రులు వెల్లి గొల్పుచు వ్రాలి.........

(స్త్రీ-౨ ఆ-౨౬-౨౭- ప.)

వ. దుర్యోధనవల్లభ, నిరీక్షించి మాధవు నుద్దేశించి యిట్లనియె......

(స్త్రీ-౨ ఆ. ౪౩)

ఈ సందర్భమునుబట్టి దుర్యోధనుని శవమును నాతనిపుత్త్రుఁడు లక్ష్మణ కుమారుని శవమును నున్న యా చోటఁ బ్రకృతమున నున్నది గాంధారి యనియు నవులఁ దిరుగుచున్నది దుర్యోధనపత్ని యనియుఁ దేలుచున్నది. కావున నీ పద్యమున వర్ణింపఁబడిన దుర్యోధనసతీదుఃఖ వ్యాపారము లా వఱకు జరుపఁబడినవే కాని యప్పుడు జరుగుచున్నవి కానేరవు. కాఁబట్టి యామె వదన మ్మల్లార్చుచు నెమ్మొగ మడిచికొనుచు మూర్ఛిల్లుచు నొఱగుచు విచేష్టయై యూరకుండుచుఁ దిరిగి పొగులంగ నవులఁ దిరుగుచున్న దన్న యీ పాఠము సంగతమై యుండలేదుగదా. ఇంక నట్లు దుఃఖించుచు తిఱిగి పొగులంగ వేసరి చెలులతోడ నవులఁ దిరుగుచున్న దన్న యర్థముగల "తిఱిగి పొగులంగ వేసరి నెఱయ మసల। యవులఁ దిరుగుచున్నది" అను పాఠమే సుసంగతమై యున్నదనియు నదియె కవిహృదయమనియుఁ జెప్పుటకు సందేహము లేదు. కాని 'నెరయు' అను రూపమును నుండుటచే నిది యంత ప్రబల ప్రమాణము కానేరదు.

బమ్మెర పోతనామాత్యుని ప్రయోగములు ప్రమాణములు కావన్న యపమార్గమును దిమ్మకవి నిరాకరించిన విషయ మీ వఱకు వివరించియే యున్నాను. (౩౭౧ విష.) 'తిఱుగు' ధాతువులోఁ బైరీతిని దిక్కయజ్వ పోతనామాత్యులు శకటమును వాడఁబట్టియే రామభద్రకవియు రామాభ్యు దయమునఁ బ్రయోగించె ననుట యుక్తము. అద్దానిని రంగనాథకవి తడ వనే లేదు.

(౪౭౭)—౨౫-తీఱు=నశించు; తీరు=చక్కఁబడు—

'తీరనికోపము, తీరనికినుక,' అని యిట్లు తిరుమలయ్యాయు నప్ప కవియుఁ దిమ్మకవియు రేఫముతో దీనిని బేర్కొనిరి. 'తీఱు' అని ఱకారమును నయిత మిందుఁ జూపిరి. అప్పకవీయములోని ద్విరేఫక శబ్దముల పట్టికలో "తీరని కినుక, తీఱిన మిట్టగుడ్లు" అని యున్నది. వీనినిబట్టి పరిశీలింపఁగా శబ్దరత్నాకరకర్త చేసిన యర్థవిభాగము (తీరు=చక్కఁబడు—విధము; తీఱు= నశించు, సంధి) సరికాదనియు 'చక్కనగు, చక్కన' అనునవె దీని యర్థము లనియు నిది ద్విరేఫకమనియు నంగీకరించు టుచితమని తోఁచుచున్నది. ఈ చక్కన యనఁగా నీ యొప్పిదము. అనఁగా నీప్రకార మనునర్థ మీ మార్గ మున సులభమె యగును. శబ్దరత్నాకర విభాగమునకుఁ దగిలిన బాధలును దీనికి సోకవు.

క. 'కాఱడవి...ఎదఁ బరితాపము।తీఱఁగ......' (భార. ఆది. ౪ ఆ.)
(పరితాపము చక్కఁబడుట యనఁగాఁ బరితాపము నివర్తిల్లుటే కదా.)

చ. "......రాజ్యము పాలు లేక తీ। ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె..." (భార. ఉద్యో. ౨ ఆ) ఇట శబ్దరత్నాకరకర్త పక్షము బాధితముకాఁగా 'తీఱు' అనుదానికి 'సంధి' అను సమంబద్ధార్థ మంగీకరింప వలసివచ్చెను. నా పక్షమున 'తీఱుసకొడఁబాటు గల్గినన్—చక్కఁసగుట కంగీకరించినచో' అను నర్థము పై పద్యమున సుసంగతమగుచున్నది. ఈ భారత ప్రయోగమె దీని ద్విరేఫకతాంగీకారమునకుఁ బ్రబలప్రమాణ మగుచున్నది.

"కం. ఈ రాజున కినముగ నొక।తీరున...
(యయాతి. సర్గ ౩ ఆ ౧౯౦ ప.)

ఆ. వె. మాఱువల్కఁ నొంప తీఱుసేయు (ఉ. రా. సర్గ. ౩ ఆ ౧౯౧ ప)
అను నుదాహృతుల నిచ్చి తిమ్మకవి యంగీకరించిన ప్రకారార్థము నందలి దీని ద్విరేఫకత్వము నయితము నా వ్రాసినపక్షమునకె యనుకూల మగుచు నంతటను దీని ద్విరేఫకత్వమును దోఁపఁజేయుచున్నది.

ద్విపద. "ఓరి నీ గర్వోక్తు లుబ్బును మదము।తీరెనె యనుచు..." అను రంగనాథ రామాయణ ప్రయోగము సంయుతము శబ్దరత్నాకర విభాగమునకు బాధక మగుచు (కావున నె యిది ప్రశ్నార్హమని యూతఁడు తలంచెను) నంతటను దీని ద్విరేఫకత్వమును బలపఱుచుచున్నది.

ఉ. "తీరిన తత్తడిం జవగతిం బుటముల్ దుమికించు చాడ్పునం। దీరని తత్తడిం జవగతిం బుటముల్ దుమికించి వాఁగె బెం। పారబిగించి......"
అను చంద్రాంగద చరిత్రప్రయోగమునఁ దీరిన (చక్కఁబడిన) యనఁగా 'అనభిజ్ఞత నివర్తించిన' అని యభిప్రాయ మెన్నునది.

రంగనాథకవి దీనికొక్క ప్రకారార్థమునె చెప్పుటకును నట్టియర్థమున ద్విరేఫకత్వము నంగీకరించియు. ద్విరేఫక శబ్దప్రదర్శన సందర్భమునఁ జెప్పకుండుటకును గారణము తెలియరాకున్నది.

(౪౭౬)——౨౬-వా తెఱ—వా తెర; తెఱ=తెర——'తెఱచు=ఆవరణము తీయు' అనుదానిలో ఱకారమె కలదు. 'తెర—చీర' అనుదానిలో రేఫమే కలదు. 'తోరంబు తెరయుఁ దొరఁగుట' అని యిట్లు యవనికార్థమున రేఫమే యుండునని తిరుమలయ్యగారు చెప్పియున్నారు. కావున 'తెర' శబ్దము ద్విరేఫకమని రంగనాథకవి చర్చించుట సరియై యుండలేదు. తమిఱమునందును నిట్లే

శబ్దార్థభేదము లున్నవి. కర్ణాటమున మాత్ర మర్థద్వయమునందును శకటమె కలదు. ఇంక 'వాతెఱ=వాతెర=అధరోష్ఠము' అనునది ద్విరేఫకముగ వాడఁబడియున్నది. కాన "వాయి + తెఱపి=వాతెఱ ; వాయి+తెర=(దంతవసనము)=వాతెర." అని యిట్లు పక్షద్వయమునందును శబ్దావయవముల నెన్ననగును. తిరుమలయ్యాయు నప్పకవియు 'వాతెర' అను రేఫఘటిత రూపము నంగీకరింపలేదు. తిమ్మకవి రంగనాథకవులు మాత్రమె దీనికి ద్విరేఫకత్వము నంగీకరించిరి.

శకటమునకు—చ. నెఱికురులున్...వా। తెఱయును...

(భార. ఆది. సర్వ 3 ఆ ౭౨ ప.)

రేఫమునకు:—కం. 'గురువెందఁ జైత్రుఁడొందినఁ। గరములు...వా। తెర..." (పారిజాతా. సర్వ. 3 ఆ. ౭౧ ప.)

(౪౭౯)—౨౭- తేఱు=తేరు=తేటపడు—

అప్పకవి దీనిని ద్విరేఫక శబ్దపట్టికలోఁ జూపలేదు. తిమ్మకవి దీని శకటమునె యుదాహరించెను. కాని యుభయులును 'తేఱు=తేరు' అను రెండు రూపములను బేర్కొనిరి. అప్పకవి రేఫపద్యములో "తేరెద మనుచు నే తేర తేరకు తేర..." అనియు ఱకారపద్యములో "ఇంతకుఁ దేఱుదురు..." అనియుఁ జెప్పెను. తిమ్మకవియు "తేఱుదు రనంగ బండిఱాల్ (త్రిపురవైరి" అని ఱకారముతోను "గంజి తేరు" అని రేఫముతోను జెప్పెను. రంగనాథకవియు దీనిని ద్విరేఫకముగానె యుదాహరించెను. శబ్దరత్నాకరకర్త మాత్ర మిది "కలుగు" అను నర్థమునందె ద్విరేఫక మనియు, "ప్రసన్నతనొందు" అనునర్థమున శకటయుతమె యనియు విభాగముచేసెను. కాని యాతఁ డిచ్చిన ప్రయోగములను మఱికొన్ని యితర ప్రయోగములను బరిశీలించునపుడు మాత్ర మట్టి విభాగమున కావశ్యకత యగపడదు. అంతటను "ప్రసన్నత నొందు" అనియే యర్థమనియు నందింది ద్విరేఫక మనియు గ్రహింపనగును.

ఱకారమునకు—"ఉ. తూఱుపు . ... । మీఱు ... ... । తీఱిచి ... ...

ప్రమదంబు మోములం। దేఱఁగ ... ... (జై. భా. ద్విరే. ౪ ఆ. ౧౦3 పు)

కం. తేఱుదురు రిపులు నక్కఱ । మీఱుదురు.........(భాస్క. సర్వ 3 ఆ. ౧౯ ౨ ప)

ఉ. .........సోయగంబుపైఁ। దేఱఁగఁ బ్రౌఢదంపతులు తేఱునఁ బెంపెసలారి రిద్దఱున్॥ (ఉ. హరి. ౭ ఆ. శబ్ద.)

రేఫమునకు—కం— వారన్యోన్యము......నేత్రములఁ జెఱునగవుల్ । తేరఁగ ... ... (నైష. ద్విరే. ౪ ఆ. ౧౨౩.)

సీ॥ ......మునిదంపతులు తమ కంబులు తేర నెయ్యంబు మీఱ। ననిచినఁ దత్ప్రియతన యుండ వారిత......" (రాఘవ. ౧ ఆ. శబ్ద.) (ఇందు భారతార్థమున "తమకంబులు=మోహావేశములు, తేరన్=పైకిఁదోఁచునట్లుగ" అనియు, రామాయణార్థమున "తమకు, అంబులు=జలములు, తేరన్=తెచ్చుటకు" అనియు నర్థము నెన్నునది)

జలాదికమందలి కాలుష్య మడుగునకుఁ బోఁగా నిర్మలమైనది మీఁద భాసిల్లును. అట్టి యర్థమునె రామాయణార్థమున నుపచరింపఁజేసికొనవలయును.

(౮౮౦)—౨౮ - తొరలు, తొఱలు

శబ్దరత్నాకరమున నిందు రేఫము మాత్రమె యంగీకరింపఁబడెను. తిరుమలయ్య మున్నగువారెల్ల నిది ద్విరేఫకమనిరి. కాని యెవ్వరును అకారమునకుఁ బ్రయోగ మియ్యలేదు.

ద్విప "తొరలెడు జనదృష్టి దోషంబు వాయ। నిరుమేల నారతు లిచ్చున ట్లొలయ" (భాగ. శబ్ద)

అప్పకవీయములోని "తొఱలుట కలయుట" అనుచో "తొఱలుట కలుగుట" అని పఠింపనగును. తిరుమలయ్య పద్యములోని "తొఱయుట దీఱఁగ" అనుచో "తొఱలుట తీఱఁగ" అని పఠింపనగును. ద్విరేఫవర్ణదర్పణములోని యీ సందర్భమునందలి గ్రంథము తొరఁగు శబ్ద విమర్శన గ్రంథములోఁ గలసిపోయి సందర్భ శూన్యమైయున్నది.

(౮౮౧)—౨౯ - తొరఁగు, (తొరుఁగు) తొఱఁగు—

తిరుమలయ్యయు నప్పకవియుఁ దిమ్మకవియుఁ నిది ద్విరేఫక మనిరి. రంగనాథకవియు శబ్దరత్నాకరకర్తయు నిది 'విడుచు' అనునర్థమున అకారయుతమనియు "పడు—(చ్యుతమగు, కాఱు, రాలు) వ్రాలు, స్రవించు, ప్రవహించు" అనునర్థములందు రేఫయుతమనియు విభజించి చెప్పిరి. అనఁగా నిందకర్మకత్వమున రేఫమును సకర్మకత్వమున అకారమును గ్రాహ్యము లని తెలుచున్నది. "తొఱఁగుట పడు డనుట" అను తిరుమలయ్య గారివాక్యము

దీనిని బ్రతిఘటించుచున్నది. (పడుసు=పడుట) అట్లయినను బ్రయోగము శబ్దరత్నాకర విభాగమునకే యనుకూలముగ నున్నట్లగపడుచున్నది.

తిమ్మకవి అకారఘటిత మని తలఁచి యుదాహరించిన

తే॥ గీ॥ "పొగడ మ్రాఁకుల మొదలను బుష్పరసము
తోఱఁగ నెత్తావియందును నెఱయనొప్పె"

అను నృసింహ పురాణ పద్యము (సర్వ-3 ఆ-౮౦ ప) మాత్రము పై విభాగమునకుఁ బ్రతికూలముగ నున్నది. కాని "నెరయు" అను రేఫఘటిత రూపము సయితము నృసింహపురాణమున

మ॥ ధరణీ మండలి......... । నెరయం బంకజ సంభ వాలయము......"
(నృసింహ-ద్వి రే-౪ ఆ-౧౧౯ పుట)

అని యిట్లు వాడఁబడి యుండుటచేతఁ బయి పద్యములోనిది 'తొరఁగు' అను రేఫఘటితశబ్దమే యనఁదగునుగాన నది ప్రతికూలము కానేరదు. 'తొఱఁగు వోవు = తప్పించుకొని పోవు' అనుదానిలో అకారము మాత్రమే కలదని సర్వసమ్మత మైనను నాశబ్దపల్లవములోనిది సకర్మక 'తొఱఁగు' శబ్దమే యనుటలో విప్రతిపత్తి యగపడదు. "తొరుఁగు" అని శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడినదిగాని దీని యుకార మధ్యత్వమును సాధించు ప్రయోగ మీయఁబడ లేదు.

రేఫమున కుదాహృతులు:—

సీ॥ పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన తొరఁగెడు
పచ్చకప్పురపు రజము । (మను. సర్వ. 3 ఆ. ౭౪ ప)

చ॥ చరణహతిన్ లతాతరులు.................మహిం ।
దొరఁగఁగ ... ... ... ... ... ... ... (భారత. ఆది. సర్వ 3 ఆ ౭౬ ప.)

క॥ పరిజనములు కన్నీరులు । తొరఁగఁగ నడలొందు ...........
(భార. ఆశ్రమ-సర్వ-3ఆ-౭౪ప);

సీ॥ పరమాత్మపదములఁ దొరఁగిపాటెడు నేటి తరఁగల..............
(నృ-పురా-సర్వ-3ఆ- ౭౭ప);

అకారమునకు:—

చ. "మఱియొక టేను జెప్పెద......మేన్ । దొఱఁగుట యొప్పదే ......
(భార. కర్ణ. సర్వ. 3ఆ ౭౮ప)

(౪౮౨)—౩౧-నెరయు = నెఱయు—

దీని నెల్లరును నెల్లయెడలను ద్విరేఫకముగ నంగీకరించిరి. నన్నయభట్ట ప్రయోగములలో మాత్రమిది 'ఆచ్ఛాదించు' అను నర్థమున రేఫ యుత ముగను 'నిండారు' అనునర్థమున ఱకార యుతముగాను నున్నది. (౪౪౪ విష) అప్పకవి తిరుమలయ్యల పద్యములలో 'నరసుట' అసి ముద్రణములు గలవు. కాని యచట 'నెరయుట' అని సవరింపనగును. తమిళ కన్నడములలో నిది శకటముతోనె యున్నది.

రేఫమునకు:—క. తరళనయనాబ్జ దళములు। నెరయఁగఁ బైై మున్ను నల్లి నృపసుతుఁ బూజించి। చిరి.........(భార. అర. ౩ ఆ. ౧౭౯)

(దృగబ్జదళములు నృపసుతు నాచ్ఛాదించు నట్లు నల్లి)

మాలిని. "నరుసకు... ...విమానంబుల్ నభోభాగ మల్లన్। నెరసి వెలుఁగు చుండన్...... (విమానములు నింగిని గప్పి వెల్గఁగా) (భాగ. ఆది. ౮ ఆ౧౯ ౬ప,

మ. అరవిందోదరమూర్తి భానుఁడు.........। నెరసెన్ జీఁకటి కార్మొగుల్ జగతిపై... ... (వసుచ. సర్వ. ౩ఆ. ౮౭ప) (నెరసెన్ = నిండెను)

క. వరమకుటరత్న.........మతి। నెరపె నుపర్వులకు......... (నెరపె = నిండారఁజేసె. బుద్ధినిగల్గించెను) (కవికర్ణ. సర్వ ౩ ఆ ౯౦)

ఱకారమునకు:—సీ. "...తాలు॥ఆ-వె॥ నుఱుము గాఁగ నిట్లు నెఱయంగ సత్వంబు। మెఱసి... ..." (భార. ఆది. ౬ ఆ. ౧౬౦ ప.) (నెఱయన్ = నిండుగా)

గీ. ఆయుధంబులు విడిచితి నంతమీఁద। మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ" (భార. ఉద్యో. సర్వ. ౩. ఆ. ౯౪ ప). నెఱపు = నిండారఁ జేయు,.

(౪౮౩)—౩౧—నెఱి = నెరి—

తిరుమలయ్యయు నప్పకవియు రంగనాథకవియు నిందు శకటమునె యంగీకరించిరి. తిమ్మకవి దీనిని ద్విరేఫకముగఁ జేర్కొనెను. శబ్దరత్నాకర కర్త 'వక్రత' అను నర్థమున మాత్ర మిది ద్విరేఫక మనెను.

చ. నెఱి కురులున్ విలోలసిత నేత్ర యుగంబును దేనె లొల్కు వా। తెఱయును...నే। నెఱిఁగిన యంతనుండి...

(భార. ద్విరే. ౩ ఆ. ౯౦ పుట.)

సీ. మొలక చీఁకటి జలజల రాల్పఁగా రాఁదె నెరులు మించిన వీరి కురులయందు.

(పాండు. ౧ ఆ. శబ్దర.)

(౪౮౪)—౩_౨—పరి = పఱి—

తిరుమలయ్యంగారు నప్పకవియు దీనిని ద్విరేఫకముగ నెంచిరి. అప్పక వీయ ద్విరేఫక పద పట్టికలో "పరి చనుదెంచుట = సేన వచ్చుట - పరి గొను = చుట్టుకొను", పరిమెయి = వేష్టనమున, పఱిమార్చుట = చంపుట" అను శబ్దములు గలవు. వీనిలో 'పఱిమార్చుట' అనుచో ఱకారము చింత్యమని తిమ్మకవి నిరసించెను. రంగనాథకవి యట్టి ప్రయోగములు లేకున్నచో నప్ప కవి యేల చెప్పు నని యీ క్రిందిరీతిని సందేహించెను. 'పరిమార్చు' శబ్దము లోని 'పరి' శబ్దము 'పఱియ=ఖండము' అనుదాని సంక్షేపరూప మని శబ్దరత్నా కరకర్త వ్యక్తపఱచెను.

సీ. కొఱ తూఱుపును పఱుగులు ఱంకె ఱిచ్చ క్ర
మ్మఱ కాఱులు లఘుత్వ మహితములని
ఎరవు పక్కెర కురుల్ గొరవంక గొరకలు పరిమార్చె నెరయుట గరగరికలు
పరువము నారును వరుగులు రోయుట రేగు నారిక గురు రేఫము లని
యప్పకవీశ్వరుం డనియె నాతఁడు ప్రయో
గముల నెచ్చటనైనఁ గాంచఁబోలు..." (ద్విరే. ౪ ఆ. ౧౨౫ పుట.)

శబ్దరత్నాకరకర్త "పఱిగొను" అనుదానికి 'అపహరించు' అను నర్థ మును గలదనియు నట్టియెడ నది ఱకార మాత్ర యుతమనియుఁ దక్కిన యెడల నది రేఫయుతమె యనియు వ్రాసెను.

రేఫమునకు—చ. "పరి చనుదెంచె గోగణముఁ బట్టె నన న్విని...వి। స్ఫురణము......" (భార. విరా. ౪ ఆ. ౭౮ ప) (పరి=సేన)

చ. "పరిమెయిఁ బాఱి... తె।చ్చి రసురభర్త......" (భార. శాంతి ౩ ఆ. ౫౦౫ ప.) (పరిమెయిన్=పరివేష్టనముచే.)

సీ. పరిమార్పఁ జాల రెవ్వరు పెక్కుభంగుల......
(భార. స్త్రీ. సర్వ. ౩ ఆ. ౧౦౪ ప)

కం. పరిభవ కరుఁడగు కీచకుఁ। బరిమార్చుట......
(భార. విరాట. సర్వ. ౩ ఆ. ౧౦౬. పుట.)

ఱకారమునకు :—క. నెఱి దప్పంబడి పెల్లుగ
నొఱలెడి నర వాజి కరుల యులి వభిమన్యుం

డఱిముఱిం బడుటకు నగ నుదిం
బఱిగొన నిల పెలుచ నఱచు భంగిం జెలంగెన్
(భార. ద్రోణ, ౨ ఆ. శబ్దర.)

పఱిగొనన్ = దుఃఖము మనస్సును బరివేష్టింపంగా ఆవరింపంగా నని యర్థము. దీనిని నీ క్రిందిపద్యమును శబ్దరత్నాకర కర్త 'అపహరించు' అను నర్థమున కుదాహరించెను. ఇం దపహరించుట యను నర్థముకన్న నావరించుట యను నర్థమె మిక్కిలి స్వారసికమై యున్నది. కావుననె తిరుమల య్యాయు నప్పకవియు దీనిని ద్విరేఫకముగా నెంచిరి.

క. నెఱిమాలి బందెవెట్టిన । నఱిముఱిం జంపినను గజము నశ్వము ద్రుచ్చెన్,
పఱిగొనిన నట్టి వారలంగొలుులం దిగిచి చంపు టొప్పుం గువలయ పతికిన్॥
(విజ్ఞా. ప్రా. కాం. శబ్ద.)

ఇందలి 'పఱిగొను' శబ్దమునకు 'అపహరించు' అను నర్థము సరియై యున్నను నట్టి యర్థముకన్న (పఱిగొను = పరివేష్టించు = ఆవరించు = ఆక్రమించు) 'ఆక్రమించు' అను నర్థము స్వారసికముగ నగపడుచున్నది. 'ద్రుచ్చె' అను పదము మూలములో నుండుటచేత దానివెనుక మరల 'అపహరించు' అను నర్థముగల పద మనావశ్యక మగును. అచట 'ఆక్రమించు' అను నర్థముగల పదమె స్వారసికమై యుండును.

(రూఢి)—33. పఱుసందనము—పరుసందనము—

ఈ 'పరుస' శబ్దము 'పరుష' శబ్ద భవమగుటచేత నిందు రేఫ ముండుటలో విప్రతిపత్తి లేదు. అట్లయినను నీ క్రింది యొక భారత ప్రయోగ పాఠాంతర ముండుటంజేసి యిందు శకటమును సైత మంగీకరించి యప్పకవి తిమ్మకవులు దీనిని ద్విరేఫక మనిరి. రంగనాథకవి తద్భవములలోం గ్వాచిత్కముగా శకటముల నంగీకరించినను నతండు చూపిన యా పట్టికలో (ద్విరే. 3 ఆ. ౧౦౨ పుట.) నీ పదము లేనందున నిందాతండు శకటము నంగీకరింప లేదనం దగును. శబ్దరత్నాకరమునందును నీ శబ్దమున ఱకారము చూపం బడలేదు.

రేఫమునకు :—క. తురగము......అ । ప్పరుసందన మేమి చెప్పుదు ।...
(భార. ద్రో. సర్వ. 3 ఆ. ౯౨ ప.)

ఱకారమునకు—ఆ. వె. చిఱుతవానికింత పఱుసందనమ్ములు । నన్నె.....
(భార. సభా. సర్వ. 3 ఆ. ౯౮ ప.)

ఇచట "చిఱుత వానికింత తెఱుసంటె పలుకులు" అని యుండవలయు ననియు "పఱుసఁదనమ్ములు" అను పాఠము నన్నయాభిప్రేతము కాద నియు నీవఱకె విశదీకరింపఁబడెను. (౪౩౧ విష.) కాఁగా 'పఱుసఁదనము' అను అకార ఘటిత రూపమునకుఁ బ్రమాణ మగపడకున్నది.

(౪౮౬)—౩౮-పాఱు = పారు—

తమిళ కన్నడములలో నీ శబ్దము అకారముతోనె యున్నది. తిరుమ లయ్యాయు నప్పకవియుఁ దిమ్మకవియు నిందు అకారమును మాత్రమె యం గీకరించిరి. రంగనాథకవియు శబ్దరత్నాకర కర్తయు ధావనార్థమున నిది ద్విరేఫకమని యంగీకరించిరి. ఈ క్రింది ప్రయోగములనుబట్టి యిది యెల్లెడ లను ద్విరేఫకమె యని యంగీకరించు టుచితము.

అకారమునకు—క. వేఱొక విలుగొని యమ్ముల । గీఱి..............
పాఱ నతఁడు... (భార. ద్విరే. ౫ ఆ. ౧౦౨ పు.)

చ. వేఱొక చాపమెత్తి... । పాఱఁగఁజేసి తేసి...
(ఉ. హరి. ద్విరే. 3 ఆ. ౧౦౨ పు.)

రేఫమునకు—శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బారెం బక్షులు...
(మనుచ. 3 ఆ. శబ్ద.)

మ. ...రాట్నంపు గుం । డ్రలు నాఁ దేనె కొలంకులం బొరలి పారన్ విచ్చు
పంకేరుహం । బుల...... (ఆముక్త. సర్వ. 3 ఆ. ౨౫౦ ప.)

మనుచరిత్రాముక్త మాల్యదల ననేక స్థలములందుఁ బ్రమాణీక రించియుఁ దిమ్మకవి పై పద్యములను రేఫద్వయ సాంకర్యమున కుదాహరించి నిరసించుట విమర్శ సహమై యుండలేదు. పై రీతిని "పరుగెత్తు, ప్రవహించు" అను రెండర్థములందును రేఫ ప్రయోగ ముండుటచే ధావనార్థమందు మాత్రమె యిది ద్విరేఫకమను వారి యభిప్రాయము పరాస్త మగుచున్నది.

(౪౮౭)—౩౯—పెఱుఁగు = పెరుఁగు—

తిరుమలయ్యాయు నప్పకవియు రంగనాథకవియు దీనిని ద్విరేఫకముగ నంగీకరించిరి. తిమ్మకవి యిందలి అకారము చింత్యమని నిరసించెను. శబ్ద రత్నాకరమున "వర్ధిల్లు, దధి" అను నర్థములలో బిందుపరకరేఫమనియు, 'విజృంభించు యత్నించు' అను నర్థములలో అకారమనియు, విభజింపఁబడెను. 'వర్ధిల్లు విజృంభించు' అను నర్థములకు భేద మగపడదు. శబ్ద రత్నాకర మున 'కడఁగు- ఉద్యమించు' అను నర్థమున కుదాహరింపఁబడిన ప్రయోగ

ములను 'వర్ధిల్లు' అను నర్థమునకే సరిపడి యుండుటచేత నట్టి యర్థాంతరము నంగీకరింప వలసిన యావశ్యకత లేదు. కన్నడమున నిది ఘనీభావార్థమున అకారముతోనె యున్నది. తమిళమున 'వర్ధిల్లు' అను నర్థమున రేఫముతో నున్నది. కాఁగా నిది యెల్లెడలను ద్విరేఫకము యని యంగీకరించుట యుక్తము. ('తెగు' అను నర్థమున నిది సిద్ధబిందుకము కేవల రేఫ ఘటితము)

రేఫమున కుదాహృతులు :—

చ. పరమ పతివ్రతన్.........దుష్టభావనం।
 పెరిఁగితి నీ నిమిత్తమున............(భార. సభా. ౨ ఆ. ౨౫౫ ప.)

తే. గీ. పెరుఁగు నడలునుఁ దనముక్కు- చెరగు లదర। (భాస్క-రరా.)

దీనిని అకారమునకు రంగనాథకవి యుదాహరించుట సరికాదు. ప్రాచీనులు "చరమ" అనియె సమ్మతించిరి. శబ్దరత్నాకరమున నిది రేఫమునకే యుదాహృతము.

క. కురుసేనగదా......। పెరిఁగిన మంటల............ (భార. ఉద్యోగ.)

అకారమున కుదాహృతులు :

సీ. తఱుచుటమ్ములఁ నేఁడు పెఱిఁగిన చందంబు.............
 (భాగ. కర్ణ. ౧ ఆ) (ద్విగే. ౪ ఆ. ౧౨౦ పుట.)

ద్విపద. పెఱుఁగుట లెల్లను బెక్కు-వ దక్కు-। నెఱుగుట కై కాక... ...
 (రం. రా. ద్విగే. ౪ ఆ. ౧౨౦ పు).

(రూరా) 3౬. బిఱుసు = బిరుసు

అప్పకవియుఁ దిమ్మకవియు నిందు శకటమునె చూపిరి. శబ్దరత్నాకరకర్త దీనిని ద్విరేఫకముగ నంగీకరించెను.

రేఫమునకు: గీ. తిరుగఁడొక మాత్రమున వచ్చు బిరుసు చూడ।
 (కళా. 3 ఆ. శబ్ద)

(అప్పకవి మతమున నిది అకారోదాహృతియె. 'తిరుగు'లో నితని మతమున అకారముగదా.)

చ. బిరుసుగ నేటికిం దలఁచు ప్రేలేదు..........। పరుసఁదనంబు।...కురియు.........। దురమున...............(జై.భా. 2 ఆ. 3౯ ప. శబ్ద)

తాకు :—

కం. ఉఱుకుచునె కఠినముష్టిన్। నెఱిచెడ......ప। ద్రెఱ... । బిఱుసున
 (కళా. ౮ ఆ. శబ్ద.)

(౪౮౯)—౩౭-మఱుగు=మరగు

తిరుమలయ్యయు నప్పకవియు దీనిని ద్విరేఫకముగ నెంచిన ట్లున్నది. "మఱవు మిఱుమిట్లు గొనన్" "మఱువులను మాటు" "నెమ్మఱవులన్" అని మూఁడుచోటుల శకటపద్యములలోఁ జెప్పి యుండుటచే వీనిలో మొదటిదగు 'మఱవు' అనునది యీశబ్దము కానోపును. "మనముల్ మరపఁగవలె" అనియు 'మరలుట మరిగించుట' అనియు నితఁడు రేఫపద్యములలోఁ జెప్పుటచేత నందు 'మరపు' అనునది దీని ప్రేరణరూప మనఁదగును. అప్పకవియు నిట్లె యీ రేఫ ఱకారములు రెంటికిని జెప్పెను. ఇది యీ గ్రంథములలో నుకారమధ్యముగఁ బడుట ముద్రణస్ఖాలిత్య మనఁగగును. తిమ్మకవి దీనిలో రేఫమును బేర్కొన లేదు. రంగనాథకవి దీనిని ద్విరేఫకమని యుదాహరించెను.

ఱకారమునకు:—రగడ. కఱచి చఱచి యఱచి పఱచు కపిని జంపు నచ్యుతు నకు। మఱగి తిఱిగి...... (అప్పకవీయ. ద్వి. ౪ ఆ. ౧౨౧ పు.)

రేఫమునకు:—

కం. .........। తరుణీసంగతి నుండఁగ। మరగిన......... (రామా. ద్విరే. ౪ఆ. ౧౨౧ పు.)

కం. హరిచేష్టితములు క్రమమున। మరగి... ... ...(ఎఱ్ఱా. హరి. ద్విరే. ౪ఆ. ౧౨౧ పు.)

(౪౯౦) ౩౮—మారి మసఁగు = మాఱి మసఁగు—

ఇది శబ్దరత్నాకరమున లేదు. తిరుమలయ్యయు నప్పకవియు దీనిని ద్విరేఫకముగఁ జెప్పిరి. తిమ్మకవియు రంగనాథకవియు దీనిలో రేఫమాత్ర మునె యంగీకరించిరి.

ఆ. వె. నారసములఁ బొదివి మారి మసంగిన। శల్యుఁ జూచి నరుఁడు ననిల। సుతుఁడు... ... (సర్వ. ౩ ఆ. ౨౧౩ ప. భార. భీష్మ.)

'మారి' అనునది సంస్కృత సమమగుటచేత నద్దాని విషయమున రేఫఱకారవిమర్శనము చేయుట యసంగతమని శబ్దరత్నాకర హృదయమై యుండును. కాని "మారి = ఒకానొక గ్రామదేవత; మారిమసఁగు = చంపు" అని పారిజాత కోశమునఁ గలదనుచు లక్ష్మీనారాయణీయమున నుదాహరింపఁ బడెను. అయ్యవి యచ్చాంధ్రకోశములు. అచ్చతెల్గు కావ్యములలో నీశబ్దము నకు వాడుక గలదు. దీనిని ద్విరేఫకముగఁ జెప్పిన తిరుమలయ్యయు నప్పకవి

యు నియ్యాది మాఱీశబ్దభవమని తలంచినట్లు తోఁచుచున్నది. (రవి విసర్గమును నిట్టిదె)-అర్థముసందు పూర్వునెలసినను దద్భవ మనఁబడునుగదా.

(౪౯౧)—౩౯-మాఱు. మారు— (బీఱువోవు)—

"కం. . . . . . . మఱుఁగున విహరించి మఱఁది మాఱుమొగము ప ల్మాఱు"

అనియిట్లు తిరుమలయ్య దీనిలో శకట రేఫమున చెప్పెను.

సీ. "బీఱువోవక యను మాఱు మాఱడుగుట . . . । మాఱుమాటాడుట మాఱుమొగమ్ము . . . వేమాఱు . . . . . . . ." అని యిట్లప్పకవి మాఱుశబ్దమున నెల్ల యర్థములందును అకారమునె యంగీకరించెను. రంగనాథకవియు నప్పకవి చొప్పుననే చెప్పెను. తిమ్మకవి యీ క్రింది భారత పద్యమున కపార్థము చేసికొని 'మారు' శబ్దమునందును రేఫము సైతము గలదనెను.

{"గీ. బీఱువోయె రథ్యంబులు మాఱు మొగము । . . . . . . . ."
(భార. భీష్మ. పర్వ ౩ఆ. ౨౦౪)}

బీఱువోవుశబ్దమునందును రేఫ అకారములు రెండింటిని సంగీకరించెను. శబ్దరత్నాకరకర్తయుఁ దిమ్మకవివలెనే భ్రమించి 'మారు' శబ్దమున రేఫమును సైతమంగీకరించెను.

"మారు. దే. వి. ప్రతి. ఆ. వె. 'అమరసైన్యములును దమయంతి వర్తింప। నేరకునికి నాకు మారు మొగము ।గా నొనర్పవలసెఁగాదె . . . . . . . . .'
(భార. ఉద్యో. ౪ ఆ. ౧౪౪ప.)" (శబ్దరత్నాకరకోశము)

"ఆ. వె. అమర సైన్యములును దమయంతె వర్తింప ।
నేరకునికి నాకు మారుమొగము । గా నొనర్పవల స . . . . . .
(సర్వ. ౩ ఆ. ౨౦౫)

ఇందులో మారుమొగమనుట రేఫముగాఁ బ్రయోగించినాఁడు గనుక బీరువోవుటను మారుమొగ మనుటను రేఫ అకారములు రెండును గలవు"
(సర్వ. ౩ ఆ. ౨౦౫.)

పై శబ్దరత్నాకర సందర్భమును దిమ్మకవిగారి యీ సందర్భమును గేవలము ప్రామాదికములయి యున్నవి. తిమ్మకవి యనుకొన్నట్లు మారుశబ్దము ద్విరేఫకమె యైనను నద్దానితోఁ బ్రాసము గల్గినంత మాత్రమున కేవలరేఫముతోఁ బ్రాసమును జూపఁజాలనపుడు 'బీఱువోవు' శబ్దమున రేఫ మెట్లు స్థిరపడునని యాతఁడు తలంచెనో తెలియకున్నది. అది యట్లుండఁగాఁ దిమ్మకవియు శబ్దరత్నాకరకర్తయు ననుకొన్నట్లు పై యుద్యోగ పర్వపద్యమునఁ దిక్క-

యజ్వ 'మాఱుమొగము' శబ్దమును బ్రయోగించినట్లే యుండలేదు. ఇఁక 'కుమారు' ననఁగాఁ గుమారస్వామిని 'మొగముగా నొనర్పవలసె' ననఁగా సేనాపతిగాఁ (అమరసైన్యములకు) జేయవలసెనని యచటఁ దిక్కయజ్వ సందర్భపఱిచెను. అచటి గ్రంథసందర్భముం జూపెదను.

'వ. అక్షౌహిణీ నాయకుల సమకట్టి రారాజు పితామహు పాలికి వారిం దోడ్కొని చని ... ... చేతులు మొగిచి యిట్లనియె.

చ. నెఱిఁ బడి యాజి నీ మొనలు నేరవు గూడి తగం జరింప............

ఆ. వె. అమరసేనలును దమంతన వర్తింప। నేరకునికి, నా, కుమారు, మొగము। గా నొనర్పవలసెఁ గాదె సమస్తసే। నలను నీవ యరసి నడపవలయు.

(భార. ఉద్యో. ౪ ఆ. ౧౪_౨-౧౪౩.-౧౪౪ ప.)

పయిసందర్భమును గ్రహింపక తిమ్మకవియు శబ్దరత్నాకర కర్తయు న పార్థమును జేసికొని 'మారు' అను రేఫరూపమును జెప్పిరిగాన నయ్యది పైని వివరించినరీతిని నిర్మూల మగుచున్నది. కాఁబట్టి "నూరు, బీరువోవు" అను రేఫఘటిత రూపములు లేవని యెన్నునది.

(౪౯_౨)—౪౦. ముందఱ = ముందర

ఎల్లరును నిందు శటమునె చూపిరి. శబ్దరత్నాకరకర్తమాత్రము దీనిని ద్విరేఫకముగా వ్రాసెను. దీనికిఁ దర్వాతిదేయగు ద్విరేఫవర్ణ దర్పణమున నిట్లు వ్రాయకుండుట వింతగనున్నది. (1887 (క్రీ. శ.) సంవత్సరమున శబ్ద రత్నాకరము మొదట ముద్రితమయి యున్నది. 1903 సంవత్సరమున ద్విరేఫ వర్ణదర్పణము ముద్రితమైనది.) ఇట్లు చూచికొనకుండుట ద్విరేఫవర్ణదర్పణ మున ననేకస్థలముల నగపడుచున్నది.

ఱాకు: చ. చిఱుతతనంబునం దగవు చిత్తమునం దలపోయలేక ముం।
దఱ నటు వోవ నిచ్చితి...  (భార. ఉద్యో. 3 ఆ. శబ్దర.)

రేఫమునకు:—కం. ధరణిఁ గడుపేదవారును। పురిటికి... ముం। దరసంగ్ర హింతు రవి మన। కరుదు...  (భార. అర. 3 ఆ. శబ్ద.)

(౪౯-3)—౪౧ (ముచ్చిఱు - ముచ్చిఱితనము - ముచ్చిరు - ముచ్చిరి)

అప్పకవియుఁ దిమ్మకవియు "ముచ్చిఱితనము" అను దానిని మాత్ర ము ఱకార ఘటితముగఁ జూపిరి. అర్థము తెలుపలేదు. శబ్ద రత్నాకరములో "ముచ్చిరు" = (శోకించు) "ముచ్చిరి" (=శోకము నొందినవాఁడు) అనునవి రేఫయుతములుగాఁ జూపఁబడినవి. ఎవ్వరును రేఫ ఱకారములకు యతి

ప్రాసస్థలస్థిత ప్రయోగములు నియ్యలేదు. రంగనాథకవి "ముచ్చిలు" (=వ్యసనపడు) అని యిట్లు శబ్దరత్నాకరార్థమును నప్పకవి శకటయుత శబ్దమును మేళగించి చూపెను.

ఉ. "ముచ్చిరనేల నేఁ గలుగ ముద్దియ...(భార. ఉద్యో. ౩ ఆ. శబ్దర.)

చ. మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁజేసి పాండునం।

దనులు......(భార. ఉద్యో. ౪ ఆ.) (ఈ ప్రయోగములు యతిప్రాసస్థల ఘటితములు కామింజేసి రేఫ అకారములను నిర్ణయింపనేరవుగదా)

(౮౯౮)—౮౨- రంతు = అంతు—

అప్పకవియు రంగనాథకవియు దీనిలో అకారమును మాత్రమె యంగీకరించిరి. తిమ్మకవి దీనిని ద్విరేఫకముగా వ్రాసెను. శబ్దరత్నాకరకర్త 'కలకలధ్వని' అనునర్థమున నిందు అకారమనియు, 'క్రీడ, రతిక్రీడ, ద్యూతక్రీడ' అనునర్థములలో నిందు రేఫమనియు వ్రాసియున్నాఁడు. అయినను గ్రీడలో నైతము గేలిసేయుట, కరతాళాది ధ్వనులుచేయుటయు నుండును గాన నిట్టి విభాగము వాని ప్రత్యేకతను జూపఁజాలదు. ప్రయోగములును గ్రీడాపరముగాఁగాని ధ్వనిపరముగాఁగాని యర్థముచేయుట కనువుగనే యున్నవి. కాన నట్టి యర్థములందుఁ దిమ్మకవి చెప్పినట్లు దీనిని ద్విరేఫక మనుటయె లెస్స.

రతిక్రీడార్థమునందలి రేఫమునుమాత్రము సాధించు యతిప్రాసాది స్థలగత ప్రబలప్రయోగము నెవ్వరును నీయలేదు. కాని యది వైకృతమగుటచేత నందు రేఫ ముండుటలో సందేహ ముండనేరదు. రంతుశబ్దము రతిశబ్దభవమని వైకృతదీపికయందును బురుషోత్తమ కవీయమునందును వ్రాయఁబడెను. కాని రంతృ శబ్దభవమనుట యుక్తతరమై యుండును.

అకారమునకు—సీ. అంతుతో మేర మీఱి దొకప్పుడును ఘనశ్రీలఁ బొంగియును నీ సింధుకన్య (వసుచ. సర్వ. 3 ఆ. ౧33ప).

ఇచట సముద్రుఁడు ధ్వనిచేయుచు మేర మీఱునని యర్థము.

ఉ. అంతులు మీఁదుమిక్కిలిగ ఱాఁగతనంబున దొమ్మిచేసి దు।

ర్దాంతపరాక్రమోన్నతులు దానవదైత్యులు ....................

(భీమ. సర్వ. 3 ఆ. ౧33 ప. శబ్దర.)

('అంతులు మీఱి-అంతులు మీఱి' అని పాఠాంతములు) (ఇచట అంతులనఁగా నలుపులు మున్నగువాని ధ్వనులు)

రేఫమునకు—

శా॥ రంతుల్ సేయుచు కుక్కుటాధమము దరిద్రక్షుద్ర శూద్రాంగణ
ప్రాంతోలూఖల మూలతండుల కణగ్రాసంబుచేఁ గ్రొవ్వి యు
ద్ధాంత స్వానిల భిన్నహృత్ఫణిఫణాంతర్మాంస మాధుర్య మే
చెంతం గ్రోలు ఖగేంద్రు చెంగటను నీ జంజాటముల్ సాగునే ॥

(శ్రీనాథుఁడు, సర్వ. 3 ఆ. ౧౩౦).

(ఇచట రంతులనఁగా ఉద్ధత ధ్వనులు)

ఉ ...నిశా। తాంగజు బాణకైరవ సితాంబుజ మత్తచకోర బాలసా।
రంగ తటిన్నికాయముల రంతులు సేసెడి వాఁడిచూపులన్।

(శ్రీనాథ. సర్వ. 3 ఆ. ౧౩౯ ప.)

(ఇందు'రంతులు చేయు టనఁగాఁ బరిహసించుట. పరిహాసము కరతా ళాది కలకలధ్వని పూర్వకమె కాన నిదియు'ధ్వని' అను నర్థమునుండి గౌణ ముగా లభించినదే యనవచ్చును.)

మ. విని యా రంతు దురంతశైల మథనా విఖ్యాత సింధూద్ధత ధ్వనియో...

(వసుచ. ౨ ఆ.) (ఇచటధ్వని యనునర్థము నిర్వివాదమేకాని యిందలి రంతు శబ్దములోని రేఫము యతిప్రాసనిబద్ధము కాదయ్యె)

(ర్ష-శి)—౮౩. రాగిల్లు, రూపించు, రీతి, రోవెలఁది, వారించు, సౌరము-

వెనుకవ్రాసిన '౩౮. మారిమసంగు' శబ్దములోని మారి శబ్దమువలెనె యివియు సంస్కృతసమములుగ శబ్దరత్నాకర కోశమున నుదాహరింపఁ బడినవి. అయినను మారిశబ్దమువలెనే యివియును సంస్కృతమునలేని యర్థ విశేషాదులనుబట్టి వైకృతము లని తలంచికావలయు నాంధ్రలాక్షణికులు వీని నచ్చ తెన్గులుగా గణించి యీ సందర్భమునఁ బ్రసంగించిరని తోఁచుచున్నది. వీనికిని నచ్చ తెనుంగు కావ్యములలోఁ బ్రయోగముండుటసైతము పైవిషయ మునకు సాధకమైయున్నది. పైవానిలోని 'వారించు' అనుదానికిఁ బ్రకృతి యగు 'వారు' ధాతువు 'వారక' 'వారని' మున్నగురూపములతో నాచ్ఛిక ముగ వాడఁబడుచుండుట సర్వసమ్మతము. అట్లె'రోవెలంది' శబ్దములోని రో శబ్దమునకు మూలమనఁదగు 'రోయి' శబ్ద మాచ్ఛికమనుటకు విప్రతిపత్తి యే లేదు.

రాగిల్లు:— 'రాగించు' అను రూపము గ్రామ్యమగుటచే 'రాగిల్లు' అనునది 'రంజిల్లు' అనుదానికి వైకృతమని తలంచిరి కాఁబోలు!

రూపించు:—'రూపు' అను తద్భవశబ్దము నెలకొనియుండుటచేత నద్దాని నుండి 'రూపించు' అనియేర్పడె నని తలంచి యుందురేమో?

రీతి:—రీతిశబ్దమునకు 'తెనుగు వావేశముగల శబ్దరత్నాకర సంబోధినీ కోశములలో ప్రకారార్థ కత్వము వ్రాయఁబడినను సంస్కృతశబ్దమయ్యునుఁ ప్రామాణికము లనఁదగు శబ్దస్తోమ మహానిధి వాచస్పత్య శబ్దార్థ చింతామ ణ్యాదులలోఁ ప్రకారార్థకత్వము వ్రాయఁబడలేదు. కాఁగా నిట్టియర్థమున నియ్యది వైకృతమని తలంచి యుందురేమో?

సౌరము:—

వెనకవ్రాసిన మారిశబ్దము గ్రామదేవతా విశేషమునకు సంజ్ఞయగుచు నాచ్ఛికమనఁబడునట్లె మతవిశేషమునకు సంజ్ఞయగుచు సౌర్యాదియు నాచ్ఛికముగాఁ దలంపఁబడెనా యని యాలోచింపవలసి యున్నది. ఆచ్ఛికకావ్యములలో సంజ్ఞావాచకములు వాడఁబడు సంప్రదాయము గలదు గదా.

'రాగిల్లు, రూపు' మున్నగువాని యాకారమునుబట్టి తద్భవత్వమును గల్పించుటయుఁ గొందఱు లాక్షణికుల కభిమతే మనఁదగును. సంస్కృతశబ్దమునకుఁ దెనుఁగు విభక్తులు చేర్చుటలోఁ గలిగెడి వర్ణవికారమునుబట్టి నైతము వానికిఁ దద్భవత్వమును గొంద ఱంగీకరించుటయుఁ గలదు. కవిసంశయ విచ్ఛేదమున 'వయసు, తపసు, మనసు, వృద్ధు, మూర్ఖు, దుష్టు, ధూర్తు' అను శబ్దములు వైకృతములుగా సాధింపఁబడినవి. 'కుండ, పన్నీరు, కళంకు, వర్గు మీను, నాదు, వాదు' మున్నగువాని తద్భవత్వము సర్వసమ్మతమే కదా.

పయి సందర్భమును బట్టి 'రాగిల్లు' ప్రభృతులు వైకృతములని తలంచి యప్పకవ్యాదు లీ సందర్భమున నీ క్రిందిరీతిని జెప్పిరని యెన్నసగును.

సీ. "రాగిల్లుటయును రారా యనుటయు" "రీతి గాదనక యీరీతి రూపించుట ...రూపరి రూపు రూక" "రోజు రోఁకలి రోలు రోవెలంది" "వారువమశ్వంబు వారని కోపంబు వారించు కొనుటయు వారకములు."

"గీ. సౌరు సౌరంబు నోడ బేహారి వింత"

సీ. "మారట మిత్తియై మారి మసంగుట" "మాఱి మసంగుట మాఱుపడుట"

(అప్పకవీయ రేఫ అకార సీసమాలికలు. ౨ ఆ. ౧౯౬-౧౯౭ ప.)

(౮౯౬)—౮౪-ఱాచు = రాచు; ఱాపు = రాపు

కేమిఱు కన్నడములలో నీ శబ్దము రేఫముతో నున్నది. తిరుమలయ్యార్యుఁడు ఱకారమునె చెప్పెను. అప్పకవి దీనియం దుభయ రేఫములను జెప్పియు

దీనిని ద్విరేఫకశబ్దపట్టికలోఁ జేర్చుకొనుట వింత. "తాచు నీలపు తాయి" "రాచుట రాఁజుట రాయుట" (అప్పకవీ. ౨ ఆ.) తిమ్మకవి దీనిలోని అకారము చింత్యమనెను. రంగనాథకవియు దీనిలో రేఫమాత్రమునె చెప్పెను.

రేఫమునకు—

ఉ. ...పాపముల్ । రాచుట యొండె గా కిహ పరంబుల కూరక దూరమై......(సునుచ. ద్విరేఫ ౨ ఆ. ౪౫ పుట.)

శా. "రారాపిళ్ళ భూజాంగదంబుల మణుల్ రాలంగ...(మను. ౪ ఆ. శబ్దర.)

ఉ. "రాపలువఁ గాను నిస్సరయ రాచిన శూలిని గాను...(మాదయ్యగారి మల్లయ; రాజశేఖ. సర్వ. 3 ఆ. ౨౧౭ ప.)

అకారమునకు:—

ద్విపద. "ఏచిన గురుభక్తి నెల్లలోకముల । తాచిన కోపమున నాటఁడి జంపికొంటి." (రంగ. రా. అయో. శబ్దర.)

ఉ. అంకెలు గర్జలై యడర తాపుఁదనంబున......(హరి. పూ. ౮ ఆ. శబ్దర.) ("అంకెలు గర్జలై యడర టాఁగతనంబున" అని యిట్లిది రంగనాథకవిచే నుదాహరింపఁబడి యుండుటంజేసి యీ యుదాహృతి మానినను మానవచ్చును. మఱియు 'రంకె' అను రేఫరూపమె తిరుమలయ్య, యప్పకవి మున్నగువారిచే నంగీకరింపఁబడి యున్నదిగాన నిది 'తాపు' అను దానికంతగా సాధకమును గాఁజాలదు.)

(౪౯౭)—౪౫- తేవు = రేవు—

తిరుమలయ్యయు నప్పకవియుఁ దిమ్మకవియు నిందు అకారమునె చెప్పిరి. రంగనాథకవియు శబ్దరత్నాకరకర్తయు నిందు రేఫమాత్రమునె యంగీకరించిరి. తిమ్మకవి యిందు రేఫమును సాధించు ప్రయోగముల నుదాహరించి రేఫద్వయసాంకర్యమున కుదాహరించుట యసంగతము.

అకారమునకు:—

ద్విపద "తేసి చూడఁగ రాని తేవు చక్కటికి" (రంగ. రా. సర్వ 3ఆ. ౨౨౯ ప.)

చ......ఒప్పుమీా । ఱిన యది యన్నదీజలము తేవుచు మంచిది......(ఎఱ్ఱా. రామా. సర్వ 3 ఆ. ౨30 ప.)

రేఫమునకు:—

గీ. "వనధి సర్వంకషం బగుచు వలయుపనికి। రేవులను గాని చొరరాని రీతి నధిప। (కవికర్ణ. ౫ ఆ. శబ్దర.)

శా. "రేవుల్ వహావు మణంగుటంబును మణి శ్రీఖండ ముక్తాదియున్) రా వాణిజ్యముఁ బెంచి యేలఁగ నగున్......(ఆముక్త. ౪ఆ. ౨౪౫. శబ్దర.)
(సర్వ. ౩ ఆ. ౨౫ ౩ ప।

ఇయ్యది 'కరవాకపట్టణము' అను నర్థమున కుదాహరణముగా శబ్దరత్నాకరమునఁ జూపఁబడెను. రంగనాథకవి దీనిని జలావతరణ ప్రదేశార్థముననే యుదాహరించెను. (ద్వి గీ. ౨ ఆ. ౪౬ ప.)

పయి రెండుపద్యములనే కాక యీక్రిందిపద్యమును స్వతేము తిమ్మకవి రేఫద్వయసాంకర్యమున కుదాహరించుట సరికాదని యీ వఱకు వ్రాసియే యున్నాను.

సీ. "శేఖులై మీఁదటి రేవులై నెమున్నొ ప, న్నాగంపుఁ గడపళ్ళ బాగు నెఱప" (కళాపూ. సర్వ. ౩ ఆ. ౨౫౬ ప.)

ఇందు "శేఖులై మీఁదటి రెప్పలై" అను పాఠము నేఁటి ముద్రణములలోఁ గలదు. శబ్దరత్నాకరకోశమునందును "రెప్ప" అను పాఠమె యుదాహరింపఁబడెను. ఈ పద్యము వ్రాఁతప్రతులలోని వగుటచేత నిందు 'రెప్ప' అను పాఠమె కవి ప్రయుక్తమనియు 'రేవులై' అన్నది లేఖకాది కృత ప్రమాద పాఠమనియు నెన్నదగును. కాఁగా నీపద్యము ప్రకృతోదాహృతి కుపకరింపదని గ్రహింపవలెను.

(౪౯౦)—౪౬—ఱోయు=రోయు—

తిరుమలయ్య 'రోయుట' అని చెప్పుటచేత 'రోఁతపడు' అను నర్థమునందు రేఫయుతమని యాతఁడు చెప్పినట్లు తోఁచుచున్నది. అప్పకవి సీ. "ఱోయుట వెదకుట ఱోఁతపడుట" అని యిట్లు రెండర్థములందును నిది ఱకారఘటితమె యని చెప్పెను. ఈ యప్పకవి వాక్యము తప్ప దీని ఱకారమునకుఁ బ్రమాణ మగపడదు. 'రోయుట ఱకార మగుట చింత్యము' అని తిమ్మకవి వ్రాసెను. "ఒకానొక ఆధునికకవి దీనిని 'వెదకు' అను నర్థము నందు శకటరేఫముగాఁ బ్రయోగించి యున్నాఁడు. అది యాదరణీయము కాదు" అని శబ్దరత్నాకరకర్త వ్రాసెనే కాని యాకవియెవ్వఁడో యాప్రయోగ మెట్టిదో తెలుపలేదు. రంగనాథకవి 'అసూయార్థమున (ఏవ) నిందు రేఫమనియు 'వెదకు' అను నర్థమున ఱకారమనియు విభజించి యప్పకవికిఁ దాను భిన్నాభిప్రాయుఁడై

యయ్యెఁ బ్రయోగాంతరము లేక కావలయును 'వెదకు' అను నర్థమునందలి అకారమున కా యప్పకవి వాక్యమునె ప్రమాణముగఁ జూపెను.

ఉ. క్రూరత కోర్చి యించుకయు ఱోయక పైకొని యెల్లభంగులన్"

(భార. భీష్మ. సర్వ. 3 ఆ. ౨౩౮ ప.)

కం......పు ॥ త్రుల నేమని విందు నేను ఱోయక యింకన్."

(భార. ద్రోణ. సర్వ. 3 ఆ. ౨౩౭ ప.)

ఉ. "... ... ఆత్మపరాక్రమోన్నతుల్ । ఱోయను గానినాంతరము ఱో యను........(రామాభ్యు. ౫ ఆ. శబ్దర.) ('వెదకు' అను నర్థమున కిది మాత్రమె యుదాహృతమయి యున్నది.)

(౪౯౯)—౪౭-ఱోలు = రోలు—

సీ. "ఱోఁజు ఱోఁకలి ఱోలు ఱోవెలంది" (అప్పక. ౨ ఆ.) అని యప్పకవి రేఫ సీసములో మాత్రమె దీనిని జెప్పెను. ఱోఁకలి శబ్ద సాహచర్యమున దీని నులూఖలార్థమున మాత్రమె పేర్కొనెనా యని యాలోచింపవలసియున్నది. తిమ్మకవియు నట్లె "ఱోలు ఱోఁకలి ఱోఁజు టంచోలిఁ బలుకు" అని చెప్పి 'ఱోలు'=విలపించు, అను దాని కీ క్రిందిపద్యమును అకారోదాహరణముగా నిచ్చుట నరయఁగా నాతఁడును నులూఖలార్థమున దీనిలో రేఫమునే యంగీకరించి విలాపార్థమున అకారమును జెప్పెనని తేలుచున్నది. శబ్దరత్నాకరమున దీనిలో రెండర్థములందును అకారమె చూపఁబడినదిగాని యులూఖలార్థ అకారమునకుఁ బ్రమాణ మీయఁబడదయ్యె. తమిళ కన్నడములలో నులూఖలార్థమున నిది రేఫ ఘటితముగనె యున్నది. 'విలపించు'అను నర్థమున సైతము దీనిలో నొకానొక కవి రేఫమును ప్రయోగించె ననియు నది సాధువు కాదనియు శబ్దరత్నాకరకర్త వ్రాసెనెకాని యాకవి ప్రయోగమును జూపఁడయ్యె. విలాపార్థమునందలి అకారమునకుఁ దిమ్మకవియు శబ్దరత్నాకరకర్తయు నీ క్రింది పద్యము నుదాహరించిరి.

ఉ. ......సమయించె నుగ్రుఁడై । ఱోలఁగ ఱోఁజఁగాఁ బలుమఱుం
బొరలంబడి లాల గ్రక్కు న । వ్వాలు మగండు

(భార. సౌప్తి. ౧ ఆ.)

'పలుమరు' అను రేఫ ఘటితరూపము సైతము వెలయుచుండుటం జేసి (శబ్దరత్నాకరముననే యుదాహరింపఁ బడెను.) (౪౩౫ విష.) యీ ప్రయోగము దీని అకారమును నిర్ణయింప సమర్థము కాఁజాలదు.

చ. సిరిగొని తాల్చు నెట్టెముగఁ బ్రేఫులు నుట్టి సిగోలుపాత్రలో । విరి యఁ గలంచుఁ గ్రొమ్మెరసు వెంద్రుక లేతి శోణిని వేమఱు బ । ల్మఱుఁ బుకిలించు నెత్తురు............ (హ. హరి. ౨ ఆ. శబ్దర.)

కం. పలు మరల సొబగు చందముఁ

బలుమఱు నగు నంగపటిమఁ బొటిల్లుదు రా

నలుగురు రా సుతు లుగ్రా

నలు గురు లతులప్రతాప నైపుణికతనన్॥ (రామా. ౩. ఆ. శబ్దర.)

మ. స్మరదంతావళ రీతి బృంహితములై ...ప । ల్మారు...

(రామాభ్యు. ద్విరేఫ. ౪ ఆ ౧ ౨ ౨ పుట.)

(౫౦౦)—౪౮—వేమాఱు = వేమారు = వేసఱు = వేమరు.—

ఈ విషయ మీవఱకు విపులముగాఁ జర్చింపఁబడి యున్నది—(౪౩౫ విష.) ' పలునూఱు, పలుమారు, పలుమఱు, పలుసరు, పల్మారు ' అను రూప ములను వలెనె గ్రహింపవలెను.

(౫౦౧)—౪౯—వేఱు = వేరు.—

తమిళ కర్ణాటములలో సన్యార్థమున నిందు అకారమె వెలయుచున్నది. తిరుమలయ్యయు నప్పకవియుఁ దిమ్మకవియు నిందు శకటవర్ణమునే యంగీ కరించిరి. రంగనాథకవియు శబ్ద రత్నాకర కర్తయు దీనిని ద్విరేఫకముగ నంగీకరించిరి.

ఱకారమునకు:—ఉ. ఆఱు రసంబులం జవుల యందలి క్రొత్తలు వుట్టి సిచ్చలున్।

వేఱొకభంగిఁ బాకములు విన్ననువొప్పఁగ సంఘటించి...

(భార. విరా. ౧ ఆ. శబ్దర.)

క. "వేఱొక విలుఁగొని యమ్ములు।గీఱ మెఱుఁగు నా రసనులు గిరికొల్పిన నో। టాఱి మెయిన్ గ్రొన్నెత్తురు।వాఱ నతఁడు తేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్."

(భార. ద్రో. సర్వ. ౩ ఆ. ౨౪౨ ప.)

రేఫమునకు:—

తే. గీ. వేరె యరదంబు నెక్కి యా శూరవర్యు । లు ... ...

(జై. భా. ద్విరే. ౪ ఆ, ౧౨౪ పుట.)

ఉ. వేరనలేదు ; (డు?) ధారుణి నవీనతరాంధ్ర కవిత్వ సంపదా । ధార రసజ్ఞులైన...(అహోబల పండితీయము. ౪౯౦ పుట. ద్విరే. ౪ఆ. ౧౨౪ పు.)

తే. గీ. పాండురాజ తనూజులు పాలి కర్థి। నిమ్మనూరాజు పనుపంగ నేఁగి ధర్మ। పుత్త్రుఁ గాంచితి నాతండు మైత్రి మెఱయ । గౌరవుల సేమ మెల్ల వేర్వేర నడిగె (భార. ఉద్యో. ౨ ఆ. ౧౧౬ ప.)

దీనిని జూచియే సినవీరభద్రాదులు 'వేరు' అను రేఫరూపమును బ్రయోగించి రని తోఁచుచున్నది. కాని భారతమున నెల్లెడలను దీనిలో అకారమె ప్రయుక్తమయి యుండుటంజేసి యిచ్చట రేఫమును దిక్క యజ్వ ప్రయోగించియుండునా యని యాలోచింపవలసియున్నది. నేఁటి ముద్రణములలో "కౌరవుల సేమ మెల్లఁ బేర్వేర నడిగె" అను పాఠాంతరము వెలయుచున్నది. "పేరన్ + పేరన్ = పేర్పేరన్ = పేర్వేరన్" అనురీతి నిచట "పేరు" శబ్దము ప్రయోగింపఁబడెనె కాని 'వేఱు' శబ్దము ప్రయోగింపఁబడలేదని యీ పాఠాంతరమువల్ల దేలుచున్నది. ధర్మరాజు కౌరవుల క్షేమమును పేరు పేరు వరుసల నడిగె ననునర్థమును సంగతమె యై యున్నది.

(౧౦_౨)—౧౦. సుఱసుఱ = సురసుర.—

సీ. "వెఱచుట వెఱఁగు నివ్వెఱ సుఱ స్రుక్కుట" (అప్ప. ౨ఆ.)

అని యిట్లప్పకవి దీనిలో అకారమునె చెప్పెను.

క. "సుఱసుఱ స్రుక్కుటయును బెం। పఱి ”

(సర్వ. 3 ఆ. ౧౪౭ ప.)

అని యిట్లు తిమ్మకవియు దీనిని అకార యుతముగనె చెప్పెను. శబ్దరత్నాకరమునందును నిది అకారముతోనే యున్నది. అట్లయినను నిది యాముక్త మాల్యదలో రేఫయుతముగఁ బ్రయుక్తమై యున్నందున ద్విరేఫకముగఁ జూపఁబడెను.

అకారమునకు:—

"చ. ఎఱుఁగని...లా।వతి. ।గిఱుపఁగ...వానిమై । సుఱసుఱ స్రుక్కనొక్కి" (నిర్వ. ౭ ఆ. శబర.)

"చ. ...ఎదు।ర్పడ మఱి సార్చులై సురసురం దుది సుళ్ళుగ స్రుక్కనోయనన్".

( ఆముక్త. ద్విరే. ౪ ఆ. ౧౧౮ పుట. )

రేఫ పూర్వక సంయోగములో అకారము నిలువదని యీ వఱకు సిద్ధాంతీకరించి యుండుటచేత (౪_౨౦-౪_౨౨ విమ.) నీయాముక్తమాల్యదా ప్రయోగమున 'ఎదుఱ్పడ' అని యిట్లు అకారమె గలదని చెప్పుటకు వలను పడదు. అట్లు చెప్పిన రంగనాథకవి మతము సరికాదనియు నీ వఱకు నిరాక

> చిం—శ్లో॥ అద్యః క్రియాసు భూతార్థ ద్యోతిన మాద్యగం వినా సర్వః ।
> యశ్రుతి మార్యా లఘు యం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్॥

---

గింపఁబడియె యున్నది. మఱియు "సాఅసాఅ" అనునది ధ్వన్యనుకరణ మగుట చేత నే రేఫమును చెప్పినను శ్రుతి లేదు.

(౫౦౩)—వ్యాఖ్య. అద్యఇత్యాది:—

సంస్కృతప్రాకృతములలోవలెఁ గాక తెనుఁగులోఁ బ్రకృతిభావమునఁ (స్వరసంధిలోని) గళలముఖ్యాఁది పరపదాదిస్వరము సార్వత్రికముగ యకార శ్రుతి గలదియు లఘూచ్చారణము గలదియు నగుచున్నదని చెప్పుచున్నాఁడు.

క్రియాసు = క్రియలయందు, భూతార్థద్యోతినమ్ = భూతార్థమును దెలిపెడి యకారమును, ఆద్యగమ్ = పదాది గత యకారమును, వినా = విడువఁగా మిగిలిన, సర్వః = అన్నిచోటులందలిదియు, అద్యః = అకార యుక్త యకారమే యగును.

యశ్రుతిమ్ = యకారశ్రుతిగలిగిన, ప్రాణతః పరమ్ = అచ్చునకుఁ బరమైయున్న, ప్రాణమ్ = అచ్చును, లఘుయమ్ = లఘుయకారమునుగా, ఆర్యాః = పూజ్యులు, (వైయాకరణులు) ప్రవదన్తి = చెప్పుచున్నారు.

లేదా—"ప్రాణతఃపరమ్=స్వరమునకుఁ బరమగు, ప్రాణమ్=స్వరమును, యశ్రుతిమ్ = యకారశ్రుతిగలదానిగను, కావుననే లఘుయమ్ = లఘుయకారమునుగాను, ఆర్యాః = పూజ్యులు, ప్రవదన్తి = చెప్పుచున్నారు." అని యోజింపనగును.

(౫౦౪)— సంస్కృతభాషలోఁ బదాంతస్వరసంధిలో వచ్చు యకార వకారములకు మాత్రమే పాక్షికముగా లఘు యకార వకారాదేశములు చేయఁబడును.

"వ్యోర్లఘు ప్రయత్నతరః శాకటాయనస్య (౮-౩-౧౮) పదాన్తయో ర్వకార యకారయో ర్లఘూచ్చారణౌ వ యౌ వా స్తోఽశిపరే" (సిద్ధాంతకౌముది, స్వాదిసంధి).

"శ్రియై + ఉద్యతః = శ్రియాయుద్యతః. గురౌ + ఉత్కః = గురావుత్కః" అను నివి మున్నగు చోటులందలి యకార వకారములు సంస్కృత లఘూచ్చారణోదాహరణము లయి యున్నవి.

తమిళ కర్ణాటకములలో స్వరసంధియందుఁ దెనుఁగులోవలె నొక్క యకారము వినఁబడుటయే కాక వకారమును వినఁబడుచున్నది. కాని యట్టి య

వ లను తత్సమ వైయాకరణులు స్వరసంహితా వ్యవధాయక వర్ణములనుగా మాత్రమె చెప్పిరిగాని వానికి లక్షణములను వివరింపలేదు.

తమిళభాషలో నట్టి స్వరసంహితా వ్యవధాయక వర్ణములను నిలుపుట యావశ్యకమని చెప్పఁబడలేదు. అట్టి వర్ణములు నిల్పినను నిలువవచ్చు నని ప్రాచీనుఁడగు తొల్కాప్పియుఁడు చెప్పియుండెను.

"ఎల్లామొఴిక్కుమ్..............." (తొలు. ౧౪౧ సూ.)

అజంతశబ్దములకు స్వరము పరమగునపుడు వాని నడుమ నొకహల్లు నిలువ వచ్చును. దానికి "ఉడమ్ పడు మెయ్"—(నడుమ నిల్చు హల్లు) అనిపేరు. (ఇట్లు తొల్కాప్పియ రీ వ్యవధాయక వర్ణయోగమును నియతముగాఁ జెప్పకున్నను గవిప్రయోగములం దియ్యది నియతమయి యుండుటంజేసి నన్నూలు వ్యాకరణకర్త య వ లు నియతముగా వ్యవధాయకములగు నని సూత్రించెను).

కర్ణాటభాషలో నట్లుగాక యే యే స్థలములలో య వ లను నిలుపవలెనో యే యే స్థలములలోవానిని నిలుపరాదో యను విషయము విపులముగా సూత్రింపఁబడెను. అట్లు నిలుపరాని చోటులను సంస్కృతములోని "శ్రియాఉద్యతః, గురాఉత్కః" అను వానినివలెను, ప్రాకృతములోని "లోఓ"(=లోకో)మున్నగు వానివలెను స్వరసంహితగనే పలుకవలె నని కర్ణాటవైయాకరణులు తలంచి యున్నారు.

ప్రాచీనుఁడగు నాగవర్మ యీ క్రిందిరీతిని సూత్రించి యున్నాఁడు.

"ఏదోదన్తా నిపాతాః స్వరేపరే ప్రకృత్యా."

(కర్ణా. భాషా. ౨౫ సూ.)

ఏకారాంతములును నోకారాంతములును నగు నిపాతములకు స్వరము పరమగునపుడు సంహితలో, నే వ్యవధాయకవర్ణమును నిలువదు. ప్రకృతిభావమె కలుగును. ఉదా. ఎలె ఇదావుదో=ఓ యీ యదియేమి? ఓహో ఇరలిం=ఓహో కాకుండుఁడు.

"ప్లుతాశ్చ" (కర్ణా. భాషా. ౨౭ సూ.)

త్రిమాత్రాక స్వరమునకు స్వరము పరమగునపుడు ప్రకృతిభావము కలుగును. ఉదా. ఎలెఅణ్ణా ఇత్త, బా=(ఓయీ యన్నా యిక్కడికి రమ్ము.)

ఈ విషయమున నీ క్రిందిరీతిని గర్ణాటశబ్దానుశాసనకర్త మిక్కిలి విపులముగ సూత్రించి యున్నాఁడు.

"పాసత్వాదిః" (కర్ణా. శబ్దా. ౪౬ సూ.)

పొసత్వాది రకారాన్తః స్వరేపరే ప్రకృత్యా తిష్ఠతి.........
ఉదా. పొస ఆనె = (క్రొత్తయేనుఁగు)............

'గడాదిః' (కర్ణా. శబ్దా. ౪౯ సూ).

.........గడాది గణపఠితా శ్శబ్దాః స్వరేపరే వా ప్రకృత్యా తిష్ఠన్తి... ...
ఉదా. తాంగ్గడ అంగజం = (తానుగదా మన్మథుఁడు.)

"శ్లోకార్ధమ్" (కర్ణా. శబ్దా. ౫౦ సూ.)

శ్లోక శ్ఛన్దోబద్ధ కందవృత్తాదిః. తస్యార్ధమ్ = సమభాగః. స్వరాన్త శ్లోకార్ధం స్వరేపరే ప్రకృత్యా తిష్ఠతి.

'అనుకరణమ్' (కర్ణా. శబ్దా. ౫౧ సూ).

స్వరాన్త మనుకరణం స్వరేపరే వా ప్రకృత్యా తిష్ఠతి.

ఉదా. యక్షోయాద్భ శ స్తాదృశో బలి ఎంబుక్తి.

'అద్వికృత్యా' (కర్ణా. శబ్దా. ౫౨ సూ.)

వికృత్యా అకార మనుకరణం స్వరే పరే నిత్యం ప్రకృత్యా తిష్ఠతి.

ఉదా. దమ్మెో ర్వినా యః క్రియతే స ధర్మ ఎంబు.....................

ప్లుతః ప్రకృత్యా॥ (కర్ణా. శబ్దా. ౪౧ సూ.)

ప్లుతసంజ్ఞకా వర్ణా స్స్వరే పరే ప్రకృత్యా తిష్ఠన్తి.

ఉదా. అక్కా 3 ఇల్లిబా = (అక్కా ఇచటికి రమ్ము)

'ఇ' (కర్ణా. శబ్దా. ౪౨ సూ.)

ఋ వర్ణే ఌ వర్ణే చ పరే స్వరః ప్రకృత్యా తిష్ఠతి—

ఉదా. అయనద ఋతు = (అయనము యొక్క ఋతువు) ఆ ఋకారం = (ఆ ఋకారము).

"ఆదే" (కర్ణా. శబ్దా. ౪౩ సూ.)

ఆ కారః అవర్ణేపరే ప్రకృత్యా తిష్ఠతి.

ఉదా. ఆ అరసం = (ఆ రాజు) .... .... ఐదౌతోః విశ్లిష్ట వర్ణత్వాత్తత్రైవ భవతి—ఆ ఐశ్వర్యం = (ఆ యైశ్వర్యము). ఆ ఔన్నత్యం = (ఆయౌన్నత్యము).

'నిపాతాః' (కర్ణా. శబ్దా. ౪౪).

నిపాతాః స్వరే పరే ప్రకృత్యా తిష్ఠన్తి. ఉదా. అరమె అరల్ద తావరె = ఒకటి, వికసించిన కమలము; (లేదా) ఇంచుక వికసించిన కమలము.

అరె ఎడె వా స్తి శిశుణ పిచశుణర్ = ఒకచోట గజ శిశువులు.

'ఓనిపాతే' (కర్ణా. శబ్దా. ౮౫).
అవర్ణో నిపాత స్వరేప రే ప్రకృత్యా తిష్ఠతి—
ఉదా. ఆ తప ఎ అతసి యొక్కయే—

(౫౦౫)—సంస్కృతభాషలో వెనుక నుదాహరించిన రీతిని బదాంత స్వరసంధిలో వచ్చెడి యలఘు యవల చోట లఘు యకార వకారము లాదేశముగ వచ్చునపుడె యవి సార్వత్రికముగా నిల్చును. అచటి పాక్షికములగు నలఘు యకార వకారములు కొన్ని యెడల లోపించుటయు నట్లు లోపించు నపుడచటి స్వర సంహితను (బకృతి భావముగాఁ (శుద్ధ స్వరములుగానే) బలుకుటయు సంప్రదాయమ్మై యున్నది.

"లోప శ్శాకల్యస్య" (౮-3-౧౯) అవర్ణ పూర్వయోః పదాన్తయో ర్యవయో ర్లోపో వాఽశి పరే. పూర్వత్రాఽ సిద్ధమితి లోప. శాస్త్ర స్యాసిద్ధత్వా న్న స్వర సన్ధిః-హార ఏహి, హరయేహి; (హరే+ఏహి) విష్ణ ఇహ, విష్ణవిహ; (విష్ణో+ఇహ) శ్రియా ఉద్యతః శ్రియా యుద్యతః (శ్రియై+ఉద్యతః) గురా ఉత్కః, గురావుత్కః (గురౌ+ఉత్కః).

"ఓతో గార్గ్యస్య" (౮-3-౨౦) ఓకారా త్పరస్య పదాన్త స్యాలఘు ప్రయత్నస్య యకారస్య నిత్యం లోపః స్యాత్-గార్గ్య గ్రహణం పూజార్థమ్-భో అచ్యుత, లఘుప్రయత్న పక్షే - భోయచ్యుత - పదాన్తస్యకిమ్- తోయమ్" (సిద్ధాంతకౌముది - స్వాదిసంధి ప్రకరణము.)

ప్రాకృతభాషలోఁ గొన్ని శబ్దములలోఁ బదాదీతర హల్లు లోపింపఁగా నేర్పడిన స్వరసంహితలో "అవర్ణద్వయ" మధ్యమున మాత్రమె లఘుతర యకారశ్రుతి కలుగునని చెప్పఁబడియున్నది. కాఁగా దక్కినచోటులందెల్ల స్వర సంహితతోనె శుద్ధ స్వరోచ్చారణముతోనె పలుకవలయునని విశదమగుచున్నది.

"యశ్రుతిరః" (౧-3-౧౦) ప్రాయో లుగిత్యాదినా కాదీనాం లోపే సతి యో అవశిష్యతేఽవర్ణః స అవర్ణాత్పరో లఘు ప్రయత్నతర యకార శ్రుతి ర్భవతి - (ఆ అవో) = ఆయవో = (ఆతపః) = (ఎండ). (అవర్ణపూర్వకత్వ మాత్రముననే కాదులచోట యత్వ మాదేశమగు ననుచు 'యత్వమవర్ణే' అని చండుఁడు సూత్రించెను. (చండవ్యా. 3 విధా. 3౯ సూ.) ఉదా-పి అ ఇ = పియ ఇ = (పిబతి).

తెలుఁగునందట్లుగాక స్వరమాత్రమునకుఁ బరమగు స్వరమాత్రము యశ్రుతిగల దగుననియు నట్టి యకారము లఘూచ్చారణము గలదగు

ననియుఁ బ్రకృత చింతామణి సూత్రము సమర్థించుచున్నది. అన్యసహిత స్వరోచ్చారణము శ్రమసంపాదకమును, సమయాపహమును, నగుటచేతఁ దెనుఁగున నట్టి స్వరసంహితత, నిత్యముగను సార్వత్రికముగను లఘు యకార వ్యవధాపితమై యుండుననిఁ బ్రకృత చింతామణిసూత్ర సిద్ధాంతార్థము నున్నది.

(౧౦౬)—పరరూపసంధి రానట్టి స్వరద్వయముల నడుమ యకారము వ్యవధాయక మగునని చెప్పెడి యీ సూత్రము సంధిప్రకరణములోఁ జెప్పఁదగిన దైనను సంధ్యక్షరముల లఘ్వలఘుత్వములను నిరూపించు నీ ప్రకరణములోఁ జెప్పుట సైతము సుసంగతమే యగుచున్నది.

'వూరు, వొకటి, వోడ, మున్నగు వ్యావహారిక శబ్దములలోని వకారము 'ఆయూరు, అదివొకటి, తెప్పవోడ' మున్నగురీతిని సంధివేళలం దగపడమింజేసి యది శబ్దసిద్ధము కానిదియు నప్రసిద్ధ పదాది నుచ్చరించుటలో వకారముగఁ బల్కుట యపభ్రష్టమే యనియుఁ దెలుపుచున్నట్లు 'యెన్నఁడు, యేఁబది మున్నగు చోటులందును "అతఁ డెన్నఁడును రాఁడు, దానిలో నేఁబది" మున్నగురీతిని యకారము సంధిలో నిలువమింజేసి యదియు నపభ్రష్టోచ్చారణ సిద్ధమే యనవలసివచ్చుచుండఁగాఁ జింతామణికర్త పదాది యకారమును సాధువుగా నంగీకరించిన వాఁడగుటంజేసి (సూ. ౧౦౫) యను యపభ్రష్టమను నభిప్రాయమును వారించుచుఁ బదాది యకారము నిలువనియు నది యలఘు యకార మనిపించుకొననియుఁ బ్రకృతకారికలోఁ బూర్వార్ధమున సుసంగతముగ విశదపఱచియున్నాఁడు. అట్టి వ్యావహారిక స్థితికిఁ బ్రామాణ్యము నిచ్చునపుడు "యన్నఁడు, యాఁబది (యాంభై)" మున్నగు వాడుకలను బట్టి వానిని 'అ' వర్ణయుత యకారము లనఁదగియున్నను సంధివేళలలో నయ్యవి "వాఁ డన్నఁడును రాఁడు, దానిలో నాఁబది" మున్నగురీతిని 'అ' త్వయుతములుగ నుండక "వాఁ డెన్నఁడును రాఁడు, దానిలో నేఁబది" మున్నగురీతిని 'ఏ' త్వయుతములయి వెలయుచుండుటం జేసి, యవి యట్టి "అత్వము" అపభ్రష్టమని నిరాకరించుటకయి చింతామణికర్త సందేహనిర్ణాయకముగాఁ బదాదిని 'అ' వర్ణయుతాలఘు యకార మనఁగా శబ్దావయవ యకార ముండ నేరదని సైతము ప్రకృతసూత్రమున సుసంగతముగ విశదపఱచియున్నాఁడు.

మఱియు "యెన్నఁడు = యన్నఁడు, యేఁబది = యాఁబది, పోయెను = పోయను. ఆయెను = ఆయను" మున్నగుచోటులలోని యకార మత్వ విశిష్టమా? అత్వవిశిష్టమా? అను సందేహమును నివారించుటకు మాత్రమే ప్ర

కృతసూత్రము రచింపఁబడెను; కాని, ప్రకృత సూత్రోక్త స్థలేతర స్థలములందెల్ల యకార మత్వయుతమె యని నిర్ణయించుటకుఁ గాదని గ్రహింపవలెను. అట్లు కానిచో "చెయిది, చెయువు, చేయుట, పోయిరి, పోయి" మున్నగు 'అ' కారేతర స్వరయుత యకారస్థలములెల్ల విరోధించును గదా.

(౫౦౭)—బాలసరస్వతియుఁ బ్రకృతసూత్రమునకు నెత్వాత్వముల సందేహమును నిర్ణయించుటయె ప్రధానోద్దేశముగ వ్యాఖ్యచేసియున్నాఁడు.

"క్రియాసు = క్రియాపదములందు, భూతార్థద్యోతితమ్ = భూతార్థములందుఁ గనుపించునదియు, ఆద్యగమ్ = నామాదినుండునదియు, నగు యకారమును వినా = వినాఁగా, సర్వః = సమస్తమైన, యః = యకారము, అత్ = తలకట్టునుట. వసియె వినియె నను నివి మొదలగు క్రియాభూతార్థస్థిత యకారములను యెలమి, యేమి, యేలాగు, యెచటికి, యెంతయును, నివి మొదలఁగు నామాది యకారములను వినాగా మిగిలిన యకారములన్నియుఁ దలకట్టుగాఁ దెలియునది. ప్రాణతః = అచ్చుకంటె, పరమ్ = పరమైన, ప్రాణమ్ = అచ్చును, యశ్రుతిమ్ = యకారము వినఁబడుదానిఁగాను, లఘు యమ్ = లఘుయకారముఁగాను, ఆర్యాః = పెద్దలు, ప్రవదన్తి = పలుకుదురు - (బాలసర. 17-18. సూత్రముల వ్యాఖ్య)"

అకారమేకాక, 'ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ, (ఐ)' అను నచ్చులతోఁ గూడిన సంహితాగమ యకారములెల్ల (అదియా, అదియు, అది యూరు, మొ.) లఘు యకారములె యై యుండఁగాఁ బయిరీతిని "మిగిలిన యకారములన్నియుఁ దలకట్టుగాఁ దెలియునది" అని వ్రాయుట దక్కిన స్వరముల చోట సందేహము గలుగదను తలంపున 'అకారమును' మాత్రమట్లు వక్కాణించెనని తోఁచక మానదుగదా. అట్లు కానిచో 'చెయిది, చెయువు, చేయుట,' మున్నగు చోటులందెల్ల యకారము తలకట్టు గలదనియే యాతఁడసంగతముగ వ్రాసి నసవలసి వచ్చునుగదా.

(౫౦౮)—ప్రకృత సూత్రము నప్పకవి తెల్గించుటలో నయిత మిట్లు దీనిని సందేహ నిర్ణయ విషయకముగనె యెంచి యున్నాఁడు.

"అద్యః క్రియాసు భూతా ద్యర్థ సముద్ద్యోతినం వినా సర్వః".

సీ. ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు ప్రాణమై యది గనుపట్టుఁగాని।
నుడుగుల నడుమను గడను యాకెందును దలకట్టు దక్క నెత్వంబులేదు।

వికృ:— భావి క్రియాసు యస్య స్యా. దేత్వ మేవ ప్రయోగతః
డోలా భూషో త్తరీయాణి, వినై త్వం నా స్తి మధ్యమే॥

---

యాఁకు భూతాది క్రియాద్యోతితములఁ జూపట్టు నెత్వము దలకట్టు గాదు।
తలకట్టు వక్రముల్ దాల్చు నీ రెంటను నలఘు యాకారంబు లమరఁగఁ బరఁగు॥
(అప్పకవీయము. ౨ ఆ. ౧౭౫. ప.)—

("ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థ ముండదు" అను విషయమును, "భూతాద్యర్థ సముద్ద్యోతిస" మ్మను చింతామణి సూత్రమునందును ముందు విమర్శింపఁ బడును.)

(౫౦౯) వ్యాఖ్య:—భావీత్యాది:—అథగ్రంథకారుండును 'అద్య' ఇత్యాది చింతామణి కారిక యకారము మీఁద నెత్వాత్వములను నిర్ణయించుచున్న దనుతలంపుతోనె దానిని వివరించుచుఁ జింతామణిలోఁ జెప్పఁబడని పరిశిష్ట విషయములను జూపుచున్నాఁడు.

భావి క్రియాసు = భవిష్యదర్థక క్రియలందలి, యస్య = యకారమునకును, ప్రయోగతః = పోయెదను, పోయెను, పోయెడి మున్నగు ప్రయోగములవలన, ఏత్వమేవ = ఎత్వమె, స్యాత్ అగును - పోయదను మున్నగు రీతిగల వానిక లపభ్రష్టములనుట. భావిక్రియలలో "చేయుదును, పోయుదువు" మున్నగు నుత్వవిశిష్ట యకారములు సైతము వెలయుచున్నను, నచట సందేహము కలుగదనియు 'ఎత్వాత్వ' సందేహ విషయము నందే నిర్ణయించుట యావశ్యకమనియుఁ దలంచి యీరీతిని జెప్పెననుటకు సందియములేదు గదా. ఇట్లె నామములందును నెత్వాత్వ సందేహ సిద్ధాయకముగా సూత్రించుచున్నాఁడు.

(౫౧౦)— వ్యాఖ్య - డోలేత్యాది - డోలా = డోలార్థకమగు 'ఉయ్యెల' శబ్దమును, భూషా=భూషాశబ్దార్థకమగు, 'తాయెతు' శబ్దమును, ఉత్తరీయాణి=ఉత్తరీయ శబ్దార్థకమగు 'పయ్యెద' శబ్దమును, వినా=విడువఁగా; మధ్యమే = నామపద మధ్యభాగ గత యకారము మీఁద, ఏత్వమ్=ఎత్వము, నాస్తి = లేదు. 'ఉయ్యాల, పయ్యాద' అను రూపములు సైత మధర్వణుని నాఁటికిఁ గవి ప్రయోగ గౌరవము నందలేదని యెఱుంగునది.

తర్వాత భాస్కర శ్రీనాథాదు లట్టివాడుక పదములకును గ్రాంథికతా గౌరవమును బ్రసాదించిరి. అట్టి ప్రయోగములను జూచికొనక ముద్దరాజు రామనాదులు పయి వికృతి వివేక కారికను బండిత పరంపరాయాతముగా విని

స్వగ్రంథములందుఁ గల విషయములను సూత్రించుటయుఁ దరువాతి కూచిమంచి తిమ్మకవి యట్టివారి సూత్రముల కతిచారమును జూపుటయు సంభవించెను.

తే. తాయెతులు నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ ।
గలుగ దెత్వంబు మధ్య యకారమునకుఁ ।
దుదిని గ్రియఁ దక్క నెత్వంబు గలుగ దాది ।
నత్వ మొందదు దెలుఁగున నబ్జనాభ. ............(కవిసంజీవని)

తే. తాయతులు నుయ్యలయుఁ బయ్యదయుఁ ననఁగఁ ।
గలుగ దత్వంబు మధ్య యకారమునకు ।
ననుచు మును ముద్దరాజు రామన వచించెఁ ।
గాని యత్వంబు గృతులందుఁ గలదు శర్వ.

ఉయ్యాల యని 'అత్వము' వచ్చుటకు—

సీ. గీ. ........ । అబ్జనాభుని తూఁగు టుయ్యాలలు గంటె ।
.... .... .... (భీమ ఖండము.)

క. ఉ । య్యాల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె నావర శిశువున్. (కళా)

శా. ఉ। య్యాలో జొంపము లంచుఁ బాడుదురు భిల్లాంభోజ పత్రేక్షణల్. (చాటుధార)

చ. కదరిన వేడి బొప్పములు.........ప।
య్యెద దడియంగఁ గానఁబడె నంచిత నిర్మల రత్నభూస్థలిన్.
(భాస్కరరా. సర్వలక్షణసార సంగ్రహము ౧ ఆ. ౧౯౫-౧౯౭)

(౫౧౧)—తిమ్మకవికిఁ బూర్వుఁడె యయ్యు నప్పకవి, పయి రీతిని ప్రయోగ విశేషములను వెదకి యుదాహరింపలేదు. మఱియు నానిలో వక్రస్థితియున్న మాట నిజమె యనియుఁ జెప్పెను. కాని, పయి శబ్దములు సమాన పదములు గానవియు సమాస పదములనియు నకారణమున నామపదమధ్యమున నెచ్చటను నెత్వ విశిష్ట యకారము గలదని యంగీకరింప నక్కఱలేదనియు నీ క్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

తే. గీ. ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను ।
గల యకారంబులకు వక్రములు నిజంబు ।
ముద్దరాజు రామన వాని మాఁటని బద ।
మధ్య యాలని చెప్పె నిమ్మాట మిథ్య. ౧౭౮

తే. గీ. [illegible]
[illegible]
[illegible]
తెలుంగు [illegible] ౧౮౫

వ. హేలా శబ్దమునకు [illegible] అనుచు కాకువు చేయఁగా హ్రస్వముగాఁ [illegible] 'ఎల' [illegible]. [illegible] శబ్దమునకుఁ దద్భవము 'ఎద' ఆయెను. దానికి.....ప్రతి [illegible] యాయెను.

('ఎడపయి [illegible]' అనునది ప్రతిసమాసము.)

ఎత్తులనఁగా దక్షిణ దేశమున నుండు [illegible]. [illegible] దేలంబలికిన 'ఎతు' ఆయెను. తోయి యనఁగా నల్లి. ......

అట్లు గనుక శబ్దాగమున్నవి అచ్చులుగాని హల్లులుగాను. సంధిచేతను లఘు యకారములైనవి. ఇవి మూఁడును ప్రత్యేక పదములుగాని, యేకపద ములు గావు. వీనిని దెలియక ముద్దరాజు రామన, కవిలోకసంజీవనిలోను జెప్పి కొనిన పద్యము. ............ (అప్పక. ౨-౮-౧౮౬.)

అప్పకవి చేసిన యీ యాక్షేపణము ముద్దరాజు రామన మాట యటుండఁగా నథర్వణుని దాఁకుచున్నది. అప్పకవి చెప్పిన యవయవార్థము లెప్పుడు సరియే యని యంగీకరించు పక్షమున నయితేను, 'ఎల' శబ్దము హేలా శబ్దార్థముతోడను, 'ఎతు' శబ్దము రక్షాబంధార్థముతోడను దెలుఁగు నఁ బ్రసిద్ధములయి యుండమింజేసియు "పయి+ఎద" 'తోయి+ఎతు' అను జంటల సంధులు తెనుఁగు వ్యాకరణములలోఁ బ్రసిద్ధములై యున్న సంధి సూత్రములచే సాధించుట కవకాశము లేమింజేసియుఁ గ్రమముగ 'ఉయ్యాల, పయ్యెద' అను రూపాంతరములు వెలయుటంజేసియు వానిని బ్రత్యేక ప్రసిద్ధ ములగు రెండేసి శబ్దముల జంటలనుగాఁ జెప్పుటకు వలనుపడదుగాన, నీవిషయ మున నథర్వణాదుల కజ్ఞతను గల్పించుట సరియైయున్నట్లగపడదు. ఏకపద మనఁగా సమాసముగాన నవి యేకపదములు గావనుట బొత్తిగా సరిపడదు. ప్రత్యయాగమాదులు నయిత మెుకప్పుడు శబ్దాంతరములైయె యుండెడి వనెడి శబ్దతత్వ శాస్త్రజ్ఞ సిద్ధాంతము చొప్పున సమాసపదములు నైతము ప్రత్యేక శబ్దములజంటలె యని యంగీకరింపక తీరమింజేసి యప్పకవి సమాసపదము లనుకొనుచున్న 'పోయెను, పోయెదను' మున్నగునవి నైతము ప్రత్యేకశబ్ద మేళనసిద్ధములే యని యంగీకరింపక తీరదుగదా.

వికృ—ఆ ద్యవర్ణాస్తు హల్త్వేన నగృహ్యన్తే కదాపిచ
ప్రాణా త్ప్రాణో లఘు ర్యః స్యాత్ । స హల్భావచ్చ క్వచి ద్భవేత్
చే ద్యత్వం తస్య కల్ప్యం స్యాత్.... .... .... ....

---

ఇంక నప్పకవి యనుకొన్నట్లు లవి పృథక్ఛబ్దములె యనుపక్షమున నాంధ్ర దేశీయోచ్చారణమున నాద్యంతస్థాదులుగనె యుండఁదగియుండుటం జేసి యాతఁడను నట్టివి యజాది పదములనియు సంధివేళను వాని మొదట లఘుయకారము నిల్చుననియుఁ జెప్పి నన్నయభట్టును సైతమాక్షేపించుటకు వీలుపడదు గదా. ఆపక్షమున నవి యలఘు యకారాదులే యనియు సంధివేళను "సర్వత్రాజ్వదిత్యాది చింతామణి సూత్రముచేత నట్టి యలఘు యకారము లోపించుననియుఁ జెప్పుటలో ననుపపత్తి యేమియు లేదుగదా.

(౫౧-౨)—వ్యాఖ్య-ఆ ద్యవర్ణా స్త్విత్యాది :—

వ్యవహారమున సంధివశమున సంహితాకార్యముగా వచ్చిన 'అత్వవిశిష్ట పదాది యకారము లావయవికములు కామింజేసి యలఘు యకారము లనిపించుకొనఁజాలవనియు నవి లఘు యకారములనఁదగు ననియుఁ జెప్పుచున్నాడు. ఆది = అచ్చాంధ్రశబ్దము మొదటనున్న అవర్ణాస్తు. 'అ, ఆ,' వర్ణములు సంహితాకార్యభూత యకారవంతములయినను, కదాపిచ = ఎట్టియెడలనైనను హల్త్వేన = హల్లుగాననుట, నగృహ్యన్తే=గ్రహింపఁబడవు. ప్రాణాత్ =స్వరముకంటెఁ బరమైన, ప్రాణః=స్వరము, లఘుః, యః, స్యాత్ =లఘు యకారయుక్తమగును. సః = ఆ లఘుయకారము, క్వచిత్ =ఒకప్పుడు, హల్ భవేత్ = హల్లుగ నుపయోగింపఁబడవచ్చును. క్వచిచ్చ=ఒకప్పుడు, అచ్చుభవేత్ =స్వరముగనే యుపయోగింపఁబడును. చేత్ = అట్లు లఘుయకారమయినపుడు, తస్య = దానియొక్క, యత్వమ్= యకారరూపహల్త్వము, కల్ప్యం స్యాత్ = కల్పింపఁదగిన దగును. శబ్దసిద్ధము కాదని భావము. అనఁగా నచ్చాంధ్రపదాదినున్న స్వరము స్వరపరకత్వమున యకారవంతమయినను నట్టి యకారముచ్చారణ సౌకుమార్యార్థ కల్పితమెకాని పదాది యకారమనిపించుకొనదని భావము.

"ఆయతి వసుశోభనాకృతీ"త్యాది స్థలములలో "ఆ+అతివ" అనియు, 'ఆ+యతి' అనియు ఛేదమగుటంజేసి యచటి కల్పిత యకారమొకయర్థమున స్వరముగనే వాడఁబడినను నర్థాంతరమునఁ బదాది హల్లుగఁ బరిగణింపఁబడి

డనని మాత్రమె గ్రహింపనగును. ఇట్లు ప్రాకృతవ్యాకరణ కర్తలును యశ్రుతి శబ్దమును వివరించి యున్నారు.

‘యశ్రుతిరః’ (౧-౩-౧౦) ప్రాయో లుగిత్యాదినా, కాదీనాం లోపే సతి యోనశిష్యతే ఽ వర్ణః సః అవర్ణాత్పరో లఘుప్రయత్నతర యకారశ్రుతిర్భవతి. (ఆతపో = ఆయవో) ప్రాకృతపుస్తకములలో సైత మిట్లు యకారము వ్రాయక "ఆ అవో" అనురీతిని వ్రాయుట నిర్మూలమె యనుటకు సందియము లేదు. చండకృత ప్రాచీనవ్యాకరణమున "యశ్రుతి" అని చెప్పక యత్వమె యాదేశముగ విధింపఁబడెను. మఱియు, నిందులో ‘అ’ వర్ణద్వయ స్వరసంహితలో మాత్రమె యకారము వచ్చునని చెప్పఁబడలేదు. అవర్ణ పూర్వకత్వమాత్రమున ‘క’కారాదుల చోట యకారాదేశము విధింపఁబడెను.

"యత్వ మవర్ణే" (చండ. వ్యంజనవిధానము. ౩౧ సూ.) "కకారవర్గ తృతీయయో రవర్ణే స్థితయోః, పరే యత్వం భవతి. కాకాః = కాయా. నాగాః = నాయా. ..."

అహోబలపతియు నీ విషయమునఁ దెనుఁగులో యకారాగమము వచ్చునని యే వ్యాఖ్య చేసియున్నాఁడు. "క్రియాసు భూతార్థప్రకాశకం నామాద్యాగం చ యకారం వినా, యః, అత్ = అకారవాన్ భవతి" (అహో. ౧౫౦ పుట.)

అకారవత్త్వార్థము సులభముగా నుండునని నేను "అద్యః" అనుదానిని సమాసపదముగ వ్యాఖ్యచేసితిని. అట్లయినను, అత్ = అకారవాన్, అను నహోబలపతి వ్యాఖ్యయు సరియే యనఁదగును. చింతామణికర్త స్థలాంతరమున నట్టి ప్రయోగమును జేసి యున్నాఁడనక తీరదు. "అ ద్దంత్యా స్తాలవ్యా శ్చ ర్వ్యాక్రః॥ (ఆం. చిం.)

(౫౧౪):—"ఆద్యవర్ణాస్తు..." అను కారిక కహోబలపతి పయిరీతి నర్థముచేసికొనలేదు. పదాది యకారము తెల్గున సమ్మతముకాదని యథర్వాణుని సిద్ధాంతముగ నంగీకరించెను. "వికృత్యాదిగతో యోఽత్ర।స్యా చ్ఛబ్దాన్తరయోగతః। ప్రాణమాత్రావశేష స్స్యా। దత్ర శ్రీకవిసమ్మతేః" అనియిట్లథర్వణుఁడు శ్రీకవిమతమును వివరించి యుండుటచేత నయ్యది పదాది యకారమథర్వణమతము కాదను పక్షమునకు బాధకము కాదని సమర్థించుకొనెను.

"అప్పకవి పుస్తకేతు "అద్యః క్రియాసు భూతాద్యర్థ సముద్ద్యోతినం వినా సర్వః ఇతి పాఠః స్థితః. ఆదిశబ్దేన పోయెదన్ చనియెదన్ ఇత్యాదావేత్వం సిద్ధమ్. పూర్వపాఠే త్వేత న్నగృహ్యతే; కల్పనాగౌరవమపీ హాపాద్యతే; నచో

చ్చారణ లాఘవమేవ తస్య ప్రయోజనమ్, తదర్థం కల్పనా గౌరవ మఙ్గీకార్య మితి వాచ్యమ్. తదభావేపి బాధకాభావేపి తదపేక్షయాం తత్కల్పనా గౌరవ స్యానుచితత్వాత్. అద్యవర్ణాస్తు హ్రస్వేన । నఖ్యాత్యైస్త్వ దావసీ చే త్యథర్వణా చార్యస్య స్వసిద్ధాన్తవచనాచ్చ. తస్మా దప్పకవి పుస్తకపాఠ ఏవ సాధురితి ప్రతిభాతి. సర్వ త్రాజ్వ త్యాద్యర్యమితి సూత్రం తు తత్పుస్తకే సన్నిత్యాత ఏవ తేన 'ఎవ్వఁడు' ఇత్యాదౌ యత్వాభావాదౌ న పండితా న్యాద్యయంగమమ్. కించ 'వికృతి పదాదౌ ప్రథమా । స్వస్త త్వితీయానునాసికౌ సప్త । స్వేచ్ఛదని సప్త ఉదాత్తా । దన్త్యోష్ఠభవస్య వికృతి స్వ్యాదా' ఇతి చ తత్పుస్తకే స్థితమ్."

(అహో. ౧౫౫-౧౫౬ పుటలు.)

ఈసందర్భమున నహోబలపతి బొత్తిగ 'ప్రమాణ' పడిన ట్లగపడు చున్నది. అప్పకవిపుస్తక పాఠము చింతామణి కి గ్రభిన్నమగునా? కాదా? యను విచారణమే చేయలేదు. ఆపాఠము బాలసరస్వతికి లభించిన చింతామణి పాఠమునకన్న యుక్తముగా నున్నదను మాత్రమె చెప్పు చున్నాఁడు. అట్టి యుక్తతను సాధించుటలో నాధారముగఁ జూపిన "అద్యవర్ణా స్త్వి"త్యాద్యథర్వణ వచనము నాప్రాసనరీతిని సమన్వయింపదని యుండుట చేత నది బాలసరస్వతీయ పాఠమున కనుకూలము గాదు, నది యప్పకవికి సాధకము కానేరదుగదా. ఉచ్చారణ లాఘవమును సపేక్షించి కల్పనాగౌరవము నంగీకరింపనగు ననెడి కోటి నెత్తియు దానిని సరిగ నాదింపక యే విడిచెను. లోక వ్యవహారమే భాషాస్థితిగ్రహణమున కాధారమై యుండు కాలమున 'యెవ్వఁడు' మున్నగు రీతిని నాడుకలో బదాది యకారము ప్రసిద్ధమై యుం డఁగా ద్రావిడ భాషాంతరములలో నయితేము వెనుక ప్రాసనరీతి నట్టియెడల యకారస్థితిగూఢమై (౫౧౭.వి.)యుండఁగా నట్టిస్థితి నంగీకరించి సంధికాలమునఁ బ్రయోగములలో నయ్యది యగపడనింౙేసి తల్లోపము సూత్రించుట యుక్త ముగాని ప్రక్రియాలాఘవమునకయి వెతికిగిన సహజస్థితికి విరుద్ధముగఁ బ్రక్రియాకల్పనముచేయుట యుక్తముకాదు గదా. మఱియు నప్పకవి పుస్త కములో 'సర్వత్రా జ్వది'' త్యాది కారికలేదని యహోబలపతి వ్రాయు టయు వింతగనె యున్నది. అప్పకవీయములో సర్వత్రాజ్వదిత్యాది కారి కయు దాని కాతఁడు స్వమతానుకూలత ఘటింపఁగోరి మార్గాంతరమునఁ ౙేసిన వివరణమును వెలయుచునే యున్నవి. అప్పకవీయ పాఠ విచారణ యుక్తాయుక్తతలు ముందు విపులముగ విమర్శింపఁబడును.

మఱియు "సర్వ త్రాజ్వ త్యా ర్య మితి సూత్రంతు తత్పుస్తకే న దృశ్యత ఏవ" అను వ్రాతనుబట్టి చూడఁగా నట్టి 'సర్వత్రా జ్వది' త్యాది కారికయుఁ దదనుకూలమగు "అద్యః క్రియాస్వి" త్యాది ప్రకృత సూత్ర ములోని "ఆద్యగమ్" అను దళమును జింతామణి కర్తృ కృతములు కావ నియు నహోబలపతి తలంచినట్లు ధ్వనిత మగుచున్నది. ఆ పక్షమున నాతఁ డనుకొన్నట్లు శ్రీ కవిమతముచేతనయినను నథర్వణుఁడు సంధివేళలోఁ బదాది యకార లోపమును "వికృత్యాదిగతో యోత్ర। స్యాచ్ఛబ్దాన్తర యోగతః। ప్రాణమాత్రావశేష స్స్యా। దత్ర శ్రీ కవిసమ్మతేః॥" (అహో, ౧౫-౨పుట) అని యిట్లు సూత్రింపవలసిన ప్రసక్తి యేమో తెలియరాకున్నది. ఇంతియ కాక యప్పకవీయపాఠమే చింతామణికర్తృకృత మను పక్షమున "భూతాద్య ర్థేత్యాది శబ్దము" చేతనే 'హోమెద' నిత్యాది భావిక్రియా కథనము లభించుచుండఁగా "భావిక్రియాసు యస్య స్యా। దేత్వమేవ ప్రయోగతః" అని యథర్వణుఁడు క్రొత్తగాఁ బూరించుచున్నట్లు సూత్రింపనేల? అట్లే యప్ప కవీయ చింతామణిలో "వికృతి పదాదా ప్రథమాన్తస్థ తృతీయానునాసికా న్తః" అని యుండుటయే నిజమైనఁపు డథర్వణుఁడు మరలఁ బునరుక్తముగ "ఆద్య వర్ణాస్తు హాత్త్వేన। సగృహ్యాన్తే కదాచిచ" అనుకారిక నహోబలపతి యనుకొన్న యర్థముతో సూత్రించి యుండుట యెట్లు పొసఁగును? అట్లే "వికృత్యాదా భవే న్నణః" అనుదానిని నైత మథర్వణుఁడు సూత్రింప నేల?

పయి సందర్భమునుబట్టి యథర్వణుని నాఁటికిఁ జింతామణిలో "అద్యః క్రియాస్వి"త్యాది ప్రకృత సూత్రములో 'ఆద్యగమ్, అను దళమును "సర్వ త్రా జ్వత్యార్య" మిత్యాది కారికయు వెలయుచుండెననియు "భూతా ద్యర్థ సముద్ద్యోతిన" మ్మను పాఠమును "వికృతి పదాదా వి" త్యాది కారి కయు నర్వాచీనముగఁ బ్రక్షిప్తము లయ్యెననియుఁ జెప్పుటకు సందేహము లేదు.

వెనుక వివరించిన రీతిగ "ఆద్యవర్ణాస్త్వి" త్యాది కారికకు "ఆద్య గమ్మ"ను చింతామణి పాఠమునకు నవిరుద్ధముగ నర్థము సందర్భపడియుండు టంజేసి యథర్వణునకు పదాది యకార నిషేధ తాత్పర్యము గలదని కల్పిం చుటకుఁ బ్రసక్తి లేదు. అథర్వణుఁడును సర్వత్రాజ్వదిత్యాది చింతామణి కారికకు ద్రుతపూర్వక సంధిలోఁ బదాది యకారము స్వర సదృశమగునని యర్థము చేసికొన్నవాఁ డగుటచేత ద్రుతపూర్వకత్వమునందే కాక, ఉకా

వికృతిపదాదా విశ్వ్యాది కారికకును సర్వత్రాజ్వాదిత్యాది కారికకును సాం
గత్యము నప్పకవి కల్పించిన ట్లాతని యీ క్రింది యాంధ్రీకరణమువలన
విశద మగుచున్నది.

ఉ. ఆరయ నప్పకృష్ణోక్తులఁ బదాదులయందు యకార ముండ దా।
తీరునఁ బల్కు ద్రావిడ గణుతింపఁగ నచ్చగు దాని డాఁపలన్।
నీరజనాభ నాంతములు నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చె।
న్నారు నితండు నైద్య వసుధాధిపు నేపడఁగించె నేఁడనన్.

(అప్ప. ౫ ఆ. ౮౦ ప.)

క. శృంగాంత్య వక్రయుగముల। సాంగత్యము వాకు నాంధ్రసంస్కృతముల నా।
దిం గలుగ దట్టి ద్రావిడ ధారం గలయు ద్రుతాంతములను బ్రాణము లట్లన్.

కం. ముంగా మురుగులు నాలుగు।
నుంగరములు మూఁడు నేడు నొడ్డాణంబుల్. (అప్ప. ౫. ఆ. ౮౨-౮౩ ప.)

ఇట్టి యప్పకవీయ సమన్వయ మెంతమాత్రమును సరికాదు. వ్యావ
హారికపదములను మూలముగా గ్రహించి వానినుండి గ్రాంథికరూపములను
సాధించు ప్రక్రియ చింతామణిలోనే కాక యే వ్యాకరణమునందును లేదు.
రాముఁడుచేత మున్నగు వ్యావహారికరూపములను మూలముగాఁగొని రాముని
చేత మున్నగు గ్రాంథికరూపములను సాధించుట యదృష్టచరము. మఱియు
నట్టి యప్పకవీయ పద్ధతియే చింతామణికర్తభిప్రేతమైనయెడల నప్పకవివలెనే
యాతఁడును 'సర్వత్రాజ్వాది'త్యాది సూత్రముచే 'యెవరు' మున్నగు శబ్ద
ములలోని యకారమునకు సంధివేళను లోపమును సూత్రించినట్లె వూరు
మొదలగు శబ్దములలోని వకారమునకు సైతము సంధిలో లోపమును
సూత్రించి యుండఁడా ?

(౫౧౮):—ఇఁక 'వూరు' మొదలగుస్థలములం దెట్లు పదాది వకారము
వ్యవహారస్థమై యున్నను సంధివేళల నిలువమింజేసి పదావయవముగా నంగీ
కరింపఁబడలేదో యట్లే 'యెవరు' మున్నగు చోటులందు సైతము పదాదిని
వ్యవహారస్థమైయున్న యకారము సంధివేళ నిలువనికారణమునఁ బదావయవ
ముగా నంగీకరింపరాదని శంకింపరాదు. ఈవిషయమున యవలకుఁ గొంత

సామ్య మున్నను గొంత భేదమును గలదు నున్నది. లోకవ్యవహారమునుబట్టి శబ్దములను గ్రహింపక తీరకున్నను యథాస్థితముగా వ్యావహారిక స్థితిని గ్రహించుటకును వలనుపడదు. ఆవిషయమున నైయాకరణులు కొన్ని నియమములను బాటించుట సంప్రదాయమై యున్నది. 'ఒకయూరు' మున్నగు స్థలములందు పూర్వప్రభృతి శబ్దముల యకారము నిలువకుండుటయేకాక యాచోట యకారము నిల్చుచున్నది. 'యెప్పుడు' మున్నగు స్థలములలోని పదాది యకారమున్ననో 'అదియెప్పుడు,' మున్నగురీతిని సంధిలో ననేకస్థలములందు నిల్చుటయు 'అదెప్పుడు, వచ్చెనెప్పుడు' మున్నగు కొన్ని స్థలములలో లోపించుటయు మాత్రమే కలదు గాని దానికి బదులుగా వేఱొక సంహితా వ్యవధాయక వర్ణము నిల్చుటలేదు. ఇంక నట్టియెడల 'అదియెప్పుడు' మున్నగు చోటులందు సయితము సహజ యకారము పోవుచునే యున్నదనియు నాగమ యకారము వచ్చుచున్నదనియు గదా చెప్పవలయును. అంతకంటె సహజ యకారమె నిల్చుచున్నదనియు 'అదెప్పుడు' మున్నగు చోటులందు మాత్రమె లోపించుచున్నదనియుఁ జెప్పుట యుక్తియుక్తము కాదా? 'అది యతఁడు' మున్నగుస్థలములందుఁ బ్రత్యేకావస్థలో 'అతఁడు' మున్నగు చోటులందు యకారస్థితి లేనందున నచట యకారాగమము చేయుటయుక్తము గాని యెప్పుడు మున్నగుచోట్ల సహజముగా నున్న యకారమును విడిచికొని వేఱు యకారాగమము చేయవలయుననుట యుక్తముకాదుగదా. పదాదియకారమువలెఁ బదాది వకార మెన్నఁడును సంధివేళలందు నిల్చియుండనేరదు గదా.

(౫౧౭)— 'యెవ్వఁడు, యెన్నఁడు, యేబది,' మున్నగు శబ్దములలో యకారోచ్చారణము గలదనుటకు, వాని పరిణామములు 'యవ్వఁడు, యన్నఁడు, యాభై' అను నాకారములతో వెలయుచుండుటయె ప్రబలనిదర్శన మనవచ్చును. అవి 'ఎ'కారాదికములుగనే వాడఁబడియున్నచో నట్టి పరిణామములు సంభవింపనేరవుగదా.

ఎత్వవిశిష్ట పదాది యకారోచ్చారణము నాఁటిదియు నేఁటిదియుఁ గాక మిక్కిలి ప్రాచీనమై యున్నదనియు నద్దాని పరిణామము లనఁ దగునవియు వానికిఁ బరిణామములనఁ దగినవియుఁ దమిళ కర్ణాటభాషలలో నగపడుచుండుటంజేసి చింతామణికర్త "ఎ" త్వవిశిష్టపదాది యకారాంగీకారము చేయుట యుక్తమెయని చెప్పవచ్చును.

| సన్నయాంగీకృత శబ్దములు. | తమిళము | కన్నడము | అర్వాచీనాంధ్ర వైయాకరణ సమ్మతములు. |
|---|---|---|---|
| యేను | యాన్ | ఆన్ | ఏను |
| యేఱు | యాఱు<br>ఆఱు | ... | ఏఱు |
| యేనుఁగు | యానై<br>ఆనై | ఆనై | ఏనుఁగు |
| యేఁడు | యాణ్డు | ... | ఏఁడు |
| యేలు | ఆళ్ | ఆళ్ | ఏలు |
| యెఱుఁగు | అఱి | అఱి | ఎఱుఁగు |
| యేయది<br>యేఁది | యావదు<br>యాదు | ఆవుదు | ఏయది |
| యేవారు<br>యెవరు<br>యేరు | యారు | ఆర్ | ఏవారు |
| యేవాఁడు<br>యెవఁడు | యావన్ | ఆవన్ | ఏవాఁడు |

పయివానిలో యకారయుక్తములగు నెత్వవిశిష్ట పదాది యకారరూపములు ప్రాచీనములనియు, నట్టి యెత్వవిశిష్ట యకారయుతశబ్దముల పరిణామముల త్వవిశిష్ట యకార ఘటిత శబ్దములనియు వానిపరిణామములు లుప్తపదాది యకారకశబ్దము లనియు శబ్దతత్వశాస్త్ర సంప్రదాయముచొప్పున నంగీకరింపకతీరదు గదా. 'యేఱు' మున్నగు శబ్దములందలి పదాదిస్థ తాలవ్యములగు యకారముల మీఁద మరలఁ దాలవ్యాచ్చగు నెత్వము పలుకుటకంటె నట్టి 'ఎవర్ణము' వానియందలి కంఠ్యత మూలమున 'అ' వర్ణముగాఁ బలుకుట సుఖతరముగా నుండు ననుటకు సందేహములేదుగదా. ఇట్టి పరిణామము నందిన 'ఆత్వ' విశిష్టపదాది యకారములు తమిళమున దొల్కాప్పియరు నాఁటికే గ్రాంథికతావస్థ నందఁదగిన సాధు వ్యవహారస్థితి నందుటచేతఁ గావలయు నాతఁడు వాని సాధుత్వము నీ క్రిందిరీతిఫి సూత్రించెను.

"ఆవో........" (తొల్కా. ౬౫ సూ.)

యకారము 'ఆ'కారము తోఁగూడి పదాదిని నిల్చును.

ఇట్లే 'యాసదు' మున్నగు సంస్కృత శబ్దభవములైన పదములకు 'అవుదు' మున్నగునవి సాధువులనుచు గ్రంథకర్త సమర్థనగుచుండుటను సూత్రించి యున్నారు.

పయిరీతి నెత్వవిశిష్ట పదాది యకారయుత శబ్దములకు గాని వాని పరిణామములను సట్టి వానిపరిణామములును భాషాంతరములలోని సంస్కృత ద్వయాకరణులచేత గ్రాంథికములుగ సంగీకరింపఁబడుచుండుటను చింతామణికర్త తన నాఁటికి సద్వ్యవహారమునందుఁ బ్రశస్తప్రయోగములలోను సంధి స్థలములలోను వెలయుచున్న యెత్వవిశిష్ట పదాది యకారమును గ్రాంథికముగాను నావయవికముగాను సంగీకరించుట యుక్తమే యనుటకు సందేహము లేదుగదా.

(౫౮౮)— అద్యఃక్రియా స్వీత్యాది సూత్రమున "యెన్నఁడు–యన్నఁడు, ఆయెను = ఆయను," మున్నగు స్థలములందలి యకారలోపపరిస్థము లగు నెత్వాత్వములను నిర్ణయించు తలఁపుసు సూత్రింపఁబడినదగుటంజేసి 'ఇత్వ' విశిష్టపదాది యకారాంగీకార మందు స్మరింపఁబడలేదుగాని తుల్యన్యాయమున, 'యిప్పుడు, యిరువది' మున్నగుచోటులలోని పదాది యకారము సైతము గ్రాంథికమనియు, నావయవికమనియు నెన్నఁదగును. అట్లయిన 'యింద్రుఁడు' మున్నగు స్థలములందును, బదాది యకారము సంగీకరింపవలదా యని శంకింపఁజనదు. "యేధితము, యేకము" మున్నగు చోటులందువలెనే 'యింద్రుఁడు' మున్నగుచోటులందును వాడుకలో నే త్వేత్వములు యకారము మీఁద వెలయుచున్నను నవి సంస్కృత శబ్దములగుటచేతను నేటి యాంధ్ర వ్యవహారము సంస్కృత, శబ్దగ్రహణ సాధకము కాకుండుటచేతను సంస్కృత భాషాసంప్రదాయమునుబట్టి యట్టియెడలఁ బదాది యకారాభావము నిశ్చయింపఁదగి యుండుటచేతను వానిలోని పదాది యకారమును గ్రాంథికముగా నంగీకరింపకుండుట విరుద్ధము కానేరదు.

(౫౮౯)— ఈ పక్షమున నిట్టి పదాది యకారమును గ్రాంథికముగా నంగీకరించు నపుడు తుల్యన్యాయమున "వూరు వొకటి, వోడ," మున్నగు శబ్దములలోని యుచ్చారణసౌకర్యార్థకమెయగు వకారము మాత్ర మేల గ్రాంథికముగఁ జింతామణికర్త యంగీకరింప రాధని శంకింపఁజనదు. జన్యమాత్రము పరిణామ రూపమనుటలో విప్రతిపత్తి లేనప్పు డిట్టి శబ్దములలో నెవ్వి పరిణామ రూపములు కాకుండును? అట్లయినను దత్తత్కాల వ్యవహారస్థశబ్ద ప్రపంచము నుండి వానివాని సద్వ్యవహార యోగ్యతావిశేష తారతమ్యములనుబట్టి

వి :—వికృత్యాదౌ భవే న్న ణః

---

తత్తచ్ఛబ్దములకుఁ దత్తత్కాలిక పండితకవులు గ్రాంథికతాఽగ్రాంథికతల యెన్నికను జేయుచుండుట సంప్రదాయమగుటంజేసి యట్టి శంక కించుకేని యవకాశము లేదు.

తెల్గులో సరళోచ్చారణము విస్తరించియున్న నేఁడునైతము 'జల్లు' శబ్ద మసాధు వనియు 'చల్లు' శబ్దము సాధువనియుఁ దలంచుచున్నాముగదా. ఇట్టి వెన్ని లేవు ?

ఏయురీతినె యాయా శబ్దముల ద్రావిడభాషా చరిత్రమునుబట్టియు సాధ్వసాధుతా నిర్ణయముచేయుటకు వలనుపడును. సాధ్వసాధుతా నిర్ణయము తత్తత్కాలిక పండితాధీనము మాత్రమెయై యుండును. (ప్రాచీన ద్రావిడభాషలలో "అ ఇ ఉ" అనునవి ప్రాచీనతమ నిర్దేశక సర్వనామశబ్దము లనుట సర్వసమ్మతమైయున్నను, వాడుకలోని 'అదుగో, అరుగో, ఇదుగో ఇరుగో,' మున్నగునవి యపశబ్దము లనియు, వాడుకలోలేని "వాఁడుగో, వారుగో, వీఁడుగో, వీరుగో" మున్నగు నవి సుశబ్దములనియుఁ దలంపఁబడు చుండలేదా ?.)

(౫౨౦)—వ్యాఖ్య. వికృత్యాదావిత్యాది :—వికృత్యాదౌ = తద్భవ పదాదిని, ణః = ణకారము, నభవేత్ = కాదు ; ఉండదని భావము.

యకారము మీఁది యెత్వాత్వముల సందేహమును వారించు ప్రసంగమునఁ జింతామణి పదాది నత్వ విశిష్ట యకార ముండనేరదని సూచింపఁగా నద్దానిని సవరించుటలో నథర్వణుఁడును యకారవిషయమును వివరించి తత్ప్రసంగవశమునఁ దద్భవముల మొదట ణకారమును లేదని చెప్పెనుగాన నిది యప్రసక్తము కానేరదు.

అథర్వణుఁడు సంస్కృతభవములగు ప్రాకృతశబ్దములను సయితము వికృతులలోనె చేర్చినవాఁ డగుటంజేసియుఁ బ్రాకృతపదాదిని వైకల్పికముగ ణకారముండుట సుప్రసిద్ధమగుటంజేసియు నట్టి ణకార మట్టి వికృతుల మొదటఁ గొందఱ వాడుకలలో నగపడుటంజేసియు నట్టి సందేహమును వారించుటకయి దీని నుపదేశించె నని చెప్పఁదగియుండుటంజేసి యీనిషేధ మప్రసక్తమని కాని యసంభవ విషయ నిషేధ మనికాని యనావశ్యకమనికాని చెప్పుటకు వలనుపడదు.

ప్రాకృతభాషలలోఁ బదాది ణకారము గలదనుటకుఁ బ్రమాణము:—

(చి॥) నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్ ।

(వికృ) కశ్చి ద్వదతి సాజాత్యం । యథా వేవానయో స్తథా ।

అవద చ్చాత్ర సాజాత్యం । ప్రాసే ష్వపి చ కశ్చన ।

అనయో స్సజ్గతిం యస్తు । కరోతి కవితార్యతా ।

అస్యా అత్యన్త మిష్టత్వా । ద్దుష్యాపి స్పృహ రక్ష్యతే ॥

---

"ఆదేస్తు వా (౧-౩-౫౬.) ఇతి వ్యాప్యనువర్తతే. ఆదే స్సకారస్య ణో వా స్యాత్. నరః = ణరో = నరో ; నదీ = ణఈ = నఈ ;"

(షడ్భాషాచంద్రికా - ౫౫ పుట.

"నోణః" (వరరుచి - ౨ పరి. ౪ సూ.)

శ్లో॥ సర్వత్రాగ రయుక్తస్య । నస్య ణత్వం స్మృతః పరమ్ ।

సర్వత్ర నస్య ణత్వం స్యాత్ । ఏవం వాణం నదీ ణఈ॥

(వరరుచి కృత కాత్యాయన సూత్ర వృత్తిరూప ప్రాకృతమంజరి).

"వాదౌ" (౮-౧-౨౨౯ సూ.)

అసంయుక్తస్యాదౌ వర్తమానస్య నస్య ణో వా భవతి. ణరో=నరో (నరుఁడు.) ణఈ = నఈ (నది.) (హేమచంద్రుని శబ్దానుశాసనము.)

(౫-౨౧)—వ్యాఖ్య. నాన్యేషామిత్యాది:—అన్యేషామ్ = రేఫవ్యతిరిక్తములగు లఘ్వలఘు యవ ల లకు, వైధర్మ్యమ్ = యతిప్రాసవిరోధము, న=లేదు; - రయోస్తు = రేఫ అకారములకన్ననో, నిత్యం స్యాత్ = అట్టి యతిప్రాసవిరోధము నిత్యముగా నగును.

ఇచటఁ బరస్పర విరోధముగల ర ఱ లకేక శేషసమాస మెట్లు పొసఁగు నని శంకింపరాదు. ర ఱ లకు నన్న యనాఁడు లఘ్వలఘుతా భేదము మాత్రమే యుండుటచే వానిక వర్ణపార్థక్యము లేమింజేసి (౧ ౭. ౨౬౮. వి) సిద్ధమగు నేకశేషము వచ్చుట విరుద్ధము కానేరదు. సూత్రములోఁ జెప్పఁబడిన వైధర్మ్యము యతిప్రాసాది శబ్దాలంకార విషయముల మాత్రమె యని గ్రహింపవలెను - ఏకశేషసమాసము భిన్నాకారకములు భిన్నలింగములు మున్నగువానికి నిసమ్మతమేకదా.

"విరూపాణామపి సమానార్థానామ్" వక్రదణ్డశ్చ కుటిలదణ్డశ్చ = వక్రదణ్డౌ......'పుమాన్ స్త్రియా' (౧-౨-౬౭) హంసీ చ హంసశ్చ = హంసౌ; "వృద్ధోయూనా తల్లక్షణ శ్చే దేవ విశేషః" (౧-౨-౬౫) గార్గ్యశ్చ గార్గ్యాయణశ్చ గార్గ్యౌ......" (సిద్ధాంతకౌముది. ౨౦౦ పుట.)

(౫౨౨)—వ్యాఖ్య. కశ్చిదిత్యాది:—కశ్చిత్ = ఒకకవి, అనయోః = ఈ రేఫ అకారములకు, యతావేవ = యతి విషయమునందు మాత్రమె, సాజాత్యమ్ = మైత్రిని, వదతి = చెప్పుచున్నాఁడు; ప్రయోగించుచున్నాఁడనుట; కశ్చన = వేఱొకఁడు, ప్రాసేప్వపి చ= ప్రాసములందును, సాజాత్యమ్= మైత్రిని; అవదత్ =పలికెను; ప్రయోగించెననుట. అస్యాః = ఈ రేఫ అకార యతి ప్రాసమైత్రీఘటనము, అత్యన్తదుష్టత్వాత్ = గొప్పదోషమగుటచేత, యస్తు = ఏ కవి, అనయోః = ఈ రేఫ అకారములకు, సజాతిమ్ = మైత్రిని, కవితాకృతౌ = కవితచేయుటలో, కరోతి = చేయుచున్నాఁడో, సః = ఆ కవి, దుష్కవిః = దుష్కవి యని, కథ్యతేహి = చెప్పఁబడును గదా. అనయో స్సంగతిం యస్తు కరోతీత్యా ద్యుత్తరకారిక యనురోధమునఁ బూర్వకారికలలోని 'కశ్చిత్, కశ్చన' శబ్దములు కవిపరములె కాని లాక్షణిక పరములు గావనుచు నెఱుంగనగును.

రేఫ అకారముల యతిప్రాస మైత్రి మున్నగు నెల్లవిషయములును 'లఘువోఽలఘవశ్చే' తీత్యాది సూత్ర వ్యాఖ్యానావసరమున విపులముగా విశదీకరింపఁబడెను. కాన నిట విస్తరించి చర్చింపలేదు.

ఇది యంతస్థ ప్రకరణము.

న తాలవ్య చజలకు దంత్య చజలతోడి యతిమైత్రి యుదాహృతి లభింపనేరదు.
ప్రాసమైత్రికి మాత్రమె యుదాహరణములు లభించును.

ఉ. ఇంచుక యేని పాపమున కెన్నఁడు రోయక యెల్లవారఁ బా।
ధించి మనుష్య మాంసములు దించును గ్రొవ్వితి వాని నెల్లఁ గ్ర।
క్కించెద నీమదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలు ద్రోలి కే।
గించెదఁ జక్కనై నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా॥

(భార. ఆది. ౮ ఆ. ౨౯౭ ప).

ఇఁక నత్వ వైశిష్ట్యమునందును సంస్కృత చజలు తాలవ్యములె యగును గాన, వానితో నత్వ విశిష్టాచ్ఛిక దంత్య చజలకు మాత్రము యతి మైత్రి విషయమున సయితి ముదాహరణములు లభింపవచ్చును.

ఆ. వె. అనఘ యిది సురాసురాంశావతారకీ।
ర్తనము దీని వినినఁ దవిలి భక్తిఁ।
జదివినను సమస్తజనులకు నఖిలదే।
వాసురాదు లిత్తు రభిమతములు.

(భారత. ఆది. ౩ ఆ. ౮౪ ప).

ఈవిషయమునే యహోబలపతి యీక్రిందిరీతిని వివరించి యున్నాఁడు.

అత్రత్యో దన్త్య శ్చ రాద్యాయాం తాలవ్య శ్చశ్చ మిథః అన్యోన్యం యతి ప్రాసయోః సవర్ణశ్చ భవేత్. "చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి" ఇత్యాదిక మత్రోదాహరణమ్. వక్ర చ వర్గస్యతు సంస్కృత చవర్గేణ దన్త్య చవర్గేణ చ ప్రాసమైత్రీ మాత్రమస్తి. ప్రాసే స్వరమైత్ర్యపేక్షాయా అభావా దితి జ్ఞేయమ్." (అహో. ౧౫౯. పుట)

"చఱకు = చెఱకు, జండా = జెండా, చాట=చేట, జాన = జేన చాద = చేఁద, చాప = చేప" మన్నగు చోటులందు 'అత్వ విశిష్టము సాధువా? ఎత్వ విష్టము సాధువా?' అనెడి సందేహమును వారించుటకు మాత్రమె ప్రకృత సూత్రమును సైతము చింతామణికర్త సూత్రించెనే కాని యాచ్ఛిక చజ లెట్టియెడల దంత్యములో యెట్టి యెడలఁ దాలవ్యములో యను విషయమును సాకల్యముగ వివరింపఁ దలఁచి సూత్రించి యుండలేదు. ఇతర వర్ణముల కట్టి స్థాన ప్రయత్నాదులను వివరింపక వీనికి మాత్రము చెప్పనేల యనియు, నట్టివి పలుకుబడివల్లను సంస్కృత వ్యాకరణాభ్యాసమువల్లను

తెలియఁగలననియుఁ దెలుపుచున్నది. అట్లగుటచే "ఇ ఈ ఎ ఏ లంగూడిన చజలు తాలవ్యంబులు" (౮ సూ). "అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ లం గూడిన చజలు దంత్యములు." (౯ సూ.) (బాలవ్యా.సంజ్ఞా.)మున్నగువిషయములను సూత్రింప లేదు. అట్లు కానిచో వక్రవంశములు తాలవ్యములని చెప్పియుండఁడు గదా. "ఏ జఖో వక్రః" అనుచోప్పున 'ఎ, ఒ'లు సంయుతము వక్రములై యగుటచేతఁ దద్విశిష్ట చజలును దాలవ్యములై కావలసి వచ్చునుగదా. వెనుక నుదాహరించినరీతిని 'చాప=చేప' మున్నగు వానిలో 'అత్వమా? ఎత్వమా?' అను సందేహము పొడముట కలదుగాని, యెచ్చటనేనియు 'అత్వమా ? ఒత్వమా ?' అను సందేహము నొదవించు నుదాహృతు లుండ నేరవుగదా. ఆకారణముచేతఁ బ్రకృత సూత్రములోని వక్రశబ్ద మెత్వ మాత్ర పరము యని యెన్న నగును.

మత్స్యార్థకమగు 'చాప' శబ్దము మున్నగునాని వ్యావహారికోచ్చారణములోని చకారము తాలవ్యముగాఁ బలుకఁబడుచుండుటచేతను, నట్టి చకారాచ్చిక మగుటచేతను నచట 'చేప' అని పలుకవలెను గాని 'చాప' అని 'ఆ' కారముతోఁ బలుకరాదనియు నట్టి యత్వ ప్రైశిష్ట్యమె యున్నచో నాస్తరణార్థక మగు 'చాప' శబ్దమునందువలె దంత్యోచ్చారణమె వెలసియుండుననియుఁ బ్రకృత సూత్ర ముపదేశించుచు సందేహనిర్ణయముఁ జేయుచున్నది. ఇట్లె "చెయ్యి, చెయ్యి, చెయ్యము" మున్నగు శబ్దములలోని చకారము దాలవ్యముగనే పలుకఁబడుచుంశుటఁజేసి యద్దానిమీఁది స్వరము వక్రరూపమె గాని 'చైవు, చైది—చైదము, మున్నగు రీతి నుండెడి యత్వపూర్వాంశకమగు నై కారము కాదనియు గ్రహింపవలయును. అర్వాచీనుఁడగు పిండిప్రోలు లక్ష్మణ కవి వ్యావహారిక వాసనాబలముచేఁ బయి నియమము గ్రహింపఁజాలక యచట నైత్వము నంగీకరించెనని యీ క్రింది యాతని ప్రయోగమువలన విశద మగుచున్నది.

"చైవుల సాకిరి చాయ మగఁడు" (ఆంధ్రనామ సంగ్రహము, దేవవర్గు).

(సి-౨౮)—అద్దంత్య ఇత్యాది చింతామణి సూత్రముచేత "చంద్రుఁడు" మున్నగు సంస్కృతసమ శబ్దములందును తాలవ్యతా శ్రుతిచే నెత్వ విశిష్టతా భ్రాంతి కలుగునేమో యను తలంపున 'చజల' దంత్య తాలవ్యతా భేదము తద్భవ దేశ్యములందు మాత్రమె యని యథర్వాణుఁడు విశదీకరించుచున్నాఁడు.

ప్రాకృతే తద్భవే చాపి । చజౌ దన్తభవౌ స్మృతౌ॥

---

వ్యాఖ్య—ప్రాకృత ఇత్యాది—ప్రాకృతే = ఆంధ్రదేశ్యమందును, తద్భవేచాపి – వైకృత శబ్దములందును, చజౌ = చజలు, దంతభవౌ = దంత్యములుగ, స్మృతౌ = చెప్పఁబడినవి - అట్లని వీనికిఁ దాలవ్యత లేకపోలేదు - చప్పుడు, చాప, మున్నగువాని యుచ్చారణమున జిహ్వయొక్క పార్శ్వములు దంతములను దాఁకుటయేకాక జిహ్వామధ్యము తాలువును దాఁకును. కావున నివి దంత్యములును దాలవ్యములును ననఁదగును. అట్లయినను గురు పాండవ వ్యవహార న్యాయమున వీనికి దంత్యములను వ్యవహారము కలుగుచున్నదని గ్రహింపవలెను. ఈ విషయ మీవఱకు వర్ణోత్పత్తి వివరణ సందర్భమున విమర్శింపఁబడి యున్నది. (వి-౧౯౮).

ఈ యథర్వణ సూత్రమునుబట్టి తత్సమ శబ్దములలోని చజలకు దంత్యత లేదని తేలుచున్నది. అట్లయినను సంస్కృత చజలమీఁదఁ దెనుఁగు స్వరము నిల్చునపుడు వానియందు దంత్యోచ్చారణము నెలయుచుండుట చేత నవి దంత్యములు కానోపునని కొందఱు తలంచుచున్నారు.

“ సంస్కృత సమములం దికారాంతము లయిన శబ్దముల యుపధా చజలు బహువచనంబు పరంబగు నపుడు దంత్యము లగును......ఉ. అర్చి - అర్చులు; రోచి = రోచులు; వీచి = వీచులు; రాజి - రాజులు; వాజి - వాజులు మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్య యుక్తంబు కానంబడియెడి......” (బాల. సంజ్ఞ ౧౦ సూ).

ఇట్లు చెప్పుటకన్న సంస్కృత చజ లాంధ్రలక్షణ విహిత స్వరముతోఁ గూడినపుడు దంత్యము లగునని చెప్పు టుచితము. ఆ పక్షమున రాజు శబ్దమును బ్రత్యేక నిపాతముగా నంగీకరింప నక్కఱలేదు. మఱియు బాలవ్యాకరణముచే సిద్ధింప నట్టియు వాడుకలో నున్నట్టియు “ అచ్చులు ” స్వరములు) మున్నగు చోటులందలి దంత్యతయు సంగ్రహింపఁబడును. (గుప్తార్థ ప్రకాశికాకర్త యిచటి చకారము దంత్యము కాదనియు ‘ ముద్ర అను నర్థములోనె యిందలి చకారము దంత్యమనియు వ్రాయుట వాడుకకు సరిపడి యుండలేదు. ‘ అర్చులు ’ అను నప్పటి వాడుకలోని దంత్యతకు సాధుత్వము నిచ్చుటకును, ‘ అచ్చులు ’ అనుచోటి వాడుకలోని దంత్యతకు సాధుత్వము నియ్యకుండుటకును దగిన యుక్తి యేమియు లేదు గదా.

పయి విషయముల సంగీకరించుచునుఁ బ్రౌఢవ్యాకరణ కర్త 'రాజు' శబ్దమునందలి దంత్య జకారోచ్చారణము దాని నైకృతత్వమును నిర్వాహ్యమగు నని కొందఱు తలంచెడి తలంపు నిట్లు సూత్రించెను.

" రాజు నైకృతంబని కొందఱ అందురు. " (అందువలన తత్సమంబు నందలి చజలు దంత్యములు కావని యూహించుదురు) ఉదా:—

తే. గీ. రాజు మాడంగఁ జెప్పంగ రాని కడిమి ।
నీటియుఁ గ్రుమ్మి నొందిరి తేఁటి మూఁకలు । (యు._౨ ఆ).

అనియు బ్రాచ్యాంధ్రకావ్య ప్రయోగమును జూపి యుద్దాని నైకృతత్వమును నిర్ణయించెను. ఇట్లీతఁడు ప్రత్యేకముగ రాజుశబ్ద జకారమునకు దంత్యతను నైకృతత్వమును నిర్వహించినను సిద్ధసమాసమునందుఁ దత్సమశబ్దాంతర్గత రాజు శబ్ద జకారమునకును బాలవ్యాకరణమునందువలె దంత్యత నంగీకరింపక తీరదని తలంచి యీక్రిందిరీతిని సూత్రించెను.

" ఒకానొకచో జకారం బుభయంబు నగు " (ప్రౌఢ. సం. ౫) "శ్లేష యందు జకార మొక్కటియు నొకయర్థమున దంత్యమును నింకొకయర్థమునఁ దాలవ్యము నయ్యెడు నని యర్థము."

"ఉదా—అకట పాండురాజ యనె నున్నతి" (రాఘ. ౧ ఆ). (ఇట జకారము భారతార్థమునందు దంత్యము. రామాయణార్థమునందుఁ దాలవ్యము నని యెఱుంగవలయు.)"

పయిరీతిని 'పాండురాజె' అనుసంబోధనములోని జెకారము దంత్యమె యని యంగీకరించెను. ఇట్లే భీమరాజె మున్నగు స్థలములందును వాడుకలో నున్న దంత్యతనుబట్టి తత్సమములందును నిట్టిచోట్ల చజలకు దంత్యత సంగీకరింపక తీరదని బాలవ్యాకరణానుసారముగఁ బ్రౌఢవ్యాకరణకర్తయు సంగీకరించెను. కాని, 'పాండురాజె, భీమరాజె, రోచులు, పీచులు, రాజులు, (రాజి), వాజులు,' మున్నగు తత్సమ శబ్దస్థలములలోని దంత్యత యపభ్రష్టమనియు నయ్యది యంగీకార్యము కాదనియు నచట, "పాండురాజు, భీమరాజు" మున్నగురీతిని దాలవ్యత నుచ్చరించుటయే సాధువనియు నప్పకవి యీ క్రిందిరీతిని జర్చించి యున్నాఁడు.

"తే. గీ. దంత్య తాలవ్య చజలకు ధరణి వ్రాయు ।
తఱిని శుద్ధాంధ్రలిపిని భేదంబు కలిమి ।

ద్వ్యర్థ కృతులను దలకట్టు లనుచు నొకట ।
నిదియు నొకదాన నదియును నిడఁగరాదు ॥

(రాఘవపాండవీయమునందు)

ఆ. వె॥ ఎందు వేఁట రారె యితరు లే మనసుతో ।
దారసంగసుఖము తప్పఁ ద్రోచి ।
తకట పాండురాజ యశమెన్న నై తతి ।
క్రూర దశరథేశ కులము రోయ ॥ (౧ ఆ. ౨౯ ప.)

(పాంసుర+అజయశము) (రామాయ.) [పాండురాజ+యశము.] (భార)

వ॥ ... ... ... ఆద్యప్రకృతియందు దంత్యములు లేవు. కనుక శుద్ధ సంస్కృతమైన పాండురాజ శబ్దమునందుఁగల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. ఇది తెలియక కేవలాంధ్రులు దంత్యాక్షరముగా నుచ్చరింతు రది లాక్షణికమతము కాదు. అట్లగుటంజేసి కవితాప్రవర్తకులయిన సూరపరాజుగా రింతవట్టును విచారించి (తాలవ్యముగానే) ప్రయోగించిరి. "

(అప్పక-౨ ఆ-౧౩౫-౧౩౬ప. ౬౫ పుట)

బాలవ్యాకరణగుప్తార్థ ప్రకాశికాకర్త, పైయప్పకవీయ గ్రంథమునకును బాలవ్యాకరణములోని విషయములకును వైరుధ్యము లేకుండ సరిపెట్టుటకు దలపడి యప్పకవి తాలవ్యమనుచున్నది 'రాజుఁడు' శబ్దసంబోధనమగు 'రాజ' అన్న దేకాని, 'రాజ్' శబ్దసంబోధనమగు 'రాజ్' అన్నది కాదనుచు నీ క్రిందిరీతి నసంగతముగా వ్రాసియున్నాఁడు.

"ఇచ్చటఁ బాండురాజ శబ్దమునకుఁ బాండురోగ మితనియందుఁ బ్రకాశించు నన్న వ్యుత్పత్తియందు, నధికరణార్థంబున ఘఞ్ ప్రత్యయము వచ్చినది. కావున నిచ్చటఁ బాండురాజశబ్దంబు "పాండురోగము ప్రకాశించువాఁడా" అనిన విశేషణార్థ మిచ్చును; కాని 'పాండు నామముగల రాజా' అనిన నృపాది విశేష్యార్థం బియ్యనేరదు. విశేష్యార్థకంబై ప్రసిద్ధంబైన రాజశబ్ద జకారంబు దంత్యం బని వ్యాకరణకర్తల తాత్పర్యంబుకాని విశేషణార్థకంబైన రాజశబ్ద జకారంబు దంత్యంబు గా నేరదనియే వారి తాత్పర్యంబు ............... కాఁబట్టి భాతార్థమునందును బాండురాజ శబ్ద జకారంబు తాలవ్యంబనియే యూహించుకొనవలయును, కావుననే యప్పకవిగారు తమగ్రంథంబునందలి ద్వితీయాశ్వాసములో నీపద్యంబునే యుదాహరించి 'శుద్ధసంస్కృతమైన

పాండురాజ శబ్దంబునం గల జకారము తాలవ్యమే కాని దంత్యము కానేరదు. .........” అని భారతార్థమునందును జకారము తాలవ్య మనియే సిద్ధాంతీకరించిరి. “క్రియావాచకమైన రాజు శబ్దంబునకు విశేషణార్థము నిచ్చునట్టి యీ పాండురాజశబ్దమునొక్క ప్రథమావిభక్తి రూపము ‘రాముఁడు’ అనునట్లు ‘పాండురాజుఁడు’ అనియే యుండవలెను. ఈ వ్యాకరణమునందలి తత్సమ పరిచ్ఛేదములోని డెబ్బది యెనిమిదవ సూత్రము ప్రసిద్ధంబైన (రాజు) నృపాది విశేష్యార్థక రాజశబ్దమునకే చెల్లును” (బాల-గు- ప్రకాశిక-బాలవ్యాకరణపు సంజ్ఞా ౧౦ సూ. వ్యాఖ్య).

పై వ్రాఁత కేవలము నసంగమనుటకు సందేహము లేదు. పాండురాజ శబ్దములోని జకారము శుద్ధసంస్కృత మగుటచేత నది సంస్కృతసంప్రదాయముచొప్పునఁ దాలవ్యమే కాని దంత్యము కానేరదని యితఁడు చెప్పుచున్నాఁడు. ఈగుప్తార్థ ప్రకాశికా కారుఁడు సాధించిన వంధ్యాపుత్త్ర ప్రాయమగు నప్రసిద్ధ ఘుణాంత రాజుఁడు శబ్దము శుద్ధసంస్కృత మనియుఁ బ్రసిద్ధ రాజు శబ్దము శుద్ధసంస్కృతము కాదనియుఁ జెప్పుట యుక్తమా? అప్పకవికి నిట్టి తలంపు గలదని చెప్పుట యన్యాయ్యము. అప్పకవి ప్రసిద్ధ రాజు శబ్దము నుజ్జగించి యీ పద్యమున నప్రసిద్ధరాజుఁడు శబ్దమును గ్రహించె ననుట కించుకేని యాధారము గలదా?

మఱియు నీసందర్భమున గుప్తార్థప్రకాశికాకర్త యప్పకవి మతము ననుసరించుచుఁ బ్రౌఢవ్యాకరణములోని పయిని వ్రాసిన “ఒకానొక చో జకారం బుభయంబు నగు” అను సూత్రమును ఖండించుటలో నీక్రిందిరీతి యుక్తిని జూపి యున్నాఁడు.

“అయ్యది చింత్యంబు. పరస్పరంబును విరుద్ధోచ్చారణంబులు గల దంత్య తాలవ్య జకారంబులు రెండును బద్యపఠన సమయంబున నేకీభావంబుగా నెట్లుచ్చరింప శక్యంబగును? పద్యపాఠకాలంబున దంత్య ముచ్చరించినచో రామాయణార్థము చెడును; తాలవ్యముగాఁ బలికినచోఁ భారతార్థమునకు భంగము సంభవించును.” (బాల-సంజ్ఞ ౧౦ సూత్రపు వ్యాఖ్య.)

ఇట్లు చర్చించుట సరియా? చింతామణికర్తయే ‘మిథ స్సవర్ణ శ్చ’ అని వానికి సావర్ణ్యము నంగీకరించెనే! శ్లేషమున నిట్టి యైక్యము సుప్రసిద్ధము కాదా? సఖండాఖండశబ్దములకును లఘ్వలఘు యరలవ ఘటితశబ్దములకును శ్లేషమున నేకీభావముగల ఘటనలు సుప్రసిద్ధములు కావా? “యమకాదౌ భవే

దైక్యం డలో ర్బవో ర్లరో స్తథా" అను సాహిత్యదర్పణోదాహృత సూక్తి చొప్పున వర్ణాంతరములకును నైక్యానుసంధానము శ్లేషమునఁ బ్రసిద్ధము కాదా? ఇట్టి శబ్దౌచితినే పాటించినపుడు సార్వత్రికమగు సభంగాభంగశ్లేష మెట్లు చదువ నగును? కావుననే రాఘవపాండవీయకర్త తనగ్రంథము నుభయార్థములందును జోడించి యేకాకారముగాఁ జదువ వలదనియుఁ దన గ్రంథమును వేర్వేఱుగ రెండుగ్రంథములుగఁ జదువ వలయుననియు నీక్రింది రీతిని జెప్పికొని యున్నాఁడు.

క॥ ఒక కథ వినియెడిచోటి వే
ఱొక కథపై దృష్టి యిడిన నొకయర్థముఁ దోఁ
పక పోవుఁ గాన నేకా
ర్థకావ్య మెట్లట్లు వినఁగఁ దగు నొక టొకటిన్॥

(రాఘవ. ౧ ఆ-౧౮ ప. పీఠిక.)

ఇంక నిట్లు వ్యవహారవశమున సంస్కృత చజలకు దంత్యత కల్గినపు డట్టి స్థితి నంగీకరించుటయా? అపభ్రష్టమని దాని నిరాకరించుటయా? యను విషయమును నిర్ణయించుటకు, దంత్య తాలవ్య చజలకు సావర్ణ్య మంగీకరింపఁ బడుటంజేసి యతిప్రాస శ్లేషాది నిబద్ధస్థల మహాకవి ప్రయోగము లుపచరింపవు. కాని, యొక్కమార్గ మేతన్నిర్ణయమున కాధారముగ నున్నది.

విభక్తి నిమిత్తకములగు మార్పులుతప్ప నింకేమాత్రమయినను సంస్కృత శబ్దార్థములందు మార్పు గల్గెనేని యవి వైకృతము లనఁబడును గాని తత్సమములుగా నెన్నఁబడుట సంప్రదాయము కాదు.

'రాౙు, మంౘెము' మున్నగు చోటులందుఁ గల్గిన దంత్యత విభక్తి నిమిత్తకము కామింజేసి యట్టి దంత్యత వానికి వైకృతత్వాపాదక మగుచున్న దనుటకు సందేహములేదు. కావున, 'పాండురాజు, భీమమహారాజు, ధర్మరాజు' మున్నగు సిద్ధసమాసములుగాని 'అర్చులు, రోచులు' మున్నగు తత్సమశబ్దములుగాని వైకృతములు కామింజేసి వానివానియందలి దంత్యత యప్పకవి చెప్పినట్లపభ్రష్ట మనకతీరదు. కాఁగా వైకృతములని యంగీకరింపఁదగిన 'రాౙు, వలరాౙు, మంౘెము' మున్నగు శబ్దములలోని చజల దంత్యత సాధువనియు, వైకృతము లనరాని 'ధర్మరాజు, భీమరాజు' మున్నగు తత్సమములలోని చజలందుఁ గల వాడుకలోని దంత్యోచ్చారణ మపభ్రష్టమనియుఁ జెప్పుటకు సందియము లేదు.

మఱియు 'పాండురాజు' అను నిదాహరణమున సంబోధనరూపము నెవ్వరును 'రాజు' అను చోటనుండునటుల జకారాంతముగాఁ బలుకగా వాడుకయే లేదు. 'రాజీవాక్షుల నేను పాపకిని చంద్రా రాజవా నీవు..." మున్నగు వసుచరిత్ర పద్యములోని 'రాజవా' అను చోటి జకారమునువలెనే 'పాండురాజ' అనెడి సంబోధనమునందును దాలవ్యముగానే యుచ్చరించి జకారమును బలుకుట రూఢమైయున్నది.

(౫-౨౫ — ప్రకృత మనుసరించెదము. "ప్రాకృతే సంస్కృతే చాపి" ఇత్యాది ప్రకృత సూత్రములోని ప్రాకృతశబ్దమునకును సహోదాహరణత్యాదులు ప్రాకృతసమాదిరూప వైకృతపరముగానే యర్థముచేసిరి. కాని యర్థానికి నా చెప్పిన త్యాంధ్ర దేశ్యపరముముగా నర్థముచేయుటయే యుక్తమని గ్రహింపవలయును.

ప్రకృతులనఁగా దేశీయులగు ప్రజలు. వారిసంబంధమైన దనఁగా వారి వాడుకలోని భాష ప్రాకృత మనఁబడును. ఈవ్యుత్పత్తిని భాషాప్రపంచ మెల్ల దేశ్యమే యనఁదగును. అట్లయినను దత్సమ తద్భవ దేశ్య విభాగమును బట్టి తత్సమ తద్భవేతరము దేశ్యముగా నెన్నఁబడుచున్నది. కాఁగా నెల్లభాషల లోను నట్టి దేశ్యభాషాభాగము నవయవార్థమునుబట్టి ప్రాకృత మనుటలో, విప్రతిపత్తి యెంత మాత్రమును లేదు. కాని, ప్రకృతమునను నాంధ్రభాష లోని చజలనుగూర్చి ప్రసంగించుచుండుటచేత నిచటి ప్రాకృతశబ్ద మాంధ్ర దేశ్య పరమనుటకు సందేహము లేదు. ఈవిషయ మీనాటికి నిక్కలి విపులముగా విమర్శింపఁబడియున్నది. (౨౬-౨-౨౬. క. వి.)

పయిని వ్రాసినచొప్పున నవయవార్థమునుబట్టి ప్రాకృతశబ్ద మెల్ల భాషలలోను దేశ్యభాగమునకుఁ జెల్లఁదగినదే యైనను, నది తత్సమ తద్భవ దేశ్యాత్మకములగు మహారాష్ట్రీ శౌరసేనీ మాగధీ పైశాచీ ద్వితయాపభ్రంశ రూప భాషాషట్కమునకు రూఢమైనసంజ్ఞయై వెలయుచుండుటంజేసి యీ సందర్భమున నప్పకవ్యహోబల పండితులు భ్రమించి యీక్రిందిరీతిని వివరించియున్నారు. అందప్పకవి కీవికృతివివేక కారిక శ్రుతి గోచరమై యుండమింజేసి యేతదర్థకముగనె యగపడుచున్న యీ క్రింది యథోక్తజపక్కా వచనము నాతఁ డీక్రింది రీతిని వివరించెను.

తే॥ "ప్రకృతులను రెంట రెండు రూపముల నమరు।

జంద్రునకుఁ జందురుండని సంస్కృతమునఁ ।
జంద్దుఁడని ప్రాకృతమున నీనందమునను ॥

చందురు శబ్దము శుద్ధ సంస్కృత శబ్దముననే అయిన తద్భవము గాని సంస్కృతముచెడి అయిన ప్రాకృతమువలన నయినది గాదు.

చజౌ తజ్జే ప్రాకృతేచ । దన్త్యావేవ న సంశయః.

టీక ...ఇటను నధోక్షజపక్కికావచనముచేత నిదియు సంస్కృతజాతమైన తద్భవము గనుక మొదలనున్న చకారము దంత్యమయి తెలుఁగుచేయఁగా 'చందురుండు' అని యయినది............'చంద్ద' ఆయెను. ఇది ప్రాకృత భాష గనుక మునుపు చెప్పిన యధోక్షజ వచనమున నాదినున్న చకారము దంత్యవర్ణ మాయెను. అదితత్సమము (ప్రాకృతసమము) చేయఁగా 'చంద్దుఁ' డని నిల్చెను. కాఁబట్టి యీ మాట సంస్కృతమునఁ బుట్టిన ప్రాకృతముననే యయిన తద్భవముగాని శుద్ధ సంస్కృతమున నయినది గాదు. ............
..." (అప్పక - ౧ ఆ. ౮౫) ('చంద. చందుఁడు' అను ముద్రణము తప్పు).

ఈ యధోక్షజ వచనమును మనమున నిడియే స్థలాంతరమున నప్పకవి యీక్రింది పద్యమును జెప్పె ననవచ్చును.

తే॥ దంత్యములు నరవంకలు దైవభాషఁ ।
గనము; తాలవ్యములఁ దలకట్లులేవు * ।
ప్రాకృతమునందు, దద్భవ పదమునందు ।
దంత్యములె కాని తాలుజాతములు లేవు ॥

( * అత్వవైశిష్ట్యమునఁ దాలవ్యము లుండ వని భావము )

వ॥ వక్రమునకుఁ దద్భవము వంక గనుక నరవంక లనఁగా గుఱుచ మెత్వములు ..................." అప్పక-౨ ఆ-౧౨౩)

అహోబలపతి పయి యధోక్షజ వచనమును "ప్రాకృతే తద్భవే చాపీ" త్యాది ప్రకృతసూత్రమును విమర్శించి పయి యప్పకవి యభిప్రాయముతోనే యీక్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"జూదము శౌరసేనీ తత్సమః (ఇచటి 'తద్భవః' అను ముద్రణము తప్పు) 'నతు తద్భవః. తథాహి. ప్రాకృతవ దిత్యతిదేశాత్. "ద్యర్యోర్జ' ఇతిజాదేశః దన్త్యస్య శౌరసేన్యామథో రచో స్తోరి' తి సూత్రేణ తస్య దాదేశే తద్రూపం సిద్ధమ్. నచ తాలవ్య జకారేణ వైలక్షణ్యమ్ "ప్రాకృతే తద్భవే చాపి । చజౌ

దన్తభవౌ స్మృతా' ఇత్యాథర్వణాచార్య లోకోక్తత్వాత్. ప్రాకృతే=ప్రాకృతసమే ఇత్యర్థః............ ఏవంస్థితే జాదశబ్దః శౌరసేనీతద్భవ ఇతి సరస్వత్యోక్తమ్ తద్విచార మార్గ్యమేవ. ప్రాకృతే తద్భవే చాపీత్యాథర్వణ సూత్రే ప్రాకృతశబ్దస్య ప్రాకృతసమపరత్వం నరసింహ గ్రన్థరీత్యా వ్యాఖ్యాతమ్. వస్తుతస్తు ప్రాకృత శబ్దస్య ప్రాకృతపరత్వమేవ. "చజౌ తజ్జే ప్రాకృతే చ। దన్త్యావేవ న సంశయ ఇత్యధోక్షజాచార్య వచనాత్. (అహో ౧. ౨౬ -౧ ౨౭ పుటలు).

ఇచటి యహోబలపతిప్రసంగము సగయాగా నాతఁడధోక్షజ వచనమును మహారాష్ట్రప్రాకృత తద్భవపరముగా సర్థముచేసినట్లు వ్యక్తమగుచున్నది. అట్లు కానిచో సధోక్షజాథర్వణ వచనములు తుల్యముగు శబ్దరచనముతో నుండుటవు డధోక్షజ వచనమునుబట్టి ప్రాకృతే తద్భవే చాపీత్యాది సూత్రము లోని ప్రాకృతశబ్దము ప్రాకృతసమాంధ్ర శబ్దపరము కాదనియుఁ బ్రాకృత భాషా పరమే యనియును బ్రసంగించియుండఁడు గదా. అధోక్షజ పక్కి-కా వచనము తెనుఁగును గూర్చియె చెప్పఁబడినదు డందలి ప్రాకృత శబ్దమునకు సైతము ప్రాకృతసమ మర్థ మను నరసింహవ్యాఖ్యకుఁ బ్రతిబంధ ముండదు గదా. ఇఁక నావచనము ప్రాకృతమునుగూర్చి చెప్పఁబడినదని గ్రహించినచో "మహారాష్ట్రోద్భవాం భాషాం ప్రకృష్టాం ప్రాకృతం విదుః" అను చొప్పున ప్రాకృతేచ = మహారాష్ట్రియందును, తజ్జే = తద్భవములలోను, చజౌ=చ జలు దన్త్యావేవ=దంత్యములే" అనియర్థము చేయవచ్చును. తన్మూలమున ప్రాకృత భవములందలి చజలకు నరసింహ వ్యాఖ్యాచే లభింపని దంత్యతయుఁ జెప్పఁబడినదగును. ఈ రీతి నప్పక వ్యహోబలపతుల యభిప్రాయము లభిన్నములు కాఁగలవు. కాని వీరి యీ వివరణములనుబట్టి తెనుఁగున వైకృతశబ్దములలో మాత్రమె 'చజ' లకు దంత్యత చెప్పఁబడినదని తెలుచున్నది. కాఁగా వీరిద్దఱి వివరణములనుబట్టియు నాంధ్ర దేశ్య పదములందలి చజలకుఁ బ్రసిద్ధమయి యున్న దంత్యత యసిద్ధమగుచున్నది.

ఆంధ్ర దేశ్యమునందు 'చజ'ల దంత్యత యలవాటయి యున్నపుడే వైకృతములలో నట్టిదంత్యత ప్రవేశించియుండు ననుట యుక్తముకాని దేశ్యమునలేని యుచ్చారణము వైకృతములలో గల్గెననుట యెట్లు పొసఁగును? మఱియుఁ బ్రాకృతభాషయందు 'చజ'లకు దంత్యత గలదని చెప్పుట యిచటఁ బ్రసక్తమును గాదు. ప్రాకృత సమములు సైతము వెనుక వివరించినరీతిని దద్భవములలోనివే యగుటచేతఁ బ్రాకృతసమములను గూర్చి వేఱుగఁ జెప్ప

నక్కఱలేదు. మఱియు నాంధ్ర దేశ్యమందలి చజల దంత్యత రూఢమై యుండుటచేత వాని విషయమును జెప్పుట యత్యావశ్యకమై యున్నది.

కాఁగా "ప్రాకృతే తద్భవేచాపీ" త్యాది ప్రకృత సూత్రమునందలి ప్రాకృత శబ్దము నా వివరించినరీతి నాంధ్ర దేశ్యపరమె యనియుఁ బ్రాకృత భాషాపరముగాని ప్రాకృతసమ రూపాంధ్రపదపరముగాని కానేరదనియు గ్రహింపవలయును.

(౫-౨౬)—మఱియుఁ బ్రాకృతములో నీ దంత్యోచ్చారణము ప్రసిద్ధమయి యున్నదా యను విషయము పరిశీలింపవలసి యున్నది. నేఁటి మరాటీ భాషలో నీ దంత్యోచ్చారణము గలదని కాల్డువెల్లుదొరగారీక్రింది యర్థము నాంగ్లమున వ్రాసి యున్నారు.

"మరాటీభాషయందును దెలుఁగు భాషయందును చవర్గ ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ వర్ణములు (మరాటీలో ఛ ఝ లు గలవు) ఇ ఈ ఎ ఏ ఐ స్వర యోగమునఁ దమకు సహజమగు సంస్కృతాది భాషా ప్రసిద్ధమైన తాలవ్యతతోనే యుచ్చరింపఁబడును. కాని తద్భిన్న స్వరయోగమున సరళములుగా నుచ్చరింపఁబడుచున్నవి. అనఁగా చకారము 'త్స' అనునదిగను జకారము'ద్జ' అనునదిగను బలుకఁబడుచున్నవి. ఇట్టి వింత యుచ్చారణ మీ రెండు భాషలలో మాత్రమె యగపడుచున్నది. సంస్కృతములోఁ గాని తక్కిన యే యుత్తర దేశపు భాషలలోఁ గాని యిట్టి యుచ్చారణము లేదు. ఈ యుచ్చారణము తెల్గునుండి మరాటీలోనికి వచ్చినదో, మరాటీ నుండి తెలుఁగులోనికి వచ్చినదో చెప్పుటకు నేను సాహసింపఁ జాలను. ఈ విషయమున నా రెండు భాషలకును సంబంధము గలదని మాత్రము చెప్పఁగలను." (కాల్డువెల్లు. రివైజ్డు ఎడిషను. ౧౪౧ పుట ౪ పేరా.)

ఇట్టి వ్రాఁత కనుకూలముగా మహారాష్ట్రీప్రాకృత భాషలో నిట్టి యుచ్చారణ ముండెడిదేమో యనియూహించుటకీక్రింది వరరుచి సూత్ర మించుక యవకాశము నిచ్చుచున్నది.

"చవర్గస్య స్పష్టతా తథోచ్చారణః"

చవర్గస్య యథా స్పష్ట స్తథోచ్చారణో భవతి. (భామహ వృత్తి)

(ప్రాకృత ప్రకాశము ౧౧ పరిచ్ఛేదము. ౫ సూ. ౧౨౭ పుట మాగధ్యనుశాసనము).

ఇట్లు మాగధీ భాషలో మాత్రము చవర్గమునకు స్పష్టోచ్చారణము గలదని విశేషించి చెప్పుటచేతఁ దక్కిన ప్రాకృతములలో, నందును 'ప్రాకృత షట్క మూలభూత మహారాష్ట్రీ' ప్రాకృతములో 'చ' వర్గమున కస్పష్టోచ్చారణమేదో కలదని సూచిత మగును. ఈ స్పష్టతాస్పష్టత లెట్టివో యెచటను నిరూపింపఁబడలేదు; కాని పై సందర్భమునుబట్టి ప్రాకృతములోని 'చ' వర్గమునకు స్పష్టత యనఁగా సహజమగు తాలవ్యతా రూప శుద్ధోచ్చారణము లేదనియు నస్పష్టత యనఁగా దంత్యత్వ తాలవ్యత్వ రూప మిశ్రోచ్చారణము గలదనియుఁ జెప్ప నగునా యని యాలోచింపవలసి యున్నది.

ఇట్టి దంత్యోచ్చారణము ప్రాకృతమునందే యున్నచో నయ్యది తదనుశాసన సందర్భమున వరరుచి సూత్రములలో నయినఁ జెప్పఁబడి యుండవలదా? ప్రాకృత ప్రకాశమునందే కాక యే ప్రాకృత వ్యాకరణము లోను నట్లు చెప్పఁబడ లేదు. వెనుక నుదాహరించిన రీతి నాంధ్రభాష లోని వైకృత ప్రక్రియలో నట్టి దంత్య చజాదేశము చెప్పఁబడి యుండ లేదా? (౧౨౦ వి). "అలఘు ల (ళ) కారస్థితి మహారాష్ట్రీ ప్రాకృతమునఁ జెప్పఁబడకున్నను నద్దాని స్థితిని సిద్ధముగాఁ జేసికొని పైశాచీ ప్రాకృతమున నట్టియలఘు ల(ళ) కారమునకు లఘు లకారాదేశము విధింపఁబడినట్లు (ళోలః) యిచటను చవర్గముయొక్క యస్పష్టోచ్చారణము మహారాష్ట్రీ ప్రాకృతమునఁ జెప్పఁబడకున్నను నద్దానిని సిద్ధముగాఁ జేసికొని యిట్లు మాగధియందు స్పష్టోచ్చారణము విధింపఁబడె నని సమాధానము చెప్పుట కవకాశము లేదు.

[౫౨౬.వి.]మాగధీ చ వర్గస్పష్టతా విధానమున కభిప్రాయము వేఱు.(587పుట)

లకారముయొక్క యలఘూచ్చారణము వెనుక నుదాహరించిన రీతిని సంస్కృత భాషలోనే ప్రాకృతానుశాసన కాలమునాఁటికే ప్రసిద్ధమై యుండుటం జేసి ప్రాకృత వ్యాకరణములో నద్దానిని వేఱుగ నాదేశింప నక్కఱ లేక పోయెను - చవర్గముయొక్క యస్పష్టోచ్చారణ మట్లు సంస్కృతమున నుండెడి దని నిరూపించుట కవకాశ మేమియు లేమిం జేసి పై రీతిని నలఘు లకార సామ్యమున సమాధానమును జెప్పుట కెంతమాత్రమును నవకాశము లేదు.

మాగధీ భాషానుశాసన సందర్భములో 'చ' వర్గమునకు స్పష్టోచ్చారణము గలదని చెప్పఁబడుట సైత మీ ప్రాకృత ప్రకాశమునందుఁ మాత్రమె యగపడుచున్నది. అట్టి విధానమె యావశ్యకమైన యెడలఁ

దర్వాతి సిద్ధ హేమచంద్ర శబ్దానుశాసనములోఁ గాని షడ్భాషా చంద్రికా దీతర ప్రాకృత వ్యాకరణములలోఁ గాని యట్టి చవర్గస్పృష్టోచ్చారణము సూత్రింపఁబడి యుండదా? కాఁగా నా కాలపు మగధ దేశీయ వ్యావహారిక మున'చ' వర్గ మస్పృష్టముగా ననఁగా శయ (చ=శ.జ=య) వర్ణా ద్యుచ్చారణ సాంకర్యాది రూపముగా నుండుటచేత నట్టి వ్యావహారి కాస్పృష్టోచ్చారణము గ్రాంథిక మాగధిలో నుండరాదని వరరుచి యట్లు సూత్రించెనని యూహింప నగును. అట్టి శవర్ణోచ్చారణసాంకర్యము కాలక్రమున 'చ్ఛ' కార స్థలమందు మాత్రము గ్రాంథికత నందుటచేతఁ గావలయుఁ బ్రాకృత ప్రకాశికేతర ములగు హేమా ద్యనుశాసనములం దెల్ల చ్ఛకారమునకు 'శ్చ' అనునది యా దేశింపఁబడియున్నది.

"చ్ఛస్య శ్చోఽనాదౌ" (౮-౪-౨౬౫) మాగధ్యా మనాదౌ వర్తమానస్య చ్ఛస్య తాలవ్య శకారాక్రాన్త శ్చో భవతి; గశ్చ (గచ్ఛ) పిశ్చిలే (పిచ్ఛిల) పుశ్చది (పృచ్ఛతి). లాక్షణి కస్యాపి ఆవన్న వశ్చలే (ఆపన్న వత్సల)........." (సిద్ధ హేమచంద్ర శబ్దా)

"చ్ఛోఽనాదౌ శ్చః" (3-౨-3౨)

అనాదౌ వర్తమానస్య లాక్షణిక స్యాలాక్షణికస్యచ చ్ఛస్య శకార సహిత చకారో భవతి. పిచ్ఛిలః = పిశ్చిలే. లాక్షణికస్య—ఆపన్న వత్సలః = ఆవన్న వచ్ఛలో = ఆవణ్ణ వశ్చలే. వృశ్చికః = వచ్ఛో = వశ్చే. ఇత్యాద్యూహ్యమ్." (షడ్భాషా చంద్రిక, మాగ ధ్యనుశాసనము ౧౮౬ పు.)

ఇట్లు నూతనముగా వాడుకనుండి గ్రహింపవలసిన దానిని గ్రహించి హేమాదులు తక్కిన వ్యావహారికాపభ్రష్టోచ్చారణములను వివరించుట (వరరుచివలె) యనావశ్యక మని తలంచి మాగధిలో చవర్గ స్పృష్టతా విధానమును జేయమాని రని గ్రహింప నగును.

మఱియు నస్పృష్టత యనునపుడు పయిరీతిని సమానస్థానిక వర్ణాంతరోచ్చారణ సాంకర్యము గలదనుట యుక్తముగాని భిన్నస్థానిక వర్ణాంతరోచ్చారణ మిశ్రణ మున్నదనుట యుక్తముకాదు. ఇంతియకాక వరరుచి చెప్పిన మాగధిలోని యీ స్పృష్టతి నియతము చవర్గ సాధారణముగా ననఁగా ఇకార సాధారణముగాను సకల స్వరయోగ సాధారణముగాను జెప్పఁబడుటంజేసి

యట్టి స్పష్టత, వర్గ పంచకమునగల చవర్గీయములందు మాత్రమే గాక ' ఇ ఈ ఎ ఏ ఐ ' స్వరేతర ప్రాణయోగమున మాత్రమె నేటి మరాటీ భాషలో వెలయు చున్న దంత్యోచ్చారణ రూపమయిన స్పష్టతాభావమునకుఁ బ్రతియోగి యని యూహించుట సరిగ్గాయె యుండనేరదు గదా.

పరిశీలింపఁగా నీ దంత్యోచ్చారణము ద్రావిడ భాషలనుండియే మరాటీ భాషలోఁ బ్రవేశించినదని తోఁచుచున్నది. ఇట్టి దంత్యోచ్చారణము తమిళమునను నాంధ్ర కర్ణాటములందును బ్రచురముగ నగపడుచుండుట చేతను గౌడ భాషలలో నొక్క మరాటీ భాషయందు మాత్రమె యది వెల యుచున్న దనుటచేతను నట్టి యుచ్చారణము ద్రావిడభాషల సంపర్కము ననె మరాటీలోఁ బ్రవేశించె నని చెప్పుట మిక్కిలి యుక్తముగు యుండును.

(౫౨౭)—కాల్డువెల్లుగారు బాగుగాఁ బరిశీలింపని యీ దంత్యో చ్చారణము " ఆంధ్రము, మరాటీ " అను భాషలలో మాత్రము గలదని చెప్పి యున్నను నియ్యది తమిళ కర్ణాటములలో నయితము విశాలముగ వ్యాపించి యున్నదని చెప్పవచ్చును.

తెనుగునందలి చకారము మీఁద ' అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ ' లు నిల్చి నపుడు దానికి యుచ్చారణమున దంత్యత యున్నను దాలవ్యతయు మిశ్రితమై యుండును గాని కర్ణాటభాషలో నట్టియెడల నది కేవల దంత్యముగనే యనఁగా సకారముగనే సాధారణముగా మారిపోవుచున్నది. ' అందును బహాది నట్టి చకారము మిక్కిలి తెలుచుగ సకారరూపము నందిపోయునది. " చలుకు = కర విమోచనే, చాళిసు = చాంచల్యే, చాఁ = రాంహా, చక్కి... సంతోషతా భావే " అని యిట్లల్పసంఖ్యాక ధాతువులు మాత్రము కర్ణాట శబ్దానుశాసన్య ధాతుపాఠములో నగపడుచున్నవి. సకారపరిణామ మందినవన్నో మిక్కిలి యధికముగా వెలయుచున్నవి. ' ఇ ఈ ఎ ఏ ' లతోఁ గూడిన చకారములం దిట్టి సకార పరిణామము కన్నడమున సాధారణముగ లేదనవచ్చును. తమిళమున ద్విత్వస్థలములు ననునాసిక యుక్తస్థలములును దప్పఁ దక్కినచోటులం దెల్ల 'చ' వర్ణము దంత్య సకారముగానే పలుకఁబడుచున్నది. తమిళభాషలో సకార లిపి లేనందున నీ యుచ్చారణము వాడుకలో మిక్కిలి కలుషితమై

ఇది శ్రీమదాంధ్ర భాషానుశాసక ప్రథమ ద్వితీయాచార్యాంధ్రవ్యాకరణ సామ్రాజ్యధుర్య నన్నయభట్టారక కాథర్వణాచార్యకృత నన్నయాథర్వణీయాఖ్య లక్షణ గ్రంథరాజంబునందలి సంజ్ఞాపరిచ్ఛేదంబున మొదటిభాగము సంపూర్ణము.

---

యున్నది గాని "అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ" లతోఁ గూడినపుడు చకారము దంత్యసకారముగాను "ఇ ఈ ఎ ఏ" లం గూడినపుడు దాలవ్య శవర్ణముగాను బలుకఁబడుచున్నదని చెప్పవచ్చును.

పయి సందర్భమునుబట్టి ద్రావిడభాషలలో నుచ్చారణ సౌలభ్యాపేక్షచే సరళోచ్చారణము వచ్చినపుడే తమిళ కర్ణాటములలోని సరళతర మనఁదగు నీ సకారోచ్చారణమును దెలుఁగు దంత్యచకార దంత్యజకార దంత్య సకారోచ్చారణములును వచ్చియుండు ననియుఁ గాలక్రమమున నట్టి ద్రావిడ సకారోచ్చారణము మరాటీభాషలో సైతము చేరెననియు నిర్ణయింపనగును.

ఇది దంత్యతాలవ్య చజప్రకరణము.

ఇది శ్రీవత్స సగోత్ర పవిత్ర శ్రీమద్వేంకటాంబా ముఖలింగేశ్వర జ్యేష్ఠపుత్త్ర శ్రీమచ్చింతామ ణ్యుపాఖ్య షడ్దర్శనీపారంగత నారాయణాఖ్య పండిత కవీంద్ర శమనిచయానంద గురు ప్రకాండ పాదపద్మ మధుకర వివిధ ప్రబంధ శాస్త్రగ్రంథ విమర్శన వీరసింహ మంజరీ ప్రబంధ సుమ సమర్పి తాంధ్ర వాగ్దైవత వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి విరచిత వైయాకరణ పారిజాతాఖ్య నన్నయాథర్వణీయ వ్యాఖ్యానమున సంజ్ఞా పరిచ్ఛేద భాగము

సంపూర్ణము.

# ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పులు | ఒప్పులు |
|---|---|---|---|
| XV | 5 | ధరలనఁగ | ధార లనఁగ |
| 1 | 2 | సందర్బము | సందర్భము (ఈ పంక్తిని 'విషయ సంఖ్య' అను దానిక్రిందఁ జేర్చవలెను. |
| 19 | 2 | చిం. సావాగ్యా | దీని నీపుటలోఁ దీసి వేయవలెను. |
| 20 | 2 | ............... | "చిం. సావాగ్యా......" అను దాని నీపుటలోఁ జేర్చవలెను. |
| 22 | 2-3 | "స్వస్థాన ........" | ఈ రెండుపంక్తుల శ్లోక మీపుట మీఁదఁ దీయవలెను |
| 23 | 2-3 | ............... | స్వస్థానేత్యాది శ్లోకము నీపుట మీఁద నిల్పవలెను. |
| 46 | 1 | అశ్లీలాపశజతల | అశ్లీ లాపశబ్దతల |
| 50 | 1 | అపశలబ్ద | అపశబ్ద |
| 90 | 1 | విభక్త | విభక్తి |
| 96 | 16 | పదాదిహల్లు | పదాది హల్లు |
| 113 | 9 | భణు | భ = బ |
| 133 | 20 | నారికేలము | ఇచటి 4 చోట్లను 'ల'కు వెనుక '(ళ)' అని చేర్చవలెను |
| 146 | 8 | రణుభిర్మాత్రా | చతుర్భి రణుభి ర్మాత్రా |
| 148 | 10 | యభయమని | యుభయ మని |
| 166 | 1 | హెడ్డింగు వ్రాయలేదు | ఈ యుక్తచోటను "ఉపధ్మానీయానుస్వారముల వ్యుత్పత్తి" అని నిల్పవలెను. |
| 186 | 28 | లలయో | లళయో |
| 187 | 12 | ళకారవలెగా | ళకారము వలె |
| 255 | 31 | "ఏట" (పళ్ళు) | "పల్లు" (పళ్ళు) |
| 258 | 6 | సాపుగా | సాఫుగా |
| 308 | 12 | డుజ్జు | డుబ్బు |
| 368 | 6 | పండ్లకోయు | పండ్లుకోయు |
| 383 | 22 | బిన్దుస్స్యాత్ | బిన్దు స్స్యాత్ |

| | | | |
|---|---|---|---|
| 384 | 12 | “నుండియొర్చి......” అను తుదివాక్యము దీసివేయుదు | “చూడవలెను” అని నిల్పవలెను |
| 453 | 23 | తుఱునంటి | తెఱునంటి |
| 456 | 3 | స్వద్వాచః | సద్వాచః |
| 457 | 20 | చేకుత్ర | చేకూత్ర |
| | | జేకూత్ర | కేకుత్ర |
| 559 | 1 | ౪౧౦ | ౫౧౦ |
| 589 | 3 | సామ్రాజ్య | సా(మ్రాజ్య |

---

# ఉదాహృత గ్రంథ సంకేతములు

ఆంధ్రశబ్ద చింతామణి
అథర్వణకారికావళి (వికృతి వివేకము)
అహోబలపండితీయము
బాలసరస్వతీయము
కవిజనాంజనము
బాలవ్యాకరణము
ప్రౌఢవ్యాకరణము
బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక
ఆంధ్ర భాషాభూషణము
కవిజనాశ్రయము
నరసభూపాలీయము
కావ్యాలంకార చూడామణి
ఆంధ్ర వైయాకరణ పారిజాతము
అప్పకవీయము
కవిసంశయ విచ్ఛేదము
ఛందోదర్పణము
తాతంభట్టు కవిచింతామణి
కవిసంజీవని (ముద్దరాజు రామన)
సర్వలక్షణసార సంగ్రహము
శబ్దరత్నాకర కోశము
వైకృతదీపిక
అలఘు కౌముది
బాలచంద్రోదయము
ఆప్టీ కోశము
బర్నెలు దొరగారి దక్షిణ హిందూదేశ లిపిశాస్త్రము.
డా. కాల్డువెల్లు దొరగారి కంపారిటీవు ద్రావిడవ్యాకరణము
లక్ష్మీనారాయణీయము
సర్వశబ్ద సంబోధినీ కోశము
వాచస్పత్య కోశము
శబ్దస్తోమ మహానిధి
శబ్దకల్పద్రుమము
గురుబాల ప్రబోధిక — లింగాభట్టీయము

| | |
|---|---|
| ముగ్ధ | ముగ్ధబోధ వ్యాకరణము |
| కవికల్ప | కవికల్పద్రుమము ధాతుపాఠము |
| దుర్గా | దుర్గాదాస వ్యాఖ్య (ముగ్ధ) |
| శ్రీరామ | శ్రీరామ తర్క వాగీశ వ్యాఖ్య (ముగ్ధ) |
| సిద్ధా. కౌ | సిద్ధాంత కౌముది. |
| ప్రౌఢమ | ప్రౌఢ మనోరమ |
| మహాభా | పతంజలి మహాభాష్యము |
| కైయట | కైయట వ్యాఖ్య (మహాభాష్య) |
| ఉద్ద్యోత | ఉద్ద్యోత వ్యాఖ్య (మహాభాష్య (వివరణవ్యాఖ్య) |
| ప్రాకృ. ప్ర | ప్రాకృత ప్రకాశము |
| షడ్భా | షడ్భాషాచంద్రిక |
| సిద్ధ. హే | సిద్ధహేమచంద్ర కృత ప్రాకృత శబ్దానుశాసనము |
| ప్రాకృ. మం | ప్రాకృతమంజరి |
| చండ | చండకృత ప్రాకృతవ్యాకరణము |
| వృత్తర | వృత్తరత్నాకరము |
| కావ్యాద | కావ్యాదర్శము (దండి) |
| సాహిత్య | సాహిత్యదర్పణము |
| సూర్యసి | సూర్యసిద్ధాంతము |
| ఋగ్వేద | ఋగ్వేద ప్రాతిశాఖ్యము |
| తైత్తిరీ | తైత్తిరీయ ప్రాతిశాఖ్యము |
| శుక్ల య | శుక్లయజుఃప్రాతిశాఖ్యము |
| పాణి. శిక్ష | పాణిని శిక్ష |
| వైదికా | వైదికాభరణ వ్యాఖ్య |
| ఉవ్వట | ఉవ్వటభాష్యము. పార్షదవ్యాఖ్య |
| త్రిభాష్య | త్రిభాష్య రత్న వ్యాఖ్య |
| సాయన | సాయన భాష్యము |
| కర్ణా. భూ | కర్ణాట భాషా భూషణము. |
| కర్ణాటశబ్దా | కర్ణాట శబ్దానుశాసనము |
| తోల్కా | తోల్కాప్పియము |
| కేరళ | కేరళ పాణినీయము. (మళయాళ) |
| భాషాశా | భాషాశాస్త్ర సంగ్రహము (సంస్కృత) |
| ఆం. విజ్ఞా | ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము |
| ఆం. సా. ప | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (చెన్నపురీ పుస్తక భాండాగారములోనిది) |

లక్ష్మణరాయ వ్యాసావళి
భారతీపత్రిక
శాసన పద్య మంజరి
నృపాధిప శతకము
అశోక శాసనములు (ప్రాకృత)
నందివర్మ పెదవేగి శాసనము
శక్తివర్మ ప్రభు బట్టు శాసనము
యుద్ధమల్లుని బెజవాడ శాసనము
రాజరాజు కోరుమల్లి శాసనము
అద్దంకి పండరంగ శాసనము
పొందువగ్రామ శాసనము
బసవపురాణ పీఠిక
శకట రేఫ నిర్ణయము
ద్విరేఫవర్ణ దర్పణము
తిరుమలయ్యగారి రేఫ శకటరేఫ నిర్ణయము
భారతము — ఆది సభారణ్యాది పర్వములు.
బసవపురాణము
నిర్వచనోత్తర రామాయణము
నన్నిచోడ కుమార సంభవము
ఉత్తర హరివంశము
ఎఱ్ఱాప్రెగడ రామాయణము
హరివంశము (ఎఱ్ఱాప్రెగడది)
భాస్కర రామాయణము
భాగవతము (పోతరాజాదులది)
విష్ణుపురాణము
మార్కండేయ పురాణము.
కాశీఖండము
హరవిలాసము
శృంగార నైషధము
భీమేశ్వర పురాణము
జైమినీభారతము
కళాపూర్ణోదయము
శృంగార షష్ఠము
యయాతి చరిత్రము

| | |
|---|---|
| కవిక | కవికర్ణరసాయనము |
| మనుచ | మనుచరిత్రము |
| వసుచ | వసుచరిత్రము |
| రాఘవ | రాఘవ పాండవీయము |
| హా. న | హరిశ్చంద్ర నలోపాఖ్యానము |
| ఆము | ఆముక్త మాల్యద |
| కేయూ | కేయూరబాహు చరిత్రము |
| బహుళా | బహుళాశ్వ చరిత్రము |
| తారా | తారా శశాంక విజయము |
| విజయ | విజయ విలాసము |
| ఉ. రా | ఉత్తర రామాయణము |
| రామాభ్యు | రామాభ్యుదయము |
| పాండు | పాండురంగ మాహాత్మ్యము |
| నృసింహ | నృసింహ పురాణము |
| విజ్ఞా | విజ్ఞానేశ్వరీయము |
| నా. పంచ | నారాయణ కవి పంచతంత్రము. |

